# 1

# బ్రిటిష్ రాజ్యాంగ చరిత్ర

## (క్రీ. శ. 1485–1947)

### ఉపోద్ఘాతము

ఈనాడు ప్రపంచంలో ఉన్న అనేక ప్రజారాజ్య విధానాలకు బ్రిటిష్ లేదా ఇంగ్లండ్ రాజ్యాంగ విధానము మాతృక అని, మూలకందమని కీర్తి పొందుతున్నది. ప్రతి ప్రజాస్వామ్య రాజ్యాంగంలోను దానికి ప్రత్యేకమైన కొన్ని లక్షణాలు లేకపోలేదు గాని ప్రజాభిప్రాయాను సారం ప్రజలు ఎన్నుకొన్న శాసనసభలకు బాధ్యత వహించి ప్రభుత్వము పరిపాలన సాగింప వలెననే ఇంగ్లండ్ రాజ్యాంగంలోని మూలసూత్రము అన్ని ప్రజాస్వామ్యాల రాజ్యాంగాలకు ప్రాతిపదిక కావడంవల్ల ఇంగ్లండ్ రాజ్యాంగ విధానం గురించి తెలిసికొనడం అత్యావశ్యకము.

ఇంగ్లండ్‌లో ఇరవై ఒక్క ఏళ్ళు నిండిన స్త్రీ పురుషులందరికి పార్లమెంటులోని దిగువ సభ అయిన ప్రజాసభ (House of Common) కు తమ ప్రతినిధులను ఎన్నుకొనటానికి హక్కు ఉన్నది. వారిచేత ఎన్నికయిన ప్రజాసభ సభ్యులలో అధిక సంఖ్యాకులు ఏ రాజకీయ పక్షానికి చెందుతారో, ఆ పక్ష నాయకుని ప్రధానమంత్రిగా రాజు నియమిస్తాడు. అతడు తన సహమంత్రులను లేదా మంత్రివర్గ సభ్యులను ఎన్నుకొని పరిపాలనా శాఖలను వారికి పంచి ఇస్తాడు. ప్రధానమంత్రి మంత్రిమండలికి నాయకుడు; మంత్రుల సహాయంతో వివిధ పరిపాలనా శాఖల ద్వారా పార్లమెంట్ చేసే చట్టాలకు లోబడి దేశపరిపాలనా బాధ్యతను నిర్వహిస్తాడు. చట్టాలు చేసే అధికారము పార్లమెంట్‌ది; అందులోను ముఖ్యంగా ప్రజాసభది. పార్లమెంట్ శాసనాధికారాన్ని మంత్రిమండలిగాని, న్యాయస్థానాలుగాని ప్రశ్నించడానికి వీలు లేదు. శాసనాలకు అర్థవివరణచేసి తాము విచారించే రాజ్యాల కన్వయించి తీర్పు చెప్పే అధికారము న్యాయస్థానాలది. అందులోను ముఖ్యంగా హైకోర్టు అనే ఉన్నత న్యాయస్థానానిది. కాని మహాభియోగం (Impeachment) అనే పద్ధతిననుసరించి కామన్స్‌సభ నేరం మోపగా ప్రభువులసభ (House of Lords) చెప్పే తీర్పును ఉన్నతన్యాయస్థానం కాదనలేదు. అట్లాగే 'నేరారోపణచట్టము' (Bill of Attainder) ద్వారా పార్లమెంట్ విధించే శిక్షనుకూడా కాదనలేదు. మంత్రివర్గము అధికార కాలపరిమితి సామాన్యంగా ఐదేళ్ళు. కాని విశ్వాసరాహిత్య తీర్మానం (Non-confidence motion) ద్వారా మంత్రివర్గాన్ని ఎప్పుడైన తొలగించే అధికారము పార్లమెంటుకు ఉన్నది. కాని అటువంటి సందర్భంలో ఆ పార్లమెంట్‌ను రద్దుచేసి నూతన పార్లమెంట్ నిర్మాణానికి ఎన్నికలు జరపండని ప్రధానమంత్రి రాజుకు సలహానివ్వ వచ్చు. ఆ సలహాను సామాన్యంగా రాజు అంగీకరిస్తాడు. మళ్ళీ ఎన్నికలు జరిగి ఆనాటి ప్రజాభిప్రాయాన్ని ప్రతిబింబించే నూతన పార్లమెంట్ ఏర్పడి అందులో అధిక సంఖ్యాక పక్షం విశ్వాసానికి పాత్రులైనపార్టీతో నూతన మంత్రివర్గము ఏర్పడుతుంది. ఈ సందర్భంలో

గమనించవలసిన ముఖ్యవిషయ మొకటుంది. సర్వ సత్తాక సార్వభౌమాధికారాని (Sovereignty) కి హక్కుదారులమని చెప్పుకొనే ప్రజలు ఆ అధికారాన్ని పార్లమెంట్ ఎన్నికల




సమయాన మాత్రమే చెలాయించగలరు. పార్లమెంట్ సమావేశమైనప్పుడు ఆ అధికారాన్ని చెలాయించేది పార్లమెంట్. పార్లమెంట్ సమావేశం కాని కాలంలో ఆ అధికారము మంత్రివర్గ అధీనంలో ఉంటుంది. ఇంక రాజైనవాడు పరిపాలనలో ఏ అంశంలోనూ స్వతంత్రించి ఏ

పనిగాని చేయలేడు. అన్నిటా అతడు పార్లమెంట్ అధికారానికి ప్రతినిధి అనదగ్గ ప్రధాన మంత్రి సూచనలకు, సలహాలకు కట్టుబడి ప్రవర్తించవలసినవాడే. అతడు దొర. కాని దొరతన మతనిదిగాదు (The king of England reigns but does not govern). రాజుగా ఉన్నంతకాలం కనీసం తన వివాహవిషయంలో కూడా అతనికి స్వేచ్ఛలేదు. ప్రధానమంత్రి సలహాకు విరుద్ధంగా తన కిష్టంవచ్చిన యువతిని వివాహమాడదలచిన ఎనిమిదో ఎడ్వర్డ్ సింహాసనాన్ని త్యజించవలసి వచ్చింది. ఇంక పరిపాలనా నిర్వాహణలో స్వతంత్రించి వ్యవహరించదలచిన రాజు విషయము వేరే చెప్పనవసరం లేదు.

ఇంగ్లండ్‌లో రాజరికము వంశానుగతమైనది (hereditary). పార్లమెంట్‌లోని ఎగువ సభ లేదా ప్రభువులసభ (House of Lords) లో అధిక సంఖ్యాకులు వంశపారంపర్య సభ్యత్వమున్న ప్రభువులు. అయినా ఇంగ్లండ్ రాజ్యాంగ విధానము ప్రజాస్వామ్యంగానే పరిగణితమవుతున్నది. కాని పార్లమెంట్‌కున్న ఉన్నతాధికారాలు ఏ ఒక్క చట్టంలోనూ లేదా రాజ్యాంగశాసనంలోనూ నిర్వచించిలేవు. పరిపాలనా నిర్వాహణకు బాధ్యత వహించే మంత్రి వర్గాన్నిగాని, ప్రధాని పదవినిగాని సృష్టించిన రాజ్యాంగశాసనమూ లేదు. అట్లాగే న్యాయ స్థానాల స్వాతంత్ర్యాన్ని నిర్ణయించే చట్టమూ లేదు. ఒక్కమాటలో చెప్పవలెనంటే ఈనాటి ఇంగ్లండ్ రాజ్యాంగంలో ఎక్కువపాలు రాజ్యాంగ శాసనాల ఫలితంగాక సంప్రదాయాలవల్ల సిద్ధించిందే. ఈ ప్రజాస్వామ్య విధానము అనేక శతాబ్దుల పరిణతి ఫలితము. ఈ విధానంలోని ముఖ్యాంశాలైన రాజరికము, పార్లమెంట్‌లోని రెండు సభలు, న్యాయస్థానాలు, స్థానిక పరిపాలనా సంస్థలు అన్నీ ఏడెనిమిది శతాబ్దాలకు తక్కువగాని చరిత్ర కలిగినవే. ఈ సుదీర్ఘ కాలంలో వీటి నిర్మాణంలోను, అధికారాలలోను, ఎప్పుడెప్పుడు ఎటువంటి మార్పులు సంభవించినాయో ఆ మార్పులు ప్రజాస్వామ్య పరిపాలనకు క్రమక్రమంగా ఎట్లా పుష్టినిచ్చినాయో వివరించేదే ఇంగ్లండ్‌దేశ రాజ్యాంగచరిత్ర.

ఈ పాఠ్యగ్రంథము ఇంగ్లండ్ రాజ్యాంగ చరిత్రలో క్రీ. శ. 1485 తరవాత ఏర్పడిన పరిణామాలను మాత్రమే వివరించడానికి ఉద్దేశించింది. క్రీ. శ. 1485 తరవాతనే ఇంగ్లండ్ ప్రపంచవ్యాప్తమైన సామ్రాజ్యాన్ని నిర్మించుకొని పరిశ్రమలకు, వాణిజ్యానికి ప్రపంచ కేంద్రాలలో అతిముఖ్యమైన పేరు పొందింది. అట్లాగే పరిపాలనాధికారము రాజునుంచి భూస్వాములనుంచి మారి ప్రజలందరి సొత్తు అయిందికూడా 1485 తరవాతనే. కాని ఈ రాజ్యాంగ వికాసానికి పునాదులను అంతకుముందు కాలంలోనే వేయడం జరిగింది. అందుచేత ఆ చరిత్రను గురించి సంగ్రహంగా ముందు తెలుసుకోవడం అవసరము.

# 2
# ట్యూడర్ లకు పూర్వం రాజ్యాంగ పరిణామక్రమము

**ముఖ్యలక్షణాలు**

క్రీ. శ. 450-600 మధ్యకాలంలో జ్యూటులు (Jutes), ఆంగ్లేయులు (Angles) శాక్సన్‌లు (Saxons) అనే జర్మన్ జాతులవారు బ్రిటన్‌ను ఆక్రమించినారు. అప్పటినుంచే బ్రిటన్ లేదా ఇంగ్లండ్ రాజ్యాంగ చరిత్ర ఆరంభమయింది. ఈ ఆక్రమణలో బ్రిటన్ ఉత్తర, ఈశాన్య ప్రాంతాలలో నివసించే బ్రిటిష్ జాతివారిని ఆంగ్లేయులు పూర్తిగా నిర్మూలించినారు. కాని పశ్చిమ దక్షిణ ప్రాంతాలవారు చాలావరకు వేల్స్ ప్రాంతానికి పారిపోగా మిగిలినవారు ఆ ప్రాంతాలాక్రమించిన శాక్సన్‌లకు దాసులు (Villeins) అయినారు. అందుచేత ఆ ప్రాంతాలలో నివసించే ప్రజలలో అస్వతంత్రులు, వారిచేత సేవలను అందుకొనే స్వతంత్ర శాక్సన్‌లు అని రెండు వర్గాలు ఏర్పడినాయి. ఆంగ్లోశాక్సన్ తెగలలో కొన్నిటిలో రాజరికము (monarchy) అమలులో ఉండేది. మరికొన్ని తెగలవారు మొదట్లో యుద్ధకాలంలో మాత్రం నాయకులను ఎన్నుకొని వారి నాయకత్వం కింద యుద్ధాలు చేసేవారు; కాని కాల క్రమేణ ఆ నాయకులు కూడా రాజులయినారు. దేశాన్ని ఆక్రమించడంలో నాయకుల కెక్కువగా తోడ్పడిన వీరులు గొప్ప జమీందారులైనారు. క్రీ. శ. ఎనిమిదో శతాబ్దినుంచి డేన్‌లు ఇంగ్లండ్ మీద దండయాత్రలు సాగించినారు. ఆ డేన్‌లను ఓడించడంలో వెసెక్స్ రాజులు దేశానికి నాయకత్వం వహించినారు. దీనిని పురస్కరించుకొని తొమ్మిదో శతాబ్ది ఆరంభానికి వెసెక్స్ రాజులు ఇంగ్లండ్ దేశమంతటికీ రాజులయినారు. ఆనాటి నుంచి జ్యూట్‌లు, ఆంగ్లేయులు, శాక్సన్‌లు అనే భేదాలు అంతరించి వారందరూ ఇంగ్లీషు జాతి వారుగా వ్యవహారంలోకి వచ్చినారు. దేశానికి ఇంగ్లండ్ అనే పేరు స్థిరపడింది. ఆనాటికి దేశంలో గ్రామాలు, పట్టణాలు, శతగ్రామ కూటాలు (Hundred), మండలాలు (Shires) అనే భాగ, విభాగాలు ఏర్పడినాయి. పరిపాలనా సౌఖ్యానికి పట్టణ సమితి (Town moot), శతగ్రామ సమితి (Hundred moot), మండల సమితి (shire moot) అనే స్థానిక పరిపాలనా సంస్థ లేర్పడినాయి. దేశమంతటికీ సంబంధించిన వ్యవహారాలను చూడడానికి ప్రజాసమితి (Folk moot), విజ్ఞుల సమితి (Witanagemote) అనే రెండు సంస్థ లుండేవి. ఒక్కొక్కప్పుడు శతగ్రామ సమితికి ఆ సీమలోని పట్టణాలపై పరిపాలనాధికారము ఉండేది. రాజ్యంలోని స్వతంత్ర ప్రజలకు ప్రజాసమితి (folk moot) సమావేశాలలో పాల్గొనడానికి హక్కు ఉండేది. కాని రాజ్యము విశాలమైన కొద్దీ ఆ సమితి సమావేశం కావడమే అసాధ్యమయ్యేది. అందుచేత రాజ్యమంతటికీ సంబంధించిన వ్యవహారాలను చూడ టానికి 'విజ్ఞుల సమితి' (Witan) మాత్రమే సమావేశమై రాజుకు సలహాలివ్వడం మామూ లయింది.

సొంతభూమి ఉన్నా లేకపోయినా స్వతంత్ర ప్రతిపత్తిగల ప్రజలందరూ యుద్ధసమయాలలో రాజుకు సేవచేయవలసినవారే. విశాలమయిన జమీనులు గల ప్రభువులు క్రమక్రమంగా తమ జమీనులలో రాజులవలెనే వ్యవహరించసాగినారు. జాతీయ వ్యవహారాలలో మాత్రం విజ్ఞుల సమితి (Witan) సమావేశాలకు వారు హాజరవుతూ, రాజు ప్రధానోద్యోగులతోపాటు న్యాయ పరిపాలనలోను, శాసనాలు చేయడంలోను, దేశరక్షణలోను రాజుకు సహాయపడే ఆచార మేర్పడింది. డేనిష్ దండయాత్రల కాలంలో సామాన్య రైతులు, భూమి లేని స్వతంత్ర ప్రజలు ఆత్మరక్షణకోసం బలవంతుడయిన ప్రభువును ఆశ్రయించడం అవసరమయింది. అట్లా ఆశ్రయించకుండా ఎవ్వరూ ఉండరాదని ఎథెల్‌స్టన్ కాలంలో రాజశాసనం జారీ అయింది. ఆ విధంగా క్రీ.శ. 1066 లో నార్మన్‌లు ఇంగ్లండ్‌ను జయించే ముందే నార్మండీ రాజ్యంలో అమలులో ఉన్న భూస్వామిక విధాన (Feudalism) లక్షణాలు కొన్ని ఇంగ్లండ్‌లో ప్రత్యక్షమయినాయి. కాని ఆంగ్లో - శాక్సన్‌ల స్థానిక పరిపాలనా సంస్థలు మాత్రం నార్మన్ దండయాత్రలలో నశించిపోక, వారి పరిపాలనా విధానంలో అంతర్భాగమయినాయి.

## నార్మన్ భూస్వామిక విధానము

రాజ్యంలో భూమి అంతటికి రాజే యజమాని అనేది నార్మన్ భూస్వామ్య విధాన ముఖ్య సిద్ధాంతము. రాజు తన అవసరాలకు కొంత భూమి ఉంచుకొని, మిగిలిన దానిని తన అనుచరులకు కొన్ని షరతులపై పంచి ఇస్తాడు. రాజు తనకోసం కేటాయించుకొన్న భూమికి రాజక్షేత్రము లేదా రాజమాన్యము (Crown land or Royal Demesne) అని పేరు. రాజునుంచి భూమిని పొందినవారికి ప్రధాన భూస్వాములని (Tenants-in-chief) పేరు. వీరు రాజు తమకు ప్రసాదించిన భూమికి బదులుగా అతనికి యుద్ధ వ్యవహారంలోను, రాజ్య పరిపాలనలోను, న్యాయవిచారణలోను తోడ్పడవలసి ఉండేది. వీరు తమకు రాజునుంచి లభించిన భూమిలో కొంత తమ అవసరాలకు ఉంచుకొని మిగిలినదానిని తమ అనుచరులకు అవే షరతులపై పంచి యిచ్చేవారు. ఈ రెండో తరగతి భూస్వాములకు 'మధ్యతరగతి భూస్వాములు' (Mesne Tenants or Intermediate Tenants) అని పేరు. ఈ విధంగా భూమి అంచెలంచెలుగా అనేక దశలకు చెందిన భూస్వాముల మధ్య విభక్తమై ఉండేది. మొత్తం విధానము స్వరూపాన్నిబట్టి 'పిరమిడ్' (Pyramid) ను పోలి ఉండేది. ప్రతి స్థాయిలోని భూస్వామి తనకు భూమినిచ్చిన అంతస్తులోని భూస్వామి లేదా ప్రభువుకు పైన పేర్కొన్న బాధ్యతలను నిర్వహించడమేగాక, కొన్ని ముదుపులను, మామూళ్ళను చెల్లించవలసి వచ్చేది. ఉదాహరణకు ప్రభువు పెద్దకుమారుని యుద్ధవీరుని చేసే సందర్భంలోను, పెద్దకుమార్తె వివాహ సమయంలోను, సామంతుడు కట్నాలు కానుకలు చెల్లించవలె. ప్రభువు శత్రువు చేజిక్కినప్పుడు అతని విముక్తికోసం చెల్లించవలసిన ధనం (Ransom)లో సామంతుడు భాగస్వామి కావలె. సామంతుడు మరణించినప్పుడు అతనికి ప్రాయంరాని కుమారులు కుమార్తెలు ఉండే వారికి యుక్తవయస్సు వచ్చేటంతవరకు వారి పోషణ విషయంలోను, కుమార్తెల వివాహ విషయంలోను ప్రభువు బాధ్యత వహించేవాడు. కాని ఆ బాధ్యతలను మోసినంతకాలమూ సామంతుని భూమి ప్రభువు అనుభవంలోనే ఉండేది. సామంతుడు

ప్రభువుపట్ల తన విధులను నిర్వహించకపోతే అతనిని భూమినుంచి తొలగించడానికి ప్రభువుకు పూర్తి అధికారము ఉన్నది. సంతు లేక సామంతుడు మరణించినప్పుడు అతనిభూమి ప్రభువుకే సంక్రమించేది.

నార్మన్ రాజుల రాజ్యంలోని ప్రతిమండలిలోను షెరిఫ్ (Sheriff or Shire-reeve) లనే ఉద్యోగులను నియమించేవారు. భూస్వాములనుంచి రావలసిన కానుకలను, కట్నాలను, రాజక్షేత్రాల ఫలసాయాన్ని, న్యాయస్థానాలు నేరస్థులపై విధించే అపరాధాలను వసూలుచేయడం షెరిఫ్‌ల విధులు. ఇంకా పూర్వం శాగ్జన్ రాజులకు ఏయే ఆదాయాలుండేవో వాటిని కూడా నార్మన్ షరిఫ్‌లు రాబట్టేవారు.

శాగ్జన్ కాలంనాటి విజ్ఞుల సమితి (Witan) స్థానంలో నార్మన్ రాజులు 'ది గ్రేట్ కౌన్సిల్' (The Great Council) అనే పేరుతో ఒక రాజపరిషత్తును ఏర్పరిచినారు. రాజప్రాసాదంలోని ప్రధానాధికారులు, 'జస్టిషియర్' అనే ముఖ్య న్యాయాధికారి, 'ఛాన్స్‌లర్' అనే రాజ్యకార్య నిర్వాహకుడు, కోశాధికారి, పై పరిషత్తులో ముఖ్య సభ్యులు. చర్చి ఉద్యోగులు బ్రహ్మచారులు కాపడంచేత వారు స్వార్థరహితులనే నమ్మకంతో నార్మన్ రాజులు చర్చి ఉద్యోగులనే జస్టిషియర్‌లుగా, ఛాన్స్‌లర్‌లుగా నియమించే వారు. ఈ అధికారులతోబాటు తమ ప్రధాన జాగీర్‌దారుల (tenants-in-chief) లో ముఖ్యులైన వారినికూడా రాజు పరిషత్ సమావేశాలకు ఆహ్వానించేవాడు. ఆ రాజపరిషత్తు రాజ్య ఆదాయవ్యవహారాలను పర్యవేక్షించేపట్ల వాటికి సంబంధించిన వ్యాజ్యాలను విచారించేపట్ల 'ఎక్స్‌చెకర్' (Exchequer) అనీ, న్యాయవిచారణ చేసేపట్ల క్యూరియా రెజిస్ (Curia Regis) అనీ పేరు పొందింది. కాలక్రమాన క్యూరియారెజిస్, ఎక్స్‌చెకర్లు రెండు ప్రత్యేక సంస్థలుగా రూపొందినవి. అవి న్యాయవిచారణా నిర్వహణ బాధ్యతను నిర్వహిస్తున్నా రాజపరిషతుకు ఆ విషయానగల అత్యున్నతాధికారాలు కొనసాగినవి. క్యూరియారెజిస్ సభ్యులైన న్యాయాధికారులు ప్రతి సంవత్సరం కొన్ని నెలలపాటు 'సంచార న్యాయస్థానాలు' (Circuit-courts) గా మండలాలలో పర్యటించి మండల న్యాయస్థానాల (Shire Courts) లో తామే న్యాయాధికారులుగా, రాజసభ విచారించదగ్గ వ్యాజ్యాలను పరిష్కరించే ఆచారమొకటి అమలులోకి వచ్చింది. దీని ఫలితంగా భూస్వాముల న్యాయస్థానాలు, ప్రాచీన స్థానిక న్యాయస్థానాలైన పట్టణ, శత గ్రామ, మండల సభలుకూడా సంచార న్యాయస్థానాల అధికారానికి తల ఒగ్గవలసి వచ్చింది. దీనివల్ల ప్రజలకెంతో మేలు చేకూరింది. భూస్వాముల న్యాయస్థానాల దౌర్జన్యము అడుగంటిపోయింది. వ్యాజ్యాల పరిష్కారము పండితులు, పక్షపాతరహితులు అయిన రాజన్యాయాధీశులవల్ల జరగటంచేత చక్కని న్యాయం చేకూరింది. ఊరికొక చట్టము, నార్మన్‌లకొక చట్టము, శాగ్జన్‌లకొక చట్టము, ఒక్కొక్క ప్రభువు న్యాయస్థానంలో ఒక్కొక్క విధమైన చట్టము. ఇన్ని విభిన్న చట్టాల మధ్య న్యాయం నలిగిపోతూ ఉండే పూర్వస్థితికి స్వస్తి చెప్పడమయింది. ప్రభువులపై రాజాధికారము పటిష్ఠమయింది. ఇంకా సంచార న్యాయస్థానాలు పూర్వం జిల్లాలలో లేదా కౌంటీలలోను రాజ ప్రతినిధులుగా షెరీఫ్‌లు సాగిస్తూ ఉన్న అత్యాచారాలను అంతమొందించింది. అందరికీ సమానమైన న్యాయం చేకూరడంవల్ల ప్రజలలో జాతీయతాభావం పెంపొందింది.

ఆంగ్లో - శాగ్జన్ రాజుల పరిపాలనా కాలంలో స్వతంత్ర ప్రతిపత్తి గల పౌరులందరూ జాతీయసైన్యం (Fyrd) లో చేరి రాజ్యరక్షణకు విధిగా కత్తి కట్టవలసి ఉండేది నార్మన్ రాజులు భూస్వామ్య విధానాన్ననుసరించి తమ సామంత ప్రభువులనుంచి సైనిక సేవలు రాబట్టుతూ ఉండేవారు. అయినా ఆంగ్లో - శాగ్జన్ రాజులనాటి జాతీయ సైన్య (Fyrd) విధానం కూడా వారు కొనసాగించినారు. తమపై తిరుగుబాటు చేసిన సామంతులను అణిచి వేయడానికి ఆ సైన్యాన్ని ఉపయోగించేవారు. ఇంకా సైనిక సేవలు చేయడం ఇబ్బందిగా భావించి సామంతులు ఆ సేవలకు పరిహారంగా కొంత సొమ్ము చెల్లించే పద్ధతిని (Scutage) ప్రవేశపెట్టినారు. ఈ అవకాశాన్ని ఉపయోగించుకొన్న ప్రభువు లనేకులు తత్ఫలితంగా రాజు నెదిరించగల సైనికశక్తిని క్రమంగా కోల్పోయినారు. ఈ విధంగా కూడా రాజ్యాధికారం బలపడింది. కాని ఇన్ని విధాల రాజాధికారము పటిష్ఠమైనా బలహీనుడైనవాడు సింహాసన మధిష్ఠించినప్పుడల్లా సామంత ప్రభువులు అతనిని లెక్కచేయక స్వతంత్రంగా వ్యవహరించడం మధ్యయుగము (క్రీ. శ. 1066-1485) ఇంగ్లండ్ దేశచరిత్రలో ముఖ్యలక్షణమయింది. రాజుకు, అతని ప్రధాన భూస్వాములకు మధ్య జరిగిన కలహాల ఫలితంగానే బ్రిటిష్ పార్లమెంటరీ వ్యవస్థ ఉత్పన్నమై క్రమంగా బలపడింది.

## పార్లమెంటరీ విధానము : ఉత్పత్తి

క్రీ. శ. 1066 లో ఇంగ్లండ్‌ను జయించేముందు నార్మండీ ప్రభువు మొదటి విలియమ్ భూదానాల (Benijium) వల్ల, శరణాగతి (Commendation) వల్ల భూస్వాములు తమ సామంతుల సంఖ్యను వృద్ధిచేసుకొని వెసెక్స్ రాజులను బలహీనపరిచినారు. అటువంటి అనర్థాన్ని నివారించడానికే మొదటి విలియమ్ తన భూస్వాములకు దూరదూర ప్రాంతాలలో భూములు ప్రసాదించినాడు. ఇంగ్లండ్‌లోని వేరువేరు మండలాలు వేరువేరు కాలారేలో నార్మన్ లకు స్వాధీనం కావడం దీనికి కొంత తోడ్పడింది. విలియమ్ చేసిన పై సంస్కరణలవల్ల తిరుగుబాటు చేయదలచిన ప్రభువులు తటాలున తమ సామంతుల సేనలను సమీకరించడానికి వీలులేకపోయింది. ఇంకా విలియమ్ శాలీస్‌బరీ పట్టణంలో తన ప్రధాన భూస్వాముల సామంతు లందరిచేతనూ ఎట్టాంటి సందర్భంలోను తాము రాజు నెదిరించి పోరాడమనే ప్రమాణాన్ని స్వీకరింప జేసినాడు. క్రీ. శ. 1086 లో దేశంలోని ప్రతివ్యక్తికి ఉన్న ఆస్తిపాస్తుల వివరాలు (Domesday Survey) సేకరింప జేసినాడు. దీనివల్ల ప్రజలనుంచి వీలైనంత ఆదాయం రాబట్టడానికి రాజుకు చక్కని అవకాశం లభించింది. సముద్రతీర వాసులనుంచి ఇంగ్లండ్ రాజులు దేనుల దండయాత్రల కాలంలో వసూలుచేసిన 'డేన్‌గెల్' అనే సుంకాన్ని అవసరం లేకున్నా నార్మన్ రాజులు వసూలుచేసినారు. నేరాలుచేసిన వారిపై అధికమైన అపరాధాలు విధించి కూడా తమ ఆదాయాన్ని పెంచుకొన్నారు. సైనిక సేవకు పరిహారంగా వసూలు చేసిన 'స్కూటేజ్' రుసుములు కూడా వారిని బలవంతులుగా చేయడంలో తోడ్పడినాయి. రాజ్యంలోని అడవులన్నీ తమ సొత్తని ప్రకటించి వాటిలో అక్రమంగా ప్రవేశించినవారిపైన, వేటాడిన వారిమీద కఠినమైన శిక్షలు నార్మన్ రాజులు విధించినారు. రాజు శాసనాలను ప్రజలందరికీ వర్తించేటట్లుచేసి తమ అధికారాన్ని ఎట్లా పెంచుకొన్నారో లోగడ తెలుసుకొన్నాము.

ఇంతజరిగినా మొదటి ముగ్గురు నార్మన్ రాజుల కాలంలో అణిగి మణిగి ఉన్న ప్రభువులు బలహీనుడైన స్టీఫెన్ కాలాన నిరంకుశులై చెలరేగినారు. వారి సహాయాన్ని దేబిరిస్తూ స్టీఫెన్ వారికి అనేక అధికారాలను కట్టబెట్టినాడు. దుర్గాలను యథేచ్ఛగా కట్టుకోనిచ్చినాడు.

# నార్మన్ వంశము

## మొదటి విలియమ్ 1066-87




అందుచేత స్టీఫెన్ రాజు కారాదని పోరాడిన మెటిల్డా కుమారుడైన రెండో హెన్రీ రాజుకాగానే స్టీఫెన్ కాలంలో నిర్మితమయిన ప్రభువుల దుర్గాలను కూలదోయించినాడు. స్టీఫెన్ ప్రసాదిం

చిన భూములు గుంజుకొన్నాడు. అధికారాలు రద్దుచేసినాడు. మొదటి హెన్రీ కాలంలో వసూలుచేసిన స్కూటేజ్ సుంకాన్ని తిరిగి ప్రవేశపెట్టినాడు. కాని తన అవసరాన్ని బట్టి

## ప్లాంటాజెనెట్ వంశము




సుంకం వద్దని సైనిక సేవనే కోరే హక్కు వదులుకోలేదు. తన న్యాయాధిపతులు మండల న్యాయస్థానాలలో (Shire courts) కూర్చొని న్యాయవిచారణ చేసేటప్పుడు ఎంత గొప్ప

భూస్వామి అయినా హాజర్ కావలెనని, న్యాయవిచారణలో తోడ్పడవలెనని, ఆ కోర్టు తీర్పులకు బద్ధుడు కావలెనని శాసించినాడు. దీనివల్ల సామంత ప్రభువుల కోరలు పీకినట్లయింది. ప్రాచీన స్థానిక న్యాయస్థానాలను, ప్రజల హక్కులను, లెక్కచేయని సామంత ప్రభువుల నిరంకుశత్వానికి ఈ శాసనము గొడ్డలి పెట్టయింది. ఇంగ్లండ్‌లో ఏకరాజ్యము, ఏకైక రాజ శాసనమూ నెలకొనడానికి కిది ఏంతో తోడ్పడింది.

డేన్‌గెల్‌కు బదులు కారుకేజ్ అనే పన్నును రెండో హెన్రీ వసూలు చేసినాడు. 'సెలాడిన్' సుంకమని వ్యక్తి చరాస్థిలో పదోవంతును వసూలుచేయడంలో రెండో హెన్రీ క్రొత్తమార్గం తొక్కినాడు. తన సైనికబలాన్ని పెంపుచేయవలెనని, ఏ స్వతంత్ర పౌరునికైనా హద్దుకు తగినట్లుగానే ఆయుధాలుండవలెనని, రాజు అనుమతిలేక ఆయుధాల నెగుమతి చేయరాదని శాసనం చేసినాడు. భూస్వాములు చెల్లించే సుంకాలు, పన్నులు, కానుకలు, సేవలు చర్చి ఉద్యోగులుకూడా రాజుకు చెల్లించవలెనని రెండో హెన్రీ పట్టుబట్టినాడు. చర్చి న్యాయస్థానాల పరిపాలనాధికారాలపై ఇతడు దాడిచేసినాడు. ఇతనికి పూర్వం తీవ్రమైన నేరాలు చేసిన క్రైస్తవమతాచార్య వర్గంవారి (clergy) ని రాజ న్యాయస్థానాలు విచారించి శిక్షించడానికి వీలు లేకుండేది. చర్చి న్యాయస్థానాలు దారుణమైన పద, కర, శిరశ్ఛేదాది శిక్షలు విధించేవిగావు. చిన్నచిన్న నేరాలను చేసినవారిని కూడా ఇతర న్యాయస్థానాలు అటువంటి శిక్షలకు గురిచేసేవి. తీవ్ర నేరాలు చేయమని చర్చి న్యాయము ప్రజలను ప్రోత్సహించినట్లయింది. చర్చి ఉద్యోగి కానివాడైనా తాను ముందుముందు ఎప్పుడో చర్చి ఉద్యోగి కాదలచినట్లు ప్రకటిస్తే చాలు అతడు రాజ న్యాయస్థానాలకు లోబడవలసి వచ్చేదికాదు. చర్చి న్యాయస్థానాలు చేసే ప్రథమ విచారణలో నేరం చేసినట్లు తేలితే ముద్దాయిని రాజ న్యాయస్థానాలకు బదిలీ చేయవలెనని రెండో హెన్రీ పట్టుబట్టినప్పటికీ లాభం లేకపోయింది.

క్రీ. శ. 1164 లో క్లారెండన్ అనేచోట తన రాజసభ గ్రేట్ కౌన్సిల్ (The Great Council) ను సమావేశపరచి కారెండన్ చట్టాలను కొన్ని ఆయన ప్రకటించినాడు. ఆ చట్టాలు అమలులోకి వచ్చిఉంటే ఎనిమిదో హెన్రీ కాలంలో చర్చిలో జరిగిన మార్పులు కొన్ని రెండో హెన్రీ కాలంలోనే వచ్చి ఉండేవి: i. కారెండన్ చట్టాలలోని ముఖ్యాంశాలు చర్చిలోని పెద్ద అధికారులైన బిషప్పుల, సన్యాసుల (Abbots) ఎన్నిక రాజసమ్మతితో అతని చర్చిలో అతని ఉద్యోగుల సమీక్షంలో జరగవలె. ii. అతని అంగీకారం లేకుండా ఇంగ్లండ్‌లోని చర్చి కోర్టుల తీర్పులపై రోమన్ పోప్ (pope) కు అప్పీళ్ళు తీసుకొని పోకూడదు. iii. బిషప్పులు, ఆర్చిబిషప్పులు రాజానుమతిలేనిదే దేశం వదలిపోకూడదు. iv. మంత్రులనుగాని, ముఖ్య సామంతులనుగాని రాజానుమతి లేకుండా చర్చి వెలివేయకూడదు. ఇవిగాక ఇంకా కొన్ని ముఖ్యమైన మార్పులను కారెండన్ చట్టాలు విధించినాయి. కాని ఈ మార్పులు ఆ కాలానికి విప్లవాత్మకమైనవిగా ఉన్నాయి. కాబట్టి రెండో హెన్రీ ప్రయత్నాలు విఫలమయినాయి. రెండో హెన్రీకి ముందు ఇంగ్లండ్‌లో న్యాయవిచారణ పద్ధతులు కొన్ని అనాగరక స్థితిలో ఉండేవి. నేరస్థుని కాళ్ళు చేతులు కట్టి నీటిలో పడవేస్తే అతడు మునిగితే నిరపరాధి అని, తేలితే నేరస్తుడని నిర్ణయించేవారు. నేరస్తుడు కాలిన ఇనుమును చేతిలో ఉంచుకొని కొన్ని అడుగులు నడిచిన తరవాత అతని చేతులకు కట్టుకట్టి కొన్ని దినాల తరవాత ఆ గాయం మానిపోతే అది అతని నిర్దోషిత్వాన్ని తెలుపుతుందని

అట్లా చేసేవారు. నార్మన్‌లు ఇంగ్లండ్‌ను ఆక్రమించిన తరవాత మరొక పద్ధతి ప్రవేశపెట్టి నారు. వాది ప్రతివాదులు కత్తిపట్టి పోరాడవలె. గెలిచినవాడు నిరపరాధి అని తేల్చేవారు ఈ విచారణ పద్ధతులలో దోషనిర్ణయము సరిగా జరుగుతుందని ఇప్పటి కాలంవారు నమ్మలేరుగదా!




రెండో హెన్రి సామ్రాజ్యము

ఇంగ్లీషు రాజులకాలంలో పైవాటికన్న మెరుగైన ఒక దోషవిముక్తి నిర్ణయపద్ధతిని (Com-purgation) అవలంబించినారు. ప్రతివాది తాను నిర్దోషినని వాదించినప్పుడు అతని మాట

నిజమని శతగ్రామకూటమిలోని పన్నెండుమంది పెద్దలు ప్రమాణంచేసి చెబితే శిక్ష తప్పించు కొనేవాడు. భూమి తగాదా వచ్చినప్పుడు ఆ భూమి ఏ మండలంలోనిదో ఆ మండలంలోని నలుగురు భూస్వామి యోధులు (knights) పొరుగు మండలంలోని పన్నెండుగురు భూస్వాము లను ఎంపికచేసి ఆ పన్నెండుగురు ప్రమాణంచేసి ఆ భూమి ఎవరిదో నిర్ణయించవలెనని రెండో హెన్రీ శాసనం చేసినాడు క్రీ. శ. 1166 లో కారెండన్ (అసైజ్) శాసనము నేరస్తుల విచారణలో జ్యూరీ పద్ధతిని ప్రవేశపెట్టింది. రాజు న్యాయవాధిపతులు మండల న్యాయస్థానం సమావేశమైనప్పుడు ప్రతి శతగ్రామకూటమిలోని పన్నెండుగురు అర్హులైనవారూ, గ్రామం లోని నలుగురు పెద్దమనుష్యులూ ప్రమాణంచేసి తమ తమ ప్రాంతంలోని నేరస్తులను పేర్కొనవలెనని, అట్లా పేర్కొన్నవారు జలపరీక్ష (ordeal by water), అగ్నిపరీక్ష (ordeal by fire), యుద్ధపరీక్ష (ordeal by combat) లలో ఒక్క పరీక్షఅయిన తీసుకొనవలెనని, ఆ పరీక్ష ఫలితాలనుబట్టి నేరనిర్ణయం జరగవలెననీ క్లారెండన్ రాజు ప్రకటన (Assize of clarendon) సారాంశము. కాని 1215 లో ఒక చర్చి కౌన్సిల్ అటువంటి పరీక్షలను నిషేధించింది. ఆనాటినుంచి కారెండన్ ప్రకటన పేర్కొన్న గొప్ప జ్యూరీ (Grand-jury) తో బాటు మరొక్క చిన్న జ్యూరీ (Petty-jury) ని తీర్పు చెప్ప డానికి నియోగించడం పరిపాటి అయింది

రెండో హెన్రీ కుమారుడు మొదటి రిచ్చర్ మహాయోధుడు. అతనికి యుద్ధపిపాస చాలా ఎక్కువ. జెరూసలెమ్‌ను తురుకలనుంచి విడిపించడానికి ఐరోపా రాజులు సైన్యాలను తీసుకొనిపోయినారు. వారితో వెళ్ళడానికి డబ్బు చాలక రిచ్చర్డ్ పట్టణాలపై తనకున్న హక్కు లను అమ్ముకొన్నాడు. అతనికాలంలో ప్రతి మండలంలోను రాజుకున్న భూస్వామ్య (Feudal) హక్కులను నిర్ణయించడానికి జ్యూరీలను నియోగించినాడు. ఇతని కాలంలో షెరీఫుల మితి మీరిన అధికారాలు తగ్గించడమయింది. షెరీఫు న్యాయాధికారిగా ఉండరాదని నిర్ణయమయింది. ప్రతి మండలంలోను రాజు న్యాయాధిపతులు విచారించవలసిన నేరాలను జతచేయడానికి ఒక కార్‌నర్‌ను (coroner), మరి ముగ్గురు యోధులను (Knights) నియమించడం ఆచార మయింది.

## హక్కుల మహాపత్రము
## (The Magna Carta - 1215)

మొదటి రిచర్డ్ తరవాత అతని తమ్ముడు జాన్ రాజయినాడు. అతడు ప్రజాకంట కుడు. అతని నిరంకుశత్వాన్ని నివారించడానికి అతని ముఖ్య సామంతులు ఇంగ్లీష్ చర్చి ఉద్యోగులతోను, పట్టణవాసులతోను, భూస్వాములతోను చేతులు కలిపినారు. ఫ్రెంచి రాజైన ఫిలిప్ అగస్టస్ ఫ్రాన్స్‌లోఉండే రెండో హెన్రీకి చెందిన రాష్ట్రాలనన్నిటిని ఆక్రమించినాడు. చివరకు ఇంగండ్‌లో జాన్ రాజంటే లెక్కచేసేవారే లేకుండా పోయినారు. ఇంకా అతడు ఇంగండ్‌లోనే ఉన్న తన ఆదాయాలపైనే పూర్తిగా ఆధారపడవలసి వచ్చింది. ఇంగండ్‌లోని మతసంస్థలపైన, మతాధికారులపైన అతడు సాగించిన నిర్బంధాలకు కోపించి పోప్ మూడో ఇన్నోసెంట్ అతనిని చర్చినుంచి వెలివేసినాడు. ఈ వెలికి జంకి పోప్ ప్రతినిధి అయిన స్టీఫెన్ లాంగన్‌కు జాన్ మోకరించి పోప్ అనుగ్రహంవల్ల తాను రాజైనట్లు లాంగన్ చేతుల

నుంచి కిరీటం గ్రహించి ప్రజలలో తనకున్న కాస్త పరువును పోగొట్టుకొన్నాడు. ఫ్రాన్స్‌లో అతడు పోగొట్టుకొన్న భూములను రాబట్టడానికి ఉత్తర ఇంగండ్‌లోని సామంత ప్రభువులు సహాయానికి రామని ఎదురు తిరిగినారు. అయినా జాన్ తన సేనలతో ఫ్రాన్స్‌కు పోయినాడు. ఆ సమయంలో సెంట్ఆల్బన్ పట్టణంలో అతని సామంతులు, మతాధికారులు సమావేశమయి నారు. ఇంగ్లీష్ చర్చికి అతని పరిపాలన కాలంలో కలిగిన నష్టాలకు పరిహారమడిగినారు. ఆ మహాసభకు క్రీ. శ. 1213 న రాజు భూములలో ఉన్న ఒక్కొక్క పట్టణంనుంచి రీవ్ అనే రాజోద్యోగితోబాటు నలుగురు ప్రతినిధులు హాజరైనారు. ఇటువంటి సభనే ఆర్చిబిషప్ స్టీఫెన్ లాంగన్ లండన్‌లో సమావేశపరిచి మొదటి హెన్రీ ప్రజలకు దత్తంచేసిన హక్కులను మన్నించండని, రాజును కోరమని వారిని ప్రేరేపించినాడు. క్రీ.శ. 1214 లో మరొకసారి సామంతులు సెంట్ఆల్బన్స్‌లో సభచేసి ప్రజల హక్కులకోసం రాజును ఒత్తిడి చేసినారు. రాజు వారి కోరికలను మన్నించక తాత్సారం చేయడంవల్ల క్రీ. శ. 1215 లో ఆ సామంతులు తమ సేనలతో లండన్‌పైకి దాడి వచ్చినారు. జూన్ 15 తేదీనాడు హక్కుల మహాపత్రంపై జాన్ తన అంగీకారముద్ర వేసినాడు. ఈ హక్కులపత్రము ఇంగ్లీషు ప్రజాస్వాతంత్ర్యానికి పునాదిరాయి అని బ్రిటిష్ చరిత్రకారులు ఘోషిస్తున్నారు.

## హక్కుల మహాపత్రము

1. క్రీ.శ. 1066 నుంచి ఇంగ్లీషు చర్చి అనుభవిస్తున్న అధికారాలు దానివేనని రాజు అంగీకరించినాడు. ఇంగ్లీష్ బిషప్పులకు, ఆర్చిబిషప్పులకు, మతాధిపతుల (Abbots) కు వారి వారి భూములను ఖాయం చేసినాడు

2. లండన్ తదితర పట్టణాలు, రేవులు వాటి పూర్వపు హక్కుల ననుభవించవచ్చు. రాజ్యమంతటా ఒకేరకం కొలతలు, తూనికలు అమలులో ఉండవలె.

3. జాన్ తన సొంత అరణ్యాలుగా మార్చిన ప్రాంతాలను స్వేచ్ఛగా వదిలి వాటి పరిపాలనలోని అనర్థాలను విచారించడానికి ప్రతిమండలంలో పన్నెండుమంది యోధులను ఎన్నుకొనవలెనని, వారు దౌర్జన్యం చేస్తే నలభైరోజులలో వారిని తొలగిస్తానని ఆయన వాగ్దానం చేసినాడు.

4. న్యాయ పరిపాలనలో మితిమించిన జుల్మానాలు వేయడం ఉండదని, విచారణలో ఆలస్యము ఉండదని, అయినా ఏదైనా విచారణ లేకుండా ఎప్వరూ శిక్షితులు కాకుండా చూస్తానని, సాటివారి తీర్పు లేనిదే ఇంగ్లీషు చట్టాలకు విరుద్ధంగా ఏ స్వతంత్రపౌరుడూ శిక్షితుడు కాడని, దేశ బహిష్కృతుడు కాడని, చట్టాల రక్షణకోసం వారిని వెలిపెట్టరని జాన్ మాట ఇచ్చినాడు. అంటే ఈ న్యాయ సూత్రాలు స్వతంత్ర పౌరులకేగాని దాసులకు, సేవకులకు అన్వయించవని అర్థము.

5. వ్యాపారస్థులను పీడించి సుంకాలు వసూలుచేయరని, పౌరుని అనుమతి లేకుండా అతని బండ్లను, గుర్రాలను, ధాన్యాన్ని, వస్తువులను, రాజభటులు తేరగా తీసికొనిపోరని, రైతునుంచి సేద్యానికవసరమైన వస్తువులను, పశువులను జప్తుచేయరని రాజు వాగ్దానం చేసినాడు. రెండో హెన్రీ కాలంలో రాజుతోఉండే సామాన్య వ్యాజ్యాల న్యాయస్థానము (Court of Common Pleas) Exchequer, కోర్టుతోబాటు లండన్ నగరంలోనే స్థావరంగా

ఉంటుందని జాన్ మాట ఇచ్చినాడు. రాజన్యాయాధిపతులు ఇకముందు గూడా సంవత్సరానికి నాలుగుసార్లు మండలాలలో పర్యటనలుచేసి సామాన్య పౌరులకు న్యాయ సౌకర్యం కలిగించ గలరని మహాపత్రం చెప్పింది. క్రీ. శ. 1873 లో ఈ మూడు న్యాయస్థానాలూ-కోశ న్యాయ స్థానము (The Exchequer Court), సామాన్య వ్యాజ్యాల న్యాయస్థానము (Court of Common Pleas), రాజ న్యాయస్థానము (The Court of King's Bench)-హైకోర్టు అనే పేరుతో సంఘటితమయినాయి. ఈ న్యాయస్థానాలుగాక రాజెక్కడ ఉండే అక్కడ రాజ న్యాయస్థానము (Court of the King's Bench) సమావేశమై న్యాయ ప్రదానం చేసే పద్ధతి పూర్వంవలెనే కొనసాగింది.

6. ముఖ్య సామంతులకు ఈ మహాపత్రంవల్ల కలిగిన లాభాలు ఏమంటే— (i) వారి నుంచి భూస్వామిక రుసుములను, సేవలను మునుపటికంటె ఎక్కువగా తాను రాబట్టనని, ii) సామంతరాజు చనిపోయినప్పుడు అతని ఆస్తి వారసులకు సంక్రమించినపట్ల నిర్ణీతమైన ధనాన్నే ఇక వసూలు చేయగలనని, (iii) మైనరు బాలబాలికల పెంపకానికి న్యాయాన్ని మించి వ్యయంచేసి వారి ఆస్తిని తాను అనుభవించనని, పాడుచేయనని, బాలికలు వారి అంతస్థుకు తగనివారిని పెండ్లాడవలెనని నిర్బంధించనని సామంత విధానంలో లేని ఏ సుంకాలను, ప్రజామండలి (common council of the kingdom) సమ్మతిలేకుండా వసూలుచేయనని రాజు వాగ్దానం చేసినాడు. ఈ సమితికి ప్రభువులను, బిషప్పులను, ఆర్చి బిషప్పులను ఆహ్వానించడానికి రాజు అంగీకరించినాడు అంటే ఈ సందర్భంలో సామాన్య ప్రజాప్రతినిధులను విస్మరించరని అర్థము.

పైన చెప్పిన హక్కుల పత్రాన్ని పరిశీలిస్తే క్రీ శ. 1215 నాటికి ప్రభువులు, మతాధి కారులు, భూస్వాములు ఏయే విషయాలలో రాజుల అత్యాచారాలకు గురి అవుతుండేవారో వాటిని నివారించడానికి ప్రయత్నించినారే కాని ప్రజాపరిపాలన స్థాపించడానికి వారు యోచించినట్లు తోచదు. ఆ కాలంలో స్వతంత్రులైన పౌరులసంఖ్యకంటె స్వేచ్ఛ, న్యాయ స్థానాల రక్షణలేని సేవకుల, భూదానుల సంఖ్య ఎక్కువ అని కొందరి అభిప్రాయము. దేశంలోని భూమి దేశ ప్రజలదేగాక రాజొక్కడిదేనని సేవలు, కట్నాలు, సుంకాలు చెల్లించే షరతుమీద అందులో కొంత తన ముఖ్యానుచరులకిచ్చే జాగీర్‌దారీ విధానపు మూలసూత్రము ప్రజాస్వామ్య సిద్ధాంతానికి విరుద్ధము.

అయినా జాన్ అన్యాయాల నెదిరించడానికి పట్టణాల ప్రతినిధులు ప్రభువులతోను, బిషప్, ఆర్చిబిషప్‌లతోను జతకూడటం చూస్తే కొత్తయుగమొకటి ఇంగండ్‌లో బయలుదేరి నట్లు తోచకమానదు. రాజుల దురన్యాయాలను ప్రజలందరు ఏవగించుకొనేకాలం వచ్చింది. అటవీ శాసనాలనుగురించి పట్టణ ప్రజల హక్కులనుగురించి మాగ్నాకార్టాలో చేసిన వాగ్దానాల వల్ల లాభాన్ని పొందేవారు పెద్ద సామంతులు, చర్చి ఉన్నతోద్యోగులు కారు ; మధ్యతరగతి ప్రజలు. ఈ హక్కుల పత్రంలో న్యాయవిచారణనుగురించి చేసిన ఏర్పాట్లు యావత్ప్రజానీ కానికి రక్షణనిచ్చేవి. న్యాయపరిపాలనలో మధ్యతరగతి ప్రజల తోడ్పాటును న్యాయస్థానం తీసుకోవలెనని ఈ పత్రం స్థిరపరిచింది, శాసనబద్ధం చేసింది. ఈ పత్రం ప్రకారం ప్రభువులు రాజునుంచి తామే ఏ హక్కులను కోరినారో వాటిని తమ సామంతులకు కూడా ఇవ్వగలమని ప్రతిజ్ఞ చేసినారు.

## పార్లమెంట్ అభివృద్ధి

రాజు కొత్త పన్నులను వేయగోరేటప్పుడు మాత్రమే తన ముఖ్య సామంతులను సమావేశపరచవలె. కాబట్టి తనకున్న ఆదాయంతో పరిపాలన జరుపుకోదలిస్తే అతని నడిగే వారుండరు. 1215 తరవాత కూడా శాసనాలు చేయటంలోను, న్యాయపరిపాలనలోను, రాజ్య పరిపాలనలోను రాజే సర్వాధికారి. ముఖ్య రాజోద్యోగులు రాజు కెదురు తిరుగరుకదా ? ఇక మాగ్నాకార్టా ప్రాధాన్యమేమి ?

మూడో హెన్రీ కాలంలో సామాన్య ప్రజాప్రతినిధులను తమతో కలుపుకోనిదే రాజు నిరంకుశత్వాన్ని తా మరికట్టలేమని ప్రభువులు గ్రహించినారు. వారు హక్కుల పత్రాన్ని రాజు మన్నించేటట్లు చేయడానికి చేసిన పోరాటంలో పార్లమెంట్ ఉద్భవించింది. అంతేగాక రాజు వాగ్దానంచేసిన హక్కులను అతిక్రమిస్తే సామంతులు తీసుకోదగిన చర్యనుగురించి విప్లవాత్మకమైన సూచన మాగ్నాకార్టాలో పొందుపరిచినారు. ఈ సూచనను అనుసరించి రాజు మాగ్నాకార్టాను ఉల్లంఘించకుండా చూడటానికి తమలో ఇరవైఅయిదుగురిని ఎన్నుకొంటారు. ఏ హక్కుకైనా భంగం కలిగినప్పుడు వారిలో ఏ నలుగురైనా రాజునుగాని, అతడు లేనప్పుడు అతని జస్టిషియర్‌నుగాని అందుకు పరిహారం కోరవచ్చు. అడిగిన తరవాత నలభై దినాలు ఆగవలె. అప్పటికీ న్యాయం జరగకపోతే ఆ యిరువైఅయిదుమంది రాజుపై యుద్ధం ప్రకటించవచ్చు. వారు రాజకుటుంబంవారి వ్యక్తిస్వాతంత్ర్యాన్ని అరికట్టరాదు కాని, అతని భూములను, కోటలను ఆక్రమించవచ్చు. ఇతర విధాలగూడా అతనిపై ఒత్తిడి తేవచ్చు. ఎంత కాలం రాజు అన్యాయపరిపాలన చేయడో అంతకాలం ప్రజలతనికి లొంగి ఉండవలెగాని, అతడు ప్రజల హక్కులకు భంగం కలిగించినప్పుడు అతనిపై తిరుగుబాటు చేయడానికి వారికి హక్కున్నదని, అది న్యాయసమ్మతమని మాగ్నాకార్టా ఘోషించినట్లయింది. ఇట్లా ప్రజాభిప్రాయబద్ధమైన రాజరికానికి హక్కుల మహాపత్రము పునాదివేసినట్లయింది. ఇదే దాని ప్రాముఖ్యము ఇంగ్లండ్ రాజులు తమ పట్టాభిషేక సమయాన చేసే ప్రతిజ్ఞకు మాగ్నాకార్టా ఈ విధంగా సార్థకత కల్పించింది.

## పార్లమెంట్ అభివృద్ధి 1206–1307

మూడో హెన్రీ రాజయ్యేనాటికి అతనికి తొమ్మిదేండ్లు క్రీ. శ. 1232 వరకు రాజ సంరక్షకుడు మొదట పెమ్‌బ్రోక్ ; అతని తరవాత హ్యూబర్ట్‌డిబర్గ్ అనే జస్టిషియర్. జాన్ ఇచ్చిన హక్కుల పత్రాన్ని వారొకటికి రెండుసార్లు ప్రకటించినారు. అటవీశాసనాన్ని ప్రత్యేకంగా ప్రకటించినారు. క్రీ. శ. 1232 లో మూడో హెన్రీ స్వయంగా పరిపాలన చేపట్టినాడు. కాని కొద్ది కాలంలోనే అతడు తనకన్నా తన తండ్రి మేలనిపించినాడు. విదేశీయులను చుట్టూ చేర్చుకొని వారికి భూములు, అధికారాలు, కోటలు కట్టబెట్టడం చూసి ఇంగ్లీషు ప్ర వులు అతని పరిపాలనను ద్వేషించసాగినారు. రోమన్‌పోప్ ఇంగ్లీషు చర్చిలోని ఉన్నతోద్యోగాలను ఇటాలియన్ పాదిరీలతో నింపడం చూసి ఇంగ్లీషు చర్చి ఉద్యోగులు హెన్రీకి విరోధులయినారు. ఎంత ధనమూ చాలక కొన్ని కొత్త సుంకాలు వసూలు చేయగా జన సామాన్యము అతని పరిపాలనను అసహ్యించుకోసాగింది. ఒకవైపు దుష్పరిపాలన సాగిస్తూనే మరొకవైపు ధారాళంగా సత్పరిపాలన నెలకొల్పుతానని వాగ్దానాలు చేస్తూ ప్రభువులను,

మతోద్యోగులను, పట్టణ ప్రతినిధులను, భూస్వాములను, సమావేశాలకు పిలుస్తూ ఉండడం వల్ల అందరి దృష్టిలోనూ అతడెంతో చులకన అయినాడు.

1237 లో గ్రేట్ కౌన్సిల్ (Great Council) అంటే మహామండలి సహాయ సుంకము వసూలుచేయవలసిన విధానాన్ని నిశ్చయించిన తరవాత అది సరిగా ఖర్చుపడేటట్లు చూడటానికి ఒక కమిషన్‌ను కూడా నియమించవలెనని మూడో హెన్రీ తానే సూచించినాడు. మరుసటి సంవత్సరం 15 మంది సభ్యుల కమిషన్ ఒకటి పరిపాలనను సంస్కరించడం కోసం ఏర్పాటుచేయమని తానే కోరినాడు. 1254 లో గ్రేట్ కౌన్సిల్ సమావేశానికి ప్రతి మండలంనుంచి ఇద్దరు యోధులు, ఇద్దరు మతాధికారులు ఆహ్వానితులయినారు. 1258 లో లండన్‌లో గ్రేట్ కౌన్సిల్ సమావేశమై, తన కోరికలు తీర్చడానికి రాజసభ నుంచి పన్నెండుగురు, తానెన్నుకొనే పన్నెండుగురు మొత్తం 24 గురు కమిషనర్‌లు అవసరమైన సంస్కరణలను క్రిస్‌మస్‌లోపుగా పూర్తిచేయవలెనని తీర్మానించింది. కాని తరవాత రెండు నెలలకే జూన్ మాసంలో అది ఆక్స్‌ఫర్డ్‌లో సమావేశమై 24 గురు కమిషనర్‌లను నియమించింది. వీరు 15 మంది సభ్యుల కౌన్సిల్‌ను ఎన్నుకొన్నారు. వీరు శాశ్వత సభ్యులు. మంత్రులపైన, ఉన్నతోద్యోగులపైన వీరికి పెత్తనము ఉండవలసినట్లు, ప్రభువులందరు ఎన్నుకొన్న పన్నెండుమంది కమిటీతో వీరు సంవత్సరానికి మూడుసారులు సమావేశమై రాజ్యవ్యవహారాలన్నింటినీ చర్చించవలెనని తీర్మానమయింది. 1259 లో ఆక్స్‌ఫర్డ్ తీర్మానాలకు మరికొన్నింటిని జతపరిచి వెస్ట్‌మిన్‌స్టర్ నియమావళి అనేది ఏర్పరచినారు.

ప్రజల అసంతృప్తి తీవ్రమయిందని గుర్తించి లండన్‌లో గ్రేట్ కౌన్సిల్‌ను ఆహ్వానిస్తూ ప్రతి మండలంనుంచి నలుగురు వీరులను పంపమని రాజు షెరీఫ్‌లకు తాఖీదు పంపినాడు. ప్రభువులు హెన్రీ రాజుకు, తమకు మధ్య రాజీ కుదర్చడానికి ఫ్రాన్స్ రాజు నాహ్వానించినారు. కాని అతని తీర్పు రెండు పక్షాలకు తృప్తినివ్వలేదు. అందుచేత యుద్ధం సంభవించింది. అందులో రాజూ అతని పక్షంలోని ముఖ్యులూ ప్రతిపక్షనాయకుడైన సైమన్ డి మాన్‌ఫర్ట్ చేతిలో ఖైదీలయినారు. తరవాత సమావేశమైన పార్లమెంట్‌కు ప్రభువులతోబాటు ప్రతి మండలంనుంచి నలుగురు వీరులను పిలవడమయింది. వారు ముగ్గురిని తామెన్నుకొన్నారు. ఆ ముగ్గురు తొమ్మిదిమంది కౌన్సిలర్‌లను నియమించినారు. వారి సలహా మేరకు రాజు పాలించవలెనని నిశ్చయించినారు. 1265 లో సైమన్ పిలిచిన పార్లమెంట్‌లో ప్రభువులు, మతోద్యోగులతోబాటు పట్టణాల, గ్రామాల ప్రతినిధులు కూడా కూర్చున్నారు. ఈ కారణం చేత సైమన్ 'ఇంగ్లీషు పార్లమెంట్ స్థాపకుడు' అని కొందరన్నారు. ఈ సభ జనవరిలో జరిగింది. ఆగస్టు నెలలో జరిగిన ఎవెషామ్ యుద్ధంలో సైమన్ చనిపోవడం చేత పార్లమెంట్‌ను సృష్టించడానికి అతడు పడిన శ్రమ అప్పటికి వృథా అయినట్లు తోచింది. ప్రజలలో అన్ని తరగతులకు ప్రాతినిధ్యం వహించే పార్లమెంట్ తోడ్పాటుండే పరిపాలన సుకరమవుతుంది అనే నీతిని సైమన్ డి మాన్‌ఫర్డ్‌వల్ల గ్రహించినందువల్ల అటువంటి ప్రాతినిధ్యమున్న ఆదర్శ పార్లమెంట్‌గా 1295 లో మొదటి ఎడ్వర్ నమూనా పార్లమెంట్ (Model Parliament)ను సమావేశపరచడం సంభవించింది. కాని తరవాత ముప్పయి ఏండ్లలో ఏ ప్రాంతం వారినుంచి ధనము, ఇతర సహాయాన్ని అడగదలచినాడో ఆ ప్రాంతంలో ఉన్న పట్టణాల, మండలాల

ప్రతినిధులను మతాధికారులను, ప్రభువులను మాత్రమే ఐదవ ఎడ్వర్డ్ పార్లమెంట్‌లకు ఆహ్వానించడం చాలాసార్లు జరిగింది.

## నమూనా పార్లమెంట్ (Model Parliament)

ప్రధాన భూస్వాముల, మతాధికారుల ప్రాబల్యం తగ్గించడానికి రాజు మధ్యతరగతి ప్రజలను కూడగట్టుకొనడ మవసరమని తెలిసి స్కాట్లండ్, వేల్స్ రాజులతో యుద్ధం చేయడానికి ధనంకావలసి ప్రభువులకు, మతాధికారులకు వ్యక్తిగతంగా పిలుపు పంపడమేగాక ఒక్కొక్క చర్చికి ఒక్కొక్క ప్రాక్టరు (proctor)ను, చర్చి మండలానికి ఇద్దరు ప్రాక్టరులను పిలుచుకొనిరావలెనని మతాధికారులను మొదటి ఎడ్వర్డ్ ఆదేశించినాడు. ఒక్కొక్క జిల్లానుంచి ఇద్దరు యోధులు, ప్రతి పట్టణం నుంచి ఇద్దరు పౌరులు, ఒక్కొక్క గ్రామం నుంచి ఇద్దరు గ్రామస్థులు ఎన్నికయ్యేటట్లు చూడమని షెరీఫ్‌లకు తాఖీదు పంపినాడు. ఇట్లా బ్రిటిష్ రాజ్యాంగ చరిత్రలో ప్రథమంగా ప్రజలలో అన్ని తరగతుల వారికి ప్రాతినిధ్యం లభించింది. ఈ 1295 పార్లమెంట్ తరవాత ఇంగ్లీష్ చర్చిలోని సామాన్యోద్యోగులు తమంతట తామే పార్లమెంట్‌కు రావడం మానుకొన్నారు. మరొక సంవత్సరంలోపుగా ఇంగండ్‌కు స్కాట్లండ్‌తోను ఫ్రాన్స్‌తోను యుద్ధం సంభవించింది. ఈ ఒత్తిడివల్ల ధనసహాయం చేయమని చర్చివారిని, ప్రభువులను ఎడ్వర్డ్ కోరినాడు. సహాయంచేయ నిరాకరించిన వారిని రాజ్యరక్షణనుంచి వెలివేసినాడు. రాజున్న యుద్ధరంగంలో తప్ప తాము పోరాడమని ప్రభువు లెదురు తిరిగినారు. వారికి రాజు నచ్చజెప్పి చూసినాడు. కాని లాభంలేకపోయింది. తాను ముందుచేసిన వాగ్దానానికి భిన్నంగా రేవులో ఎగుమతికి సిద్ధంగా ఉన్న ఉన్నిని స్వాధీనం చేసుకొన్నాడు. సేవలు ప్రతిమండలమూ సరఫరాచేయవలెనని, ప్రభువులు ఫ్రాన్స్ యుద్ధానికి సిద్ధపడవలెనని ప్రకటించి ఎడ్వర్డ్ ఫ్రాన్స్‌కు పోయినాడు. అతడు వెళ్ళగానే కొందరు ప్రభువులు లండన్ పట్టణంపై దాడిచేసినారు. ఎడ్వర్డ్ కుమారుడు వారి కోరికలను రాజుకు తెలియజేయగా అతడు ఇంతకుముందు తానుగాని తన పూర్వులుగాని సత్పరిపాలనను గురించి ప్రజల హక్కులనుగురించి చేసిన ప్రకటనలన్నింటిని ధ్రువపరుస్తున్నట్లు తెలియజేసినాడు., మునపటి పత్రాలకు ఈ 1297 పత్రానికి ఎంతో వ్యత్యాసమున్నది. ఈ ధ్రువపత్రానికి (Confirmation of the Charters) విరుద్ధంగా రాజు నడవకుండా చూడటానికి ప్రజలకు సంపూర్ణ ప్రాతినిధ్యమిచ్చే పార్లమెంట్ ఒకటి ఎటూ ఏర్పడుతుంది. కాలం గడిచే కొద్ది పార్లమెంట్ బలపడటానికి ఇతర సందర్భాలు కూడా తోడ్పడినాయి. పార్లమెంట్‌ను కూడగట్టుకొనడానికి తమకు అనుకూలురుగా ఉన్న సభ్యులతో దానిని నింపడానికి రాజులు, పరిపాలనాధికారాన్ని చేజిక్కించుకోదలచి ప్రభువులు ప్రయత్నించినారేగాని పార్లమెంట్‌ను కాదన్నవారు 1291 తరవాత ఎవ్వరూ లేరు. అట్లా కాదన్న వారిలో స్టూవర్ట్‌రాజు మొదటి చార్లెస్ తల తెగింది. అంతేకాక ఆయన కుమారులు ఫ్రెంచి రాజైన 14వ లూయీపంచల్లో పడిగాపులు కాయవలసి వచ్చింది.

మొదటి ఎడ్వర్డ్ రాజాధికారాన్ని ఏ విధంగా పటిష్ఠం చేయజూసిందీ తెలుసుకోవలెనంటే అతడు గొప్ప సామంత ప్రభువులను, కాథలిక్ చర్చిలోని ఉన్నతాధికారులను పడదోయడానికి ఎట్లా ప్రయత్నించినాడో తెలుసుకోవలె. ఇంగండ్ దేశచరిత్రలో క్రి. శ. 1066 వరకు

ప్రాచీన యుగమైతే క్రీ శ. 1485 వరకు మధ్యయుగంగాను అనంతరం ఆధునికయుగంగాను పరిగణింపవలసి ఉంటుంది. మధ్యయుగ చరిత్ర ముఖ్యలక్షణము రాజుల, సామంత ప్రభువుల పరస్పర పోరాటం. ఈ పోరాటంలో ప్రభువుల స్వార్థానికి, దౌర్జన్యానికి గురిఅయిన పీడిత ప్రజానీకము ఆరంభంలో రాజులకే అండగా నిల్చింది. వీరి సహాయాన్ని పొందటానికి ఒక వైపు పార్లమెంట్‌లో వీరికి ప్రాతినిధ్యం సమకూరుస్తూ మరొకవైపు ప్రభువులపైన, మతాధికారులపైన దెబ్బతీయడానికి చర్యలు మొదటి ఎడ్వర్డ్ తీసుకొన్నాడు అవి :

1. *గ్లస్టర్ చట్టము:* కొన్ని ప్రాంతాలలో ప్రభువులు చెలాయించే న్యాయవిచారణాధికారాలు వారి కే విధంగా లభించినాయో విచారించవలసిందిగా ఈ చట్టము సంచారన్యాయాధిపతులను కోరింది ఈ విధంగా అక్రమంగా వారికి భుక్తమైన అధికారాలను మొదటి ఎడ్వర్డ్ అంతం చేసినాడు.

2. సంవత్సరానికి 20 పౌనులు ఆదాయమిచ్చే సొంతభూమి కలవాడు యోధుడుగా నమోదు కావలె. అట్లా కాకపోతే విశేష అపరాధం చెల్లించవలసి ఉంటుందని రాజు ఆజ్ఞ చేసినాడు. దీనివల్ల అతనికి ఆదాయం లభించడమేగాక ఎదురుతిరిగిన సామంతులను అణిచి వేయడానికి సైన్యసహాయం కూడా లభిస్తుంది.

3. *క్వియా ఎంప్టోరిస్ :* (భూమి పంపకి నిషేధము) తమ అనుచరుల బలగాన్ని వృద్ధిచేసుకొనడాన్ని సామంతులు తమ భూములను కొంత పంచి ఇచ్చి కొత్త కౌలుదార్లను ఏర్పాటుచేసుకొనడాన్ని ఈ చట్టము నిరుత్సాహపరచింది. ఏ సామంతుడైనా అట్లా చేస్తే ఆ కొత్త కౌలుదార్లు, అతని అనుచరులుకాక అతని పైప్రభువుకు అనుచరులై వానికే తమ సేవలనుచేసి సుంకములను చెల్లించవలసి ఉంటుందని ఈ చట్టం ప్రకటించింది. పైప్రభువు ఆ కొత్త కౌలుదార్లను తీసుకొనడానికి నిరాకరిస్తే వారు రాజుకే అనుచరులవుతారని ప్రకటించింది.

4. కొత్తగా ఎవరుగాని తమ భూములనుంచి ఏ మాత్రం చర్చికి ఇకమీద దానం చేయరాదని 1279 లో మోర్ట్‌మెయిన్ చట్టము (భూదాన నిషేధ శాసనము) చేయుడమయింది. చర్చిలకిచ్చే భూముల ఆదాయాలు, సేవలు ప్రభువునకు లోపించకుండా నివారించడానికి ఈ చట్టం చేయడం జరిగింది. చర్చితో లాలూచిపడి ఒక చేతితో భూమిని దానంచేసినట్లేచేసి దానిని మళ్ళీ తక్కువ రుసుము చెల్లించి మరొకచేతితో తీసుకొనే అక్రమాన్ని ఈ చట్టం నిరోధించింది.

5. చర్చి న్యాయస్థానాలు ఇకమీద నీతికి, మతవిరుద్ధ కార్యాలకు, వీలునామాలకు, పెండ్లిండ్లకు సంబంధించిన వ్యాజ్యాలను మాత్రమే విచారింపవలెనని 1285 లో చట్టం చేయడమయింది.

6. 1296 లో తనకింద చర్చిఉద్యోగులు రాజులకు, ఇతర ప్రభువులకు పన్నులు చెల్లించరాదని పోప్ ప్రకటించినాడు పన్నులు చెల్లించని మతోద్యోగులకు ఎటువంటి రక్షణా ఉండదని మొదటి ఎడ్వర్డ్ అనడంతో చర్చి ఉద్యోగులు దారికి వచ్చినారు.

7. మొదటి ఎడ్వర్డ్ కాలంనుంచి మూడు ముఖ్య న్యాయస్థానాలు స్థిరపడినాయి. (i) సామాన్య న్యాయస్థానము (Court of Common Pleas or Popular Court) అనాది కాలంనుంచీ ప్రజల న్యాయస్థానాలు పాటించిన సంప్రదాయ సిద్ధమైన న్యాయాన్ని

ఇచ్చే కోర్టు (ii) ఎక్స్చెకర్ కోర్టు (Exchequer court) రాజు ఆదాయాలనుగురించి ఏర్పడే వ్యాజ్యాలను విచారించే న్యాయస్థానము (iii) రాజు న్యాయస్థానము (The King's Bench Court). ఈ మూడు న్యాయస్థానాలూ వేరువేరు కాలాలలో రాజసభ (Curia Regis) నుంచి చీలి ఏర్పడినాయి. ఎన్ని కోర్టులున్నా రాజు న్యాయప్రదాత కాకపోడు కనక న్యాయవిచారణాధికారాన్ని చెలాయించే ఛాన్సరి కోర్టు ఒకటి కొత్తగా ఏర్పడింది. రాజు ముఖ్యోద్యోగులు కొందరు, అతని న్యాయాధీశులందరు దానిలో సభ్యులు. వీరుగాక ఇతరులను కూడా సభ్యులుగా రాజు నియమించవచ్చు తమకు న్యాయమివ్వమని ప్రజలు రాజుకు చేసే ప్రార్థనలను ఈ కోర్టు విచారించేది ఈ కోర్టుకు ఛాన్సలర్ అధ్యక్షుడు. ఈ న్యాయస్థానాలన్నీ రాజశాసనాలను సమానంగా పాటించేవి. రాజ్యంలో వేర్వేరు ప్రాంతాలలో పూర్వం ఉండే ప్రత్యేక న్యాయస్థానాల న్యాయాలూ – అంటే ప్రభువుల కోర్టులు పాటించిన న్యాయాలు – ప్రజా న్యాయస్థానాలు అనాదిగా పాటించిన న్యాయాలూ ఇకమీద రాజ శాసనానికి సమానంగా కట్టుబడి ఉండవలసి రావటంచేత రాజు పలుకుబడి, ధనాదాయం హెచ్చడమేగాక ఇంగ్లండ్ ఒక్క రాజ్యంగా సంఘటితం కావడానికి చక్కని అవకాశమేర్పడింది. అందుచేత పార్లమెంట్‌లో తమకు ప్రాతినిధ్యం రాగా బాగుపడిన సామాన్యజనులు ప్రభువులకు, చర్చి ఉన్నతోద్యోగులకు ఎదురు నిల్చి వారితో పోరాటం చేయడంలో తనకు అండగా ఉంటారని రాజు తలచినాడు. కాని వారట్లా చేయక ప్రభువులతోను, కాథలిక్ చర్చితోను చేతులు కలిపి పార్లమెంట్ అధికారాన్ని హెచ్చించడానికి కృషి చేసినారు. తత్ఫలితంగా సుపరిపాలన లభించకపోవడమేగాక ప్రభువర్గంలో చీలికలేర్పడి ఒక్కొక్క పక్షంవారు పార్లమెంట్‌లో తమ అనుచరులను నింపి మధ్యయుగ ఇంగ్లండ్ దేశచరిత్రలో అరాజకత్వ పరిస్థితిని తెచ్చి పెట్టినారు.

## రాజ్యాంగ పరిణామము 1307–1485

క్రీ శ. 14, 15 శతాబ్దాలలో మరే శతాబ్దంలోను జరగనంతగా పార్లమెంట్ అధికారం పెంపొందింది. ఇంగ్లీషువారి జీవితము అనేక రంగాలలో మలుపుతిరిగిన కాలమది. రెండో హెన్రీ (1154) నుంచి రెండో రిచర్డ్ వరకు (1327) ఇంగ్లండ్‌ను పాలించినవారు ప్లాంటాజెనెట్ వంశంవారు. వారికి తాము రాజులు కావడానికి వంశానుగతమయిన హక్కు గలదని వాదించే వీలుండేది. వారికి ముందు మొదటి విలియమ్ కాలంనుంచి 1154 వరకు పాలించిన నార్మన్‌లకు ఇంగ్లండ్‌ను యుద్ధంలో గెల్చుకొన్నందువల్ల తాము రాజులమైనామనే అహంకారం పొందే వీలుండేది. కాని 1327 లో రాజైన మొదట లెంకాస్ట్రియన్, హెన్రీ బొలింగ్ బ్రూక్, అతని వంశంవారూ పార్లమెంట్ అనుగ్రహం వల్లనే తాము రాజులు కాగల్గినామని గ్రహించిన వారు. వారి కాలంలో పార్లమెంట్ అనేకాధికారాలను పుంజుకొన్నది. యార్కిస్టులు పార్లమెంట్‌ను నామమాత్రావశేషం చేయవలెనని ప్రయత్నం చేసినారుగాని ముప్పదేండ్ల గులాబీల యుద్ధంలో అనేక ప్రభువంశాలు అంతరించడంచేత వారి బలం నశించింది. తరవాత పాలించిన ట్యూడర్ రాజులు ప్రభుశత్రుశేషాన్ని సమూలంగా చితకగొట్టినారు లెంకాస్ట్రియన్ రాజుల కాలంలో పార్లమెంట్ సాధించిన అధికారాలను మన్నించడంవల్ల తమకు బలం కలుగు

తుందని ట్యూడర్‌లు భావించినారు. అందుచేత సాధికారమైన పార్లమెంట్ సంస్థ ఇంగ్లీష్ రాజ్యాంగ చరిత్రలో శాశ్వతంగా నిల్చిపోయింది.

ఈ కాలంలో చర్చి పరిస్థితి చాలా చెడిపోయింది. పురోహిత వర్గంవారు మతానుసారం జీవించడం మాని భోగలాలసులై ప్రజల మన్ననలకు దూరమైనారు. చర్చి సంపదకు,

## లాంకాస్టర్ యార్క్ వంశాలు




భూములకు తరుగులేదు. రాజుకు ఇతర భూస్వాములు చెల్లించే అనేక కట్నాలను, సేవలను వారు చెల్లించ నక్కరలేదు. బూడిద, నల్లరంగుల సన్యాసులు (The Grey friars and The black friars) అనే బైరాగి సంఘాలు చర్చిని అనేక విధాల విమర్శించసాగినాయి. ప్రజల హక్కులకోసం రాజులతో పోరాడే స్టీఫెన్ లాంగ్‌టన్ వంటివారు మతవర్గం వారిలో అరుదయినారు. రోమన్ పోప్‌లు ఇంగ్లీష్ చర్చిలోని ఉన్నత పదవులను ఇటాలియన్‌లతో నింపడంవల్ల చర్చిపై పోప్‌ల పరిపాలనను ఇంగ్లీష్ జాతి ఖండించసాగింది.

ఆ కాలంలో నల్లమారి (Black death) అనే గొప్ప అంటువ్యాధి విశేషంగా సేద్య బానిసలను (serfs), భూదాసులను (Villeins) బీదలను, కూలినాలి జనాన్ని తుడిచివేసింది. ఈ వ్యాధికి ముందే భూస్వాములు పంటలు పండించడం మానివేసి తమ భూములను పచ్చిక

బయళ్ళుగా చేసి గొర్రెలను పెంచి వాటి ఉన్నిని (ఫ్రెంచ్ -- ఫ్లాండర్స్) రాష్ట్రానికి పంపి అధిక లాభాలను సంపాదించడానికి పూనుకొన్నారు. భూదాసులను తొలగించి వారి భూములనూ బీళ్ళనూ ప్రభువులు పచ్చికబయళ్ళుగా మార్చసాగినారు. అప్పుడు సేవకుల సంఖ్య చాలా వరకు తగ్గిపోగా భూదాసులు పొలాలను విడిచి పారిపోకుండేటట్లు చేయవలెనని ప్రభువులు చూసినారు. కాని వారి ప్రయత్నాలు ఫలించలేదు. చర్చిలో చేరినా సంవత్సరంపై ఒక్క దినము ప్రభువుకు చిక్కక పట్టణంలో గడిపినా భూదాసుడు స్వతంత్రుడే అవుతాడు అనే ఆచారం పురాతనమైనది. ఇప్పుడు దాని సేవలు భూదాసు లుపయోగించుకొన్నారు. భూదాసులు లేకపోతే భూస్వామిక విధానము పునాది లేనిక ఇంటివలె కూలిపోయింది; ప్రభువుల ఫ్యూడల్ బలం విరిగిపోయింది

## పార్లమెంట్ అభివృద్ధి

పార్లమెంట్ ఇంగ్లండ్‌లో రూపు సంతరించుకొంటున్న కాలంలో ఇంగ్లండులో ఉన్నట్లే ఐరోపియన్ రాజ్యాలన్నింటిలోను ప్రజలలో నాలుగు ముఖ్యవర్గా లుండేవి; 1. ఉన్నత ప్రభువర్గము, 2 పురోహితవర్గము, 3. మధ్యతరగతి జనము, 4. సేద్య బానిసలు. భూదాసులు వీరిలో మూడవవర్గం వారిని మధ్యతరగతి వారని వ్యవహరించవచ్చు. వీరిలో చిల్లర భూస్వాములు, సొంత భూమిలేని స్వతంత్రులైనవారు, పట్టణవాసులు, పరిశ్రమలవల్ల వ్యాపారంవల్ల జీవించేవారు, ప్రభువుల సంతానమైనా అగ్రజులు కానందువల్ల జమీనులకు వారసత్వం లేనివారు, ఈ మధ్యతరగతి జనులతో మనస్సులు కలిసి పొత్తు కుదిరిన పురోహిత వర్గంలోని సామాన్యోద్యోగులు ఉన్నారు. ఈ వర్గం వారికి నార్మన్ ఉన్నత సమితి (The Norman Great Council) సమావేశాలకు రమ్మని ఉన్నత ప్రభువులకు, బిషప్, ఆబట్, ఆర్చ్ బిషప్పులకు మండలాధికారి అయిన షెరీఫ్ ద్వారా వ్యక్తిగతంగాగాక సామూహికంగా ఆహ్వానాలు పంపేవారు. ఆ అధికారి అవసరమయిన సందర్భాలలో, మండల, పట్టణ సమితుల ఎన్నికలు జరిపి ఆ నార్మన్ గ్రేట్ కౌన్సిల్‌కు ప్రతినిధులను పంపేటట్టు చూసేవాడు. ఈ ప్రతినిధులతో కూడిన గ్రేట్ కౌన్సిల్ (Great Council) క్రమంగా పార్లమెంట్‌గా రూపుదాల్చింది ఏ వర్గంవారితో తనకు పని ఉంటుందో ఆ వర్గం ప్రతినిధులను మాత్రమే పార్లమెంట్ సమావేశాలకు ఆహ్వానించడానికి రాజులు మొదట పూనుకొన్నారు. కాని క్రమంగా మొదటి రెండు వర్గాల ప్రతినిధులు హాజరైన సమావేశాలకు మూడో వర్గం ప్రతినిధులు హాజరు కావడానికి వైముఖ్యం చూపడంవల్ల ఇంగ్లీష్ పార్లమెంట్ ద్విశాసనసభగా స్థిరపడిపోయింది. ఈ పరిణామానికి మత వ్యవస్థలోని కిందివర్గాల ఉద్యోగుల వైఖరికూడా తోడ్పడింది. పై కారణంవల్ల అప్పటినుంచి ప్రత్యేక సమావేశాలు జరిపి రాజులతో తమకున్న వ్యవహారాలను, ఇతర సమస్యలను పరిష్కరించుకొనడానికి అలవాటుపడటంచేత వారు పార్లమెంట్‌కు దూరమయినారు. మొదటి రెండు వర్గాలవారు ప్రభుసభ కాగా మూడోవర్గం ప్రతినిధులతో సామాన్య ప్రజలందరికీ ప్రతినిధి సభగా కామన్స్ సభ అవతారం దాల్చింది. పొరుగు రాజ్యాలైన ఫ్రాన్స్, స్కాట్లండ్‌లలో పార్లమెంట్ సంస్థ మరో రూపంలో పరివర్తనం పొందింది. ఫ్రెంచి శాసనసభ ప్రభువులసభ, మతోద్యోగుల సభ, పట్టణవాసుల సభ అనే మూడు అంగాలు కలిసి స్టేట్స్ జనరల్ (States general) అయింది. స్కాట్లండ్‌లో

శాసనసభ ఉన్నత ప్రభువర్గసభగా నిల్చిపోయింది. రాజు భూములలోని పట్టణవాసులకు మాత్రం దానిలో ప్రాతినిధ్యం లభించింది. ఇక మిగిలిన సేద్యపు బానిసలు (serfs), భూదాసులు (Villeins) నాలుగో వర్గంవారు. కాస్తవానికి వీరినొక వర్గమనడానికి వీలులేదు. ఒక వర్గం వారిలో దృశ్యమయే సహానుభూతి, ఏకతలు వీరిలో లేవు. వీరికి సాంఘికంగాను, రాజకీయంగాను ఎటువంటి హక్కులు లేవు. భూస్వామిక విధాన మదుగంటి, ప్రభుత్వాధికారం బలపడిన తరవాత వీరు స్వతంత్ర పౌరవర్గంలో కలిసిపోయినారు.

మధ్యయుగంలో కాలం గడిచినకొద్దీ ప్రజలలో మూడో వర్గంవారి ప్రాముఖ్యం హెచ్చయింది. రెండో హెన్రీ, మొదటి ఎడ్వర్డ్, మూడో ఎడ్వర్డ్, లెంకాస్ట్రియన్ వంశ రాజులు ఈ వర్గం వారిని చాలా మన్నించినారు. బలవంతులైన పై రాజుల కాలంలో వ్యవసాయం కన్న పరిశ్రమలు, వ్యాపారము లాభకారులయినాయి. రాజుకు వారినుంచి అనేక విధాల ఆదాయం హెచ్చయింది వారి తోడ్పాటుంటే వీలున్నప్పుడెల్ల విప్లవం లేవదీసే ప్రభు వర్గం వారిని అణచివేయవచ్చునని రాజరికం వారి నమ్మకము. నార్మన్ రాజులకు ఈ వర్గం వారు తోడ్పడినారు తోడ్పడకుండా ఉంటే ప్రభువర్గ దౌర్జన్యం నుంచి వారికి రక్షణ లేకపోయేది. కాని జాన్ కాలంనుంచి వారు రాజ శత్రువులతో చేరి రాజు బలాన్ని తగ్గించడానికి పార్లమెంట్ శక్తిని హెచ్చించడానికి తోడ్పడినారు. కాని రెండో రిచ్చర్డ్ కా.ంతరవాత ఈ వర్గంవారు రాజరికం వైపే మొగ్గినారు వారి అధికారాలను లెంకాస్ట్రియన్ రాజులు పోషించినారు తరవాత ట్యూడర్ రాజులు మన్నించినారు.

*పార్లమెంట్ పరిణామము:* మధ్యయుగంలో ప్రతి జిల్లానుంచి జిల్లాసభ (shire-moot or country court) ఎన్నుకొనే ఇద్దరు యోధులు, ప్రతి నగరం (Borough) నుంచి ఇద్దరు నగరవాసులు ఇంగ్లీష్ పార్లమెంట్‌లో ప్రాతినిధ్యం వహించేవారు. ఆ ప్రాతినిధ్యము నియోజకవర్గ పరిమితినిబట్టిగాని సంపదనుబట్టిగాని నిర్ణీతమైనది కాదు జిల్లా సభ సమావేశాలలో పాల్గొనేవారే జిల్లా ప్రతినిధులను ఎన్నుకొనే పద్ధతి ఒక శతాబ్ది కాలం అమలులో ఉందిగానీ నాలుగో హెన్రీ రాజు కాలంలో 1406 లో ఆ ఆచారము శాసనం ద్వారా క్రమబద్ధము అయింది. 1430 లో ఆరో హెన్రీ కాలంలో కౌంటీలలో ఎన్నుకొనే హక్కు ఏటా నలభై షిల్లింగుల ఆదాయమిచ్చే సొంతభూమి కలవారికే అని నిర్ణయిస్తూ పార్లమెంట్ ఒక చట్టం చేసింది. పట్టణాల నుంచి పార్లమెంటుకు ప్రతినిధులను ఎన్నుకొనే అధికార మెవరికుంటుందో 1832 పార్లమెంట్ సంస్కరణ శాసనందాకా నిర్ణయం కాలేదు.

కౌంటీల నుంచి పార్లమెంట్ ఎన్నికలకు నిల్చేవారు యోధులుగా (belted knights) ఉండవలెనని ఆరో హెన్రీ కాలపు రాజశాసనం విధించింది. కాని యోధులేగాక సామాన్య భూస్వాములు కూడా ఎన్నికవుతూనే ఉండేవారు. నగర ప్రతినిధుల అర్హతలు నిర్ణయించే శాసనం మొదటిసారిగా 1711 లో వచ్చింది. కామన్స్ సభ ప్రాముఖ్యము అధికం కావడం గమనించి దానిని ఆకట్టుకొనడానికి తమ అనుచరులను ఎన్నుకొనవలెనని కౌంటీల వోటరులను ప్రభువులు నిర్బంధించడం, రాజుకు అనుకూలురనే ఎన్నుకొండని షెరిఫ్ పీడించడం ఆ కాలంలో సామాన్యమయింది. 1377 లో లెన్‌కాస్ట్రియన్ డ్యూక్ (రెండో రిచ్చర్డ్ పినతండ్రి) అయిన జాన్ ఆఫ్ గాంట్ తన అడుగులకు మడుగులొత్తేవారిని ఎన్నుకొనేటట్లు ఎన్నిక వర్గాలన్నింటిని, నిర్బంధించి పార్లమెంట్‌ను నిర్వీర్యం చేసినాడు. దీనిగురించి పార్లమెంట్

ఫిర్యాదుచేయడం చేతనే జిల్లాల ప్రతినిధులు జిల్లాకోర్టుల సభ్యులందరి సమావేశాలలో ఎన్నిక కావలెనని 1406 శాసనము అయింది.

పైన చెప్పినదానినిబట్టి లెంకాస్ట్రియన్ల కాలంనాటికే సంపూర్ణ ప్రజా ప్రాతినిధ్యంగల పార్లమెంట్ పరిపాలన సుస్థిరంగా ఏర్పడిందని అనడానికి వీలులేదు. పార్లమెంట్‌కు పోయి రావటంచేత తమ వ్యాపారాలు మూలబడతాయని కౌంటీలలోని, నగరాలలోని, ప్రజలు సమావేశాలకు హాజరయ్యేవారు కారు. నగరాల, కౌంటీల ప్రతినిధులు పార్లమెంట్‌కు హాజరయినప్పుడు తమకు కొత్త ఆదాయాలు చూపించమని రాజులు వారిని ఒత్తిడి చేసేవారు. జిల్లాలలోని ఇతర భూస్వాములు చెల్లించే పన్నులకంటె ఎక్కువ రేటు పన్నులు నగరవాసులు కట్టవలసి ఉండటంవల్ల వారు తమకు పార్లమెంటరీ ప్రాతినిధ్యము వద్దని, మొరపెట్టిన సందర్భాలు కూడా లేకపోలేదు. ప్రతినిధులను రాబట్టడానికి పార్లమెంటుకు హాజరయిన వారికి బత్తెలిచ్చే పద్ధతిని ప్రవేశపెట్టినా పార్లమెంట్ సమావేశాలపట్ల ప్రజల వైముఖ్యం అంతగా తగ్గలేదు. ఒక్కొక్కసారి పార్లమెంట్‌కు పోకుండా పారిపోయినవారిని షెరీఫ్‌లు తరిమి పట్టి బలవంతంగా హాజరయ్యేటట్లు చేసిన సందర్భాలు ఇంగ్లీషు పార్లమెంట్ చరిత్రలో ఉన్నాయి.

మధ్య యుగంలో పార్లమెంట్ ఏ సంవత్సరానికా సంవత్సరం ఎన్నికయ్యేది. వాని జీవితము ఒక్క సమావేశంతోనే ముగిసేది. ఆ సమావేశము సామాన్యంగా నాలుగు వారాలకంటె ఎక్కువకాలం సాగేదికాదు. పార్లమెంట్‌ను ప్రతిఏడు ఎన్నుకోవలసినట్లు 1330 లోను, 1361 లోను రాజ శాసనాలు జారీ అయినాయి.

## పార్లమెంట్ అధికారాభివృద్ధి

మొదట కొన్ని శతాబ్దాలవరకు ఇంగ్లండ్ రాజులకు సొంత జమీనులు, అడవులు, గనులు, రేవు సుంకాలు, సామంతులు చెల్లించే కానుకలు, సేవలు, ఓడలు పగిలి ఒడ్డుకు కొట్టుకొని వచ్చే వస్తు సంచయము మొదలయినవి ఆదాయానికి ఆధారాలు. మొదటి విలియమ్ కాలంనుంచి ఈ ఆదాయానికి, ఫ్యూడల్ ఆదాయాలు కలిసినాయి. అటవీ న్యాయస్థానాలు, రాజు న్యాయస్థానాలు విధించే అపరాధాలు రాజు భూములలో వెలసిన పట్టణవాసులనుంచి వసూలుచేసే ప్రత్యేక సుంకాలు (Tallages) వారి ఆదాయాన్ని పెంచినాయి. ఇన్ని విధాల సొంత ఆదాయమున్న రాజులు దుర్వ్యయాలకు, వ్యసనాలకు దిగక అనవసర యుద్ధాల పూనుకోకుండా ఉంటే సంప్రదాయ విరుద్ధమైన కొత్త పన్నులు వేయడానికిగాని, పాత పన్నుల రేట్లు హెచ్చించడానికిగాని, అట్లాచేసి పార్లమెంట్‌తో కలహించడానికిగాని అవసరం వచ్చేదిగాదు. డబ్బు అడిగినప్పుడల్లా తనకేమి అధికారాలిస్తారని పార్లమెంట్ ఒత్తిడి చేసేది కాదు. కాని ఎవరిపై పన్నుల బరువు వేయదలచుకొన్నారో ఆ వర్గాల, ఆ వర్గ ప్రతినిధుల ఒప్పుదలలేకుండా, పన్నులు వసూలు చేయరాదనే ఫ్యూడల్ ఆచారాన్ని రాజులు పాటించవలసి వచ్చింది. మొదటి ఎడ్వర్డ్ కాలంనుంచి పట్టణవాసులు, నగరవాసులు క్రమంగా అధిక ధనవంతులయినారు. నల్లపోత అనే అంటువ్యాధి పల్లెల జనాన్ని, భూదాసులను, తుడిచిపెట్టిన తరవాత పంట పొలాలను బీడుపెట్టి గొర్రెల పెంపకానికి పూనుకొన్న భూస్వాములు ఫ్లాండర్స్‌లోని నేతగాండ్లకు హెచ్చు ధరలకు ఉన్నిని అమ్మి భాగ్యవంతులయినారు. బలవంతులైన రాజుల పరిపాలనవల్ల వ్యవసాయము, వృత్తులు, వ్యాపారము బాగా పుంజుకొన్నాయి.

ప్రభువులు ఒండొరులతోను, రాజులతోను పోరాడినప్పుడు వారెవ్వరూ వృత్తి వ్యాపారాలు చేస్తున్నవారి జోలికి పోని కారణంచేత, కామన్స్ సభలో ప్రాతినిధ్యం గల వర్గాల మొత్తం రాబడి ప్రభువుల సభలోని వారి మొత్తం ఆదాయంకంటె అత్యధికము అయింది. వారివల్ల రాజు కెక్కువ రాబడి ఉండటంచేత పన్నులు విధించే విషయంలో కామన్స్ సభ అభిప్రాయాలకు రాజు హెచ్చు విలువ ఇయ్యవలసి వచ్చింది.

రెండో ఎడ్వర్డ్ (1307-1327) కాలంలో తన ఆమోదం లేకుండా రాజు విధించే పన్నులు శాసన విరుద్ధాలని పార్లమెంట్ చాలాసార్లు ప్రకటించింది. 1311 లో ప్రభువు లొక కమిషన్ ఏర్పాటుచేసి తమకు ఇష్టులైన వారినే రాజు ముఖ్యోద్యోగులుగా నియమించేటట్లు చేయగలిగినారు. ఆ కమిషన్ చేసిన అధికార ప్రకటనలను పార్లమెంట్ ఆమోదం పొందలేదనే కారణం చెప్పి 1322 లో రెండో ఎడ్వర్డ్ రద్దు చేసినాడు. అందుచేత శాసనాలు పార్లమెంట్ లోని రెండు సభల ఆమోదాన్ని విధిగా పొంది తీరవలెనని 1322 లో కంఠోక్తిగా చెప్పినట్లయింది. 1327 లో రెండో ఎడ్వర్డ్‌ను రాజ్యభ్రష్టుని చేయడానికి అతని రాజ్యాంగ విరుద్ధ చర్యలే కారణాలని చెప్పడమయింది. అందుచేత పార్లమెంట్ అభిప్రాయాన్ని మన్నించని రాజును గద్దెదింపె అధికారము దానికున్నదన్నమాట. ఈ సిద్ధాంతాన్ని 1215 తరవాత ఈ విధంగా పునరుద్ఘాటించినట్లు అయింది. ఇది ప్రస్తావించి 1399 లో రెండో రిచర్డ్‌ను, 1688లో రెండో జేమ్స్‌ను గద్దె దింపడాన్ని పార్లమెంట్ సమర్థించింది. మూడో ఎడ్వర్డ్ (1327-1377) కాలంలో ఫ్రాన్స్, ఇంగ్లండ్‌ల మధ్య శత సంవత్సర యుద్ధ మారంభమయింది. ఆ కారణాన రాజు కెంత ఆదాయమూ చాలకపోవటంవల్ల తన జమీనులోని పట్టణాలలో నివసించే వారిపై టాలేజ్ (Tallage) అనే పన్ను 1332 లో మూడో ఎడ్వర్డ్ విధించినాడు. టాలేజ్ విధించే అధికారము రాజుకున్నదని హక్కుల ధ్రువపత్రము (confirmation of the charters) 1297 లో స్పష్టంగా చాటింది. ఇంగండ్ నుంచి ఉన్ని కొనుగోలుచేసి తీసుకొనిపోయే విదేశీవర్తకులనుంచి, పౌను ఉన్నికి ఇంత పన్ను అని రాజు వసూలుచేయడం ఆనాటి శాసనాలకు విరుద్ధం కాదు. ఈ రెండు విధాల పన్నులనూ రెండో ఎడ్వర్డ్ వసూలుచేసినట్లే అతని కుమారుడు కూడా వసూలు చేసినాడు. పార్లమెంట్ ఆక్షేపించగా ఉన్నిపై పన్ను కట్టేది ఫ్లాండర్స్ వర్తకులేగాని ఇంగ్లీషువారు కారనీ ఆ బరువు పడేది విదేశీయుల మీదకదా అని రాజు తన చర్యను సమర్థించుకొన్నాడు. కాని పార్లమెంట్ తీవ్రంగా విమర్శించింది. అందుచేత 1340 లో ఇకమీద పార్లమెంట్ సమ్మతిలేనిది టాలేజ్‌కాని, ఇతర ఫ్యూడల్ సుంకాలు కాని రాజు వసూలు చేయరాదనే చట్టాన్ని రాజు అంగీకరించవలసి వచ్చింది. 1362, 1371 లలో ఉన్నిమీద కూడా పార్లమెంట్ సమ్మతి లేకుండా పన్ను వేయరాదనే చట్టాలను రాజు ఒప్పుకోవలసి వచ్చింది. 1373 నుంచి రాజు ఒక టన్ను ద్రాక్ష సారాయంపై ఇంత పన్ను (Tonnage) ఒక పౌను ఉన్ని కింత పన్ను (Poundage) చెల్లించవలెనని పార్లమెంట్ లోనే చట్టాలు చేయడమయింది. రెండో రిచ్చర్డ్ (1377-99) మూడో ఎడ్వర్డ్ మనమడు. తండ్రి మరణం నాటికి మైనరు. అందుచేత సంరక్షకుని అధికారంలో ఉండవలసి వచ్చింది. అతని మైనారిటీలో రాజు కౌన్సిల్ సభ్యులమీద ప్రధానోద్యోగుల నియామకాలమీద, పన్నులు విధించి వాటిని వెచ్చించడం మీద పార్లమెంట్ యథేచ్ఛగా అధికారం చూపింది. సంరక్షకుని తొలగించి ఎనిమిదేండ్లు రాజ్యాంగానికి అనుకూలంగానే రిచర్డ్ వ్యవహరించినాడు. కాని అతని

అధికార లాలసత్వము అతనిని కుదురుగా ఉండనివ్వలేదు. 18వ శతాబ్దాంతాన మూడో జార్జి రాజు చేసినట్లే రెండో రిచర్డ్ 1397 లో తనమాట జవదాటని వారినే పార్లమెంట్ ఎన్నికకు నెగ్గించుకొని వేల్స్ విలుకాండ్లను పార్లమెంట్‌ను బెదరించడానికి తెచ్చిపెట్టి ఉన్నిమీది పన్నును తన జీవిత పర్యంతం తనకు లభించేటట్లు చట్టం చేయించినాడు ఆ పార్లమెంట్ రాజు కిష్టులైన వారిని ఒక కమిటీగా నియమించి ఆ కమిటీకి తన అధికారాలన్నింటినీ ప్రసాదిస్తూ శాసనం చేసింది. దానితో ఆగక ఆ కమిటీ ప్రసక్తికూడ లేకుండా కొన్ని పన్నులను రిచర్డు వసూలు చేసినాడు. పార్లమెంట్ ఆమోదం లేకుండానే పార్లమెంట్ చట్టాలను కొంత కాలం అమలు జరపకుండా ఉండే (Suspending) అధికారాన్ని ఉపయోగించి పార్లమెంట్ రికార్డులను, చట్టాలను తన ఇష్టానుసారం తారుమారు చేసే అధికారాన్ని రిచర్డ్ చేబట్టినాడు. తాను సమ్మతించని చిత్తు చట్టాన్ని పార్లమెంట్‌లో ప్రవేశపెట్టినందుకు సిహాక్సి అనే సభ్యునిపై రాజద్రోహం నేరం మోపి రిచర్ అతనికి మరణశిక్ష విధింపజేసినాడు. ఆ శిక్ష అమలులోకి రాలేదు. కాని పార్లమెంట్‌ను, దాని అధికారాలను కాదనకుండా జీపచ్ఛవం చేసి ; రాజు నిరంకుశత్వాన్ని నెలకొల్పే విధానమెట్లా సాధ్యమో రెండో రిచర్డ్ చేసి చూపించినాడు. కాని ప్రజా పరిపాలనా విధానానికి, పార్లమెంట్ బద్ధమైన రాజరికానికి ఇంగ్లండ్‌లో ఇంకా నూక లుండటంచేత రెండో రిచర్డ్‌ను 1398 లో రాజ్య భ్రష్టునిచేసి నాలుగో హెన్రీ (1399) లెంకాస్ట్రియన్ వంశాన్ని పార్లమెంట్ ప్రతిష్ఠించింది. మూడో ఎడ్వర్డ్ రెండో కుమారుని మనుమడు ఎడ్మండ్ మార్టిమర్ (మార్చ్ ప్రభువు) ను కాదని మూడో కుమారుని పుత్రుడైన నాలుగో హెన్రీని రాజుగా చేయడంచేత పార్లమెంట్ అనుగ్రహంవల్ల తాము రాజులమైనామని (1399-1460 లెంకాస్ట్రియన్ రాజులు భావించినారు. నిరంకుశుడైన కారణాన రెండో రిచర్డ్‌ను పడగొట్టిన నాలుగో హెన్రీ తాను పార్లమెంటరీ అధికారాన్ని మన్నించవలసివచ్చింది. లెంకాస్ట్రియన్‌ల కాలంలో ఫ్రాన్స్‌తో యుద్ధము తీవ్రరూపం ధరించడంవల్ల, ఆ వంశ రాజులు పార్లమెంట్ అభిమాన ఆమోదాలకోసం ప్రయత్నించినారు. పార్లమెంట్ ఆమోదించని కొత్త పన్ను దేనినీ వారు వసూలుచేయడానికి ప్రయత్నించలేదు. పార్లమెంట్‌లోని రెండు సభలూ ఆమోదించనిదే ప్రభుత్వానికి ధనం కూర్చే ఏ ఆర్థిక చట్టాన్నీ (Money Bill) రాజు ఆమోదానికై పంపకూడదని, ఆ చట్టాన్ని ప్రజాసభాపతే (Speaker) రాజుకు పంపవలెనని 1407 లో నాలుగో హెన్రీ ఒక నియమం చేసినాడు. కామన్స్ సభ ఆమోదించిన ఆర్థిక చట్టాన్ని ప్రభువుల సభ ఆమోదించవచ్చు ; తిరస్కరించనూ వచ్చు ; కాని సవరించరాదు అనే ఈనాటి విధానానికి, ఈ 1407 రాజనిబంధన మూలం కావచ్చు

*శాసనాలు చేయడంలో పార్లమెంట్ పాత్ర:* నార్మన్‌లు రాకముందు సాంఘికాచార సంప్రదాయాల ననుసరించి గ్రామ, పట్టణ, మండల సమితులు శతాబ్దాల తరబడి న్యాయ పరిపాలన సాగించినాయి. నార్మన్ పరిపాలనలో రాజు ప్రధానోద్యోగులు, సామంత ప్రభువులు, చర్చి ఉన్నతోద్యోగులు కూడి ఏర్పడిన రాజసభవారు మహాసభ (The Great Council) గా, శాక్సన్‌ల నాటి విజ్ఞుల సమితి (Witenagemot) స్థానాన్ని ఆక్రమించి న్యాయ నిబంధనలు (Ordinances) చేసేవారు. 1322 లో ప్రభువులు నియమించిన కమిటీవారు ఆర్డినెన్సులు చేయగా, పార్లమెంట్ రెండు సభలు ఆమోదించని కారణం

చేత అవి చెల్లవని పార్లమెంట్ చేతనే రెండో ఎడ్వర్డ్ వానిని రద్దు చేయించినాడు. ఇకముందు చట్టాలు రెండు సభల ఆమోదంతోనే చేయవలెనని ఆ పార్లమెంట్ తీర్మానించింది.

మొదట్లో రాజు డబ్బడిగినప్పుడల్లా తమ ఇబ్బందులను తొలగించమని పార్లమెంట్ సభ్యులు రాజుకు అర్జీని సమర్పించుకొనేవారు. ఆ అర్జీలోని కొన్ని కోరికలను తీరుస్తూ కొన్నింటిని తీర్చకుండానో సవరించో రాజు ప్రకటనచేయడం ఆచారమైపోయింది. అటువంటి ప్రకటనలకు స్టాట్యూట్‌లు (Statutes) అని పేరు. హక్కు పొందటానికి, ధనం మంజూరు చేయడానికి ఇట్లా ఒక లంకెను పార్లమెంట్ వారే ఏర్పాటుచేసినారు. తరవాత తమ అర్జీని రాజు ముందుగా ఆమోదిస్తేనేగాని ధనము ఇవ్వము అని పార్లమెంట్ సభ్యులు అన్నారు (1401). తరవాత తమ అర్జీలు ఉన్నవి ఉన్నట్లుగా మార్పులేకుండా రాజు ఆమోదించవలెనని పార్లమెంట్ పట్టుబట్టడం (1414) మామూలయింది.

***రాజ మంత్రులు - పార్లమెంట్‌కు వారి బాధ్యత:*** మొదట్లో మంత్రులను, న్యాయాధిపతులను, గ్రేట్ కౌన్సిల్ సభ్యులను రాజే నియమించేవాడు. పరిపాలనాధికారము, న్యాయ పరిపాలనాధికారము, శాసనాధికారము శతాబ్దాలుగా రాజులోనే ప్రతిష్ఠితమై ఉండేవి. 1688 తరవాతనే ఈ స్థితి మారి రాజు, మంత్రులు పార్లమెంట్‌కు బాధ్యులుకావడం జరిగింది. అప్పుడప్పుడు మంత్రులను తాము నియమించటానికి ప్రభువులెట్లా ప్రయత్నించినారో ఇంతకు ముందు తెలుసుకొన్నారు. మూడో ఎడ్వర్డ్ వార్ధక్యంలో అతని కుమారుడు జాన్ (John of Gaunt) తన అనుచరులను మంత్రులుగా చేసి అధికార దుర్వినియోగం చేయడంవల్ల ఫ్రాన్స్‌లో సాగుతూ ఉన్న యుద్ధంలో అపజయం కలిగినప్పుడు రాజు కోశాధిపతి అయిన లాటిమీర్ ప్రభువు లంచగొండి అని, ప్రజా ద్రవ్యాపహరణ చేసినాడని తొలగించి పార్లమెంట్ ఖైదుకు పంపింది. రాజోద్యోగులను మరికొందరిని కూడా దుష్టపాలనకు శిక్షించింది. రెండో రిచర్డ్ స్నేహితులను, ఉద్యోగులను పార్లమెంట్ శిక్షించింది. 1450 లో ఆరో హెన్రీ మంత్రి, అతని రాణికి మిత్రుడైన సఫీక్ ప్రభువుపై కామన్స్‌సభ నేరారోపణచేయగా ప్రభువుల సభ న్యాయస్థానమై మహాభియోగ విచారణ (impeach) చేసింది. ఇట్లా లంకాస్ట్రియన్ రాజుల పరిపాలనను ముగిసేనాటికి పన్నులు విధించడంలోను, వాటి వినియయంలోను, మంత్రులు, రాజు పార్లమెంట్‌కు బాధ్యులయ్యేటట్లు చేయటంలోను, శాసనాలను చేయడంలోను, పార్లమెంట్ ఘనవిజయాలను సాధించడమేగాక ఉన్నత న్యాయస్థానాలకు అతీతమైన స్వతంత్ర న్యాయస్థానంగా వ్యవహరించడం కూడా కద్దు.

ప్రజా పరిపాలనకు అనుకూల శక్తులు ఏ విధంగా దశలు దశలుగా బలం పుంజుకొన్నాయో లెంకాస్ట్రియన్ రాజుల పరిపాలనాంతానికి పార్లమెంటరీ విధానం ఎట్లా రూపు దిద్దుకొన్నదో సంగ్రహంగా పర్యాలోకిస్తే యార్కిస్ట్ రాజుల కాలంలో అది ఎటువంటి, ఒడుదుడుకులకు తాళవలసి వచ్చిందో, ఏ విధంగా పార్లమెంట్ అధికారాన్ని ఒకవైపు మన్నిస్తూనే ట్యూడర్ రాజులు మరొకవైపు నిరంకుశంగా పరిపాలించినారో తెలుసుకోవడం సుకరమవుతుంది.

లెంకాస్ట్రియన్‌లు నిరంకుశులు గారు. రాజ్యాంగాన్ని, పార్లమెంటరీ సంప్రదాయాలను వారు మన్నించినారు. అయినా పాలనాధికారా లింకా వారి చేతులలోనే ఉండేవి. మంత్రులను నియమించేదీ వారే, తొలగించేదీ వారే. వారికి వారే ప్రధానమంత్రులు, సేనాధిపతులు,

ప్రధానాధికారుల నియమించేవారూ రాజులే. తమ సొంత ఆదాయంతో వారు నిర్వహించుకొనగల్గితే. కొత్త ఆదాయాల కోసం పార్లమెంట్‌ను వారు సమావేశ పరచవలసిన అవసరం లేదు. ఏ యేటికాయేడు సరికొత్త పార్లమెంట్ సమావేశమైనా దాని జీవితకాలము సామాన్యంగా ఒక నెలకు మించేదికాదు. అది రాజును విమర్శించినా పరిపాలనాధికారము సర్వమూ ఇంకా రాజుల చేతులలోనే నిల్చి ఉండేది.

మతపక్షము ఏ విధంగా ప్రజల మన్ననకు దూరమయినదో ముందు తెలుసుకొన్నారు. పోనుపోను చర్చికి వెలపల ధీమంతు లనేకులు కనబడతారు. చర్చి పరిపాలనము విజాతీయ పరిపాలనమని ప్రజలు భావించసాగినారు. చర్చి ఉద్యోగుల భోగపరాయణత్వము వారి పట్ల ప్రజలలో అసహ్యభావాన్ని జనింపచేసింది. ఇంగ్లండ్‌లోని విరాగుల సంఘాలు (The grey friars, the block friars) ఆ ఏహ్యభావాన్ని మరింత వృద్ధిచేసినాయి. ఆ కాలంలో కాథలిక్ చర్చిలో రెండు చీలిక లేర్పడినాయి. రోమన్ పోప్‌లను కొందరు మన్నించగా, ఫ్రాన్స్‌లోని అవిన్యాన్ (Avignon) పోప్‌లను మన్నించేవారు కొందరు. ఆ పోప్‌లు ఒక రొకరిని దూషించుకొనడం చూసి ఇద్దరినీ గర్హించేవారు మరి కొందరు ఏర్పడినారు ట్యూడర్ రాజు ఎనిమిదో హెన్రీ మత విప్లవాన్ని (1529-36) తెచ్చి పెట్టడానికి ముందే రెండో హెన్రీ చర్చిపై దాడి ఆరంభించినాడు. మొదటి ఎడ్వర్డ్ చర్చికి ఇకపై భూదానాలు ఎవరూ చేయరాదన్నాడు. రెండో హెన్రీ చర్చి ఉద్యోగ నియామకాలకు, ఇంగ్లీష్ చర్చి కోర్టులనుంచి రోమన్ పోప్‌కు అప్పీళ్ళు పంపడానికి రాజు ఆమోదం కావలెనన్నాడు. ఒక సంవత్సరపు చర్చి ఆదాయము రాజు ప్రభుత్వ అవసరాలకు తీసుకొనవలెనని 1404 లో కొన్ని జిల్లాలలోని యోధులు సూచించినారు. ఎనిమిదో హెన్రీ మఠాలు అణిచివేయటానికి ఒక్క శతాబ్దం ముందే ఇంగ్లండ్‌లోని మఠాల భూములేగాక, బిషప్పుల భూములను కూడా రాజు జప్తు చేసుకోవలెనని 1410 లో కామన్స్‌సభ తీర్మానించింది. 1414 లో పార్లమెంట్ అయిదో హెన్రీకి విజాతీయుల మఠాలకు అనుబంధమయిన మఠగృహాల (priories) భూములను ఇచ్చివేసింది.

పోప్‌కు ఇంగ్లీషు చర్చి లోబడలేదని అతనికి ఏ కట్నాలు ఇంగ్లీష్ మతోద్యోగులు చెల్లించరాదని 1366 లో పార్లమెంట్ శాసించింది. ఇంగ్లీష్ చర్చికి చెందిన ఉద్యోగులను పోప్ నియమించరాదని 1390 కి ముందే పార్లమెంట్ చట్టాలు చేసింది. పోప్ కోర్టుకు అప్పీళ్ళు చేసినవారిని దేశబహిష్కృతులను చేస్తూ 1393 కు ముందు చాలాసార్లు పార్లమెంట్ చట్టాలు చేసింది. ఈ చట్టాలకు దోహదమిచ్చినది ఇంగ్లీషు ప్రజల జాతీయతాభావమే కాని వీనినిబట్టి ట్యూడర్‌ల నిరంకుశత్వానికి అనుకూలమైన వాతావరణము చిరకాలంగా ఇంగ్లండ్‌లో ఉంది అని స్పష్టమవుతుంది. కామన్స్ సభ బలము వృద్ధి అయ్యేకొద్దీ ప్రభువర్గము బలహీనమయింది. కాని అది నిర్వీర్యమయినది అని అనుకోవడం పొరపాటు. మూడో ఎడ్వర్డ్, నాలుగో అయిదో హెన్రీల కాలంలో ప్రభువుల ధైర్యోత్సాహాలు ప్రకటితమయినాయి. రాజులు నిరంకుశులు కాజూసినప్పుడంతా హరితో యుద్ధాలకు పూనుకొన్నది ప్రభువులేకాని, కామన్స్ సభవారు కాదు. మూడో హెన్రీ, రెండో ఎడ్వర్డ్, రెండో రిచర్డ్‌లు నిరంకుశంగా పరిపాలించినప్పుడంతా వారిని కత్తిపట్టి ఎదుర్కొన్నది ఆ రాజుల ముఖ్య సామంతులే. వీరే తాత్కాలిక పరిపాలకులు (Lords Orainers)గా పూర్వపు ఫ్యూడల్ ప్రభువుల మార్గమనుసరించి తమలో కొందరిని అప్పుడప్పుడు వీరు నియమించటం కద్దు. మునపటివలె తమ

వల్ల భూములు పొందిన వారిని సైన్యాలలోకి వచ్చి యుద్ధాలలో సాయపడండని కోరే హక్కు వారు పోగొట్టుకొన్నారు. కాని రాజు ప్రధాన సామంత ప్రభువులు భూసంపద విస్తారంగా కల్గినవారు కావడంచేత తమ యూనిఫారాలు ధరించి తమవల్ల జీతాలు పొందే సైనిక బృందాలను చేర్చుకొని, తమ తగవులతో దేశాన్ని అలజడిలో నింపేవారు లెంకాస్ట్రియన్ల, యార్కిస్టుల కాలంలో ఈ ప్రభువుల పోరాటాలు చాలా అసహకరమైన స్థాయికి వచ్చినాయి

జాన్ లాంకాస్టర్, మూడో ఎడ్వర్డ్ రాజు మూడో కొడుకు. యార్క్ ప్రభువు, క్లారెన్స్ ప్రభువు మూడో ఎడ్వర్డ్ రెండో నాలుగో సంతానము. వారికి వారసులైన యార్కిస్టులతో. లెంకాస్ట్రియనులతో ముప్పై సంవత్సరాలు పోరాటం సాగింది. ఆరో హెన్రీ కాలంలో అతనిని ఓడించి యార్కిస్ట్ వంశంవాడైన నాలుగో ఎడ్వర్డ్ సింహాసన మెక్కినాడు. అతని కుమారులిద్దరిని (అందులో పెద్దవాడు 5 వ ఎడ్వర్డ్) లండన్ బురుజు (Tower) లో ఖైదుచేసి చంపించి నాలుగో ఎడ్వర్డ్ సోదరుడు రిచర్డ్ మూడో రిచర్డ్ అనే పేరుతో ఇంగ్లండ్‌కు రాజయినాడు. బాస్‌వర్త్‌ఫీల్డ్ (1485) యుద్ధంలో ఇతనిని చంపి లెంకాస్ట్రియన్ వంశానికి చెందిన హెన్రీ రిచ్‌మండ్ ట్యూడర్ – ఏడో హెన్రీగా రాజై ట్యూడర్ వంశాన్ని స్థాపించినాడు

లెంకాస్ట్రియన్ పక్షంవారు ఎర్ర గులాబీని, యార్కిస్టులు తెల్ల గులాబీని తమతమ పార్టీ చిహ్నాలుగా ధరించడంచేత ఆ రెండు పక్షాలమధ్య జరిగిన యుద్ధాలకు గులాబీల (రోజాల) యుద్ధాలని ప్రసిద్ధి వచ్చింది.

ఈ ముప్పయి ఏండ్లకాలంలోను ఆరిపోవడానికి ముందు దీపం వెలిగినట్లు, తమ స్వార్థాన్ని, దౌర్జన్యాన్ని, అక్రమాలను, యుద్ధ లాలసత్వాన్ని ప్రదర్శించి చాలురా ఈ ప్రభువుల నాయకత్వమని ప్రజలందరూ ద్వేషించేటట్లు, వీరిని నేలమట్టం చేయగల ఏడో హెన్రీని, అతని తరవాత ట్యూడర్ రాజుల నిరంకుశత్వాన్ని ఆమోదించేటట్లూ చేయడంలో ప్రభువర్గం వారు అద్భుత విజయం సాధించినారు. వీరు దుర్గాలు నిర్మించి వాటిని తమనుంచి జీతాలు తీసుకొనే సైనికులతో నింపి వారు అత్యాచారాలు చేసి న్యాయస్థానాలకు పోవలసినప్పుడు న్యాయాధిపతులను, జ్యూరీలను బెదరకొట్టి నిర్బంధించి వారికి శిక్షలు పడకుండా రక్షించేవారు. ఆ కాలంలో భూస్వాములు పొరుగువారి భూములను కలుపుకోవడం ప్రభుకన్యాపహరణం చేయడం సర్వసామాన్యంగా సంభవించేవి (Estate-jumping and heiress-lifting were the most common evils of the time). బలహీనులైన రాజులకు ఈ దుర్గాధిపతుల మూకలను ఎదుర్కొనగల సైన్య ధనసహాయ సంపత్తి లేదుకదా ! నాలుగో ఎడ్వర్డ్ పార్లమెంట్ సమ్మతి కోరనవసరం లేకుండానే ధన సంపాదన చేసే మార్గం కనిపెట్టినాడు. తన తాబేదారులను రాజ్యంలోని అత్యంత ధనికుల వద్దకు పంపి రాజుపట్ల వారి భక్తివిశ్వాసాలకు సూచకంగా కట్నాలు, కానుకలు (Benevolences and free gifts) విధిగా ఇచ్చేటట్లు చేయడమే ఈ విధానము. వాటిని ఏ ప్రత్యేక వర్గంవారుగాని, ప్రజలందరుగాని నిర్బంధంగా ఇచ్చే పన్నులని అనడానికి వీలులేనందువల్ల పార్లమెంట్ శాసనాలను నాలుగో ఎడ్వర్డ్ అతిక్రమించినాడనే వీలులేకపోయింది. ఈ ధన సంపాదన విధానాన్ని తరవాతి ట్యూడర్ రాజులు అనుసరించినారు. అనుసరించబోయి మొదటి ఛార్లెస్ ప్రాణానికే ముప్పు తెచ్చుకొన్నాడు.

ఈ కల్లోల పరిస్థితులలో సామాన్య ప్రజల పరిస్థితులు మనమనుకొన్నంత శోచనీయ స్థితికి దిగజారలేదు. లెంకాస్ట్రియన్ పార్లమెంట్ల ప్రాబల్యాన్నిగురించి చదివినారు. గులాబీ యుద్ధాల కాలంలో మధ్యతరగతి ఇంగ్లీష్ ప్రజలు తమ వృత్తివ్యాపారాలను యథావిధిగా నిర్వహిస్తూ పోగలిగినందువల్ల భాగ్యవంతులైనారు. వారి సహాయము అన్ని పక్షాలకూ కావలసి వచ్చింది. ప్రభువర్గంవారి తీవ్ర రాజకీయ పోరాటాలలో పాల్గొనగల శక్తి వారికి లేదు. కాని అరాజకత్వాన్ని అణచదలచిన ట్యూడర్‌లకు కావలసినంతగా వారు తోడ్పడినారు.

ఉన్ని వ్యాపారంలో ఎక్కువ లాభాలకు అలవాటుపడిన భూస్వామిక వర్గంవారు భూదాసుల భూములు ఆక్రమించడంచేత ఆదీనులు పట్టణాలకు చేరిన సంగతిని, తరవాత నల్ల పోతవ్యాధివల్ల భూదాసులు, సేవకులు, ఇతర సామాన్య జనులు రాలిపోయిన విషయమూ చదివినారు. ఈ వ్యాధివల్ల అనంతకాలంలో భూదాసులు (Villeins) భూములు వదలిపోయే పరిస్థితిని ప్రభువులు నిరోధించసాగినారు. కాని వారి ప్రయత్నాలు విజయం పొందలేదు. కాలక్రమాన ఇంగ్లండ్‌లో స్వేచ్ఛలేని భూదాసుల సేద్య బానిసల తరగతి అదృశ్యమయి పోయింది. కొలంబస్, వాస్కోడిగామాలు, సముద్ర మార్గాలు కనిపెట్టిన అనంతరం సముద్రాంతర దేశాలతో ఇంగ్లీష్‌వారి రాకపోకలు, వ్యాపారాలు వృద్ధిపొందిన కాలంలో భూస్వాముల ప్రాముఖ్యం తగ్గింది ఫ్యూడల్ విధానం నశించింది. నావిక దిక్సూచి (Mariners compass) వల్ల, సముద్రాంతర వ్యాపారం వృద్ధిపొందడంచేత ఎగుమతుల, దిగుమతుల వ్యాపారంపై పన్నులవల్ల రాజుల ఆదాయము హెచ్చయింది. ఫిరంగులు, తుపాకీ మందు 16 వ శతాబ్దంలో కనిపెట్టడంవల్ల ప్రభువుల దుర్గాలను ట్యూడర్ రాజులు సులభంగా పగలగొట్టించగలిగినారు. తుపాకి దెబ్బకు కవచము, శిరస్త్రాణము నిలవలేదు. కనక ప్రభువర్గం వారి అత్యాచారాలు అంతరించినాయి. ఫిరంగి దళాలను పోషించడం రాజు కొక్కడికేగాని ప్రభువులకు సాధ్యం కాలేదు. ఈ కారణంచేత ట్యూడర్ రాజులు బలవంతులయినారు. మత విప్లవానికి (Reformation) పూర్వం రోమన్ పోప్‌లకు ఇంగ్లీష్ చర్చినుంచి పోతూ ఉన్న ధన ప్రవాహము ట్యూడర్ రాజుల బొక్కసంలోకి మళ్ళింది. మఠాలను అణిచివేసిన తరవాత వాటి భూములు ఎనిమిదో హెన్రీకి చెందటంవల్ల అతడు మరింత ధనవంతుడు, బలవంతుడు అయినాడు. ట్యూడర్ నిరంకుశత్వానికి అనేక శక్తులు. రాజమార్గం వేసినట్లయింది. మధ్య యుగము అంతమై ఇంగ్లీష్ రాజ్యాంగ చరిత్రలో నవీనయుగము ఇట్లా 16 వ శతాబ్దాంతంలో ఆరంభమయింది.

# 3

# ట్యూడర్ రాజుల కాలంలో రాజ్యాంగ పరిణామము

( క్రీ. శ. 1485–1603 )

## ట్యూడర్ నిరంకుశ స్వభావము

రిచ్‌మండ్ ప్రభువైన హెన్రీ ట్యూడర్ బాస్‌వర్త్‌ఫీల్డ్ యుద్ధంలో (1485) మూడో రిచర్డ్‌ను ఓడించి ఏడో హెన్రీ అనే పేరుతో ట్యూడర్ రాజవంశాన్ని ప్రతిష్ఠించడంతో ఇంగ్లీష్ రాజ్యాంగ చరిత్రలో ఒక నూతన అధ్యాయం ప్రారంభమయింది. ఆ పరిణామము లంకాస్ట్రియన్ - యార్కిస్ట్ పక్షాల కలహంలో ఒక అంతర్దశగా ఆనాటి ఆంగ్లేయులకు తోచి ఉండవచ్చు. క్రీ. శ. 1399 లో జరిగినట్లే ఇప్పుడు కూడా మూడో ఎడ్వర్డ్ వంశంలోని అగ్రజులను తోసిరాజని అనుజుల వంశస్థుడైన లెంకాస్ట్రియన్ ప్రభువును రాజుగా చేయడం వల్ల రాజ నియామకాధికారము పార్లమెంట్ తనదేసని పునరుద్ఘాటించినట్లే అని కొందరంటారు. కాని ఏడో హెన్రీ రాజైన తరవాత యార్కిస్ట్ వంశానికి చెందిన నాలుగో ఎడ్వర్ కుమార్తె ఎలిజబెత్‌ను పెండ్లాడి రెండు వంశాలకూ రాజకుటుంబం ప్రాతినిధ్యం వహించేటట్లు చేయటంతో సైన్యానికి పటుత్వం లేకపోయింది.

ట్యూడర్లతో ఇంగ్లాండ్ ఆధునిక యుగంలో అడుగు పెట్టింది. ఈ యుగారంభంలో జరిగిన వైజ్ఞానిక పునరుద్ధరణ, దూరపు ఖండాలకు సముద్రమార్గాలు కనిపెట్టడం ప్రొటెస్టంట్ మత సంస్కరణోద్యమము, జాతీయభావ వికాసము మొదలైన సంఘటనలవల్ల ఐరోపా రాజ్యాల ప్రజాజీవనంలో అన్ని రంగాలలోను విప్లవాత్మకమైన మార్పులు వచ్చినాయి. వీటిలో ఒకటి విదేశ వాణిజ్యం విస్తరించడం. మధ్యయుగపు ఆర్థిక విధానము, భూస్వామ్య విధానము అంతరించడం. అపారంగా విస్తరించిన వాణిజ్యరంగంలో లక్షలు, కోట్లు గడించిన వణిక్ ప్రముఖులు రాజుకు మద్దతుగా నిలిచి భూస్వామ్య విధానాన్ని అంతంచేయడంలో ప్రముఖపాత్ర నిర్వహించినారు. ఒకవైపు ఆంతరంగిక యుద్ధాలలో ఎన్నో ప్రభు కుటుంబాలు నశింపగా మరొకవైపు రాజు ఆర్థిక సంపత్తి, సైనికబలము బాగా పెరిగినాయి. ఆంతరంగిక యుద్ధాలనుంచి బతికి బయటపడ్డ ప్రభువులు సొంత సేనలను ఉంచుకొనరాదని శాసనం (Statute of Livery and Maintenance) జరిగింది. దీనితో భూస్వామికవర్గ మింకా శక్తిహీనమయింది. ఇక వారు రాజును ప్రతిఘటింపవలెనంటే ధనికపర్గంతో చేతులు కలిపి పార్లమెంట్ ద్వారానే పోరాడవలసి వచ్చింది. కాని రాజు బలవంతుడయితేనే రాజ్యంలో శాంతిభద్రతలు నెలకొల్పి సంరక్షించగలడని గులాబీ యుద్ధాలవల్ల తెలుసుకొన్న పార్లమెంట్ భూస్వాములను అణిచివేయడానికి, రాజుతో సహకరించడానికి సంసిద్ధమై ఉంది. ఇంకా

జాతీయ భావోద్దీపితులైన పార్లమెంట్ సభ్యులు విదేశీయుడైన పోప్ అధికారాన్ని తొలగదోసి చర్చిపై రాజు ఆధిపత్యాన్ని నెలకొల్పటానికి కూడా సంసిద్ధంగానే ఉన్నారు.

## ట్యూడర్ వంశము




పై అంశాలను ఉదాహరించి ట్యూడర్లు నిరంకుశమైన రాజులు కారని, వారి నిరంకుశ చర్య లన్నింటిపై పార్లమెంట్ ఆమోదముద్ర ఉండటంవల్ల, ప్రజలను ప్రతినిధి అయిన పార్లమెంట్‌ను తోసిరాజనకుండా వారు పరిపాలన చేసినారని రుజువవుతుందనే వాదమొకటి ఉంది. కాని వారు పార్లమెంట్‌కు జరిగే ఎన్నికలలో తమకు అనుకూలురైనవారే ఎన్నికయ్యే టట్లు చూడగలిగినారు. పార్లమెంటనీ నియోజకవర్గాలైన పట్టణాలు అనేకం క్షీణదశలో ఉండటం వల్ల అవి రాజోద్యోగుల చెప్పుచేతలలో ఉండేవి. మఠాల ఆస్తిపాస్తులను వశపరచుకొన్న ట్యూడర్ రాజులు ఆ భూములలో కొన్నింటిని తమపై ఆధారపడి ఉండే వారికి ప్రసాదించి కొత్త ప్రభువంశాలను నెలకొల్పినారు. ఆ వంశాల ప్రతినిధులు ప్రొటెస్టంట్ మతాన్ని తొలగించే ప్రయత్నాలకు ప్రబల శత్రువులు. అట్లా తొలగిస్తే తమ భూములు తిరిగి మఠాల పరం కావచ్చుననే భయము వారికుండటం సహజము. కాథలిక్ పక్షపాతి అయిన మేరీ రాణి చర్చిల మఠాల భూములను పునరుద్ధరించ ప్రయత్నించినప్పుడు కొత్త ప్రొటెస్టంట్ ప్రభువు లామె యత్నానికి అడ్డు తగిలినారు. శక్తిమంతమైన పాత ప్రభువుల వంశాలు నశించడం చేతను, మతాలంతరించటం చేతను, మఠాధిపతులు ప్రభువుల సభలో సభ్యత్వాన్ని కోల్పోవడం చేతను, ఇంగ్లీషు చర్చికి రాజే అధిపతికావడం చేతను, ప్రభువుల సభలోని చర్చి అధికారులు రాజానుచరులు కావడంచేతను, ప్రభువులసభ ట్యూడర్‌ల నిరంకుశత్వాన్ని అరికట్టడానికి పూనుకొనలేదు. కామన్స్‌సభ సభ్యత్వాన్ని కూడా ట్యూడర్ రాజులు తమ కనుకూలంగా మలుచుకొన్నారు. ఏ పట్టణాలు కామన్స్ సభకు ప్రతినిధులను ఎన్నుకొనవలెనో నిర్ణయించే అధికారము రాజుదే. ఎనిమిదో హెన్రీ కాలంలో వేల్స్‌లో కౌంటీల నిర్మాణం పూర్తి

అయింది. వాటికి ఛెషైర్‌లోని పట్టణాలకూ పార్లమెంటరీ ప్రాతినిధ్యం వచ్చింది. ఆరో ఎడ్వర్, ఎలిజబెత్‌ల కాలంలో అరవై కొత్త పార్లమెంటరీ పట్టణాలు నెలకొల్పడమయింది. వాస్తవానికి వాటిలో అధికభాగం పార్లమెంటరీ ప్రాతినిధ్యానికి ఎటువంటి అర్హతా లేనివి. సహజంగా వాటినుంచి ఎన్నికయ్యే ప్రతినిధులు రాజుకు కావలసినవారే గదా. ఈ కారణాలవల్ల కామన్స్ సభ కూడా ట్యూడర్‌ల నిరంకుశత్వానికి వారధి కట్టదలచుకోలేదు. అంతమాత్రాన ట్యూడర్ రాజులు కాదనడంలో స్వారస్యం లేదు. నిర్బంధ ఋణాలు, కుహనా బహుమతులు వారు యథేచ్ఛగా భూస్వాములనుంచి, శ్రీమంతులైన వణిజులనుంచి వసూలు చేసినారు. మత విషయాలలో ప్రజలేది నమ్మవలెనో ఎటువంటి పూజా విధానాల అవలంబించవలెనో రాజు నిర్ణయానికే వదిలిపెట్టినారు. ఇవన్నీ నిరంకుశత్వ లక్షణాలే గదా! అయితే వారి నిరంకుశత్వము ప్రజానురంజకము, పార్లమెంట్‌కు సమ్మతమయింది. దానికి ముఖ్యకారణాలు మతం విషయంలో ప్రజలకు పెద్ద పట్టుదలలు లేకపోవడం; ఆర్థికంగా తమ జీవితాలు హాయిగా గడపుకొనవలెననే గాఢమైన కాంక్ష; ఎన్నో తరాలనుంచి అడుగంటిన శాంతి భద్రతలను సుస్థిరంగా నెలకొల్పిన ట్యూడర్ రాజులపైగల అభిమానము; మతవ్యవహారాలలోను, రాజకీయాలలోను, విదేశ వాణిజ్యంలోను, ఇతర దేశాల ప్రాబల్యాన్ని ఎదుర్కొనడంలోను రాజులకు ప్రజలకు మధ్య సంపూర్ణమైన అంగీకారముండటం. ఇంకా జనసామాన్యం ఆదరాభిమానాలను పోగొట్టుకొనే చర్యలను ట్యూడర్ రాజులు చేయలేదు. ఏ విషయంలోనైనా పార్లమెంట్ పట్టుదల చూపితే ఆ విషయంలో పార్లమెంట్ అభిమతాన్నే మన్నించడం జరిగేది. ట్యూడర్ రాజుల ఆర్థిక విధానము, వైదేశిక నీతి నాటి ప్రజాబాహుళ్యంలో దినదినాభివృద్ధి చెందుతున్న ఐహిక ఆపేక్షలకు, జాతీయభావానికి ప్రతిబింబా లయినాయి. తమ నిరంకుశత్వానికి ఒక పరిధి ఉన్నదనే వివేచనాజ్ఞానాన్ని ట్యూడర్ రాజు లెన్నడూ పోగొట్టుకోలేదు. ఆ వివేచనాజ్ఞానం లేనందున ట్యూడర్ రాజులవలె నిరంకుశత్వాన్ని చెలాయించబోయిన స్టూవర్ట్ రాజులు ఎన్నో అగచాట్ల పాలయినారు.

జి. బి. ఆడమ్స్ (G. B. Adams) ట్యూడర్ల పరిపాలనా యుగానికి ఒక ప్రత్యేక లక్షణమున్నదని ఈ విధంగా చెప్పినాడు: "మధ్యయుగ భూస్వామ్య విధానము అంతరించి ఆధునిక ప్రజాస్వామ్య ప్రభుత్వస్థాపన జరుగు కాలంలో ట్యూడర్లు పరిపాలనకు వచ్చినారు. అప్పటి పరిస్థితులను సదవకాశంగా తీసుకొని వారు అధికారం పెంచుకొన్నారు. తమకు కావలసిన పనులన్నీ పార్లమెంటుతో సంప్రదించి సాధించుకొన్నారు. కొన్ని సమయాలలో నియంతలుగా ప్రవర్తించినా, ప్రజాక్షేమమును మరచిపోలేదు. ప్రభువులను అణచి ఇంగ్లీషు చర్చిని తమ అధీనంలో ఉంచుకొన్నారు. వారు ప్రభువులకే నియంతలుగాని సామాన్య ప్రజలకు కాదు."

ట్యూడర్ రాజులు కొన్ని సందర్భాలలో న్యాయవిరుద్ధమైన, అమానుషమైన పనులను చేసి నియంతలుగా వ్యవహరించినారు. ఏడో హెన్రీ 1499 లో ఎర్ ఆఫ్ వార్ విక్ (Earl of Warwick) పై రాజద్రోహ నేరము మోపి చంపించెను. ఎనిమిదో హెన్రీ కార్డినల్ ఊల్సీ (Wolsey) పై రాజద్రోహము మోపినాడు. మేరి రాణి 300 ప్రొటెస్టెంట్ మతస్థులను చంపించి "రక్తపిపాసి" లేక "రుధిరప్రియ"గా పిలువబడెను. 1539 వ సంవత్సరము ట్యూడర్‌ల నిరంకుశపాలనకు ఒక మచ్చుతునక అని చెప్పవచ్చు. ఇన్ (Inne) పండి

తుడు "ఈ సంవత్సరము ట్యూడర్ నియంతృత్వానికి ఒక మైలురాయి అని పేర్కొన్నాడు కాని పై కృత్యాలలో ట్యూడర్ రాజులకు పార్లమెంట్ ప్రజల మద్దత్తు ఉన్నది. ఆంగ్లేయ ప్రజలు ట్యూడర్ రాజుల నియంతృత్వ విధానం సహించినారు. కారణమేమంటే దేశానికి పటిష్ఠమైన ప్రభుత్వం కావలె. 15 వ శతాబ్దంలో ఏడో హెన్రీ సింహాసనానికి వచ్చేసరికి దేశము ప్రభువుల అంతర్యుద్ధాలలో మునిగి ఉన్నది. ఏడో హెన్రీ ప్రభువుల్ని అణచే సందర్భంలో పార్లమెంట్ అతనికి పూర్తి సహకారము ఇచ్చినాడు. ఎనిమిదో హెన్రీ ఇంగ్లీషు చర్చిని పోప్ అధికారమునుంచి తెగతెంపులు చేసినపుడు కూడ మద్దతు నిచ్చినాడు. ఎలిజబెత్ కాలంలో మొదటి 30 సంవత్సరాలు దేశము దేశీయ, విదేశీయ విపత్తులకు గురిఅయింది. ఆమె తీసుకున్న చర్యలన్నిటికి పార్లమెంట్ మద్దత్తు ఇచ్చినాడు. కాని ట్యూడర్ రాజులకు పార్లమెంట్‌తో ఏ విధంగా మెలగవలెనో బాగా తెలుసు. తన యిష్టమువచ్చిన వారికి గుత్త వ్యాపారాలు ఇచ్చే సందర్భాలలో పార్లమెంట్ అభ్యంతరం చెప్పినపుడు ఎలిజబెత్ పార్లమెంట్ కోరిక ప్రకారం నడచుకొనేది

ట్యూడర్ రాజులు బలహీనంగా ఉండి లంకాస్ట్రియన్‌ల వలె రాజ్యాంగబద్ధమైన రాజరికాన్నే అనుసరించి ఉంటే, పార్లమెంటరీ సంస్థ రాజరిక వంశాల తగాదాలలో మాసిపోయేది అని మేటిలాండ్ అభిప్రాయము. ట్యూడర్ నియంతృత్వము పార్లమెంటరీ విధానము, సమన్యాయ పరిపాలనను సాగిస్తూ, ప్రజలలో జాతీయభావం నెలకొల్పి, శాంతి భద్రతలు కాపాడి, ప్రభువులను అణిచి, ఆంగ్లేయ చర్చిని పోప్ అధికారమునుంచి తొలగించింది.

<u>పార్లమెంట్‌తో ట్యూడర్‌ల సంబంధాలు</u>: ట్యూడర్ రాజుల అధికారము, పలుకుబడి హెచ్చినాయనటంలోనే పార్లమెంట్ బలం తగ్గిందనే అర్థము ఇమిడి ఉన్నది. ఏడో హెన్రీ కాలంలో ప్రభువుల సభలోని ప్రభువుల సంఖ్య గులాబీ యుద్ధాల ఫలితంగా సగానికి తగ్గింది హెన్రీ మంత్రులైన మోర్టన్, డడ్లీలు కానుకలు, ఐచ్ఛిక ఋణాలు అనే పేరున రాజుకు విశేష ధనం సంపాదించి పెట్టినారు. అంతరించిన సామంతుల భూములు రాజుకు సంక్రమించడం చేత ఏడో హెన్రీ మరింత ధనవంతుడయినాడు. రాజ శాసనాలను అతిక్రమించిన వారిపై విశేషించి అపరాధాలు విధించి హెన్రీ ఇంకా ధనాన్ని రాబట్టినాడు. రాజుకు రావలసిన స్వంత ఆదాయాలను రాబట్టడంలో అతడెంతో కాఠిన్యం వహించినాడు. ఇరుగుపొరుగు రాజ్యాలతో శాంతియుత సంబంధాలు ఏర్పడటానికి అనుకూల వైవాహిక సంబంధాలపై ఆధారపడిన విదేశాంగ విధానాన్ని అనుసరించినాడు. తన కుమార్తెను స్కాట్లండ్ రాజైన నాలుగో జేమ్స్ కిచ్చి పెండ్లి చేసినాడు. స్పెయిన్‌లోని కాథరీన్ రాకుమార్తెను తన కుమారుడైన ఆర్థర్‌కు ఇచ్చి వివాహంచేసిన కొద్దికాలానికే ఆర్థర్ మరణించినాడు కాని స్పెయిన్‌తో గాఢ మైత్రిని కాంక్షించిన హెన్రీ ఆ రాజ కుమార్తెను తన రెండో కుమారుడైన (ఎనిమిదో) హెన్రీ కిచ్చి పునర్వివాహం చేసినాడు. పైన వివరించిన విధంగా విశేషమైన ధనాన్ని కూడ బెట్టుకొనడం చేత, అగ్రరాజ్యాలతో యుద్ధాలకు దిగవలసిన అవసరం లేకుండా విదేశాంగ విధానాన్ని అవలంబించడం వల్ల ఏడో హెన్రీకి కొత్త పన్నులు విధించడానికి పార్లమెంట్‌ను అర్థించవలసిన అవసరం లేకపోయింది.

ఎనిమిదో హెన్రీ రాజ్యానికి వచ్చిన కొద్ది కాలంలోనే తండ్రి సంపాదించిన ధనాన్ని

వ్యయం చేసినాడు. అందుచేత కొత్త ఆదాయ మార్గాలు వెదకవలసి వచ్చింది. మంత్రి ఊల్సే ద్వారా పార్లమెంట్‌ను 8 లక్షల పౌనులు మంజూరుచేయమని కోరినాడు. కాని పార్లమెంట్ ఆ మొత్తాన్ని బాగా తగ్గించి ఆ చిన్న మొత్తాన్ని కూడా నాలుగేండ్లలో నాలుగు వాయిదాల మీద వసూలుచేసుకోడానికి అనుమతించింది. కాని ఊల్సే ఆ మొత్తాన్ని ఒక్క వాయిదాలోనే వసూలు చేసినాడు అతడు 1522 లోను, మళ్ళీ 1523 లోను ప్రతి పౌరుడూ స్వప్రమాణంగా తన ఆస్తి విలువను ప్రకటించవలెనని ప్రకటించినాడు. ఆ ఆస్తి విలువపైన భారీ ఎత్తున పన్ను విధించవలెనని అతని పథకము. కాని ప్రజలు ఎదురు తిరగడంవల్ల హెన్రీ ఆ పథకాన్ని విరమించుకోవడమే గాక తిరుగుబాటు చేసినవారిని క్షమించవలసి కూడా వచ్చింది.

బలవంతపు కానుకలను పూర్వం నాలుగో ఎడ్వర్డ్ వసూలు చేసినాడు. కాని మూడో రిచర్డ్ కాలంలో అవి చట్టవిరుద్ధాలని ప్రకటించడమయింది. అయినా ఏడో హెన్రీ ఆ కానుకలను అడపా దడపా వసూలు చేసినాడు. ఎనిమిదో హెన్రీ చాలాసార్లు వసూలు చేసినాడు. ఇవ్వడం నిరాకరించిన వారిని రాజు ప్రీవీ కౌన్సిల్ తీవ్రంగా బెదిరించేది. మొండికిపడిన వారిని కారాగృహాలలో బంధించి సామాన్య సైనికులుగా సేవచేయమని నియమించి ప్రీవీ కౌన్సిల్ హెన్రీ నిరంకుశత్వానికి మద్దతు నిచ్చింది. హెన్రీ చాలాసార్లు నిర్బంధపు ఋణాలు తీసుకొన్నాడు. ఆ ఋణాలపై వడ్డీ చెల్లించే ప్రసక్తి లేకుండేది. పైపెచ్చు రాజు ఆ ఋణాలు తీర్చవలసిన అవసరమే లేదని పార్లమెంట్ రెండుసార్లు చట్టాలు చేసింది. ఒకవేళ ఎవరికైనా ఋణంలో కొంత భాగం చెల్లిస్తే ఆ చెల్లించిన ధనాన్ని తిరిగి రాజుకు మరలా ఇవ్వవలెనని కూడా చట్టం చేసినారు. ఈ విధంగా రాజు అక్రమ చర్యలకు పార్లమెంట్ తన ఆమోదముద్ర వేసింది. ఎలిజబెత్ రాణి చాలాసార్లు నిర్బంధ ఋణాలను తీసుకొన్నది. కాని అసలు మొత్తాలు చెల్లించి వేసింది ఉదాహరణకు యోధత్వం (knight-hood) ప్రసాదించడం ద్వారా, ధన రూపంలో కాకుండా వడ్డీలు ముట్టజెప్పేది.

ఎగుమతి దిగుమతులపై సుంకాలు విధించడం ప్రజల మీద పన్నులు విధించినట్లు కాదని చాలా తరాలుగా ఇంగ్లండ్ రాజుల వాదన. కాని ఉన్ని మీద పన్ను విధింపును క్రితంలో పార్లమెంట్ గర్హించిన సందర్భాలు ఉన్నాయి. పద్నాలుగు, పదిహేను శతాబ్దులలో టన్నేజ్, పౌండేజ్ అనే సుంకాలను వసూలు చేసేవారు. ఉన్ని, చర్మాలు, తగరం మొదలయినవి ఎగుమతి అయ్యేటప్పుడు అటువంటి సుంకాలను పార్లమెంట్‌తో నిమిత్తం లేకుండానే రాజులు దండుకొనే ఆచారం తరతరాలుగా వాడుకలో ఉన్నది. దిగుమతుల విలువపై కొంత శాతం వసూలుచేసే ఆచారం కూడా ఉంది. ఇంగ్లీష్ పరిశ్రమలు, విదేశ వాణిజ్యము అభివృద్ధిచెందే కొద్దీ పై సుంకాలవల్ల వచ్చే ఆదాయము బాగా వృద్ధిచెందింది. అందుచేతనే పదే పదే పన్నులు విధించడానికి పార్లమెంట్ అనుమతి కోరవలసిన అవసరం లేకపోయింది. రేవులు రాజు సొంత ఆస్తికింద పరిగణితమయ్యేవి. అందుచేతనే విదేశ వస్త్రాల దిగుమతుల మీద, మేరీ రాణి తీపి సారాయిల మీద ఎలిజబెత్ రాణి పార్లమెంట్ ప్రసక్తి ఏ మాత్రం లేకుండానే సుంకాలు వసూలు చేయగలిగినారు. ఈ సుంకాలు వసూలుచేయడం రాజు ప్రత్యేకాధికారాలలో ఒకటని అనేకులు అభిప్రాయపడినారు.

పై ఆధారాలే గాక తమకు ఎదురుతిరిగిన వారిపై భారీ ఎత్తున అపరాధాలు విధించడం కూడా ముఖ్య ఆదాయ సాధనమేనని ట్యూడర్ రాజులు పరిగణించినారు. అన్యాయార్జిత విత్త

సముపార్జనలోను, నిరంకుశాధికారం చెలాయించటంలోను ట్యూడర్ రాజులకు కొన్ని సంస్థలు ముఖ్యంగా తోడ్పడినాయి. వాటిలో పేర్కొనదగ్గవి స్టార్ ఛాంబర్ న్యాయస్థానము (Star Chamber Court) ప్రభుత్వ మతవిధానాన్ని అమలుజరపడానికి ఎలిజబెత్ రాణి కాలంలో స్థాపితమయిన హైకమిషన్ కోర్టు (Court of High Commission), రాజు ప్రత్యేక న్యాయస్థానమైన ప్రీవి కౌన్సిల్, దానినుంచి ఏర్పడిన వేల్స్ కమిషన్ (Commission of Wales, కౌన్సిల్ ఆఫ్ ది నార్త్ (Council of the North) ఆదేవి. ట్యూడర్ రాజులు విధించే అన్యాయపు, అక్రమపు పన్నులను, సుంకాలనూ చేసే బలాత్కారాలను సమర్థిస్తూ వారి నెదిరించిన వారిని ఏదో ఒక నేరం మోపి శిక్షించే పై సంస్థలు ట్యూడర్ల నిరంకుశత్వం కొనసాగడానికి ఎంతగానో తోడ్పడినాయి. ఏదో విధంగా ఆర్జించిన ఆర్థిక స్తోమతవల్ల ట్యూడర్ రాజులకు ఎక్కువసార్లు పార్లమెంట్ను మాటిమాటికీ సమావేశపరచవలసిన అవసరం లేకపోయింది. తన పరిపాలనా కాలం రెండవ సగభాగంలో ఏడవ హెన్రీ పార్లమెంట్ సమావేశాన్ని ఒక్కసారి మాత్రమే జరిపినాడు. ఆయన పాలించిన మొత్తం నాలుగేండ్ల కాలంలో ఎనిమిదో హెన్రీ ఏడుసార్లు పార్లమెంట్ను సమావేశ పరచినాడు. ఎలిజబెత్ రాణి తన రాజ్య కాలంలో పార్లమెంట్ను మూడేండ్లకొకసారి కూడా సమావేశపరచలేదు.

## శాసన నిర్మాణంలో ట్యూడర్ పార్లమెంట్ల పాత్ర

శాసనాలు చేసే అధికారము ఒక్క పార్లమెంటుకే ఉన్నదనే సిద్ధాంతాన్ని ట్యూడర్ రాజు లెప్పుడూ కాదనలేదు. కాని రాజులు అత్యవసర చట్టాలు (Ordinances) చేయడాని కున్న అధికారాన్ని వారు వదులుకోలేదు. ఈ అత్యవసర చట్టాలు శాసనాలవలెనే అమలులోకి వచ్చేవి. అంటే పార్లమెంట్తో సమాంతరంగా శాసనాధికారాన్ని రాజులు చెలాయించినారన్న మాట. ప్లాంటాజెనెట్ రాజుల కాలంనుంచీ ఆర్డినెన్స్‌లు జారీచేయడం పరిపాటి అయింది. ఎనిమిదో హెన్రీ పార్లమెంట్పై ఒత్తిడితెచ్చి ఆర్డినెన్స్‌లకు పార్లమెంట్ శాసనాలతో సమాన ప్రతిపత్తి ఉన్నదనే చట్టాన్ని పార్లమెంట్చేత 1539లో చేయించినాడు. కాని ప్రజల స్వేచ్ఛకు, ఆస్తికి భంగకరమైన సామాన్య న్యాయానికి (Common law) విరుద్ధమయిన చట్టాలు మాత్రం రాజు చేయరాదనే ఒక నిబంధనను ఆ చట్టంలో చేర్చడమయింది. ఆరో ఎడ్వర్డ్ కాలంలో 1539 నాటి చట్టాన్ని పార్లమెంట్ రద్దుచేసింది. కాని చర్చి పూజా విధానాలు సంస్కరించడానికి ధరల పెరుగుదలను అరికట్టడానికి, అసత్య వార్తాప్రచారం చేసే వారిని శిక్షించడానికి ఎడ్వర్డ్ మంత్రులు అనేక ఆర్డినెన్స్‌లు జారీ చేసినారు. ఆరో ఎడ్వర్డ్ తరవాత రాజ్యానికి వచ్చిన మేరీరాణి కేథలిక్ మతవిరుద్ధమయిన విద్రోహకర గ్రంథాలు (Seditious tracts) కొనే వారికి మరణశిక్ష విధిస్తూ ఒక దారుణమైన ఆర్డినెన్స్ జారీ చేసింది. ఎలిజబెత్ రాణి దేశదిమ్మరులను (Vagrants), దొమ్మిదారుల (rioters) ను మరణశిక్షకు పాత్రులను చేస్తూ ఒక ఆర్డినెన్స్ చేసింది. ఆమె బీదల మేలు కోరి ఒక శాసనం (Poor law) చేయించింది. ప్రతి పారిష్ (parish) లోను వృద్ధులను, వికలాంగులను పోషించవలెనని, వికలాంగులు కానివారికి పని చూపించవలెనని, అందుకయ్యే ఖర్చు ఇంటిపైన పన్ను రూపాన వసూలుచేయవలెనని పై చట్టం నిరూపించింది. ఒక ఆర్డినెన్స్‌లో బిచ్చమెత్తి బతకడాని కలవాటుపడిన సోమరిపోతులను, దృఢకాయులను దేశదిమ్మరులుగా పరిగణించరాదని విపులీక

వ్యయం చేసినాడు. అందుచేత కొత్త ఆదాయ మార్గాలు వెదకవలసి వచ్చింది. మంత్రి ఊల్సే ద్వారా పార్లమెంట్‌ను 8 లక్షల పౌనులు మంజూరుచేయమని కోరినాడు. కాని పార్లమెంట్ ఆ మొత్తాన్ని బాగా తగ్గించి ఆ చిన్న మొత్తాన్ని కూడా నాలుగేండ్లలో నాలుగు వాయిదాల మీద వసూలుచేసుకోడానికి అనుమతించింది. కాని ఊల్సే ఆ మొత్తాన్ని ఒక్క వాయిదాలోనే వసూలు చేసినాడు అతడు 1522 లోను, మళ్ళీ 1525 లోను ప్రతి పౌరుడూ స్వప్రమాణంగా తన ఆస్తి విలువను ప్రకటించవలెనని ప్రకటించినాడు. ఆ ఆస్తి విలువపైన భారీ ఎత్తున పన్ను విధించవలెనని అతని పథకము. కాని ప్రజలు ఎదురు తిరగడంవల్ల హెన్రీ ఆ పథకాన్ని విరమించుకోవడమే గాక తిరుగుబాటు చేసినవారిని క్షమించవలసి కూడా వచ్చింది.

బలవంతపు కానుకలను పూర్వం నాలుగో ఎడ్వర్డ్ వసూలు చేసినాడు. కాని మూడో రిచర్డ్ కాలంలో అవి చట్టవిరుద్ధాలని ప్రకటించడమయింది. అయినా ఏడో హెన్రీ ఆ కానుకలను అడపా దడపా వసూలు చేసినాడు ఎనిమిదో హెన్రీ చాలాసార్లు వసూలు చేసినాడు. ఇవ్వడం నిరాకరించిన వారిని రాజు ప్రీవీ కౌన్సిల్ తీవ్రంగా బెదిరించేది మొండికిపడిన వారిని కారాగృహాలలో బంధించి సామాన్య సైనికులుగా సేవచేయుమని నియమించి ప్రీవీ కౌన్సిల్ హెన్రీ నిరంకుశత్వానికి మద్దతు నిచ్చింది. హెన్రీ చాలాసార్లు నిర్బంధించి ఋణాలు తీసుకొన్నాడు ఆ ఋణాలపై వడ్డీ చెల్లించే ప్రసక్తే లేకుండేది పైపెచ్చు రాజు ఆ ఋణాలు తీర్చవలసిన అవసరమే లేదని పార్లమెంట్ రెండుసార్లు చట్టాలు చేసింది ఒకవేళ ఎవరికైనా ఋణంలో కొంత భాగం చెల్లిస్తే ఆ చెల్లించిన ధనాన్ని తిరిగి రాజుకు ముదరా ఇవ్వవలెనని కూడా చట్టం చేసినారు. ఈ విధంగా రాజు అక్రమ చర్యలకు పార్లమెంట్ తన ఆమోదముద్ర వేసింది. ఎలిజబెత్ రాణి చాలాసార్లు నిర్బంధ ఋణాలను తీసుకొన్నది. కాని అసలు మొత్తాలు చెల్లించి వేసింది ఉదాహరణకు యోధత్వం (knight-hood) ప్రసాదించడం ద్వారా, ధన రూపంలో కాకుండా వడ్డీలు ముట్టజెప్పేది.

ఎగుమతి దిగుమతులపై సుంకాలు విధించడం ప్రజల మీద పన్నులు విధించినట్లు కాదని చాలా తరాలుగా ఇంగ్లండ్ రాజుల వాదన. కాని ఉన్నిమీద పన్ను విధింపును క్రితంలో పార్లమెంట్ గర్హించిన సందర్భాలు ఉన్నాయి. పద్నాలుగు, పదిహేను శతాబ్దులలో టన్నేజ్, పౌండేజ్ అనే సుంకాలను వసూలు చేసేవారు. ఉన్ని, చర్మాలు, తగరం మొదలయినవి ఎగుమతి అయ్యేటప్పుడు అటువంటి సుంకాలను పార్లమెంట్‌తో నిమిత్తం లేకుండానే రాజులు దండుకొనే ఆచారం తరతరాలుగా వాడుకలో ఉన్నది. దిగుమతుల విలువపై కొంత శాతం వసూలుచేసే ఆచారం కూడా ఉంది. ఇంగ్లీష్ పరిశ్రమలు, విదేశ వాణిజ్యము అభివృద్ధిచెందే కొద్దీ పై సుంకాలవల్ల వచ్చే ఆదాయము బాగా వృద్ధిచెందింది. అందుచేతనే పదే పదే పన్నులు విధించడానికి పార్లమెంట్ అనుమతి కోరవలసిన అవసరం లేకపోయింది. రేవులు రాజు సొంత ఆస్తికింద పరిగణితమయ్యేవి. అందుచేతనే విదేశ వస్త్రాల దిగుమతుల మీద, మేరీ రాణి తీపి సారాయిల మీద ఎలిజబెత్ రాణి పార్లమెంట్ ప్రసక్తి ఏ మాత్రం లేకుండానే సుంకాలు వసూలు చేయగలిగినారు. ఈ సుంకాలు వసూలుచేయడం రాజు ప్రత్యేకాధికారాలలో ఒకటని అనేకులు అభిప్రాయపడినారు.

పై ఆధారాలే గాక తమకు ఎదురుతిరిగిన వారిపై భారీ ఎత్తున అపరాధాలు విధించడం కూడా ముఖ్య ఆదాయ సాధనమేనని ట్యూడర్ రాజులు పరిగణించినారు. అన్యాయార్జిత విత్త

సముపార్జనలోను, నిరంకుశాధికారం చెలాయించటంలోను ట్యూడర్ రాజులకు కొన్ని సంస్థలు ముఖ్యంగా తోడ్పడినాయి వాటిలో పేర్కొనదగ్గవి స్టార్ ఛాంబర్ న్యాయస్థానము (Star Chamber Court), ప్రభుత్వ మతవిధానాన్ని అమలుజరపడానికి ఎలిజబెత్ రాణి కాలంలో స్థాపితమయిన హైకమిషన్ కోర్టు (Court of High Commission), రాజు ప్రత్యేక న్యాయస్థానమైన ప్రివీ కౌన్సిల్, దానినుంచి ఏర్పడిన వేల్స్ కమిషన్ (Commission of Wales), కౌన్సిల్ ఆఫ్ ది నార్త్ (Council of the North) అనేవి ట్యూడర్ రాజులు విధించే అన్యాయపు, అక్రమపు పన్నులనూ, సుంకాలనూ చేసే ఋణాలను సమర్థిస్తూ వారి నెదిరించిన వారిని ఏదో ఒక నేరం మోపి శిక్షించే పై సంస్థలు ట్యూడర్ల నిరంకుశత్వం కొనసాగడానికి ఎంతగానో తోడ్పడినాయి ఏదో విధంగా ఆర్జించిన ఆర్థిక స్తోమతవల్ల ట్యూడర్ రాజులకు లంకాస్ట్రియన్ రాజులకువలె పార్లమెంట్‌ను మాటిమాటికీ సమావేశపరచ వలసిన అవసరం లేకపోయింది. తన పరిపాలనా కాలం రెండో సగభాగంలో ఏడో హెన్రీ పార్లమెంట్ సమావేశము ఒక్కటి మాత్రమే జరిపినాడు. తాను పాలించిన ఇరవై నాలుగేండ్ల కాలంలో ఎనిమిదో హెన్రీ ఏడుసార్లు పార్లమెంట్‌ను సమావేశ పరిచినాడు. ఎలిజబెత్ రాణి తన రాజ్య కాలంలో పార్లమెంట్‌ను అయిదేండ్లకొకసారి కూడా సమావేశపరచలేదు.

## శాసన నిర్మాణంలో ట్యూడర్ పార్లమెంట్ల పాత్ర

శాసనాలు చేసే అధికారము ఒక్క పార్లమెంట్‌కే ఉన్నదనే సిద్ధాంతాన్ని ట్యూడర్ రాజు లెప్పుడూ కాదనలేదు. కాని రాజుల అత్యవసర చట్టాలు (Ordinances) చేయడానికున్న అధికారాన్ని వారు వదులుకోలేదు. ఈ అత్యవసర చట్టాలు శాసనాలవలెనే అమలులోకి వచ్చేవి. అంటే పార్లమెంట్‌తో సమాంతరంగా శాసనాధికారాన్ని రాజులు చెలాయించినారన్న మాట. ప్లాంటా జెనెట్ రాజుల కాలంనుంచీ ఆర్డినెన్స్‌లు జారీచేయడం పరిపాటి అయింది. ఎనిమిదో హెన్రీ పార్లమెంట్‌పై ఒత్తిడితెచ్చి ఆర్డినెన్స్‌లకు పార్లమెంట్ శాసనాలతో సమాన ప్రతిపత్తి ఉన్నదనే చట్టాన్ని పార్లమెంట్‌చేత 1539లో చేయించినాడు. కాని ప్రజల స్వేచ్ఛకు, ఆస్తికి భంగకరమైన సామాన్య న్యాయానికి (Common law) విరుద్ధమయిన చట్టాలు మాత్రం రాజు చేయరాదనే ఒక నిబంధనను ఆ చట్టంలో చేర్చడమయింది. ఆరో ఎడ్వర్డ్ కాలంలో 1539 నాటి చట్టాన్ని పార్లమెంట్ రద్దుచేసింది. కాని చర్చి పూజా విధానాలు సంస్కరించడానికి ధరల పెరుగుదలను అరికట్టడానికి, అసత్య వార్తాప్రచారం చేసే వారిని శిక్షించడానికి ఎడ్వర్డ్ మంత్రులు అనేక ఆర్డినెన్స్‌లు జారీ చేసినారు. ఆరో ఎడ్వర్డ్ తరవాత రాజ్యానికి వచ్చిన మేరీరాణి కేథలిక్ మతవిరుద్ధమయిన విద్రోహకర గ్రంథాలు (Seditious tracts) కొనే వారికి మరణశిక్ష విధిస్తూ ఒక దారుణమైన ఆర్డినెన్స్ జారీ చేసింది ఎలిజబెత్ రాణి దేశదిమ్మరులను (Vagrants), దొమ్మిదారుల (rioters)ను మరణశిక్షకు పాత్రులను చేస్తూ ఒక ఆర్డినెన్స్ చేసింది. ఆమె బీదల మేలు కోరి ఒక శాసనం (Poor law) చేయించింది. ప్రతి పారిష్ (parish) లోను వృద్ధులను, వికలాంగులను పోషించవలెనని, వికలాంగులు కానివారికి పని చూపించవలెనని, అందుకయ్యే ఖర్చు ఇంటిపైన పన్ను రూపాన వసూలుచేయవలెనని పై చట్టం నిరూపించింది. ఒక ఆర్డినెన్స్‌లో బిచ్చమెత్తి బతకడాని కలవాటుపడిన సోమరిపోతులను, ధృఢకాయులను దేశదిమ్మరులుగా పరిగణించరాదని విపులీక

రించడమయింది. బిచ్చమెత్తుకొంటున్నప్పుడు పట్టుబడితే మొదటిసారి చేసిన చర్యకు దానిని మానివేయుమని బెదరింపు, రెండోసారి ముఖంపైన 'వి' (V-Vagrart - దేశదిమ్మరి) అనే సాంకేతికాక్షరం వ్రాయడం, మూడోసారి మరణదండన విధించడం శిక్షలుగా నిర్ణీతమయి నాయి. ఈ ఆర్డినెన్స్ అమలుజరపటంలో పథ్యశిలను, ఉరికంబాలను ఎక్కినవారి సంఖ్య ఎంతో తెలియదు. కాని తన విశ్వాసాలకు విరుద్ధమైన గ్రంథాలు ఉన్నంత మాత్రాన, వారిని మరణశిక్షకు గురిచేస్తూ మేరీరాణి ఆర్డినెన్స్ జారీ చేయగల్గడం, బిచ్చమెత్తిన నేరానికి ఉరి కంబ మెక్కించవలెననే దారుణమైన ఆర్డినెన్సును పార్లమెంట్ ఖండించకుండా ఉండటం ట్యూడర్ రాజుల నిరంకుశత్వానికి, మత స్వాతంత్ర్య విషయంలోను, బీదల ప్రాణాలకు విలువ కట్టడంలోను నాటి పార్లమెంట్‌లు చూపిన ఉదాసీనతకు, ఉపేక్షాభావానికి, తార్కాణాలు.

పత్రికా స్వాతంత్ర్యము, ముద్రణాస్వేచ్ఛ, వాక్ స్వాతంత్ర్యము ప్రజాస్వామ్య విధానానికి, పార్లమెంటరీ వ్యవస్థకు మూలస్తంభాలని ఈనాడు సర్వసామాన్యంగా అందరూ అంగీకరిస్తున్నారు. కాని ఆ నాడు ఈ స్వాతంత్ర్యాలను, ఈ స్వేచ్ఛలను రాజులు లెక్క చేయలేదు. వాటి రక్షణనుగురించి పార్లమెంట్ అంతగా పట్టించుకోలేదు. ముద్రణాలయాలు ఒక్క లండన్ నగరంలోను, ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయాలలోను మాత్రమే నెల కొల్పవచ్చునని 1586 లో ఒక ఆర్డినెన్స్ జారీ అయింది. ఆరునెలలకు మించి ముద్రణాను భవం లేనివారు ముద్రణ వృత్తినుంచి తొలగిపోవలెనని మరొక ఆర్డినెన్స్, ముద్రణాలయా లెన్ని ఉండవచ్చునో నిర్ణయించే అధికారం కేంటర్‌బరి ఆర్చ్‌బిషప్, లండన్ బిషప్‌ల హస్త గతం చేయడమయింది వారి అనుమతిలేనిదే ఏ పుస్తకాన్నీ ముద్రించే వీలులేదు. ఈ నియ మాల నతిక్రమించినవారికి శిక్ష కారాగృహవాసము. ఆ తరవాత రెండువందల ఏండ్లవరకు ఆంగ్లేయ జాతికి పత్రికా స్వాతంత్ర్యం లభించలేదు.

ట్యూడర్ రాజులు నిరంకుశులుగా దేశాన్ని పాలించినా ప్రజాభీష్టమైన పరిపాలనను సాగించి, ప్రభువులను అణిచి, పటిష్ఠ ప్రభుత్వం స్థాపించినారు. వీరు ప్రజానురంజక రాజులేగాని నిరంకుశ రాజులు మాత్రం కారు.

పార్లమెంట్‌ను మన్నించి పార్లమెంట్ సభ్యులకు మాత్రం వాక్ స్వాతంత్ర్యము, వ్యక్తి స్వాతంత్ర్యము కల్పించినారు. రాజ్యవిషయాలను పార్లమెంట్‌తో చర్చించినారు. తమకు కావలసిన పనులన్నీ పార్లమెంట్‌కు తెల్పి సాధించుకొన్నారు వారికి పార్లమెంట్ సింహాస నము నిచ్చినదన్న విశ్వాసము ఉన్నది. ఆర్థిక, శాసన, న్యాయవిషయాలలో పార్లమెంట్‌తో తగాదాలు పెట్టుకోలేదు. పార్లమెంట్ సంప్రదాయాలను పాటించినారు. ప్రభువులను అణచటం చర్చిని పోప్‌నుంచి తెగతెంపులు చేయటం, నేరస్థులకు శిక్ష, ఉరిశిక్ష విధించటం, తాత్కాలిక శాసనాలు, ప్రకటనలు ప్రవేశపెట్టటం, పన్నులు, సుంకాలను విధించటం మున్నగు విషయా లలో పార్లమెంట్ పూర్తిగా మద్దతు ఇచ్చినది.

1512 పార్లమెంట్ సమావేశంలో స్ట్రోడ్ (Strode) అనే పార్లమెంట్ సభ్యుడు తగరపుగని అధికారుల హోదాలు, హక్కుల విషయమై బిల్లును ప్రవేశపెట్టగా, అతనిని రాజు న్యాయస్థానము (King's Court) నిర్బంధించింది. కాని అతనిని ఎనిమిదో హెన్రీ జైలు నుంచి విడిపిస్తూ ఈ విధంగా పేర్కొన్నాడు. ''పార్లమెంట్ సభ్యులకు దేశ విషయాలను

చర్చించే అధికారమున్నది. రాజుకు ఆ అధికారాన్ని తీసివేసే హక్కు లేదు." అట్లే 1543లో జార్జి ఫెర్రార్స్ (George Ferrars) అనే పార్లమెంట్ సభ్యుడు పార్లమెంటులో మాట్లాడి నపుడు నిర్బంధితుడయినాడు. కాని ఎనిమిదో హెన్రీ అతనిని విడుదలచేస్తూ, పార్లమెంట్ సభ్యుని అవమానించిన తనను అవమానించినట్లే అని పలికినాడు. పార్లమెంట్ ప్రాతినిధ్యం ఎక్కువ సంఖ్యలో బరోలకు (Borough) కల్పించబడినాయి. ఎడ్వర్డ్ కాలంలో 253 నుండి 288 వరకు. మేరిరాణి కాలంలో 288 నుండి 310 వరకు; ఎలిజబెత్ కాలంలో 369 ప్రతినిధుల సంఖ్యవరకు పెరిగింది.

ట్యూడర్‌లు కొన్ని సమయాలలో నిరంకుశులుగా వ్యవహరించినారు. వీరి కాలంలో ప్రభువులు, మంత్రులు నిర్దాక్షిణ్యంగా చంపబడినారు. ఎలిజబెత్ తన వివాహ, మత, విదేశ విషయాలలో పార్లమెంట్‌కు హక్కు లేదని శాసించినాడు. కాని పార్లమెంట్ సభ్యులు ఈ విషయాలపై చర్చించి నిర్బంధితులయ్యేవారు. పార్లమెంట్ ప్రవేశపెట్టిన 91 బిల్లులలో 48 బిల్లులను ఆమె తిరస్కరించినాడు. గుత్తాధికారాలను తనకు తోచిన వారికి ఇచ్చేది. ఇన్ని చేసిన ఎలిజబెత్ ఒకనాడు పార్లమెంట్ సమావేశంలో ఈ విధంగా పలికినాడు: "నాకు కావలసినది ప్రజల అభిమానం, దేశాభివృద్ధి మాత్రమే". ఈమె పరిపాలన ఒక ఉజ్వల యుగము. బ్రిటన్ దేశచరిత్రలో ఈమెను మించిన పాలకులెవ్వరు లేరని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఈమె ఎంతో వివేచనాశక్తి, దూరదృష్టి కలది. శాంతిభద్రతలను నెలకొల్పి, శత్రువులను నిర్జించి, రాజ్య బలాన్ని, ప్రతిష్టను అపారంగా పెంపుచేసింది. కళలను ప్రోత్సహించింది. నిరుద్యోగ సమస్యలను పరిష్కరించింది. మత సంబంధమయిన అశాంతిని రూపు మాపింది. పరిశ్రమలు, వ్యాపారము, వాణిజ్యము అభివృద్ధిచేసింది. పేదలు, నిరుద్యోగులు, అనాథలు, వికలాంగులకు జీవనోపాధి కల్పించింది. నావికా శాఖను అభివృద్ధిపరచి శాస్త్రీయమైన తర్ఫీజును కల్పించింది. ఇతరాలయిన ఎన్ని లోపాలను ప్రజ లీమెను మన్నించి ప్రేమించినారు. ఈమె పరిపాలన ఒక స్వర్ణయుగము.

పార్లమెంట్ ట్యూడర్‌ల కాలంలో ఎన్నో హక్కులను, హోదాలను పొందింది. శాసన ఆర్థిక, పరిపాలన, న్యాయాధికారాలను వహించింది. దేశ అభివృద్ధి, అశాంతి రూపుమాపటం, పటిష్ఠ ప్రభుత్వ స్థాపన ప్రభువులను అణచటం. రోమ్‌తో ఇంగ్లండ్ చర్చిని తెగతెంపులు చేయటం మున్నగువిషయాలలో ట్యూడరతో పూర్తిగా సహకరించింది. పార్లమెంట్, ట్యూడర్ రాజులు దేశపరిపాలనా విషయాలలో అన్యోన్యంగా మెలగినారు. అట్లాగని పార్లమెంట్ ట్యూడరకు అణకువగా మెలగలేదు. ఉదాహరణకు గుత్తవ్యాపారాల విషయమై తాను జోక్యం చేసుకొని అధికారం నిల్పుకున్నది. ఎలిజబెత్ కోరిన ధనమును మంజూరు చేయలేదు. పార్లమెంట్ సమావేశాలలో సభ్యులకు వాక్ స్వాతంత్ర్యం ఉండింది.

## ట్యూడర్ యుగము - మంత్రుల బాధ్యత

ప్లాంటా జెనెట్ రాజులకాలంలో మంత్రులైన లాటిమర్, సఫోక్ ప్రభువులను దుష్పరిపాలన చేసిన నేరానికి పార్లమెంట్ విచారణచేసినట్లు చదివినారు. కాని ఆ కాలంలో అటువంటి నేరాలకు ట్యూడర్ కాలంలోవలె మరణశిక్ష విధించే పద్ధతి లేదు. ఆ కాలంలో అటువంటి నేరస్తులను పదభ్రష్టులు చేసేవారు. లేదా వారిపై జరిమానాలు విధించేవారు. లేదా వారి

ఆస్తులు జప్తు చేసేవారు ట్యూడర్ కాలంలో అవే నేరాలకు మరణశిక్షలు కూడా విధించేవారు. ఉదాహరణకు ఎనిమిదో హెన్రీ తాను రాజ్యానికి వచ్చిన కొత్తలో తన తండ్రికి నిర్బంధ విధానాల ద్వారా భూస్వాములనుంచి, ధనికులనుంచి సంపదలు దోచి ఇచ్చిన నేరానికి మంత్రులైన ఎమ్సెన్, డడ్లీలను రాజద్రోహ నేరానికి శిక్షించమని పార్లమెంట్‌ను తానే రెచ్చగొట్టినాడు. ఇట్లా చేయడంలో హెన్రీ ముఖ్య ఉద్దేశము ప్రజల అభిమానం సంపాదించడమే. ఇదే విధంగా తనకెంతో సన్నిహితుడై అపారమైన సేవచేసిన కార్డినల్ ఊల్సీపై కూడా ఎనిమిదో హెన్రీ రాజద్రోహ నేరం మోపినాడు ఇందుకు ముఖ్యకారణము తాను కోరినంత త్వరలో తన భార్య కాథరిన్‌నుంచి విడాకులు పోప్‌నుంచి సంపాదించలేకపోవడమే. కాని లండన్‌వస్తూ మార్గమధ్యంలోనే ఊల్సీ మరణించడంతో అతనికి వధ్యశిల నెక్కవలసిన యోగం తప్పిపోయింది. కాంటర్‌బరి ఆర్చిబిషప్ అయిన థామస్ క్రాంవెల్ రాజద్రోహి అని హెన్రీ శిరః ఖండన చేయించినాడు. క్రాంవెల్ హెన్రీకి సన్నిహితుంటు. ఇంగ్లండ్ చర్చి పరిపాలనలోను, మతాచరణంలోనూ హెన్రీ కోరిన మార్పులనే క్రాంవెల్ ప్రవేశపెట్టినాడు. కాని కాథలిక్‌ల అభిమానం సంపాదించదలచి అటువంటి వానిని కూడా హెన్రీ వధ్యశిల కెక్కించినాడు. ఎలిజబెత్ రాణి మంత్రులకు అటువంటి గతి పట్టలేదు. కాని వారు పార్లమెంట్‌కు ఎన్నడూ బాధ్యత వహించలేదు ఈ సందర్భాన ఒక్క విషయాన్ని ముఖ్యంగా జ్ఞప్తి తెచ్చుకోవలె. ట్యూడర్ రాజులు తమ మంత్రులను సామాన్యంగా మధ్యతరగతి వారినుంచి నియమించేవారు. అందువల్ల వారు తమ ఉన్నతికి కారకులైన రాజులకు సంపూర్ణంగా విధేయులై మెలిగేవారు.

## కౌన్సిళ్ళ ద్వారా పరిపాలన (Government by Councils)

ట్యూడర్‌ల కాలంలో దేశపరిపాలన రాజుచేత నియమితమయి రాజుకు బాధ్యత వహించిన కౌన్సిళ్ళ ద్వారా సాగింది. ఈ కౌన్సిళ్ళన్నింటిలో ప్రధానమైనది 'ప్రివీ కౌన్సిల్'. ఈ 'ప్రివీ కౌన్సిల్' నార్మన్‌లకాలపు 'రాజసభ' (Curia Regis) వంటిది. 'ప్రివీ కౌన్సిల్' అనే పేరు ప్రప్రథమంగా లెంకాస్ట్రియన్ రాజుల కాలంలో వాడుకలోకి వచ్చింది. 13 వ శతాబ్దిలో సామాన్య న్యాయస్థానాలు (Common Law Courts), 14 వ శతాబ్దిలో ఛాన్సరీ కోర్టు, నార్మన్ రాజులనాటి రాజసభ (Curia Regis) నుంచి ఉద్భవమైన న్యాయ పరిపాలనా బాధ్యతలు వహించినాయి. న్యాయపరిపాలనగాక తక్కిన పరిపాలన కార్యక్రమాలను 'ప్రివీ కౌన్సిల్' నిర్వహించే పద్ధతి లెంకాస్ట్రియన్‌ల కాలంలో ఏర్పడింది. కాని లెంకాస్ట్రియన్ ప్రివీ కౌన్సిల్‌కు, ట్యూడర్ ప్రివీ కౌన్సిల్‌కు విభిన్న లక్షణాలు చాలా ఉన్నాయి. లెంకాస్ట్రియన్ రాజుల ప్రివి కౌన్సిల్ సభ్యులలో అనేకులు బలవంతులైన సామంత ప్రభువులు బిషప్పులు వారు రాజుకు దాసోహమనేవారు కారు. స్వతంత్రాభిప్రాయాలు గలవారు. రాజులు వారి అభిప్రాయాలు మన్నించవలసి వచ్చేది. ఆ సభలో వారేగాక రాజు ముఖ్యోద్యోగులు కూడా సభ్యులుగా ఉండేవారు. ఈ నాటి మంత్రివర్గం వలెనే ఏ చట్టాలను పార్లమెంట్ చేయవలెనో ఏ ఏ పన్నులను ఆమోదించవలెనో లెంకాస్ట్రియన్ ప్రివీ కౌన్సిల్ నిర్ణయించేది. అంటే పార్లమెంట్ కార్యక్రమాన్ని సిద్ధంచేసేది. యుద్ధంవంటి ప్రత్యేక జాతీయావసరాలు తలయెత్తినప్పుడు నార్మన్ ప్లాంటా జెనెట్‌ల కాలాలలో వలెనే లెంకాస్ట్రియన్‌లు తమ ప్రివీ కౌన్సిల్ సమావేశాలకు మిగతా సామంత ప్రభువులను కూడా ఆహ్వానించేవారు. కాని నియామకాలంలో,

శాసనాలు చేసే విషయంలో, పన్ను లామోదించే (విధించే) విషయంలో సర్వాధికారాలూ పార్లమెంట్ పరమైనా కొన్ని సందర్భాలలో ముఖ్య రాజోద్యోగులను కూడా పార్లమెంట్ నియమించడమేగాక, దుష్పరిపాలన చేస్తే శిక్షించేది. అందువల్ల ప్రీవీ కౌన్సిల్ సెంరాస్ట్రియన్ రాజులకు తాబేదారుగా కాక పార్లమెంట్ ఇష్టానుసారమే నడవవలసి వచ్చింది.

ట్యూడర్‌ల కాలంలో జరిగిన రాజ్యాంగ అభివృద్ధిలో పేర్కొనదగినది ప్రీవీ కౌన్సిల్ స్థాపన. ఈ ప్రీవీ కౌన్సిల్ ఒక వంద సంవత్సరాల తరువాత రాజుకు పార్లమెంట్‌కు గల సంబంధాన్ని, పార్లమెంట్‌కు రాజుకు గల సంబంధాన్ని విశదపరచటంలో ప్రముఖ పాత్ర వహించింది. ఇది ట్యూడర్ రాజుల సలహా సంఘము. ఈ కౌన్సిల్‌లోని సభ్యులు ట్యూడర్ రాజుచే నియమింపబడి, మధ్యతరగతి కుటుంబాలకు చెంది, రాజాదరణ మీద ఆధారపడే వారు

ప్రీవీ కౌన్సిల్‌ను ఏడవ హెన్రీ లండన్ నగరంలో స్థాపించినాడు. ఇతడు మధ్య తరగతి వారిని, న్యాయమూర్తులను, యోధులను సభ్యులుగా నియమించినాడు. ఇతని కాలంలో మార్టన్ (Martan), ఫాక్స్ (Fox), వార్డన్ (Wardan), బ్రే (Bray), లోవెల్ (Lowell), ఎమ్సన్ (Emson), డడ్లీ (Dudly) మున్నగువారు ప్రీవీ కౌన్సిల్ సభ్యులు. ఈ సభ్యులకు కౌన్సిలర్లు అని పేరు. కౌన్సిల్‌లో మతాధికారుల, ప్రభువుల ప్రాతినిధ్యం తగ్గి వారి ప్రభావం క్షీణించింది. సాధారణంగా కౌన్సిల్ సభ్యత్వం 15 నుంచి 20 వరకు ఉండేది. కాని ఆరవ ఎడ్వర్డ్, ఎలిజబెత్‌ల కాలంలో సభ్యత్వం 40 వరకు పెరిగింది. సభ్యునికి ప్రతి సంవత్సరం 100 పౌండులు జీతము, ఉచిత భోజనము లభించేవి. రాజే ఈ కౌన్సిల్‌కు సర్వాధికారి. సభ్యులను నియమించే వాడు, తీసివేసే వాడు. సభ్యుల సలహాలను పాటించటం, సంప్రదించటం అనే బాధ్యతలు రాజుకు లేవు. ఈ కౌన్సిల్ సభ్యులు ఎన్ని అధికారాలు అనుభవించినా, ట్యూడర్‌ల నిరంకుశ అధికారాన్ని ధిక్కరించలేక వారి ఆదరాభిమానాలపై ఆధారపడి ఉండేవారు.

ప్రీవీ కౌన్సిల్ నేటి ఆధునిక మంత్రిమండలి వంటిది. దీనికి శాసన, పరిపాలన, ఆర్థిక, న్యాయ, మతాధికారాలు ఉండేవి.

*శాసనాధికారాలు:* 1. శాసన కార్యక్రమాలను చర్చించటం. 2 శాసన కార్యక్రమాలను తయారుచేయటం. 3. రాజు సలహాపై ప్రకటనలను, నియత శాసనాలను ప్రకటించటం.

*పరిపాలనాధికారాలు:* 1. స్థానిక, దేశపరిపాలనా విషయాలను చూడటం. 2. ప్రభుత్వశాఖలను, ఉద్యోగులను తనిఖీచేయటం 3. ఎన్నికల గూర్చి చర్చించటం. 4. పారిశ్రామిక వర్తకరంగాలపై ప్రత్యేక శ్రద్ధ వహించటం. 5. దేశరక్షణ, భద్రత విషయాలలో బాధ్యత వహించటం. 6 పుస్తక ప్రచురణలకు లైసెన్సులు మంజూరు చేయటం. 7. ముద్రణాధికారులపైన అజమాయిషి వహించటం. 8. దేశవిషయాలను రాజుకి నివేదించి సలహాలివ్వటం. 9. దేశ విదేశపరిపాలనా విధానాలను నిర్ణయించటం. 10. రాయబారులకు, సేనానులకు ఆజ్ఞలను పంపటం. 11. ప్రధానోద్యోగులకు ఆజ్ఞలను జారీచేయటం.

**ఆర్థికాధికారాలు:** 1. ప్రభుత్వ వ్యయానికి కావలసిన ద్రవ్యవనరులను నిర్ణయించటం 2. దేశ ఆర్థిక విషయాలను రాజుతో చర్చించటం.

**న్యాయాధికారాలు:** ఇది ఒక ఉన్నత న్యాయస్థానము. కాని న్యాయాధికారాలు స్టార్ ఛేంబర్ న్యాయస్థానానికి ఇచ్చివేసినాడు.

**మతాధికారాలు:** చర్చి విషయాలను పరిశీలించి మతవిధానాన్ని అమలుపరచటం.

ప్రీవీ కౌన్సిల్ సమావేశాలకు రాజే అధ్యక్షుడు. రాజులేని సమయంలో ప్రభు. అధ్యక్షుడు (Lord President) సమావేశాలను జరిపిస్తాడు. సమావేశ నిర్ణయాలను గ్రంథరూపంలో భద్రపరిచేవారు. కౌన్సిల్‌కు ప్రత్యేక ముద్ర ఉంది.

ఈ కౌన్సిల్‌లో స్టేట్ సెక్రటరీ, ప్రధాన రాజముద్రాధికారి (Lord keeper of the Great Seal), రాజు సొంత ముద్రాధికారి (Lord Privy Seal), కోశాధికారి (Lord Treasurer), లార్డ్ ప్రెసిడెంట్ (Lord President) మొదలైనవారు ప్రధాన ఉద్యోగులు. స్టేట్ సెక్రటరీ ముఖ్యమంత్రిగా వ్యవహరించేవాడు. ఇతడే రాజుకు మంత్రి మండలికి మధ్యవర్తి

రాచనగరంలోని ప్రధానాధికారులకు కూడా ప్రీవీ కౌన్సిల్‌లో సభ్యత్వము ఉంది. ప్రీవీ కౌన్సిల్ నియామకంపైన, అది అనుసరించే పరిపాలనా విధానంపైన పార్లమెంట్‌కు ఎటువంటి పెత్తనం లేకుండేది. కాని ప్రీవీ కౌన్సిల్ సభ్యులు సామాన్యంగా పార్లమెంట్‌లోని రెండు సభలలో ఏదో ఒకదానిలో సభ్యులు ఉండటంచేత తన ఇష్టానుసారం ప్రీవీ కౌన్సిల్ నడిచేటట్లు చేయడానికి పార్లమెంట్‌కు కొంత అవకాశము ఉండేది. కాని ప్రీవీ కౌన్సిల్ సభ్యులు సాధారణంగా మధ్యతరగతికి చెందినవారు కావటంచేత పాత ప్రభువంశీకులవలె గాక రాజు ఇష్టానుసారమే నడచుకొనేవారు.

## స్టార్ ఛేంబర్ న్యాయస్థానము (Court of Star Chamber)

క్రీ. శ. 1487 లో ఏడో హెన్రీ స్టార్ ఛేంబర్ న్యాయస్థానం స్థాపించినాడు. స్టార్ ఛేంబర్ అనే పేరు ప్రాచీనమైనది. 1487 పార్లమెంట్ చట్టం ప్రకారం ప్రీవీ కౌన్సిల్‌లోని కొంతమంది సభ్యులతో ఒక ప్రత్యేక కమిటి ఏర్పాటుచేయడం జరిగింది. ఆ కమిటీయే స్టార్ ఛేంబర్ న్యాయస్థానము. చరిత్రకారుడు టేనర్ స్టార్ ఛేంబర్ న్యాయస్థానం "ఉనికి ఒక క్లిష్టతరమైన రాజ్యాంగ సమస్యయని, దాని చరిత్ర అపార్థం చేసికొనబడినదని పేర్కొన్నాడు" ఈ న్యాయస్థానం ప్రీవీ కౌన్సిల్‌లో ఒక విభాగంగా ఉండి ఉన్నత న్యాయాధికారాలను ప్రీవీ కౌన్సిల్‌నుంచి పొందినాడు. దీని సమావేశాలు జరిగే ఒక గదికప్పు మీద నక్షత్రాలు చిత్రించి ఉండటంచేత దీనికి స్టార్ ఛేంబర్ న్యాయస్థానమని పేరు వచ్చింది. దీనిని స్థాపించటంలో ముఖ్య ఉద్దేశము : ప్రభువులను అణచటం సామాన్య న్యాయస్థానాలపై ప్రభువుల ప్రభావం తగ్గించటం. ప్రభువుల స్వంత సైన్యాలను నిషేధించిన (Statute of Livery and Maintanance) చట్టం అమలుచేయటం. న్యాయాన్ని కల్పించని జ్యూరీలను శిక్షించటం, సమన్యాయ పరిపాలనను ప్రవేశపెట్టటం.

స్టార్ ఛేంబర్ న్యాయస్థానంలో 26 మంది జ్యూరీలు ఉండేవారు. కాని సభ్యుల సంఖ్యకు పరిమితి లేదు సమావేశాలకు జ్యూరీ లందరు తప్పక హాజరయ్యేవారు.

*న్యాయాధికారాలు:* ఈ న్యాయస్థానానికి ఉన్నత న్యాయాధికారాలు ఉండేవి. దీనికి మరణశిక్ష విధించే అధికారం లేదు. కాని జరిమానా, కొరడాదెబ్బలు, అంగవిచ్ఛేదము, కాలనిర్ణయంలేని ఖైదు మొదలైన క్రూరశిక్షలను విధించేది. దోషులు ఈ కోర్టుబారినుంచి తప్పించుకొనలేక పోయినారు. రాజు ఆగ్రహానికి అతని పగకల ధనాశకు గురిఅయిన వారికి సర్వనాశనం అయ్యేవారు. గులాబీల యుద్ధాలనుంచి బ్రతికి బయటపడిన బలవంతులైన సామంత ప్రభువులు, రాజ్య ఐక్యానికి అడ్డుగా నిలిచినవారూ, ఈ కోర్టు ద్వారా సమూలంగ నాశనమయినారు.

స్టార్ ఛేంబర్ న్యాయస్థానము 16 వ శతాబ్దం నుంచి ప్రముఖ పాత్ర వహించి, 17 వ శతాబ్దంలో ఉన్నతస్థాయిని చేరుకున్నది కాని దీర్ఘకాలిక పార్లమెంట్ (Long Parliament, 1640) దీనిని రద్దు పరిచింది.

పై కోర్టుకు అనుబంధంగా కౌన్సిల్ ఆఫ్ ది నార్త్ (Council of the North), వేల్స్ కౌన్సిల్ (Council of Wales) వెస్ట్ కౌన్సిల్ (Council of the West) స్థాపితమయినాయి.

*కౌన్సిల్ ఆఫ్ ది నార్త్ (Council of the North):* యార్క్ (York), డర్హామ్ (Durham), నార్దంబర్లాండ్ (Northumberland), కంబర్లాండ్ (Cumberland), వెస్ట్మోర్లాండ్ (Westmorland) అనే కౌంటీలపై నార్త్ కౌన్సిల్‌కు న్యాయపరిపాలనాధికారాలు ఉన్నాయి. ఈ కౌన్సిల్ ఉత్తర (North) ప్రాంతంలో "హై కమిషన్ కోర్టు"గా వ్యవహరింపబడింది. స్టార్ ఛేంబర్ న్యాయస్థానము పంపిన ఆజ్ఞలను అమలు జరిపేది. 1572 లో ఈ కౌన్సిల్‌కు ఎర్ల్ ఆఫ్ హంటింగ్డన్ (Earl of Huntingdon) అధ్యక్షుడుగా ఉండి న్యాయపరిపాలనా వ్యవహారాలను చక్కగా చూసింది. ఇతని కాలమునుంచే ఈ కౌన్సిల్ అభివృద్ధిచెందింది.

*వేల్స్‌కౌన్సిల్ (Council of Wales):* వేల్స్ ప్రాంతంలో ఈ కౌన్సిల్‌కు న్యాయపరిపాలనాధికారాలు ఉన్నాయి.

*వెస్ట్‌కౌన్సిల్ (Council of the West):* ఈ కౌన్సిల్ 1589 లో స్థాపింపబడి 1547 లో రద్దు అయింది. దీనికి కార్న్వాల్ (Cornwall), దేవన్ (Devon), సోమర్‌సెట్ (Somerset), డోర్‌సెట్ (Dorset) అనే కౌంటీలపైన న్యాయపరిపాలనాధికారాలు ఉన్నాయి. స్టార్ ఛేంబర్ న్యాయస్థానము పంపిన ఆజ్ఞలను పాటించేది. ఈ కౌన్సిల్ రద్దు అయిన తరవాత దీని అధికారాలు స్టార్ ఛేంబర్ న్యాయస్థానానికి, సాధారణ న్యాయస్థానాలకు బదిలీ అయినవి.

పై కౌన్సిళ్ళు ప్రముఖ స్థానిక న్యాయపరిపాలనా సంఘాలు.

పైన చెప్పిన మూడు కోర్టులేగాక ప్రీవీ కౌన్సిల్ శాఖలుగా పనిచేసిన ఇతర న్యాయస్థానాలు కూడా కొన్ని ఉన్నాయి. 'అర్తుల న్యాయస్థానము' (The Court of Requests) బీదలకు న్యాయం చేకూర్చేది. 'అక్రమణల న్యాయస్థానము' (The Court of Augmentation), ప్రథమ ఫల దశభాగాల కోర్టు (Court of first-Fruits and tenths) అనే రెండు ఆర్థిక న్యాయస్థానాలు చర్చి నుంచి గుంజుకొన్న ఆస్తులకు, చర్చిలోని పదవులవల్ల లభించే మొదటి సంవత్సరపు బవజు, ఆదాయాంశ భాగాలకు సంబంధించిన

న్యాయవిచారణ జరిపేవి. ఇంకా వేల్స్ కౌన్సిల్ వంటివి ఐర్లండ్‌లో ఐరిష్ కౌన్సిల్ కెలే పట్టణంలో కెలే కౌన్సిల్, మత విప్లవానంతర మత విధానాతిక్రమణలను విచారించడానికి ఏర్పడిన హైకమిషన్ కోర్టు ఈ న్యాయస్థానాలన్నీ ప్రీవీ కౌన్సిల్ పర్యవేక్షణ కిందనే పని చేసేవి. ఇవన్నీ గాక ప్రత్యేక సందర్భాలలోను, కౌంటీలలోను ఉత్పన్నమయ్యే సమస్యల విచారణకు తాత్కాలికంగా కమిటీలను కమిషన్‌లను కూడ ప్రీవీ కౌన్సిల్ నియమించేది.

## స్థానిక పరిపాలనము

లంకాస్ట్రియన్‌లు, యార్కుల పరిపాలనా కాలంలో జిల్లా కోర్టులు (Shire Courts) శతములలోని న్యాయస్థానాలు (Hundred Courts), జమీందారుల న్యాయసభలు (Fendal Courts) తమ తమ ధర్మాలను విడిచి పెట్టినవి. అట్లే స్థానికాధుకారులు కూడ తమ కర్తవ్యాలను మానివేసినారు. గులాబీల యుద్ధకాలము నాటికి ప్రజల ఇక్కట్లు చెప్ప నలవి కాదు. ఈ విధంగా లంకాస్ట్రియన్‌లు, యార్కుల పాలనా కాలంలో స్థానిక ప్రభుత్వము పూర్తిగా పతనం చెందింది. ప్రజలు పటిష్ఠ ప్రభుత్వ స్థాపనకోసం ఆత్రుతతో ఉన్న పరి స్థితిలో ట్యూడర్లు సింహాసన మధిష్టించి పటిష్ఠ ప్రభుత్వాన్ని స్థాపించి, స్థానిక పరిపాలనలో మార్పులు తీసికొనివచ్చి దేశంలో శాంతి భద్రతలు నెలకొల్పినారు.

షెరీఫ్‌లు 15 వ శతాబ్దిలో కూడ రాజ ప్రతినిధులుగాను, కౌంటీ సేనలకు ముఖ్యాధి కారులుగానూ వ్యవహరించినారు. కాని 16 వ శతాబ్దంలో మేరీరాణి కాలంలో లార్డ్ లెఫ్టినెంట్ (Lord Lieutenant) అనే నూతన ఉద్యోగి కౌంటి సేనలపు అధికారిగా నియమిస్తూ పార్లమెంట్ శాసనం చేసింది. తత్ఫలితంగా షెరీఫ్‌లకు ఈ కింది విధులు మాత్రమే మిగిలినాయి : 1. శాంతిభద్రతలను నెలకొల్పటం. 2. నేరస్థులను న్యాయమూర్తులను సమక్ష మందుంచటం. 3. సంచార న్యాయాధిపతులు (Circuit Judges) కౌంటికి వచ్చినప్పుడు వారు తమ విధులు నిర్వహించడానికి అవసరమైన ఏర్పాట్లుచేయటం 4. మరణ శిక్షణలను అమలుపరచటం. 5. పార్లమెంట్‌కు ఎన్నికలు ఏర్పాటుచేయటం.

*కౌంటీలలో లార్డ్ లెఫ్టినెంట్ విధులు:* 1. శాంతిభద్రతలను కాపాడటం. 2. న్యాయ బద్ధంగా ఉండటం. 3. స్థానిక పరిపాలనను సక్రమంగా ఉంచటం. 4. సైనిక విషయా లను ప్రీవీ కౌన్సిల్‌కు నివేదించటం. 5. స్థానిక ఉద్యోగు నియామకాల విషయంలో ప్రముఖ పాత్ర వహించటం.

## శాంతిస్థాపక న్యాయమూర్తులు (Justices of Peace)

ట్యూడర్ యుగంలో శాంతిని కాపాడే న్యాయాధిపతులే శాంతిస్థాపక న్యాయమూర్తులు (Justices of Peace). వీరిని లార్డ్ ఛాన్సలర్ (Lord Chancellor) నియమిస్తాడు. కౌంటీల పరిపాలనలో వీరు జీతభత్యాలులేని ప్రధానోద్యోగులు. ఈ న్యాయమూర్తుల ఉద్యోగాలు 13 వ శతాబ్దాంతాన మొదట సృష్టి అయినాడు. అప్పుడు వారి ఉద్యోగధర్మాలు రాజు న్యాయస్థానాలు విచారించడానికి వ్యాజ్యాలను సిద్ధపరచడం, తరవాత కొంతకాలం కారొనర్ (Coroner) అనే ఉద్యోగి, ఆ తరవాత శాంతి పరిరక్షకులు (keepers or Conservators of the Peace) అనే ఉద్యోగులు పై పనిని నిర్వహించేవారు. మూడో

ఎడ్వర్డ్ రాజు 1360 లో కొన్ని రకాలైన మహాపరాధాలను (felories) చేసిన వారిని విచారించి జైలుశిక్ష విధించే బాధ్యత శాంతి పరిరక్షకులపై ఉంచినాడు. తరవాత కొంత కాలానికి బాధ్యత శాంతిస్థాపక న్యాయమూర్తులకు అప్పగించడమయింది. 1388 లో సాలుకు నాలుగు పర్యాయాలు వీరి న్యాయస్థానాలు పనిచేయవలెనని నిర్ణయమయింది. క్రమేణా వారి అధికారాలు పలువిధాలుగా కౌంటీలలో పెరుగుతూ వచ్చినాయి.

శాంతిస్థాపక న్యాయమూర్తులకు పరిపాలన, పోలీస్, న్యాయాధికారాలు ఉన్నాయి.

*పరిపాలనాధికారాలు:* 1. స్థానిక పరిపాలనా యంత్రాంగానికి కావలసిన జీత భత్యాలులేని ఉద్యోగులను నియమించటం. 2. శాంతిని నెలకొల్పటం. 3 రాజశాసనాలు తాత్కాలిక శాసనాలను అమలుచేయటం. 4. పని లేనివారికి పని కల్పించటం. 5 ధర లను నిర్ణయించి ఎగుమతి దిగుమతులను క్రమపరచటం. 6. తూనికలలో మోసం లేకుండా చూడటం. 7. లైసెన్సులను జారీచేయటం. 8. ఆసుపత్రులను, కారాగారాలను, చర్చి లను పర్యవేక్షించటం. 9. సారాయి దుకాణాలను తనిఖీ చేయటం. 10. కుట్టు పనివాళ్ళ పేదల క్షేమం చూడటం. 11. కార్మికుల కూలిని నిర్ణయించటం. 12. ఉద్యోగులను అదుపులో ఉంచటం. 13. రాజమార్గాలను చక్కగా ఉండేటట్లు చూడటం. 14. వంతె నలు మరమ్మత్తు చేయించటం. 15. శ్రేణుల (Guilds) ఉపశాసనాలను పరీక్షించటం. 16. కాథలిక్ మతస్థులపైనను, నిర్వాహకులపైనను నిఘా ఉంచటం. 17. పరిశ్రమలపైన, వాణిజ్యంపైన తనిఖీ జరపటం. 18. విదేశీయుల రాకపోకలను గమనించటం. 19. ప్లేగు కాలంలో సహాయ కార్యక్రమాలు చేపట్టటం.

*పోలీస్ అధికారాలు:* 1. స్థానిక శాంతిభద్రతలను కాపాడటం. 2. స్థానిక సైనిక దళము, నౌకలను అదుపులో ఉంచటం. 3. కాన్‌స్టేబిల్సును నియమించటం. కాన్‌స్టేబిల్సు విధిగా సేవ చేయవలె. వారు జీతభత్యాలు లేని ఉద్యోగులు.

*న్యాయాధికారాలు:* 1. ఆజ్ఞలను పాటించనివారిని, పన్నులను ఎగవేసిన వారిని ధరలను పెంచి ఎక్కువ లాభాలు గణించువారిని, నేరస్థులను శిక్షించటం. 2. ప్రొటె స్టెంట్ చర్చికి వెళ్ళనివారిపైన జరిమాన విధించటం. 3. అల్లర్లు చెలరేగకుండా చూడటం. 4. యాచకులు తమ అనుమతిలేనిదే యాచన చేయనివ్వకుండటం. 5. తిరుగుబోతులను స్వాధీనపరచుకొనటం.

వాస్తవానికి కౌంటీల పరిపాలనలో ఈ శాంతిస్థాపక న్యాయమూర్తులకు సంబంధించని విషయమే లేదు. అందుచేతనే వీరికి ట్యూడర్‌లకు సర్వసేవ చేసే చెలియలు (Tudor maids of all work) అని మారుపేరు ఉంది. ఒక్కమాటలో చెప్పవలెనంటే పూర్వపు పట్టణ సభలు, ఫ్యూడల్ కోర్టులుచేసే పనులన్నిటినీ, ఈ శాంతిస్థాపక న్యాయమూర్తులు చేసే వారు. ఇందువలన షెరీఫ్‌లు కోర్టు తీర్పులు మాత్రమే అమలుజరిపే అమీనులైనారు. శాంతి స్థాపక న్యాయమూర్తులకు లభించిన పై ప్రాముఖ్యము 1888 లో స్థానిక పరిపాలనా చట్టం జరిగేవరకు నిలిచి ఉంది.

ట్యూడర్‌ల కాలంలో స్థానిక పరిపాలనా వ్యవస్థలో పారిష్ సభ పూర్వం పట్టణసమితి స్థానంలోకి వచ్చింది పారిష్ చర్చి పరిపాలనాంగాలలో అట్టడుగున ఉన్న సంస్థ. పారిష్ పరిధి పట్టణ పరిధితో సమానమై ఉండేది. పారిష్‌సభ చర్చి వ్యవహారాలు చూడటంతోబాటు

పట్టణ పరిపాలనకు బాధ్యత వహించటంతో ఎంతో ప్రాముఖ్యంగల వ్యవస్థగా రూపొందింది. దీనితో ట్యూడర్‌ల కాలంలో ప్రప్రథమంగా రూపొందిన బీదలకు న్యాయం కలిగించే విధానాన్ని నిర్వహించే బాధ్యతకూడా పారిష్‌దే అయింది. పట్టణ పరిపాలనకు బాధ్యత వహించటంతో బాటు, ప్రజల ఆధ్యాత్మిక జీవనం, శాంతిభద్రతలు కాపాడటంతో ఎంతో ప్రాముఖ్యం గల వ్యవస్థగా రూపొందింది.

ఈ బాధ్యతా నిర్వహణకోసం చర్చి ఉద్యోగులైన పార్సన్, వార్డన్‌లు బీదల సహాయ నిధిని వసూలు చేయవలసి వచ్చింది. ఎలిజబెత్ రాణి 1601 లో చేసిన చట్టాన్ననుసరించి బీదల నుద్ధరించే కార్యక్రమాన్నంతా పారిష్‌సభ నిర్వహించవలసి వచ్చింది. దాని ఆధ్వర్యంలో బీదల పర్యవేక్షకులు (overseers of the poor) అనే ఇద్దరు ఉద్యోగులు నియమితులయినారు. బీదల సహాయానికి ఒక్కొక్క గృహస్థుడు చెల్లించవలసిన 'రేటు'ను నిర్ణయించి వసూలైన ధనాన్ని అంగవికలులను, వృద్ధులైన బీదలను 'బీదల గృహా' లందించి పోషించటం ఆ పర్యవేక్షకుల ముఖ్యధర్మము. ఇంకా వీరు పనిచేయడానికి దేహదార్ఢ్యమున్న వారికి కావలసిన పనిముట్లు, ముడి వస్తువులు సరఫరా చేయవలసి ఉంది. ఈ 'బీదల శాసనము' (Poor Law) అమలు జరపటంలో మంచితోబాటు కీడు కూడ ఉంది. అభిమానము అడ్డువచ్చి 'బీదల శాసనం' వల్ల లభించే సహాయాన్ని తీసుకోవడానికి జంకినవారందరూ సంపన్నులుగా పరిగణితులయి బీదల సహాయానికి రేటు చెల్లించవలసి వచ్చింది. ఇక 'బీదల గృహాల'లోను వారి కార్ఖానాలలోను పరిస్థితులు వాతావరణము ఎంత దారుణంగా ఉండేవో ఛార్లెస్‌డికిన్స్ వ్రాసిన ఆలివర్‌ట్విస్ట్ అనే నవలను చదివితే సులభంగా గ్రహించవచ్చు. ఆనాటి నుంచి ఈనాటి వరకు పారిష్ సభ (vestry) స్థానిక పరిపాలనలో విశేషపాత్రను నిర్వహిస్తున్నది.

*పట్టణ పరిపాలన:* పరిశ్రమలకు, వాణిజ్యానికి కేంద్రాలైన పట్టణాలూ కొన్ని రేవు పట్టణాలూ విశేషసంపదలకు నిలయాలు కావటంతో పట్టణ లేదా బరోకౌన్సిల్ సభ్యత్వానికి హెచ్చురేట్లు చెల్లించవలసి వచ్చింది. దానితో ఆ సభ్యత్వము అత్యంత ధనికులైన వారి గుత్త అయింది. పట్టణంలోని వృత్తులను తమకు, తమ కుటుంబంవారికి మాత్రమే నిల్పుకొనే ఉద్దేశంతో బయటి ఊళ్ళనుంచి వచ్చినవారు పట్టణపు ఎల్లలో తమ వృత్తిని సాగించడాన్ని కౌన్సిల్‌వారు నిషేధించటం పరిపాటి అయింది. స్వతంత్రంగా వృత్తిని సాగించగోరేవారు ఏడేండ్లకాలం అంతే వాసులుగా గడిపి మరికొన్ని ఏండ్లు ఊళ్లు తిరుగుతూ వస్తు విక్రేతలు (journeymen) గా చేయవలసి వచ్చింది. క్రమేణ నగరపాలక సంఘ సభ్యులను ఎన్నుకొనే హక్కు శ్రీమంతుల హస్తగతమయింది. ఈ హక్కుదారులకే పార్లమెంట్ సభ్యులను ఎన్నుకొనే హక్కుకూడ పరిమితమయింది. ఒక్కొక్కప్పుడు నగరవాసులు కౌంటీలలోని భూస్వాములను తమ ప్రతినిధులుగా పార్లమెంట్‌కు ఎన్నుకొనడం జరిగేది. 1832 లో పార్లమెంటరీ సంస్కరణ చట్టము (Reform Act of 1832), 1835 లో మునిసిపల్ కార్పొరేషన్‌ల చట్టము జారీ అయ్యేటంతవరకూ పట్టణాలలోని అధిక సంఖ్యాకులు మునిసిపల్, పార్లమెంట్ ఎన్నికలలో వోటుచేయలేని దుస్థితిలోనే ఉన్నారు.

స్థానిక సంస్థలపై ప్రీవీ కౌన్సిల్‌కు శాంతి స్థాపక న్యాయమూర్తులకు అధికారాలు ఉన్నాయి. ప్రీవీ కౌన్సిల్ స్థానిక పరిపాలనను సక్రమపద్ధతిలో ఉంచుతుంది. షెరీఫ్‌లు,

శాంతిస్థాపక న్యాయమూర్తులు, మేయర్లపై ఉన్న ఫిర్యాదులను విచారిస్తుంది. వారి ఎన్నిక, వారిని పదవులనుంచి తొలగించే విషయాలను పరిశీలిస్తుంది. కౌంటీల ఉద్యోగులలో ఉన్న తగవులను కూడ విచారిస్తుంది. శాంతిస్థాపక న్యాయమూర్తులు స్థానిక సంస్థలను పర్యవేక్షణ చేస్తారు.

*ప్రొటెస్టెంట్ సంస్కరణోద్యమము: రాజ్యాంగంలో మార్పులు:* ఇంగ్లీష్ చర్చిపై రోమన్ పోప్‌ల ఆధిపత్యాన్ని తొలగించడానికి ప్లాంటాజనెట్ రాజులు చేసిన ప్రయత్నాలు విఫలమైన తరవాత 1529 వరకు చర్చి వ్యవహారాలు యథాపూర్వకంగానే సాగుతున్నాయి. చర్చిని సంస్కరించడానికి 1529 లో పార్లమెంట్ సమావేశమయింది. ఆ పార్లమెంట్ 1536 వరకు సమావేశమై చర్చిలో చాలా మార్పులను చేసింది. ఈ పార్లమెంట్‌ను సమావేశపరిచిన ఎనిమిదో హెన్రీ ప్రజల మత విశ్వాసాలలోను, పూజా విధానాలలోను మార్పులు తేవలెనని అంతగా కాంక్షించలేదు. కాని ఇంగ్లీష్ చర్చి పరిపాలనలో రోమన్‌పోప్‌కున్న స్థానము ఇంగ్లండ్ రాజుకు సంక్రమింపజేయడానికి అతడు ధృడనిశ్చయుడయినాడు. ఈ విషయంలో అతని కృషివల్ల పార్లమెంట్ చేసిన చట్టాల ఫలితంగా రాజ్యంలో రాజు అధికారము ద్విగుణీకృతమయింది. రాజు ఆదాయము కూడా బాగా పెరిగింది. విదేశీయులకు, ముఖ్యంగా ఇటాలియన్‌లకు ఆంగ్లేయుల జీవితాలపై పెత్తనము పోయింది. ఈ పరిణామము ఆంగ్లేయుల జాతీయతా భావానికి అఖండవిజయమని పరిగణింపవచ్చు. ఈ విజయము జాతీయైక్యానికి ఎంతగానో తోడ్పడింది. రాజాదాయం పెరగడంచేత ఆర్థిక విషయాలలో రాజు పార్లమెంట్‌పై ఆధారపడవలసిన అవసరం తగ్గిపోయింది. ఈ విధంగా మతసంస్కరణ ట్యూడర్‌ల నిరంకుశ పరిపాలనకు దోహదమిచ్చింది. చర్చి పాలనా యంత్రాంగంలో వచ్చిన మార్పులు క్రమేణ మతవిధానంలోను, విశ్వాసాలలోను కూడా చాలా మార్పులకు దారి తీసినాయి. మతసంస్కరణ విషయంలో ఎనిమిదో హెన్రీ, ఎలిజబెత్ రాణి ఇద్దరూ ఒక్క విషయంలో గట్టి పట్టుదల వహించినారు. అది ఏ మార్పులు వచ్చినా దేశప్రజలందరూ ఒకే మార్గాన నడవవలెనని, లేకపోతే దేశంలో శాంతిభద్రతలు కరువవుతాయని వారి భయము. అందుచేతనే వారు చేసిన మార్పులు ఏ తీవ్రవాదానికి సంబంధించినా లేకపోయినా వారు మార్పులు చేయడంలో మధ్యమార్గాన్నే అనుసరించినా తమ మార్గాన్ని అనుసరించి చేసిన మార్పులను ఎవరెదిరించినా కఠినంగా శిక్షించినారు. ఎనిమిదో హెన్రీ తన ఇష్టుడైన క్రాన్‌మర్ (Cranmer) ను కాంటరిబరీ అర్చ్‌బిషప్‌గా నియమించి, కాథరిన్‌కు విడాకులిచ్చి, ఆన్‌బోలీన్‌ను వివాహమాడినాడు. చర్చికి తానే సర్వాధికారియని ప్రకటించినాడు. పై విషయాలలో అతడు పార్లమెంట్ సహకారం పొందినాడు.

## మత సంస్కరణ పార్లమెంట్ (Reformation Parliament) 1529–36

ఈ పార్లమెంట్ చేసిన సంస్కరణలలోని ముఖ్యాంశాలు క్రింది విధంగా ఉన్నాయి :

(1) ఒక వ్యక్తి ఒకటికన్న ఎక్కువ చర్చి ఉద్యోగాలకు నియమతుడు కారాదు. తాను ఎక్కడ ఉద్యోగిగా నియమితుడవుతాడో ఆ ప్రాంతంలోనే అతడు నివసించవలె. మతాధికారులెవ్వరు వ్యవసాయంగాని వ్యాపారంగాని చేయకూడదు. ఈ నియమాల ఫలితంగా

సామాన్య చర్చి ఉద్యోగుల సమావేశము (Convocation) పై రాజుకు పెత్తనం లభించింది (1529).

(2) హెన్రీ కాథరీన్ విడాకుల వ్యాజ్యాన్ని విచారించే కోర్టులో జడ్జిగా వుల్సీని పోప్ నియమించినాడు. ఆ నియామకాన్ని అంగీకరించడం ప్రిమునైర్ చట్టానికి విరుద్ధమని వుల్సీని విచారణకు తేవటమేగాక, ఆ నియామకాన్ని ఆమోదించిన నేరానికి చర్చి కాన్వొకేషన్‌లపై అపరాధ రుసుములను విధించినాడు.

(3) ఇంగ్లీషు చర్చి ఉద్యోగులు ఏటేటా పోప్‌కు చెల్లించే పన్నులు నిలిపివేయడమయింది. బిషప్ పదవికి నియమితుడైనవాడు, ఆ నియామకానికి పోప్ అనుమతివ్వటంలో ఆలస్యమయినా అభిషిక్తుడు కావచ్చు (1531-32)

(4) ఇంగ్లండ్ చర్చి కోర్టులనుంచి పోప్ న్యాయస్థానానికి అప్పీళ్ళు తీసుకొనిపోరాదు. వీలునామాలు, వివాహము, వివాహ విభేదాలు ఇకపై రాజు న్యాయస్థానంలోనే పరిష్కారం కావలె. అప్పీళ్ళు ఒకచర్చి కోర్టునుంచి పైచర్చి కోర్టుకు, ఆర్చిబిషప్ కోర్టునుంచి కాన్వొకేషన్ సభకు పంపడం మానవలె (1532-33).

(5) ఆర్చిబిషప్ కోర్టు తీర్పుపై అప్పీళ్ళు వినడానికి కమిషనర్‌లను నియమించినారు. ఏటేటా పోప్‌కు పన్నులు చెల్లించరాదని పునరుద్ఘాటించడమయింది 'పీటర్స్ పెన్నీలు' పోప్‌కు చెల్లించరాదు. పోప్ ఇచ్చే లైసెన్సులు, చర్చి నేరాలనుంచి క్షమాపణలు చెల్ల నేరవు. ఎనిమిదో హెన్రీ మొదటి వివాహము చెల్లదని, అతని రెండో భార్య ఆనిబొలీన్ కుమార్తె ఎలిజబెత్ హెన్రీ తరవాత రాజ్యానికి వారసురాలని శాసనమయింది. చర్చిపై రాజు సర్వాధికారి అని చర్చి ఉద్యోగులు ప్రమాణాలు చేయవలె అట్లా ప్రమాణ స్వీకారం చేయనిరాకరించినందుకు మోర్ ఫిషర్ అనే చర్చి ఉన్నతోద్యోగిపై రాజద్రోహ నేరం మోపి మరణశిక్ష విధించినాడు.

(6) చర్చి సర్వాధికార శాసనము (Act of Supremacy) కాథరిన్‌తో హెన్రీ వివాహాన్ని రద్దుచేయడానికి పోప్ నిరాకరించగా ఈ శాసనం (1534) చేయడమయింది. దాని సారాంశము ఇంగ్లీషు చర్చికి ఇంగ్లండ్ రాజే పరమోన్నతాధికారి. దానిని సంస్కరించడానికి, దానికి విరుద్ధమైన విశ్వాసాలను అణిచివేయడానికి రాజే అధికారి. అతని ఉన్నతాధికారాన్ని అంగీకరిస్తూ ప్రతి చర్చి ఉద్యోగి ప్రమాణంచేయవలె. తన ఉద్యోగంవల్ల లభించే మొదటి సంవత్సరపు ఆదాయంలో పదోవంతు ఇకనుంచి రాజుకే చెల్లించవలె.

(7) రెండువందల పౌన్‌లకు మించిన ఆదాయంగల మఠాలు ఎత్తివేయడమయింది. వాటి ఆస్తి సర్వము రాజుకు చెందేటట్లు 1535-36 లో ఒక శాసనం జారీ అయింది. దానిని ప్రతిఘటిస్తూ ఒక తిరుగుబాటు (Pilgrimage of Grace) జరిగింది. దానిని అణిచివేయడమేగాక మిగిలిన మఠాలనన్నిటిని కూడా ఎత్తివేస్తూ వాటి ఆస్తులు సంపూర్ణంగా రాజుకు, అతని వారసులకు సంక్రమింపజేస్తూ చట్టం చేయడమయింది ఈ విధంగా సంక్రమించిన ఆస్తిపాస్తులలో అధికభాగము ప్రభువులకు పంచిపెట్టడమయింది. అదే ఆధారంగా కొత్త ప్రభు పదవులు సృష్టి అయినాయి. సహజంగా ఈ కొత్త ప్రభువులు మత విప్లవానికి అచంచల పక్షపాతులయినారు. రాజుకు నమ్మినబంటులు అయినారు.

ఆరు ప్రకరణాల శాసనము (Act of Six Articles): ఈ చట్టము మత విశ్వాసాలతో కొన్ని మార్పులను చేసింది. ఆ మార్పు లేమంటే: 1. రొట్టె, ద్రాక్షరసము జీసస్ రక్తమాంసాలుగా మారుతాయి. 2. కాథలిక్ మతాచార్యులు అవివాహితులుగా ఉండవలె. 3. కాథలిక్కులు జీవితంలో తాము చేసిన పాపాలను ఒప్పుకుంటూ మరణసమయంలో మతాచార్యుల చెవిలో రహస్యంగా చెప్పవలె. 4. కాథలిక్ మతాచార్యులు ప్రైవేటుగా దైవపూజను జరిపించుకొనవచ్చు. 5. కాథలిక్ మతాచార్యులు శాశ్వతంగా నీతి నియమాలతో కూడిన జీవితం గడిపెదమని ప్రతిజ్ఞ చేయవలె. 6. కాథలిక్కులు తీసుకొనే రొట్టె జీసస్ రక్తమాంసాలుగా మారుతాయని విశ్వాసముండటం. వీటితోబాటు ఇంగ్లండ్‌లోని చర్చీలన్నింటిలోను ఇంగ్లీష్ భాషలోకి తర్జుమాచేసి బైబిల్ ప్రతులనే ఉపయోగించవలెనని తీర్మానం చేయడమయింది. చర్చీలలో ప్రార్థనలు లాటిన్‌కు బదులు ఇంగ్లీష్‌లో జరగడం ఆంగ్లేయులలో దినదనాభివృద్ధి చెందుతున్న జాతీయతాభావాని కొక ప్రతీక.

ఆరో ఎడ్వర్డ్ రాజ్యకాలంలో 1548 లో ఇంగ్లీష్ ప్రథమ ప్రార్థనా గ్రంథము (The first prayer book) వెలువడింది. దాన్ని అన్ని ప్రార్థనా మందిరాలలోను ఏకరూపంలో వాడవలెనని ఒకటి రెండు పర్యాయాలు పార్లమెంట్ శాసనాలను చేసింది. (Acts of uniformity). ఆ ప్రార్థనా గ్రంథము 1552 లో సవరణలతో ముద్రితమయింది ఆరో ఎడ్వర్డ్ తన తండ్రి ప్రవేశపెట్టిన ఆరు ప్రకరణాల చట్టాన్ని, క్రైస్తవ చర్చి సంస్కారణాలను రద్దుచేసి, 42 ప్రకరణాల చట్టాన్ని (Forty two articles of Faith) ప్రవేశపెట్టి ఇంగ్లాండ్ దేశంలో ప్రొటెస్టెంట్ మతాన్ని స్థాపించినాడు.

ఎనిమిదో హెన్రీ - కాథరిన్‌ల పుత్రిక మేరి (1553-58) రాణి. ఈమె కాథలిక్ మతాన్ని అవలంబించడమే కాక ఇంగ్లాండ్‌లో ఆ మతాన్ని పునరుద్ధరించడానికి శాయశక్తులా కృషి చేసినాడు. స్పెయిన్ రాజైన రెండో ఫిలిప్‌ను వివాహమాడి కాథలిక్ మతాన్ని ఐరోపాలో వ్యాప్తిచేయటానికి పాటుపడనాడు. తన తండ్రి (ఎనిమిదో హెన్రీ), సోదరుడు (ఆరో ఎడ్వర్డ్) ప్రొటెస్టెంట్ మతాన్ని పెంపొందించడానికి అమలుజరిపిన చట్టాల నన్నింటిని రద్దుచేయించి దేశంలో పోప్ అధికారాన్ని తిరిగి స్థాపించినాడు. ఇంగ్లీషు ప్రార్థనాగ్రంథాన్ని నిషేధించినాడు. ప్రొటెస్టెంట్ బిషప్పులను పదవులనుంచి తొలగించి కాథలిక్ బిషప్పులను నియమించినాడు. ఆరు ప్రకరణాలను తిరిగి ప్రవేశపెట్టినాడు కాథలిక్ సిద్ధాంతాలను వ్యతిరేకించిన 300 ప్రొటెస్టెంట్ మతస్థులను నిర్దాక్షిణ్యంగా చంపించినాడు. ఈ హింసకు గురిఅయిన వారిలో కాంటర్‌బరీ ఆర్చిబిషప్ అయిన క్రాన్‌మర్ ఒకడు. ప్రొటెస్టెంట్‌లను రాజద్రోహులుగా, రాజ్య శత్రువులుగా పరిగణించినాడు. ఇందువలన ఈమెకు "రక్తపిపాసి" లేక "రుధిర ప్రియ" అనే పేర్లు వచ్చినాయి (Bloody Mary). ఇటువంటి కాథలిక్ మత విధానంవలన ప్రొటెస్టెంట్ మతం క్షీణించకపోగా మరింత పురోగమించింది.

## ఎలిజబెత్‌రాణి కాలంలో మతసంస్కరణ

క్రీ శ. 1558 లో ఎలిజబెత్ ఇంగ్లండ్‌రాణి అయింది. మరుసటి సంవత్సరమే మేరీ రాణి కాలంలో జరిగిన మార్పులను రద్దుచేస్తూ ఎనిమిదో హెన్రీ కాలంలో చేసిన మార్పులను పునరుద్ధరిస్తూ సర్వాధికార చట్టమొకటి జారీ అయింది. ఇది ఇంగ్లండ్ చర్చిపై విదేశీయుల

కెట్లాంటి అధికారం లేదని, క్రితంలో విదేశీయులు అనుభవించిన అధికారాలు, హోదాలు, ఆదాయాలు ఇకపై ఇంగ్లండ్ రాణికే చెందవలెనని నిర్ణయించింది. చర్చి ఉద్యోగులు, న్యాయాధిపతులు, ఇతర ప్రభుత్వోద్యోగులు రాణియే చర్చికి పరమోన్నతాధికారిణి అని ప్రమాణాలు చేయవలెనని కూడా నిర్ణయమయింది. చర్చిపై తన అధికారాన్ని నిర్వహించ డానికి రాణి కమిషనర్‌లను నియమించవచ్చు. ఇదే సంవత్సరంలో ఏకరూపశాసనము (Act of Uniformity) చర్చి ఉద్యోగులు సంస్కరించిన ప్రార్థనాదికాలను, బైబిల్‌ను, ప్రార్థనా గ్రంథాలను అనుసరించవలెనని శాసించింది. అట్లా చేయకపోతే మొదటి సంవత్సరం ఆ నేరానికి ఆస్తి జప్తు, రెండో సంవత్సరం ఖైదు, మూడో సంవత్సరం యావజ్జీవ కారాగార శిక్ష అని నిర్ణయించింది 1562 లో ఆక్స్‌ఫర్డ్ కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయాల పట్టభద్రులు, కామన్స్ సభ సభ్యులు, న్యాయవాదులు చర్చిపై రాణియే ఉన్నతాధికారిణి అని ప్రమాణం చేయవలెననే శాసనమయింది. మరుసటి సంవత్సరం మతవిధాన సూత్రాలు మునపటి 42 నుంచి 39 కి తగ్గించడమయింది. ఇంకా చర్చిపై ఉన్నతాధికారిణి రాణి అని ఉపాధ్యాయు లందరూ ప్రమాణం చేయవలెననే ఆజ్ఞ జారీ అయింది. ప్రభుత్వము నిర్ణయించిన నూతన మత విధానాన్ని అంగీకరించని కాథలిక్కులు కొద్దిపాటి జుర్మానాను చెల్లించి తమ ఇష్టాను సారము ప్రార్థనాదికాలు జరిపించుకొనవచ్చునని కూడ శాసించడమయింది.

**హైకమిషన్ కోర్టు:** 1559 పార్లమెంట్ చట్టము తన కిచ్చిన అధికారాన్నిబట్టి ఎలిజ జెత్ రాణి ప్రభుత్వ మత విధానాన్ని అమలుపరచటానికి 1588 లో మత సంబంధిగా హై కమిషన్ కోర్టును (The Court of Ecclesiastical High Commission) ఏర్ప రచినాడు. ఈ విధంగా ఎనిమిదో హెన్రీ ఆన్‌బొలీన్‌ల ఏకైక పుత్రిక అయిన ఎలిజబెత్ మహారాణి విజ్ఞతతో తీవ్రమైన కాథలిక్ మతాన్ని తీవ్రమైన ప్రొటెస్టెంట్ మతాన్ని సమ న్వయ పరచి ఇంగ్లాండ్‌లో మతశాంతిని నెలకొల్పింది. ఈమె కాలంలో ప్రొటెస్టెంట్ మతము మూడు పూవులు ఆరుకాయలుగా విజృంభించింది.

# 4

# తొలి స్టూవర్టుల కాలంలో రాజ్యాంగ పరిణామము

**(క్రీ. శ. 1603–1649)**

### స్టూవర్టు రాజులు - ఉపోద్ఘాతము

ఎలిజబెత్ రాణి మరణించిన తరవాత ఇంగ్లాండ్ దేశమును స్టూవర్ట్ వంశ రాజులు పరిపాలించినారు. ఈ వంశానికి చెందినవారు మొదటి జేమ్స్, మొదటి ఛార్లెస్, రెండో ఛార్లెస్, రెండో జేమ్స్. వీరు క్రీ. శ. 1603 నుంచి 1688 వరకు పాలించినారు. మొదటి జేమ్స్ స్కాట్లండ్ దేశపు మేరిరాణి, డన్లీ (Dunly) ల కుమారుడు; ఎనిమిదో హెన్రీ కుమార్తె అయిన మార్గరెట్ మునిమనుమడు జేమ్స్ కుమారుడు మొదటి చార్లెస్. మొదటి ఛార్లెస్ (1625-49) కుమారులు రెండో ఛార్లెస్ (1660-85) రెండో జేమ్స్ (1685-88). ఈ స్టూవర్ట్ రాజ వంశీయులు ఇంగ్లాండ్, స్కాట్లండ్ దేశాలను కలిపి పాలించినారు. వీరి పరిపాలనా కాలానికి ఆంగ్లేయ చరిత్రలో "స్టూవర్ట్ యుగమని" పేరు.

మొదటి జేమ్స్ విద్యావంతుడు. దైవాంశ సంభూత సిద్ధాంతం ప్రవేశపెట్టి రాజే సర్వాధికారియని ప్రవచించినాడు. కాని ఇతనికి "క్రైస్తవ ప్రపంచమున తెలివైన మూర్ఖుడు" (Wisest fool of Christendon) అని బిరుదు ఉంది. ఇతని కుమారుడు మొదటి ఛార్లెస్. ఇతడు తెలివితక్కువవాడు; చాలా పిరికివాడు; గర్విష్ఠి; మూర్ఖుడు; నీతి నియమాలు లేనివాడు. మంత్రివర్గంలో విశ్వాసంలేనివాడు. తండ్రివలె దైవాంశ సంభూత సిద్ధాంతాన్ని అమలుపరిచినాడు. ఇంగ్లాండ్ దేశాన్ని పాలించిన రాజులలోకెల్ల ఇంతటి దురదృష్టవంతుడు మరొకడు లేడు. ఇతని కుమారుడు రెండో ఛార్లెస్, రెండో ఛార్లెస్ 1660 లో సింహాసన మధిష్టించటంతో ఇంగ్లాండ్‌లో రాజరిక పునః ప్రతిష్ఠాపన (Restoration) జరిగింది ఇతని సోదరుడు రెండో జేమ్స్ నిరంకుశుడు; మూర్ఖుడు; దూరదృష్టి లేనివాడు; సంకుచిత భావాలు కలవాడు.

స్టూవర్ట్‌యుగంలో దేశపరిపాలనలో తమకు గల స్థానం గురించి స్టూవర్ట్ రాజులకు పార్లమెంట్‌కు మధ్య తీవ్ర వివాదమేర్పడింది. దేశమందు సంభవించిన మార్పులను గుర్తింపక స్టూవర్ట్ రాజులు మూర్ఖంగాను, నిరంకుశలుగాను ప్రవర్తించినారు. వీరికి రాజున కుండవలసిన సద్గుణాలు లేవు. పార్లమెంట్ హక్కులను తిరస్కరించి, ఆ సభను అవమాన పరచి దేశపరిపాలన, మత, విదేశీ విషయాలలో ప్రజాభిప్రాయానికి విరుద్ధంగానడచినారు. మొదటి ఛార్లెస్ పార్లమెంటును సమావేశపరచకయే పదునొకండు సంవత్సరాలు (Eleven years of tyranny) నిరంకుశుడుగా పాలించినాడు. చివరకు 1642-48 సంవత్సరాల మధ్య రాజుకు పార్లమెంట్‌కు జరిగిన అంతర్యుద్ధంలో పార్లమెంట్ పక్షానికి

విజయం లభించింది. మొదటి ఛార్లెస్‌ను 1649 లో ఉరితీయడం జరిగింది. అటుపిమ్మట మరి కొంత కాలానికి రెండో జేమ్స్ సింహాసనానికి వచ్చి పార్లమెంట్‌వారి అభిప్రాయాలకు విరుద్ధంగా నడచుటవలన రాజ్య భ్రష్టుడయినాడు. ఈ విధంగా 85 సంవత్సరాల కాలంలో తీవ్రవాదాలు చెలరేగి తుదకు పార్లమెంట్‌కే ఆంగ్లరాజ్య పరిపాలనలో సర్వాధికారాలు లభించినాయి. స్టూవర్ట్ రాజుల చరిత్రను ఆంగ్లేయ చరిత్రలో ఒక ముఖ్య ఘట్టంగా పరిగణించవచ్చు.

రెండో జేమ్స్ పదవీభ్రష్టుడైన తరవాత, పార్లమెంట్ ఆరెంజి రాకుమారుడు మూడవ విలియం, (William III, Prince of Orange) అతని భార్య మేరి (రెండో జేమ్స్ కుమార్తె) లను 1689 లో బ్రిటిష సింహాసనం అధిష్టించి, ఆంగ్లేయదేశాన్ని పరిపాలించ టానికి ఆహ్వానించింది.

### రాజు - పార్లమెంట్‌ల వివాదస్వరూపము, కారణాలు

ట్యూడర్ యుగాంతానికి పార్లమెంట్, దేశ పరిపాలనలో సాధించిన ప్రముఖస్థానాన్ని గురించి 1589 లో సర్ థామస్ స్మిత్ ఇంగ్లండ్‌లోని కామన్‌వెల్త్ (Commonwealth of England) అనే గ్రంథంలో ఇట్లా వివరించినాడు: "ఈ రాజ్యంలో సంపూర్ణ పరిపాలనాధికారం పార్లమెంట్‌కే ఉన్నది. దాని అంగీకారంతో చేసేదే స్థిరమైనది - అదే శాసనము, అదే ధర్మము. లోగడ చట్టాలను రద్దుచేసేది, లేదా అమలుపరచేది, కొత్త శాసనాలను చేసేది, వ్యక్తుల హక్కులనూ, ఆస్తులనూ మార్చేది, మత విధానాలను స్థాపించేది, తూనికలు, కొలతలు మార్పు చేసేది, హక్కుల విషయమైన సందేహాలను తీర్చేది, రాజ్య వారసత్వం నిర్ణయించేది, పన్నులను, సుంకాలను విధించేది, రాజు విచారణకు తెచ్చే నేరస్థులను శిక్షించేది, క్షమించేది ఆ పార్లమెంటే. ఒక్క మాటలో చెప్పవలెనంటె 'శతానికాల సభ' (కమీషియా సెంటూరియాటా), 'జాతుల సభ' (ట్రైబ్యూటా) కూడ ప్రాచీన రోమ్‌లో ఏమేమి చేయగలిగి ఉండేవో అదంతా ఇంగ్లండ్ ప్రజలందరికి ప్రాతినిధ్యం వహించి అందుల అధికారాన్ని పుంజుకొని ఉన్న పార్లమెంట్ చేయగలిగి ఉండేది. ఆ పార్లమెంట్‌లో రాజునుంచి పేదవరకు అందరూ స్వయంగా గాని, ప్రతినిధుల రూపంలోగాని సమావేశమై ఉన్నట్లే. పార్లమెంట్ అంగీకరించేది ప్రతి ఒక్కడు అంగీకరించినట్లే". సర్ థామస్ స్మిత్ వర్ణన సారాంశము సభాగతుడైన రాజుకు (King in Parliament) మించిన పరిపాలకుడు, శాసనకర్త, న్యాయాధికారి లేడని.

కాని ఇంగ్లండ్‌లో శతాబ్దులుగా సభాగతుడైన రాజేగాక పార్లమెంట్‌తో ఎటువంటి ప్రసక్తిలేక, దానికి సమాంతరంగానే కాక, దానికి మించి సర్వం సహాధికారి అయిన రాజూ ఉండేవాడనేమాట మరువరాదు. బలవంతులు, ప్రతిభావంతులు అయిన రాజులు పాలించినప్పుడు పార్లమెంట్ తలవంచి ఉండటం, బలహీనులు రాజులయినప్పుడు వారిని తన ఇష్టం వచ్చినట్లు పార్లమెంట్ ఆడించటం తెలిసిన విషయమే. ఉదాహరణకు రెండో రిచర్డ్ పార్లమెంట్‌ను లెక్కచేయక రాచరికపు ప్రత్యేకాధికారాలు చెలాయించటం, ప్రత్యేక ఆదాయాలు రాబట్టటం, లెంకాస్ట్రియన్‌ల కాలంలో పన్నులు విధించటంలోను, శాసనాలు చేయటంలోను, మంత్రులను కట్టడి చేయటంలోను, పార్లమెంట్ విశేషాధికారాన్ని చెలాయించటం, యార్కిస్ట్,

ట్యూడర్ పాలకులు ఒకవైపు పార్లమెంట్ అధికారాన్ని కాదనకుండా మరొకవైపు తమ విశేష రాజాధికారాలను (Royal Prerogatives) ఉపయోగించటం పేర్కొనవచ్చు.

## స్టూవర్ట్ వంశము




తాము నిరంకుశలుగా ప్రవర్తించినప్పుడు కూడా ట్యూడర్లు తమ చర్యలకు పార్లమెంట్ ఆమోద ముద్రను సంపాదించుకొనేవారు. మొదటి విలియమ్, మొదటి ఇద్దరు హెన్రీలు,

మొదటి ఎడ్వర్డ్ ఇంకా లెంకాస్ట్రియన్ పార్లమెంట్‌లు ఇంగ్లీష్ చర్చిపై రోమన్ పోప్‌ల ఆధిపత్యాన్ని తగ్గించడానికి ఎంతో ప్రయత్నించడమయింది. కాని ఎనిమిదో హెన్రీ చేసిన మత సంస్కరణ అంతటి మార్పు తీసుకొనిరాలేదు. మత విషయంలో ఏకరూప చట్టము (Act of uniformity), సర్వాధికార శాసనాల (Act of supremacy) ఫలితంగా ఇంగ్లండ్ ప్రజల మత జీవితంపైన ఇంగ్లీష్ చర్చి ఉద్యోగులపైన, ఆదాయాలపైన, క్రైస్తవ మతాలన్నింటిపైన పోప్‌లు చెలాయిస్తున్న ఆధిపత్యము, వాటినుంచి అనుభవిస్తున్న ఆదాయము సర్వం ట్యూడర్‌ల హస్తగతమయినాయి ఇది అంతా పార్లమెంట్ అంగీకారంతోనే జరిగింది. అందుకు రెండు ముఖ్య కారణాలు ఆ కాలంలో మత విషయకమైన పట్టుదలలు అంతగా లేకపోవడం, ప్రజలలో ప్రజ్వరిల్లుతున్న జాతీయతా భావము కారణాలేమైనా ఆ సంస్కరణల ఫలితంగా రాజుల అధికారము బహుళంగా విస్తరించింది. రాజుల ఆగ్రహానికి గురిఅయిన వారిని అటెయిండర్ బిల్లుల (Bills of attainder) ద్వారా పార్లమెంట్ శిక్షించేవి. ట్యూడర్లు తమ నిరంకుశ చర్యలన్నింటిపైన పార్లమెంట్‌చే ఆమోదముద్ర వేయించడంచేత స్టూవర్ట్ రాజుల కాలంలో పార్లమెంట్ ఆ అధికారాలన్నీ వాస్తవానికి తమవేనని వాదించడానికి అవకాశమేర్పడింది. అదే విధంగా స్టూవర్ట్ రాజులు తాము చెలాయించదలచిన విశేషాధికారాలు, వసూలుచేయదలచిన పన్నులు, సుంకాలు, నిర్బంధ ఋణాలు మొదలైనవి ట్యూడర్‌ల కాలంలో రాజులు చెలాయించినవే, వసూలుచేసినవేనని వాదించడానికి కూడా వీలుపడింది. కాని స్టూవర్ట్ రాజులు గమనించని సత్యమొకటుంది. ట్యూడర్ రాజుల విషయంలో వారి కోరికలకు, పార్లమెంట్ అభిప్రాయాలకు మధ్య గొప్ప వైరుధ్యం లేకుండేది. కాని స్టూవర్ట్ల విషయంలో వారి కోరికలకు, పార్లమెంట్ ఆశయాలకు మధ్య ఎప్పుడూ సామరస్యం కుదరలేదు.

ట్యూడర్ రాజులు ప్రజలపై కాథలిక్ మతాన్ని రుద్దినా ప్రొటిస్టంట్ విధానాలను రుద్దినా వారి పార్లమెంట్‌లు ఉదాసీన భావంతో ఉండేవి. కాని స్టూవర్ట్ పార్లమెంట్ సభ్యులలో సామాన్యంగా అధిక సంఖ్యాకులు అతివాద ప్రొటస్టంట్‌లు. స్టూవర్ట్ రాజులు మాత్రం ఇంగ్లండ్ చర్చి అనుసరించే సౌమ్యవిధానమే - అతివాద ప్రొటిస్టంట్‌లకు, అతివాద కేథలిక్కులకు మధ్యే మార్గము—వాంఛనీయము అని పట్టుదల వహించినారు. ట్యూడర్ పార్లమెంట్‌లకు రాజులను ధిక్కరించవలెననే యోచనే లేకుండేది. పై పెచ్చు పార్లమెంట్‌ను సంప్రదించకుండానే కొన్ని విషయాలలో రాజులు స్వతంత్రంగా వ్యవహరించవచ్చునని కూడా అభిప్రాయపడినారు. రాజు స్వతంత్రాధికారము, సభాగ్రతుడైన రాజు అధికారము ఈ రెండింటిలో దేనిది పైచేయి అనే విషయాన్నిగురించి చర్చించవలెననే కాని, ఆ సమస్యను పరీక్షకుపెట్టి తేల్చవలెనని రెండు పక్షాలకు ఎప్పుడూ వాంఛ కలగలేదు. పార్లమెంట్ ద్వారాను, సామాన్య న్యాయస్థానాల ద్వారాను చెలాయించే అధికారము రాజులకుంటే అది వారి స్వతంత్ర అధికారాల కంటె మిన్న అయినది, బలీయమైనది అని ట్యూడర్ పార్లమెంట్‌లకు తోచలేదు. ఏ విషయంలోనైనా రాజు పట్టుదల చూపితే పార్లమెంట్ సర్దుకొనిపోవడం, పార్లమెంట్ పట్టుదల జూపితే రాజు సర్దుకొనిపోవడం సర్వసామాన్యంగా జరిగేవి. పై రెండు విధాలైన అధికారాల మధ్య సంఘర్షణ రాకుండా తమ ప్రత్యేకాధికారాల నుపయోగించి సంప్రదాయసిద్ధమైన పార్లమెంటరీ అధికారాన్ని తగ్గించడానికి ప్రయత్నాలు చేయకుండా ట్యూడర్ రాజులు చాలా

మెలకువతో నడచుకొన్నారు. ట్యూడర్ కౌన్సిళ్ళ నిరంకుశ చర్యలు రాజు వ్యక్తిగతమైన చర్యలుగానే ట్యూడర్ పార్లమెంట్‌లు సహించి భావించినాయి కాని స్టూవర్ట్ రాజుల కౌన్సిళ్ళ నిరంకుశచర్యలు చూసి పార్లమెంట్ అధికారంకోసం పోటీపడే సంస్థలుగా భావించి వాటిని ప్రతిఘటించ పూనుకొన్నాయి వారి పార్లమెంట్‌లు. నిరంకుశులైన ట్యూడర్ రాజులు ఎక్కువగా తమ ప్రత్యేక స్వతంత్ర అధికారాలనే ఉపయోగించినా పార్లమెంట్ సహించడానికి మరొక కారణముంది. అది ఆ రాజులు ఇంగ్లీష్ చర్చిపై విదేశీయులైన పోప్‌ల ఆధిపత్యాన్ని అంతమొందించి పోప్‌లు, వారి పక్షపాతులైన స్పెయిన్ రాజులు బ్రిటిష్ దీవులలో రెచ్చగొట్టిన కుట్రల సన్నిటిని అణిచివేయడమే కాకుండా స్పెయిన్ ఇంగ్లండ్‌పై ప్రత్యక్షంగా చేసిన నౌకా దండయాత్రలను తరిమికొట్టి స్పెయిన్ దేశానికి వెండి బంగారాలు చేరవేసే ఓడలను దోపిడీ చేయించి సముద్రాంతర దేశాలలో ఆంగ్లేయ వలసలను నెలకొల్పటానికి, వ్యాపారాన్ని విస్తరించటానికి ప్రోత్సాహమివ్వడం మొదలైన కార్యక్రమాల ద్వారా ఇంగ్లండ్ కీర్తి ప్రతిష్ఠలను, వైభవాలను ఇనుమడించడానికి జయప్రదంగా కృషిచేయడం

## మొదటి జేమ్స్ (1603–25)

*గుణశీలాలు:* పసిపాపగా ఉన్నప్పుడే ఆరో జేమ్స్‌గా స్కాట్లండ్‌కు రాజయినాడు. అందుచేత ఊహ తెలుసుకొన్న నాటినుంచి తాను రాజుననే అహంకారము బాగా ఇతనికి ఒంటబట్టినది. జేమ్స్ బాగా చదువుకొన్నవాడు. ఆ కాలపు రాజులలో అది అరుదైన విషయము. రాజు దేవాంశ సంభూతుడనే రాజనీతి సిద్ధాంతంపై ఆనాడు విరచితమయిన గ్రంథాలన్ని అతడు శ్రద్ధగా పఠించినాడు. ఆ సిద్ధాంతంలో అచంచలమైన విశ్వాసమాతనికి కలిగింది. రాజు భగవంతునిచే నియమితుడయినవాడు కనక అతని చర్యలను విమర్శించడం, ప్రతిఘటించడం రాజుపట్ల అవిధేయతేగాక, భగవంతునిపట్ల అపరాధమవుతుంది. అటువంటివారు రాజుచేతను, భగవంతునిచేతను కూడా శిక్షార్హులవుతారు. రాజాజ్ఞను అదేమని ప్రశ్నించక ప్రజలు తక్షణం శిరసావహించవలెనని, ఏ విధంగాను నిరోధించరాదని అతని వాదము. ఈ వాదాన్నే 'స్వతంత్ర రాజరికపు శాసనము' (The Law of Free Monarchies) అనే తన గ్రంథంలో విపులీకరించినాడు. ఎలిజబెత్ రాణి కాలంలో ఇంగ్లండ్‌లో స్థిరపడిన ఆంగ్లికన్ మత విధానం కూడా దైవదత్త రాజరికాన్ని అంగీకరించేదే.

జేమ్స్ ఇంగ్లండ్ రాజయినప్పుడు ఆ దేశంలో నెలకొల్పిన మతవిధానాన్ని, అమలులో ఉన్న చట్టాలను, సంప్రదాయాలను రక్షిస్తానని దేవునిసాక్షిగా ప్రమాణంచేసినాడు. అందుచేత అతివాదులైన ప్యూరిటన్‌లు కోరే మత సంస్కరణలకు తా నేమాత్రం అంగీకరించనని జేమ్స్ పట్టుబట్టినాడు. కాని కామన్స్ సభలో అధికసంఖ్యాకులు ప్యూరిటన్‌లు. వీరు ఎలిజబెత్ రాణి కాలంలో మత స్వాతంత్ర్యాన్ని కాపాడుకోడానికి దేశంనుంచి పారిపోయి జర్మనీ, స్విట్జర్లండ్‌లలో తలదాచుకొన్నారు. ఆ దేశాలలో ప్రచారంలో ఉండే అతివాద ప్రాటెస్టంట్ సిద్ధాంతాలలో గాఢమైన విశ్వాసాన్ని అలవరచుకొని ఇంగ్లండ్‌కు తిరిగి వచ్చినారు. ఇంగ్లండ్‌లోని మత విధానాన్ని తమ విశ్వాసాలకు అనుగుణంగా సరిదిద్దడానికి కంకణం కట్టుకొన్నారు.

జేమ్స్ స్కాట్లండ్ రాజుగా ఉన్న కాలంలో ఇంగ్లండ్‌లో ట్యూడర్‌లు అనుసరించిన పరిపాలనా విధానాన్ని చక్కగా పరికించినాడు. వారు జాతీయ న్యాయస్థానాలు అవలంబించె సామాన్య న్యాయానికి, పార్లమెంట్ అధికారానికి అతీతమైన విశేష రాజాధికారాన్ని పురస్కరించుకొని దేశాన్ని పాలించినారని గ్రహించినాడు. ఈ విషయంలో ట్యూడర్‌ల అడుగు జాడలలోనే తా వెందుచేత నడపకూడదని మొదటి జేమ్స్, అతని కుమారుడైన మొదటి ఛార్లెస్‌ల పట్టుదల. ట్యూడర్‌ల నిరంకుశ విధానాలను సహించిన ఇంగ్లండ్ ప్రజలు, పార్లమెంట్ ఆ రాజులు గౌరవించిన సంప్రదాయాలను తాము కూడా గౌరవిస్తూ ఆ రాజులవలెనే పరిపాలించదలచినప్పుడు తమ చర్యలను ప్రజలు, పార్లమెంట్ విమర్శించటం, ప్రతిఘటించటం ఏందుకోసమో ఆ తండ్రి కొడుకులకు అర్థం కాలేదు కాలం మారిందని, కాలంతోబాటు పరిస్థితులు మారినాయని, వాటితో బాటు ప్రజలు కూడా మారినారని వారు గ్రహించలేదు.

మొదటి జేమ్స్ ట్యూడర్ వంశ స్థాపకుడైన ఏడో హెన్రీ కుమార్తె సంతతివాడు. హెన్రీ కుమార్తె మార్గరెట్ స్కాట్లండ్ రాజైన నాలుగో జేమ్స్‌ను వివాహమాడింది. వారి మునిమనుమడే ఇంగ్లండ్ రాజైన మొదటి జేమ్స్. కాని ఏడో హెన్రీకి, మొదటి జేమ్స్‌కు మధ్య నాలుగుతరాల వ్యవధి ఉన్నది. అంత దీర్ఘకాలంలో పరిస్థితులు మారకుండా ఉంటాయా? ఇంకా ట్యూడర్ రాజులు ఇంగ్లండ్ దేశస్థులు ఇంగ్లీష్ జాతికి చెందినవారు. జేమ్స్ స్కాటిష్ జాతికి చెందిన స్కాట్లండ్ దేశస్థుడు. సహేతుకం కాకున్నా అతడు 'మొరటు స్కాచ్' వాడని ఇంగ్లండ్ వారికి అతనిపట్ల కొంత నిరాదరము ఉండేది. దీనికి తోడైనవి అతని రూపసంపద లక్షణాలు - ముద్ద ముఖము, సాగిన బిగ్గ, లావు నాలుక, వాదించటంలో మొండి పట్టుదల. జేమ్స్‌కు పుస్తక విజ్ఞానమ్ము మెండు. కాని లోక జ్ఞానము పూజ్యము. పార్లమెంట్ చేసే ప్రతి వాదంలో తల బిరుసుతనము, పెంకితనం మాత్రమే అతనికి స్ఫురించేవి. ఎనిమిదో హెన్రీ తరవాత ఇంగ్లండ్‌ను పాలించిన ముగ్గురికి సంతానం లేకపోవడంవల్ల ఆరో హెన్రీ ఎలిజబెత్ తరవాత తన రెండో చెల్లెలి సంతానానికి సింహాసనం చెందవలెనని వ్రాసిన వీలునామాను పార్లమెంట్ తోసిపుచ్చడంవల్ల జేమ్స్ ఇంగ్లండ్‌కు రాజయినాడు. జేమ్స్‌కు మాత్రం తాను ఇంగ్లండ్‌కు రాజు కావడం కేవలం భగవదిచ్ఛేకాని, మానవ మాత్రులైన పార్లమెంట్ సభ్యుల చర్య లే మాత్రం కావని దృఢవిశ్వాసము. పార్లమెంట్ అభిప్రాయంలో ట్యూడర్ కాలంలో చేసిన ప్రతి శాసనము, ప్రతి సంస్కరణ, ప్రభుత్వ కార్యక్రమము పార్లమెంట్ ఆమోద ముద్రతోనే చేసినవని ప్రజా ప్రతినిధి సభ అయిన పార్లమెంట్‌లోనే సమగ్ర రాజ్యాధికారము, సార్వభౌమత్వము కేంద్రీకరించి ఉన్నాయని రెండు పక్షాలలోను సర్దుకొని పోయే గుణం లోపించడంచేత పై రెండు రకాల అభిప్రాయాలకు విశ్వాసాలకు మధ్య సంఘర్షణ తప్పలేదు. కాని ఎంత పట్టుదలతో విసుగులేకుండా వాదించినా తాడు తెగినదాకా లాగే గుణము, ధైర్యము జేమ్స్‌లో లేనందువల్ల అయన రాజ్యం చేసిన కాలంలో విపరీతమైన పరిణామాలేవీ సంభవించలేదు. అతని కుమారుడు మొదటి ఛార్లెస్ అటోయిటో తేల్చుకోవలెననే గుణమున్నవాడు కాబట్టి అతని కాలంలో అంతర్యుద్ధం చెలరేగి అతని దుఃఖాంతంగా ముగిసింది. మొదటి జేమ్స్ పెద్ద కుమారుడైన హెన్రీ 1612 లో అకాలమరణానికి గురి కావడంవల్ల ఛార్లెస్ యువరాజయినాడు. మామూలు పరిస్థితిలో రాజయ్యే అవకాశం లేనందువల్ల అతడు రాజుకు కావలసిన శిక్షణలు పొందలేదు. మత విషయాలలో అతనికి

దృఢమైన విశ్వాసాలున్నాయి. సత్ప్రవర్తన కలవాడేగాని తండ్రివలెనే తన అభిప్రాయాలతో ఇతరులు ఎందుకు ఏకీభవించరో అర్థం చేసుకోలేదు. అతని తండ్రి ప్రతిపక్షాల వాదానికి ప్రతివాదంగా రాజ్యము దైవదత్తమనే సిద్ధాంతాన్ని ఉపయోగిస్తే ఆ సిద్ధాంతాన్ని నిలబెట్ట డానికి ఛార్లెస్ రాజ్యాన్ని, తన ప్రాణాలను కూడా పోగొట్టుకోవడానికి సిద్ధమయినాడు. ఛార్లెస్ ఎవ్వరినీ నమ్మేవాడు కాడు. మాట నిలకడలేనివాడని, నమ్మరానివాడని, ఇతరులకు అనిపించేటట్లు ప్రవర్తించేవాడు

ప్రతిపక్షంలోని వారు ప్రజాస్వామ్య సిద్ధాంతాన్ని గురించి, పార్లమెంట్ ఆధిక్యాన్ని గురించి ఎంత వాదించినా వారిలో స్వార్థచింతనే ఉందని ఛార్లెస్ భావించేవాడు. రాజు పార్ల మెంట్ గ్రాంటుల కాసించకుండా ఫ్యూడల్ ఆదాయాలు, రేవు సుంకాలు, చర్చి ద్వారా రాబడి, రాజక్షేత్రాల వ్యవసాయము మొదలయిన వాటితో పరిపాలన జరుపుకోవలెనని వారి వాదము. డబ్బు విషయంలో పీనాసులు మొదటి జేమ్స్ అల్లుడు ఫ్రెడరిక్ తన రాజ్యాన్ని కోల్పోయినప్పుడు అతని రాజ్యాన్ని పునరుద్ధరించే విషయంలో అతని పక్షం వహించి జర్మనీ ఫ్రాన్స్‌లతో యుద్ధానికి దిగమని జేమ్స్‌ను ప్రోత్సహించిన పార్లమెంట్ ఆ యుద్ధానికయ్యే ఖర్చుకు ధనాన్ని మంజూరుచేయడానికి నిరాకరించింది. అంతేకాక అవసరాలనుబట్టి అతడు ఫ్యూడల్ ఆదాయాలను పెంచినా, రేవు సుంకాలను హెచ్చించినా, నిర్బంధ ఋణాలను, బలవంతపు కానుకలను వసూలుచేసినా, ప్రతిఘటించేది. పైగా పార్లమెంట్‌ను సమావేశ పరచడంలేదని నిందారోపణ చేసేది. ప్రతిపక్షంలోని వారు అనేకులు వర్తక వాణిజ్యాలలోను, పరిశ్రమలలోను బాగా సంపాదించి బలిసినవారు. పౌరసత్వాన్ని, పరిశ్రమలను తమ కుటుంబా లకు గుత్తలుగా చేసుకోవలెనని వారి ఆకాంక్ష. నిరుద్యోగులకు వృత్తులు కల్పించడానికి, వృద్ధులకు, కుంటివారికి, గుడ్డివారికి సహాయపడటానికి రాజులు చేసిన ప్రయత్నాలకు విరోధులు. వ్యక్తిగత ద్వేషాలతో మంత్రులను పదవీయడానికి చూసేవారు. ఇతర కారణాల వల్ల రాజుకు ప్రతిపక్షంగా ఏర్పడినా మత విశ్వాసాల విషయమై పోరాడుతున్నామని చెప్పి ప్రజల అభిమానాలకు పాత్రులు కావలెననే నటించే కపటులు.

రాజపక్షానికి, పార్లమెంట్‌లోని ప్రతిపక్షానికి కలహ కారణాలు కింది విధంగా చెప్ప వచ్చు :

రాజుకు కొన్ని ప్రత్యేక రాజకీయాధికారా లున్నాయి. అవి

(1) ఆర్డినెన్స్‌ల ద్వారా శాసనాలు చేయడం.

(2) పార్లమెంట్ అంగీకారం లేకుండా పన్నులు విధించడం, ఆదాయం పెంచుదల, కొత్త ఆదాయమార్గాలు కల్పించడం.

(3) తన ఇష్టం వచ్చినట్లు మంత్రులను నియమించడం, తొలగించడం

(4) పార్లమెంట్ ప్రసక్తిలేకుండా పరిపాలన సాగించడం.

(5) దేశరక్షణకు స్వతంత్రించి ఏర్పాట్లు కావించడం.

(6) సామాన్య న్యాయస్థానా లందించే న్యాయానికి భిన్నంగా ప్రత్యేక రాజన్యాయాన్ని అందజేయడం.

(7) న్యాయాధిపతులను పదవులనుంచి తొలగించడం.

(8) పార్లమెంట్ ప్రసక్తి లేకుండా మతైక విషయాలను నిర్ణయించడం.

(9) తన ఇష్టంవచ్చినట్లు పార్లమెంట్‌ను సమావేశపరచడం, సమావేశాన్ని రద్దు చేయడం, పార్లమెంట్‌ను వాయిదా వేయడం.

(10) పార్లమెంటరీ ఎన్నికలపైన, వ్యవహారాలపైన పెత్తనం చేయడం.

కాని పార్లమెంట్ ప్రతివాద మేమంటే

(1) పార్లమెంట్ ఆధిపత్యాన్ని గుర్తిస్తూ ఇంగ్లండ్ రాజు లెందరో ఆర్డినెన్స్‌లు చేసినారు.

(2) పార్లమెంట్ — అంటే కామన్స్ సభ, ప్రభువుల సభ — రాజూ కలిసిచేసిన శాసనాలకు మరి ఏ విధంగా చేసిన చట్టాలకన్నా, రాజ ప్రకటనలకన్నా ఎక్కువ పవిత్రత, ప్రామాణ్యము ఉన్నాయి

(3) ప్రత్యేక, అసాధారణ ఆదాయాలను అనుమతించే హక్కు పార్లమెంట్‌కు మాత్రమే ఉంది.

(4) ఇంగ్లండ్ చర్చికి రాజును అధిపతిగా చేసినది పార్లమెంట్ చట్టమే కనక రాజాధికారం కన్నా పార్లమెంట్ అధికారమే మిన్న.

(5) సామాన్య న్యాయస్థానాలు అములుపరచే న్యాయము సంప్రదాయ సిద్ధమైనది, జాతీయమైనది. అందుచేత అది ఉత్తమమైనది. రాజ ప్రకటనలు దాని నతిక్రమించలేవు.

(6) హక్కు హక్కులు ప్రసాదించమని పార్లమెంట్ రాజును అడిగినమాట నిజమే. కాని అట్లా అడగడం కేవలం మర్యాదకోసమే. రాజు నిరాకరించినా పార్లమెంట్ ఆ హక్కులను పొందే ఉంటుంది. పార్లమెంట్‌కున్న హక్కులతో పోలిస్తే రాజుకున్న హక్కులు తగ్గు స్థాయిలోనివే.

(7) రాజు మంత్రులను పార్లమెంట్ చట్టంచేసి శిక్షించవచ్చు.

పై ప్రతివాదంతో బాటు ఒకటిన్నర శతాబ్దాలుగా మూలబడిఉన్న 'ఇంపీచ్‌మెంట్' పద్ధతిని స్టూవర్ట్ పార్లమెంట్‌లు తిరగదోడినవి.

రెండు పక్షాలవారూ తమ వాదాలకు ఉపపత్తిగా ట్యూడర్ కాలపు సంప్రదాయాలనే పేర్కొనేవారు తమ వాదాన్ని బలపరచటాని కనుకూలించే చారిత్రకాంశాలను పేర్కొనేవారు, ఆ యా అంశాలను తమ కనుకూలించే విధంగా వ్యాఖ్యానించేవారు. ఎదుటివారి వాదంలో న్యాయమేదైనా ఉన్నదని విచారించేవారుగాని, ఉంటే గుర్తించేవారుగాని రెండు పక్షాలలోను లేరు. మొరటుదనంలో, అసహనంలో, అహంకారంలో ఒకరిని మించిన వారు మరొకరు. సక్రమంగా పరిపాలన నిర్వహించడంలోని సాధకబాధకాలు ఎవ్వరికీ పట్టలేదు అవసరమైన రాజనీతి సిద్ధాంతాలు చర్చించటాని కందరూ సర్వదా సన్నద్ధులే. రాజ్య మెట్లా పుట్టింది? రాజు ముందా, ప్రజలుముందా? రాజాధికారము ప్రజలు ప్రసాదించినదా, దైవదత్తమా? రాజ ధర్మానికి విరుద్ధంగా ప్రవర్తించే రాజును భగవంతుడు విధించిన శిక్షగా భరించవలెనా, రాజును తొలగించటానికి ప్రజల కధికారమున్నదా? ఇటువంటి తత్త్వ విచారాలు రాజకీయ ఆవేశాలను దెబ్బకొట్టడానికి ఉపయోగించినాయి. కాని పరిపాలనా సౌష్ఠవాన్ని పెంపొందించటానికిగాని ప్రజావసరాలను తీర్చటానికిగాని సహాయ పడలేదు.

## మొదటి జేమ్స్ - పార్లమెంట్ల సంబంధాలు

జేమ్స్ ఇంగ్లండ్ సింహాసమధిష్టించే నాటికి పార్లమెంట్ సభ్యులలో ప్యూరిటన్లు అధిక సంఖ్యాకులుగా ఉన్నారు. వీరు ఇంగ్లండ్ మత వ్యవస్థలో తీవ్రమైన సంస్కరణ తీసుకొనిరావలెనని, పార్లమెంట్ అధికారము, హోదా ప్రజల స్వేచ్ఛను పెంచవలెనని గాఢంగా కాంక్షించే వారు. ప్యూరిటన్లలో ఒక ముఖ్యవర్గంవారు ప్రెస్బిటేరియన్ మత విధాన పక్షపాతులు. ఈ విధానము కాల్విన్ బోధించిన విధానానికి సన్నిహితంగా ఉంటుంది. ఇంగ్లండ్ చర్చిలో కాల్విన్ నమ్మకాలను, పద్ధతులను బలవంతంగానైనా ప్రవేశ పెట్టవలెనని వీరి అభిలాష. అంటే బిషప్లకు, ఆర్చిబిషప్లకు అధిపతిగా రాజు చర్చిని, పరిపాలింప రాదని, ఏ చర్చి వ్యవహారాలు ఆ చర్చికి హాజరయ్యే పెద్దలే నిర్వహించవలెనని, చర్చి వ్యవస్థలో సభ్యులుగానే ఉంటూ ఆ వ్యవస్థలో తాము అభిలషించిన మార్పులే తేవలెనని వారి ప్రయత్నము. వీరు ఎలిజబెత్ రాణి పరిపాలనాంతంలో ఆమె నిరంకుశ పరిపాలనా విధానాన్ని విమర్శించే పార్లమెంటరీ ప్రతిపక్షంగా ఏర్పడినారు.

ప్రెస్బిటేరియన్లనుంచి విడిపోయిన బ్రౌనిస్లు మతవిశ్వాసాల విషయంలో స్వేచ్ఛ ఉండవలెనని కోరే వారు. కాని చర్చి పరిపాలన రిపబ్లికన్ పంథాలోనే జరగవలెననే వారు.

ప్యూరిటన్లకు బద్ధ విరోధులు హై చర్చి పార్టీ వారు. వీరు చర్చిలో జీసస్, మేరీ మాత పటాలు, విగ్రహాలు ఉండవలెననే వారు. చర్చి ఉద్యోగులు పొడుగైన నల్ల గౌనులు ధరించవలెనని, పారిష్ చర్చినుంచి అంచెలంచెలుగా బిషప్లు, ఆర్చిబిషప్లు, చర్చి అంతటికి సర్వాధికారిగా రాజు ఉండవలెనని కోరే వారు. వీరి ఉద్దేశంలో రాజు దేవుని ప్రతినిధి. చర్చిలో ప్రార్థనలు ఇంగిష్ ప్రార్థనాగ్రంథం (English Prayer Book) తోనే చేయవలెనని, భక్తిపరమైన పాటలు చర్చికి వచ్చిన వారందరు కలిసి వాద్య సంగీతంతో బాటు పాడవలె నని హైచర్చి పక్షం వారి పట్టుదల. ప్యూరిటన్ల దృష్టిలో హైచర్చివారు అభివృద్ధి నిరోధ కులు వారి పద్ధతులు ఇంచుమించు కాథలిక్ పద్ధతుల వంటివి. మొదటి జేమ్స్, దృష్టిలో ప్యూరిటన్ ప్రెస్బిటేరియన్ పద్ధతులలో అందము, చందము, మట్టు మర్యాద సరయిన పూజా పునస్కారాలు లేవు

జేమ్స్ రాజైన కొత్తలో సుమారు 800 మంది మతాచార్యులు (Clergy-men) మిలినరి పిటిషన్ (Millenary petition) అనే ఒక పత్రాన్ని రాజుకు నివేదించినాడు. పత్రంలో చర్చిలోగాని ప్రభుత్వంలోగాని ఎటువంటి మార్పులు కోరలేదు. న్యాయస్థానాలలో మార్పులు, సుశిక్షితులైనవారు బోధకులుగా నియమితులయ్యే అవసరము మొదలైన అంశాలు మాత్రమే అందులో ఉన్నాయి. పత్రంలోని అంశాలు చర్చి చట్టంకోసం హాంప్టన్ కోర్ట్ (Hampton court) అనేచోట జేమ్స్ రాజు ఒక సమావేశాన్ని ఏర్పరచినాడు. ఆ సమా వేశంలో మిలినరి పత్రంలోని అంశాలను తోసిపుచ్చడమేగాక ప్రెస్బిటిరియన్ విధానాలకు, ఇంగ్లీష్ చర్చికి మధ్య సైతాన్కు, దేవునికి మధ్య ఉన్నంత విభేదము ఉన్నదని (Presbytory and the Church agree as well as God and the devil) ఖండితంగా తన అభిప్రాయాన్ని వెలిబుచ్చినాడు. ఈ సమావేశమయిన కొద్ది కాలానికే చర్చి కాన్వొకేషన్ కింది విధంగా తీర్మానించింది. ఇంగిష్ ప్రార్థనా పుస్తకంలోని ఏ ఒక్క మాటయినా దేవుని

మాట కాదు అనేవారు చర్చినుంచి వెలి అవుతారు. అట్లా వెలి అయినవారు తమ మతం మార్చుకొనేవరకు ఖైదులో ఉండవలసి ఉంటుంది. కాని 1611 లో కేంటర్‌బరీ ఆర్చిబిషప్ అయిన ఆబట్ ప్యూరిటన్‌లవైపు మొగ్గినందువల్ల వారిని పై తీర్మాన మతంగా బాధించలేదు.

కేంటర్‌బరీ సమావేశం జరిగిన తరవాత కొద్ది కాలానికే 1604 మార్చి మాసంలో మొదటి జేమ్స్ మొదటి పార్లమెంట్ సమావేశమయింది. పార్లమెంట్‌లో హైచర్చి సిద్ధాంతాలను అంగీకరించే 'టోరీ' పక్షంవారు రాజాధికారము దైవదత్తము; ఎదురు మాట్లాడకుండా ప్రజలతనికి విధేయులై ఉండవలె అనే జేమ్స్ రాజకీయ సిద్ధాంతాలు (Theories of Divine Right and Passive Obedience) పూర్తిగా శిరసావహించినారు. ఈ సిద్ధాంతానికి బద్ధవిరోధులు ప్యూరిటన్‌లు. అందుచేత ఈ సిద్ధాంతాలు జేమ్స్‌కు, అతని మొదటి పార్లమెంట్‌కు త్వరగానే కలహం తెచ్చిపెట్టినాయి. ఆ కలహం పెరిగి పెద్దదై మొదటి స్టూవర్ట్ రాజులకు, వారి పార్లమెంట్‌కూ మధ్య యుద్ధంగా పరిణమించింది.

***జేమ్స్ మొదటి పార్లమెంట్* (1603-04)**, మొదటి పార్లమెంట్‌ను సమావేశపరచడానికి చర్య తీసుకొంటూ అనుమానాస్పద, శిలంగలవారిని పార్లమెంట్‌కు ఎన్నుకోరాదని జేమ్స్ నియమం చేసినాడు. అంతేకాక ఎన్నుకొన్న ప్రతి సభ్యుని విషయంలోను ఈ నిబంధన పాటించినారో లేదో ఛాన్సరీ నిర్ణయం చేయవలెనని ఆజ్ఞ చేసినాడు. వెంటనే పార్లమెంటరీ సభ్యత్వానికి అర్హతలు నియమించడానికి, ఎన్నికల విషయంలో వచ్చే తగాదాలను పరిష్కరించడానికి పూర్తి హక్కు తమదేనని ఈ పార్లమెంట్ తన మొదటి సమావేశంలో తీర్మానించింది. ఈ తీర్మానాన్ని ఖండిస్తూ "కామన్స్ సభ ప్రత్యేకాధికారాలన్నీ రాజునుంచి సంక్రమించినవే, రాజు మంజూరు చేసినవే" అని జేమ్స్ ప్రకటించినాడు అంతట తమ చర్యను "క్షమాపణ పత్రము" (A Form of Apology) లో సమర్థించుకొంటూ వారి స్వాతంత్ర్యాలూ ప్రత్యేకాధికారాలూ వారి భూములూ వస్తు వాహనాలవలెనే వారికి వారసత్వంగా సంక్రమించిన హక్కు భుక్తాలలోవని, వాటిని రాజుతొలగించడానికి వీలుకాదని కామన్స్‌సభ తీర్మానించింది. ఇంకా తమ సభ రికార్డ్ కోర్టని (A Court of Record), ఇతర న్యాయస్థానాలన్నింటినీ మించిన న్యాయస్థానమని, రాజ్యమతాన్ని మార్చడానికిగాని, దానినిగురించి చట్టాలు చేయడానికిగాని రాజుకు అధికారం లేదనికూడా ఆ సభ తీర్మానించింది. కాని ఈ తీర్మానాన్ని రాజుకు పంపినట్లు లేదు. మేము శాంతిని, ఐకమత్యాన్ని అభిలషిస్తున్నామేగాని వేరు విధంగా తలచవద్దని, దేశ పరిపాలనలోను చర్చి పరిపాలనలోను ఉన్న లోపాలను గమనించవలెనని రాజును కామన్స్ సభ్యులు ప్రార్థించినారు. వారు స్వేచ్ఛగా పరిపాలనలోని ఇతర లోపాలను - అంటే ఫ్యూడల్ మైనర్ల సంరక్షకత్వంలోను గుత్తవ్యాపార (monopolies) విషయంలోనూ జరిగే అక్రమాలను - గురించి చర్చించడానికి తమకు పూర్తి చర్చా స్వేచ్ఛ ఉందని, అందుకని తమను అరెస్టు చేసే అధికారము రాజుకు లేదని వారు తీర్మానించినారు.

మొదటి పార్లమెంట్ తొలి సమావేశంలోనే కామన్స్ సభ సభాపతి (Speaker) శాసనంచేసే అధికారము ఒక్క పార్లమెంట్ హైకోర్టు (The High Court of Parliament) కే కలదని, ఆ అధికారము మరెవ్వరికి లేదని మొదటి జేమ్స్‌ను హెచ్చరించినాడు ఈ మాటలను వివరిస్తూ ఆ సభాపతి ఇంకా ఇట్లన్నాడు: "కామన్స్ సభ తీర్మానించిన

తరవాత, ఆ తీర్మానాన్ని ప్రభువుల సభ అంగీకరించిన తరవాత రాజామోద ముంచేనేగాని ఏదీ శాసనం కాదు. రాజు ఏ చట్టాన్నీ ప్రతిపాదించడు. అతనికుండే హక్కు పార్లమెంట్ రెండు సభలూ ఆమోదించి తనకు పంపిన చట్టాన్ని ఆమోదించి శాసనం చేయటమో, తోసి వేయటమో.'' అప్పటికి ఇంగ్లీష్ రాజ్యాంగంలో ఇంగ్లండ్ రాజుకుండే స్థానమేదో మొదటి జేమ్స్‌కు కొంత అర్థమై ఉండవచ్చు. కానీ తన అభిప్రాయాలను ఇతరులపై రుద్దగల శక్తి గానీ నలుగురిని ఒప్పించి కూడగట్టుకొని, తన ఇష్టానుసారం నడిపించే శక్తి లేకున్నా తా బట్టిన కుందేటికి మూడే కాళ్ళని ఎదుటివారిని రెచ్చగొట్టేవాడేకాని జేమ్స్ తన పద్ధతి మనుకో లేదు. ఈ తత్వంతో పార్లమెంట్‌ను ఒప్పించడాని కెంతచేసినా దాని నిరోధం పోను పోను ఎక్కువై అతని కుమారుని కాలంలో దారుణ ఫలితాలకు దారితీసింది.

*మొదటి పార్లమెంట్ రెండో, మూడో సమావేశాలు* (1605-07): ఒక ముసాయిదా చట్టాన్ని ఏ పార్లమెంట్ సమావేశంలో ప్రవేశపెట్టి తోసివేయడం జరిగిందో ఆ సమావేశం లోనే రెండోసారి దానిని ప్రవేశపెట్టరాదని 1606 లో నిబంధన చేసినారు. 1607 లో కామన్స్ సభ క్రిస్టోఫర్ పిగాట్ అనే సభ్యుని పార్లమెంట్ సభ్యత్వాన్ని రద్దుచేసి తనకు అటువంటి అధికారమున్నదని రుజువుపరచింది. ఇంగ్లండ్, స్కాట్లండ్‌లను ఏకరాజ్యం చేయ వలెనని జేమ్స్ చెసిన సూచనను పార్లమెంట్ ఆమోదించలేదుగాని రెండు రాజ్యాలకూ విరోధం కల్పించే చట్టాలను రద్దుచేసింది. జేమ్స్ ఇంగ్లండ్‌కు రాజైన తరవాత స్కాట్లండ్‌లో పుట్టినవారందరు ఆంగ్లపౌరులే అని 1608 లో కాల్విన్ కేసులో కోర్టు తీర్మానించింది. 1607-09 మధ్య పార్లమెంట్ అదే పనిగా చేసే ఆరోపణలకు విసిగి రెండేండ్ల కాలం కామన్స్ సభను జేమ్స్ పిలువలేదు. ఆ రెండేండ్లు పరిపాలన సాగించడానికి ధనం చాలక తనంతట తానే దిగుమతులపై పన్నులు విధించినాడు.

*బేట్స్ వ్యాజ్యము* (*Bate's case*): 1606 లో బేట్సు అనే వర్తకుడు తాను దిగు మతి చెసిన ప్రతి హండ్రెడ్‌వెయిట్ పుల్లబెర్రి పండ్లపై రాజువేసిన అయిదు షిల్లింగుల అదనపు పన్నును చెల్లించడానికి నిరాకరించినాడు. ఎక్స్చెకర్ కోర్టు ఈ వ్యాజ్యము విచారణ చేసి అటువంటి అదనపు పన్నులు విధించడానికి రాజు కధికారమున్నదని తీర్పు చెప్పింది. ''పన్ను విధించే అధికారము పార్లమెంట్‌దే కాని, పరిపాలనావసరం కొద్దీ ఆ పన్నుపై అధిక పన్నును రాజు తన అసాధారణ విశేషాధికాలాన్నిబట్టి విధించవచ్చు'' అనే తీర్పును ఆధారంగా చెసుకొని 1608 లో ఇంచుమించు అన్ని దిగుమతులపైన అధిక పన్నులు విధిస్తూ రేట్ల పుస్తకమొకటి జేమ్స్ ప్రకటించినాడు. ఈ విధంగా రాజు పార్లమెంట్‌ను సమావేశపరచ కుండా, తన పరిపాలనపై దాని అభిప్రాయాలు చెప్పడానికి అవకాశమే ఇవ్వక ఎంత కాలమైనా అతడు దేశాన్ని పరిపాలించవచ్చుగదా!

*నాలుగో సమావేశము* (1609-10): అదనపు దిగుమతి పన్నులనుగురించి సమా వేశారంభంలోనే కామన్స్ సభ వివాదానికి సిద్ధమయింది. కాని అదనపు పన్నులగురించి ఒక్కమాట కూడా ఉచ్చరించకూడదని జేమ్స్ నిషేధించినాడు. ఆ నిషేధాన్ని అధిక్షేపిస్తూ కామన్స్ సభ అధనపు పన్నులన్నీ శాసన విరుద్ధమని ప్రకటిస్తూ వాటిని రద్దు చేయవలెనని తీర్మానించింది. కాని ఆ తీర్మానాన్ని ప్రభువుల సభ తోసిపుచ్చింది. అందుచేత జేమ్స్ అదనపు పన్నులను యథేచ్ఛగా విధించటానికి వీలయింది. హైకమిషన్ కోర్టునుగురించి,

రాజ ప్రకటనల (Royal Proclamations) దుర్వినియోగాన్ని గురించి కామన్స్ సభ ఫిర్యాదుచేసింది. ఆ ఫిర్యాదుననుసరించి ప్రధాన న్యాయాధిపతి సర్ కోక్‌ను ప్రివీ కౌన్సిల్‌కు పిలిపించి మీ అభిప్రాయమేమని జేమ్స్ అడిగినప్పుడు ఇతర న్యాయాధిపతులను సంప్రదించి అతడు జేమ్స్‌కు ఈ విధంగా తెలిపినాడు : i. రాజ ప్రకటనం ద్వారా అంతకుముందు లేని క్రొత్త నేరాలను రాజు సృష్టించలేడు. ii. రాజ ప్రకటన ఆధారంగా నేరమైన చర్యను స్టార్ ఛాంబర్ కోర్టు శిక్షించరాదు. iii. చట్టము అనుమతించినంతవరకేగాని అంతకుమించి రాజుకు విశేషాధికారాలు లేవు.

ఈ సమావేశంలో పర్వేయన్స్, సైన్యంలో సేవకు బదులు పుచ్చుకొనే మొత్తాలు, వదలుకోడానికి జేమ్స్ ఒప్పుకొనేటట్లుంటే ప్రతి సంవత్సరమూ అతనికి 2 లక్షల పౌనులు మంజూరుచేయడానికి కామన్స్‌వారు సిద్ధపడినారు కాని ఆ బేరం కుదరలేదు. ఇంతలో పార్లమెంట్ రద్దయింది.

తరవాత మూడేండ్లవరకు పార్లమెంట్‌ను సమావేశపరచక ఎక్కువ ఆదాయం చేబట్టడానికి ఎన్నో అక్రమపద్ధతుల నవలంబించినాడు. వీటిలో ముఖ్యమైనవి రాజముద్రగల పత్రాలనిచ్చి ఋణాలు తీసుకోవడం, జరిమానాల బాకీలు వసూలుచేయడం, ప్రభువదవులను అమ్మడం, క్రొత్త బేరోనీలను సృష్టించటం, రాజు సొంత భూములను అమ్మడం. చివరకు విధిలేక 1614 లో తన రెండో పార్లమెంట్‌ను సమావేశపరచినాడు. కొన్ని విషయాలలోనైనా రాజు కొంత తగ్గివస్తే పార్లమెంట్‌ను అతని వైపు త్రిప్పగలమనీ, రాజభక్తి గలవారు పార్లమెంటరీ ఎన్నికలలో గెలుపొందేటట్లు చూడటం సాధ్యమేననీ నెవిల్ బేకన్ అనే వారిద్దరు ముందుకు వచ్చినారు. వారి ఎత్తులు ముందుగా తెలియడంవల్ల ఎన్నికలలో ప్రభుత్వ పక్షం వారు ఓడిపోయినారు. మూడు సంవత్సరాల తరవాత సమావేశమవడంవల్ల దీనికి ముదిగి పోయిన పార్లమెంట్ అని పేరు వచ్చింది.

***జేమ్స్ రెండో పార్లమెంట్ :*** ఈ పార్లమెంట్ సమావేశమయిన వెంటనే అదనపు పన్నుల విషయం చర్చించి తన సమ్మతిలేకుండా అటువంటి పన్నులు విధించే హక్కు రాజుకు లేదని ఏకగ్రీవంగా తీర్మానించింది. వెంటనే రాజు పార్లమెంట్‌ను రద్దుచేసినాడు. ఏ పనీ సాధించకముందే రద్దు కావడంచేత ఈ పార్లమెంట్‌కు "ముదిగిపోయిన (Addled Parliament) అని పేరు వచ్చింది. ఈ పార్లమెంట్‌లోని కామన్స్ సభ సభ్యులను నలుగురిని జేమ్స్ కారాగారానికి పంపించినాడు.

రెండో పార్లమెంట్‌ను రద్దుచేసిన తరవాత ఆరేండ్లవరకు పార్లమెంట్‌ను సమావేశపరచక అదనపు పన్నులు, జరిమానాలు, నిర్బంధ ఋణాలు ఫ్యూడల్ ఆదాయాలు తన ఇష్టం వచ్చినట్లు రాబడుతూ జేమ్స్ పరిపాలన సాగించినాడు. అయినా డబ్బు చాలక బిరుదులను అమ్ముకొన్నాడు. చివర ప్రజలందరినుంచి స్వేచ్ఛా విరాళాలను (Benevolences)కు కూడా వసూలు చేసినాడు. జేమ్స్ నిరంకుశ రాజరికానికి కొంత అడ్డుగా మిగిలినది అతని న్యాయాధికారులు. వారిలో ముఖ్యుడు ప్రధాన న్యాయాధిపతి సర్ ఎడ్వర్డ్ కోక్. ఒక సందర్భంలో రాజు విశేషాధికారాలకు (Prerogatives) సంబంధించిన వ్యాజ్యాలలో తీర్పు చెప్పే ముందు న్యాయాధిపతులు ఆ విషయంలో తన వాదన వినవలెనని జేమ్స్ పట్టుబట్టినాడు. రాజుకు అటువంటి హక్కు లేదని కోక్ వివరించినాడు. తన కోర్టుకు ఏ వ్యాజ్యం వచ్చినా

న్యాయంగా తీర్పు చెబుతానని కూడా అన్నాడు. కోపగించి జేమ్స్ అతనిని కౌన్సిల్‌నుంచి వెడలగొట్టినాడు. న్యాయాధిపతులు రాజానుగ్రహానికి పాత్రులై ఉన్నంతకాలమే పదవిలో ఉంటారనే బూజుపట్టిన ఒక పాత శాసనాన్ని బయటికి లాగినాడు. అయినా కోక్ తన అభిప్రాయాలను మార్చుకోడానికి నిరాకరించినాడు. దానితో జేమ్స్ మరింత ఆగ్రహం పొంది అతనిని ఉద్యోగంనుంచి తొలగించినాడు.

1614 లో రెండో పార్లమెంట్‌ను రద్దు చేస్తూ ఆ పార్లమెంట్‌లో సభ్యులు మాట్లాడిన మాటలు కారణంగా నలుగురు సభ్యులను ఖైదుచేసిన విషయాన్ని మూడో పార్లమెంట్ సమావేశం కాగానే కామన్స్ వారు ప్రస్తావించినారు గాని, సభ్యుల వాక్స్వాతంత్ర్యాన్ని కాపాడి నిలబెడతానని రాజు మాట ఇచ్చినందువల్ల ఆ విషయాన్ని అంతటితో వదిలి తమకు కలుగుతున్న కష్టనిష్ఠురాలను గురించి చర్చించడానికి ఒక కమిటీని నియమించినారు. వారు మొదట విచారణకు తీసుకొన్నది గుత్తి వ్యాపారాల విషయము. కొన్ని వస్తువులను తయారుచేసి అమ్మటానికి తమకు ప్రభుత్వమిచ్చిన గుత్తాధికారాన్ని దుర్వినియోగం చేసి, వస్తువులను విపరీతపు ధరలకమ్మి ప్రజలను దోచుకొన్న వారిలో మిచెల్ (Mitchell), మాంపెసాన్ (Mompesson) లు అగ్రేసరులు. రాజుకు ఆ గుత్తాధికారాలను అమ్మడానికి గాని ఇవ్వడానికి గాని అధికారం లేదనే చట్టాన్ని చేయడానికి పార్లమెంట్ పూనుకోలేదు. కాని మూలబడిఉన్న నిందారోపణ పద్ధతి 'ఇమ్‌పీచ్‌మెంట్' (Impeachment) ను ఈ సందర్భంలో వారు మళ్ళీ వెలికి తెచ్చినారు. ఒకడు నేరగాడని శిక్ష విధిస్తూ ఒక చట్టాన్ని పార్లమెంట్ రెండు సభలూ చేసి దుష్టులను దండించే బిల్ ఆఫ్ ఎటెయిండర్ (Bill of Attainder) పద్ధతివలె ఇమ్‌పీచ్‌మెంట్ పద్ధతి సులభమైనది కాదు. ఈ పద్ధతిలో కామన్స్ సభ నేరారోపణ చేసి ప్రభుసభ ముందు నిందితుని విచారణకు తీసుకొనివస్తుంది. నేరం రుజువైనదని ప్రభు సభ వారు అభిప్రాయపడితే శిక్ష విధిస్తారు. ఈ శిక్షనుగురించి ఇతర న్యాయస్థానాలకు అప్పీలులేదు. రెండువంద లేండ్లుగా ఏ కారణం వల్లా ఇంగ్లీష్ పార్లమెంట్ రాజులను ఎదిరించడానికి పూనుకోలేదు. ఇప్పుడీ పద్ధతిని పునరుద్ధరించడం వల్ల రాజు నిరంకుశత్వానికి పార్లమెంట్ వెన్నుపోటు పొడవటానికి వీలయింది. ఆ నిరంకుశత్వాన్ని అమలుపరచే రాజోద్యోగులను రాజుకు దుష్టపరిపాలనలో సహాయపడినందుకు పార్లమెంట్ దండించేటప్పుడు ఎవరూ వారిని రక్షించరు. పైగా రాజు నిరంకుశత్వాన్ని సాగించటానికి ఏ ఉద్యోగీ ముందుకురాడు. మొదట ఈ ఇంపీచ్‌మెంట్‌లకు పూనుకొన్నప్పుడు పార్లమెంట్‌వారు తెలిసిచేసి ఉండరుగాని ఈ పద్ధతి (ప్రజాభిప్రాయ) పరిమిత రాజరిక విధాన స్థాపనకు దివ్యాయుధమయింది.

ఈ ఇంపీచ్‌మెంట్ తతంగమంతా మిచెల్, మాంపెసాన్‌ల విషయంలోనూ లంచగొండులయిన సర్ జాన్ బెనెట్ అనే జడ్జి, డాక్టర్ ఫీల్డ్ అనే బిషప్‌ల విషయంలోనూ జరగలేదు. కానీ కామన్స్ సభ వారి నేరాలనుగురించి సేకరించిన సాక్ష్యాన్ని ప్రభు సభకు పంపగా ఆ సభ వారికి శిక్ష విధించింది.

ఈ సమావేశంలో ఛాన్సలర్ ప్రభువైన ఫ్రాన్సిస్ బేకన్‌పై లంచాలు తీసుకొన్నాడని ఇంపీచ్‌మెంట్‌కు పూనుకొని ప్రభు సభముందు నేరారోపణ చేయగా నేరా లొప్పుకొన్న బేకన్‌కు ఆ సభ జరిమానా, కారాగారశిక్షలు విధించింది. ఈ అవమానానికి గురికాకుండా

తనకు నిరంకుశ పరిపాలనలో చాలా సహాయపడుతున్న బేకన్‌ను జేమ్స్ కాపాడలేక పోయి నాడు. కాని ఆ శిక్షలు అమలు కాకుండా చూసినాడు.

బేకన్ తరవాత రాజు ప్రివీ కౌన్సిలర్ మిడిల్ సెక్స్ ప్రభువువంతు వచ్చింది. లంచాలు తీసుకొన్నందుకని, ఇంకా ఇతర నేరాలకని అతనిని పార్లమెంట్ ఇమ్పీచ్ చేసి శిక్షించింది. ఈ విషయంలో తనకు సాక్ష్యాల ప్రతు లివ్వలేదని, ప్లీడర్‌ని నియమించుకోనివ్వ లేదని ఆ ప్రభువు ఆక్షేపిస్తే ఇకముందిటువంటి లోపాలు జరగనీరాదని ప్రభువుల సభ ఆజ్ఞా పించింది.

## మొదటి జేమ్స్ విదేశ రాజనీతి

i. *మొదటి జేమ్స్ కాలంలో ఇంగ్లండ్ - స్కాట్లండ్ సంబంధాలు:* మొదటి ఎడ్వర్డ్ కాలంనుంచి ఇంగ్లండ్ స్కాట్లండ్‌లకు అడపాదడపా యుద్ధాలు జరుగుతూనే ఉండేవి. స్కాటిష్ రాజు నాలుగో జేమ్స్ ఇంగ్లండ్‌తో యుద్ధం చేసినవాడే. స్కాటిష్‌రాణి మేరీ కుమారుడు ఆరో జేమ్స్ 1603 లో ఎలిజబెత్ మరణానంతరం ఇంగ్లండ్‌కు మొదటి జేమ్స్‌గా రాజయిన తరవాత ఇంగ్లండ్, స్కాట్లండ్‌లకు సన్నిహిత సంబంధ మేర్పడింది. 1604 లో రెండు దేశాలకు పార్లమెంటరీ సమైక్యం కుదర్చవలెనని జేమ్స్ ప్రయత్నించినాడు. కాని ఆ ప్రయత్నము విఫలమయింది. స్కాచ్ వారికి ఇంగ్లండ్‌లో పౌరసత్వ మివ్వడానికి పార్లమెంట్ నిరాకరించింది. కాని 1603 తరవాత పుట్టిన స్కాచ్‌వారు ఇంగ్లీష్ పౌరులే అని న్యాయ స్థానము తీర్పు నిచ్చింది.

1715 లో రెండో జేమ్స్ కుమారుడు మూడో జేమ్స్, 1745 లో అతని కుమారుడు ఛార్లెస్ ఎడ్వర్డ్ తామింగ్లీష్ రాజులు కావలెనని చేసిన ప్రయత్నాలకు చాలా కొద్దిమంది స్కాచ్ ప్రజలే తోడ్పడినారు తరవాత ఆనీ రాణి కాలంలో (1707 లో) సమైక్య శాసనాన్ని పార్లమెంట్ ఆమోదించడంవల్ల రెండు రాజ్యాలూ అన్ని విధాలా ఒకే రాజ్యమయినాయి ఆనాటి నుంచి ఈనాటి వరకు ఇంగ్లీష్ - స్కాటిష్ ప్రజల సహకారంతో అన్ని రంగాలలోనూ బ్రిటిష్ జాతి అభ్యుదయం పొందడం చూడవచ్చు.

ii. *మొదటి జేమ్స్‌కు ఫ్రాన్స్‌తో సంబంధాలు:* 1603 లో ఇంగ్లండ్ ఫ్రాన్స్‌తో హామ్టన్ కోర్ట్ సంధి చేసుకొన్నది. కొంతకాలం తరవాత హెన్రీటా మేరియాతో జేమ్స్ కుమారుడు చార్లెస్ పెండ్లి జరిగింది. ఆమెతోబాటు ఆమె కాథలిక్ మతగురువు ఇంగ్లండ్‌కు వచ్చి కాథలిక్ మత ప్రచారం సాగించటంవల్ల మొదటి చార్లెస్ రాజైన తరవాత అతడు కాథలిక్ మతంవైపు మొగ్గడంవల్ల జేమ్స్‌కూ అతని తరవాత మొదటి చార్లెస్‌కూ వారి పార్ల మెంట్‌లతో విరోధమేర్పడటం అనంతర చరిత్ర.

iii. *మొదటి జేమ్స్ కాలంలో ఇంగ్లండ్ - హాలండ్ సంబంధాలు:* జేమ్స్ రాజు కాకముందే స్పెయిన్ రాజులకు, వారిపై తిరగబడిన డచ్ కాల్వినిస్టులకు చాల కాలంగా యుద్ధం జరుగుతూ ఉండేది. ఇంగ్లండ్‌కు సమీపాన ఉండే హాలండ్‌లో స్పెయిన్ బలాన్ని క్షీణింపజేయటం ఎలిజబెత్ రాణి సంకల్పము. కాబట్టి కొన్ని డచ్ పట్టణాలను జామీన్ ఉంచుకొని విప్లవకారుల కామె ధనసహాయం చేసింది. 1604 లో జేమ్స్ స్పెయిన్‌తో చేసుకొన్న సంధి కారణంగా డచ్ తిరుగుబాటుదారుల కెటువంటి సహాయమూ చేయలేక

పోయినాడు. ఇది పార్లమెంట్‌కు అతనిపై ఆగ్రహానికి కారణమయింది. 1609 లో హాలండ్ స్పెయిన్‌తో తాత్కాలిక సంధి చేసుకొన్నందువల్ల, తన వ్యయానికి పార్లమెంట్ ఇచ్చిన ధనం చాలనందువల్ల, కాషనరీ పట్టణాల సంరక్షణకు సంవత్సరానికి 20,000 పౌనులు ఖర్చవుతున్నందువల్ల 1616 లో మొదటి జేమ్స్ ఆ పట్టణాలను రెండు లక్షల పదివేల పౌనులకు హాలండ్ ప్రభుత్వానికే స్వాధీనం చేసినాడు.

iv. ***మొదటి జేమ్స్‌కు స్పెయిన్‌తో సంబంధాలు:*** స్వభావతః జేమ్స్ శాంతిని అభిలషించేవాడు. 1604 లో జేమ్స్ స్పెయిన్‌తో సంధి చేసుకోవడం ఇంగ్లీష్ ప్రజలకు ఎంత మాత్రం ఇష్టంలేదు. స్పెయిన్‌కు విరుద్ధంగా డచ్ వారికి యుద్ధంలో సహాయం చేయకపోవడం, వేల్స్ రాజకుమారునికి, స్పానిష్ రాజకన్యకు పెండ్లి కుదర్చడానికి జేమ్స్ సాగించే రాయబారాలూ అతనికీ అతని పార్లమెంట్‌లకూ మధ్య కలతలకు కారణమయినాయి. ప్రొటస్టెంట్ రాజకుమార్తెనైనా తన కుమారునికి చేసుకోవలెనని పార్లమెంట్ జేమ్స్‌కు మనవిచేయగా విదేశ రాజనీతి వారికి అర్థమయ్యే విషయం కాదని దానిలో తలదూర్చవద్దని అతడు పార్లమెంట్‌ను మందలించినాడు

స్పెయిన్‌తో సంధి చేసుకోడానికి ముందే పోప్‌తో జేమ్స్ స్నేహ సంబంధాలు ఏర్పరచు కొన్నాడు. జేమ్స్ ఇంగ్లండ్ రాజవడం పోప్ ఆమోదించగా ఇంగ్లండ్‌లోని కాథలిక్ వ్యవహారాలను చూడటానికి ఆర్చి బిషప్ బ్లాక్‌వెల్‌ను పోప్ నియమించినప్పుడు జేమ్స్ ఆమోదించినాడు. 1603 లో ఇంగ్లీష్ కాథలిక్‌లు పన్నిన చిన్న కుట్ర (Bye-plot) ను బ్లాక్‌వెల్ జేమ్స్‌కు తెలియజేసినాడు. తరవాత బయల్పడిన పెద్ద కుట్ర (Main plot) ఆశయము అరబెల్లా స్టూవర్ట్‌ను రాణిని చేయడం. రెండు కుట్రలనూ అణిచివేయడమయింది. రెండో కుట్రలో భాగమున్నదని సర్ వాల్టర్ రాలేను ఖైదు చేసినారు. కొంత కాలం జరిగిన తరవాత చార్లెస్ - స్పానిష్ రాజకుమార్తెల వివాహానికి స్పెయిన్ సమ్మతి పొందటం కోసం, జర్మనీ వ్యవహారాలలో తన అల్లుడు పలాటిన్ ఎలెక్టర్ ఫ్రెడరిక్‌ను బవేరియా రాజపదవి నుంచి తోసివేసి ఫెర్డినాండ్‌కు రాజ్యమిప్పించడం కోసం, స్పానిష్ సైన్యాలను పంపకుండేటట్లు ఒప్పించటం కోసం స్పెయిన్‌తో నౌకా యుద్ధాలలో విజయం సాధించిన వీరులలో ఒక్కడని కూడా చూడకుండా, సర్ వాల్టర్ రాలేకు జేమ్స్ మరణశిక్ష విధించినాడు అయినా స్పెయిన్ సేనలు పంపింది. అవి ఫ్రెడరిక్‌ను బవేరియా నుంచి తరిమివేసినాయి. జేమ్స్ ఆగ్రహించి స్పెయిన్‌పై యుద్ధం చేయడానికి నిశ్చయించినాడు. పార్లమెంట్ సంతోషించి రాజుకు విశేషించి ధనము మంజూరుచేయడానికి సిద్ధపడింది. ఈ సందర్భంలో (1620 లో) మొదటి జేమ్స్ మూడో పార్లమెంట్ సమావేశమయింది

1620 వరకు విదేశ వ్యవహారాలలో శాంతి ఉన్నందువల్ల అమెరికాలో ఇంగ్లీష్ వలసలనేకం స్థాపితమయినాయి. ఐర్లండ్‌లోని విద్రోహ నాయకులు టైరోనో, టిర్ కానెల్‌లు పరారి కావడంవల్ల ఆ ప్రాంతంలో శాంతి ఏర్పడటమే గాక అల్‌స్టర్ రాష్ట్రంలో స్కాటిష్, ఇంగ్లీష్ ప్రొటెస్టంట్ వలసలు స్థాపితం కావడంవల్ల భావికాలంలో కాథలిక్ - ప్రొటెస్టంట్ కలహాలకు బీజాలు నాటినట్టయింది. ఇంగ్లీష్ వ్యాపారము ఇండియా, అమెరికాలతో వృద్ధి కావడం, ఇంగ్లీష్ పరిశ్రమల పెంపు కారణాలుగా సంపన్నులైన పార్లమెంట్ సభ్యులు పార్లమెంట్ అధికారాన్ని హెచ్చించే ప్రయత్నంలో అధికోత్సాహం చూపసాగినారు.

*స్పానిష్ వ్యవహారాలు, ఫ్లాయిడ్ కేసు:* 1618 లో జర్మనీలోని కాథలిక్, ప్రొటెస్టంట్ రాజ్యాల మధ్య ముప్పయి ఏండ్ల యుద్ధము ఆరంభమయింది. ఆరేండ్ల కింద జేమ్స్ తన కూతురు ఎలిజబెత్‌ను పాలటైన్ ఎలెక్టర్ అయిన ఫ్రెడరిక్‌తో పెండ్లి చేసినాడు. బొహిమియా ప్రొటెస్టంట్‌లు విప్లవం లేవదీసి తమ రాజు ఫెర్డినాండ్‌ను తరిమివేసి ఫ్రెడరిక్‌ను రాజుగా ఎన్నుకొన్నారు. ఫెర్డినాండ్ స్పెయిన్ రాజు సహాయ మడిగినాడు. యుద్ధం వ్యాపించ కుండా చేయడానికి జేమ్స్ (మొదటివాడు చనిపోయినందువల్ల) తన రెండో కుమారుడూ వేల్స్ రాజకుమారుడూ, అయిన చార్లెస్‌కు, స్పెయిన్ రాజకుమార్తెకు వివాహం కుదిరితే బాగుండునని ప్రయత్నం చేసినాడు. ఎలిజబెత్ కాలపు యుద్ధాలలో స్పానిష్ వారికి గుండె గాలమైన సర్ వాల్టర్ రాలీకి స్పెయిన్ స్నేహాన్ని (పాత నేరాన్నొకటి పైకిదీసి) కోరి శిరః ఖండనం చేయించినాడు. ఈ సమయంలో కాథలిక్ మతానికి చెందిన స్పెయిన్ రాజ్యంతో సంబంధం మానుకొని ఏ ప్రొటెస్టెంట్ రాకుమార్తెతోనైనా చార్లెస్ పెండ్లి జరిపించమని పార్లమెంట్ మనవి చేసింది. ఇట్లా ఉండగా స్పానిష్ సేనలు పాలటైన్‌ను ఆక్రమించడం, బోహిమియాను ఫ్రెడరిక్ పోగొట్టుకోవడం ఒకే సమయంలో జరిగినాయి. అందువల్ల స్పెయిన్‌తో అవసరమయితే యుద్ధం చేయడానికి 5 లక్షల పౌనులు జేమ్స్ అడగగా వెంటనే మూడో పార్లమెంట్ మొదటి సమావేశంలోనే లక్షా అరవైవేల పౌనులు సహాయక ధనము (Subsidy) ఆమోదించినారు స్పెయిన్ 1620 లో పాలటైన్‌ను ఆక్రమించినందుకు తన సంతోషాన్ని ప్రకటించిన కాథలిక్ బారిస్టర్ ఫ్లాయిడ్‌ను కామన్స్ సభ విచారించి జరిమానాతో బాటు బండకొయ్య శిక్ష (Pillory) విధించింది. అసలట్టి నేరాలను విచారించి శిక్ష విధించే అధికారము నార్మన్ గ్రేట్ కౌన్సిల్ నుంచి తనకు సంక్రమించిందే గాని కామన్స్ సభకు లేదని ప్రభు సభ ఆక్షేపించగా కామన్స్ సభ ఫ్లాయిడ్ కేసును ప్రభు సభకు బదిలీ చేసింది. ఇంతలో తాను యుద్ధానికి సప్లయిలు కోరగా నిరాకరించిన పార్లమెంట్‌ను రాజు వాయిదా వేయటం జరిగింది.

*మొదటి జేమ్స్ మూడో పార్లమెంట్, రెండో సమావేశము* (1621): మొదటి రెండు సమావేశాల మధ్యకాలంలో రాజుపక్షంవారు తన ఉద్యోగకాలంలో అక్రమ ప్రవర్తనకు పాల్పడినాడని సర్ ఎడ్వర్డ్ కోక్‌పై చర్య తీసుకోడానికి పూనుకొన్నారు. సమావేశం కాగానే కామన్స్ సభ కోరికపై నేరమారోపించిన వారిని నిర్బంధంలో ఉంచి విచారణ జరపటానికి ఒక కమిటీని నియమించింది. కోక్ ప్రతిపాదనపై కామన్స్ వారు ఇంగ్లండ్‌లో కాథలిక్ పద్ధతులు వ్యాపించకుండా చూడుమని, చార్లెస్‌కు ప్రొటస్టంట్ రాకుమార్తెతో పెండ్లి చేయుమని, స్పెయిన్‌పై యుద్ధం ప్రకటించుమని రాజును కోరినారు,

విదేశీ రాజనీతి రహస్య వ్యవహారమని, అందులో పార్లమెంట్ జోక్యం పెట్టుకోకూడదని జేమ్స్ కామన్స్ స్పీకర్‌కు వ్రాసినాడు. దానికి వాక్స్వాతంత్ర్యము తమ హక్కు అని కామన్స్ బదులు చెప్పగా అది చెల్లదని రాజు ప్రకటించినాడు. రాజ ప్రకటనను ఖండిస్తూ కామన్స్ సభ కింది విధంగా తీర్మానించింది :

(i) మా స్వాతంత్ర్యాలు, ప్రాతినిధ్యాలు, హక్కులు ఈనాటివి కావు. జన్మతః ప్రజలకు ప్రాప్తించినవి. అవి వారి వారసత్వము.

(ii) రాజుకూ, రాజ్యానికి, చర్చికి, ప్రజల కష్టనిష్ఠూరాలకు సంబంధించిన విషయాలను చర్చించటానికి, సంప్రదించటానికి, చట్టాలు చేయటానికి పార్లమెంట్‌కు అధికారమున్నది.

(iii) అటువంటివి చర్చించటానికి ప్రతి సభ్యునికి వాక్స్వాతంత్ర్యముంది, ఉండి తీరవలె.

జేమ్స్ పార్లమెంట్ రికార్డులను తెప్పించి పై తీర్మానమున్న పేజీని చింపివేసి ఆ మూడో పార్లమెంట్‌ను రద్దు చేసినాడు.

**జేమ్స్ నాలుగో పార్లమెంట్ (1628-24):** రాజుకు, పార్లమెంట్‌కు విభేదాలు ఎక్కువగా లేని కాలమిది. పరిశ్రమలకు, వర్తకానికి సంబంధించిన గుత్తాధికారాలను ఇవ్వడం, చట్ట విరుద్ధమైన లైసెన్సు లివ్వడం, కోర్టు తీర్పుకు ముందే దాని పరిశీలనలో ఉన్న అపరాధాలను రాజు మన్నించడం—అన్నీ చెల్లవని, ప్రాచీన మౌలిక శాసనాలకు విరుద్ధమని ఈ పార్లమెంట్ శాసనం చేసింది. కొత్తగా కనిపెట్టిన యంత్రాలకూ పేటెంట్ (Patent) హక్కు లివ్వడం మాత్రం నిషేధం నుంచి మినహాయించడమయింది.

స్పెయిన్‌తో వివాహ సంబంధాలు ఏర్పరచుకొనే ప్రయత్నాన్ని విరమించుకోవడమే గాక స్పెయిన్‌తో యుద్ధానికి కూడా సన్నద్ధుడై జేమ్స్ పార్లమెంట్‌ను యుద్ధ వ్యయానికి ఆరు సబ్సిడీలు అడిగినాడు. పార్లమెంట్ మూడు సబ్సిడీలు మాత్రమే మంజూరు చేసింది సబ్సిడీ అంటే ప్రత్యక్ష భూమిపన్ను, ఆస్తిపన్ను, భూమిపన్ను మేరీ రాణి కాలపు భూమి విలువపైన పౌనుకు 48 పెన్నీల వంతున, ఆస్తిపన్ను 14 వ శతాబ్దం మధ్యలో నిర్ణయించిన వస్తువుల విలువపై పౌనుకు 32 పెన్నీల వంతున, రాజ భూములలో ఉన్న ప్రజలపై మాత్రం 1/10 వంతున ఆస్తిపన్ను చెల్లించవలసినట్లు పార్లమెంట్ నిర్ణయించింది అంటే సబ్సిడీ మొదలైన వాటివల్ల సుమారు లక్ష పౌనులు, యుద్ధానికని ప్రత్యేక ఆదాయము నాలుగో పార్లమెంట్ రాజుకు చూపిస్తే యుద్ధానికి చేసే వ్యయాన్ని పార్లమెంట్ నియమించే కోశాధికారులు అజమాయిషీ చేయడానికి జేమ్స్ అంగీకరించినాడు. 1624 మే మాసాంతంలో ఈ నాలుగో పార్లమెంట్ రద్దయింది. 1625 మార్చి 27 వ తేదీన జేమ్స్ స్వర్గస్థుడయి ధన్యుడయినాడు. కాని ఛార్లెస్‌కు ఇకముందున్నది ముసళ్ళ పండుగ.

## జేమ్స్ పరిపాలన ఫలితాలు

**కామన్స్ సభ సాధించిన హక్కులు:** 1. ఇంపీచ్‌మెంట్ హక్కు పునరుద్ధరించడం; 2. ప్రజలందరికి సంబంధించిన విషయాలపై చర్చకు స్వాతంత్ర్యము; 3. గుత్తాధికార నిషేధ శాసనము; 4. రాజ ప్రకటనలవల్ల కొత్తనేరాలు సృష్టించకపోవడం; 5. దిగుమతి ఎగుమతులపై కొత్త పన్నులను, అదనపు పన్నులను, పార్లమెంట్ మంజూరుచేయని పన్నులను నిషేధించడం; 6. రాజు అడిగినంత ఇవ్వక, పరిపాలనకు కావలసినంతైనా ఇవ్వక ఎప్పుడూ రాజు తనపై ఆధారపడేటట్లు చేయడం - ధనము మంజూరుకు ముందు తన కోరికలు తీర్చమని పట్టుబట్టడం; 7. రాజు నిరంకుశ చర్యలకు మంత్రులను బాధ్యులుగా చేయడం - ఆ విధంగా కార్యనిర్వాహణశాఖ శాసన సభకు లోబడి ఉండేటట్లుచేయడం; 8. పార్లమెంట్ కొన్ని న్యాయ శాఖాధికారాలు పొంది రాజ్యంలో సార్వభౌమాధికారాన్ని సాధించడానికి పునాదులు వేయడం.

మొదటి ఛార్లెస్ (1625-49), పార్లమెంట్‌తో వివాదాలు: మొదటి ఛార్లెస్‌కు తండ్రికున్న సామర్థ్యం లేదుగాని, అతనికి లేనంత మొండితనము, సాహసమూ ఉన్నాయి. అతనిని పరివేష్టించి ఉన్న రాజోద్యోగులు, మతాధికారులు చిన్ననాటినుంచి రాజ పదవి దైవ దత్తమని, రాజ్యాధికారము విశిష్టము, ప్రత్యేకము, ఎదురులేనిదని నూరి పోసినారు. దానికి తోడు న్యాయాధిపతుల తీర్పులు కూడ రాజు నిరంకుశాధికారాన్ని సమర్థించేవిగానే ఉండేవి. ఒకరు చెప్పినా వినడు తనకు తెలియదు. మూర్ఖులు అనుభవంవల్లనైనా తెలుసుకొంటారు. ఎదురు దెబ్బ తగిలినప్పుడు మరింత బిర్రబిగుసుకొనే తత్వము అతనిది. తొందరపడి మాట ఇస్తానేమో అని అనుమానము. అందుచేత వాగ్దానభంగం చేయడం అతనికి పరిపాటి అయింది. అతని మాట నెప్పుడూ, ఎవ్వరూ నమ్మని పరిస్థితి ఏర్పడింది. న్యాయంగా తనకుగల హక్కులను నిలబెట్టుకోవడానికి పోరాడుతున్నాననే భావమేగాని ఇతరుల హక్కులకు భంగం కల్గిస్తున్నాననే భావం అతనికి కలగనే లేదు.

ఇక పార్లమెంట్ హక్కులకోసం పోరాడే వారిలో కొత్తగా చేరిన సర్ జాన్ పిమ్, ఎలియట్, హామ్ప్డన్ మొదలైనవారు అతివాదులు వారికి పరిపాలనా బాధ్యత లేదు. ప్రభుత్వం ఇబ్బందులు వారిని బాధించవు. రాజడిగిన ధనాన్ని ఇస్తామంటారుగాని చాలినంత ఇవ్వరు. వారివ్వనందువల్ల చట్టవిరుద్ధమైన ఆదాయాలకు రాజు ఎగబడితే అటువంటి చర్యలను ముందు ఖండించి ఇకమీదట అటువంటి తప్పులను చేయనని రాజు వాగ్దానమిస్తేనేగాని రొక్క మివ్వమని రాజును నొక్కేవారు. అట్లా నొక్కితే రాజు తన విశేషాధికారాలకు స్వస్తి చెప్ప వచ్చునని వారు భావించినారు. రాజ్యంలో సార్వభౌమాధికారము ప్రజాప్రతినిధులైన తమదో రాజుదో తేల్చుకోవలసిన సమయం వచ్చిందని, తమకు ఏకాభిప్రాయం కుదరనప్పుడు పార్లమెంట్ మాటే చెల్లితీరవలెనని, అందుకే తాము రాజుతో పోరాడుతున్నామని ఇప్పటికి వారికి చక్కగా తెలిసివచ్చింది. ఛార్లెస్‌తో వివాదపడే పార్లమెంట్ సభ్యులలో అధిక సంఖ్యా కులు ప్యూరిటన్‌లు. వీరికి ఆంగ్లికన్ చర్చి వ్యవహారమంతా కాథలిక్ పద్ధతిగా తోచింది. ఛార్లెస్ భార్య హెన్రిటా మేరియా ఫ్రెంచి రాజకుమారి; కాథలిక్ మతస్థురాలు. రాజు మత విషయంలో రాణి పద్ధతులవైపు మొగ్గు చూపుతున్నాడని వారికి గట్టి నమ్మకము.

ఈ పరిస్థితులలో రాజుకు, కామన్స్ సభకు పోరాటం ఎట్లాగూ తప్పదు. ఆ పోరా టంలో రాజు ఓటమి తథ్యము. ఏమంటే సరయిన పథకం వేసుకోనూ లేదు; సమయం చూసి చావుదెబ్బ కొట్టనూ లేదు.

ఛార్లెస్ మొదటి పార్లమెంట్ (1625): స్పెయిన్‌తో యుద్ధానికి తొందరపడుతూ ఛార్లెస్ గద్దె ఎక్కిన అయిదు రోజులకే పార్లమెంట్‌ను సమావేశపరచడానికి తాఖీదులు పంపి నాడు. పుష్కలంగా పార్లమెంట్ ధనమిస్తుందని ఆశించినాడు. కాని పార్లమెంట్ ఇచ్చినది రెండు సబ్సిడీలే. టన్నేజ్, పౌండేజ్‌లు ఒక సంవత్సరానికి మాత్రమే. మొదటి జేమ్స్ రాజయినప్పుడు టన్నేజ్, పౌండేజ్‌లు ఆయనకు జీవిత పర్యంతమూ పార్లమెంట్ ఇచ్చింది. ఛార్లెస్ యుద్ధానికని కోరిన మొత్తంలో పదో భాగం కూడా కామన్స్ సభ మంజూరు చేయ లేదు. ఇంగ్లండ్‌లో ప్రాటెస్టంట్ మతానికి కాథలిక్‌ల ఉపద్రవ మొకటి కొత్తగా వచ్చి పడిం దని, పరిపాలనలోని లోపాలను తెలుసుకొని వాటిని రాజ్యంలోని ఇతర అనర్థాలను ముందు సవరించవలసినదని కామన్స్ సభ తీర్మానించింది. చాలా కాలంగా స్పెయిన్‌పై యుద్ధం

ప్రకటించవలెనని కోరుతూ ఉన్న పార్లమెంట్ చివరకు యుద్ధం నిశ్చయమైన తరవాత దానికి తగిన సహాయం చేయ నిరాకరించింది. విసిగి ఛార్లెస్ పార్లమెంట్‌ను రద్దు చేసినాడు (12-8-1625).

*మొదటి ఛార్లెస్ రెండో పార్లమెంట్* (6-2-1626): పార్లమెంట్ సహాయం లేనందువల్ల ఛార్లెస్ ప్రభుత్వం సాగించలేక రెండో పార్లమెంట్‌ను త్వరగా సమావేశపరచవలసి వచ్చింది. ధన సహాయం మాట ఎత్తకుండా ముందు ఛార్లెస్ దుష్పరిపాలనకు కారకులైన వారిని శిక్షించడానికి కామన్స్ పూనుకొన్నది. దాని దాడినుంచి బకింగ్‌హామ్‌ను కాపాడేటందుకు సమావేశమైన రెండు నెలలకు ఛార్లెస్ తన మొదటి పార్లమెంట్‌ను రద్దుచేసినాడు. ఈ రెండో పార్లమెంట్ చేయబూనుకొన్న మొదటి పని బంకింగ్‌హామ్ విచారణే. కామన్స్ సభ్యులను తన సన్నిధికి పిలిపించి వారు చేయవలసిన మొదటి పని సప్లయులు మంజూరుచేయటమేనని బంకింగ్‌హామ్ గాని ఇతర రాజోద్యోగులు గాని ఏది చేసినా తన ఆజ్ఞను అనుసరించే చేసినారని, వారిని కామన్స్ సభ ప్రశ్నించడానికి తాను అనుమతించనని ఛార్లెస్ వాదించినాడు. 1624 లో నౌకా సైన్యాన్ని స్పెయిన్ పైకి నడిపించి ఓడినందుకు మాన్‌ఫీల్డును, తరవాత 1625 లో కేడిజ్ పైకి పంపిన నౌకాదళము ఓడినందుకు బాధ్యులైన వారిని - ఆ ఓటమిలో తన బాధ్యత ఏమీ లేనట్లు - బకింగ్‌హామ్ ప్రభృతులను ముందు శిక్షించకపోతే తాము ఛార్లెస్‌కు సప్లయులు చేయమని కామన్స్ సభ పట్టుబట్టింది. కామన్స్ సభ్యులయ్యే వీలులేకుండా కోక్, వెంట్‌వర్త్‌లను షెరిఫ్‌లుగా రాజు నియమించినాడు; బ్రిస్టల్ ప్రభువు శాసనసభకు హాజర్ కారాదన్నాడు; అరండేల్ ప్రభువును నిర్బంధంలో ఉంచినాడు. ఇవి చాలక ఫ్రాన్స్‌తో సముద్ర యుద్ధం పెట్టుకొని ఒక నౌకా దళాన్ని లా రోషెల్ దీవికి పంపగా అది అక్కడ భగ్నమయింది. వీటన్నిటిని గురించి, యుద్ధ చర్యలనుగురించి ముఖ్యంగా బకింగ్‌హామ్‌ను విచారించవలెనని కామన్స్ సభ మంకుపట్టు పట్టింది. ఇంపీచ్‌మెంట్ ప్రధాన నాయకులైన ఇలియట్, డిగ్‌లను వారన్నమాటలకు జేమ్స్ లండన్ టవర్‌లో పడవేసినాడు. వారిని ముందు విడుదలచేయనిదే మరేపనీ చేయమని కామన్స్ సభ అన్నందువల్ల విధిలేక రాజు లొంగిపోయినాడు. టన్నేజ్, పౌండేజ్‌లను తాము మంజూరుచేయనిదే రాజు వసూలు చేయరాదని, బకింగ్‌హామ్‌ను ఉద్యోగం నుంచి తొలగించనిదే తాము ధన మివ్వమని భీష్మించినందువల్ల ఛార్లెస్ ఈ రెండో పార్లమెంట్‌ను రద్దుచేసినాడు (15-6-1626).

బకింగ్‌హామ్‌ను ఇంపీచ్ చేస్తూ డిగ్, ఇలియట్‌లు అన్న మాటలు కొన్ని చాలా అర్థవంతమైనవి. "ఇంగ్లండ్ రాజు తప్పు చేయడు. శాసన విరుద్ధమైన పని తాను చేయడు ఇతరులను చేయమని నిర్బంధించడు. రాజు చేయ మన్నందువల్ల తాము చేసినామనేవారే ఆ పనులవల్ల అనర్థాలు కలిగితే బాధ్యులు అవుతారు; రాజు కాదు" అని డిగ్స్ సిద్ధాంతం చేసినాడు. ఇంక ఇలియట్ ఈ సిద్ధాంతాన్ని మరింత వివరిస్తూ "రాజు ఒప్పుకొన్నా, రాజే ఆజ్ఞాపించినా - ఆయన ఒప్పుకొన్నాడని, ఆజ్ఞాపించినాడని నేను నమ్మలేను - అంత ఉన్నత పదవిలో ఉన్న వ్యక్తి రాజును బతిమాలిగాని ఆ పని ఎటువంటి దుష్ఫలితాలకు దారి తీస్తుందో నచ్చచెప్పిగాని చెడుమార్గం నుంచి మళ్ళించకపోతే శిక్షార్హుడే" అంటూ మంత్రివర్గం బాధ్యతను సుస్పష్టం చేసినాడు. పరిపాలకులైన మంత్రులు తమ చర్యలకు ఇక మీదట రాజును అడ్డుపెట్టుకోలేరన్నమాట. అంటే డిగ్స్, ఇలియట్‌ల హేతువాదం కార్యరూపం దాల్చిన

నాడు పరిమిత రాజరికము (limited monarchy) ఏర్పడినట్లే. దుష్పరిపాలన సాగించ టానికి రాజుకు నమ్మినబంట్లు దొరకరన్నమాట.

*ఛార్లెస్ రెండో, మూడో పార్లమెంట్ల మధ్య కాలము (1626-27)*: పరిమిత రాజరిక మేర్పడటానికి ముందు బ్రిటిష్ రాజ్యాంగ చరిత్ర ఎన్నో అవాంఛనీయ పరిణామాలను ఎదుర్కొనవలసి వచ్చింది. అందులో మొదటిది ఛార్లెస్‌కు, అతని పార్లమెంట్‌కు జరిగిన అంతర్యుద్ధము ; కడపటిది రాజు శిరః ఖండనము. ట్యూడర్లు తమ చర్యలవల్ల ప్రజలు ఎదురు తిరిగితే తమ మంత్రుల తలలు అప్పగించి తాము తప్పించుకొనేవారు. పార్లమెంట్ వద్దన్నా, మంత్రుల బాధ్యతలను ఛార్లెస్ తన నెత్తిన వేసుకొనేవాడు. తనను నమ్మిన వారికి కష్టాలు రాకూడదనే నీతికి లోబడి తన తలనే బలి ఇచ్చినాడు.

విదేశాలతో యుద్ధాలు లేనప్పుడే పరిపాలన సాగించటానికి ప్రభుత్వాదాయం చాల కుండేది. ఇప్పుడు స్పెయిన్‌తో యుద్ధానికి తోడు ఫ్రాన్స్‌తో 1627లో యుద్ధం వచ్చి పడింది. అందుచేత జేమ్స్ పద్ధతులనే గాక ధన సంపాదనకు ఛార్లెస్ కొత్త మార్గాలు తొక్క వలసి వచ్చింది. టన్నేజ్, పౌండేజ్‌లను పార్లమెంట్ మంజూరుచేయకపోయినా అతడు వసూలు చేసినాడు. (బలవంతపు) కానుకలు, నిర్బంధ ఋణాలు లాగుకొన్నాడు. పెద్ద ఎత్తున అప్పులు చేసినాడు. మినహాయింపులను అమ్మినాడు. కడపటి సబ్సిడరీ రేటుకు అయిదంత లుగా నిర్బంధ ఋణాన్ని కూడా పన్నువలెనే వసూలుచేయడానికి ప్రయత్నించినాడు. కాని ఈ విధంగా లభించిన ధనము చాలా కొంచెము. 1625 లో కౌంటీలలో బలవంతంగా సైనికు లను సమీకరించినాడు. 1626, 1627 లలో సముద్రతీర మండలాలలోని వారు ఓడలనయినా వాటికి బదులు ఓడ రుసుమునైనా చెల్లించేటట్లు చేసినాడు. ఇది మధ్యయుగం నుంచి అమలులో ఉన్న ఆచారము. కాని దానికి విరుద్ధంగా తీర ప్రాంతాలవారి నుంచే కాక మధ్యమండలాల ప్రజలనుంచి కూడ ఓడ రుసుము ఛార్లెస్ వసూలు చేయదలచినాడు. తన సొంత భూములను అమ్మినాడు. ఎన్ని విధాల ప్రయత్నించినా లభించిన ధనమేమో కొద్ది - ఉద్భవించిన జన ద్వేషము ఎక్కువ. 1626 సెప్టెంబర్‌లో విధించిన నిర్బంధ ఋణాన్ని ఎదిరించిన స్థానిక శాంతి స్థాపక న్యాయమూర్తులను (Justices of the Peace) ఉద్యోగాలనుంచి తొలగించి నాడు. ఋణ మివ్వరాదన్న వారి పేర్లు ప్రీవీ కౌన్సిల్‌కు పంపినాడు. సామాన్యులను బల వంతంగా సైనికులను చేసినాడు. కొందరి జరిమానాలు, జైలు శిక్షలు ప్రాప్తమయినాయి. ఈ కొత్త సైనికులలో క్రమశిక్షణ నిలబెట్టడానికి (యుద్ధకాలంలో విధించే) సైనిక శాసనాన్ని దేశంలో యుద్ధం లేకున్నా ప్రకటించినాడు. పౌరులు సైనికులను తమ ఇండ్లలో ఉంచుకొని పోషిస్తూ వారి జులుమ్‌ను, అత్యాచారాలను సహించవలసి వచ్చింది. ఇన్నాళ్ళూ రాజంటే అయిష్టత కామన్స్ సభ్యులకే ఉండేది— ఇప్పుడు అతనిపై ద్వేషము జన సామాన్యంలో కూడా వ్యాపించింది.

*డార్నెల్ వ్యాజ్యము (Darnel's case)*: డార్నెల్, అతనితోబాటు నలుగురు యోధులు నిర్బంధ ఋణమివ్వడానికి నిరాకరించగా వారిని రాజు ఖైదు చేయించినాడు రాజు బెంచ్ కోర్టులో తమను విడుదల చేయించమని ఆ అయిదుగురు (Write of Habeas corpus) పిటిషన్ పెట్టుకొన్నారు. రాజు ప్రత్యేక ఆజ్ఞలను అనుసరించి వారిని ఖైదులో ంచినానని జైలర్ కోర్టుకు సమాధానమిచ్చినాడు. 1591 లో ఇటువంటి కేసులో న్యాయాధి

పతులు రాజు కనుకూలంగా తీర్పు ఇచ్చినందువల్ల, ఇంతకుముందు రాజు అభిప్రాయాన్ని లెక్కచేయని ముఖ్య న్యాయాధిపతి కోక్‌ను 1616 లో పదవీ భ్రష్టుని చేయటాన్ని గమనించి నందువల్ల దేశరక్షణకు పౌరులను విచారణ చేయకుండానే జైలుకు పంపే హక్కు రాజుకు ఉండటం అవసరమని బెంచ్ కోర్ట్ వా రభిప్రాయమిచ్చినారు. అటువంటి హక్కు రాజుకు ఉన్నదని అనుకొన్నా, పౌరులను విచారణకు చేయకుండా చెరకు పంపిన నేరాన్ని వారంట్‌లో పేర్కొనవలసిందేనని ఆ అయిదుగురి పక్షానా న్యాయవాది వాదించినాడు. రాజు ప్రస్తుత చర్య మాగ్నాకార్టా సూత్రాలకు విరుద్ధమని అతని వాదన. కారణం చెప్పడంవల్ల ఒక్కొక్కప్పుడు ప్రజాక్షేమానికి భంగం వాటిల్లుతుందని జడ్జీలు అభిప్రాయపడినారు. కారణం చెప్పకుండా విచారణ జరిపి ట్యూడర్ రాజులు ఎందరినో జైళ్ళకు పంపలేదా అని ఛార్లెస్ పక్షం వారి సమర్థన. అది నిజమేకాని పార్లమెంట్‌కు తాను సమ్మతించని పన్నులు రాజు వసూలు చేయరాదు అనే అధికారమున్నప్పుడు దానిని తోసిపుచ్చి రాజు తన ఇష్టానుసారం పన్నులు రాబట్టడం, పన్నులు ఇవ్వడానికి నిరాకరించిన వారిని ఖైదుకు పంపడం రాజ్యాంగ విరుద్ధమని కామన్స్ సభవారి వాదము. ఇది ఇట్లా ఉండగా స్పెయిన్‌తో ఛార్లెస్ మళ్ళీ యుద్ధానికి దిగినాడు. రీ (Rhe) దీనిపైకి పంపిన నౌకా సైన్యము ఓడిపోయింది.

*ఛార్లెస్ తీవ పార్లమెంట్* (1628-1629); ఎన్ని ఉపాయాలు పన్నినా యుద్ధ వ్యవహారాలు సాగించడానికి చాలినంత ద్రవ్యం చేకూరలేదు. అందుచేత రాజు మూడో పార్లమెంట్‌ను 1628 మార్చిలో సమావేశపరిచినాడు. దేశంలో అప్పుడున్న రాజకీయ వాతావరణంలో ఎక్కువమంది రాజు ప్రతిపక్షులే ఎన్నిక కావడంలో ఆశ్చర్యమేమీ లేదు. కామన్స్ సభ రాజుకు అయిదు సబ్సిడీలు మంజూరుచేసింది. అంటే రాజు కవసరమయిన ద్రవ్యంలో మూడోవంతు ఇవ్వడానికి అంగీకరించిందన్నమాట. మంజూరు చేసిందేగాని ఎప్పుడు వాటిని వసూలుచేయవలెనో అది నిర్ణయం చేయలేదు. తన అవసరాలుగాని, తా ననుసరించదలచు కొన్న విదేశ రాజనీతినిగాని రాజు కామన్స్ సభకు నివేదించలేదు.

కామన్స్ సభ యథాపూర్వకంగా ముందు పరిపాలనా లోపాల సవరింపు, తరవాత ధనం మంజూరు అనే క్రమాన్ని అనుసరించింది. అప్పటికి బకింగ్‌హామ్‌పై దాడి అటుంచి ఇటీవలి పరిపాలనలో కనిపించిన ప్రజాక్షేమ విరుద్ధాలైన రాజ్యాంగ విరుద్ధాలైన కార్యకలాపాలను ఖండించడానికి పూనుకొన్నది. తమ విషయమై రాజు ఉపయోగించిన బెదరింపు మాటలకు మండిపడి కామన్స్ సభవారు కమిటీగా మారి రాజు చేసిన ప్రత్యేకాధికార దుర్వినియోగాన్ని గురించి చర్చించసాగినారు. వారికి ఆగ్రహం కలిగింది ముఖ్యంగా నాలుగు విషయాలలో : 1. శాసన విరుద్ధాలైన పన్నులు విధించడం ; 2. నేరారోపణ, న్యాయస్థాన విచారణ, శిక్షవిధింపు లేకుండా పౌరులను కారాగృహాలలో ఉంచడం ; 3. సైనికులను ప్రజల ఇండ్లలో ఉంచి వారికయ్యే వ్యయాన్ని ఆ కుటుంబ యజమానులపై రుద్దడం ; 4. శాంతి సమయంలో సైనిక శాసనాన్ని పౌరులపట్ల అమలుపరచడం.

ఈ నాలుగు దురాచారాలను తీవ్రంగా ఖండిస్తూ పార్లమెంట్ తీర్మానంచేసినా అది నిరుపయోగమని స్వానుభవంవల్ల పార్లమెంట్‌కు తెలుసు. ఈ నాలుగింటిని ప్రస్తావించి ఇవి శాసన విరుద్ధాలంటూ చట్టం చేస్తే చాలునని కొందరాలోచించినారు. కాని అటువంటి శాసనానికి తాను సమ్మతించనని ఛార్లెస్ ముందే స్పష్టపరచినాడు. కొత్తగా చట్టమేదీ చేయకుండా ఈ

విషయాలపై ముందున్న శాసనాలను ఉదాహరిస్తే బాగుంటుందని కొందరు చూసినారేగాని, రాజు దాని కంగీకరించి తరవాత తన నిరంకుశ చర్యల కనుకూలమైన వ్యాఖ్యానం చేయగల డనే భయం లేకపోలేదు. దీర్ఘంగా చర్చించి ఒక హక్కుల అర్జీ లేదా పిటిషన్ (Petition of Right) రాజుకు సమర్పించవలెనని కామన్స్ సభ తీర్మానించింది. స్వతంత్ర పౌరుల నెవ్వరినీ న్యాయమైన కారణాన్ని న్యాయసమ్మతమైన అనుమతిపత్రం (Warrant)లో పేర్కొనకుండా ఖైదు చేయరాదని, పార్లమెంట్ సమ్మతిలేకుండా ఏ పన్నూ వసూలుచేయ రాదనీ ముందు తీర్మానించి రాజుకు ఇవ్వదలచిన పిటిషన్‌గురించి సంప్రదించడానికి ఉమ్మడి సమావేశం జరపవలెనని కామన్స్ సభ ప్రభువుల సభను కోరింది. ప్రభువుల సభ కామన్స్ సభ తయారుచేసిన పిటిషన్‌లోని హక్కులను బలపరుస్తూనే అందులో ''రాజుకు సార్వ భౌమాధికారం సంపూర్ణంగా ఉంటుంది'' అనికూడా పేర్కొనవలెనని సూచించింది. కామన్స్ సభ ఈ సూచనను సంపూర్ణంగా తోసిపుచ్చింది. తరవాత పార్లమెంట్ హక్కుల పిటిషన్‌ను యథాతథంగా ఆమోదించింది.

ఈ హక్కుల పిటిషన్ (1628)లోని ముఖ్యాంశాలు కింది విధంగా ఉన్నాయి: i. పూర్వం టాలేజ్‌లను నిషేధించిన స్టాట్యూట్‌ను, మూడో ఎడ్వర్డ్ కాలంలో పార్లమెంట్ సమ్మతి లేకుండానే పన్ను, టాలేజ్, సుంకం విధించడాన్ని నిషేధించిన శాసనాన్ని జ్ఞప్తికి తెచ్చింది. ii. నిర్బంధ ఋణాలను వసూళ్ళు చేయడాన్ని, ఇవ్వడానికి నిరాకరించిన వారిని ఖైదు చేయడాన్ని ఆక్షేపించింది. iii విచారణలేకుండా ప్రజలను ఖైదు చేయడాన్ని మాగ్నాకార్టా ఖండించిన విషయాన్ని ప్రస్తావించి అటువంటి అక్రమాలను రాజాజ్ఞ పేరిట సమర్థించడాన్ని విమర్శించింది. iv. ప్రైవేట్ వ్యక్తుల ఇండ్లలో సైనికులను ఉంచడాన్ని, సైనిక శాసనం ప్రకారం శిక్షలు విధించడాన్ని ఆక్షేపించింది. v. ఇంగ్లండ్ స్టాట్యూట్‌ల, శాసనాల ద్వారా ప్రజలకు లభించిన హక్కులకు భంగం కలగకుండా చూడవలెనని రాజుకు మనవి చేసింది.

ఈ హక్కుల పిటిషన్‌ను తా నామోదిస్తే రాజ పదవినిబట్టి తనకున్న నిరంకుశాధి కారాన్ని వదలుకొన్నట్లవుతుందా అని న్యాయాధిపతులను పిలిపించి రాజు సంప్రదించినాడు. వారి సమాధానము తృప్తికరంగా లేనందువల్ల పిటిషన్ మంజూరుచేయడానికి సంకోచాన్ని చూపినాడు గాని చివరకు రెండు సభల ఒత్తిడికి లొంగిపోయి ''పిటిషన్‌లో ప్రస్తావించిన కోరికలు తీరునుగాక'' అని హక్కుల పిటిషన్‌కు ఛార్లెస్ తన ఆమోదం తెల్పినాడు.

*హక్కుల పిటిషన్ ప్రాముఖ్యము:* ఆమోదం తెల్పుతూ ఆయనచేసిన ఆజ్ఞకు న్యాయ స్థానం తీర్పుకు ఉన్నంత విలువ ఉంది. ఆ ఆజ్ఞలో ప్రస్తావించిన హక్కులు రాజు విశేషాధి కారాల పరిధినుంచి న్యాయస్థానాధికారాల పరిధిలోకి వచ్చినాయి. ఆ హక్కులను రాజు అతిక్రమించకుండా కాపాడటం ఉన్నత న్యాయస్థానాల బాధ్యత.

హక్కుల పిటిషన్ ఒక స్టాట్యూట్ కాదు అరవై ఏండ్ల తరవాత దానిలో ఉదాహ రించిన హక్కులు శాసనరూపం దాల్చినాయి. అనాటికది న్యాయస్థానం రికార్డ్ మాత్రమే. మాగ్నాకార్టాతో ఆరంభమైన రాజ్యాంగానికి సంబంధించిన ముఖ్య పత్రాలలో ఇది ఒకటి. కొత్తగా ఇది సాధించిన ప్రజల హక్కు లేమీ లేవు. మాగ్నాకార్టాలో ఉన్నట్లే ఈ పిటిషన్‌లో కూడా అనాటి ప్రజలు పడుతున్న ఇబ్బందులను పేర్కొన్నారు. రాజు చర్యలవల్ల ఏయే

హక్కులకు భంగం కలుగుతున్నదో ప్రస్తావించడమే గాక ఆ హక్కులు కొత్తగా పార్లమెంట్ కోరుతున్నవి కావని, అవి అనాదినుంచి ప్రజల అనుభవంలో ఉన్నట్టివేనని మాగ్నాకార్టా వలెనే ఈ హక్కుల పిటిషన్ కూడా ఘోషించింది. అంతేకాని రాజకీయ తత్వవిచారణకు అమెరికన్ (U. S. A.) రాజ్యాంగ శాసనం పూనుకొన్నట్లు ఈ పిటిషన్ పూనుకోలేదు. ఈ పిటిషన్‌లోని ప్రజల హక్కులను ఛార్లెస్, తరవాతి రాజులు మన్నించవలసి వచ్చింది. ఈ చర్చలలో ధ్రువపడిన దేమంటే ప్రజాప్రతినిధి అయిన పార్లమెంట్ అభిప్రాయాలకు రాజు బద్ధుడై ఉండవలెననే ప్రధాన రాజ్యాంగ సిద్ధాంతము. దేశ శాసనాలకు, వాటిని అతిక్రమించే రాజు విశేషాధికారా (Prerogative) నికి మధ్య హద్దు గీయడానికి ప్రప్రథమంలో ప్రయత్నించినది హక్కుల పిటిషన్. ఇంగ్లీష్ రాజ్యాంగ పత్రాలలో ఈ పిటిషన్‌కు మాగ్నాకార్టాకు (1215), హక్కుల చట్టానికి (Bill of Rights 1689) ఉన్నంత ప్రాముఖ్యం లేదుగాని, రాజునుంచి సార్వభౌమాధికారాన్ని పార్లమెంట్‌కు బదిలీచేసే ప్రయత్నంలో ఈ హక్కుల పిటిషన్‌ను మొదటి మెట్టుగా మనం పరిగణించవచ్చు.

హక్కుల పిటిషన్‌ను రాజామోదించినందుకు సంతోషించి కామిస్తాన్న సబ్సిడీలను మంజూరుచేస్తూ పార్లమెంట్ చట్టం చేసింది. జీవితాంతం రాజుకు టన్నేజ్, పౌండేజ్‌లను ఇవ్వడానికి సిద్ధపడినా, పార్లమెంట్ తాను సమ్మతించకముందే రాజు వాటిని వసూలు చేయడాన్ని నిరసిస్తూ బకింగ్‌హామ్‌ను ఉద్యోగంనుంచి తొలగించమని రాజును ప్రార్థించింది. బకింగ్‌హామ్‌ను విడవలేని రాజు పార్లమెంట్‌ను వాయిదా వేసినాడు బకింగ్‌హామ్‌ను ఫెన్‌టన్ (Fenton) అనే మతోన్మాది హత్యచేయటంతో రాజు పార్లమెంట్‌తో కలహించటానికి ఉన్న ప్రబలకారణం తొలగిపోయింది. కాని తరవాత కూడా జీవిత పర్యంతం రాజుకు ఆ పన్నులివ్వడానికి సిద్ధపడిన కామన్స్ సభ ఆ పనిచేసి రాజమైత్రి సంపాదించడాని కెందువల్ల పూనుకోలేదో తెలియదు.

బేట్స్ కేసు తీర్పు నుపయోగించుకొని రేవు సుంకాలను యథా ప్రకారం రాజు వసూలు చేస్తూ వాటిని చెల్లించని వారిపై జరిమానాలు, ఖైదు శిక్షలు విధించినాడు. అటు కామన్స్ సభలోను, ఇటు రాజులోను, సామరస్యము, సర్దుకొనిపోయే గుణం లోపించడంచేత క్రమంగా అంతర్యుద్ధం రాక తప్పలేదు.

*రోల్ కేసు (Rolle's Case):* రోల్ ఒక వర్తకుడు. కామన్స్ సభ్యుడు. ఆ సభ సమావేశం కావడానికి ముందు టన్నేజ్, పౌండేజ్ సుంకాలు కట్టలేదన్న కారణాన రేవులో ఉన్న అతని వస్తువులను ప్రభుత్వోద్యోగులు జప్తు చేసినారు. ఆ ఉద్యోగులు తన ముందు హాజరయి సమాధానం చెప్పుకోవలెనని కామన్స్ సభ కోరింది గాని ఈ జప్తు కామన్స్ సమావేశం కానప్పుడు జరిగినందువల్ల పార్లమెంట్‌ను ఉద్యోగులు తృణీకరించడానికి వీలయింది. అందువల్ల టన్నేజ్, పౌండేజ్‌లను గురించి విచారించడానికి పార్లమెంట్ ఒక కమిటీని ఏర్పాటు చేయదలచినప్పుడు ఆ సుంకాలు వసూలుచేయడానికి తన కెట్టాంటి హక్కూ లేదని రాజు ఒప్పుకొన్నాడు.

ఛార్లెస్ మత విధానము: కామన్స్ సభ్యులు రాజకీయాలలో ట్యూడర్‌లకు ముందు అమలులో ఉన్న పరిపాలనా విధానాన్ని సమర్థించేవారయినా మత విషయాలలో మాత్రం తీవ్రమైన, విప్లవాత్మకమైన మార్పును కోరేవారు. వారు సంస్కర్త కాల్విన్ అభిప్రాయాను

సారం ఇంగ్లీష్ చర్చిని సంస్కరించవలెనని పట్టుబట్టినారు. ఒకవేళ రాజకీయాలలో కామన్స్, రాజూ సర్దుకొని పోగలిగినా మత విషయాలలో వారు ఘర్షణ పడక తప్పదు

1628 లో లాడ్ అనే లండన్ బిషప్ ప్రోత్సాహంతో ఆంగ్లికన్ చర్చి మత నిబంధనలను కొత్తగా ప్రకటించి వాటి నెవ్వరూ ప్రతికూలంగా వ్యాఖ్యానించరాదనీ మత విషయాలలో జోక్యం కలగజేసుకోవడానికి పార్లమెంట్‌కు ఎటువంటి అధికారం లేదనీ ఛార్లెస్ హెచ్చరించినాడు. ఇంతటితో రాజుకూ కామన్స్‌కూ ఉన్న విభేదాలను తిరగదోడినట్లయింది.

కామన్స్‌లో సంఖ్యాబలము ప్యూరిటన్లది. ఆ కాలంలో ఏ మత శాఖవారికి ఇతర శాఖల నమ్మకాలనూ పూజా విధానాన్నీ సహించే సద్గుణము ఉండేది కాదు. ఆబట్ కాన్‌టర్బరీ ఆర్చి బిషప్‌గా ఉన్నప్పుడు హైచర్చి లేదా ఆర్మీనియన్ పద్ధతులను ఆదరించ లేదు. కాని మాంటెగూ కాథలిక్ పద్ధతులను సమర్థిస్తూ వ్రాసిన వ్రాతలను, మెయిన్ వేరింగ్ మొదలైనవారు రాజు నెదిరించరాదని చేసే ఉపన్యాసాలను రాజు ఆమోదిస్తున్నందువల్ల తానేమీ చేయలేక పోయినాడు. ఇప్పుడు లాడ్ కాంటర్‌బరి ఆర్చ్‌బిషప్ అయిన తరవాత హైచర్చి ప్రచారము పెచ్చు పెరిగి పోయింది కామన్స్ సభలో ఇంగ్లీష్ చర్చి విధానంలో మార్పులను తెచ్చి పెట్టిన వారు తన ముందు హాజర్ కావలెనంటూ తాఖీదులు పంపినాడు. అంతటితో ఆగక టన్నేజ్, పౌండేజ్ విషయాలను మళ్ళీ లేవనెత్తి రోల్ వస్తువులను రేవులో జప్తు చేసినవారు పార్లమెంట్‌ను అవమానపరిచినందుకు సమాధానం చెప్పుకోడానికి రావలెనని ఆజ్ఞాపించినాడు. తన ఉద్యోగులను కామన్స్ ప్రశ్నించడానికి అనుమతించక ఛార్లెస్ కామన్స్ సభను వాయిదా వేసినాడు.

కామన్స్ పునస్సమావేశం కాగానే పార్లమెంట్ ఆమోదం లేని టన్నేజ్, పౌండేజ్‌ల వసూళ్ళను గురించి, ఇంగ్లీష్ చర్చిలో ఆర్మీనియన్ పద్ధతులు ప్రవేశపెట్టడాన్ని గురించి చర్చ ప్రారంభించింది. రాజు తిరిగి చర్చను వాయిదా వేసినా స్వల్ప కాలానికే మళ్ళీ సమావేశం జరిపించినాడు. కాని కామన్స్ మళ్ళీ పాత పాటనే మొదలు పెట్టడంవల్ల రాజు దానిని మళ్ళీ వాయిదా వేసినాడు. సమావేశపరచిన పార్లమెంట్‌ను వాయిదా వేయడానికి రాజుకధికారం లేదంటూ సర్ జాన్ ఎలియట్ ప్రతిపాదించిన మూడు తీర్మానాలనూ కామన్స్ ఆమోదించడానికి పూనుకొన్నది లోపలి సభ్యు లెవ్వరు వెలపలికి పోకుండా సభా భవన ద్వారాలను మూయించినారు. అధ్యక్ష స్థానంలో ఉండరాదని రాజు తనకు ఆజ్ఞ పంపినాడని లేచిపోజూసిన సభాపతి ఫించ్‌ని (Finch) బలవంతంగా కుర్చీలో కూర్చోబెట్టి తమ మూడు తీర్మానాలను ఎలియట్‌చే చదివించి వాటిని తా మామోదించినామని ప్రకటించిన తరవాతనే కామన్స్ సభ వాయిదా పడింది.

*ఎలియట్ తీర్మానాలు:* (1) మతంలో మార్పులను ప్రవేశపెట్టేవారూ, సనాతనం గాని (Unorthodox) సిద్ధాంతాలను ప్రవేశపెట్టేవారూ దేశద్రోహులు. (2) టన్నేజ్ పౌండేజ్‌ల విధింపుకు, వసూళ్ళకు సాయపడేవారు ప్రజాస్వామ్యానికి శత్రువులుగా పరిగణితులవుతారు. (3) అటువంటి సన్నిడీలను చెల్లించే వర్తకులందరూ ఇంగ్లండ్ స్వాతంత్ర్యానికి ద్రోహం చేసినవారు.

తరవాత ఛార్లెస్ వాయిదాపడిన మూడో పార్లమెంట్‌ను రద్దుచేసినానని (1629 లో) ప్రకటించినాడు. కాని ఆ ప్రకటన చేసే వరకైనా ఆగక ప్రతిపక్షనాయకులు తొమ్మిది మందిని

అరెస్ట్ చేయించి ఖైదులో ఉంచినాడు. న్యాయస్థానంలో వారిపై జాగ్రత్తగా ఆలోచించి నేరారోపణం చేయడమయింది. పార్లమెంట్ సమావేశంలో సభ్యులు చెప్పే మాటలకు వారిని శిక్షించ బూనటం సభ్యత్వపు హక్కులకు విరుద్ధాలని కోర్ట్ ప్రశ్నలకు ముగ్గురు బదులు చెప్పటానికి నిరాకరించినారు. వారు ఎలియట్, స్ట్రోడ్, వాలెంటైన్‌లు. వారికి హెచ్చు జరిమానా విధించి జైలులో తోసినారు. వారిలో ఎలియట్ 1632 లో టవర్‌లో మృతి చెందినాడు. స్ట్రోడ్, వాలెంటైన్‌లు (1640 లో) స్వల్ప కాలానికే పార్లమెంట్ సమావేశం కానున్నప్పుడు విడుదలైనారు. హేల్స్ జైలునుంచి పారిపోయినాడు.

మూడో పార్లమెంట్ కడపటి సమావేశ కార్యక్రమం సర్వమూ విప్లవాత్మకమయినదే. ఛార్లెస్ రాజ్యకాలంలో రాజుకూ పార్లమెంట్ పక్షానికీ జరగబోయే అంతర్యుద్ధానికి అది నాంది అయింది. తరవాత పదకొండేళ్ళు పార్లమెంట్‌ను సమావేశపరచకుండా ఛార్లెస్ పరిపాలన సాగించినాడు. ఈ పరిపాలనను పదకొండేళ్ళ (1629-1640) నిరంకుశ పరిపాలన (Eleven Years Tyranny) అని అంటారు. పార్లమెంట్ సమ్మతించిన, సమ్మతించని సబ్సిడీలు, రేట్లు వసూలుచేసి ఇతర దేశాలతో యుద్ధాలన్నీ మాని వ్యయంలో పొదుపు చేస్తూ ఛార్లెస్ ఈ కాలంలో పరిపాలించినాడు.

# 5

# మొదటి ఛార్లెస్ ఏకాదశవర్ష నిరంకుశ పరిపాలన

## (క్రీ.శ 1628–1640)

**(The Eleven Years Tyranny)**

'నిరంకుశ పరిపాలనము' అనే శీర్షికను బట్టి, పదకొండు సంవత్సరాల మొదటి ఛార్లెస్ పరిపాలన ఆ కాలంలో చాలా ప్రజాకంటకంగా ఉన్నదనే అభిప్రాయాలు కలగ వచ్చు. కాని అంతకుముందు అతడుగాని, అతని తండ్రిగాని, పూర్వం ట్యూడర్ పరిపాలకులు గాని చేయని అకృత్యాలు ఛార్లెస్ చేసినాడని మన మనుకోరాదు. పార్లమెంట్‌ను సమావేశ పరిచి దానితో సంప్రదించకుండా ఆ కాలంలో ఛార్లెస్ పరిపాలించినాడని ఆ శీర్షికకు అర్థము. మత విషయాంలోగాని, పరిపాలన విషయాలలోగాని, చివరకు సొంత వ్యవహారాలలోగాని తమ ఇష్టానికి వ్యతిరేకంగా నడిచిన వారి తలలను కొబ్బరికాయల వలె ట్యూడర్ పరిపాలకులు ఎగర గొట్టినారు. కాని ఒక్కని శిరఃఖండనమైనా మొదటి జేమ్స్‌గాని, మొదటి ఛార్లెస్‌గాని చేయించినట్లు కనపడదు. పై పెచ్చు ఛార్లెస్ ఇష్టానుసారంగా ప్రభుత్వకార్యం నిర్వహించి నందుకు అంతర్యుద్ధానికి ముందే రాజమంత్రులు కొందరు పార్లమెంట్ చేతిలో మరణశిక్షకు గురి అయినారు. కొత్త పన్నులు, సుంకాలు, అధిక సుంకాలు, పాతపడిన పన్నులు, ఇచ్ఛా కానుకలు, ఇచ్ఛా ఋణాలు వసూలు చేసినా నేరం మోపక విచారించక న్యాయస్థానాలు శిక్ష విధించి జైలులో తోసినా రాజు చర్యలను అతని న్యాయస్థానాలు అత్యవసర పరిస్థితులలో దేశసంరక్షణావసరాలలో, రాచరికపు విశేషాధికారాలలో కారణాలుగా చెప్పి సమర్థించినాయి. సమర్థించనప్పుడల్లా సామాన్య న్యాయస్థానము (Court of Common Pleas) ముఖ్య న్యాయాధిపతి సర్ ఎడ్వర్డ్ కోక్ ప్రోద్బలంతో తాత్కాలికంగా రాజుకు వ్యతిరేకంగా తీర్పు లివ్వడం జరిగింది. 1616 లో కోక్‌ను, 1627 లో క్రూ అనే న్యాయాధిపతిని ఉద్యోగభ్రష్టులు చేసిన తరవాత రాజు చర్య లన్నిటినీ అతని న్యాయస్థానాలు ఎప్పుడూ సమర్థించేవి. ఈ కాలంలో పార్లమెంట్‌లోని ప్రభువుల సభలోని ఏ కొందరో తప్ప మిగిలిన అధిక సంఖ్యాక సభ్యులు రాజు విషయంలో ప్రాతికూల్యం కంటె అభిమానమే ఎక్కువ చూపుతుండేవారనడం నిర్వివాదాంశము. అంతేగాక మతాచార్య సభలు (conventicles) ఈ పదేండ్లలో రాజు అవసరాలకు ఉదారంగా సబ్సిడీలిచ్చి తోడ్పడినవే. రాజుకు అధికాదాయం మంజూరుచేయ డానికి కామన్స్ సభ అనేక పర్యాయాలు సంసిద్ధత చూపించింది. ఆ మంజూరుకు, రాజు చేసే టన్నేజ్, పౌండేజ్, ఓడ రుసుముల వసూళ్ళకు వారు లంకె పెట్టినా వాటిని తాను మానుకొంటానని ముందు మాట ఇచ్చి తరవాత వారు సబ్సిడీలను, టన్నేజ్, పౌండేజ్‌లను ఎంతమాత్రం మిస్తారో వేచి చూసేటంత ఓర్పు ఒక్కసారయినా ఛార్లెస్‌కు లేకపోయింది.

మరొక సందర్భంలో కూడా రాజు అవిచారత, అవివేకము మాటిమాటికి కనబడేవి. దుష్పరి పాలనకు ముఖ్యకారకులని మాటిమాటికి కామన్స్ సభ సూచించిన వారిని పదవులనుంచి తొలగించి పార్లమెంట్‌తో సమాధానపడే నేర్పు కూడా ఛార్లెస్‌కు లేదు. పాప మా మంత్రులు వధ్యస్థాన మలంకరించేటంత వరకు రాజానుగ్రహం వారిని వెంటాడింది. వారు దోషులయితే వారికంటే ముందు వారికంటె ఎక్కువగా తానే దోషినని పార్లమెంట్ ఆగ్రహాన్ని మాటి మాటికి తనవైపు తిప్పుకోడానికి ఎంత ప్రయత్నమైనా ఛార్లెస్ చేసినాడు. వీటన్నిటికి తోడు ఎక్కువగా అనర్థకమైన కారణం అతడు అనుసరించిన మత విధానము. కామన్స్ సభలో అధిక సంఖ్యాబలం ప్యూరిటన్లది. ప్రభువుల సభలో హెచ్చుమంది రాజు పక్షంవారైనా వారిలో కొందరు మతాచార్యులు, కొందరు రాజోద్యోగులు. మిగిలినవారు ప్యూరిటన్లు. తమ సంఖ్యాబలం తక్కువైనా కామన్స్ సభ మద్దతు చూసుకొని పట్టుదలతో రాజు చర్యలను ప్రతిఘటించేవారు. ప్రభువుల సభ పన్నులు మంజూరుచేసే అధికారాన్ని లంకాస్ట్రియన్ల కాలంలోనే పోగొట్టుకొనడం వల్ల కామన్స్ మాటకున్న విలువ ప్రభువుల సభకు లేనందువల్ల, మత విషయాలలో మార్పులు తెచ్చిపెట్టే పనులకు ఛార్లెస్ పూనుకోకపోతే అతనికి ప్రెస్‌బిటేరి యన్ స్కాట్లండ్‌తోను, ప్యూరిటన్ కామన్స్‌తోను యుద్ధం సంభవించేదే గాదు. ఛార్లెస్ నాయనమ్మ, స్కాటిష్ మేరీరాణి కాథలిక్ మతస్థురాలు. ఆమె తన స్కాటిష్ ప్రెస్‌బిరిటేరి యన్ ప్రజలతో తగవులాడి రాజ్యం పోగొట్టుకొని ఎలిజబెత్ రాణి ఆశ్రయం పొందింది. కాని ఆమె ఇంగ్లండ్‌లోని కాథలిక్ కుట్రలకు కారణం కావటంవల్ల ఎలిజబెత్ రాణి ఆమెను చంపించింది. మేరీకి పట్టినగతే 1649 లో ఆమె మనుమడు ఛార్లెస్‌కు పట్టింది. అందే అతడు కూడా ఆమె వలెనే స్కాటిష్ ప్రెస్బిటేరియన్‌లపై తన హైచర్చి పద్ధతులను బలవంతంగా రుద్దటానికి ప్రయత్నించడమే కారణము నిద్రించే కుక్కలను లేవగొట్టవద్దని ఒక ఇంగ్లీషు సామెత. ఇక మొరిగే కుక్కల జోలికి అసలు పోరాదనే వివేకమైనా ఛార్లెస్‌కు లేకపోయింది.

1630 లో వాల్టర్, 1634 లో హీత్ అనే న్యాయాధిపతులు పదవీ భ్రష్టులు అయినారు కాని రాజు ఆగ్రహానికి గురి అవుతామనే భయమున్నా ఛార్లెస్ నిరంకుశ పరిపాలన కాలంలో అప్పుడప్పుడు కొందరు న్యాయాధిపతులైనా అతని చర్యలను ఖండించటం ఆశ్చర్యకరము రాజుపైన అతని ప్రభుత్వంపైన ప్రజలలో తిరస్కారభావాన్ని, ద్రోహభావాన్ని రెచ్చగొడు తున్నారనే, నేరాన్ని ఇలియట్ మీదా అతని మిత్రుల మీదా మోపినారు. తాము తప్పు ఒప్పు కొంటే విడిచిపెడతామన్నా ఇలియట్, హోల్స్, వాలింటయిన్‌లు జరిమానా చెల్లించడానికి, ఖైదు శిక్ష నమభవించడానికి సిద్ధమయినారేగాని రాజును క్షమాభిక్ష అడగలేదు. వారితో బాటు సోడ్ కూడా జైలుకు పోయినాడు. మిగిలినవారు ఉద్యోగాలతో రాజు పక్షం చేరినారు. 1625 నుంచి 1629 వరకు మూడు పార్లమెంట్‌లు ఎన్నికయినా, పరిపాలనావసరాలకు చాలి నంత ద్రవ్యం రాజు కిచ్చిన పాపాన వాటిలో ఏ ఒక్కటీపోలేదు. అందుచేత ఈ పదకొం డేళ్ళ కాలంలో ఛార్లెస్ ప్రభుత్వం సాధ్యమైనంతవరకూ పార్లమెంట్ ఇష్టానికి ప్రత్యక్షంగా విరుద్ధంగాని ద్రవ్యార్జన మార్గాలను అవలంబించింది.

జేమ్స్ కాలంనుంచి పార్లమెంట్ ఇష్టానికి విరుద్ధమైనా అధిక సుంకాలు, నిర్బంధ ఋణాలు, ఇద్ప్రాకట్నాలు రాజుకు విశేషాదాయం చేకూర్చేవి. హక్కుల పిటిషన్‌ను ప్రత్య క్షంగా భంగపరచకుండా ఏ విధంగా పన్నులు రాబట్టవలెనో రాజు, అతని ఉద్యోగులు

శ్రద్ధగా ఆలోచించినారు. 1629 లో ఛాంబర్స్ అనే వర్తకుడు టన్నేజ్, పౌండేజీలు చెల్లించ డానికి నిరాకరించినప్పుడు స్టార్ చేంబర్ కోర్టు జరిమానా వేయడమేగాక అతనిని జైలులో వేసింది. పై చర్య 1481 చట్టానికి విరుద్ధమని, ఆ శిక్షలు రద్దుచేసి తన వస్తువులను తిరిగి ఇప్పించమని ఛాంబర్స్ ఎక్స్చెకర్ కోర్టులో కేసు పెట్టినాడు. ఆ కోర్టు ప్రధాన న్యాయాధిపతి (Chief Baron) అంతకుముందే ఉద్యోగంనుంచి తొలగిపలసి రావడంవల్ల టన్నేజ్, పౌండేజీలు అక్రమమనిగాని, క్రమమనిగాని ఏదీ చెప్పక ప్రభుత్వము స్వాధీనం చేసుకొన్న వస్తువులనుగాని, జరిమానానుగాని తిరిగి ఛాంబర్స్‌కు ఇప్పించలేదు. 1631 లో ఎగుమతి, దిగుమతులపై అధిక సుంకాలు వేయడానికి రాజు కధికారముందని న్యాయస్థానం ధ్రువ పరిచింది 1635 లో కొత్త ఎగుమతి దిగుమతి సుంకా లేయే వస్తువులపై ఎంతెంతో తెల్పుతూ రేట్ల పుస్తక మొకటి ప్రచురించినారు. విదేశ వ్యాపారాలు చాలా బాగా ఉండటంవల్ల ఛార్లెస్ కాలంలో ఈ విధంగా వచ్చిన సొమ్ము ప్రభుత్వపు మొత్తం సంవత్సరాదాయంలో సగమట.

ప్రత్యక్షంగా పార్లమెంట్ నిరోధించని, ఎప్పుడైనా అమలుపరచిన ఆదాయ మార్గాలను విరివిగా ఇప్పుడు ఛార్లెస్ ప్రభుత్వము అమలుపరచసాగింది. వాటిలో ఓక సుంక మొకటి. అటవీ శాసనోల్లంఘనం చేసినందుకు జరిమానా విధించడం మరొకటి. గుత్త హక్కుల అమ్మకం రుసుములు, నిర్బంధ సైనిక సేవకు (Knighthood service) ప్రత్యామ్నాయ సుంకాలు జమీను భూముల జోలికి పోకున్నందుకు జమీన్‌దారుల నుంచి తీసుకునే ముడుపులు ఇట్లా అనేక రకాల ఆదాయాన్ని ఛార్లెస్ ప్రభుత్వం రాబట్టింది. రాజు సొంత అడవుల పూర్వపు ఎల్లలు పెంచి వాటిని ఆక్రమించినందుకు, ఉపయోగించినందుకు జరిమానాలు విధించింది. లేదా క్రమ ధనం రాబట్టింది. మూడువందలేండ్లుగా రాజు అటవీ ప్రదేశాలలో ఇండ్లు కట్టుకొని ఉన్నవారి కుటుంబాల నుంచి ఈ విధంగా ధనం రాబట్టడమయింది. ఈ చర్య ఛార్లెస్‌పై ఎంత ద్వేషం కల్గించిందో ఊహించవచ్చు. అడిగినంత చెల్లించలేనివారి ఇండ్లు కూలదోసి అందుకయిన ఖర్చును ప్రభుత్వోద్యోగులు రాబట్టినారు. చట్టం ఒక్కొక్క వ్యక్తికి గుత్త హక్కు నివ్వటం నిషేధించింది. అందుచేత నలుగురయిదుగురు కంపెనీలుగా చేరి పెద్ద మొత్తాలు ప్రభువుకు చెల్లించి గుత్త హక్కులు కొనుగోలు చేసినారు. ఇట్లా కొన్ని బొగ్గుల కంపెనీలు, సబ్బుల కంపెనీలు, ద్రాక్షసారాయి కంపెనీలు మొదలయినవి ఏర్పడి ప్రజలను పీడించినాయి.

పూర్వం 20 పౌండ్ల సంవత్సరాదాయమున్న వారే సైనిక సేవ చేసే నిర్బంధం ఉండేది. తుపాకిమందు వాడుకలోకి వచ్చిన తరవాత పాతకాలపు కవచ శిరస్త్రాణాలు, ఆయు ధాలు నిరుపయోగాలైనాయి. అయినా సైనిక సేవ తప్పించుకోడానికి వ్యక్తులు ధనం చెల్లిస్తారు. కాబట్టి నిర్బంధ సైనిక సేవా ప్రత్యమ్నాయ సుంకాలను ఛార్లెస్ వసూలు చేయించినాడు. సంవత్సరాదాయం 40 పౌనులలో ఉన్నవారు ఈ సుంకం చెల్లించనవసరం లేదన్నారుగాని ఇప్పటి నలభై పౌనులు పూర్వపు 2 పౌండ్లకు సమానం కాబట్టి కొద్దిపాటి భూమి కలవా రనేకులు ఈ రుసుం చెల్లించవలసి వచ్చింది.

కొత్తగా ఆచరణలో పెట్టిన ఆదాయ మార్గాలలో చాలా విమర్శకు గురిఅయింది ఓడ సుంకము. మధ్యయుగంలో పట్టణాలను, మండలాలను సాయుధులైన యుద్ధ భటులను దేశ రక్షణకు పంపవలెనని అడిగినట్లే రేవు పట్టణాల వారిని కొన్ని ఓడలను దేశసేవకు అప్ప

జెప్పవలెనని అడగటం సహజంగానే ఉంది ఆ కాలంలో వర్తక నౌకలను యుద్ధ నావలుగా మార్చటం సులభసాధ్యమే కాని ఫిరంగులు వాడుకలోకి వచ్చిన అధునాతన కాలంలో అది సాధ్యం కానందువల్ల జమీందారులను, పట్టణాలను సాయుధ సైనికులను పంపమని అడగటం మూలబడినట్లే, రేవు వర్తకులను ఓడలిమ్మని అడగటం కూడా వాడుకలో లేదు. 1626 లో స్పెయిన్‌తో యుద్ధం ప్రకటించినప్పుడు ఛార్లెస్ ఓడలిమ్మని అడిగినట్లే ఇప్పుడు రేవు పట్టణాల వారినే గాక దేశాంతర్భాగాలలో ఉన్న వారిని కూడా పెద్ద యుద్ధనావల నిర్మాణానికి ధనం వసూలుచేసి ఇమ్మని ఛార్లెస్ ప్రభుత్వం అడగనారంభించింది. ఆ కాలంలో డచ్ వారి నౌకా దళము శక్తిమంతం కావడం స్పెయిన్ దేశానికే గాక ఫ్రాన్స్, ఇంగ్లండ్ దేశాలకు కూడా భయకారణమయింది. ఆలివర్ క్రామ్‌వెల్, రెండో ఛార్లెస్‌ల కాలంలో రెండు డచ్ యుద్ధాలు ఇంగ్లండ్ చేయవలసి వచ్చిందంటే ఈ భయమే కారణమని రుజువవుతుంది. అందుచేత ఇంగ్లండ్ నౌకా దళాన్ని పెంచడానికని రాజు ఓడ పన్ను లిమ్మని అడగటం చట్టసమ్మతమని స్టార్‌ఛేంబర్ కోర్ట్, కోర్ట్ ఆఫ్ కామన్ ప్లీస్ తీర్పు లివ్వటంలో సబబు లేకపోలేదు. అందు చేతనే ఒక్క లండన్ పట్టణవాసులు తప్ప మరెవ్వరూ 1684 అక్టోబర్‌లో ఓడపన్ను మొదటి సారి అడిగినప్పుడు అంతగా ఆక్షేపించలేదు. ఈ సూచన చేసిన మనుడు అప్పటి అటార్నీ జనరల్ నాయ్. మొదటిసారి రేవు పట్టణాల వారిపైన ఈ ఓడ పన్ను విధిందడమయింది. కొన్ని వందల టన్నుల బరువున్న యుద్ధ నావలను సరఫరా చేయడమేగాక వాటిని యుద్ధా లకు అనువుగా జేసి ఆరునెలల పోషణ భృతిని కూడా ప్రభుత్వానికి చెల్లించవలెనని ప్రతి రేవు పట్టణంలోని జనులను కోరడమయింది. అటువంటి పెద్ద ఓడలను లండన్ ప్రజలు తప్ప ఇతరులు సరఫరా చేయలేరు. కాబట్టి వాటికి బదులు ఇతర పట్టణవాసులు ధనం చెల్లించవలసి వచ్చింది. కాదన్న కొందరిని కారాగారాలకు పంపడంతో అందరూ దారికి వచ్చి కిమ్మనకుండా ఓడ పన్ను చెల్లించినారు.

1685, *ఆగస్ట్ - ఓడపన్ను వసూలు:* ఈసారి పౌరులందరి మీద ఈ ఓడ పన్ను విధించడమయింది. దేశ స్వాతంత్ర్యం ప్రత్యేకంగా తీరవాసుల కవసరమై దేశాంతర్భాగాల ప్రజల కనవసరం కాదు. అందుచేత దేశ రక్షణ భారము కొత్త పరిస్థితులలో బలీయమైన నౌకాదళంపై ఆధారపడింది కాబట్టి ప్రజలందరూ ఈ పన్ను చెల్లించవలెనని ఒక్కొక్క మండలము ఒక్కొక్క ఓడ మూల్యం చెల్లించవలెనని ఆ సొమ్ము వసూలుచేసి నౌకా సైన్య కోశాధిపతికి పంపవలెనని అన్ని కౌంటీల షెరిఫ్‌లకూ తాఖీదులు పంపడమయింది. ఈసారి ఓడ పన్ను చెల్లింపంటే వ్యతిరేకత హెచ్చయింది. తనవంతు చెల్లించటం నిరాకరించిన లండన్ వర్తకుడు రిచర్డ్ ఛేంబర్స్ తనను అకారణంగా ఖైదులో తోసిన లార్డ్ మేయర్‌పై కింగ్స్ బెంచ్ కోర్ట్ (King's Bench Court) లో వ్యాజ్యం వేసినాడు. మేయర్ రాజాజ్ఞ మేరకు తానట్లా చేసినానని సమర్థించుకొన్నాడు. ఆ సమర్థన కోర్టువారు అంగీకరించి వ్యాజ్యాన్ని తోసివేసినారు. రాజుకు అటువంటి అధికారముందా లేదాఅన్న ప్రశ్ననే వారడగ నివ్వలేదు.

1686, *అక్టోబర్ - మూడో ఓడపన్ను వసూళ్ళు:* ఓడ పన్నును ఈసారి కూడా ప్రజలందరిపైనా విధించడమయింది. దేశరక్షణార్థం ఓడ పన్ను వసూళ్ళు న్యాయసమ్మత మయితే అదే కారణంతో ఇంకెన్నో కొత్త పన్నులను ఆ ఓడ పన్ను కూడా ఎంత రేటు

వంతునైనా ప్రజలనుంచి రా వసూలుజు చేయవచ్చు; చేస్తే మూడు సబ్సిడీలకు సమానమైన రెండు లక్షల పౌనులు ఏటేటా ఒక్క ఓడ పన్ను వల్లనే రాజు వసూలుచేసుకొని ఇతర దేశాలతో యుద్ధం లెకుండా చూసుకొంటే పార్లమెంట్ ససలు సమావేశపరచకుండా రాజ్యం పాలించటం అతనికి సాధ్యము అవుతుంది

న్యాయశాస్త్రానుసారం ప్రభుత్వ పాలనమా? ప్రభుత్వావసరాలకు లోబడి న్యాయ పరిపాలనమా? ఒక పన్ను సక్రమమో, అక్రమమో నిర్ణయించే అధికారం కడపట పార్ల మెంట్‌దా? రాజుదా? రాజరికపు ప్రత్యేకాధికారం ప్రజాప్రతినిధి అయిన పార్లమెంట్ అధికారానికి లొంగి తీరవలెనా పార్లమెంటరీ అధికారమే తల ఒగ్గవలెనా? ఈ ప్రశ్నలు ఇపుడు స్పష్టంగా ముందుకు తోసికొని వచ్చినాయి. జాన్ హంప్‌డన్ అనే వర్తకుడు తనపై విధించిన ఇరవై షిల్లింగ్‌ల ఓడ పన్ను చెల్లించటానికి నిరాకరించి ఎక్స్‌చెకర్ కోర్ట్ ముందు విచారణకు సిద్ధపడి పై విషయమే నిర్ణయించవలెనని అనుకొన్నాడు. ఎక్స్‌చెకర్ కోర్ట్‌లో (Barons of the Exchequer) ఆ కోర్ట్ జడ్జీలే గాక సాంప్రదాయిక న్యాయాధిపతులు కూడా సమావేశమైనారు.

ఓడ పన్ను విషయంలో రాజు ముందే న్యాయాధికారులను ఇట్లా అడిగినాడు: "రాజ్యా రక్షణకూ రాజ్య క్షేమానికీ రాజు ఓడలను సరఫరా చేయమని ప్రజలను ఆజ్ఞ చేయవచ్చునా, లేదా? ఆ ఆజ్ఞను అమలు పరచవచ్చునా? కూడదా? దేశాని కాపద కలుగుతుందని నిర్ణయించవలసినది రాజొక్కడే కదా?" రాజుకు అనుకూలంగా అతనికి అట్లాంటి విశేషాధి కారము (Prerogative) ఉన్నదని జడ్జీల సమాధానము. రాజాజ్ఞ (writ) 'లా' ప్రకారం సమర్థనీయం కాదని హంప్‌డన్ కోర్ట్‌కు చేసుకొన్న మనవి.

హంప్‌డన్ చేసిన ప్రతివాద మిట్లా ఉన్నది: (1) బ్రిటిష్ రాజ్యాంగము సామాన్యా దాయాన్ని రాజ్య రక్షణకు ఏర్పాటుచేసింది. (2) అది చాలకుంటే పార్లమెంట్ ఇతర సబ్సి డీలను, అదనపు ఆదాయాలను ప్రభుత్వానికి చూపవలసి ఉంటుంది. (3) హక్కుల పిటిషన్ స్పష్టంగా పార్లమెంట్ సమ్మతిలేనిదే ఏ పన్నూ రాజు వసూలు చేయరాదని చెప్పింది. (4) ఓడ పన్ను విషయంలో పూర్వమది వసూలయిందని చూపిన దృష్టాంతాలన్నీ ఆ పన్ను రేవు పట్టణాలవారి నుంచే వసూలయినట్లు రుజువు చేస్తున్నాయి. (5) దేశానికి అపాయం సంభవించినప్పుడు రాజుకు విశేషాధికారాలుంటాయని ఒకవేళ అంగీకరించినా ఇప్పుడటువంటి అపాయకర పరిస్థితులు ఏమీ లేవు.

పన్నెండు మంది న్యాయాధిపతులలో ఏడుగురు రాజుకు విశేషాధికారాలున్నవనీ, పార్ల మెంట్‌కు వాటిని తగ్గించడాని కెంత మాత్రం అధికారం లేదని తీర్పు చెప్పినారు. ఫలితం, ఇంకో మూడేండ్లు రాజ్యంలోని అన్ని మండలాలనుంచి వరసగా ఓడ పన్ను వసూలు చేసి నారు. రాజుపై జనంలో ఆగ్రహం పెరిగింది. న్యాయశాసనాలను తాను గౌరవించక ముందు ముందు ప్రజలూ గౌరవించక పోవడానికి ఛార్లెస్ దారి చూపినట్లయింది.

అంతర్యుద్ధం సంభవించకుండా రాజు జాగ్రతపడితే పార్లమెంట్‌ను సమావేశ పరచ కుండా పరిపాలన సాగించడం సాధ్యమయ్యేదే. 1636 లో ఆదాయాన్ని మించి జరిగిన ఖర్చు 18 వేల పౌనులకు తగ్గింది. 1637 నుంచి మిగులు బడ్జెటే. ఒక్క రేవు సుంకాలే 1608 లో 54,000 పౌనుల ఆదాయ మిచ్చినాయి. 1638 లో లక్షా ఇరవై ఏడు వేల పౌన్ల ఆదాయం

తెచ్చిపెట్టినాయి. రాజు కౌన్సిళ్ళ పరిపాలన మిప్పుడు ఉచ్చదశ నందుకొంది వాణిజ్యాభివృద్ధికి డ్రెయినేజ్ స్కీమ్‌లకు రెండు దుష్టగ్రహాలు ఆవరించినాయి. సర్ థామస్ వెన్‌ట్‌వర్త్, కాంటర్‌బరీ ఆర్చ్‌బిషప్ విలియమ్ లాడ్ అనే వారే ఆ దుష్టగ్రహాలు. వారిద్దరి పైన ఛార్లెస్‌కు ఎనలేని నమ్మకము. రాజును పోరానిదారులు తొక్కించి వీరు స్కాట్లెండ్‌తోను, పార్లమెంట్‌తోను పోరాటం తెచ్చిపెట్టినారు.

## సర్ థామస్ వెన్‌ట్‌వర్త్ (స్ట్రాఫర్ ప్రభువు)

ఛార్లెస్ మొదటి పార్లమెంట్‌లలో రాజుకు ప్రతిపక్షంలోని నాయక ముఖ్యులలో ఈ వెన్‌ట్‌వర్త్ ఒకడు. కాని కాలం గడిచినకొద్దీ అతని అభిప్రాయాలు రాజుకు సుముఖంగాను, పార్లమెంట్‌లోని అతివాదులకు వ్యతిరేకంగాను మారసాగినాయి. హక్కుల పిటిషన్‌ను అతడు ఆమోదించినా రాజ్యంలో పరిపాలనాధికారము పార్లమెంట్ కంటె రాజుకే ఎక్కువగా చెందుతుంది అనే దృఢాభిప్రాయము అతనికి కలిగింది. అందుచేత అతడు ఛార్లెస్ పక్షంలో చేరటం, 1632 లో ఐర్లండ్ లార్డ్ డిప్యూటిగా నియమితుడు కావటం సంభవించింది. "సమాజ క్షేమాన్ని సాధించడానికి ప్రజా సముదాయ ప్రతిబింబమైన రాజు సంపూర్ణాధికారము స్థాపితం కావలె. ఈ ప్రయత్నంలో ఏ వ్యక్తుల బాగోగులనూ రాజు లక్ష్యపెట్టవలసిన అగత్యం లేదు', అనే ఈ సిద్ధాంతాన్ని వెన్‌ట్‌వర్త్ ప్రతిపాదించినాడు. ఇది కార్యరూపం పొందటానికి అవసరమయిన చర్య లన్నిటినీ తాను ఐర్లండ్ పరిపాలనలో తీసుకోదలచినాడు. ఈ విధానానికి అతడు 'తుణ్ణము' (Thorough) అనే పేరు పెట్టినాడు. ఇది సంపూర్ణంగా ఆచరణలో పెట్టడానికి అక్కడ ఐర్లండ్‌లోను, తరవాత ఇంగ్లండ్‌లోనూ ప్రతిపక్ష సభ్యులను లొంగదీయడానికి బలమైన శక్తిని రాజు చేకూర్చుకొనడం అత్యవసరమని గ్రహించి అటువంటి ప్రబల సైన్యాన్ని ఐర్లండ్‌లో తాను సమీకరిస్తున్నానని వెన్‌ట్‌వర్త్ రాజుకు తెలియజేసినాడు. రాజు పక్షం వారిలో వెన్‌ట్‌వర్త్ అంత సమర్థుడు మరొకడు లేడు. పార్లమెంట్ అతనిని ద్వేషించినంతగా మరెవ్వరినీ ద్వేషించ లేదు.

*విలియమ్ లాడ్ - కాన్‌టర్‌బరీ ఆర్చ్‌బిషప్:* 1633 లో లాడ్ కాంటర్‌బరీ ఆర్చ్‌బిషప్ కావడానికి ముందు లండన్ బిషప్‌గా ఉన్నప్పుడే ఛార్లెస్ అభిమానాన్ని సంపాదించుకొన్నాడు. అతడు హైచర్చ్ పార్టీవాడు. ఆ పార్టీవలె రాజ్యం దైవదత్తమనే సిద్ధాంతాన్ని గాని, ఆర్మీనియన్ పూజా విధానాలనుగాని అవలంబించినవాడూ కాడు. ఇంగ్లీష్ చర్చికి రాజే పెద్ద అనే సూత్రాన్ని విరోధించేవారిని ఎంతమాత్రమూ మన్నించనివా డితడు. ఇంగ్లీష్ చర్చిలో అనుసరించవలసిన పూజాదికాలను అలక్ష్య పరచడానికి, దానికి వ్యతిరేకమయిన వాటిని అవలంబించే ధోరణిని అణిచి పారవేయడానికి చూసినాడు. చర్చి ఉద్యోగులు కాని వారు పై చర్యలు ఆమోదించే వారిని, ఆమోదించే వ్రాతలను, ప్రచురించిన వారిని దండించడానికి ఇతడు పూనకొన్నాడు. ఈ చర్యలలో యార్క్ ఆర్చ్‌బిషప్ నీల్ లాడ్‌కు సంపూర్ణ సహకార మిచ్చినాడు. ఒక్కొక్క బిషప్ ఉద్యోగంలో ఖాళీ ఏర్పడటం తడవుగా ఆ ఖాళీలో తన పద్ధతులు ఆచరణలో పెట్టేవారినే బిషప్‌లుగా ఇతడు నియమించేవాడు. 1633-37 సంవత్సరాల మధ్య ఇతని ప్రతినిధిగా ఒక వికార్ - జనరల్ లాడ్ ఆమోదించిన పూజా

ప్రార్థనాదికాలు రాజ్యంలోని అన్ని చర్చీలూ అనుసరించేటట్లు చేయడానికి ఇంగ్లండ్‌లోని అన్ని చర్చీలను అజమాయిషీ చేసి వచ్చినాడు.

అనుమాన మున్నచోట ప్రతి విషయమూ విరోధకారణమే అవుతుంది. మతగురువు ఉపన్యసించే బల్ల, దానికిముందు కమ్యూనియన్‌బల్ల ఉత్తర దక్షిణాలుగా చర్చికి తూర్పు కొనలో ఉండటం మామూలు. అది ఎలిజబెత్ రాణి అయిన కొత్తలో చేసిన ఏర్పాటు. కాని మూడు దశాబ్దాలుగా కమ్యూనియన్ బల్లను ఛాన్సరీలో తూర్పు పడమరలుగా మార్చడం మామూలయింది. దానిని యథాపూర్వకంగా దక్షిణోత్తరాలుగా మార్చవలెనని లాడ్ ఆదేశము ఇది అనేకులకు కోపకారణమయింది. ఇంగ్లీష్ చర్చిని కాథలిక్ చర్చిలో తిరిగి కలిపివేసే ప్రయత్నంలో ఇది ఒక మెట్టుగా ప్రాటస్టంట్ లనేకులు భావించినారు. రాచనగరులో రాణికి మతగురువుగా పోప్ నియమించిన పాన్‌జానీ ఉండటం వారి అనుమానాలకు దోహదమిచ్చింది మొదటి జేమ్స్ కాలంలో ఆదివారం చర్చిలో ప్రార్థనాదుల అనంతరం మతస్థుల ఆటపాటలలో పాల్గొనవచ్చునని ఒక ఆజ్ఞ జారీ అయింది. ఇప్పుడీ విధంగా ప్రతి గ్రామంలోనూ జరగవలెనని ఈ ఆజ్ఞను ప్రతి గురువూ తన ప్రార్థనాదులైన తరవాత చదవవలెనని లాడ్ పట్టుబట్టినాడు. ప్యూరిటన్‌ల దృష్టిలో ఇంతకన్న ఘోరమైన దురాచార మింకొకటి ఉండబోదు. ప్యూరిటన్లేగాక ఇతర ప్రాటస్టంట్ శాఖలవారు కూడా ఈ ఆజ్ఞపట్ల ఒకటయినారు. లాడ్ విధానాన్ని అమలుపరచడం కోసం హైకమిషన్ కోర్ట్, స్టార్‌చేంబర్ కోర్ట్ ఏకమై తద్వ్యతిరేకంగా చరించినవారిని, వ్రాతలు వ్రాసినవారిని, ముద్రించి ప్రచురించిన వారిని, అటువంటి పుస్తకాలు తెప్పించి అమ్మినవారిని ఘోర శిక్షలపాలు జేసినాయి. ఇటువంటి కరపత్రాలు ప్రచురించిన నేరానికి 1637లో ప్రిన్ (Prynne), బాస్ట్‌విక్ (Bastwick), బర్టన్ (Burton) అనే ముగ్గురికి బండకొయ్య, అంగచ్ఛేదము, జరిమానా, యావజ్జీవ కారాగార వాసాలనే శిక్షలను స్టార్‌చేంబర్ కోర్ట్ విధించింది. అదే కోర్టు అటువంటి వ్రాతలను విదేశాల నుంచి దిగుమతి చేసినందుకు జాన్ లిల్‌బర్న్‌కు కొరడావేట్లు, బండకొయ్య, జైలుశిక్షలు విధికిచింది. ఇటువంటి దారుణము, అమానుషము అయిన శిక్షలకు గురిఅయిన మరి ముగ్గురిని (విలియమ్స్, ఆస్ బాల్డిస్టన్, లెయిటన్‌లను) టాన్‌వెల్ లాంగ్‌మీడ్ పేర్కొన్నాడు.

ఇంగ్లండ్‌లో తన ఆంగ్లికన్ విధానానికి ప్రతికూలురను అణచివేయటంలో ఇట్లా అఖండ విజయం సాధించిన లాడ్‌కు ఇంక పట్టపగ్గాలు లేకపోయినాయి. స్కాట్లండ్‌లో అర్ధ శతాబ్దికి పైగా అమలులో ఉన్నది ప్రెస్బిటీరియన్ చర్చ్ విధానము. దానిని సమూలంగా పెకలించివేసి అఖండ కీర్తిని మూటగట్టుకోదలచినాడు ఆర్చ్ బిషప్ లాడ్. 1603 నుంచి ఈనాటి వరకు స్కాట్లండ్ వల్ల ఎటువంటి ఇబ్బందీ రాజుకు కలగలేదు. అక్కడి ప్రభువర్గము తమ స్కాటిష్ రాజ వంశం పట్ల చాలా భక్తితో ఉండేది. లార్డ్స్ ఆఫ్ ది ఆర్టికల్స్ (Lords of the Articles) అనే ఒక కమిటీకి స్కాటిష్ పార్లమెంట్ అధికారాలను ఇవ్వడంవల్ల స్కాటిష్ చర్చి జనరల్ అసెంబ్లీ పలుకుబడి కొంత సన్నగిల్లింది. జేమ్స్ కాలంలోనే పెర్త్ అయిదు సూత్రాలను ప్రెస్బిటీరియన్ చర్చి అంగీకరించింది. అందుచేత ప్రెస్‌బిటీరియన్ చర్చి పూజా విధానంలో కొన్ని మార్పు లప్పటికే ప్రవేశించినాయని గ్రహించవలె. మొదటి ఛార్లెస్ రాజైన కొత్తలో పూర్వం స్కాటిష్ చర్చ్ కాథలిక్ మతాన్ననుసరించిన రోజులలో దానికున్న భూములను తిరిగి ఇప్పించే ప్రయత్నం చేసినాడు (1625). ఫలితంగా ఆ భూము

లనుభవిస్తూ ఉన్న ప్రభువులు ఇప్పుడు రాజు పక్షం విడిచి ప్రెస్బిటేరియన్ లయిన సామాన్య జనుల పక్షం వహించినారు. 1629-37 మధ్య కాలంలో లాడ్ ఆంగ్లికన్ పద్ధతి ... కాలు స్కాటిష్ చర్చిలలో జరిపించ బూనుకొన్నాడు. 1633 లో సెంట్‌గైల్స్ చర్చిలో రాజు పట్టాభిషేకం జరిపిస్తూ ఆంగ్లికన్ తంతు నవలంబించడం సంభవించింది. ఆ సందర్భంలో ప్రెస్బిటేరియన్ గురువులు వాడే జనీనా గౌన్ బదులు ఆంగ్లికన్ మతగురువు లుపయోగించే నల్ల గౌనులనే స్కాటిష్ మతగురువు లికమీదట ధరించవలెననే స్కాటిష్ స్టాట్యూట్ ఒకటి ప్రచురితమయింది. 1635 లో కొత్త మత సూత్రాలను స్కాటిష్ చర్చిలో ప్రవేశపెట్టడమేగాక 1637 లో ఆంగ్లికన్ ప్రార్థనా గ్రంథంవంటి కొత్త ప్రార్థనా గ్రంథాన్నే ఇకమీద స్కాటిష్ చర్చిలలో వాడవలెననే ఆజ్ఞను. (స్కాచ్ పార్లమెంట్‌నుగాని, స్కాటిష్ క్లర్జీనిగాని సంప్రదించకుండా, చివరకు స్కాటిష్ బిషప్‌లతో ఒక మాటయినా చెప్పక) లాడ్ సలహాపై ఛార్లెస్ జారీ చేసినాడు. స్కాటిష్ బిషప్‌లు కొంత కాలంగా రాజోద్యోగాలు గాను, రాజు ప్రివీ కౌన్సిల్ సభ్యులుగాను నియమితులయినారు. వీటన్నిటి ఫలితంగా అన్ని తరగతుల స్కాటిష్ ప్రజానీకమూ రాజు పక్షాన ఐక్యం కావడం సులభతరమయింది. స్కాట్లండ్ దేశమంతటా తమ మతాన్ని రక్షించుకొనడానికి టేబిల్స్ (Tables) అనే కమిటీ లేర్పడినాయి. 1638 మార్చిలో ఈ కమిటీలన్నీ ఏకమై ఒక జాతీయాంగీకారం (National Covenant) చేసుకొన్నాయి. రాజును, అతని అధికారాన్ని, సరయిన మతాన్ని, రాజ్య శాసనాలను, ప్రజల స్వాతంత్ర్యాన్ని కాపాడటానికి ఈ ఒప్పందం చేసుకొన్న సభ్యులు ప్రభుత్వంపై యుద్ధం ప్రకటించినారు. ఈ యుద్ధానికి బిషప్పుల యుద్ధమనే పేరు వచ్చింది. యుద్ధానికి ముందు నవంబర్ 1638 లో గ్లాస్గో పట్టణంలో స్కాచ్ జనరల్ అసెంబ్లీ సమావేశమై రాజ కమిషనర్ల ఆజ్ఞలు ఉల్లంఘిస్తూ స్కాట్లండ్‌లో ఆంగ్లికన్ మతాన్ని, ప్రార్థన గ్రంథాన్ని, మత సూత్రాలను, అయిదు నిబంధనలను రద్దు చేసినట్లు ప్రకటించింది. సైన్యం సమీకరించింది. ఛార్లెస్ ఇంగ్లండ్ నుంచి పంపిన సేన దానితో పోరాడింది కాని దానిని పూర్తిగా ఓడించలేకపోవటంతో రాజు స్కాచ్ జనరల్ అసెంబ్లీతో తాత్కాలిక సంధి చేసుకోవలసి వచ్చింది

సంధి షరతులుగా లార్డ్స్ ఆఫ్ ది ఆర్టికిల్స్‌ను తొలగించి స్కాటిష్ చర్చి, పార్లమెంట్‌లపై అధికారాన్ని రాజు వదులుకోవలెనని, ఆంగ్లికన్ విధానాన్ని స్కాట్లండ్‌లో రద్దు చేయవలెనని స్కాచ్ వారు కోరినారు. దేనికి రాజు ఒప్పుకోలేదు. అందుచేత రెండో బిషప్‌ల యుద్ధము (1640) జరిగింది. అందులో రాజు ఓడిపోవడంవల్ల ఆ స్కాచ్ సైన్యము శాశ్వత సంధి జరిగేటంతవరకు స్కాట్లండ్ సరిహద్దులో కాచుకొని ఉండేటట్లు, అంతవరకు దానికయ్యే వ్యయము ఛార్లెస్ భరించేటట్లు తాత్కాలికమైన ఒడంబడిక చేసుకోవలసి వచ్చింది. దాని కర్థము తన సైన్యానికయ్యే వ్యయమేగాక శత్రు సైన్య వ్యయం కూడా రాజే భరించవలెనని యుద్ధ సుంకాలు, యుద్ధ ఋణాలుగాక కోట్, కాన్‌డక్ట్ కట్నం (Coat and conduct money) కూడా అన్ని కౌంటీల ప్రజల నుంచీ వసూలు అయింది. ఇంతలో వెన్ట్‌వర్త్ ఐర్లండ్ నుంచి వచ్చి చేరినాడు. అతని సలహాపై 1640 ఏప్రిల్ 13వ తేదీనాడు పార్లమెంట్ సమావేశమయ్యేటట్లు నిశ్చయమయింది.

## స్వల్పకాలిక పార్లమెంట్ (The Short Parliament)

ఇది మొదటి బిషప్పుల యుద్ధం కాగానే సమావేశమయింది. దీనికి ముఖ్య నాయకులు పిమ్, హంప్‌డన్‌లు. పార్లమెంట్ అసంతృప్తికి కారణాలన్నిటినీ తాను తొలగిస్తానని వాగ్దానం చేస్తూ ముందు యుద్ధానికి ధనం మంజూరుచేయమని రాజు కోరినాడు. ముందు తమ ఇబ్బందులను తొలగించనిదే ధనం మాట ఎత్తవద్దని కామన్స్ సభ ఒక కమిటీని నియమించింది. ఆ కమిటీ సభ్యులు ప్రభువుల సభలో (i) ఇటీవల ప్రవేశపెట్టిన మతంలో, చర్చి పూజా విధానంలో మార్పులు, (ii) వ్యక్తుల ఆస్తిపై చేసిన దురాక్రమణ, (iii) పార్లమెంట్ అధికారాల అతిక్రమణలను గురించి చర్చించవలెనని నిర్ణయించినారు. ఇది పద్ధతి కాదని రాజు ప్రభువుల సభ ముందు ధనం మంజూరు చేస్తే పార్లమెంట్ ఆగ్రహ కారణాలన్నిటినీ తాను తొలగించగలనని, ఓడ పన్నుకు బదులు పన్నెండు సబ్సిడీలిస్తే చాలునని బతిమాలుకొన్నాడు. ప్రభువుల సభ ముందు ధనం మంజూరుచేయరాదని చెప్పి చివాట్లుతిని ధనం మంజూరు విషయంలో మాట్లాడే హక్కు తనకు లేదని అంగీకరించి సర్దుకొన్నది. కామన్స్ సభ కలిసి రాలేదని అలిగి దానిని ఛార్లెస్ రద్దు చేసినాడు. ఇట్లా ఛార్లెస్ నాలుగో పార్లమెంట్ మూడు వారాల ముచ్చటగా ముగిసింది. అది సాధించిందేమీ లేదు. ఒక్క లాభం మాత్రం కలిగింది. రాజు బలమెంతో, కామన్స్‌లో అతని ప్రతిపక్షం బలమెంతో లోకానికి స్వల్పకాలిక పార్లమెంట్ స్పష్టంగా చాటినట్లయింది. స్కాచ్ వారికి తమ విరోధులలో ఐకమత్యం లేదనే విషయమూ తేటతెల్లమయింది. అంతేగాక కామన్స్ సభలో తమపై సానుభూతి కలవారు అనేకులున్నారని వారు గ్రహించినారు. స్కాచ్ వారితో సంధి చేసికొమ్మని కామన్స్ సభ తీర్మానించేటట్లున్నదని తెలిసి అటువంటి తీర్మానం చేయకుండటానికే రాజు పార్లమెంట్‌ను రద్దు చేసినాడు.

రద్దు చేయటంతో తృప్తిపడక రాజు కామన్స్ సభ్యులు కొందరిని ఏదో నెపంతో ఖైదు చేయించినాడు. మండలాధికారులకు ఓడ పన్ను, కోట్ అండ్ కాన్‌డక్ట్ పన్ను అలస్యం లేకుండా పూర్తిగా వసూలుచేసి పంపుమని తాఖీదులు పంపినాడు. లండన్ వాసులు రాజుకు అప్పులివ్వడానికి నిరాకరించినారు. ఐరిష్ పార్లమెంట్ వెన్‌ట్‌వర్త్ అనుకొన్నంత ధనసహాయం చేయలేదు. ప్రీవీ కౌన్సిల్‌లో ఈ రాజ్యాన్ని లొంగదీయడానికి ఐర్లండ్ నుంచి సైన్యాన్ని తెస్తానని వెన్‌ట్‌వర్త్ అన్న మాటలు అతడు ఇంగ్లండ్‌ను గురించే అన్నాడని ఆయన ప్రత్యర్థులు వ్యాఖ్యానించినారు కాని తాను స్కాచ్ వారిని గురించి ఆ విధంగా అన్నట్లు సమర్థించుకొన్నా పార్లమెంట్ అతని మొరను పెడచెవి పెట్టింది. సైన్యంలో చేరిన వారు కొందరు ఆఫీసర్లను చంపి తిరుగుబాటు చేసినారు. వారిని దారిలోకి తీసుకొనిరావడానికి సైనికశాసనము అమలుపరచవలసి వచ్చింది. ఈసారి ఓడ పన్ను, కోట్ పన్ను, నిర్బంధ ఋణాలు తగినంత ద్రవ్యం సమకూర్చలేక పోయినాయి. డచ్ వారికి, స్పెయిన్ వారికి జరుగుతున్న యుద్ధంలో స్పెయిన్‌కు సహాయం చేయగలనని, దానికి బదులు ఋణ మివ్వవలెనని స్పెయిన్ దేశాన్ని రెండు సార్లు అడగటం జరిగిందిగాని ధనమేమీ ఆ విధంగా రాలేదు. రాజ్యంలోని వెండి, బంగారు నాణేలను కల్తీచేసే ఆలోచనగాని, నాణేలు ముద్రించడం కోసం లండన్ టవర్‌లో దాచిన వెండి బంగారాలను జప్తు చేసే యోచనగాని కార్యరూపం దాల్చలేదు. ఒక్క మత

గురువుల కాన్వకేషన్‌వారు మాత్రం ఈ కల్లోల పరిస్థితులలో అండగా నిలిచి అప్పుడప్పుడు సబ్సిడీలు మంజూరుచేసినారు. చర్చి పూజా ప్రార్థనాదికాలలో వచ్చిన మార్పులను గట్టిగా సమర్థించినారు. రాజాజ్ఞలు శిరసావహించవలసిన విధిని, అతని దైవదత్తాధికారాన్ని వారు పునః పునః సమర్థించినారుగాని అదంతా అరణ్యరోదనమే అయింది. సైన్యాన్ని గ్రామస్థుల ఇండ్లలో ఉంచవలసి వచ్చింది. రాజు పరిపాలనపట్ల ప్రజలలో ద్వేషం పెరిగిపోయింది. ఇది ఇట్లా ఉండే స్కాటిష్ సైన్యము సరిహద్దు దాటి నార్తంబర్‌లాండ్, డర్‌హమ్ జిల్లాలలో తిష్ఠ వేసింది. ఇంగ్లండ్‌పై తాము యుద్ధం చేయడానికి రాలేదని, ప్రజలపై దౌర్జన్య మేమీ చేయమని వారు మాట ఇచ్చినారు. ఆ మాట నిలుపుకొన్నారు. ఎన్ని నిర్బంధాలకు పూను కొన్నా రాజు సైన్యంలో 18,000 మందికి మించి చేరలేదు. అది స్కాచ్ సైన్యంలో సగం కూడా కాదు. మతావేశంతో పోరుకు వచ్చినవారు స్కాచ్ సైనికులు; అయిష్టంతో విధిలేక సేనలో చేరినవారు ఇంగ్లీషు సైనికులు.

ఈ పరిస్థితులలో దేశంలో అతివ్యాప్తంగా ఉన్న అసంతృప్తివల్ల, రాజుకూ రాజ్యానికీ మతానికీ దాపరిస్తున్న అనర్థాలవల్ల వీలైనంత త్వరగా పార్లమెంట్‌ని సమావేశపరచవలసిందని పన్నెండు మంది ప్రభువులు ఛార్లెస్‌కు విజ్ఞప్తి చేసినారు. అట్లా వెంటనే చేయకుండా రాజు స్టాఫర్డ్ ప్రభువు (వెన్‌ట్‌వర్త్) సలహామీద ఉన్నత ప్రభు సమావేశాన్ని యార్క్ నగరానికి ఆహ్వానించినాడు. అది 1640 సెప్టెంబర్ 24 తేదీనాడు జరిగిన స్కాచ్ సైన్యంతో ఒక సమాధానం కుదిర్చింది. నెలకు 25,000 పౌనుల వంతున ఆ సైన్యానికి చెల్లించటానికి జామీనుగా తాము ప్రవేశించిన రెండు మండలాలలో వారు నిల్చి ఉండవచ్చునని ఈ తాత్కాలిక సంధి సారాంశమని జి. బి ఆడమ్ తన ఇంగ్లీషు రాజ్యాంగ చరిత్రలో చెప్పినాడు ఈ 25,000 పౌనులు రెండు నెలల కొకసారి చెల్లించవలసినట్లు డి. ఎల్ కేర్ తన ఇంగ్లీషు రాజ్యాంగ చరిత్రలో తెల్పినాడు. ఇంత ధనం పార్లమెంట్ ఇవ్వనిదే లభించడమెట్లా? తమ హామీపై అప్పు తెచ్చుకొమ్మని యార్క్ సమావేశంలో ప్రభువులు మాట ఇచ్చినారు. .సి ఋణమిచ్చే వారెవరు? విధిలేని పరిస్థితులలో పార్లమెంట్ సమావేశానికి రాజు తాఖీదులు పంపినాడు. అది 1640 నవంబర్ నెలలో సమావేశమయింది. అంతటితో ఛార్లెస్ పదకొండేళ్ళ నిరంకుశ పరిపాలన మంతమయింది

## దీర్ఘకాలిక పార్లమెంట్ (Long Parliament)
## అంతర్యుద్ధము : 1640–1653

స్కాటిష్ సేన తిష్ఠవేసుకొని కూర్చుండిన ఉత్తర జిల్లాలలో పార్లమెంట్‌పై గాక రాజు పట్లనే సానుభూతి ఉన్నా ఇంగ్లండ్ తూర్పు, దక్షిణాలలో సైనికులవల్ల పీడ అంతగా లేనిచోట్ల పార్లమెంట్ మీది అభిమానమే ఎక్కువగా ఉంది. లండన్ పట్టణవాసులు రాజుకు ఋణ మివ్వడానికి నిరాకరించడమే గాక హైకమిషన్‌కు వ్యతిరేకంగా ప్రదర్శనలు చేసినారు. స్టార్ చేంబర్ కోర్టు ప్రదర్శకుల నేమీ చేయలేకపోయింది. రాజు పక్షంవారు ఎన్నిక అయ్యేటట్లు చూడటానికి వ్యవధి చాలకపోయింది.

పార్లమెంట్ 3–11–1640 న సమావేశమయింది. 11–11–1640 నాడు స్ట్రాఫర్డ్‌ను నిర్బంధంలోకి తీసుకొన్నారు. అతని కేవిధమయిన చెడూ జరగదనీ రాజు చాలా నచ్చచెప్పిన

మీదట అయిష్టంగా జంకుతూనే ఉత్తరాదిన ఉన్న తన జమీన్ నుంచి స్ట్రాఫర్డ్ ప్రభువు లండన్‌కు వచ్చినాడు. ఒకప్పుడు తమతో ఉండి రాజు పక్షానికి తిరిగిపోయిన ద్రోహి అని స్ట్రాఫర్డ్‌పై కామన్స్ సభలోని ప్రతిపక్షం వారికి పీకల దాకా పగ ఉంది. రాజు కూటమిలో ఇతరులందరి కంటె అత్యంత సమర్థుడని అతడంటే భయము. కాని రాజుకు అత్యంత విశ్వాసపాత్రుడైన అతనిపై రాజద్రోహ నేరం మోపితే అది నిలుస్తుందా అని అనేకుల అనుమానము. అతనిపై నిందారోపణ (impeach) చేస్తూ చేసిన తన ప్రారంభోపన్యాసంలో రాజ్యం మౌలిక శాసనాలనూ ప్రజల స్వాతంత్ర్యాలనూ తలకిందులు చేయటానికి వాటిపై దాడి చేసినందువల్ల అతడు రాజద్రోహం చేసినట్లయిందని పిమ్ వివరించినాడు. కాని ఈ నేరాన్ని ఋజువుచేయలేరని ప్రభువులు అనేకులు నచ్చజెప్పడంవల్ల నిందారోపణ మానుకొని స్ట్రాఫర్డ్ దోషి అని అటెయిండర్ బిల్లును (Bill of Attainder) అతనిపై ప్రవేశపెట్టి అన్ని శాసనాలవలెనే రెండు సభలూ ఆ బిల్లు నామోదించి అతనికి మరణశిక్ష విధించినాయి. స్ట్రాఫర్డ్‌పై మోపిన నేరమిది : "చాలా ప్రాచీనమూ మౌలికమూ అయిన చట్టాలను ప్రజల స్వాతంత్ర్యాలను, ఇంగ్లండ్ ఐర్లండ్ రాష్ట్రాలలో కూలదోయడానికి, వాటి స్థానే రాజ్యంలో నిరంకుశమూ, ప్రజాకంటకమూ, శాసన విరుద్ధమూ అయిన పరిపాలనను స్థాపించటానికి స్ట్రాఫర్డ్ ప్రయత్నించినాడు." ప్రభు సభాసభ్యు లనేకులు ఆ బిల్లుపై వోటు తీసుకొనే వేళకు మొగం చాటు చేసినారు. కుట్రలూ దౌర్జన్యాలూ జరుగుతాయనే వదంతులు ప్రబలినాయి. ప్యూరిటన్ మూకలు వ్యతిరేక ప్రదర్శనలు చేసినాయి. తత్ఫలితంగా రెండు సభలూ బిల్లు నామోదించినాయి. ప్రజా విద్రోహ చర్యలకు జంకి మొదట కొన్నాళ్ళాగినా చివరకు తమ నమ్మిన బంటును, అన్నింటికీ తననే నమ్ముకొన్నవానికి విధించిన మరణశిక్షా పత్రంపై ఛార్లెస్ తన ఆమోద ముద్ర వేసినాడు.

స్ట్రాఫర్డ్ ప్రభువుకు ఈ దుర్గతి పట్టేలోగా, ఇంగ్లీష్ చర్చికో పూజా ప్రార్థనాదికాలలో మార్పులు చేయడానికి ప్రయత్నించినాడని ఆర్చ్ బిషప్ లాడ్‌ను ఇంపీచ్ చేసినారు. అతనితో బాటు హాంప్‌డన్ కేసులో ఓడ పన్ను వేయడానికి ప్రత్యేకాధికారం రాజుకు ఉన్నదనే తీర్పు చెప్పిన న్యాయాధిపతు లారుగురు - లార్డ్‌కీపర్ ఫించ్, మరి ఇతరులూ - ఇంపీచ్‌మెంట్‌కు గురిఅయినారు. ఇట్లా రాజ పక్షపాతులలో ముఖ్యు లనేకులు ప్రభువుల సభనుంచి తొలగిపోవడం జరిగింది. అంతకుముందే బిషప్‌లు ప్రభు సభనుంచి తొలగిపోయినారు. అందువల్ల ప్రభువుల సభలో ఇకమీద రాజవిరోధులదే అధిక సంఖ్యాబల మయింది. కామన్స్ సభలో కొంతకాలం ప్యూరిటన్లకు ఖండితంగా మెజారిటీ ఏర్పడింది.

ఇంగ్లండ్‌పై దండెత్తి వచ్చే స్కాచ్ సైన్యాన్ని పారదోలటానికి తనకు తోడ్పడుతుందని కొండంత ఆశతో ఉన్న రాజుకు పార్లమెంట్ ఎటువంటి ఆర్థికాది సహాయమూ చేయకపోవడం అటుంచి స్కాచ్ సైనికులు తమ సోదరులని పేర్కొంటూ వారి వ్యయాలకని నెలకు మూడు లక్షల పౌనులు మంజూరుచేసింది. పిలుపు అందిన వెంటనే లండన్‌కు వచ్చిపడే మిత్ర సైన్యము ఉత్తర మండలాలలో ఉంటే రాజుగతి అడకత్తెరలో చిక్కిన పోకవలె అయి తా నాడిన మాటకు, ఆటకు అడ్డు ఉండదని గుర్తెరిగే పార్లమెంట్ ఈ పని చేసింది.

8-11-1640 నాడు సమావేశమయిన దీర్ఘకాలిక పార్లమెంట్ (Long Parlia-

ment) మొదటి సమావేశము పదినెలలు జరిగి సెప్టెంబర్ 1641 లో వాయిదా పడింది. ఈ కాలంలో అది చేసిన ముఖ్యమైన శాసనాలివి.

1. మూడేళ్ళ చట్టము 1641 : ఇకమీద ఏండ్లు పూండ్లు సమావేశ పరచకుండా రాజు నిరంకుశంగా పరిపాలించడానికి అవకాశము ఉండరాదనే మూడేళ్ళ చట్టం (The Triennial Act) చేయడమయింది. మూడేళ్ళయినా రాజు పార్లమెంట్‌ను పిలవకపోయినా ఛాన్సలర్ ప్రభువో, ముఖ్య ప్రభువులో షెరిఫ్‌లో మేయర్లో, బెయిలిఫ్‌లో, ఊరకున్నా వోటర్లు తమకు తామే పార్లమెంట్‌కు తమ ప్రతినిధులను ఎన్నుకోవచ్చు.

ఏ పార్లమెంట్‌నూ సమావేశమయిన తరవాత 50 దినాలకు ముందు రద్దు చేయరాదు; వాయిదా వేయకూడదు. ఒకవేళ రాజు దానిని రద్దు చేయకపోయినా మూడేళ్ళు కాగానే దానంతట అది రద్దయితీరుతుంది. అంటే దాని గరిష్ఠ ఆయుః ప్రమాణము మూడేళ్ళు, కనిష్ఠ ఆయుః ప్రమాణము 50 దినాలు అని అర్థము. ఒకసారి ఎన్నికై పార్లమెంట్ పదవులనుబట్టి వేలాడడానికి వీలులేదు. మూడేళ్ళలో ప్రజాభిప్రాయము ప్రధాన ప్రజా సమస్యలపై మారినా మారవచ్చు గదా ! పార్లమెంట్ సభ్యత్వము తదనుకూలంగా మారకపోతే అది ప్రజలకు నిజమైన ప్రతినిధి కాకపోవచ్చు గదా !

ఇట్లా మూడేళ్ళ చట్టం ఒకవైపు రాజు నిరంకుశత్వాన్ని, మరొకవైపు పార్లమెంట్ నిరంకుశత్వాన్ని నివారించటానికి ఉద్దేశించినది. ఇంత సముద్దేశమున్న ఈ పార్లమెంటే "తన సమ్మతి లేనిదే తనను రాజు వాయిదా వేయగూడదు, రద్దు చేయగూడదు" అని తీర్మానించింది. పరిస్థితుల ప్రాబల్యంవల్ల అది ఇటువంటి తీర్మానం చేయవలసి వచ్చింది. రాజు సదుద్దేశాలను గురించి పార్లమెంట్ సభ్యులలో అధిక సంఖ్యాకులకు ఎటువంటి నమ్మకమూ లేదు. న్యాయంగా పార్లమెంట్ గరిష్ఠ జీవిత మెన్నేళ్ళు ఉండవచ్చు అనే దానిని గురించి తరవాతి శతాబ్దాలలో తీవ్ర చర్చలు ఇంగ్లండ్‌లో జరిగి మూడేళ్ళు సభ్యుడు పార్లమెంటరీ వ్యవహారాలు అర్థం జేసుకొనడానికే సరిపోతుందని, అనుభవం కలగగానే అటువంటి సభ్యుడు ఎన్నికలలో సభ్యత్వం పోగొట్టుకొంటే దేశానికే నష్టమనీ ఏడేళ్ళయితే సభ్యుడు ప్రజలకు తన బాధ్యతను మరిచి తాను ప్రజలపై అధికారినని అహంకరించే అపాయముంటుందని అనేకులు అభిప్రాయపడటంవల్ల, 1911 లో పార్లమెంట్ గరిష్ఠ ఆయుః ప్రమాణం అయిదేళ్ల కంటె ఎక్కువ కాలం ఉండరాదనే శాసనం చేసినారు. తన సమ్మతి లేనిదే తనను రాజు రద్దు చేయరాదని ఈ పార్లమెంట్ చేసిన తీర్మానాన్ని ఛార్లెస్ ఆమోదించటంతో అది శాసనమయింది. తన నిరంకుశ పరిపాలనాస్త్రాలలో ముఖ్యమైన దానిని చేజేతులా ఇట్లా ఛార్లెస్ పోగొట్టుకొన్నట్లయింది.

2. తరవాత పార్లమెంట్ ఛార్లెస్ నిరంకుశత్వానికి జీవనమిచ్చే రేవు సుంకాలపై తన దృష్టిని మళ్ళించింది. టన్నేజ్, పౌండేజ్ సుంకాలను రెండు నెలలపాటు రాజు వసూలు చేసుకోవచ్చునని పార్లమెంట్ అనుమతి ఇచ్చింది. కాని ఎగుమతి, దిగుమతి పన్నులపై ఎటువంటి హెచ్చు సుంకాన్ని, రేటును పార్లమెంట్ అంగీకరించనిదే రాజు వసూలుచేయరాదనే శాసనం చేయడమయింది.

3. దీనితోబాటు ఓడ పన్ను శాసన విరుద్ధమని తీర్మానిస్తూ హాంప్‌డన్‌కు శిక్ష విధిస్తూ కోర్టు వారు చేసిన తీర్పును పార్లమెంట్ రద్దు చేసింది.

4. స్టార్ చేంబర్ కోర్టను రద్దు చేయడమయింది. ఈ చట్టంవల్ల ప్రీవీ కౌన్సిల్, స్టార్ చేంబర్ కోర్టలకు పూర్వము ఉండే సివిల్ క్రిమినల్ వ్యాజ్యాలను విచారించి పరిష్కరించే అధికారం పోయింది. కాని నేరారోపణ జరిగినప్పుడు ప్రశ్నించి విచారణకు పంపే అధికారం రాజు కౌన్సిల్ (ప్రీవీ కౌన్సిల్) కు పోలేదు అయినా విచారణకోసం నిర్బంధంలో ఉన్నవారు కోరితే వారికి హేబియస్ కార్పస్ రిట్ మంజూరుచేయవలెననీ, జైలు అధికారి ఆ రిట్ను కోర్టువారికి పంపేటప్పుడు నిర్బంధించిన కారణం తెలపవలెననీ, నిర్బంధించిన వ్యక్తిని విచారించి అతనిని బేషరతుగా విడుదలచేయడమో, జామీనిచ్చి విడుదలచేయడమో, జైలు నిర్బంధానికి పంపడమో ఏదో ఒకటి మూడు దినాలలో అమలు జరపవలెనని పార్లమెంట్ శాసనం చేసింది.

స్టార్ ఛేంబర్ కోర్టనుంచి చీలిన శాఖలు : (i) ఉత్తరమండలాల కౌన్సిల్, (ii) వేల్స్, సరిహద్దు మండలాల కౌన్సిల్, (iii) లాంకాస్టర్ డచ్చీ కౌన్సిల్, (iv) సరిహద్దు రాష్ట్రపైన ఛెస్టర్ ఎక్స్ఛెకర్ కోర్ట్. ఈ నాలుగూ స్టార్ ఛేంబర్ కోర్టతోబాటు రద్దయినాయి. రాజు విరోధులను చితకకొట్టడంలో ఇవి ఇన్నాళ్ళూ ప్రచండాయుధాలుగా ఉండేవి. ఇవి లేకపోతే రాజు నిరాయుధుడయినట్లే. తన విరోధులను ఈ న్యాయస్థానాలు విధించే అన్యాయ శిక్షలకు గురిచేసే వీలు ఇకమీద రాజు కుండదు.

5. మత విషయాలలో రాజుకున్న అధికారం పార్లమెంట్కు లోబడే విశేష రాజాధికారాల పరిధిలోది. ఈ అధికారాన్ని హైకమిషన్ కోర్ట్ ద్వారా అతడు చెలాయించేవాడు. కామన్స్లోని ప్యూరిటన్లకు న్యాయస్థానం పట్ల ఉన్నంత తీవ్ర ద్వేషము రాజు నిరంకుశాధికార సంస్థలలో మరి దేనిపైనా లేదు. ఈ కోర్టను స్థాపిస్తూ ఎలిజబెత్ రాణి చేసిన శాసనమిపుడు రద్దు కావడంతో ఈ న్యాయస్థానము అంతరించినట్లయింది. ఇతర చర్చి న్యాయస్థానాలకు పూర్వముండే జరిమానా, కారాగృహవాస శిక్షలు, కొరడా దెబ్బలు, ఖండకొయ్య వంటి శిక్షలు విధించే అధికారం తొలగిపోయింది. ఇంతటితో చర్చి కోర్టల కోరలు పెరికినట్లయింది

6. పర్వేయన్స్ హక్కును తగ్గించడమయింది. నిర్బంధ యోధత్వ ప్రసాదన హక్కు రద్దయింది రాజు అడవుల సరిహద్దులను కత్తిరించడమయింది. విదేశీ దండయాత్రల సమయంలో తప్ప ప్రజలను నిర్బంధించి సేనలో చేర్చే ప్రభుత్వాధికారం తొలగిపోయింది. అటువంటి అధికారం శాసన విరుద్ధమని ప్రకటించడం జరిగింది.

7. బిషప్లకు ప్రభువుల సభలో వోటింగ్ హక్కు రద్దయింది.

దీర్ఘకాలిక పార్లమెంట్ మొదటి సమావేశం పైన చెప్పిన శాసనాల ఫలితంగా లాంకాస్ట్రియన్ల కాలంలో తనకున్న హోదాను తిరిగి సాధించినట్లయింది. ఇంతవరకు రాజు, అతని ప్రీవీ కౌన్సిల్ అనుభవించిన విశేషాధికారాలు ఇంతటితో అంతమయినవనీ సామాన్య న్యాయస్థానాలలో అమలుపరిచే సామాన్య న్యాయము, మనస్సాక్షిగా అంగీకరించే న్యాయం మాత్రమే ఇకపై దేశంలో మన్నన పొందుతుందని పార్లమెంట్ శాసించింది. ఈ న్యాయానికి విరుద్ధంగా ఎవ్వరి ఆస్తిపాస్తులకుగాని, హక్కులకుగాని భంగం జరగదని ధ్రువపరిచింది.

ఇంతవరకు కామన్స్ సభలో సభ్యులు చాలావరకు ఐకమత్యంతో పనిచేసినారు. కాని మత విషయాలలో ప్రసక్తి కలిగించుకొనడం ఆరంభించగానే భేదాభిప్రాయాలు పొడగట్టి

సాగినాయి. డిసెంబర్ 11 తేదీన లండన్ పౌరులు బిషప్ పద్ధతిని రద్దు చేయమని కోరుతూ రాజుకు ఒక పిటిషన్ సమర్పించుకొన్నారు. కొన్ని వారాల తరవాత 1000 మంది మత గురువులు బిషప్‌ల చర్చి పరిపాలనను సంస్కరించవలెనని కోరుతూ ఒక అర్జీ దాఖలు చేసుకొన్నారు. దీనివల్ల పార్లమెంట్‌లో చీలిక లేర్పడేటట్లున్నది. ఒకటి ప్యూరిటన్ల పక్షము. దీనిలో ప్యూరిటన్ల సంఖ్యకంటె ప్రెస్బిటీరియన్ల సంఖ్య అధికంగా ఉంది. వీరు బిషప్‌ల చర్చి పాలన అంతం చేయగోరేవారు. బిషప్‌ల కింద గ్రామ పురోహితులు (Parish priests), పైన ఆర్చి బిషప్‌ల పరిపాలన యథాపూర్వకంగా ఉండవలెననే వారు రెండో పక్షము. ఈ పక్షంలో అంత ఐక్యమత్యం లేదు. చర్చిలో కొన్ని అసంగతమైన, అవాంఛనీయమైన లోపాలున్నాయనీ వాటిని సంస్కరించవలెననీ వీరందరు అంగీకరించినా ఏ విషయంలో సంస్కరించవలె, ఏ విధంగా సంస్కరించవలె అనే విషయంలో వీరందరికి ఏకాభిప్రాయం కలగలేదు. ప్రభువుల సభనుంచి బిషప్‌లను తీసివేయవలెనని కామన్స్ సభ బిల్లు ఆమోదించింది కాని దానిని ప్రభువుల సభ తోసిపుచ్చింది. ఇంతకంటె తీవ్రమయిన చిత్తు చట్టం గ్రామ పురోహితులనుంచి ఆర్చి బిషప్‌ల వరకు ఈ మతగురువుల విధానాన్ని తోసి రాజనవలెనని చూసింది కాని దానిని కామన్స్ సభ ఆమోదించలేదు. ఈ బిల్లు పేరు రూట్ అండ్ బ్రాంచ్ చట్టము (Root and Branch Bill). చర్చి ప్రార్థనలను, పూజారులను గురించిన భేదాభిప్రాయాలు పార్లమెంట్‌లో చీలికలకు దారితీసిన మాట నిజమైనా చర్చిలో తీవ్ర సంస్కరణలను ఆమోదించని వారంతా తరవాత రాజు పక్షం చేరినారు. ఇప్పటివరకు రాజుకున్న విశేషాధికారాలను రద్దు చేసింది చాలు. రాచరికము కోరలు పీకిన పామువలె ఉంది. ఇంకా దానిని ప్రహరించవలసిన అగత్యం లేదనేవారే మతంలో, చర్చి ప్రార్థనాదులలో తీవ్ర పరివర్తనకు విముఖత చూపినారు. 1641 అక్టోబర్ 20 తేదీ పార్లమెంట్ రెండో సమావేశం ఆరంభమయ్యే సమయానికి ఇంకా తీవ్రమైన సంస్కరణ లక్కరలేదనేవారూ తీవ్ర సంస్కరణవాదులూ కామన్స్ సభలో సమాన సంఖ్యాబలంతో ఉన్నారు. 1641 సెప్టెంబర్‌లో పార్లమెంట్ మొదటి సమావేశం వాయిదాపడి రెండో సమావేశ మారంభమయ్యేనాటికి కామన్స్ సభలోని ఈ చీలికలు ప్రస్ఫుటంగా బయటపడినాయి. అనేకులు ప్రతి పక్షాన్ని విడిచి రాజు పక్షం చేరేవారు. తనను నిర్బంధించి దీర్ఘ కాలిక పార్లమెంట్ అనేక శాసనాలు ఆమోదించేటట్లు చేసిందనీ అందువల్ల వాటిలో అనేకం చెల్లవని రాజు అభిప్రాయపడుతున్నట్లు క్రమంగా వదంతి ప్రబలింది. అట్లాంటి వాటిని రద్దుచేసి తిరిగి తన నిరంకుశ పరిపాలన స్థాపించవలెనని రాజు అభిలషిస్తున్నాడన్న వార్త వ్యాపించింది. నిరంకుశ రాజరికమో, నిరంకుశ పార్లమెంటరీ ప్రభుత్వమో— ఈ రెండింటిలో ఏ ఒక్కటో ఉండవలె కాని, రెండూ ఉండటం సాధ్యం కాదని అందరికీ తేట తెల్లమయింది.

ఈ రెండు సమావేశాల మధ్య కాలంలో ఛార్లెస్ ఎడింబరో పట్టణానికి పోయి వచ్చినాడు. నే నింక ప్రెస్బిటీరియన్ చర్చిని బలపరచగలనని, స్కాటిష్ ఒప్పందం చేసుకొన్న వారితో విరోధించను సరిగదా, వారిని అభిమానించగలనని తెల్పుతూ ఛార్లెస్ స్కాచ్ వారితో రాయబారాలు సాగించినాడు. అంతటితో ఊరుకోకుండా ఇంగ్లీష్ ప్యూరిటన్ నాయకులతో సంప్రదింపులు చేసిన వారికి వ్యతిరేకంగా ఛార్లెస్ సాక్ష్యం సమకూర్చుకోవడానికి ప్రయత్నించినాడు. సాక్ష్యాలు సేకరించిన తరవాత వారిపై రాజద్రోహ నేరం మోపి విచారణ చేయవలెనని

అతని ఎత్తు. వారిలో ప్రముఖులైన ఆర్‌గైల్, హామిల్టన్‌లను తటాలున నిర్బంధించవలెనని ఛార్లెస్ చూసినాడుగాని, ముందే వార్త తెలిసి వారిద్దరూ తప్పించుకొని పారిపోయినారు. సైన్యాన్ని స్కాట్లండ్‌లో సమీకరించడానికి రాజు ప్రయత్నించినాడని తెలిసి పార్లమెంట్‌లోని ప్రతిపక్షం వారు పార్లమెంట్ బలాన్ని దృఢతరం చేయడానికి తమ చర్యలను సమర్థించుకొంటూ రాజు దుష్ప్రయత్నాలను విమర్శిస్తూ, మందలిస్తూ మహాధిక్షేపణమనే పత్రాన్ని (Grand Remonstrance) పార్లమెంట్‌లో ఉపాదించినారు.

## మహాధిక్షేపణము (The Grand Remonstrance)

ముందుచేసిన కార్యాలను పార్లమెంట్ సమర్థించుకొన్న తరవాత తా నికమీద చేయ దలచుకొన్న కార్యక్రమాన్ని ఈ పత్రంలో ప్రజానీకానికి నివేదించింది. ఇంగ్లీష్ జాతి ప్రాచీన గౌరవాన్ని, ఘనతను, భద్రతను పునరుద్ధరించడానికి కామన్స్ సభ శ్రమపడుతూ ఉందని ఈ అధిక్షేపణ పీఠికలో ప్రకటించింది. కాని ఇంగ్లీషు పరిపాలనలో ఉండే మౌలిక సిద్ధాంతాలను తలకిందులు చేయటానికి, ప్రాటెస్టెంట్ మతాన్ని కూలదోసి పోప్ అధికారాన్ని ఇంగ్లండ్‌లో ప్రవేశ పెట్టడానికి, పార్లమెంట్ అధికారాన్ని అవమానం పాలు చేయడానికి, రాజు పక్షం వారు పన్నిన కుట్రను కామన్స్ సభ ఖండించింది. రాజు విశేషాధికారాల పేరిట రాజూ, ప్రభుత్వాధికారులూ, రాజోద్యోగులూ ఏ యే నిరంకుశ చర్యలకు ఎట్లా పాల్పడింది దీర్ఘకాలిక పార్లమెంట్ వాటికి ప్రతి క్రియలుగా ఏ యే శాసనాలు చేసిందీ ఈ పత్రం వివరించింది. కాని ప్రభువుల సభ తోడ్పాటు లేకుండే కామన్స్ సభ శక్తిహీనమవుతుందని అంగీకరించింది. చర్చి పరిపాలనా విధానాన్ని, తుడిచి పెట్టడానికి తాము ప్రయత్నించినా మనడం, చర్చికి ప్రతికూలంగా ప్రాటెస్టెంట్‌లలో శాఖలనూ, ప్రార్థనా కూటాలనూ ఏర్పరచడానికి కారణమయినామని అనడం కల్ల అనీ తమ ఉద్దేశము చర్చి పూజా ప్రార్థనాదికాలలో కొత్త పోకడలను అణిచివేయటం మాత్రమేనని బిషప్‌ల అధికారాలకు హద్దు లేర్పరచి మతగురువుల పంపాలనలో వ్యాపించిన చెడు పద్ధతులను సంస్కరించడానికే తాము ప్రయత్నించినామనీ ఈ మహాధిక్షేపణ పత్రంలో ప్రకటించినారు. ఇంగ్లీష్ ప్రజలందరూ ఒక్క చర్చికి చెందిన వారుగా ఉండవలెననేదే తమ కోరిక అని ఉద్ఘాటించి ఆ సత్ఫలం సాధించడానికి మతగురువుల సంఘం స్థాపించడమే గాక ప్రభుత్వం కింద సూచించిన ఇతర చర్యలను తీసుకొనవలెనని మహాధిక్షేపణ పత్రం కోరింది.

(i) రోమన్ కాథలిక్‌ల కుట్రలనుంచి దేశాన్ని రక్షించడానికి ఒక స్థాయీ సంఘం స్థాపించడమేగాక కుహనా ప్రాటెస్టెంట్‌లను చర్చి నుంచి తొలగించడానికి అనుమానమున్న వారిని పరీక్షించవలెనని, (ii) శాసన విరుద్ధాలైన చర్యలకు, సుంకాలకు ప్రజలను గురిచేసిన వారిని సెషన్స్‌కు, సంచార న్యాయస్థానాలకు విచారణ చేయడానికి పంపవలెనని, న్యాయాధిపతులు చట్టాలను సూటిగా అమలు జరిపేటట్లు ప్రమాణం చేయవలెనని, (iii) పార్లమెంట్‌ను సంప్రదించకుండా రాజు మంత్రులను నియమించరాదని, ఆ మంత్రులు చట్టాలను అనుసరిస్తామని ప్రతిజ్ఞ చేయవలెననీ ఏ విదేశ ప్రభుత్వం నుంచీ ఎటువంటి బహుమతులూ, పింఛనులూ తాము పుచ్చుకోబోమని ప్రమాణం తీసుకొనవలెననీ ఈ మహాధిక్షేపణ పత్రంలో తెలియ

జేసినారు. పత్రాన్ని అచ్చు వేయవలెనా, అక్కరలేదా అనే విషయంలో కొంత తర్జనభర్జన జరిగిన తరవాత చివరకు దానిని ముద్రించవలెనని పార్లమెంట్ తీర్మానించింది.

కామన్స్ సభలో మూడు వందల మందికి మించి మహాధిక్షేపణ పత్రాన్ని గురించి చర్చించిన వారుండగా దాని కనుకూలంగా వోటు చేసిన పక్షానికి 11 మంది మెజారిటి మాత్రమే లభించింది.

కామన్స్ సభలో రాజు పక్షం మొగ్గేవారి సంఖ్య విశేషంగా పెరిగిపోయిందని దాని కర్థము. వోటింగ్ జరిగిన కొద్ది కాలానికే స్కాట్లండ్ నుంచి ఛార్లెస్ తిరిగి వచ్చినాడు. రాజుకు తన మంత్రులను నియమించుకొనే హక్కు ఉంది అనడంలో సందేహం మాత్రం లేదని, తన హక్కును తాను వదులుకోనని, తన మంత్రివర్గంలో దుర్మార్గులెవ్వరూ తనకు తెలిసినంతవరకూ లేరని, తన మంత్రు లేమిచేసినా బాధ్యత తనదేనని అధిక్షేపణకు ఛార్లెస్ సమాధానం వ్రాసి పంపినాడు. తరవాత ప్రజా పక్షం వహించిన నాయకులకు మంత్రి పదవులు ఆశపెట్టి తన పక్షానికి ఛార్లెస్ తిప్పుకో చూసినాడు కాని ఆ ప్రయత్నం నెగ్గలేదు. అందుచేత అధిక్షేపణను కాదన్న కామన్స్ సభ్యులకు ఉద్యోగాలిచ్చి కామన్స్‌లోని తన ప్రతి పక్షాన్ని బలహీనపరచడానికి కతడు ప్రయత్నించినాడు. అంతటితో ఆగక కింబోల్టన్ ప్రభువును, మరి అయిదుగురు కామన్స్ సభ్యులను ఇంపీచ్ చేయవలసినదని అటార్నీ జనరల్‌ను రాజు ఆజ్ఞాపించడమేగాక వారిని నిర్బంధంలో ఉంచి వారిపై మోపిన నేరాలను విచారించడానికి ఒక కమిటీని ఏర్పాటుచేయుడని ప్రభు సభను కోరినాడు. ప్రభువులలో కదలిక లేకపోగా ఛార్లెస్ సైనికులను వెంట తీసుకొని ఆ అయిదు మంది సభ్యులనూ అరెస్టు చేయడానికి తానే కామన్స్ సభకు పోయినాడు. కాని ముందే వార్త తెలిసి ఆ సభ్యులు కామన్స్ నుంచి పరారయినారు. రాజు ప్రశ్నించగా కామన్స్ స్పీకర్ బదులు చెప్పక మౌనం వహించినాడు. రాజు కోపంతో ఉడికిపోతూ కామన్స్ సభనుంచి వెనకకు తిరిగినాడు. తమ స్వాతంత్ర్యాలను రాజు భంగపరచినాడని కామన్స్ సభ వారు మరింత మండిపడినారు. రాజుకు ఈ అత్యాచారము అసలు అవసరమే లేదు. అతడు ఆ అయిదుగురిని అప్పజెప్పవలెనని సార్జెంట్‌ను మొదట పంపినప్పుడు వారిని అరెస్టు చేయనక్కరలేదని, వారిపై ఏ నేరాలైనా మోపితే కోర్టులో వాటికి సమాధానం చెప్పడానికి సభ్యులు సిద్ధంగా ఉన్నారని కామన్స్ సభ చెప్పి పంపివేసింది. ఇప్పుడు తమ రక్షణకు భటులను పంపవలెనని లండన్ మేయర్‌ను కామన్స్ సభ కోరింది. రాచనగరు ముట్టడికి తయారుచేసి రక్షణకు సైనికులను పంపవలెనని ఇన్స్ ఆఫ్ కోర్ట్ వారిని ఛార్లెస్ కోరినాడు. తమపై మోపిన నేరాలను తాము చేయలేదని ఆ అయిదుగురూ సమర్థించుకొన్న తరవాత ఇంపీచ్‌మెంట్ పత్రం దుష్టమయినదని, దానిని వ్రాసిన వారిని శిక్షింపవలసినదని ప్రభువుల సభను కోరుతూ కామన్స్ సభ తీర్మానించింది. రెండు పక్షాలకు సమాధానం కుదురుతుందనే ఆశ అంతరించింది. లండన్ పట్టణాన్ని రాజు వదిలిపోయినాడు. రెండు పక్షాలూ సైన్యాలను సమీకరించుకొనటం ప్రారంభించినాయి.

*సైనికశాసనము (1642)*: ఇంగ్లండ్, స్కాట్లండ్‌లలో ఇంతకుముందున్న సైన్యాలు రద్దయి ఉన్న కారణాన, తిరుగుబాటు చేసిన ఐర్లండ్‌ను లొంగదీయడానికి కొత్తగా సైన్యాన్ని సమీకరించవలసిన అవసర మిప్పుడేర్పడింది. కాని సైనిక బలాన్ని చేజిక్కించుకొంటే దానిని ఐరిష్ విప్లవాన్ని అణిచిన తరవాత, ఇంగ్లీష్ పార్లమెంట్‌లోని ప్రతిపక్షాన్ని లొంగదీయడానికి

ఛార్లెస్ దానిని ఉపయోగించదనే నమ్మకమేముంది? అందువల్ల సైన్యాన్ని కామన్స్ సభాధి కారం కింద ఉంచడానికి కామన్స్ సభలో శాసనాన్ని రాజు ప్రతిపక్షులు ప్రవేశపెట్టినారు (Bill for the Regulation of the Militia). సైన్యము రాజాధీనంలోనే ఏండ్ల తరబడి ఉన్నది. ఇప్పుడు దానిని పార్లమెంట్ అధీనం చేయడాని కిష్టపడడం ఇంగ్లీష్ రాజకీయ, న్యాయశాస్త్ర సంప్రదాయాలకు విరుద్ధమనడంలో సందేహం లేదు. ఆ చట్టాన్ని రాజు అంగీకరించక తిరస్కరించటంలోనూ ఆశ్చర్యం లేదు. కాని పరిస్థితుల ప్రాబల్యంవల్ల పార్లమెంట్ ఈ చట్టాన్ని చేయక తప్పని పరిస్థితి ఏర్పడింది.

రాజు ఆమోదం లేకపోతే పార్లమెంట్ రెండు సభలూ అంగీకరించిన చిత్తు చట్టమైనా శాసనం గాదు. అందువల్ల సైనిక శాసనాన్ని పార్లమెంట్ తన ఆర్డినెన్స్‌గా ప్రకటించింది. 14 వ శతాబ్దంలో ఆర్డినెన్స్ వాడుకలో ఉన్నమాట నిజమేగాని ఆ ఆర్డినెన్స్‌లు ప్రకటించటం రాజు కాకుండా పార్లమెంట్ చేసేదిగాదు - కామన్స్ వారితో సంబంధం లేకుండా తన కౌన్సిల్‌తోగాని, ప్రభువులతోగాని కలిసి రాజు చేసేది. ఇప్పుడు పార్లమెంట్ చేసిన ఈ ఆర్డినెన్స్ బ్రిటిష్ రాజ్యాంగానికి, రాజకీయ సంప్రదాయాలకు విరుద్ధమైనది. తన చర్యను కామన్స్ సభ అద్భుతంగా సమర్థించుకొన్నది. రాజముద్ర ఉన్నట్టే భావించవలెనన్నది. రాజు స్వయంగా చేసే తీర్మాన, చర్యలకంటె ఈ పార్లమెంటరీ తీర్మానమూ, చర్యా రాజు ఇచ్ఛా పూర్వకంగా చేసినటువంటిదే. ఒకవేళ రాజు చెడు సలహాలచేత మతిచెడి తాను కాదన్నా, దీనికి అడ్డు తగిలినా ఈ ఆర్డినెన్స్‌లోని ప్రతి వాక్యమూ రాజు ఆమోదముద్ర పడినట్టిదే అని పరిగణించవలె అన్నది. ఈనాడు వాడుకలో ఉన్న రాజకీయ పరిభాషనుబట్టి చూస్తే సార్వ భౌమత్వము (Sovereignty) రాజు బిరుదు ధరించిన వానిలోగాక ప్రజల ప్రతినిధులతో కూడిన ఇంగ్లీష్ పార్లమెంట్‌లో ప్రతిష్ఠితమై ఉన్నదనే సారాంశము స్పష్టమవుతుంది.

యుద్ధ మారంభం కావడానికి ముందు తన కోరికలను పందొమ్మిది సూత్రాలుగా సంగ్రహించి పార్లమెంట్ రాజుకు నివేదించింది. ఈ సూత్రాలు సార్వభౌమత్వం పార్ల మెంట్‌లో స్థాపితమై ఉన్నదని సిద్ధాంతీకరించటంతో ఆగక, ఆ సార్వభౌమత్వము దైనందిన పరిపాలనలో ఏ విధంగా కార్యరూపం దాల్చవలెనో కూడా వివరించినాయి. పూర్వపు ఆక్స్ ఫర్డ్ నియమావళి (Provisions of Oxford) ఇంకోసారి ఈ పందొమ్మిది సూత్రాలుగా రూపొందినాయని అంటారు. ప్రీవీ కౌన్సిల్ సభ్యులను, ఉన్నతోద్యోగులను, ముఖ్య న్యాయాధి పతులను ఇక మీదట పార్లమెంటే నియమించవలె. ఈ సూత్రాలను రాజు అంగీకరిస్తే శాస నాధికారమే గాక దేశ పరిపాలన కూడా సంపూర్ణంగా పార్లమెంట్ కైవస మవుతుందనడంలో సందేహం లేదు. రాజపదవి కది సున్న చుట్టినట్లే. కాబట్టి ఈ సూత్రాలను రాజు ఎట్లాగూ ఆమోదించడని అందరికీ తెలిసినదే. ఒక విధంగా చూస్తే అవి పార్లమెంట్ రాజుపై చేసిన యుద్ధ ప్రకటనలని భావించవచ్చు.

యుద్ధ మారంభం కాగానే పార్లమెంట్‌లోని మితవాదులు హైడ్, ఫాక్‌లాండ్‌ల నాయ కత్వాన రాజుతో చేరినారు. అందువల్ల పార్లమెంట్ పిమ్, హాంప్‌డన్‌ల నాయకత్వాన తీవ్ర వాదుల స్వాధీనమయింది. రెండు పక్షాలవారూ యుద్ధానుభవం లేనివారే. కాని రాజు పక్షం వారికి కత్తిసాము, వేట పరిచితాలే. యుద్ధంలో వారు ఎక్కువ చొరవ, సాహసం చూపించడం వల్ల మొదటి సంవత్సరం విజయాలు రాజు పక్షంవారే గుత్త గొన్నారు. ఆ పక్షంలో రూపర్ట్

వంటి సాహసికులైన అశ్వదళ నాయకులున్నారు. ఇక పార్లమెంట్ పక్షం నాయకులైన వారిలో హెచ్చుమంది పార్లమెంట్ చర్చలలో అద్భుత వాక్ శూరత్వం ప్రదర్శించిన వారే. స్టాంఫర్డ్ ప్రభువు, ఫీన్స్ మొదలైనవారు సేనాపతులుగా ఉండటానికి సంపూర్ణార్హులు కారు. పార్లమెంటరీ నాయకులందరిలో ఒక్క హంప్డనే సమర్థుడైన సేనానాయకుడుగా పేరు సంపాదించుకొన్నాడు. పార్లమెంట్ సైనికులలో ఐకమత్యము తక్కువ. వారిలో స్వతంత్రులు (Independents) సమర్థులు, ఆత్మ విశ్వాసం గలవారు. వారికి పార్లమెంట్‌లో అధిక సంఖ్యాకులైన ప్రెస్బిటీరియన్లకూ ఒకరి పొడ ఒకరికి గిట్టదు. రాజు పక్షపు ఆంగ్లికన్‌లు ఇంగ్లీషు ప్రజలను నిర్బంధంగా నయినా తమ పద్ధతులకు తిప్పవలెనని యోచించినట్లే ప్రెస్బి టీరియన్‌లు కూడా ఇంగ్లీష్ చర్చిలో తమ పద్ధతులను బలవంతంగా ప్రవేశ పెట్టవలెనని కోరిన వారే. యుద్ధంలో వెంట వెంట ఓడిపోవడం చూసి పార్లమెంట్ స్కాచ్ వారితో ఇంగ్లండ్‌లో ప్రెస్బిటీరియన్ మతాన్ని ప్రవేశ పెట్టగలమని పవిత్రమైన ఒప్పందం (Solemn League and covenant) చేసుకొన్నది. స్కాచ్ సేన సరిహద్దుదాటి ఇంగ్లండ్‌లోని ఉత్తర మండలాలను తన వశం చేసుకొన్నది. పార్లమెంట్ సభ్యులయి సైనికాధికారాలున్న వారు స్వయంగా సైనికోద్యోగాలకు రాజీనామా చేయవలెనని స్వతంత్రు లొక ఎత్తు ఎత్తి ఆత్మ నిరాసక శాసనము (Self - denying ordinance) అనే దానిని చేసినారు. దాని ఫలి తంగా చేతగాని సేనానాయకుల పీడ పార్లమెంట్ సైన్యాలకు వదిలిపోయింది. ఆ సైన్యాలు స్వతంత్రుల అధీనమయినాయి. రాజు పక్షంలో చేరిన రాజ భక్తులు వెండి బంగారాలు ఎంత ధారపోసినా ఒక్క లండన్ పట్టణము పార్లమెంట్ సైన్యాలకు అందించినంత ధన సహాయాన్ని రాజు కివ్వలేక పోయినారు. ఒకటి రెండు యుద్ధాలలో ఓటమి రాగానే రాజు పక్షంలో ఉన్న వారికి నిరుత్సాహం ప్రబలి పోయింది.

రాజు పక్షం వారికి మొదటి పెద్ద దెబ్బ నేస్‌బి యుద్ధంలో తగిలింది. పార్లమెంట్ పక్షాన నిలిచిన గ్లస్టర్ పట్టణాన్ని ముట్టడిస్తూ కాలహరణం చేయక రాజు లండన్ మీద దాడి చేసి ఉంటే యుద్ధ ఫలితం వేరే విధంగా ఉండేది. ఇప్పుడు నేస్‌బిలో జయించిన సేన, లండన్ నుంచి ఒక సేన రాజుపైకి పోయి అతడు గ్లస్టర్ ముట్టడి మానుకొనేటట్లు చేసినాయి. వరసగా యుద్ధాలలో ఓడిన ఛార్లెస్ స్కాచ్ సేనల కధీనుడయినాడు. స్కాచ్ వారనే అభి మానమైనా చూపకుండా వారు తమ రాజును పార్లమెంట్ సేనలకు అప్పగించినారు. తరవాత రెండేండ్లు సైన్యంలోని స్వతంత్ర పక్ష నాయకులకు, పార్లమెంట్‌లోని ప్రెస్బిటేరియన్‌లకు, స్కాచ్ సైన్యాలకు, నిర్బంధంలో ఉన్న రాజుకూ నాలుగు స్తంభాల ఆటగా రాయబారాలు నడిచినాయి. ఒకరిని మరొకరినుంచి విడదీసి ఒకరిని మరొకరి పైకి రెచ్చగొట్టి రాజు తిరిగి తన బలం పుంజుకోవలెనని చూసినాడు. కాని అతని ప్రయత్నా లేమీ కలిసిరాలేదు. స్కాచ్ సైన్యాలు తిరిగి సరిహద్దు దాటి ఉత్తర మండలంలోకి చొచ్చుకొని వచ్చినాయి. లండన్ పరిస రాలలోని శత్రువులను చెదరగొట్టి ఆలివర్ క్రామ్‌వెల్ అనే వాడు స్కాటిష్ సైన్యాల పైబడి వాటిని ఓడించి స్కాట్లండ్‌కు పారిపోయేటట్లు చేసినాడు. ఇంత జన నష్టానికి కారకుడైన ఆ రక్త పిపాసిని హతమార్చడానికి నిశ్చయించి స్వతంత్ర పక్ష సైన్యం లండన్‌కు వెనుదిరిగి వచ్చింది. ఆ పనికి అడ్డు లేకుండా ఉండటానికి మొదట కర్నల్ ప్రైడ్ అనే వాడు సైనిక బృందాన్ని వెంట తీసుకొని కామన్స్ సభపై దాడి చేసినాడు అందులో ఉన్న ప్రెస్బిటీరి

యన్‌లను బయటికి పంపి లోపలికి ఏ ప్రెసిబిటీరియన్ రాకుండా తన ప్రయత్నానికి అనుకూలపడే వారిని మాత్రమే ప్రైడ్ దానిలో ఉండనిచ్చినాడు. నవంబరు మూడో తేదీన దీర్ఘకాలిక పార్లమెంట్ సమావేశమయినప్పుడు కామన్స్ సభకు వచ్చిన వారిలో ప్రైడ్ ప్రక్షాళితం చేయగా మిగిలినవారు ఎనిమిదోవంతు కూడా ఉండరేమో. ప్రభువుల సభ అప్పటికే మూలబడింది గదా! పార్లమెంట్‌కు శేష పార్లమెంట్ (Rump Parliament) అనే పేరు వచ్చింది. ఈ పని సాధించిన తరవాత స్వతంత్రులతో నిండిన సైన్యం తీసుకొన్న మలిచర్య శేష పార్లమెంట్ (Rump Parliament) చేత ప్రజావిద్రోహం (Treason) చేసిన రాజును విచారించడానికి ప్రత్యేక న్యాయస్థానం ఏర్పాటు చేయించడం. ఈ న్యాయస్థానం పార్లమెంట్ రద్దుచేసిన స్టార్ ఛేంబర్ కోర్ట్ వంటిదే కాకుంటే అది రాజు సృష్టించింది. ఇది పార్లమెంట్ చేత స్థాపితమయినది విచారణారంభం నుంచి ఛార్లెస్ ఈ న్యాయస్థానాన్ని గుర్తించలేదు తనను విచారించడానికి ఆ కోర్టుకు ఏ అధికారమూ లేదు పొమ్మన్నాడు.

*పార్లమెంట్ ఛార్లెస్‌పై మోపిన నేరము:* ప్రజా ప్రతినిధులతో కూడిన పార్లమెంట్ ఛార్లెస్‌ను రాజుగా చేసింది. దేశ శాసనాలకు లోబడి పరిపాలించడానికి అతనికి పరిమిత పాలనాధికారం వచ్చింది. దుర్బుద్ధితో తన ఇష్టానుసారం ప్రజల హక్కులను, స్వాతంత్ర్యాలను తోసివేసి నిరపేక్ష నిరంకుశాధికారి అయి ఆ హక్కులను, స్వాతంత్ర్యాలను కాపాడటానికి మూల రాజ్యాంగ శాసన బద్ధంగా ఏర్పడిన ప్రజా ప్రతినిధులతో కూడి అనాదిగా వస్తున్న పార్లమెంట్‌ను సమావేశపరచడం మాని దేశద్రోహి అయి పగబట్టి ఈ పార్లమెంట్ మీదను, అది ప్రాతినిధ్యం వహించిన ప్రజలపైనను యుద్ధం తలపెట్టినాడు. 1649 జనవరి 27 తేదీన ఛార్లెస్ దేశద్రోహి అని న్యాయస్థానం తీర్పు చెప్పి అతనికి మరణశిక్ష విధించింది 30-1-1649 నాడు గండ్ర గొడ్డలితో అతని తలను మొండెంనుంచి వేరు చేసినారు. 1649, జనవరి నాలుగో తేదీనాడు పార్లమెంట్ బ్రిటిష్ రాజ్యాంగంలో తనకున్న ప్రధాన స్థానాన్ని ఈ విధంగా నిర్వచించింది: - "పరిపాలనాధికారం మొదట దేశ ప్రజలది. తరవాత వారికి ప్రతినిధులైన ప్రజాసభది (కామన్స్ సభది). ఈ అధికారం సంపూర్ణమైనది. సభా సమావేశంలో వారేది చట్టమంటారో దానిని ప్రజలందరూ ఎటువంటి మినహాయింపూ లేకుండా విధిగా శిరసావహించవలసి ఉంటుంది. దానిని రాజుగాని, ప్రభువుల సభగాని ఆమోదించినా ఆమోదించకున్నా అది అనుల్లంఘనీయమైన శాసనమే." అంతకు పదేళ్ళకు ముందే థామస్ హూకర్ ప్రజాసార్వభౌమత్వ సిద్ధాంతాన్ని చక్కగా నిర్ణయించినాడు: "తమ పరిపాలకులను, న్యాయాధిపతులను నియమించే అధికారమున్న ప్రజలకు ఆ పరిపాలకుల న్యాయాధిపతుల విధులను, అధికారాలను, వాటి పరిమితులను నిర్ణయించే అధికారమున్నదని ప్రత్యేకించి చెప్ప నవసరం లేదు."

ఛార్లెస్ రాజు వధనుగురించి ఏకాభిప్రాయం ఏనాడూ లేదు అతనిని చంపకుంటే ఇంకా ఎన్ని వేలమంది చావుల కతడు ప్రోత్సాహకు డౌతాడో అనే భయంవల్లనే అతని వధ సమర్థనీయమని క్రామ్‌వెల్ ప్రభృతులన్నారు. అతనిని చంపడ మవసరమా? యావజ్జీవ కారాగారమో, దేశ బహిష్కారమో విధిస్తే చాలదా అని కొందరి విమర్శ గద్దె ఎక్కిన నాటి నుంచి పట్టుబట్టి ఛార్లెస్‌కు పార్లమెంట్ పరిపాలనావసరాలకు తగినంత ఏనాడూ మంజూరు చేయక అధిక సుంకాలు, నిర్బంధపు కానుకలు బుటాలూ విధిలేక వసూలు చేసే పరిస్థితులను

కల్పించిన కామన్స్ సభలోని పర్తక శిఖామణులు ప్రజల క్షేమాన్ని కోరేవారయినారా? ఛార్లెస్ ఒక్కడే వారి క్షేమం కోరనివాడు అయినాడా? ఛార్లెస్ వధ్యస్థానం నుంచి తన వాదాన్ని ఎట్లు సమర్థించుకొన్నాడో గమనించవచ్చు. ప్రజల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను మరెవ్వరి కంటె తక్కువ కోరినవాడు గాదు. ప్రజల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు, ధన ప్రాణాలు సురక్షితంగా శాసనాలను, చట్టాలను అమలుపరిచే ప్రభుత్వం మూలానా భద్రంగా నిలిచి ఉంటాయి. అంతేగాని పరిపాలనా విషయాలలో వారికి వంతు ఉండడం అవసరం లేదు. "పాలితులైన ప్రజలూ సార్వభౌముడూ ఎప్పటికీ ఒక్కరు కారు." రాజును, ప్రభువుల సభనూ, పార్లమెంట్‌నూ కూలదోసిన స్వతంత్ర పక్ష సైనికాధికారులు తరవాత పది ఏళ్ళలో ప్రజా ప్రభుత్వ విధానాలను మార్చి ప్రయోగాలు చేసినారు గాని ప్రజాహృదయం వారి చర్యలను హర్షించ లేదు. క్రామ్‌వెల్ చనిపోయిన (సెప్టెంబర్, 1658) తరవాత ఇరవై నెలలలోనే ఇంగ్లండ్‌లోని రాజకీయ పక్షాలన్నీ ఏకమై హతుడైన మొదటి ఛార్లెస్ కుమారుని ప్రవాసంనుంచి రావించి (మే, 1660) రాజుగా ప్రతిష్ఠించడంలో ఇది స్పష్టమవుతుంది.

# 6

# కామన్ వెల్త్ ప్రభుత్వము

## ( 1649 ఫిబ్రవరి – 1660 మే )

1649 జనవరి నెలలో 'ప్రజల ఒప్పందము' పేరిట సేనలోని స్వతంత్ర పక్షం వారు తమలో తాము సంప్రదించుకొని పరిపాలనాంగం స్థాపించి దాని అధికారాలను నిర్వచించ డానికి మొదట లిఖిత రాజ్యాంగాన్ని గురించి ఒడంబడిక చేసుకొని దానిని కామన్స్ సభకు సమర్పించుకొన్నారు. ఈ ఒప్పందాన్ని ఆధారం చేసుకొన్న ప్రభుత్వాంగ మేదీ అసలేర్పడ లేదు. చాలా పరిమిత ప్రజాసంఖ్య కలిగిన రాజ్యాల కుపయోగించే ప్రత్యక్ష ప్రజా ప్రభు త్వాన్ని గురించిన ప్రస్తావన ఈ ప్రజల ఒడంబడికలో ఉంది. ప్రజలు ఒకరితో ఒకరు సంప్రదించుకొని అందరి అంగీకారంతో తమ కనుకూలించే ప్రభుత్వాన్ని ఏర్పాటు చేస్తూ దాని అధికారాలను నిర్ణయించదలచినారని, ఆ ప్రభుత్వానికి ఎన్ని అధికారాలిచ్చినా ప్రజల ఆస్తికి, స్వాతంత్ర్యానికి, భద్రతకు భంగం కలిగించే అధికారాలను ఇవ్వలేరని ఆ ఒడంబడి కలో ఉంది. తరవాత నాలుగేండ్లకు ఈ ప్రాతిపదిక మీదనే హాబ్స్ అనే రాజకీయ తత్త్వవేత్త తన గ్రంథంలో అనాది కాలంలో రాజ్యాన్ని, ప్రభుత్వాన్ని ప్రజలు స్థాపించినారని, ప్రభుత్వం రాజుదైనా పార్లమెంట్‌దైనా ప్రజలు తమ సర్వాధికారాలను శాశ్వతంగా దత్తం చేసినారని పర్యవసానంలో శాశ్వతంగా నిరంకుశ రాజరిక మేర్పడిందని వివరించినాడు. జి. బి. ఆడమ్స్ అభిప్రాయంలో ''ప్రజల ఒప్పందము'' ప్రాతిపదికగా ఇంగ్లండ్‌లో ప్రభుత్వ మేర్పడి ఉంటే 17 వ శతాబ్దంలోనే ఆ దేశంలో లింకన్ నిర్వచించినట్లు ప్రజల కోసం ప్రజా ప్రభుత్వం స్థాపితమయి ఉండేది. ఆనాటికి ప్రజాస్వామ్యం ఆదేశంలో తగినంత రాజకీయ పరిపక్వతకు రాకపోవడం వల్ల అది సంభవం కాలేదు. అంతేగాక ఏ సైనిక దౌర్జన్యానికి రాజు బలి అయినాడో ఆ సైనిక కూటమి వెలువరించిన రాజ్యాంగం ఎంత మేలైనదైనా దానిని అప్పటి బ్రిటిష్ ప్రజలు ఆమోదించే మానసిక పరిస్థితిలో లేరు. తమ సైనిక బలాన్ని చెక్కు-చెదరకుండా నిల్పుకొని దేశంలో శాంతి భద్రతలకు భంగపాటు కలగకుండా చూడ డమే క్రామ్‌వెల్ పార్టీవారి ప్రథమ కర్తవ్యము. నిజానికి వచ్చే పదకొండేండ్లలోను ఎన్ని కొత్త రాజ్యాంగ విధానాలను ప్రవేశ పెట్టినా ఇంగ్లండ్ సైనిక పరిపాలన కిందనే ఉన్నదన వలె.

తామేర్పరచిన రాజ్యాన్ని కామన్ వెల్త్ (పది మంది సొత్తు) అనీ ఆ రాజ్యపాలకుడు నిరంకుశ ప్రభువు కాక ఒక ప్రజా రక్షకుడనీ అది పాలిత దేశ (Protectorate) మనీ స్వతంత్ర పక్షం వారు అన్నారు. 1649 ఫిబ్రవరి 18 న రంప్ పార్లమెంట్ దేశాన్ని పాలించ డానికి స్టేట్ కౌన్సిల్‌ను ఏర్పాటు చేసింది. అది మార్చి 17 వ తేదిన రాజపదవినీ మార్చి 19 న ప్రభుసభనూ రద్దు చేసింది. మే 19 వ తేదీనాడు అది ఒక ముఖ్య ప్రకటన చేసింది.

"ఇంగ్లండ్, దాని రాజ్యభాగాలలోని, ప్రదేశాలలోని ప్రజలు ఇకపై కామన్ వెల్త్‌గాను, స్వతంత్ర రాజ్యంగాను పరిగణితు లవుతారు. దేశప్రజల ప్రతినిధులతో కూడిన పార్లమెంట్ సర్వాధికారం కింద అది నియమించే ఉద్యోగులచేతను మంత్రులచేతను ప్రజాశ్రేయస్సు చేకూర్చడానికి పరిపాలన కొనసాగుతుంది" అనేదే ఈ ప్రకటనలోని ముఖ్యాంశము. ఇది ప్రజారాజ్య ప్రయోజనాన్ని అద్భుతంగా నిర్వచించినా సైనిక శక్తిలేని పరిపాలకుడు అప్పుడున్న పరిస్థితులతో తట్టుకొని నెగ్గిరాలేడు. 1653 ఏప్రిల్ 20 వ తేదిన రంప్ పార్లమెంట్ సభ్యులను క్రామ్‌వెల్ సైనికుల చేత బయటికి నెట్టివేయించినాడు.

తరవాత చిన్న పార్లమెంట్ (The Little Parliament) లేదా బేర్ బోన్స్ పార్లమెంట్ (Barebone's Parliament) అనేది 1653 జూలై 5 న సమావేశమయింది. స్వతంత్ర చర్చీలు పేర్కొన్న సభ్యుల పట్టీలనుంచి ఎంపికయినవారు ఈ పార్లమెంట్ సభ్యులయినారు. వీరు చెప్పదగ్గ పనేమీ చేసినవారుకారు ఎన్నో ఉదార సంస్కరణలను గురించి చర్చించి చర్చించి 1653 డిసెంబర్ 12 వ తేదీన ఈ పార్లమెంట్ తనను తానే రద్దు చేసుకొంది. సేనానాయకులు సిద్ధపరచిన పరిపాలన ప్రణాళికను (Instrument of Government) ప్రజల ఆమోదంగాని పార్లమెంట్ ఆమోదంగాని తీసుకోకుండా క్రామ్‌వెల్, అతని కౌన్సిలూ చేరి అచరణలో పెట్టినారు.

## పరిపాలనా ప్రణాళిక

1. ఇంగ్లండ్, స్కాట్లండ్, ఐర్లండ్, వాటికి అనుబంధమైన రాష్ట్రాలు కూడి ఏర్పడిన కామన్‌వెల్త్‌లో ఉన్న శాసనాధికారం సంపూర్ణంగా సంరక్షకునిలోను, పార్లమెంట్‌తో సమావేశమయిన ప్రజలలోను ఉన్నది– ఇది ప్రణాళికలోని మొదటి సూత్రము. దీనివల్ల ఇంగ్లండ్ స్కాట్లండ్, ఐర్లండ్‌లు రాజకీయంగా సంఘటితమయినాయని శాసనం గుర్తించినట్లయింది.

2. సంరక్షకుడు, అతని తాలూకు కౌన్సిల్ విధులూ అధికారాలూ వాటి పరిమితులూ తరవాత నిర్వచించినారు. అనేక సందర్భాలలో పార్లమెంట్ సలహా తీసుకొని దాని సమ్మతితో ప్రభుత్వం నడుచుకోవలసి ఉంటుంది.

3. ఈ నాటి శాసనసభ సొంత సమ్మతి లేనిదే రద్దు కాదు. పరిపాలనా ప్రణాళిక ప్రకారం సమావేశమయిన నాటినుంచి అయిదు నెలలలోగా సంరక్షక ప్రభువు (Lord Protector) పార్లమెంట్‌ను రద్దు చేయరాదు.

4. పార్లమెంటరీ ప్రాతినిధ్యాన్ని ఈ ప్రణాళిక చక్కబరచింది. జనసంఖ్య తగ్గిపోయిన చిన్న పట్టణాలకున్న ప్రాతినిధ్యం తీసివేసి లీడ్స్, మాన్ ఛెస్టర్ వంటి కొత్తగా ఏర్పడిన పెద్ద పట్టణాలకు ప్రాతినిధ్యాన్ని ఏర్పాటు చేసినారు. మండలాలకున్న ప్రతినిధుల సంఖ్య 135 కు పడిపోగా కౌంటీల ప్రతినిధుల సంఖ్య 238 కు పెరిగింది. ఇక వోటర్ల అర్హతలను చాలా వరకు పెంచినారు. 200 పౌనుల విలువ చేసే ఆస్తిగల వారికే వోటింగ్ హక్కును పరిమితం చేసినారు. జరిగిన అంతర్యుద్ధంలో పార్లమెంట్‌ను ఎదిరించి పోరాడిన వారికి నాలుగు పార్లమెంటరీ ఎన్నికల దాకా వోటింగ్ హక్కు లేకుండా చేసినారు. రోమన్ కాథలిక్కులకు, ఐర్లండ్‌లో తిరుగుబాటుకు సాయంచేసిన వారికి శాశ్వతంగా ఓటు హక్కు తొలగించినారు.

5 పార్లమెంట్ ఆమోదించిన తీర్మానాలు సంరక్షకుడు అంగీకరిస్తేనేగాని శాసనాలు కావు. తనకు పంపిన ఇరవై దినాలలోగా సంరక్షకుడు తన ఆమోదాన్ని తెలపవలె. కామన్స్ సభ తీర్మానాలు సంరక్షకుడు ఆమోదించకపోయినా చట్టాలవుతాయి కాని, ఆ తీర్మానాలు పరిపాలనా ప్రణాళికకు విరుద్ధంగా ఉండరాదు. కామన్స్ సభ ఆమోదించే చట్టాలు రాజ్యాంగ విరుద్ధమయినవో కావో నిర్ణయించవలసిన అధికారి ఎవ్వరో ఈ ప్రణాళిక పేర్కొనలేదు. సంరక్షకుడు తానామోదించకుంటే దానికి సరయిన కారణాలు చెప్పి కామన్స్ సభను ఒప్పించి తాను సూచించే సవరణలను అది అంగీకరించేటట్లు చేయవచ్చు. ఈ ప్రణాళికా రాజ్యాంగం మూడేళ్ళు అమలులో ఉంది. అట్లాగాక అది కొన్ని దశాబ్దాలు నిలిచి ఉంటే ఏ చట్టాలు రాజ్యాంగ విరుద్ధాలు, ఏవి కావు అనే వివాదం బహుశా న్యాయస్థానాలు పరిష్కరించే ఆచారం ఏర్పడి ఉండేదేమో? ఈ ప్రణాళిక రాజ్యాంగానికి సవరణలు చేయడానికి సుముఖంగా లేదని కొందరి అభిప్రాయము. సంరక్షకుని ఆమోదంతో పార్లమెంటే రాజ్యాంగాన్ని సవరించి ఉండేదని మరి కొందరి ఊహ.

6 సంరక్షకుని కౌన్సిల్ సభ్యుల నియామకంలో పార్లమెంట్‌కు పాలుండేదని, ముఖ్య ప్రభుత్వోద్యోగులను సంరక్షకుడు నియమించినా వారి నియామకాలను పార్లమెంట్ ఆమోదించ వలసి ఉండేదని ఈ ప్రణాళిక వల్ల తెలుస్తూ ఉంది.

7. కాథలిక్ మతాన్ని, బిషప్పుల చర్చ్ పరిపాలనను ఇది నిషేధించినా మిగిలిన ప్రాటస్టెంట్ లందరికీ మత స్వాతంత్ర్యాన్ని ఈ రాజ్యాంగ మనుగ్రహించింది.

ఈ రాజ్యాంగంలో సార్వభౌమత్వ మెవ్వరిది? ప్రజలు ఏర్పాటుచేయని రాజ్యాంగంలో ప్రజలకు సార్వభౌమత్వ ముంటుందనేది నమ్మరాని మాట. క్రామ్‌వెల్, అతని సైనికాధికారి మిత్రు లేర్పరిచే ప్రణాళికలో, దానివల్ల సిద్ధించే రాజ్యాంగంలో చివరి అధికారం ఏ విధం గానూ పార్లమెంట్‌ది కాదు. ఈ దినమున్న రాజ్యాంగాన్ని రేపు మార్చివేస్తున్న సైనికాధికారుల చర్యలవల్ల ప్రజారాజ్యం శాశ్వతంగా సిద్ధిస్తుంది అనడం అసంగతమైన విషయము. ఇన్ని శతాబ్దాల రాజ్యాంగ పరిణామాన్ని తోసిరాజని సైనికాధికారులు నిర్మించే రాజ్యాంగాలకు చాలా ప్రాముఖ్యాన్ని ఆపాదించే విమర్శలను మనం గ్రహించలేము.

పరిపాలనా ప్రణాళిక ఫలితంగా ఏర్పడిన పార్లమెంట్‌లు పరిపాలనలో సాధించిన మార్పులు, ఉపాదించిన సవరణలు మనం గమనిస్తే ఆ కాలంలో పార్లమెంట్ సభ్యులు అభివృద్ధి ప్రణాళికలను గురించి ఎంత శ్రద్ధ వహించినారో, సతమత మవుతున్నారో మనం గ్రహించవచ్చు. అప్పుడు వారనుకొని సాధించలేకపోయిన మేళ్ళు తరవాతి శతాబ్దంలో బ్రిటిష్ ప్రజలకు సిద్ధించినాయి. అవి ఉచిత విద్యాశాఖలు; పబ్లిక్ పోస్ట్ ఆఫీస్; పేదలకు పని కల్పించడానికి నిర్మాణ ప్రణాళికలు; స్త్రీలకు వోటింగ్ హక్కు; జాతీయ బాంక్ స్థాపనము; ముద్రణా స్వాతంత్ర్యము; స్వేచ్ఛా వాణిజ్యము; నౌకా శాసనాలు; పరిపాలనలో (ఒక్క కాథలిక్‌ల విషయంలో తప్ప) మత విభేదాలను పాటించక పోవడం; స్థానిక పరిపాలనాభివృద్ధి; వివాహాలను సులభ సాధ్యం చేసే చట్టాలు; జనాభా లెక్కల సేకరణ; ఎక్సైజ్ పన్ను విధింపు; పార్లమెంటరీ కమిటీలను ఎక్కువగా ఉపయోగించుకోవడం; న్యాయ పరిపాలనలో ఆలస్యాన్ని నివారించడం; ఖర్చులు తగ్గించడం, న్యాయాధిపతులకు జీతాలు నిర్ణయించడం, వారిలో అవినీతి కనిపించనంత కాలం పదవులలో ఉంచడం;

క్రిమినల్ కేసులలో తమ నిర్దోషిత్వాన్ని రుజువు చేసుకోడానికి నిందితులకు ఎక్కువ సదుపాయాలు కల్పించడం ; కారాగారాలలో ఖైదీల జీవితాన్ని బాగుచేయడం ; అప్పులు చెల్లించని వారి విషయంలో కఠిన పద్ధతులు తొలగించడం, మొదలైనవి.

## పరిపాలనా ప్రణాళికా కాలపు పార్లమెంట్

మొదటి పార్లమెంట్ క్రామ్‌వెల్ వద్దన్నా వినక ఆ ప్రణాళిక ఎంతవరకు బ్రిటిష్ రాజ్యాంగ శాసనాన్ని అనుసరించి ఉన్నదో దానిని సవరించడానికి తనకు వీలుందో లేదో చర్చ చేయవలెనని పట్టుబట్టింది అప్పుడు క్రామ్‌వెల్ దానిని రద్దు చేసినాడు. రెండో పార్లమెంట్‌లో ప్రభువుల సభ పునరుద్ధరిత మయింది కాని ఆ సభలోని సభ్యులను సంరక్షకుడు, అతని కౌన్సిల్ నియమించినారు. ఈ రెండు పార్లమెంట్‌లూ ఒకదాని తరవాత ఒకటి కొత్త రాజ్యాంగాలను తయారుచేసినాయి. సభ్యులలో అతివాదులను బలవంతంగా తొలగించినా మిగిలినవారు సంరక్షకుని ఎన్నికపైనా అతని కౌన్సిల్‌పైనా తమకు పెత్తనం ఉండవలెననీ ఆదాయ వ్యయాలమీద, యుద్ధ ప్రకటనలమీద, సంధి చేసుకొనడం మీద, సైనికుల సంఖ్య మీద, మత సహన పరిమితులమీద తమకు అధికారం ఉండవలెనని పట్టు బట్టినారు.

పరిపాలనా ప్రణాళిక ప్రకారం ఏర్పడిన మొదటి పార్లమెంట్ సంరక్షకుని, అతని కౌన్సిలర్లను జీవిత పర్యంతం పదవిలో ఉండేటట్లు నియమించింది కౌన్సిల్‌లో ఖాళీ ఏర్పడితే పార్లమెంట్ కొందరి పేర్లను సూచించేటట్లు, అందులో కౌన్సిల్ పేర్కొన్న ఇద్దరిలో ఒక్కరిని సంరక్షకుడు నియమించేటట్లు నిబంధించినారు. 30,000 మంది సైనికులను, నౌకా దళాన్ని పోషించడానికి చాలినంత ధనాన్ని, ఇతర పరిపాలనా వ్యయాల కోసం ఏటా రెండు లక్షల పౌనులను మంజూరుచేసింది పార్లమెంట్ సమావేశం కాని కాలంలో ఈ సైన్యాలు సంరక్షకుని అధీనంలో ఉంటాయి. కౌన్సిల్ సమ్మతి లేకుండా సంరక్షకుడు ఆర్డినెన్స్ ప్రకటించరాదని, మూడేండ్ల కొక సారయినా పార్లమెంట్‌ను సమావేశపరచవలెనని, సమావేశమైన తరవాత 5 నెలలలోగా దానిని రద్దు చేయరాదని ఈ ప్రణాళిక శాసించింది. కాని ఈ ప్రణాళిక, కౌన్సిల్ ఆర్డినెన్స్‌లు రాజ్యాంగ విరుద్ధమని విమర్శకులు కోర్టుల కెక్కినారు. 1655 లో స్టూవర్ట్ పక్షం వారొక తిరుగుబాటు సాగించినారు. అందుచేత స్థానిక ప్రభుత్వాలపై మేజర్ జనరల్ లనే సైనికాధికారులను ఏర్పాటు చేయవలసి వచ్చింది. సైనిక వ్యయానికి స్టూవర్ట్ పక్షంవారి సంపదలను మేజర్ జనరల్ జప్తు చేయవలసి వచ్చింది.

రెండో పార్లమెంట్ : దీనిలోని కొందరు అతివాదులను పదవీ భ్రష్టులను చేసిన తరవాత 1654 లో అది కొత్త రాజ్యాంగాన్ని తయారుచేసి దానిని "మా వినయ పూర్వకమైన మనవి, సలహా" (The Humble Petition and Advice). అని సంరక్షకునికి సమర్పించింది దానిలో మొదటి మనవి ఆలివర్ క్రామ్‌వెల్‌ను రాజ పదవిని స్వీకరించు దని, క్రామ్‌వెల్ అట్లా చేయడాని కంగీకరించలేదుగాని దానికి బదులు తన తరవాతి సంరక్షకుడు కావలసిన వానిని నియమించే అధికారాన్ని పొందినాడు. ఎగువ శాసన సభను ఉద్ధరించడానికి సంరక్షకుడు సభ్యులను నియమించినా పార్లమెంట్ ఆ నియమకాలను ఆమోదించవలెనని, ఎగువ సభ సభ్యుని పార్లమెంట్ సమ్మతి లేనిదే తొలగించరాదని పై పిటిషన్ నిబంధించింది. కొద్ది కాలానికే రెండు శాసన సభల మధ్యా పొత్తు కుదరలేదు. కామన్స్ సభ ఎగువ

సభపై దాడి ప్రారంభించగా క్రామ్‌వెల్ ఈ పార్లమెంట్‌ను రద్దు చేసినాడు. రాజ్యాంగ పునర్నిర్మాణాన్ని గురించి కామన్ వెల్త్ కాలంలో చేసిన ప్రయత్నాలు అటు రిపబ్లికన్‌లను, ఇటు రాచరిక విధాన అభిమానులను తృప్తిపరచలేక పోయినాయి. ~~తన తదనంతరం సంరక్షకునిగా~~ ఆలివర్ తన కుమారుడు రిఛర్డ్ క్రామ్‌వెల్‌ను నియోగించి చనిపోయినాడు. సైన్యానికి, రిఛర్డ్‌కు సరిపడలేదు. సంరక్షకపదవి నుంచి అతనిని 1659 ఏప్రిల్‌లో సైనికాధికారులు తొలగించి రంప్ పార్లమెంట్‌ను తిరిగి సమావేశపరచినారు. ఆ పార్లమెంట్‌కూ ఆ సైనికాధికారులకూ పరిపాలనలో ఎవరిది పై మాటగా ఉండవలెననే విషయంలో వివాదాలు తీవ్రం కాగా అక్టోబరులో ఆ పార్లమెంట్‌ను సైనికాధికారులు తిరిగి రద్దు చేసినారు. 1660 ఆరంభంలో పార్లమెంట్ లేకుండా తాము పరిపాలించలేమని, పార్లమెంట్ పిలిపించినా అది తమతో సహకరించదని ఒక్కగా తెలిసి వచ్చింది. స్టూవర్ట్ రాజ వంశాన్ని పునః ప్రతిష్ఠించవలెనని, మునుపున్న కామన్స్ సభను, ప్రభువుల సభను ఉద్ధరించవలెననే అభిప్రాయం దేశంలో క్రమంగా వ్యాపించ సాగింది. లేకుంటే వేరు వేరు సైనికాధికారుల కింద ఉన్న సైన్యాలు పరస్పరం తలపడి దేశాన్ని అరాజకత్వ స్థితిలో పడదోస్తాయనే భయము అందరికీ కలిగింది. ఈ సందర్భాలలో స్కాట్లండ్‌లోని సైన్యాధిపతి జనరల్ మాంక్ తన సైన్యంతో లండన్‌కు వచ్చి దీర్ఘకాలిక పార్లమెంట్‌లో ఆ నాటికి బతికి ఉన్న సభ్యులందరినీ 1648 లో కర్నల్ ప్రైడ్ బయటికి పంపిన వారితో బాటు సమావేశపరిచి అది తనను తానే రద్దు చేసుకొనేటట్లు చేసినాడు. ఇంతటితో మొదటి ఛార్లెస్ చావుతో ఇంగ్లండ్‌లో ఏర్పడిన ప్రజారాజ్యం అంతమయింది. అప్పుడు రాజు తాఖీదు లేకుండానే తనకు తానే కన్వెన్షన్ పార్లమెంట్‌ను మాంక్ సమావేశపరిచినాడు. దీనిలో అధిక సంఖ్యాకులు ప్రెస్బిటీరియన్‌లు. యథా ప్రకారం వారు పరిమిత రాజరికాన్ని, ప్రెస్బిటీరియన్‌లకు ప్రాధాన్యాన్ని ఏర్పాటు చేయదలచినారు. సైన్యాన్ని తన కనుకూలం చేసుకొని మొదటి ఛార్లెస్ కుమారుడైన రెండో ఛార్లెస్‌ను సింహాసన మెక్క రమ్మని ఏ షరతులూ విధించకుండా మాంక్ సేనాని ఆహ్వానించినాడు. విద్రోహులకు క్షమాపణ, ఆస్తి భద్రత, జీతాల బకాయీల చెల్లింపు, మనస్సాక్షి కనుకూల విధంగా మతాన్ని అనుసరించటానికి వ్యక్తికి స్వాతంత్ర్యమూ రెండో ఛార్లెస్ బ్రిడా నుంచి ప్రజలకు వాగ్దానం చేసి తన రాజ్యంలో మళ్ళీ అడుగుపెట్టినాడు. దేశ పరిపాలనకు చేసే ఏర్పాట్లు పార్లమెంట్ సమ్మతించవలెననే మాటను అతడు ఒప్పుకొన్నాడు. వెంటనే కొత్త పార్లమెంట్‌కు ఎన్నిక జరిగి అది కామన్స్ సభ, ప్రభు సభలలో బాటు సమావేశమై మాంక్ ఏర్పాట్లను ఆమోదించి దీర్ఘకాలిక పార్లమెంట్ మొదటి సమావేశం చేసిన శాసనాలను, మార్పులను మాత్రం అంగీకరించింది. మే 1660 లో మొదటి ఛార్లెస్ కుమారుడైన రెండో ఛార్లెస్ ఇంగ్లండ్‌కు తిరిగి వచ్చి రాజయినాడు. ఒక దశాబ్దానికి పైగా గాడి తప్పిన బ్రిటిష్ రాజ్యాంగ పరిణామ చరిత్ర అంతటితో యథాస్థితికి వచ్చి కుదటపడింది.

## ~~ఆలివర్ క్రామ్‌వెల్ పాత్ర~~

ఆలివర్ క్రామ్‌వెల్ క్రీ. శ. 1599 లో హంటింగ్‌డమ్ (Huntingdam) లో జన్మించినాడు, ఇతడు మహావీరుడు. గొప్ప అశ్వాధిపతి, ప్యూరిటన్ మతస్థుడు. మొదటి ఛార్లెస్ మూడో పార్లమెంట్‌లో పాల్గొన్నాడు. హక్కుల పిటిషన్‌ను సమర్థించినాడు. న్యూ మోడల్

(New Model) అనే సైన్యాన్ని ఏర్పాటు చేసినాడు. మార్స్టన్ (Marstan), నస్బీ (Nasby) యుద్ధాల విజేత. మొదటి ఛార్లెస్‌కు పార్లమెంట్‌కు జరిగిన అంతర్యుద్ధంలో ప్రాముఖ్యత సంపాదించినాడు అతని ప్రభుత్వమే ఛార్లెస్‌కు ఉరిశిక్ష విధించింది.

ఆలివర్ క్రామ్‌వెల్ 1649 నుండి 1658 వరకు అధికారంలో ఉండి స్వార్థ పూరిత మైన లక్షణాలతో పరిపాలనను సాగించిన 'రంప్' పార్లమెంట్ సభ్యులను సైనిక సహాయంతో బయటకు నెట్టింది. తరవాత తన కిష్టులయిన కొంతమంది ప్యూరిటన్ సభ్యులతో ఒక పార్లమెంట్‌ను ఏర్పాటు చేసింది. ఈ పార్లమెంట్‌లో సభ్యుడైన బరెబోన్ పేరిట దీనికి బరెబోన్ పార్లమెంటని పేరు వచ్చింది ఈ పార్లమెంట్‌ను క్రామ్‌వెల్ సభ్యుల కోరికపై రద్దు చేసింది. తరవాత సైనికాధి కారులు కలసి రాజ్యాంగ ప్రణాళికను (Instrument of Government) వ్రాసినారు. ఆ రాజ్యాంగ ప్రణాళిక ప్రకారం ఆలివర్ క్రామ్‌వెల్ 1653లో దేశ సంరక్షకుడయినాడు. సంరక్షకునికి సహాయం చేయటానికి 13 సభ్యులు గల ఒక కౌన్సిల్ ఏర్పడింది.

ఆలివర్ క్రామ్‌వెల్ పరిపాలనాదక్షుడు సమర్థవంతమైన పాలకుడు. ఇతడు ప్రభుత్వ అధ్వర్యం గురించి ఈ విధంగా భావించినాడు : "దేశానికి నియంత, పార్లమెంట్ కూడ ఉండవలె. దేశం పూర్తిగా నియంత అధికారం కిందగాని లేదా పూర్తిగా స్వతంత్ర పార్లమెంట్ అధ్వర్యంలోగాని ఉండరాదు."

క్రామ్‌వెల్ సైనిక నియంతగా పాలించినాడు దేశాన్ని జిల్లాలుగా విభజించి వాటిని పరిపాలించటానికి సైనికాధిపతులను (Majors-General) నియమించినాడు. తాత్కాలిక శాసనాల ద్వారా అధిక పన్నులను విధించినాడు విమర్శ చేసినవారిని, ప్రత్యర్థులను అణచి నాడు. పార్లమెంట్‌ను తిరస్కరించి రెండు సంరక్షక పార్లమెంట్‌లను రద్దు పరిచినాడు.

సైనిక నియంతగా పాలించినా దేశ ఆర్థికపరిస్థితిని మెరుగుపరిచినాడు. విదేశవ్యాపారం పెంపు చేసినాడు. దేశ ప్రతిష్టను ఇనుమడింప చేసినాడు, శాంతి భద్రతలు నెలకొల్పినాడు వలస విధాన మవలంబించినాడు. పార్లమెంటరీ ఎన్నిక విధానంలో మార్పులు చేసినాడు. ఇంగ్లాండ్, ఐర్లాండ్, స్కాట్లండ్ దేశాలను ఐక్యం చేసినాడు. 1653 నుంచి 1658 వరకు సైనిక నియంతగా పాలించెను. 1658 లో మరణించినాడు

## కామన్‌వెల్త్ ప్రభుత్వం విఫలంకావటానికి గల కారణాలు

ఆలివర్ క్రామ్‌వెల్ ప్రజాసమ్మతంలేని ప్రభుత్వం స్థాపించినాడు. సైనిక నియంతగా పరిపాలన సాగించి పార్లమెంట్ సభ్యులను సంప్రదించక, ఆదరించక, వారి కోర్కెలను మన్నించక చివరకు రెండు సంరక్షక పార్లమెంట్‌లను రద్దు చేసినాడు. వ్యక్తి స్వాతంత్ర్యం పైనా, వాక్ స్వాతంత్ర్యం పైనా ఆంక్షలు విధించినాడు. దేశాన్ని జిల్లాలుగా విభజించి వాటి పరిపాలనకు సైనికాధిపతులను నియమించినాడు. అధిక పన్నులను విధించినాడు. రాజు అనుయాయులను, కాథలిక్కులను, ఎపిస్కోపలియన్‌లను హింసించినాడు.

ఇటువంటి సైనిక పరిపాలన వలన క్రామ్‌వెల్ ప్రజల సానుభూతిని పొందలేక పోగా అతని ప్రభుత్వం ఎంతో కాలం నిలువలేక విఫలత చెందింది. ప్రజలకు కూడ క్రామ్‌వెల్ ప్రవేశపెట్టిన సంస్కరణలను అర్థంచేసుకొనే శక్తి సామర్థ్యాలు లేవు. హక్కులు,

హోదాలు కోసమే కదా మొదటి ఛార్లెస్‌ను ఉరికంబ మెక్కించింది. అందుచేత సైనిక ప్రభుత్వం కన్న రాజరికమే మేలని రెండో ఛార్లెస్‌ను ఆహ్వానించినారు. క్రామ్‌వెల్ మరణించిన తరవాత ఈ విధంగా కామన్‌వెల్త్ ప్రభుత్వం పతనమయి రెండో ఛార్లెస్ రాకతో రాజరికం పునరుద్ధరింపబడింది.

## 1640-1660 నాటి రాజ్యాంగ పరిణామ ఫలితాలు

టాస్‌వెల్ లాంగ్ మీడ్ శాశ్వత ఫలితాలుగా నాల్గింటిని పేర్కొన్నాడు : 1. "రాజరిక విధానం నిలవదొక్కుకుందిగాని నిరంకుశ రాజరికం శాశ్వతంగా పతన మయింది." దీని కర్థం ముందు కాలంలో తన మాట సాగడానికి ఇంగ్లీష్ పార్లమెంట్‌లు రాజుతో ఘర్షణ పడవలసిన అవసరమే కలగబోదని కాదు ; పార్లమెంటరీ సార్వభౌమత్వాన్ని కాదన్న రాజు ఇక నెగ్గలేడనేది దీని తాత్పర్యము. 2. దేశపరిపాలనలో కామన్స్ సభదే ఇంక ప్రధాన స్థానమని శాశ్వతంగా గుర్తింపు జరిగింది. ఈ సత్యాన్ని అందరూ అంగీకరించడానికి, ఇది పరిపాలనలో ఆచరణకు రావడానికి ఇంకొక శతాబ్దానికి పై కాలం పట్టింది అయినా ప్రభువుల సభకుగాని, రాజుకుగాని కామన్స్ సభకు ఉన్న మాట చెల్లుబడి లేదనే విషయం జగద్విదిత మయింది. 3. రోమన్ కాథలిక్ మతానికి ఇక ఇంగ్లండ్‌లో పుట్టగతులు లేవనే మాట స్పష్ట మయింది. కాని ఇరవైఅయిదేళ్లలోనే ఆ మతం ఇంగ్లండ్ రాజకీయాలలో అలజడి కలిగించిన మాట అబద్ధం కాదు. 4. ప్రభుత్వం శాశ్వత సైన్యాన్ని పోషించటాన్ని ఇంగ్లీష్ ప్రజలు పూర్తిగా ద్వేషించి పరిస్థితి దేశంలో స్థిరపడింది. అట్లాగే మతంలోనూ రాజకీయాలలోనూ ఇంగ్లీష్ వారు అతివాదులను ద్వేషించే వారయినారు. టాస్‌వెల్ లాంగ్ మీడ్ చెప్పిన ఫలితాలకు తోడు మరికొన్ని శాశ్వత ఫలితాలను కూడా జి. బి. ఆడమ్స్ పేర్కొన్నాడు. ఆర్థిక స్వాతంత్ర్యం కోసం మొదటి ఎడ్వర్డ్ కాలంనుంచీ ఇంగ్లీష్ రాజులు చేసిన పోరాటం కామన్స్ సభకు అనుకూలంగా పరిష్కారమయింది రెండో జేమ్స్ తప్ప ఇంగ్లీష్ రాజెవ్వడూ ఇకమీద పార్లమెంట్ సమ్మతిలేని ఆదాయాలు రాబట్టటానికి ప్రయత్నించలేదు. 2. రాజరికపు ప్రత్యేక న్యాయపరిపాలనాధికారాన్ని పురస్కరించుకొని ఏర్పడిన న్యాయస్థానాలు శాశ్వతంగా రద్దయినాయి. 1688 తరవాత అటువంటి న్యాయపరిపాలన ఏ మాత్రం మిగిలినా అది పార్లమెంట్ అజమాయిషీకి లోబడి ఉన్నదే. 3. ఇంగ్లీష్ రాజ్యాంగ పరిణామం గణరాజ్యం (Republic) వైపు మొగ్గు చూపినా ఆ దేశంలో పరిమిత రాజరిక (Limited Monarchy) విధానమే నిల్చి ఉండేటట్లు రెండో ఛార్లెస్ రాజు కావడంలో స్థిరపడినది. ఈ నాటికీ అప్పుడప్పుడు అధికారంలేని రాజరికాన్ని వృథా వ్యయాన్ని, రద్దు చేయరాదా అనే విమర్శలు వినబడుతున్నా మూడు వందల ఏళ్ళు ఎన్నో ఒడిదుడుకులకు తట్టుకొని ఏ కారణాలవల్లనైతేనేమి నిల్చి ఉండడాన్ని బట్టి పరిమిత రాజరిక విధానం ఇంగ్లీష్ రాజ్యాంగానికి శాశ్వత లక్షణమయిందని ధృఢంగా చెప్పవచ్చు. ప్యూరిటన్ విప్లవం ఇంగ్లీష్ రాజ్యాంగంలో ఏ విధమైన మార్పులు తెచ్చిపెట్టటానికి ప్రయత్నం చేసిందో అవి 1660 లో విఫలమయినట్లు కనిపించినా కాలక్రమాన అవి ఆ రాజ్యాంగంలో భాగాలే అయినాయి. సైనిక దౌర్జన్య శక్తిని ఆధారం చేసుకొని ప్రజల కెంతో మేలు చేకూర్చవలెనని ప్యూరిటన్‌లు ప్రయత్నించినారు.

కాని వారివలె జన సామాన్యము రాజరికానికి, ఆంగ్లికన్ చర్చ్ విధానానికి విరుద్ధం కాదు. అందువల్ల వారు ప్యూరిటన్లను ద్వేషించినారు. వారు చేయదలచిన మంచిని గూడా ఆచరించలేక పోయినారు. "నిలుచొని నీరు తాగవచ్చుగాని పరుగెత్తి పాలైన తాగలే"మన్న విధంగా ప్యూరిటన్ల సంస్కరణ విధానాలు విఫలమయినాయి.

# 7

# పార్లమెంటరీ రాజరికము : బాలారిష్టాలు

## రెండో ఛార్లెస్ (1660–1685) :
## రెండో జేమ్సు (1685–1688)

*పునః ప్రతిష్ఠాపనము* (*The Restoration*)*:* 1660 లో ఇంగ్లండ్‌లో పునః ప్రతిష్ఠిత మయింది రాజరికమే కాదు ; స్టూవర్ట్ వంశం కూడా. మొదటి ఛార్లెస్ మృతిచెందిన నాటి నుంచీ అతని పెద్ద కుమారుడు రెండో ఛార్లెస్ రాజయినట్లే ఇప్పుడు పరిగణించినారు. అందువల్ల ఆ నాటి నుంచి విప్లవకారులు చేసిన పనులు, 1660 వరకు చేసిన చట్టాలూ రాజు ఆమోదించ లేదు కాబట్టి చెల్లలేదు. అంతేకాదు. దీర్ఘకాలిక పార్లమెంట్ తన రెండో సమావేశం (సెప్టెంబరు 1662) తో మొదలుపెట్టి రాజ్యాంగంలో, మత విషయంలో, శాసనాలలో తెచ్చిన మార్పులు రద్దయినాయి. రెండో ఛార్లెస్‌ను రాజు చేసేటప్పుడు మొదటి ఛార్లెస్‌కూ అతని పార్లమెంట్‌కూ మధ్య వివాదాస్పదమయిన విషయాలను ఎవ్వరూ ప్రస్తావించ లేదు. పార్లమెంట్‌కు కాదనే ప్రత్యేకాధికారాలు రాజుకు ఉన్నవా ? సార్వభౌమాధికారం పార్లమెంట్‌దా కాదా – ఇట్లాంటి ప్రశ్నలు ఎవ్వరూ లేవదీయలేదు. పరిపాలనా విధానాన్ని గురించి ఛార్లెస్ ఎట్లాంటి వాగ్దానాలూ చేయలేదు. స్థూలంగా చూసే వారికి పునః ప్రతిష్ఠాపన ఫలితంగా గత 18 ఏళ్ళలో ఇంగ్లండ్ రాజకీయ జీవితంలో జరిగిందేమీ లేనట్లే తోచవచ్చు. కాని నిజమది కాదు. అంతర్యుద్ధం ప్రారంభం కావడానికి ముందే రాజరికపు ప్రత్యేకాధికారాలను నిషేధిస్తూ పార్లమెంట్ చేసిన శాసనాలన్నీ యథాపూర్వంగా నిలిచి ఉన్నాయని తెలుసుకోవలె. అట్లాగే సైనికాధికారులూ, మతావేశపూరితుల కూటాలూ ప్రజలకు సంపూర్ణ ప్రాతినిధ్యం వహించని రంప్ పార్లమెంటూ చేసిన కార్యాలు రద్దయినాయని గ్రహించవలె. ఇకమీద అధిక సుంకాలు, నిర్బంధ ఋణాలు, ఐచ్ఛిక కట్నము, ఓడ పన్నులు, మోయరాని జరిమానాలు, యుద్ధ సేవా ప్రత్యామ్నాయ సుంకాలు, ఫ్యూడల్ కట్నాలు, సేవలవంటి వాటిని గురించి ఇంగ్లీషు రాజ్యాంగ చరిత్రలో చదవము. అట్లాగే స్టార్ ఛేంబర్ కోర్ట్ వంటి ప్రత్యేక రాజరిక న్యాయస్థానాలు రద్దయినందువల్ల అవి సాంప్రదాయిక న్యాయస్థానాల ఈక్విటీ కోర్టుల న్యాయాన్ని తారుమారు చేయడం ఇకమీద జరగదు. బ్రిటిష్ సముద్రాంతర సీమల నుంచి వచ్చె ఫిర్యాదులను పరిష్కారం చేసే న్యాయాధికార మొక్కటి ప్రివీ కౌన్సిల్‌కు నిల్చిపోయింది. దానితో బాటు దోషులని అనుమానించిన వారిని ప్రశ్నించే అధికారం కూడా దానికి ఉంచినారు. కాని వృథా కాలయాపన చేయక వారిని కోర్టు విచారణకు పంపవలసినట్లు 1679 హేబియస్ కార్పస్ చట్టం శాసించింది. తరవాత పదేండ్లకుగాని హక్కుల చట్టం (Bill of Rights)లో జామీను మొత్తాలను విపరీతంగా కోరరాదనే నియమం చేయలేము. నిర్బంధితులను విచారణకు తేవడంలో వృథాగా ఆలస్యం చేసే అధికారులకు, జడ్జీలకు తీవ్ర శిక్షలను విధిస్తూ 1679 లో ఒక చట్టము జారీ అయింది. ప్రకటనల ద్వారా శాసనాలను సృష్టించే రాజాధికారానికి

చక్కని హద్దులు కల్పితమయినాయి. తనంత తాను శాసనాలు చేయలేని రాజు ప్రజలనుంచి పన్నులు మొదలైన ఆదాయాలు రాబట్టలేని రాజు ఇంక ఏ విధంగానూ నిరంకుశ ప్రభువు కాలేడు గదా! జనరల్ మాంక్ సమావేశపరచిన కన్వెన్షన్ పార్లమెంట్ రాజు ప్రచేటించిన స్టాట్యూట్ వల్ల సక్రమమైన పార్లమెంట్ అయినది. వోటింగ్ హక్కును గురించి రిపబ్లిక్ చేసిన ఏర్పాటు, జనసంఖ్య తగ్గిన ఊళ్ళకు ప్రాతినిధ్యం తొలగించి కొత్తగా ఏర్పడిన పట్టణాలకు ప్రాతినిధ్య మివ్వడం చాలా బాగున్నవని ఛాన్సలర్ క్లారెండన్ అన్నా దానిని పూర్తిగా నిషేధించి ముందుండే ప్రాతినిధ్య విధానాన్ని అవలంబించే కామన్స్ సభకు ఎన్నికలు జరిపించినారు. 1649 లో రద్దయిన ప్రభువుల సభ పునః ప్రతిష్ఠితమయినది. 1642 లో ప్రభు సభలో స్థానాలు పోగొట్టుకొన్న బిషప్‌లు, ఆ 1642 చట్టం 1661 లో రద్దు కావడంతో తిరిగి సభ్యులయినారు. అంతర్యుద్ధ ఫలితంగా ప్రవాసం పోయిన ప్రభువులు దేశానికి తిరిగి వచ్చి ప్రభు సభలో చేరినారు. శాసనాలు చేయడంలోను, పన్నుల విధింపులోనూ పార్లమెంట్‌కు సార్వభౌమత్వం సిద్ధించింది. చర్చికి సర్వాధికారిగా రాజును తొలగించి పార్లమెంట్ తానే ఆ స్థానంలో ప్రవేశించింది.

దీర్ఘకాలిక పార్లమెంట్ వలె రెండో ఛార్లెస్ పార్లమెంట్‌లు మంత్రులను, న్యాయాధిపతులను నియమించే అధికారమూ సేనలపై అధికారమూ తమకుండవలెననీ కోరలేదు. కాని వారి సక్రమ ప్రవర్తనపై తమకున్న పెత్తనాన్ని వదులుకోలేదు. పార్లమెంట్ సభ్యులు వాక్స్వాతంత్ర్యాన్ని సాధించినారు పార్లమెంట్‌లో చేసిన ప్రసంగాలు ఆధారంగా రాజు నిర్బంధాలకు గురిచేయడం ఇంక కలలోని మాట. కొత్తగా ఎన్నికయిన వర్గాలను ఏర్పరచడానికి, ప్రాతినిధ్యం ప్రసాదించడానికి పార్లమెంట్‌కే గాని రాజుకు హక్కు లేదని రెండో ఛార్లెస్ పరిపాలించినప్పుడు స్పష్టమయింది. డర్‌హామ్ పట్టణానికి, కౌంటీకి కామన్స్ సభలో ప్రాతినిధ్యమిచ్చిన పార్లమెంటే, రాజు తనంతట తాను కొత్తగా నీవార్క్‌ను నియోజకవర్గం చేయడానికి అంగీకరించలేదు. రాజు అనే వ్యక్తి లేకుండా పన్నుల విధింపూ వసూళ్ళు ఆంతరంగిక పరిపాలనమూ విదేశ వ్యవహారాలూ, వలసల పాలనమూ భూసముద్ర సైన్యాల అజమాయిషీ 18 ఏళ్ళు సాగించిన పార్లమెంట్‌లు అవి అన్నీ రాజు ప్రత్యేకాధికార పరిధిలోనివే అనే వాదాన్ని ఇకమీద లెక్క చేయవు. రాజుల కౌన్సిళ్ళు మూలపడిన తరవాత స్థానిక పరిపాలనము కేంద్ర ప్రభుత్వ యాజమాన్యం నుంచి మరింత విడిపోయింది. శాంతి సంరక్షకుల (Justices of the Peace) అధికారం విశృంఖలమయింది. వారు పార్లమెంట్ సభ్యులూ సంఘంలో ఒకే స్థాయికి - ధనిక వర్గానికి - చెందిన వారు కావడం వల్ల వారి అభిప్రాయాలు కలిసేవి. దరిద్రుల పోషణ, న్యాయమైన కూలీ నిర్ణయించడం, నిరుద్యోగులకు ఉపాధి కల్పించడం మొదలైన ధర్మ నిర్వహణ కార్యక్రమాలపట్ల వారంత శ్రద్ధ చూపడం మానివేసినారు. ఈ అలక్ష్యభావం రెండు శతాబ్దాలు స్థానిక ప్రభుత్వ లక్షణాలలో నిలిచింది. ధనిక వర్గం దృష్టి బీదల పోషణకోసం తమమీద పడే పన్నుల భారం హెచ్చకుండా, ఇతర గ్రామాల బీద ప్రజలు తమపై వచ్చి పడకుండా చూసుకోవడంతో సరిపోగా, పార్లమెంట్ దృష్టి ఎగుమతి దిగుమతి సుంకాలవల్ల వ్యాపారం దెబ్బతినకుండా చూడడంలో ఉండేది. ఇక స్థానిక పరిపాలనము, పార్లమెంట్‌పై అధికారం తమ చేతులనుంచి తొలగిపోయినందువల్ల తమ అధికారం నిలబెట్టుకొనడానికి ఇంగ్లీష్ రాజు లింకా కొత్త మార్గాలు

చూసుకోవలసి వచ్చింది. పార్లమెంట్‌లో పలుకుబడి, అధికారము అనుభవించే వర్గాలతో వారు చేతులు కలపవలసి వచ్చింది. న్యాయాధిపతులను, మంత్రులను, ఉన్నతోద్యోగులను, బిషప్పులను, ఆర్చ్ బిషప్పులను, సైనికోద్యోగులను నియమించే అధికారం ఇంకా రాజు చేతిలోనే ఉన్నందువల్ల పదవులు ఆశ చూపి ధనిక వర్గాలను లోగట్టుకొనడం రాజుకు వీలయ్యేది. పార్లమెంటరీ ఎన్నికలలో తమ కనుకూలురు ఎన్నికయ్యేటట్లు చూసుకొనడానికి, ఎన్నికయిన వారిని తమ మిత్ర కోటిలో కలుపుకొనడానికి రాజులకు వీలుండేది.

రాజు పక్షంవారూ, 18 ఏండ్లు అతని ప్రతికక్షులుగా ఉన్న ప్రెస్బిటీరియన్‌లు, ప్యూరిటన్‌లు అంతా కలిసే పునః ప్రతిష్ఠాపన సాధించినారు. కన్వెన్షన్ పార్లమెంట్‌లో అధిక సంఖ్యాబలం ప్రెస్బిటీరియన్ పక్షం వారిది. అందుచేత ఆంగ్లికన్ పార్టీ వారికి ప్రెస్బిటీరియన్‌లపై ఎంత ద్వేషమున్నా ఆంగ్లికన్ చర్చిని పునరుద్ధరించినా కొన్ని కొన్ని ఆంగ్లికన్ చర్చి పద్ధతులను అనుసరించని చర్చీలలోని ప్రెస్బిటీరియన్‌లపై ఎట్లాంటి ప్రతికూల చర్యలనూ కన్వెన్షన్ పార్లమెంట్ తీసుకొనలేదు. అది ఫ్యూడల్ భూస్వామ్య పద్ధతిని రద్దు చేసింది. అందువల్ల రాజుకు కలిగిన నష్టాలను కొంత పూడ్చటానికి బీర్ మీద ఎక్సైజ్ పన్నొకటి విధించడమయింది. దానివల్ల చెప్పదగినంత ఆదాయం రాజుకు లభించలేదుగాని అంతటితో ఫ్యూడల్ పద్ధతి ఇంగ్లండ్ నుంచి అదృశ్యమయింది. నౌకాయాన చట్టాలను (Navigation Laws) తిరిగి విధించడమయింది. టన్నేజ్, పౌండేజ్ సుంకాలను రెండో ఛార్లెస్‌కు జీవిత పర్యంతం ఈ పార్లమెంట్ మంజూరుచేసింది. కాని మొదటి ఛార్లెస్ విషయంలో వలెనే పరిపాలనా వ్యయాలకు ఎన్నడూ తగినంత ధనం ఇవ్వని దుష్ట సంప్రదాయాన్నే రెండో ఛార్లెస్ పట్లనూ అవలంబించింది. మొదటి ఛార్లెస్‌కు మరణశిక్ష విధించిన జడ్జీలలో కొద్ది మందికి మరణశిక్ష పడినా, అతని విరోధులలో ఇంకా చాలా కొద్ది మందికి అట్లాంటి శిక్షనే విధించినా, అధిక సంఖ్యాకులను క్షమిస్తూ ఈ కన్వెన్షన్ పార్లమెంట్ చట్టం చేసింది. క్రామ్‌వెల్ సిద్ధ సైన్యం రద్దయినా సైనికులకందరికీ బాకీ పడిన జీతాలు చెల్లించేటట్లు బ్రిడా నుంచి తాను చేసిన వాగ్దానాన్ని మన్నించవలెనని ఛార్లెస్ దానికి తగిన ఏర్పాట్లు చేయటం ఆరంభించినాడు. 29-12-60 తేదీనాడు కన్వెన్షన్ పార్లమెంట్ రద్దు అయింది. ఎన్నికలు జరిపి ఏర్పడిన కొత్త పార్లమెంట్ 8-5-1661 నాడు సమావేశమయింది. ఈ పార్లమెంట్‌లో ఆంగ్లికన్‌లే అధిక సంఖ్యాకులు. ప్రెస్బిటీరియన్‌లు పార్లమెంట్ నుంచి ఇంచుమించు అదృశ్యులయినారు. ఈ పార్లమెంట్‌కు పునః ప్రతిష్ఠాపిత పార్లమెంట్ లేదా కెవలియర్ పార్లమెంట్ (Restoration or Cavalier Parliament) అనే పేరు వచ్చింది. అంతర్యుద్ధకాలంలో రాజు పక్షం వారికీ ఈ పేరే ఏర్పడింది. కెవలియర్ అనే మాటకు గుర్రపు రౌతు అని అర్థము. రాజు పక్షం వారు అనేకులు ధనిక వర్గానికి చెందిన వారు. గుర్రపు స్వారీలో వారు ఆరితేరిన వారు. అందుచేత వారి కాపేరు వచ్చింది. "వారు రాజుకన్నా ఎక్కువ రాజభక్తి గలవారు, బిషప్‌ల కంటె గొప్ప ఆంగ్లికన్‌లు" అని ఈ కెవలియర్ పార్లమెంట్ సభ్యులను గురించి ఒక మాట వ్యాపించింది. ప్యూరిటన్ పక్షంవారు తమవలె జుట్టు పొడవుగా పెంచుకోక మొదళ్ళవరకు కత్తిరించుకోగా వారిని గర్హిస్తూ రౌండ్ హెడ్‌లు (Round Heads) అని కెవలియర్లు వారిని పిలిచినారు.

## కెవలియర్ పార్లమెంట్ చరిత్ర

పార్లమెంట్ వారు క్రామ్‌వెల్ సైన్యాలను రద్దుచేయడంతోబాటు వారి జీతాల బాకీలు చెల్లించటానికి 11 నెలలు ప్రత్యేకమైన రేట్లు వసూలుచేయడమే గాక తలపన్ను కూడా విధించి ఆ విధంగా 8,58,000 పౌనులు రాబట్టినారు. 1661 ఫిబ్రవరి నాటికి 18 అశ్వికదళాలూ, 18 కాల్బల పటాలాలూ, 59 దుర్గ రక్షక సైన్యాలూ రద్దు అయినాయి. మిగిలినవి కొద్దిపాటి దుర్గరక్షక దళాలూ, ఒక్క పటాలం రక్షకదళమూ (Guards). వాటిలో క్రమశిక్షణ కాపాడటానికి సైనిక శాసనం స్థానే 1666 తరవాత యుద్ధ నియమాలు (Articles of war) కొన్ని విధించినారు. ఈ సైనికుల సంఖ్యను ఛార్లెస్ క్రమంగా పెంచినాడు. రాజు నౌకా సైన్యం మీద అధికారం కోసం పార్లమెంట్ పాకులాడలేదు. దానిపైన, సైన్యంపైన రాజు పెత్తనాన్ని ధ్రువపరుస్తూ పార్లమెంట్ 1662 లో రెండు చట్టాలను ఆమోదించింది. పరరాజ్యాలతో రాయబారాలు నడపటం, యుద్ధము, శాంతి సమాధానాలు జరపడం పూర్తిగా రాజుకే వదలివేసింది. రాజుతో పోరాటం సల్పడం, అతనికి కీడు చేయడం, అతనితో యుద్ధం చేయడానికి విదేశ సైన్యాలను ఆహ్వానించడం, అతని పరిపాలనకు అడ్డు తగలడం నేరాలనీ రాజు ఆమోదం లేకుండా పార్లమెంట్ సభలు రెండూగాని ఏ ఒక్కటోగాని చేసే శాసనాలు చెల్లవనీ పార్లమెంట్ 1660 లో ఒక చట్టాన్ని చేసింది. పదిమందికి మించి ఏ పిటిషనూ రాజుకు సమర్పించ కూడదని 20 మందికి మించి చర్చిలోగాని, పరిపాలనలోగాని మార్పు కోసం పిటిషన్ పెట్టుకోరాదని పార్లమెంట్ శాసించింది. 1641 నాటి త్రైవార్షిక శాసనం (Triennial Act) రద్దుచేస్తూ 1664 లో చేసిన కొత్త త్రైవార్షిక శాసనం మూడేళ్ళ కొకసారి పార్లమెంట్‌ను రాజు సమావేశ పరచవలెనని ఒకవైపు చాటుతూనే పార్లమెంట్‌ను పిలవవలసింది రాజేనని, దానిని ఎంతకాలం నిల్పి ఉంచవలెనో నిర్ణయించవలసింది రాజేనని నిర్ణయించింది. ఈ నిబంధనను అడ్డు పెట్టుకొని 1661 లో సమావేశమైన కెవలియర్ పార్లమెంట్ తనపట్ల భక్తి విశ్వాసాలు చూపుతున్నదని ఛార్లెస్ దానిని 18 ఏళ్ళు రద్దు చేయకుండా నిలిపినాడు.

పన్నులు విధించే హక్కును పార్లమెంట్ వదలుకోలేదు కాని వచ్చిన ఆదాయాన్ని వ్యయం చేసే అవకాశాన్ని రాజుకే ఇచ్చింది. శాసన విరుద్ధాలైన ప్రకటనలు చెల్లవని 1674లో కోర్టు తీర్పు చెప్పింది. ప్రత్యేక సందర్భాలలో రాజు శాసనాన్ని అమలుపరచవచ్చు– పరచక పోవనూ వచ్చు. వ్యష్టి విషయంలో అనుసరించే విధానం సమష్టి విషయంలో పనికిరాదని కూడా కోర్టు నిర్ణయించింది.

## కెవలియర్ పార్లమెంట్ మత విధానము

1660 అక్టోబర్‌లో ఆంగ్లికన్‌లు, ప్రెస్బిటీరియన్‌లు కలిసి ఒక జాతీయమైన చర్చిలో భాగస్వాములై ఉండే విధానాన్ని రాజు సూచించినాడు. అది అందరి ఆమోదాన్నీ పొందలేదు. 1661 వేసవిలో రెండు పక్షాల మత గురువులకూ రాజీ కుదర్చటానికి జరిపిన శావాయ్ సమావేశంలో (Savoy Conference) వారొక సమానాధానికి రాలేకపోయినారు. రాజ హంతకులపై ప్రెస్బిటీరియన్‌లు దయ చూపలేదు. ఇప్పుడు పునః ప్రతిష్ఠాపిత పార్లమెంట్

సభ్యులు కూడా ప్రెస్బిటీరియన్‌ల పట్ల ఎట్లాంటి ఔదార్యమూ చూపలేదు. చర్చి పూజా ప్రార్థనలలోను, గురువుల ఉడుపుల విషయంలోను కోరిన కోరికలను ఛార్లెస్ మన్నించడాని కిష్టపడలేదు. దాని ఫలితము క్లారెండన్ కోడ్. అది పార్లమెంట్ ఆమోదం పొంది ఆంగ్లికన్‌లు కాని ప్రొటెస్టెంట్‌ల మత స్వాతంత్ర్యానికి చాల కంటకంగా పరిణమించింది.

*క్లారెండన్ చట్టాలు:* క్లారెండన్ లార్డ్ ఛాన్సలర్. రెండో ఛార్లెస్‌కు ప్రధానమంత్రి అని చెప్పవచ్చు. ఆంగ్లికన్‌లు కాని ఇంగ్లీష్ వారిపై అనేక నిర్బంధాలను విధిస్తూ అతడు పార్లమెంట్ చేత నాలుగు చట్టాలను ఆమోదింపజేసినాడు. అందులో మొదటిది (i) కార్పొరేషన్ చట్టము (1661): కార్పొరేషన్‌లున్న పట్టణాలలోని ఉద్యోగులందరూ సాలెమ్ లీగ్ అండ్ కవినంట్ (Solemn League and Covenant) లో తాము చేరలేదని, ఎట్లాంటి సందర్భాలలోనూ రాజును ఎదిరించడం నేరమని ప్రమాణపూర్వకంగా ప్రకటించవలె. రాజు సర్వాధికారి అని, అతనిపట్ల విధేయత చూపుతామని ప్రమాణం చేయవలె. పార్లమెంట్‌కు ఎన్నిక అయిన సంవత్సరంలోగా ఇకముందు ఆంగ్లికన్ కర్మలను అనుసరించి ప్రసాదమూ, తీర్థమూ పుచ్చుకోవలె.

(ii) *ఏకరూపతా శాసనము* (*Act of Uniformity*): మతగురువు లందరూ బిషప్పుల నుంచి తమ పదవులను స్వీకరించవలె. చర్చిలో వారు చేసే ప్రార్థనాదికాలలో ప్రార్థన గ్రంథాన్నే వాడవలె. ఉపాధ్యాయులందరూ రాజు కెదురు తిరగమని ప్రకటించడమే గాక ఆంగ్లికన్ చర్చి పూజా విధానాన్ని అంగీకరిస్తున్నట్లు కూడా ప్రమాణం చేయవలె.

(iii) *ప్రార్థన సమావేశ శాసనము:* ఏక కుటుంబానికి చెందనివారు నలుగురికంటె ఎక్కువమంది ఆంగ్లికన్ పద్ధతికి భిన్నమైన ప్రార్థన సమావేశాన్ని నిర్వహించరాదు; నిర్వహిస్తే తీవ్రమైన శిక్షలకు గురి అవుతారు.

(iv) *బహిష్కార శాసనము:* ఏకరూపతా శాసనాన్ని అనుసరించని మతాచార్యులు చర్చిలోను, ప్రభుత్వంలోను మార్పులు తీసుకొనిరావడానికి ప్రయత్నించమని, రాజును ఎదిరించమని ప్రమాణపూర్వకంగా ప్రకటించవలె. అట్లా చేయడానికి అంగీకరించకపోతే తామింతకుముందు ఉపన్యసించిన గ్రామ, పట్టణ కార్పొరేషన్‌లకు 8 కి. మీ. దగ్గరకు రాకూడదు. వస్తే తీవ్ర శిక్షలు విధించడమవుతుంది.

ఈ నాలుగు చట్టాలనూ అమలు జరిపితే లాడ్ సంకల్పించిన ఏకజాతీయ చర్చి విధానం ఇంగ్లండ్‌లో స్థాపితమవుతుందనటంలో సందేహం లేదు బ్రెడా ప్రకటనలో ప్రెస్బిటీరియన్‌లకు ఇస్తామన్న మత స్వాతంత్ర్యానికి సున్న చుట్టినట్లయింది; వారికి బతుకుతెరువే అసాధ్యమయిపోయింది. స్వతంత్ర పక్షం (Independents) వారివలె గాక ప్రెస్బిటీరియన్‌లు తమ విధానాన్ని ప్రజలందరూ అవలంబించవలెనని అది జాతీయ విధానం కావలెనని కోరినారు. వారు మత స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తూ చర్చిలో ఇమిడి ఉండవలెనని కోరినారు. ఇప్పుడీ నాలుగు చట్టాల ఫలితంగా ప్రెస్బిటీరియన్‌లు చర్చినుంచి వెలి అయినారు. పోనీ చర్చికి వెలపలనయినా ప్రెస్బిటీరియన్‌లు ఒకచోట సమావేశమై తమ పద్ధతి ప్రకారం ప్రార్థనాదికాలు చేసుకొంటారనుకొన్నా, వాటిని కూడా ఈ చట్టాలు నిషేధించినాయి. ఆంగ్లికన్‌లు ప్రెస్బిటీరియన్‌లపై విరుచుకొని పడినంతగా స్వతంత్రుల పైకి ధ్వజ మెత్తలేదు. అందుచేత విధిలేక కాలక్రమాన అనేకమంది ప్రెస్బిటీరియన్‌లు ఆంగ్లికన్ చర్చిలో కలిసి

పోయినారు. ఇట్లా కలిసినవారే రానున్న తరాలలో విగ్ (Whig) పార్టీకి బలమిచ్చినవారు. దేశ పరిపాలనలోనే కాక మత విషయంలోనూ పార్లమెంట్ ఆధిపత్యం ఈ విధంగా స్థాపిత మయింది. కెవలియర్ పార్లమెంట్ రాజుపట్ల, ఆంగ్లికన్ చర్చిపట్ల అత్యంత ఆదరాభిమానా లతో ఉండటం సర్వాధికారాలూ చేజిక్కించుకోవలెనన్న ఛార్లెస్ ఆశయ సాఫల్యానికి ఎంతో అనుకూలించింది. పైకి ఎంతో భోగలంపటుడైనట్లు కనబడినా అది వట్టి నటన అని, తన తండ్రి తాతల లక్ష్యాన్ని సాధించి ట్యూడర్ రాజుల కాలంలోవలె నిరంకుశత్వాన్ని స్థాపించ టానికి అతడు నిరంతరం కృషి చేసినాడని కొందరు చరిత్రకారుల అభిప్రాయము. ఛార్లెస్ సుఖభోగాలకు పాకులాడటం పూర్తిగా నటన మాత్రం కాదు. పరరాజుల పంచలలో పడిగాపులు కాసి సుఖజీవనానికి పదేళ్ళుగా మొగం వాచిఉన్న ఛార్లెస్ రాజైన తరవాత భోగాలకు ఎగ బడినాడు. వయసు మళ్ళినకొద్దీ స్త్రీలకోసం అతని ఆరాటం హద్దుమీరి పోయింది. కాని అతడు పడిన కష్టాలూ అతని తండ్రి చావూ గుర్తించి రిపబ్లిక్ కాలంలో అనుభవించిన అస్థిరతనూ, సైనిక దౌర్జన్యాలనూ మరవని పార్లమెంట్ రాజ్యం దైవదత్తమని, రాజు నెదిరించడం పాపమని, అతనికి విధేయులై ఉండటం ప్రజల ధర్మమని శాసనాలు చేయడం విచిత్రమైన విషయమే. ప్రజల, పార్లమెంట్‌ల ఈ చిత్తవృత్తిని ఛార్లెస్ చక్కగా ఉపయోగించుకొనదలిచి 1662 డిసెంబరు నెలలో తన మొదటి అనుగ్రహ ప్రకటన చేసినాడు. "ప్రజానీకాన్ని తృప్తిపరచడానికి, ఉన్న చట్టాలు ఒక వ్యక్తి విషయంలో అమలు జరగకుండేటట్లు అనుగ్ర హించడానికి రాజైన నాకు ప్రత్యేకాధికారమున్నదని నేను నమ్ముతున్నాను. ఆంగ్లికన్ చర్చికి దూరంగా ఉన్న వారి ఇబ్బందులను తొలిగించదలిచినాను అందుకోసం పై అధికారాన్ని పార్లమెంట్ సమ్మతితోనే ఉపయోగించదలిచినాను" అని రెండో ఛార్లెస్ అన్నాడు. కాని ప్రకటన తరవాత జరిగిన పార్లమెంట్ సమావేశం దీనిని అంగీకరించనందువల్ల ఛార్లెస్ తన ప్రయత్నాన్ని మానుకొన్నాడు.

కాని పదేళ్ల తరవాత పార్లమెంట్‌తో సంప్రదించకుండా తనంత తాను మత విషయా లలో ఆంగ్లికన్‌లు కాని వారిని బాధించే చట్టా లన్నిటినీ అమలు జరపకుండా వెంటనే ఆపు జేస్తున్నానని ఛార్లెస్ రెండో అనుగ్రహ ప్రకటన జారీ చేసినాడు. ఇటువంటి చట్టాలు నలభై దాకా ఉన్నందువల్ల పై ప్రకటనవల్ల పార్లమెంట్ అధికారం మీద రాజు ఎంత పెద్ద దెబ్బ తీసినాడో గ్రహించవచ్చు. కాని ఈ అనుగ్రహ ప్రకటన తమతోబాటు కాథలిక్‌లకు కూడా లాభిస్తున్నందువల్ల అదంటే ఆంగ్లికనీలు కాని ప్రొటెస్టెంట్ లందరూ విరోధించినారు. ఈ ప్రకటన అనంతరం జరిగిన సమావేశంలో "మతానికి సంబంధించిన శిక్షాస్మృతులు పార్లమెంట్ శాసనంవల్ల తప్ప మరో విధంగా అమలుకాకుండా తాత్కాలికంగా నైనా ఆపుచేసే వీలులేదు" అని పార్లమెంట్ శీర్మానించింది. ఆంగ్లికన్‌లతో సమంగా మత స్వాతంత్ర్యం కాథలిక్‌లకు కూడా సాధించవలెనంటే రాజకీయంగా తన పలుకుబడిని వృద్ధిచేసుకోక తప్పదని ఛార్లెస్ గ్రహించినాడు. ఛార్లెస్ చేసిన ఈ రెండు ప్రకటనలవల్ల పార్లమెంట్‌లోను, ప్రజలలోను కాథలిక్ మతాన్ని అభిమానించే రాజో కాథలిక్ రాజవంశమో తిరిగి దేశాన్ని పోపరి (Popery) లోకి తోయగలరనే భయం వ్యాపించింది. ఛార్లెస్ ప్రచ్ఛన్న కాథలిక్ ఏమో నన్న వదంతి వచ్చింది. అతని తమ్ముడు జేమ్సు బాహాటంగానే కాథలిక్. ఛార్లెస్‌కు సంతానం లేనందువల్ల అతని అనంతరం రాజు కావలసినవాడు జేమ్సు రాజకుమారుడే. ఈ భయాలవల్ల

ఛార్లెస్ తన అనుగ్రహ ప్రకటనను ఉపసంహరించుకొన్నా పార్లమెంట్ తీవ్ర చర్య తీసుకో దలిచింది. 1665 నుంచే రాజు మీద పార్లమెంట్ ఆదిలో చూపిన అభిమానం సన్నగిల్లడం ఆరంభమయింది. ప్రతి విషయాన్నీ విమర్శించవలెననే, అన్నింటిలో తన పెత్తనం చూపవలె ననే కోరిక బలపడసాగింది. రాజు చుట్టూ ఉన్న వారి అవినీతి, ఉద్యోగుల లంచగొండి తనమూ, హాలండ్‌తో (1665-67) జరిగిన యుద్ధాలలో వచ్చిన అపజయమూ పార్లమెంట్‌లో రాజు పట్ల ప్రతికూల భావాన్ని అధికం చేసినాయి. 1665 లో ఉదారంగా ధనం మంజూరు చేసినా దానిని యుద్ధానికే వినియోగించవలెనని కామన్స్ సభ తీర్మానించింది. అటువంటి నియమాన్నే 1666 లోను చేయడమయింది. అంతటితో ఆగక 1697 లో యుద్ధానికి మంజూరుచేసిన మొత్తాలను యుద్ధానికే వ్యయం చేసినారో లేదో చూడవలెనని శాసించింది. ఆ విషయం చూడటానికి లెక్కల కమిషనర్‌లను నియమించింది. వారు ప్రభుత్వ వ్యయాలను ఆడిట్ చేయటానికి అసాధారణాధికారాలు ఇవ్వడమయింది. ఈ విధంగా ద్రవ్యం మీది అధి కారాన్ని రాజు చేతులనుంచి తొలిగించి పార్లమెంట్ తన చేతులోకి తీసుకొన్నది. రెవిన్యూ పంపకమూ (appropriation) వ్యయాల ఆడిట్‌ను (audit) క్రమంగా ప్రభుత్వ ఆదాయ వ్యయాలన్నింటికీ వ్యాపింపజేసే కొద్దీ రాజ్యాధికారం రాజునుంచి తొలిగి పార్లమెంట్ హస్త గత మయింది. ఆడిటర్‌ల నివేదికను ఆధారం చేసుకొని నౌకా సైన్య కోశాధిపతి జార్జ్ కార్ట రేట్‌ను అనధికారంగా ధనం ఇచ్చినాడనే నేరం మోపి కామన్స్ సభ నుంచి వెళ్లగొట్టినారు. ఎడ్వర్డ్ హైడ్ ఇప్పుడు క్లారెండన్ ప్రభువయినాడు. అతనిని రాజు లార్డ్ ఛాన్సలర్ చేసినాడు. అతడు కామన్స్ సభ ఒకదాని తరవాత ఒక అధికారాన్ని చేజిక్కించుకోవడం ఓర్వలేక ఆ ప్రయత్నాలకు అడ్డు తగులుతుండటం వల్ల అతనిపై కామన్స్ సభ దేశద్రోహ నేరాన్ని మోపింది. దానికి భయపడి అతడు దేశం వదిలి పారిపోయినాడు.

*ప్రీవీకౌన్సిల్ :* రెండో ఛార్లెస్ పాలనా కాలంలో ప్రీవీ కౌన్సిల్ సభ్యుల సంఖ్య 27 నుంచి 50 వరకు పెరిగింది. ఈ కౌన్సిల్ సమర్థవంతంగా పనిచేసేది కాదు. కౌన్సిల్ సభ్యు లలో భిన్నాభిప్రాయాలుండేవి. ప్రీవీ కౌన్సిల్ పరిపాలనకు సంబంధించిన ఉత్తర్వులను జారీ చేయడం, ప్రజా క్షేమానికి తగిన చర్యలు తీసుకోవడం, వలస రాజ్య వ్యవహారాలమీద అజ మాయిషీ చేయడం మొదలైన కార్యకలాపాలు నిర్వహిస్తూ ఉండేది. సామూహికంగా కౌన్సిల్ నిర్వహించే కార్యకలాపాలకన్న దానిలోని సభ్యులు కొందరు కమిటీలుగ ఏర్పడి నిర్వహించే బాధ్యతలకే ఎక్కువ ప్రాధాన్యం ఉండేది. 1660 తరవాత విదేశ వ్యవహారాలు, సైన్యము, నౌకా దళము, వర్తక వాణిజ్యాదులకు సంబంధించి, ఫిర్యాదులు స్వీకరించడానికి కమిటీలు ఏర్పడినాయి. 1668 లో అన్ని విషయాలు ముందుగా కౌన్సిల్‌కే నివేదించవలెననీ, తరవాత ఆ విషయాలకు సంబంధించి రెవెన్యూ పంపకాల కమిటీకి చేసిన సలహామేరకు, కౌన్సిల్ వివిధ పరిపాలనా శాఖలకు ఉత్తర్వులు జారీ చేయవలెననీ నిర్ణయించడం జరిగింది. అందుచేత వారు కొన్ని కమిటీలుగ పనిచేయడం, ప్రీవీ కౌన్సిల్ సభ్యులలో కొందరు మాత్రమే రాజుకు అంతరంగిక మంత్రులుగా ఉండడం ఆచారమైంది.

## కాబాల్ మంత్రి మండలి

ఛాన్సలర్ పదవి నుంచి క్లారెండన్ తొలగిన తరవాత ఛార్లెస్ అంతరంగిక మంత్రులు

క్లిఫర్డ్, అర్లింగ్‌టన్, బకింగ్ హామ్, ఆష్లీ, లాడర్ డేల్ అనే అయిదుగురు సలహాదారులు ఏర్పడినారు. వారి పేర్ల మొదటి అక్షరాలను బట్టి వారికి సామూహికంగా కాబాల్ (Cabal) అనే పేరు వచ్చిందని కొందరు అంటారు. కాని కాబాల్ అనేది పాత పేరే. రహస్యాలోచనలూ రహస్య కార్యకలాపాలు జరిపే కూటానికి ఆ పేరు వాడుతూ ఉండేవారు ఈ అయిదుగురిలో ముఖ్యుడు ఆంటొనీ ఆష్లీకూపర్. ఈ అయిదుగురు క్రమేణా ప్రివీ కౌన్సిల్ స్థానాన్ని ఆక్రమించినారు. ఛార్లెస్ రాజుకు అంతరంగ సలహాదారులుగా వ్యవహరిస్తూ, చాలా సమర్థవంతంగ పని చేసేవారు. దాదాపు ఈ అయిదుగురు ఒక మంత్రి మండలిగా పని చేసేవారు. వీరందరు రాజుకు విధేయులుగా ఉండేవారు. కాని ఒకరినొకరు నమ్మేవారు కాదు. వారు తరచూ వ్యక్తిగత ద్వేషాలను, విరోధ భావాన్ని ప్రదర్శించేవారు. అయితే వీరందరూ వర్తక వ్యాపారాలు వృద్ధిచేయాలనీ, మత స్వాతంత్ర్యం కోసం కృషి చేయాలనే సంకల్పం కలవారు. ఈ కాబాల్ మంత్రి మండలి డచ్ వారిపట్ల వైరంబూని, ఛార్లెస్‌ను వారితో సంబంధాలు పెట్టుకోకుండా చేసింది. ఛార్లెస్ కాబాల్ సహాయంతో ఫ్రాన్స్‌తో మైత్రిని, దేశ వ్యవహారాలలో కాథలిక్‌లకు ఆంగ్లికన్‌లు గాని ప్రొటెస్టెంట్‌లకు మత స్వాతంత్ర్యాన్ని సమకూర్చినాడు. ఆ ఆలోచనా ఫలితమే ఛార్లెస్ రెండో అనుగ్రహ ప్రకటన, ఛార్లెస్ రెండో అనుగ్రహ ప్రకటనను ఉపసంహరించడంతో, కాబాల్ మంత్రి మండలి అనుసరించిన మత విధానం విఫలమైంది. పార్లమెంట్‌దే పై చేయి అయింది. తత్ఫలితంగా పార్లమెంట్ పరీక్షా శాసనాన్ని (1678) అంగీకరించింది. అదే విధంగా కాబాల్ మంత్రి మండలి విదేశీ విధానంలో గూడ విఫలత చెందింది. ఛార్లెస్ పార్లమెంట్ మాటకు తలవగ్గి, డచ్ యుద్ధం నుంచి ఉపసంహరించుకొన్నాడు.

*1678 పరీక్షా శాసనము (Test Act):* పై అనుగ్రహ ప్రకటనను రాజు ఉపసంహరించుకొనగానే ఈ చట్టాన్ని పార్లమెంట్ ఆమోదించింది. 1559 సర్వాధికార శాసనం (Act of Supremacy) వల్ల చర్చి ఉద్యోగంలోగాని, దొరతనం వారి ఉద్యోగంలోగాని ఉన్న ప్రతి వ్యక్తి పోప్ అధికారాన్ని అంగీకరించననే ప్రమాణం చేయవలసి వచ్చింది. కాని ప్రమాణం తీసుకొనడానికి నిరాకరించిన వారికి ఈ చట్టం ఎటువంటి శిక్షనూ విధించలేదు. ప్రభు సభా సభ్యులు అటువంటి ప్రమాణం చేయనక్కరలేదని చట్టమే నిర్ణయించింది.

1678 నాటి పరీక్షా శాసనంవల్ల ఏ ప్రభుత్వోద్యోగంలోనైనా చేరడానికి ముందు ప్రతి వ్యక్తి రెండు పనులు చేయవలె. 1. చర్చి (ఆంగ్లికన్) పద్ధతి ప్రకారం తీర్థ ప్రసాదాలు గ్రహించవలె. 2. ఆ తీర్థ ప్రసాదాలు శిలువ వేయబడిన జీసస్ రక్త మాంసాలుగా మారుతాయనే వస్త్వంతరణ (Transubstantiation) సిద్ధాంతాన్ని నిరాకరించవలె. ఈ చట్టాన్ని ఇంగ్లీష్ చర్చిలో లేని ప్రొటస్టెంట్‌లు ఆమోదించటం వల్ల కాథలిక్‌లతో బాటు వారిపై ఉన్న నిర్బంధాలను కూడా తొలగించడానికి ఒక బిల్లును పార్లమెంట్‌లో ప్రవేశ పెట్టినారు గాని అది నెగ్గలేదు. ఈ పరీక్షా శాసనంవల్ల నౌకా సైన్యాధిపతి (Lord High Admiral) పదవిని యార్క్ డ్యూకైన జేమ్స్ వదులుకొనవలసి వచ్చింది. కోశాధిపతి అయిన క్లిఫర్డ్ పదవీ భ్రష్టుడయినాడు. అంతటితో కాబాల్ విచ్ఛిన్నమయింది.

తరవాత సర్ థామస్ ఆస్బర్న్ (డాన్‌బీ ప్రభువు) కోశాధికారి అయినాడు. తన కిష్టం లేకున్నా రాజాజ్ఞను మీరలేక అయన ఫ్రెంచి రాజు పదునాల్గో లూయీతో ఇంగ్లండ్‌కు అప్రతిష్ఠ తెచ్చే రాయబారం నడిపినాడు. అందువల్ల అతనిని పార్లమెంట్ ఇంపీచ్ చేసింది.

రాజాజ్ఞవల్ల అట్లా చేసినాననే సమర్థనను కామన్స్ అంగీకరించలేదు. మంత్రులు తమ చర్యలకు పార్లమెంట్‌కు బాధ్యులు కాక తప్పదన్నారు. పార్లమెంట్ తీర్పు చెప్పడానికి ముందే రాజు తనను క్షమించినాడన్న డాన్బీ వాదనను కామన్స్ తోసిపుచ్చింది. శిక్ష విధించడానికి ముందు క్షమించే ప్రసక్తే లేదు పొమ్మన్నది. ఈ మాట సెటిల్‌మెంట్ చట్టంలో ఉన్నది. కామన్స్ సభ అతని విచారించింది. రాజు పార్లమెంట్‌ను మొదట వాయిదావేసి తరవాత రద్దు చేసినాడు. ఎన్నికల తరవాత సమావేశమయిన కామన్స్ సభ పార్లమెంట్‌ను రద్దుచేసినంత మాత్రాన ఇంపీచ్‌మెంట్ మధ్యలో ఆగిపోదన్నది.

రాజును చంపి ఇంగ్లండ్‌ను రోమన్ చర్చికి అప్పగించే కుట్రను తాను కనిపెట్టినానని 1678 లో టైటస్ ఓట్స్ అనే వ్యక్తి ఒక కట్టు కథను ప్రచారం చేసినాడు. ఈ కథను అనేకులు నమ్మినారు. నమ్మి చాలా భయపడి ప్రతి పార్లమెంట్ సభ్యుడూ విధిగా రాజ భక్తి, రాజ సర్వాధికారత్వ (allegiance and supremacy) ప్రతిజ్ఞలను చేయకుండా సభలో (కామన్స్ ప్రభు సభ) సమావేశం కారాదని పార్లమెంటరీ పరీక్షా శాసనం నిర్ణయించింది. ఆ ప్రమాణాలతో బాటు తీర్థ ప్రసాదాలు క్రైస్ట్ రక్త మాంసాలుగా మారవనీ, భక్తులను ఆరాధించడం దోషమనీ ప్రతి సభ్యుడూ ప్రకటించవలెననే నిబంధనను విధించడమయింది. ఈ విధంగా ఒక్క రాజు పదవికి తప్ప మరో పదవికి కాథలిక్ అయినవాడు ఆశ వదలుకోవలసి వచ్చినది. ఈ పార్లమెంట్ రద్దయి ఎన్నికలు జరిగినాయి. ఈ ఎన్నికల సందర్భంలో రాజు పక్షానికి టోరీలు, ప్రతి పక్షానికి విగ్గులు అనే పేర్లు ప్రచారంలోకి వచ్చినాయి. ఐరిష్ కాథలిక్ దోపిడిగాండ్లను టోరీలని పిలిచేవారు. ప్రెస్బిటీరియన్ మతావేశపరులకు విగ్గులని పేరు. రాజుకు ప్రతిపక్షంలోనివారు అత్యధిక సంఖ్యలో కామన్స్ సభకు ఎన్నిక అయినారు సభ సమావేశం కాగానే తొలగింపు చట్టం (Exclusion Bill) ప్రతిపాదించినారు. రెండో ఛార్లెస్ తరవాత అతని తమ్ముడైన జేమ్స్ యార్క్ ప్రభువుకు కాథలిక్ అనే కారణంతో సింహాసనం చెందకుండా వారసత్వ హక్కునుంచి అతనిని తొలగించదలచి చేసిన శాసనమది. దానిని కామన్స్ సభ అమోదించేలోగా పార్లమెంట్‌ను ఛార్లెస్ రద్దు చేసినాడు. ఈ 1679 పార్లమెంట్ చాలా స్వల్పకాలమే పనిచేసింది. ఆ కొద్ది కాలంలోనే (విగ్ నాయకుడు) షాఫ్ట్స్‌బరీ ప్రోత్సాహంతో హేబియస్ కార్పస్ చట్టం జారీ అయి న్యాయవిచారణ లేకుండా కూపర్ అరెస్టు కాకుండా రక్షణ వచ్చింది. ఇంగ్లండ్‌కు అవతల ఉన్న ప్రదేశాలలో కూడా విచారించకుండా శిక్షించడం, నిర్బంధించడం జరగరాదని ఈ చట్టం ప్రకటించింది.

1679 లో ఇంకో పార్లమెంట్‌ను రాజు సమావేశ పరిచినాడు. కాథలిక్కులు సింహాసనానికి రాకుండా తొలిగించే చట్టాన్ని తిరిగి ప్రవేశపెట్టినారు. కామన్స్ సభ దాని ఆమోదించి పంపినా ప్రభువుల సభ దానిని తోసిపుచ్చింది. వెంటనే రాజు పార్లమెంట్‌ను రద్దు చేసినాడు. కొంత కాల మాగి 1681 లో పార్లమెంట్‌ను ఛార్లెస్ ఆక్స్‌ఫర్డ్‌లో ఏర్పాటు చేసినాడు. ఆ పార్లమెంట్ చాలా దౌర్జన్యాలకు దారి తీసేటట్లు కనబడటంచేత దానిని రద్దు చేసినాడు. అతడు శేష జీవితంలో పార్లమెంట్‌ను మళ్ళీ సమావేశ పరచలేదు. టైటస్ ఓట్స్ లేవదీసిన కాథలిక్‌ల కుట్ర పేరిట నిర్దోషులయిన కొందరు కాథలిక్‌లను చంపడం తటస్థించింది. ఆ మరణ శిక్షలు న్యాయస్థానాలే విధించినా అవి అన్యాయమని అందరికి తెలిసి పార్లమెంట్‌లోని కొందరు విగ్ నాయకుల తీవ్రవాదాలను అసహ్యించుకొని ప్రజలు రాజు మీదా, అతని సోదరుని మీదా

సానుభూతి చూపినారు. ప్రతిపక్ష నాయకులు తమ ప్రయత్నాలిట్లా భగ్నం కాగా రహస్యంగా కుట్రలు పన్నినారు. అవి బయటపడగా విలియమ్ రస్సెల్, ఆల్‌గెర్నాన్ సిడ్నీ మొదలయిన వారికి మరణశిక్షలు విధించడమయింది. విగ్ పక్షం వారికి లండన్ నగరము, ఇతర పట్టణాలు ఆయువు పట్టు. అవి ఛార్టర్లను అతిక్రమించినాయనే ఆరోపణలు చేయించి వాటి అధికారాలను చాలా తగ్గిస్తూ కొత్త ఛార్టర్లను ప్రకటించడం జరిగింది. వోటింగ్ హక్కు ఆ పట్టణాలలో చాలా కొద్ది మందికే వచ్చింది. మునిసిపల్ ఉద్యోగాలు రాజు పక్షపాతులకే లభించినాయి. ఈసారి ఎన్నిక కాబోయే పార్లమెంట్‌లో రాజు అభిమానులే హెచ్చుమంది రావటానికి అన్ని జాగ్రతలు తీసుకొన్నా రెండో ఛార్లెస్ పార్లమెంట్‌ను సమావేశపరచకుండా మూడేళ్ళకు ఎక్కువ కాలమే పరిపాలించినాడు. అతడు 1685 లో మరణించినప్పుడు ఎటువంటి కల్లోలాలూ లేకుండా యార్క్ ప్రభువు జేమ్స్ రెండో జేమ్స్ రాజుగా సింహాసనం అధిష్ఠించినాడు.

రెండో ఛార్లెస్ కాలంలో చర్చి కాన్వొకేషన్ వారు తమపై తామే పన్నులు విధించు కొనే హక్కును పార్లమెంట్‌కు అప్పచెప్పినారు. ప్రభువుల సభ మొదటి వ్యాజ్యాలను విచారించే అధికారాన్ని వదులుకొని ఛాన్సలరీ కోర్ట్ నుంచి వచ్చే అప్పీళ్ళను పరిష్కరించే హక్కును మాత్రం నిలుపుకొన్నది. పూర్వం జ్యూరీలోని వ్యక్తులు తామిచ్చే అభిప్రాయానికి బాధ్యులు కావలసి ఉండేది. ఇకమీద జడ్జీలు జ్యూరీలోని వ్యక్తులు తప్పుడు తీర్పు చెబితే శిక్షించే అధికారం పోగొట్టుకొన్నారు. ప్రభు సభ నుంచి పన్నులు విధించే హక్కును పూర్తిగా తీసివేసి ఆ అధికారాన్ని కామన్స్ సభ వారే గ్రహించినారు. కావలెనంటే ప్రభు సభ పన్నుల విధింపు చట్టానికి సవరణలు చేయవచ్చు. శతాబ్దాల తరవాత ఆ హక్కును కూడా ప్రభు సభ నుంచి లాగివేసినారు. యుద్ధ కార్యదర్శి పదవి, విదేశాలలోని వలసలను (Colonies) పాలించే కమిటీ స్పష్టమయినాయి.

## రెండో జేమ్స్ (1685–1688)

రాజు కాగానే రెండో జేమ్స్ చేసినపని రేవు సుంకాలు యథాపూర్వంగా చెల్లిస్తూ ఉండవలెననే ఆజ్ఞ జారీ చేయడం. ఇది పార్లమెంట్ చేయవలసిన పని. వెంటనే జేమ్స్ పార్లమెంట్‌ను సమావేశపరచినాడు. అది ఎంతో రాజ భక్తిని ప్రదర్శించింది. అది అతనికి జీవిత పర్యంతం ఏటేటా 20 లక్షల పౌనుల ఆదాయాన్ని మంజూరుచేసింది. ఆర్‌గైల్ మాన్‌మత్‌లు తిరుగుబాటు చేసినారు గాని వారిని సులభంగా అణచివేయడమయింది. పార్లమెంట్ రెండో సమావేశంలో రాజు అది తనకు విరోధి అయ్యేటట్లు చేసుకోగలిగినాడు. తన మతానికి చెందిన కాథలిక్‌లకు ఉద్యోగా లిప్పించటానికి పరీక్షా శాసనాన్ని (Test Act) పార్లమెంట్ రద్దు చేసే ప్రయత్నం చేసినాడు. కాని అతని ఉద్దేశంలో న్యాయానికి మించి హెచ్చు ఉద్యోగాలు కాథలిక్కులకు కట్టిపెట్టవలెనని ఉంది. అది కనిపెట్టి పార్లమెంట్ పరీక్షా శాసనాన్ని రద్దు చేయడానికి నిరాకరించింది. తన అభిమతం తీరవలెనంటే తన సిద్ధ సైన్యాన్ని పెంచి తీవ్ర చర్యలకు పూనుకొనవలసి ఉంటుందని జేమ్స్ నిశ్చయించుకొన్నాడు. కాని శాంతి సమయంలో పెద్ద సైన్యాన్ని పెంచడంవల్ల 1642-1660 మధ్య కాలంలో జరిగిన అనర్థాలవంటివి సంభవిస్తాయని భయపడి జేమ్స్ మంత్రులు చేసిన ఉపపాదనలను తోసిపుచ్చి వారడిగిన విశేష

ధనాన్ని మంజూరు చేయడానికి పార్లమెంట్ నిరాకరించింది. అందుకు కోపించి రాజు పార్ల మెంట్‌ను వాయిదా వేసి అది లేకుండా పాలించటానికి నిశ్చయించినాడు.

ఇంగ్లండ్ రాజ్యం వదలి జేమ్స్ పరారీ కావడానికి దారితీసిన సంఘటనలు : 1. కాథ లిక్ మతాన్ని ఇంగిష్ ప్రజామతంగా చేయదలిచి మత విషయాలలో రాజుకున్న సర్వాధికారా లను ఆ ప్రయోజనం సాధించటానికే వినియోగించినాడు. అనేక ప్రచ్ఛన్న కాథలిక్‌లకు, ప్రకటిత కాథలిక్కులకు ఇంగిష్ చర్చిలో ఉద్యోగాలిచ్చినాడు.

2. దీర్ఘకాలిక పార్లమెంట్‌ను రద్దు చేసిన హైకమిషన్ కోర్టు స్థానంలో అటువంటిదే ఎక్లిసియాస్టికల్ కమిషన్ కోర్ట్‌ను స్థాపించినాడు.

3. ఈ కోర్టు మత గురువుల దుష్ప్రవర్తనలను విచారించి వారిని తాత్కాలికంగానో శాశ్వతంగానో ఉద్యోగాలనుంచి తొలిగించేది.

4. ఆక్స్‌ఫర్డ్ బిషప్పైన పార్కర్ కాథలిక్ అని అనేకుల అభిప్రాయము. అతనిని తమ అధ్యక్షుడుగా ఎన్నుకొనడానికి నిరాకరించినందువల్ల ఎక్లిసియాస్టికల్ కమిషన్ కోర్ట్ మాగ్డలిన్ కాలేజ్ ఉపాధ్యాయులను పదవుల నుంచి తొలగించింది.

5. కాథలిక్‌లను విశేష సంఖ్యలో జేమ్స్ సివిల్, మిలిటరీ ఉద్యోగాలలో నియమించి నాడు. స్టాట్యూట్‌లు తాత్కాలికంగా అమలు కాకుండా చేయడానికి తన ప్రత్యేకాధికారాన్ని అతడు ఈ పనికోసం ఉపయోగించుకొన్నాడు. సర్ ఎడ్వర్డ్ హేల్స్‌కు మిలిటరీ కమీషన్ అనుగ్రహించి పరీక్షా శాసనానికి విరుద్ధంగా ఆ ఉద్యోగాన్ని స్వీకరించినందుకు ఇంకొకనిచేత హేల్స్‌పై వ్యాజ్యం వేయించినాడు తన ఇష్టాన్ని వ్యతిరేకిస్తారనే అనుమానమున్న జడ్జీలను మొదట తొలగించినాడు. తరవాత హేల్స్ ఉద్యోగంలో ప్రవేశించడంలో చేసిన తప్పేమీ లేదని కోర్టువారు తీర్పు చెప్పినారు. ఏ చట్టమైనా అమలు కాకుండా నిలుపుజేయటానికి రాజు కధికారముందని జడ్జీలు అభిప్రాయపడినారు. ఇక పరీక్షా శాసనమనేది ఒకటి లేనట్లే జేమ్స్ స్వేచ్ఛగా ప్రవర్తించినాడు. సేనలోను, సివిల్ పరిపాలనలోను, ప్రీవీ కౌన్సిల్‌లోను, ఆక్స్ ఫర్డ్ యూనివర్సిటీలోను, చివరకు ఇంగిష్ చర్చి ఉద్యోగాలలోను అనేకమంది కాథలిక్కులను జేమ్స్ నియమించినాడు. పూర్వం కాథలిక్‌లు రహస్యంగా కలుసుకొని పూజాదికాలను జరుపు కొంటూ ఉండే వారు. రాజు ఇచ్చిన ప్రోత్సాహాన్ని అలుసుగా తీసుకొని వారు బహిరంగంగా ప్రార్థనాదికాలు సాగించినారు. లండన్‌లోని సామాన్యులు గుంపులు గూడి రచ్చ చేయగా పట్టణ సమీపాన 16,000 మంది సైనికులను ఆయత్త పరిచినాడు.

ఇంగ్లండ్‌లో రెండో జేమ్స్ కాలంలో ఉన్న కాథలిక్‌లు చాలా అల్ప సంఖ్యాకులు. అందుచేత వారి సహాయంతో తాను నిరంకుశ ప్రభువు కావడానికి వీలుపడదు. అందువల్ల ఆంగ్లికన్‌లు కాని ఇతర ప్రొటెస్టెంట్ శాఖలను మంచి చేసుకొనడానికి 1687 లోను, 1688 లోను వారికి, కాథలిక్‌లకు సమానంగా లాభకారిగా ఉండేటట్లు అనుగ్రహ ప్రకటనలను జారీ చేసినాడు. వారి ఇష్టానుసారం ప్రార్థనాదికాలు చేసుకొంటే శిక్షలకు గురి చేసే చట్టాలను వారికి ఏ ఉద్యోగాలూ ఇవ్వరాదనే చట్టాలను ఆపుచేసినట్లు ఈ ప్రకటనలో అతడు చాటినాడు. ఈ చాటింపు కర్థం ఒక్కటే. రాజు విశృంఖల ప్రవర్తనాన్ని అడ్డుకోగల శాసనాలు లేవని, సర్వ శాసనాధికారం తనలో ఉందని, మత స్వాతంత్ర్య వాంఛ ఒక్కటే జేమ్స్ ప్రవర్తనకు కారణం కాదని, ప్రొటెస్టెంట్‌లలోని వివిధ శాఖలను పరస్పరం రెచ్చగొట్టడం అతని ఉద్దేశ

మనీ ప్రొటస్టెంట్ లనేకులు గ్రహించి అతని దయవల్ల మత సహనం పాటించడానికి నిరాక రించినారు. తన అనుగ్రహ ప్రకటనను రాజ్య మంతటా అన్ని చర్చీలలోను మత గురువులు ప్రార్థనా సమయంలో చదివి తీరవలెనని అతడు ఆజ్ఞాపించినాడు. కాంటర్ బరీ ఆర్చిబిషప్ శాన్‌క్రాఫ్ట్, మరి ఇతర బిషప్పులు ఆర్గురూ చట్ట విరుద్ధమైన ఆ ప్రకటనను చదవడానికి నిరాకరిస్తూ ఆ ఆజ్ఞను ఉపసంహరించండని రాజును ప్రార్థించినారు. వారి పిటిషన్ తనకు మానసష్టం కలిగించడమేగాక రాజ ద్రోహకరంగా ఉన్నదని జేమ్స్ వారిని కోర్టుకు ఈడ్పించి నాడు. జ్యూరీ ఆ మత గురువులు ఏడుగురూ నిర్దోషులని తీర్పు చెప్పినారు. ఆ తీర్పు విని ప్రజలలో ఉత్సాహం వెల్లవిరిసింది.

## రక్తపాత రహిత విప్లవము

ఆ సమయంలో జేమ్స్ పుత్ర జననవార్త ప్రజలలో వ్యాపించి ఈ కాథలిక్ రాజుల ......చి ఇంకా ఎన్ని తరాలకూ తమకు విముక్తి కలగదనే దిగులు వారికి కలిగింది. జేమ్స్ తరవాతనైనా ప్రొటస్టెంట్ మతంలో భక్తి శ్రద్ధలు గల అతని పెద్ద కూతురు మేరీ, ఆమె భర్త ఆరంజ్ వంశపు రాజకుమారుడు విలియమ్ తమకు పాలకులవుతారనే ఆశతో ప్రజలు జేమ్స్ అత్యాచారాలను ఇంతకాలం సహించి ఉన్నారు. ఇప్పుడా ఆశ అడియాస కాగానే ఇంగ్లండ్‌లోని ప్రధాన వ్యక్తులు టోరీలూ, విగ్గులూ కలిసి తమ మతాన్ని స్వాతంత్ర్యాన్ని రక్షించడానికి రమ్మని మేరీ విలియమ్‌లకు విన్నపం వ్రాసి పంపినారు. ఒక సేనను వెంట దీసుకొని టార్బే రేవులో దిగి వారు ఇంగ్లండ్‌లో అడుగు పెట్టినారు. తాను నమ్మిన మిత్రులు గాని, సైనికులుగాని, ఇంకెవ్వరుగాని జేమ్స్‌కు తోడ్పడలేదు. అందరూ తనను వదిలి పెట్టగా జేమ్స్ ఇంగ్లండ్ నుంచి పరారీ అయినాడు జేమ్స్ పారిపోతూ రాజముద్రికను థేమ్స్ నదిలో జారవిడిచినా అది జాలరికి చిక్కి యథాస్థానానికి చేరిందట. పారిపోతున్న జేమ్స్‌ను పట్టి తెచ్చి నారు కాని తప్పించుకొని పోవడానికి వీలు కల్పించగా అతడు ఫ్రాన్స్‌కు పోయినాడు. దేశాన్ని తనంత తానె వదిలిపోవడంవల్ల అతడు తన రాజపదవిని స్వేచ్ఛగా వదులుకొన్నాడని ప్రకటించి నాయకులు సమావేశపరచిన కన్వెన్షన్ పార్లమెంట్ ఖాళీ అయిన సింహాసనానికి మేరీ, విలియమ్‌లను ఆహ్వానించగా వా రంగీకరించి ఇంగ్లండ్‌కు పాలకులయినారు. దీనికి ముందు ప్రజల హక్కులను ప్రకటిస్తూ రెండో జేమ్స్ చేసిన ముఖ్యమైన శాసన విరుద్ధ చర్యలను పేర్కొని వాటివల్ల అతడు తమ భక్తి విశ్వాసాలకు దూరుడయినాడని కన్వెన్షన్ పార్లమెంట్ ప్రకటించింది. అటువంటి చర్యలను తాము చేయబోమని మేరీ విలియమ్‌లు వాగ్దానం చేస్తూ ప్రజల హక్కుల ప్రకటనను (Declaration of Rights) ఆమోదించి నారు. అప్పుడే కన్వెన్షన్ పార్లమెంట్‌ను మేరీ విలియమ్‌లు క్రమమైన పార్లమెంట్ 1689 జనవరిలో సమావేశమయింది. హక్కుల ప్రకటనలోని వాటికి మరికొన్ని హక్కులు చేర్చి హక్కుల శాసనం ప్రవేశ పెట్టగా అది పార్లమెంట్ ఆమోదం పొందింది. తరవాత రాజ పదవిని మేరీ, విలియమ్‌లకూ వారి అనంతరం సంతానానికి సంతానం లేకుంటే మేరీ రాణి సోదరి ఆనీ రాజకుమార్తెకూ ఆమె సంతతికి ఆమెకు సంతు లేకుంటే మేరీ గాక వేరే భార్యను విలియమ్ గ్రహిస్తే ఆమె సంతతికి దఖలుపరుస్తూ పార్లమెంట్ శాసనం చేసింది.

మొదటి జేమ్స్ నుంచి రెండో జేమ్స్ వరకు నలుగురు స్టూవర్ట్ వంశం రాజులు ఇంగ్లండ్‌ను పరిపాలించినారు. కాథలిక్ మతం మీద వారికున్న అత్యాదరము, ప్రొటస్టంట్ అతివాదులంటే వారికున్న భీతి ద్వేషాలూ వారి పాలిట ముఖ్య శాపాలై వర్తించినాయి. నిజమైన మత సహనము వారికి లేదు; వారి ప్రజలకూ లేదు. ఈ లోపమే వారికీ వారి ప్రజలకూ మధ్య దాటరాని అడ్డుగోడగా నిల్చి ఆ వంశ రాజులను పట్టి పల్లార్చినది. తమకు స్వయంగా తోచకున్నా తమ ముందు పాలించిన రాజుల అనుభవాలవల్లనైనా వారిలో ఒక్కడూ గుణపాఠం నేర్చుకొన్నవాడు లేడు. కాని స్టూవర్ట్ రాజుల గుణహీనతే పార్లమెంటరీ పరిపాలన పాలిటి పెన్నిధి అయింది. 1603 నుంచి 1688 వరకు పరిపాలనము అయిదు తరాల పాలకుల చేతులు మారింది. తత్ఫలితంగా అది బాగా నిగ్గుదేరి పరిమిత రాజరిక విధాన విజయానికి దారి తీసింది. ఇంగ్లీష్ స్వాతంత్ర్య యుద్ధ విజయాలను హక్కుల శాసనంలో సంగ్రహించినారు. అవి భావి ప్రజా విజయాలకు పునాదులైనాయి. అవి ఇంగ్లండ్ ఆధునాతన రాజ్యాంగ చరిత్రలో అంతర్భాగాలు

## హక్కుల శాసనము (Bill of Rights)

హక్కుల శాసనంలోని ప్రధానమైన నిబంధనలు కింది విధంగా ఉన్నాయి :

1. శాసన నిర్వహణాధికారం రాజుకే చెందిందని పార్లమెంట్ సమ్మతి లేకుండా తనకు ఇష్టమైనంత కాలం చట్టాలను అమలు జరపకుండా ఉండే అధికారముందని నటించడం శాసనవిరుద్ధము.

2. శాసనాలను అమలు జరిపే అధికారం రాజుదే కాబట్టి వ్యక్తుల విషయంలో చట్టాలు—ఇటీవల జరిగినట్లు—అమలు కాకుండా మినహాయించే అధికారం రాజుకున్నట్లు నటించటం చట్టాలకు విరుద్ధమైన పని.

3. చర్చి వ్యవహారాలకు సంబంధించిన వ్యాజ్యాలను విచారించడానికి ఇటీవల నెలకొల్పిన కమిషన్ కోర్టు, తదితర కోర్టులూ, కమిషన్‌లూ శాసన విరుద్ధాలు, అనర్థకాలు.

4. ప్రత్యేక అధికార మున్నదనే నెపంతో పార్లమెంట్ మంజూరుచేయని ద్రవ్యాలను రాజు స్వంత ఉపయోగానికి వసూలుజేయడం, పార్లమెంట్ అనుమతించని విధంగానో, ఒక వేళ అనుమతిస్తే గడువు దాటిన తరవాతనో వసూళ్ళు చేయడం చట్టాలకు విరుద్ధ కార్యాలే.

5. రాజుకు విన్నపం చేసుకొనే హక్కు ప్రజల కున్నది. విన్నపం చేసుకొన్నందుకు నిర్బంధించడం, నేరారోపణ చేసి విచారించటం శాసన విరుద్ధ చర్యలే.

6. పార్లమెంట్ సమ్మతి లేకుండా శాంతి సమయంలో సైన్యం సమీకరించడం, సిద్ధ సైన్య ముంచుకోవడం చట్టానికి వ్యతిరేకమైన చర్యలు.

7. ప్రజలలో ప్రొటస్టెంట్ లయిన వారు శాసనం విధించిన మేరకు తగిన విధంగా ఆయుధా లుంచుకోవచ్చు.

8. పార్లమెంట్‌కు సభ్యులను ఎన్నుకొనడంలో ప్రజలకు స్వేచ్ఛ ఉండవలె.

9. పార్లమెంట్‌లో సభ్యులకు వాక్స్వాతంత్ర్యము, చర్చా స్వాతంత్ర్యము ఉండవలె. పార్లమెంట్‌లో వారన్న మాటలకు వారిని పార్లమెంట్ వెలపల ప్రశ్నించడానికి, కోర్టులో నేరం మోపడానికి వీలులేదు.

10. మితిమీరి జామీను మొత్తాలను కోరరాదు. మితిమీరి జరిమానాలు విధించరాదు. అసాధారణ శిక్షలు విధించరాదు

11. జ్యూరర్‌లను ఎన్నుకోవడం, నియమించడం క్రమ పద్ధతిలో జరగవలె. దేశ ద్రోహ, రాజ ద్రోహ నేరాలకు విచారణలు జరిపేటప్పుడు నియమితులయిన జ్యూరర్లు సొంత భూములున్నవారు (freeholders) గా ఉండవలె.

12. ఒక వ్యక్తిని న్యాయస్థానంలో దోషి అని నిరూపించి శిక్ష విధించడానికి ముందే విధించబోయే శిక్షలు, జరిమానాలు, ఆస్తి జప్తులు రాజు క్షమించడం న్యాయశాస్త్ర విరుద్ధము అది చెల్లనే చెల్లదు.

13. ప్రజల ఇబ్బందులు తొలగించడానికి, వారికి జరిగిన అన్యాయాలకు పరిహార మివ్వడానికి, చట్టాలలో అవసరమైన సవరణలు చేయడానికి, వాటిని బలపరచడానికి, వాటి భద్రతను కాపాడటానికి పార్లమెంట్‌ను అనేకసార్లు సమావేశపరుస్తూ ఉండవలె. ఇవి ఇంగ్లీషు ప్రజల హక్కులని, వాటిని రాజు మన్నించవలెనని హక్కుల చట్టం చాటింది. ఇట్లా ప్రజా పరిపాలన స్థాపించడానికి కొన్ని శతాబ్దాలుగా—ముఖ్యంగా 17 వ శతాబ్దిలో—రాజులతో పార్లమెంట్ చేసిన పోరాటంలో పార్లమెంట్ విజయం సాధించింది. దాని ఆధిపత్యాన్ని రాజు అంగీకరించక తప్పలేదు.

## హక్కుల శాసనం ప్రాముఖ్యము

జాన్ రాజు అనుమతించిన మహాపత్రం (The Great Charter) తోను, మొదటి ఎడ్వర్డ్ చేసిన ఛార్టర్ల ధ్రువీకరణ (Confirmation of the Charter) తోను, మొదటి ఛార్లెస్ ఆమోదించిన హక్కుల పిటిషన్‌తోను సమాన స్థానాన్ని ఈ హక్కుల శాసనానికి కొందరు పండితు లిస్తున్నారు. వాటికి లేని ప్రత్యేక ప్రాముఖ్యం దీనికి ఉన్నదని మరి కొందరి అభిప్రాయము. ఇంతకాలమూ రాజపదవి వంశపారంపర్యంగా సంక్రమించేది. రెండో జేమ్స్‌కు కుమారుడున్నా అతనిని కాదని జేమ్స్ రెండో కుమార్తెకు రాజ్యం దఖలు పరచడంతో తనకు ఇష్టం వచ్చిన వారికి సింహాసనం దత్తం చేసే అధికారం తనకు ఉన్నదని పార్లమెంట్ నిరూపించినట్లయింది. మేరీ, విలియమ్, ఆనీలలో ఎవ్వరూ తమ రాజపదవి దైవ దత్తమని అనలేరుగదా? వారి అనంతరం ఇంగ్లండ్ రాజులైన హెనోవేరియన్‌లకు రాజ్యం దైవదత్తంగా సిద్ధించిందని, పార్లమెంట్ అనుగ్రహంవల్ల రాలేదని ఎవ్వరూ కలలోకూడా అనుకోలేరు. పార్లమెంట్ చేయగా రాజులైన వారిపట్ల టోరీలకు భక్తి విశ్వాసాలు లోపించగా తాము దయచూపగా రాజులైన వారిపట్ల విగ్గులకు కూడా ప్రత్యేక గౌరవం లేకపోయింది. 17 వ శతాబ్దంలో రాజు సర్వాధిపత్యానికి అంకుశంగా ఉన్న పార్లమెంట్ 18 వ శతాబ్దంలో దేశాన్ని పరిపాలించటంలో తానే సర్వాధికారి అయినది.

హక్కుల శాసనము పార్లమెంటరీ ఆధిపత్యాన్ని నెలకొల్పినా అందులో పరిమిత రాజరిక సిద్ధాంతాన్ని, దాని స్వభావాన్ని గురించిన చర్చలు మనకు కనబడవు. దేశంలో అటువంటి చర్చలు ముమ్మరంగా జరుగుతున్న రోజులవి. పై చట్టం శాసనమైన కొన్ని నెలలకే జాన్ లాక్ రచించిన పరిపాలనను గురించిన రెండు వ్యాసాలు (Two Treatises on Government) అచ్చు అయినాయి. 1658 లోనే హాబ్స్ రచించిన 'లెవియేథన్' వెలువడింది. అందువల్ల 1776 అమెరికన్ రాజ్యాంగం పీఠికలోను, 1789 ఫ్రెంచి విప్లవా

నంతరం తయారైన ఫ్రాన్స్ రాజ్యాంగం పీఠికలోను మనకు కనపడే రాజకీయ సిద్ధాంతాల వంటివి ("మానవులంతా సమానులుగాను, స్వతంత్రులుగాను జన్మమెత్తినారు") హక్కుల శాసనం పీఠికలో చోటు చేసుకొన్నా ఆశ్చర్యం కలగదు. కాని ఈ శాసనం చేయడంలో నాయకత్వం వహించినవారు అటువంటి చర్చలు చేయకుండా ఒక నూరేండ్లుగా ఇంగ్లండ్ రాజులవల్ల పార్లమెంటరీ ప్రజారాజ్యానికి కలిగిన కడగండ్లను ప్రస్తావించి, వాటిని తొలగించ డానికి తాము తీసుకొన్న చర్యలను, చేసిన ఏర్పాట్లు మాత్రమే ఆ చట్టంలో లిఖించినారు. "మా హక్కులివి - వాటికి భంగం కలిగించటం అక్రమము - అటువంటివి ఇకమీద జరగ రాదు" అని మాత్రమే హక్కుల శాసనంలో పొందుపరిచినారు.

హక్కుల శాసనము ఒక లిఖిత రాజ్యాంగ శాసనం కాదు అది కొత్తగా ఒక ప్రభు త్వాన్ని ఏర్పాటు చేయలేదు. దానిలోని ఏ నిబంధనైనా ఇతర శాసనాల వలెనే పార్లమెంట్ ఒక చట్టం చేసి రద్దు చేయవచ్చు.

కాని ఇంగ్లండ్ రాజ్యాంగంలో లిఖిత లక్షణా లేవైనా ఉన్నాయా అని చూస్తే అవి మహాపత్రము (Magna Carta), ఛార్టర్ల ధ్రువీకరణ (Confirmation of the Charters), హక్కుల పిటిషన్ (Petition of Rights) లతో బాటు హక్కుల శాసనం (Bill of Rights) లో ఉన్నాయని ప్రస్తావించక తప్పదు.

"రాజైనా రాజ్యం మూల సూత్రాలను అతిక్రమించరాదు. అతడు కూడా దేశ శాస నాలకు బద్ధుడు కావలసిన వాడే. వాటికి అతీతుడుగాడు. వాటిని మీరితే దేశద్రోహ, రాజ ద్రోహ నేరాలకు గురికాక రాజైనా తప్పించుకోలేడు" అని హక్కుల శాసనం తెగవేసి చెబు తున్నది. ఈ శాసనమైన తరవాత ఏ రాజూ ప్రజా సార్వభౌమత్వాన్ని, పార్లమెంటరీ ఆధి పత్యాన్ని, శాసనాధికారాన్ని ప్రశ్నించలేదు; తరవాతి రాజకీయ పరిణామం ఈ చట్టంలో ఇమిడి ఉన్న మూల సూత్రాలను పరిపాలనలో సంపూర్ణంగా ఆచరణలో పెట్టడానికి సంబం ధించిందే

హక్కుల శాసనము ఏ రాజకీయ విప్లవంవల్ల లభించిందో, ఆ విప్లవం ఒక్క నెత్తురు బొట్టు నేల చిందకుండా విజయం పొందింది. ఇంత అహింసాయుతమైన రాజకీయ విప్లవం చరిత్రలోనే చాల అరుదైనది. ప్రజాభిప్రాయం మారిన మాత్రాన ఇంత పరిపూర్ణ విప్లవం సంభవించి, ఇంతగా సఫలం కావడంవల్ల దీనిని "రక్తపాత రహిత విప్లవము" (Bloodless Revolutation), "మహోన్నత విప్లవము" (The Glorious Revolutation) అని కీర్తించినారు. విప్లవనాయకులు దానిని ఎవ్వరూ విప్లవమనరాదని, అది చట్టబద్ధమయిన దని, చాలా సహజంగా కల్గినదని, న్యాయసమ్మతమని, సక్రమమైనదని ప్రజలు దానిని గురించి అనుకొనవలెనని ప్రయత్నించినారు. "నా రాజపదవికి నేను రాజీనామా ఇవ్వలేదు" అని రెండో జేమ్స్ మొత్తుకొంటున్నా మేరీ విలియమ్‌లను సింహాసన మెక్కించిన పార్లమెంట్ ఏ పదిమందో కలిసి చట్ట విరుద్ధంగా సమావేశపరిచిందే ఐనా రెండో జేమ్స్ రాజీనామా చేసి నందువల్ల సింహాసనం ఖాళీ అయిందని, ఆ ఖాళీలో జేమ్స్ కూతురు మేరీని, ఆమె భర్తను రాణిగా రాజుగా చేసినామని వాదించడమే గాక రాజుచేత తాను సక్రమమైన పార్లమెంటేనని ప్రకటింపజేసింది. ఇంగ్లండ్ ప్రజానాయకులు ఈ విప్లవం విప్లవమే కాదనే ధోరణిని ప్రదర్శించినారు. అందుచేత 1688 విప్లవాన్ని అద్భుతమైన అసాధారణమైన విప్లవమనడం న్యాయమే.

# 8
# మేరీ, మూడో విలియమ్‌లు

(క్రీ. శ. (1689–1702)

మేరీ, విలియమ్‌ల రాజ్య కాలంలో బ్రిటిష్ రాజ్యాంగ చరిత్రలో నూతన శకం ఆరంభమయింది. రాజయినవాడు 'నేను నిరంకుశ ప్రభువును' అని చెప్పుకొనే కాలం ఇంకా రాలేదు, రాబోదు. సాధికారమైన పార్లమెంట్ లేని రాచరికము, ప్రజాభీష్టంతో సంబంధంలేని రాజ్యపాలన లేవు. లాక్ వ్రాసిన "పరిపాలన గురించిన గ్రంథాలు" రెండూ నూతన రాజరిక సిద్ధాంతాన్ని స్పష్టీకరించినాయి. ప్రజలు రాజాజ్ఞలను శిరసావహించవలసింది ప్రజల క్షేమాన్ని అతడు మన్నించే వరకే. లేకపోతే ఆ రాజును పదవినుంచి దించి తమకు మేలు చేసే ఇంకొక రాజును ఎన్నుకొనే అధికారం ప్రజలకుంది అని పరస్పరం చేసుకొన్న ఒడంబడిక (Contract) లో ముఖ్య సూత్రమని లాక్ వ్రాసినాడు. ఈ ఒడంబడికను కార్యరంగంలో ప్రవేశపెట్టడమే ముందు రాబోయే అయిదు తరాల కాలంలోను జరిగిన పని. ప్రజల క్షేమాన్ని కాపాడటానికి పార్లమెంట్‌కు అధికారం ఉందని రెండు పక్షాలవారూ అంగీకరించినా దైనందిన పరిపాలనలో ప్రజల ఇష్టానిష్టాలను తెలుసుకోవటానికి సమర్థమైన రాజ్యాంగ సంస్థ ఒకటి అవసరమయింది. ఆ అవసరాన్ని తీర్చగలిగేది పార్లమెంట్ కాదు. మూడు నాలుగు వందల మంది సభ్యులు రెండు శాసన సభలలో కలిసి ప్రభుత్వ విధానాలను విమర్శించి నిర్ణయించగలరేమో కాని, సాకల్యంగా పరిపాలనా కార్యక్రమాన్ని నిత్యమూ నిర్వహించలేరు. ఆ పనికి సమర్థమయినది కాబినెట్ (Cabinet) అనే పేరుతో ఉన్న మంత్రివర్గ సంస్థ. కొద్దిమంది మంత్రులు రాజ్యాన్ని పాలించడం చరిత్రలో కొత్త విషయం కాదు. ఇంగ్లండ్ ప్రజారాజ్యం పరిణామంచెందటం ప్రారంభమయిన తరవాత, పార్లమెంటరీ పరిపాలనాధిపత్యం నిర్వివాదంగా స్థాపితమయిన తరవాత పార్లమెంట్ ప్రజలకు ప్రతినిధి అయినట్లే ఆ పార్లమెంట్‌కు తాను నిజమైన ప్రతినిధి అయి అది నిర్ణయించిన మార్గాలలో పరిపాలన సాగిస్తూ, ఏనాడు తనపై పార్లమెంట్ విశ్వాసరాహిత్యం ప్రకటిస్తుందో ఆనాడే పదవి నుంచి తొలగిపోయే మంత్రివర్గ మిప్పుడు అవసరమయింది. అటువంటి మంత్రివర్గం 1688 సంవత్సరం తరవాత పరిపాలించిన రాజుల కాలంలో క్రమంగా పరిణామం చెందింది. ఈ పరిణామ క్రమంలో ఒక్కొక్క ప్రభుత్వశాఖ అంచెలంచెలుగా రాజు చేతుల నుంచి బాధ్యతాయుత మంత్రివర్గం చేతులలోకి ఎట్లా మారిందో వచ్చే ప్రకరణాలలో చూద్దాము.

క్లారెండన్ మంత్రిపదవి నుంచి పడిపోయిన తరవాత రాజునూ పార్లమెంట్‌నూ ఒక తాటిపై నడిచేటట్లు చేయటమెట్లా సాధ్యమవుతుందోనని సర్ విలియమ్ టెంపిల్ ఆలోచించి ఒక పథకము అవలంబించినాడు. రాజు ప్రీవీ కౌన్సిల్‌లో అతని మిత్రులు ప్రతిపక్షులూ ఏ పక్షానికి చెందినవారూ చేసిన వాదోపవాదాలలో నిగ్గుదేలిన విధానాన్ని ప్రభుత్వమనుసరిస్తే రాజుకు, పార్లమెంట్‌కు ఐకమత్యం సాధించవచ్చునని ఊహించినారు. ప్రీవీ కౌన్సిల్‌లో

చేరినవారు ముందు పార్లమెంట్ సభ్యులుగా ఉన్నవారయితే వారి మాటలకు ఉభయత్రా (రాజు దగ్గర పార్లమెంట్‌లోను) విలువ ఉంటుందని టెంపిల్ ఆశపడినాడు కాని అతని విధానము విజయవంతం కాలేదు.

సర్ విలియమ్ టెంపిల్ ఊహించినట్లు కాక తద్భిన్నంగా కామన్స్ సభకు బాధ్యత వహించిన మంత్రివర్గ పరిపాలనా విధానం 1688 సంవత్సర మహా విప్లవానంతరం ఇంగ్లండ్‌లో క్రమ పరిణామం పొందింది. కామన్స్ సభలోని అన్ని పక్షాల నుంచీ ఎన్నిక చేసిన మంత్రులవల్ల కాక దానిలో ఏ పక్షానికి అధిక సంఖ్యాబలము (Majority Strength) ఉందో ఆ పక్షం నుంచి మంత్రివర్గ మేర్పడి దేశాన్ని పరిపాలించడమే ఆ కాలంలో పరిణామం చెందిన విధానము. ఆ మంత్రివర్గం తమ పార్టీ ఇష్టానుసారం ప్రభుత్వం సాగించవలసి ఉండటంవల్ల ఆ రెండింటి మధ్యా సంఘర్షణ లుండవు కాబట్టి పరిపాలక వర్గానికి పదవి, శాసన సభకు ఐకమత్యం సిద్ధిస్తాయి అంతేగాక రాజు పదవి నామ మాత్రమే అవుతుంది. పరిపాలన మీ విధంగా రూపు దిద్దుకొంటున్న కాలంలో కొత్త ప్రభుత్వ విధాన మొకటి తలయెత్తుతుందని సమకాలికులెవ్వరూ ఊహించలేకపోయినారు. ఈ విధానం అన్ని లక్షణాలతో సమగ్ర స్వరూపం పొందటం మొదటి హనోవరియన్ రాజు కాలంలోనే జరిగినా విలియమ్, అనీల రోజులలో సూర్యోదయానికి ముందు తప్పటడుగులు వేసినట్లు కామన్స్ సభలూ మంత్రి వర్గాలూ దారి దొరకక కొంత కాలం తడువుకొంటున్నట్లు వ్యవహారాలు సాగించినాయి.

తాము సింహాసన మెక్కినప్పుడు పూర్వపు రాజులకువలె ఇకముందు తమకు ఏ అధికారాలూ ఉండబోవని మేరీ విలియమ్‌లకు తెలియకపోలేదు. రాజయినవాడు శాసనానికి విధేయుడై ఉండవలెనని, చట్టాలను వ్యక్తిగత విషయాలకు అన్వయించకుండా ఉండటానికి గాని కొంత కాలం అమలు పరచకుండా ఉండటానికిగాని అతని కధికారం లేదనీ, తన ప్రకటన ద్వారా కొత్త నేరాలను సృష్టించలేడని, పార్లమెంట్ సమ్మతిలేకుండా శాంతి సమయాలలో సైన్యాల నుంచుకోవటానికి అతని కధికారం లేదని విలియమ్‌కు చక్కగా తెలుసు. ప్రభుత్వాదాయాన్ని ఎట్లా వ్యయం చేయవలెనో నిర్ణయించేది పార్లమెంటేనని, సైనిక సేవ చేయటానికి భూమి ననుభవించే విధానము ఇక మీద ఉండదని, సైనిక శాసనం ప్రకారం వ్యక్తులను విచారించే అధికారం తనకు లేదని, పర్వేయన్స్ ప్రియెంప్షన్ హక్కులు లేవని, న్యాయాధిపతులను తొలిగించలేనని, స్టార్ ఛేంబర్, హైకమిషన్‌ల వంటి ప్రత్యేక న్యాయ స్థానాలు అంతరించినాయని, పార్లమెంట్ అంగీకారం లేనిదే తన ప్రకటన ద్వారా శాసనాలు చేయలేనని, పన్నులను, సుంకాలను విధించలేననీ, కిరీటం దైవదత్తమనే బూకరింపు ఇక చెల్లదని, విచారణ లేకుండా వ్యక్తులను కారాగారాలలో బంధించలేనని, పార్లమెంట్ ఆగ్రహిస్తే మంత్రుల ప్రాణాలు దక్కవని, చర్యలవల్ల నష్టం కలిగించి వ్యక్తులకు తానే నష్ట పరిహార మిచ్చుకోవలసి ఉంటుందని, మంత్రులను కాపాడలేనని విలియమ్‌కు చక్కగా తెలుసు. కాని ఇన్ని విధాలుగా రాచరికం దుర్బలమైనందువల్ల విలియమ్‌కు ఇంకా అధికారాలే మిగలలేదని అనుకోవటం చాలా పొరపాటు అధికార శూన్యుడైన ఈనాటి బ్రిటిష్ రాజుకూ అతనికీ సామ్యమే లేదు.

సామాన్యంగా పరిపాలనా విధానాన్ని, ప్రభుత్వ కార్యక్రమాన్ని నిర్ణయించి నడిపించేది రాజు విలియమే గాని పార్లమెంట్ కాదు. అప్పటికింకా కార్యనిర్వాహక వర్గం తాన చేసే ప్రతి పనీ పార్లమెంట్ ఇష్టపడుతుందో లేదో ఆలోచించి చేయవలసిన గతి పట్టలేదు. అంతరంగిక వ్యవహారాలలో గూడా పార్లమెంట్‌ను రాజు ముందుగా సలహా అడిగే పద్ధతి ఆచరణలోకి రాలేదు. ఇంకా విదేశ వ్యవహారాలలో రాజు చాలా స్వతంత్రంగా వ్యవహరించేవాడు. స్టూవర్ట్ రాజులవలె యూరప్‌లోని కాథలిక్ రాజ్యాలలో చేతులు కలపక వాటిని ప్రతిఘటించటం విలియమ్ తన జీవితాశయంగా పెట్టుకొన్నందువల్ల అతనికి ఇంగ్లండ్ ప్రజలతోను, పార్లమెంట్‌తోను మనస్సు కలిసి వచ్చి, జర్మన్ రాజ్యాలతోబాటు ఫ్రాన్స్‌తో యుద్ధం చేయటానికి పార్లమెంట్ వల్ల అడ్డంకి ఏర్పడలేదు. నిరంతరం యుద్ధాలలో మునిగి తేలే దేశంలో అంతరంగిక పరిపాలనము యుద్ధావసరాలకు లోబడగా విలియమ్‌కు పరిపాలనలో ఎంతో స్వతంత్రాధికారం లభించింది. పార్లమెంట్‌లోని విగ్ టోరీ పార్టీల నుంచి సమానంగా ప్రముఖులను మంత్రులుగా నియమిస్తే తనకు రెండు పక్షాల తోడ్పాటూ లభిస్తుందని విలియమ్ ఆలోచించినాడు.

అంతేగాని ఆ మంత్రులు అతని అంతరంగిక, వైదేశిక రాజనీతిని నిర్ణయించలేదు. అన్నింటిలో కడపటి నిర్ణయము అతనిదే. అయినా అతడు సమకాలికుడైన ఫ్రెంచి రాజు పద్నాలుగో లూయీవలె నిరంకుశ ప్రభువు కాదు. ఆతనిని రాజుగా చేసిన కన్వెన్షన్ పార్లమెంట్‌లో విగ్గులే అధిక సంఖ్యాకులు. కాని ఒక్క పార్టీకిచెందిన రాజుగా ఉండటం విలియమ్‌కు నచ్చలేదు. తన కౌన్సిల్ సభ్యులందరినీ అన్ని విషయాలలోనూ అతడు సంప్రదించేవాడు కాడు. ఒక్కొక్కప్పుడు మంత్రులు కానివారి సలహా పొందటం కూడా జరిగింది. 1690 లో జరిగిన పార్లమెంట్ ఎన్నికలలో టోరీలు అధిక సంఖ్యలో నెగ్గినారు. అందుచేత మంత్రివర్గంలో టోరీల సంఖ్య కొంత హెచ్చు కావడం, విగ్గుల సంఖ్య కొంత తగ్గడం సంభవించింది. అంతేగాని ఏకపక్ష మంత్రివర్గమంటే అసహ్యాభావం నశించలేదు. దీనికి తార్కాణం తాను ఐర్లెండుకు పోతూ రెండు పక్షాలకూ ఇంచుమించు సమాన ప్రాతినిధ్యం ఉండే ప్రత్యేక కౌన్సిల్‌ను రాణికి సహాయపడటానికి విలియమ్ ఏర్పాటు చేయటమే.

1693 లో సందర్లాండ్ ప్రభువు మెజారిటీ పార్టీకి చెందిన మంత్రిమండలిని ఏర్పాటు చేయండని రాజుకు సూచన చేసినాడు. ఆయన అట్లా చేసి ఉంటే సంపూర్ణంగా విగ్ మంత్రివర్గం ఏర్పడి ఉండేది. రాజు ఆ సూచనను క్రమంగా ఆచరణలో పెట్టినాడు. 1699 నాటికి ఈ సంవిధానం సంపూర్ణమయింది. 1695 ఎన్నికలలో పార్లమెంట్ మెజారిటీ విగ్‌లకు లభించింది. కాని 1698 ఎన్నికలలో టోరీలకు మెజారిటీ స్థానాలు వచ్చినా విగ్ మంత్రులు రాజీనామా చేయలేదు. దీని కర్థము ఇంకా కాబినెట్ మంత్రివర్గాన్ని గురించి రాజకీయ నాయకులలో నిశ్చితాభిప్రాయం ఏర్పడలేదని అది అట్లా ఉండగా 1696 నాటి పూర్తి విగ్ పార్టీ మంత్రివర్గాన్ని జంటా (Junta) అని హేళనగా పిలిచినారు. అంటే అది దుష్టులకు కూటమి అని అనేకులు భావించినారు. 1698 లో టోరీ మెజారిటీ ఉన్న పార్లమెంట్ రాజు ఇష్టానికి వ్యతిరేకంగా సైనికుల సంఖ్యను, యుద్ధ వ్యయాన్ని తగ్గించింది. తత్ఫలితంగా ఫ్రెంచి వారిది పైచేయి కావటం, ఇంగ్లిష్ సేనలు ఓడటం సంభవించింది. ఫ్రెంచి రాజు చూపిన అతిశయమూ అహంకారమూ టోరీలను యుద్ధానికి సుముఖులను చేసింది. కాని తిరిగి ఫ్రాన్స్‌తో యుద్ధం

మొదలయ్యేనాటికి విలియన్ స్వర్గస్థుడయినాడు. ఏకపక్ష మంత్రివర్గం వైపు ఇంగ్లండ్ అడుగులు వేస్తున్నా దాని విలువను విలియమ్ బతికి ఉండగా బ్రిటిష్ రాజకీయ పక్షాలు గుర్తించలేదు. గుర్తించలేదనటం 1701 లో పార్లమెంట్ ఆమోదించిన "(వారసత్వ) స్థిరీకరణ శాసనం" లోని ఒక అంశాన్నిబట్టి తెలుస్తున్నది. అది "ప్రభుత్వం నుంచి పింఛన్ తీసుకొనే వ్యక్తిగాని, వేతనంగాని ఇతరాదాయంగాని లభిస్తున్న ఉద్యోగమో, పదవో ఉన్న వ్యక్తిగాని కామన్స్ సభలో సభ్యుడయి ఉండరాదు" అనే నిబంధన.

## ప్రధాన రాజకీయ శాసనాలు

1. ప్రభుత్వాదాయ వినిమయము (Appropriation of Supplies): పూర్వం రాజు ప్రభుత్వానికి సర్వాధికారి కాబట్టి తన సొంత ఆదాయాన్నీ పార్లమెంట్ మంజూరు జేసిన ద్రవ్యాన్నీ తన ఇష్టం వచ్చిన విధంగా వ్యయం చేస్తుండేవాడు. రాజు మంత్రులు కోరిన మొత్తాలను పార్లమెంట్ ఇవ్వడమో తిరస్కరించడమో తగ్గించి ఇవ్వడమో తన ఇష్టం ప్రకారం చేసేది. అంతేగాని మంజూరుచేసిన ధనాన్ని ఫలానా విధంగా, ఫలానా పనులకు వెచ్చించమని పార్లమెంట్ నిర్ణయించేది కాదు. నిర్బంధించేది గాదు. అట్లా ఒకవేళ చేసి ఉన్నా అది సకృత్తుగా రాజును, రాజ మంత్రులను నమ్మని సందర్భాలలో మాత్రం చేసి ఉండేది. కాని 1688 పార్లమెంట్ తాను మంజూరుజేసిన ఆదాయంలో ఏ యే ప్రభుత్వ శాఖలకు ఎంతెంత ఖర్చు పెట్టవలెనో నిర్ణయించే పద్ధతిని మొదలు పెట్టింది పన్నెండు లక్షల పౌనుల ధనాన్ని రాజు కిచ్చి ఆ మొత్తంలో సగం సైనిక వ్యయానికని, మిగిలిన సగం పౌర పరిపాలనకని నిశ్చయించింది. కాలం గడిచే కొద్దీ ఈ పద్ధతి ఇంతటితో ఆగక పౌర పరిపాలన శాఖలలో ఏ పని నిమిత్తం ఎంతెంత వ్యయపరచవలెనో, ఏ యే పనులకు ఏ యే శాఖల మీద ఎంతెంత సైనిక వ్యయం చేయవలెనో నిర్ణయించటం వరకూ వచ్చింది ఇది ఇప్పుడున్న స్థితి. అంతటితో పోక (ప్రభుత్వ శాఖల పరిపాలనలో) తాను నిర్ణయించిన హద్దులకు లోబడి ఆదాయ వ్యయాలు ప్రభుత్వం చేసినారో లేదో తెలుసుకోవటానికి లెక్కల తనిఖీ (audit) పద్ధతిని కూడా కాలక్రమంలో పార్లమెంట్ ప్రవేశపెట్టింది.

ఈ 1688 పార్లమెంట్ పూర్వపు రాజులకు మంజూరుచేసినట్లు ఎగుమతి దిగుమతి (రేవు) సుంకాలను విలియమ్ జీవిత పర్యంతమీయక నాలుగేర్ల కాలానికే ఇచ్చింది. ఇంతలో ఫ్రాన్స్‌తో యుద్ధం ఆరంభం కావడంతో ప్రజలపై అధికంగా పన్నుల భారాన్ని మోపింది. అదీ చాలక జాతీయ ఋణ (National debt) సేకరణకు ఉపక్రమించింది. అంతేగాక బాంక్ ఆఫ్ ఇంగ్లాండ్ (Bank of England) ను స్థాపించింది. బాంక్‌తో లావా దేవీలున్నవారూ, ఆ ఋణానికి ద్రవ్య మిచ్చేవారూ ప్రభుత్వానికి వచ్చే ఒడుదుడుకులలో తమ ధనం వృథా అవుతుందేమో అనే భయంతో దానికి అండగా ఉండటమనే ఇంకొక లాభం ప్రాప్తించింది. ఈ విధంగా పరిపాలనకు ఇంగ్లండ్ ప్రభుత్వం పార్లమెంట్ దయాధర్మాలపై సంపూర్ణంగా ఆధారపడవలసి వచ్చింది. విలియం పరిపాలన కాలంలోనే రాజకుటుంబ వ్యయ (Civil list) పద్ధతిని ఆరంభించినారు. అంటే రాజు, రాణి, రాజకుటుంబం వారు, జీవ యాత్ర గడపడానికి సంవత్సరానికి ఇంత ధనమని పార్లమెంట్ నిర్దేశించే పద్ధతి. దీనివల్ల రాజ కుటుంబం వారు పార్లమెంట్ దయాధర్మాలపై ఇంకా ఆధారపడవలసి వచ్చింది.

2. విప్లవ శాసనము (The mutiny act) : శాంతి సమయంలో స్థావర సైన్యాన్ని రాజు ఉంచుకోరాదని హక్కుల చట్టం స్పష్టంగా చెప్పింది. ఆ స్థావర సైన్యమే మొదటి ఛార్లెస్ వధకు కారణమయింది. అందువల్ల టోరీలకు సైన్యమంటే గిట్టదు. ఆ సైన్యాన్ని చూపి తన ప్రతిపక్షులను, ప్రొటస్టెంట్‌లను లొంగదీయ జూసిన రెండో జేమ్సును మరచిపోని ప్రొటిస్టంట్ స్థావర సైన్యాన్ని ఏవగించుకొన్నారు. కాని ఫ్రాన్స్‌తో ఇప్పుడు యుద్ధం వచ్చి పడింది. ఫ్రాన్స్‌కు ఇతర ఐరోపా రాజ్యాలన్నింటికంటె శ్రేష్ఠమైన సిద్ధ సైన్య మున్నది. దానిని పౌర సైన్యంతో (Militia) ఎదిరించగలగడం అసాధ్యము. జేమ్స్ తయారుచేసిన సిద్ధ సైన్యాన్ని రద్దు చేసే ఆలోచన విరమించుకొని ఆ సైనికుల క్రమశిక్షణార్థం సైనిక శాసన సైనిక న్యాయస్థాన కల్పనను పార్లమెంట్ తలపెట్టింది. మొదట సైనిక శాసనాన్ని అమలు పెట్టింది. దానికి కారణం ఇప్స్ విచ్‌లో ఒక స్కాచ్ పటాలం చేసిన తిరుగుబాటు. ఆరేసి నెలలకో ఒక సంవత్సర కాలానికో పరిమితం చేసి ఈ సైనిక విప్లవ శాసనాన్ని ఆమోదించే విధానం ఇంగ్లాండ్‌లో స్థిరపడింది. 1881 లో ఈ విప్లవ శాసనానికి బదులు సైనిక క్రమశిక్షణ నియమన శాసనం (Army Dicipline and Regulation Act) తరవాత ఏటేటా పార్లమెంట్ పునరుద్ధరిస్తూ వచ్చింది. అట్లా పునరుద్ధరించకుంటే ఒక్క దినమైనా సైన్యాన్ని ప్రభుత్వం నిలుపుకొనలేదు. ఈ శాసనం మూలంగా పార్లమెంట్‌కు సైన్యాలపై, ప్రభుత్వంపై పెత్తనం లభించింది.

*మత సహన శాసనము—1689* (*The Toleration Act*), ఆంగ్లికన్ చర్చ్‌కి చెందని ప్రొటస్టెంట్‌లు రెండో జేమ్స్ ప్రకటించిన మత క్షమా ప్రకటనను ఆమోదించలేదు. అతనిని రాజ్యం నుంచి పారదోలటంలో సహాయం చేసినారు. అందుచేత వారికి ఏదైనా మంచే చేయవలెనని 1688 విప్లవం కాగానే ప్రయత్నాలు జరిగినా మత పక్షాలన్నీ కలిసి రాలేదు. ఒక్క మత సహన శాసనాన్ని ఆ ప్రయత్నాల ఫలితంగా ఆమోదించడమయింది. దానివల్ల కాథలిక్‌లకు, యూనిటేరియన్‌లకు తప్ప మిగిలిన ప్రొటిస్టంట్ శాఖ లన్నింటికీ మత నిర్బంధ శాసనాల నుంచి విముక్తి కలిగి మత స్వాతంత్ర్యం లభించింది. (యూనిటేరియన్‌లు— దేవు డొక్కడేనని, అతడుగాక పవిత్రాత్మ (Holy Ghost) అనీ ఏసు క్రీస్తు అనీ వేరే దేవతలు లేరని తలిచే వారు. వీరిని ఏకేశ్వరోపాసకు లనవచ్చు. ఏసు క్రీస్తు దేవుడని పూజించే క్రైస్తవు లకు యూనిటేరియన్‌లు నాస్తికులుగా తోచటం వింతగాదు. కాథలిక్‌లు, యూనిటేరియన్‌లు కలిసి ప్రజలలో శతాంశము ఉండరు కాబట్టి చాలా మందికి ఈ మత సహన శాసనం లభించింది కొందరు చరిత్రకారుల దృష్టిలో మత విషయాలలో ఈ మత సహన శాసనానికి రాజకీయాలలో హక్కుల శాసనానికి ఉన్న స్థానమే ఉన్నది. ఇంగ్లండ్ ప్రొటస్టెంట్ మతం స్వీకరించకముందు ప్రజలందరూ కాథలిక్ మతం వారే. ప్రజలంతా ఒక్క మతానికి చెందిన వారనే సిద్ధాంతాన్ని కాథలిక్‌ల నుంచి ప్రొటస్టెంట్ శాఖలవారి వరకూ గ్రహించినారు. ఇప్పుడు మతసహన శాసనము ఈ విషయంలో ఒక విప్లవాన్ని తెచ్చినట్లయింది. దేశ ప్రజలలో అధిక సంఖ్యాకులవలెనే అల్ప సంఖ్యాకులైన ఇతర మతశాఖల వారు తమ ఇష్టం వచ్చిన విధంగా భగవంతుని ఆరాధించవచ్చునని అంగీకరించటం ఒక గొప్ప విషయము. కాని ఈ సహనాన్ని క్యాథలిక్‌లకు, యూనిటేరియన్‌లకు చూపేటంత హృదయ విశాలత వారి కింకా పట్టుబడలేదు. ఇతర ప్రొటస్టెంట్‌లకు సహనం చూపించినారనే గాని సమానత్వ మివ్వ

డానికి వారు సిద్ధం కాలేదు. వారికి (ప్యూరిటన్‌లకు, ప్రెస్బిటేరియన్‌లకు) ఇంకా ఉద్యోగాలలో, విశ్వవిద్యాలయాలలో ప్రవేశార్హత కలగటానికి ఇంకొక 140 ఏళ్ళు పట్టింది. 1689 నాటి శాసనాలవల్ల మత సహన సిద్ధాంతాన్ని మొదటి సారిగా పార్లమెంట్ అంగీకరించడమే వాటి ప్రాముఖ్యము.

ముద్రణ స్వాతంత్ర్యము (1698): అభిప్రాయ ప్రకటనకు స్వేచ్ఛ లేనిదే, ప్రజా రాజ్యం కుంటుపడుతుందనే మాటను ఈ నాడు సామాన్యంగా గుర్తించడం జరుగుతున్నది. కాథలిక్ మతము మత విషయాలలో అభిప్రాయ ప్రకటనకు స్వేచ్ఛ నివ్వటానికి బద్ధ శత్రువై ఉండేది. స్టూవర్ట్ రాజులలో జేమ్స్ I, ఛార్లెస్ I ముద్రణాలయాలను బహు నిర్బంధాలకు గురి చేసినారు. దీర్ఘకాలిక పార్లమెంట్ కూడా ముద్రణ స్వాతంత్ర్యానికి వ్యతిరేకంగా ఉండేది పునరుద్ధరణ తరవాత ముద్రణలను అధికార పర్యవేక్షణకు లోబరుస్తూ లైసెన్సింగ్ చట్టాన్ని చేయడమయింది. కాలపరిమితి తీరినప్పుడెల్ల దానిని తిరిగి పార్లమెంట్ మరి కొంతకాలం పొడిగిస్తూ 1679 వరకు గడిపింది. తరవాత ఆరేళ్ళవరకు ఈ చట్టం అమలు కాలేదు. రెండో జేమ్స్ రాజైన తరవాత 1685 లో ఏడేళ్ళ కాలం అమలులో ఉండేటట్లు ఈ లైసెన్సింగ్ చట్టాన్ని పార్లమెంట్ తిరిగి చేసింది. 1692 లో ఒక్క ఏడు ఆ చట్టానికి పార్లమెంట్ ప్రాణం పోసింది 1698 లో ఆ గడువు తీరిన తరవాత మళ్ళా పార్లమెంట్ ఆ చట్టం చేయలేదు. తమ వ్రాతలకు ముద్రణాలయాధికారులు, పత్రికా ప్రచురణ కర్తలు భావి కాలంలో బాధ్యులు అవుతారు తనను విమర్శించే వారిపై మాననష్టం చేసినారనే నెపంతో ప్రభుత్వం చర్య తీసుకొనే అవకాశం అప్పుడూ ఎప్పుడూ ఉండేదే. ఏది ఎట్లయినా పత్రికలకు కరపత్రాలకు, మత సాంఘిక రాజకీయ ప్రచురణలకు చక్కగా స్వేచ్ఛ కుదిరింది. 18 వ శతాబ్దారంభం నుంచి ప్రసిద్ధిపొందిన రచయితలంతా రాజకీయాలపై వ్రాతలు వ్రాసిన వారే పత్రికలు ఆరంభంలో వార్తలను మాత్రమే ప్రకటించేవి. తరవాతి కాలంలో అవి వార్తలను, ప్రజా సమస్యలన్నింటిని వ్యాఖ్యానించటం అధికమయింది. ప్రజ లీ విధంగా పబ్లిక్ వ్యవహారాలపై విశేష శ్రద్ధ వహించటంవల్ల ఇంగ్లండ్ ప్రజారాజ్యమనే మాట పోను పోను మరింత అర్థవంతమయింది.

త్రైవార్షిక శాసనము (Triennial Act): 1641 లో చేసిన త్రైవార్షిక శాసనాన్ని అనుసరించి పార్లమెంట్ రెండు సమావేశాలకూ మధ్య మూడేళ్ళకు మించిన వ్యవధానం ఉండరాదని శాసించడమైంది. మ్యూటినీ చట్టం ఆమోదించిన తరవాత ఆరు నెలలకు కాకున్నా సంవత్సరానికైనా పార్లమెంట్ విధిగా సమావేశం కావలసి వచ్చింది. కాని ఒకసారి ఎన్నికలు జరిగిన తరవాత ఏళ్ళుపూళ్ళు ఒక పార్లమెంటే తిష్ఠ వేసుకొని కూర్చుండే ప్రమాదం 1641 చట్టంవల్ల తీరలేదు. రెండో ఛార్లెస్ కాలంలో 18 ఏళ్ళు ఎన్నికలు లేకుండా ఒకే పార్లమెంట్ పరిపాలించటం సంభవించిందనే మాటను ఎవ్వరూ మరిచిపోలేదు. ఏళ్ళకొద్దీ ఒకసారి ఎన్నిక అయిన పార్లమెంట్ మార్పులేక వ్యవహరించటానికి వీలుంటే ఆ సభ్యులు తాము ప్రజలకు బాధ్యులమనేమాట మరవటానికీ, రాజుల నిరంకుశత్వం స్థానంలో పార్లమెంటరీ నిరంకుశత్వం నెలకొనటానికి వీలుంది. ఇది ఆలోచించి ఏ పార్లమెంట్ అయినా, జనరల్ ఎన్నికలకు తరవాత తాను మొదటిసారి సమావేశమైన నాటి నుంచి మూడేళ్లకు మించి కొనసాగరాదని 1694 త్రైవార్షిక చట్టం శాసించింది.

*దేశ (రాజ) ద్రోహుల విచారణ విధానంలో సంస్కరణ:* ఇంగ్లండ్‌లో అమలులో ఉన్న క్రిమినల్ చట్టం ప్రకారం మోపిన నేరమేమో ప్రతివాదికి విచారణకు ముందు తెలిపే వారు కాదు. ప్రతివాది న్యాయవాదిని పెట్టుకోనిచ్చేవారు గాదు ప్రతివాది సాక్షుల సాక్ష్యాలు ప్రమాణపూర్వకాలు కావు కాబట్టి వాటికి విలువ లేదు. సమర్థులైన న్యాయవాదులు ప్రభుత్వ పక్షాన నియమితులయ్యేవారు. న్యాయాధిపతులు రాజు ఆగ్రహానుగ్రహాలను గురించి భయపడే వారు. ఆంరో ఎడ్వర్డ్ శాసన మొకటి గుడ్డిలో మెల్లగా నేర నిరూపణకు ఇద్దరు సాక్షులైనా ఉండి తీరవలెనన్నది తప్పు ఒప్పుకొనేటట్లు చేయడానికి ప్రతివాదిని నానా హింసలకు గురి చేసేవారు. 1695 లో విచారణకు పూర్వం ప్రతివాదికి జ్యూరర్ల లిస్టునూ ప్రతివాదిపై మోపిన నేరం ప్రతినీ ఇవ్వవలెనని శాసించింది. తన పక్షంలో వాదించటానికి న్యాయవాదిని ఏర్పరుచుకోపచ్చుననీ ప్రమాణం చేసిన తరవాతే అతని సాక్షులను విచారించవలెననీ ఈ శాసనం చెప్పింది. అంతేగాక రాజహత్యా ప్రయత్నం చేసినందుకుగాక మరే నేరానికైనా అది జరిగి మూడేళ్ళు దాటితే నేర విచారణ తలపెట్టరాదని కూడా ఈ చట్టం నిర్ణయించింది.

*వారసత్వ నిరూపణ శాసనము (1701):* 1. మేరీ రాణికి ఆనీ రాణికి సంతానం కలిగినా ఎవరూ జీవించలేదు ఆనీ రాణి తరవాత హానోవర్ ఎలక్ట్రెస్ సోఫియాకు, ఆమె సంతతి వారికి వారు ప్రొటెస్టెంట్ లైతేనే బ్రిటిష్ సింహాసనం చెందవలెనని ఈ చట్టం నిర్ణయించింది. మొదటి జేమ్సుకు ఈ సోఫియా మనుమరాలు. హానోవరియన్ రాజులు ఎన్నిమార్లో ఇంగ్లీష్ జాతి ఒప్పుదలవల్లనే తాము ఇంగ్లండ్ రాజులమైనామని, తమకు అంతకుమించిన హక్కు లేదని ప్రకటించినారు. రాజ్య సంక్రమణ గురించి ఈ ఏర్పాటొక్కటేకాక ఈ శాసనంలో రాజ్యాంగ చరిత్ర దృష్ట్యా ప్రాముఖ్యమున్న అనుబంధ శాసనాలున్నాయి.

2. కాథలిక్ మతాభిమానులైన ఛార్లెస్-I, ఛార్లెస్-II, జేమ్స్-II ల వల్ల రాజ్యానికి ఎట్లాంటి అవాంతరాలు, ఎన్ని అవాంఛనీయ పరిస్థితులు దాపురించినాయో గమనించి ఇక ముందు అట్లాంటిఅవస్థలు కలగకుండటానికి బ్రిటిష్ రాజ్యానికి పాలకుడు ఇంగ్లీష్‌చర్చికి చెందిన వారై ఉండవలెనని పార్లమెంట్ శాసించింది. దీని ప్రాధాన్యం తెలియవలెనంటే 1715 లోను, 1745 లోను రెండో జేమ్సుకు వరసగా కుమారుడూ మనమడూ అయిన మూడో జేమ్స్, మూడో ఛార్లెస్‌లు ఇంగ్లండ్‌కు రాజులు కావడానికి ప్రయత్నించి విఫలులైనారని కాథలిక్ లైనందువల్ల వారసత్వాన్ని బట్టి వారికి మొదటి జార్జి, రెండో జార్జిల కంటె సింహాసనానికి హక్కు ఎక్కువగా ఉన్నా రాజ్యం సంక్రమించలేదని ఈ పని చేసింది టోరీ మంత్రివర్గమని, అందువల్ల రాజ్యము దైవదత్తమనే సిద్ధాంతానికి టోరీలే తిలోదకాలు విడిచినారని జ్ఞప్తికి తెచ్చుకోవలె

3. పూర్వం ప్రీవీ కౌన్సిల్ నిర్వహిస్తున్న పనులు ఇకముందు కూడా అదే నిర్వహించవలెనని, దాని నిర్ణయాలను ఆమోదించినందుకు గుర్తుగా ఆ తీర్మానాల కింద తమ చేవ్రాళ్లను ఉటంకించవలెనని నిబంధించినారు. ట్యూడర్‌ల కాలంలో పరిపాలనము సంపూర్ణంగా ప్రీవీ కౌన్సిలే నిర్వహించేది. స్టూవర్టుల కాలంలో అది ఆ కౌన్సిల్‌లోని ముఖ్యమంత్రుల నిర్ణయంపై ఆధారపడి జరుగుతూ ఉండేది. 1688 విప్లవానంతరం ఇదే పద్ధతిలో పరిపాలనం సాగినది. ఇది పార్లమెంట్‌కు అనుమాన కారణమైనది. ఈ విధంగా నలుగు రయిదుగురితో గూడుపుఠాణి చేసి రాజు లెక్కడ నిరంకుశులవుతారో అనే భయం వారికి కలిగింది. కాని

వారు కోరిన ప్రయోజనం మాత్రం సిద్ధించలేదు. ప్రీవీ కౌన్సిల్ సభ్యత్వము గౌరవ ప్రదమైన పదవేగాని, ఆ హోదా వచ్చిన వారందరికీ పరిపాలన చేయవలెననే కోరికగాని చేయగల సామర్థ్యంగాని లేవు. పైగా ప్రీవీ కౌన్సిల్ సభ్యుల సంఖ్య పెరిగిపోయిన కొద్దీ అందరూ సమావేశమై సంప్రదించటం అసాధ్యమైనది. ఆ ప్రీవీ కౌన్సిల్‌లో విగ్‌లూ, టోరీలూ - రెండు పక్షాల వారూ ఉండటంవల్ల వారందరినీ చేర్చి సంప్రదించినా కలిగేది వాగ్వివాదమేగాని విధాన నిర్ణయం కాదు. ఈ నిబంధన ఆనీ రాణి అయిన కొత్తలోనే రద్దు అయింది. పార్లమెంట్ ఇష్టానుసారంగా బాధ్యతతో మంత్రివర్గం పరిపాలించటం కాబినెట్ విధానము పరిణామ మొందినప్పుడే క్రమంగా సాధ్యమయింది.

4. కామన్స్ సభలోనుంచి ప్రభుత్వోద్యోగాలలో ఉన్న వారిని, ఇతర ఆదాయాలు, పింఛన్‌లు పొందే వారిని తొలగిస్తూ చట్టం చేయడమయింది. అట్లాంటి వారిని లోగట్టుకొని రాజు పార్లమెంట్‌ను తనకు బానిసను చేసుకోకుండా ఉండవలెననటం దీని ఉద్దేశము. పరిపాలన సాగుతున్న విధానాన్ని శ్రద్ధగా గమనిస్తూ అందులోని లోపాలను బహిర్గతం చేసి మంత్రివర్గాన్ని సరిగా నడిపించే ప్రజాభిప్రాయం ఇంకా ఏర్పడలేదు. పార్లమెంట్ చర్చలను, కామన్స్ సభ్యుల చర్యలను పత్రికలలో ప్రకటించనందువల్ల, ఎన్నిక పర్గాలు ధనికుల జమీన్‌దారుల పిడికిళ్ళలో ఒదిగి ఉన్నందువల్ల, ప్రతినిధులకు స్వతంత్రంగా వ్యవహరించే శక్తి లేనందువల్ల లంచాలను, పదవులను, బిరుదులను, పింఛన్‌లను, ఇతర ఆదాయ మార్గాలను, ఉద్యోగాలను సభ్యులకో వారి బంధువులకో కట్టిపెట్టి పార్లమెంట్ సభ్యులను మంత్రివర్గం తన చెప్పు చేతులలో ఉంచుకొనేది ఈ పరిస్థితిని మార్చి కొత్త నియమాన్ని అమలు జరిపితే పార్లమెంట్‌కు కలిగే లాభాలకంటె నష్టమే అధికము. అధిక పక్ష మంత్రివర్గ పరిపాలన ఇంకా దృఢపడలేదు. కామన్స్‌లోని చర్చలు చాలా ఉద్రిక్తంగా మంత్రులకు విసుగు పుట్టించేవిగా ఉండటంవల్ల ఈ పీడ తప్పించుకొనటానికి వారు సభ్యులను లోగొట్టుకొన జూసేవారు ఈ నిబంధనవల్ల ఇంకొక ఇబ్బంది కలిగింది. మంత్రులకు పార్లమెంట్‌లో జరిగే విమర్శలు తెలియటానికిగాని, కామన్స్ సభ్యులు ప్రీవీ కౌన్సిల్ సభ్యులను ముఖాముఖీ విమర్శించటానికిగాని వీలు లేకుండా పోయింది. అందుచేత కొన్ని ఏళ్లకు తరవాత ఈ నిబంధనను రద్దు చేయవలసి వచ్చింది. కాని 1705 అక్టోబరు 5 వ తేదీ తరవాత సృష్టించిన ఉద్యోగాలలో ఉన్నవారు, ప్రభుత్వం నుంచి పెన్షన్ పుచ్చుకొనేవారు కామన్స్ సభ్యత్వానికి అర్హులు కారని శాసించడమయింది. సభ్యుడైనవాడు ప్రభుత్వ ఉద్యోగాన్ని స్వీకరిస్తే తన కామన్స్ సభ్యత్వానికి రాజీనామా ఇచ్చి ఇష్టం వచ్చినట్లు తిరిగి పోటీచేసి ఎన్నిక కావచ్చు. ఈ నియమం ఈ నాటికీ అమలులో ఉంది:

5. ఒక్కసారి నియమించిన తరవాత న్యాయాధిపతులు జీవిత పర్యంతం పదవిలో ఉంటారని శాసించడమయింది. కాని నీతి తప్పి ప్రవర్తించిన న్యాయాధిపతిని పార్లమెంట్ రెండు సభలూ కలిసి రాజుకు నివేదిస్తే ఉద్యోగం నుంచి తొలిగిస్తారు. ఇకమీద స్టూవర్ట్ రాజులు ప్రవర్తించినట్లు న్యాయాధి పతులను అదరించి బెదరించి తమ బుద్ధికి వ్యతిరేకంగా తీర్పు లిమ్మని ప్రభుత్వం బలవంతపెట్టలేదు. ప్రజా స్వాతంత్ర్యాన్ని మంత్రివర్గానికి తావేదారులైన న్యాయాధీశులెట్లా నిర్మూలిస్తారో స్టూవర్ట్ కాలపు న్యాయస్థానాల చరిత్ర తెలిసిన

వారికి తేట తెల్లము. ఈ శాసనానంతరం బ్రిటిష్ న్యాయమూ, న్యాయాధీశులూ నిష్పక్షపాత బుద్ధికి, నిర్భయత్వానికి జగత్ప్రసిద్ధులయినారు.

6. రాజు క్షమించినాడన్న కారణంతో, ఇంపీచ్‌మెంట్ నుంచి తప్పించుకోలేరని ఈ వారసత్వ నిరూపణ శాసనంలో ఇంకొకమారు ధ్రువపరచడమయింది మంత్రులను ఇంపీచ్ చేయవలెననే యోచన విలియమ్ కాలంలో చాలాసార్లు జరిగినా 1701 సంవత్సరాంతం వరకు పార్లమెంట్ అందుకు పూనుకోలేదు. 1701 లో జరిగిన ప్రయత్నమూ సాగలేదు. ఫ్రాన్స్‌తో యుద్ధంలో ఓడిపోయినందువల్ల మంత్రులను ఆ ఓటమికి బాధ్యులను చేసి శిక్షించవలెనని ఈ ఇంపీచ్‌మెంట్ ప్రయత్నించింది. స్టూవర్ట్ రాజుల కాలంలో ఆ రాజులకు మాత్రమే బాధ్యత వహించిన మంత్రులను ఇంపీచ్ చేసినారంటే అర్థముందిగాని, రాజూ మంత్రులూ కూడా పార్లమెంట్ అధికారానికి, ఆధిపత్యానికి లోబడి ఉన్నప్పుడు మంత్రులను శిక్షించదలచడంలో న్యాయం లేదు. యుద్ధానికి చాలినంత ధనం మంజూరుచేయక, ఓటమికి కారకులైన కామన్స్ సభ్యులు ఓటమి బాధ్యతను మంత్రుల తలలకు చుట్టడం హాస్యాస్పదమయింది. ఈ ఇంపీచ్‌మెంట్ ప్రయత్నాన్ని విలియమ్ సాగనివ్వలేదు.

7. మూడో విలియమ్ వీటో పద్ధతిని నాలుగుసార్లు అవలంబించినాడు. అవలంబించి పార్లమెంట్‌కు ఆగ్రహం తెప్పించినాడు. ఆనీ రాణి దానిని ఒక్కమారు ప్రయోగించింది. ఇంపీచ్‌మెంట్ రాజుపై పార్లమెంట్ ప్రయోగించే ఆయుధము. వీటో పార్లమెంట్‌పై రాజు ఉపయోగించే ఆయుధము. కార్యవర్గానికి, శాసన సభకు కుమ్ములాట లున్నప్పుడు ఈ ఆయుధాలకు అర్థముండేది. భావి కాలంలో పోరాటం పార్లమెంట్‌లోని రాజకీయ పక్షాల మధ్యనే. మంత్రివర్గం ఏ పక్షానికి లభ్యం కావలె? ఏ పార్టీకి పార్లమెంట్‌లో సంఖ్యాబల ముంది? ఏ పార్టీ నుంచి మంత్రివర్గాన్ని ఏర్పరిస్తే కార్యవర్గానికి దాని కార్యక్రమాలకూ అంతరాయం లేక సుస్థిరత్వ ముంటుంది? ఈ ప్రశ్నలను గురించిన వివాదంలో ఈనాటి మెజారిటీ పార్టీ రేపటి మైనారిటీ పార్టీ కావడానికి వీలున్నప్పుడు కార్యవర్గంలోని మంత్రులపై ఇంపీచ్‌మెంట్ నడిపించటంగాని పార్లమెంట్‌లోని మెజారిటీ తీర్మానాన్ని ఆ పార్టీకే చెందిన కార్యవర్గము వీటో చేయించటంగాని సమంజసంగా కనబడదు. ఇంకా రాజు పోను పోను నామ మాత్రపు రాజవుతుండగా ఈ రెండు ఆయుధాలూ నిష్ప్రయోజకాలై మూల బడక తప్పదు.

కాని ఈ సత్యం ఆ కాలంలో రాజకీయవేత్తలకు స్ఫురించలేదు. ఆనీ రాణి వీటో హక్కును ఉపయోగించుకొన్నది ఒక్కమారే. ఆమె తరవాత ఆ అధికారాన్ని ఉపయోగించిన పాలకులు లేరు. పార్లమెంట్‌లోని మెజారిటీ పార్టీ వారి విధానమేదైనా ప్రజలలో అధిక సంఖ్యాకుల అభిప్రాయానికి విరుద్ధంగా ఉందన్న అనుమానం వచ్చినప్పుడు రాజు వీటోను ఉపయోగించి పార్లమెంట్‌కు సాధారణ ఎన్నిక తెచ్చి పెట్టవచ్చునా అనేది చర్చనీయాంశమే.

## దేశ పరిపాలనలో రాజు స్థానము (1689–1702)

క్రీ. శ. 1200 లో రాజే రాజ్యము, పరిపాలకుడు, శాసనకర్త, న్యాయాధీశుడు, సైన్యాధ్యక్షుడు - సర్వమూ అతడే. మత సంస్కరణోద్యమానికి (Reformation) తరవాత మతానికి గురుపీఠము అతనిదే. జాన్ కాలంలో రాజుకూ ప్రజలకూ అధిపత్య విషయంలో ప్రారంభమయిన పోరాటం ఎన్ని దశలలో గడిచి రెండో జేమ్సును ఇంగ్లండ్ నుంచి వెళ్ల

గొట్టడంతో అంతమయింది. పార్లమెంట్‌కు రాజు లోబడవలసిన వాడేనని మూడో విలియమ్ చక్కగా గుర్తించిన వాడే. ఇంగ్లండ్ గణరాజ్యమైనదన్న విషయాన్ని గురించి సందేహ మెవ్వరికీ ఇక లేదు. కాని రాజున్న గణరాజ్య (a crowned republic) మిది. ప్రజా ప్రతినిధి అయిన పార్లమెంట్ రాజుకు లోబడి పాలించవలసినదే. పార్లమెంట్ వ్యక్తపరచే ప్రజాభిప్రాయాన్ని అతడు మన్నించవలె. రాజ వైభవం, అతని బిరుదావళి, ప్రత్యేక రాజాధికారాలు అన్నీ ఆయనకున్నట్లే చర్చికి, రాజ్యానికి అతడే అధిపతి. అత్యున్నత న్యాయాధికారి, సర్వ సైన్యాధక్షుడు అతడే. కాని ఇన్ని హోదాలు, అధికారాలు పార్లమెంట్ గీసిన గిరిలో పార్లమెంట్ విశ్వాసానికి పాత్రులైన మంత్రుల ద్వారా నిర్వహించవలసిన వాడు మాత్రమే. ఈ విషయాలు ఇంత స్పష్టంగా మూడో విలియమ్ కాలంలో అనేకులకు అర్థం కాలేదు. దానికి కారణం కొంత విలియమ్ వ్యక్తిత్వము. నామ మాత్రం రాజుగా ఉండటం అతని నైజానికి విరుద్ధము. అతడు పరిపాలించినంత కాలం దేశం యుద్ధాలలో తగుల్కొని ఉన్నందువల్ల, విదేశ వ్యవహారాలకు అతడే స్వయంగా మంత్రి అయినందువల్ల, యుద్ధ రంగంలో స్వయంగా సేనలను నేర్పుతో నడిపిన సైన్యాధ్యక్షుడూ అతడే అయినందు వల్ల, పార్లమెంట్ సభ్యులూ ప్రజలూ అతని ఇష్టాన్ని మన్నించవలసి వచ్చింది. ఆనీ రాణి పరిపాలనలోగాని ఇంగ్లీష్ రాజరికమెంతగా శాసన సభాధీనమయిందో తేటతెల్లం కాలేదు.

# 9
# ఆనీ రాణి (1702–14)

మూడో విలియమ్ కాలంలో రాజు కౌన్సిల్ వ్యవహారాలు కౌన్సిల్ సభ్యు లందరి సమావేశంలో జరుగవలెననీ, దానిని ఆమోదించినవారు తాము ఆమోదించినట్లు సంతకాలు చేయవలెననీ, కామన్స్ సభకు మంత్రులు, ప్రభుత్వోద్యోగులు, పెన్షన్‌వారులు సభ్యులుగా ఎన్నిక కావడానికి అనర్హులనే చట్టమయిందనీ, ఆనీ రాణి కాగానే పై రెండింటిలో మొదటి నిబంధన రద్దయిందనీ చదివినారు. రెండేళ్ళ తరవాత (1705 అక్టోబర్ తరవాత) సృష్టించ బడిన ఉద్యోగంలో ఉన్న వ్యక్తి అయినా కామన్స్ సభ్యుడు కారాదని, ఎవరైనా కామన్స్ సభ్యుడుగా ఉండే వెంటనే ఆ సభ్యత్వానికి రాజీనామా ఇచ్చి తిరిగి పోటీ చేసి ఎన్నిక కావలె నని శాసించడమయింది. కొత్తగా ఏర్పాటయ్యే మంత్రి పదవులకు నియమితులయ్యేవారు ఈ రెండో తరగతికి చెందుతారని ఆ పదవులను సృష్టించే చట్టంలోనే ఒక నిబంధన ఉన్నది.

*మతసహనము:* ఆంగ్లికన్‌లు కాని ఇతర ప్రొటెస్టెంటుల సాయంతో సంపాదించు కొన్న స్వాతంత్ర్యాలను అనుభవించటానికి ఆనీ కాలపు టోరీల అభ్యంతరం లేకున్నా ఆ ఇతర ప్రొటస్టెంట్‌లను అణిచివేయటానికి తీవ్ర ప్రయత్నాలు చేయకపోలేదు. అయినా విలియం చేసిన మత సహన శాసనంవల్ల యూనిటేరియన్‌లు, రోమన్ కాథలిక్‌లు మినహా మిగతా ప్రొటస్టెంట్‌లకు చాలావరకు మతస్వేచ్ఛ లభించింది. ఈ శాసన ప్రకారం ప్రొట స్టెంట్ రాజు చర్చికి అధిపతి అని అంగీకరించి రాజభక్తి ప్రతిజ్ఞచేసి తీర్థ ప్రసాదాలు రక్త మాంసాలుగా మారుతాయనే సిద్ధాంతాన్ని నిరాకరిస్తే చర్చికి హాజరుగాక ప్రత్యేక పూజా సమావేశాలను జరుపుకొనవచ్చును. అందుకని వారిని శిక్షించరు. 39 సిద్ధాంతాలలో 8 సిద్ధాం తాలను ఆమోదిస్తే వారి మత గురువులు బహిరంగంగా ప్రార్థనలు, మతోపన్యాసాలు, తీర్థ ప్రసాదాలు ఇవ్వవచ్చు. ఆనీ కాలంలో టోరీలు ఆంగ్లికన్‌లుగాని ప్రొటెస్టంట్ల (Non-Con-for mists) పై ఒక దెబ్బ తీయవలెనని మాటిమాటికి ప్రయత్నించినారు. నాన్‌కన్‌ఫర్ మిస్ట్‌లు పరీక్షా శాసనం విధించినట్లు తీర్థ ప్రసాదాలు ఒకసారి స్వీకరించి, ఉద్యోగాలలో చేరిన తరవాత యథాపూర్వకంగా తమ మత జీవితాలు గడుపుకోసాగినారు. ఇది లోకవంచన గాను దైవం పట్ల అపరాధంగాను టోరీలు భావించినారు. ఈ ప్రవర్తనను శిక్షార్హం చేస్తూ ఒక చిత్తు చట్టాన్ని టోరీలు కామన్స్‌లో ప్రవేశపెట్టినారు. కామన్స్ ఆమోదించి పంపగా ప్రభు సభ తోసివేసింది. ప్రభు సభలో మెజారిటీ విగ్గులది. కాని 1711 లో టోరీ మంత్రి వర్గము ఫ్రాన్స్‌తో సంధి చేసుకొంటుందేమో అనే భయం కలిగి కొన్ని టోరీ వోట్లను యుద్ధానికి అనుకూలంగా సంపాదించటానికి కామన్స్ వారు "మధ్యే మధ్యే తీర్థ ప్రసాదాల గ్రహింపు"ను నిషేధిస్తూ చేసిన చట్టాన్ని ప్రభు సభవారామోదించి శాసనం చేసినారు.

1714లో టోరీ మంత్రివర్గము ఇంగ్లీష్ చర్చిలో చీలికలను నిషేధించే స్కిజం శాసనాన్ని (The Schism Act) ప్రవేశపెట్టి పార్లమెంట్‌చేత ఆమోదింపజేసింది. ఇది

పైన చెప్పిన చట్టంకంటే అన్యాయమైనది. దీని ప్రకారం నాన్‌కన్‌ఫార్‌మిస్‌లు ట్యూటర్లుగాను, బడి పంతుళ్ళుగాను పనిచేయరాదు. ఈ రెండు చట్టాలూ చేసిన తరవాత ఒక వైపు పరీక్షా శాసన మల్లే నిలిచి ఉండగా ఇక మిగిలిన మత సహనము ఏ పాటిది? ఏకేశ్వరాధకులకు (Unitarians), కాథలిక్‌లకు ఎట్లాంటి మత సహనాన్ని మత పరీక్షా శాసనం (Test Act) చూపలేదు గదా. ఈ చట్టాల ఫలితంగా మత సహన శాసనము నిరర్థకమయి ఉండేదే కాని 1718 లో ఇవి రెండూ రద్దయినాయి. త్వరలోనే ఆంగ్లికన్ మతం నుంచి వేరు పడిన వారు (Dissenters) సంవత్సర సంవత్సరమూ చేసే క్షమాపణ చట్టాల (Indemnity Acts) వల్ల శిక్షల నుంచి తప్పించుకొనడమే గాక ఉద్యోగులుగా ఉండటానికి కూడా వీలు కలిగింది. మతసహన శాసనము ఐర్లండ్‌కు అన్వయింప జేయలేదు. కనక స్కాటిష్ ప్రెస్బిటీరియన్లే గాక ఐరిష్ కాథలిక్‌లు కూడా 1688 కు తరవాతి 80 ఏళ్ళలో అధిక సంఖ్యలో స్వదేశాన్ని వదలిపోయి అమెరికాలో కాలనీలను స్థాపించే ఉద్యమంలో పాల్గొన్నారు.

*ఇంగ్లండ్ - స్కాట్లండ్‌ల పార్లమెంటరీ ఐక్యము:* 1603 లో స్కాట్లండ్ రాజు ఆరో జేమ్స్ ఇంగ్లండ్‌కు మొదటి జేమ్స్‌గా రాజయినాడు. రెండు దేశాలకు ఈ విధంగా రాజు ఒకడయినాడు. కాని రెండూ రెండు ప్రత్యేక స్వతంత్ర రాజ్యాలుగానే నిల్చిపోయినాయి. శాసన, పరిపాలన, న్యాయపాలన పరిధులలో రెండూ వేరు వేరు రాజ్యాలే. మత విషయంలోనూ రెంటికీ పొత్తు కుదరలేదు. 1707 లో ఇంగ్లీష్ పార్లమెంట్ స్కాటిష్ పార్లమెంట్‌తో సంప్రదించకుండా స్కాటిష్ ప్రజల ఇష్టాన్ని తెలుసుకొనకుండా స్కాటిష్ ప్రభువులకు ఇంగ్లీష్ పార్లమెంట్ ప్రభువుల సభలోను, స్కాట్లండ్‌లోని సామాన్య ప్రజలకు ఇంగ్లీష్ కామన్స్ సభలోను ప్రాతినిధ్యమిస్తూ స్కాచ్ పార్లమెంట్‌ను రద్దుచేసి రెండు దేశాలకూ పార్లమెంటరీ ఐక్యాన్ని సాధించింది. స్కాటిష్ ప్రజలపైనా, పార్లమెంట్‌పైనా ఇంగ్లీష్ పార్లమెంట్‌కు సార్వభౌమాధికారం ఎప్పుడు ఎవ్వరిచ్చినారు? ఇది ప్రజా పరిపాలనా తంత్రానికి విరుద్ధ చర్యగా కనబడటం లేదా? అనే ప్రశ్న తప్పక ఉదయిస్తుంది. దీనికి ఒక విధంగా సమాధానం చెప్పవచ్చు. స్కాట్లండ్‌తో జరిగిన యుద్ధాలలో ఒకటికి రెండు పర్యాయాలు ఇంగ్లండ్ ఆ దేశాన్ని జయించింది. క్రామ్‌వెల్ స్కాచ్ నాయకులతో ఇంగ్లీష్ చర్చిని ప్రెస్బిటీరియన్ చర్చిగా మార్చటానికి అంగీకరించినాడు. కాని మొదటి ఛార్లెస్‌ను దేశద్రోహ నేరంపై చంపినప్పుడు స్కాట్లండ్ యుద్ధానికి దిగి క్రామ్‌వెల్ చేతిలో ఓడిపోయింది. అయితే విప్లవ సంఘాలు చేసే పనిని విప్లవానంతరం సమావేశమైన పూర్వపు పార్లమెంట్‌లు ఆమోదించి ఉండవలె ఆ విధంగా జరిగినట్లు కనబడదు. 1660 లో మొదటి ఛార్లెస్ కుమారుని రాజు చేసినప్పుడు, తరవాత 1688 లో రెండో జేమ్స్ స్థానంలో విలియమ్ మేరీలను, ఆనీని ఇంగ్లండ్ రాజుగా రాణులుగా ఇంగ్లీష్ పార్లమెంట్ ఎన్నుకొన్నప్పుడు స్కాట్లండ్‌కున్న సొంత పార్లమెంట్‌లు ఆ యా చర్యలను ప్రత్యేకంగా ఆమోదించనట్లు లేదు. చెప్పదలచింది ఏమంటే 1603 తరవాత నూరేళ్లకాలం ఇంగ్లండ్ స్కాట్లండ్‌లు న్యాయ శాస్త్ర రీత్యా ఒకే రాజు పాలన కింది రెండు స్వతంత్ర రాజ్యాలయినా రాజకీయ వ్యవహారాలలో సమైక్య రాజ్యంగానే వ్యవహరిస్తూ ఉండేవి. 1707 నాటి ఐక్య శాసనంవల్ల పై రాజకీయ వ్యావహారిక ఐక్యానికి, పార్లమెంటరీ న్యాయశాసన ఐక్యాలు తోడైనవి. ఈ ఫలితానికి దారితీసిన వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

(i) మొదటి జేమ్స్ రెండు దేశాల పార్లమెంటరీ ఐక్యాన్ని సాధించవలెనని ఎంతో ప్రయత్నించినా ఇంగ్లీష్ పార్లమెంట్ ఆ విషయంలో ఎట్లాంటి శ్రద్ధా చూపలేదు. (ii) రంప్ పార్లమెంట్‌ను రద్దుచేసిన క్రాంవెల్ ఏర్పరిచిన బేర్‌బోన్ పార్లమెంట్‌లోని 144 గురు సభ్యులలో ఐర్లండ్‌కు ఆరుగురిని స్కాట్‌లాండ్‌కు ఐదుమంది సభ్యులను ఇచ్చి ఆయన మూడు దేశాలకు ఐక్యాన్నేర్పరచినాడు. క్రామ్‌వెల్ ఆ ఐక్యాన్ని స్కాట్లండ్‌పై రుద్ది ఆ దేశ ప్రజలు ఎదిరించకుండా అక్కడ తన సైన్యాన్ని ఉంచినాడు. (iii) 1660 లో ఇంగ్లాండ్ స్కాట్లండ్‌ల ప్రత్యేక పార్లమెంట్‌లను పునరుద్ధరించడమయింది. (iv) రెండు దేశాలూ ఒక్క రాజ్యంగా ఉన్నప్పుడు ఇంగ్లీష్ వారితోబాటు స్కాటిష్‌వారు అనుభవిస్తున్న వాణిజ్య స్వాతంత్ర్యానికి హాని కలగలేదు. 1670 లో స్కాటిష్ పార్లమెంట్ పక్షాన రెండు దేశాల ఐక్యం కోరి ఇంగ్లీష్ పార్లమెంట్‌తో రాయబారం నడపడానికి రెండో ఛార్లెస్ కమిషనర్లను ఏర్పాటు చేసినాడు. కాని బ్రిటిష్ పార్లమెంట్ కలిసిరాలేదు. 1688 లో మూడో విలియమ్ రెండో ఛార్లెస్ చేసినటువంటి ప్రయత్నమే చేసినాడు. కాని అతని ప్రయత్నం అదే విధంగా విఫలమయింది. అతని పరిపాలనాంతంలో స్కాట్లండ్ వర్తకుల సంఘం ఒకటి డేరియన్ భూసంధిలో వలస ఏర్పాటు చేయబోగా స్పానిష్ సైనికులు వారిని పారదోలినారు. ఈ అనర్థాలకు ఇంగ్లీష్ ప్రజల పార్లమెంట్‌ల ఓర్వలేనితనము, ఉపేక్ష కారణాలని స్కాట్లండ్ వారు ఆగ్రహించినారు. వారిని పరిపాలించేది లండన్‌లోని ఇంగ్లీష రాజు - ఇంగ్లీష్ పార్లమెంట్ చెప్పుచేతులలో ఉన్న ఇంగీష్ ప్రివీ కౌన్సిల్‌వారు. కాని ఇంగ్లీష్ కాలనీలలో, ఇంగ్లీష్ వారి వ్యాపారంలో వారికి పాలు లేదు. ఇంక ఇంగ్లండ్‌తో మే మెందుకు కలిసి ఉండవలె అని స్కాటిష్ వారడగటం ప్రారంభించినారు. రెండు దేశాల ఐక్యాన్ని సాధించడం కోసం విలియమ్ ప్రభువు ఇంకొకమారు ప్రయత్నించినాడు. ఆ పని చూడటానికి ప్రభువుల సభచేత కమిషనర్‌లను నియమింపజేసినాడు. ఆనీ రాణి కాగానే రెండు దేశాల పార్లమెంట్‌లు కమిషనర్‌లను నియమించటానికి ఆమె కధికార మిచ్చినాయి. వారు చాలాసార్లు 1702, 1708 లో సమావేశమయినారు. ఇంగీష్‌వారి ప్రత్యేక వ్యాపార హక్కులను పోనాడటానికి వారి కమిషనర్‌లు ఒప్పుకోలేదు. ప్రెస్బిటేరియన్‌లకు ఉద్యోగా లివ్వటానికి అంగీకరించలేదు. ఈ ప్రయత్నమూ విఫలమయింది.

*ఐక్యశాసనము* (1707)*:* తమ మతానికి, వ్యాపారానికి తగిన రక్షణ కల్పించక పోతే ఆనీ తరవాత తాము వేరే వ్యక్తిని రాజు చేసుకొంటామని స్కాచ్ పార్లమెంట్ 1704 లో తీర్మానించింది. దాంతో స్కాట్లండ్ వారిని విదేశీయులుగా చూస్తూ తమ వస్తువులను అమ్ముకోడానికి ఇంగ్లండ్‌కు రానీయరాదని ఇంగ్లీష్ పార్లమెంట్ శాసించింది. వ్యవహారాలు క్రుతిమించి రాగాన పడేటట్లుండగా ఉభయులూ కొంత తగ్గి వచ్చి 1706 లో రాజీ షరతులకు ఒప్పుకొన్నారు. తత్ఫలితమే 1707 నాటి ఐక్య శాసనము.

*ఐక్యశాసన నిబంధనలు:* 1. ఇంగ్లండ్ స్కాట్లండ్‌లు గ్రేట్ బ్రిటన్ అనే పేర ఐక్యం కావలె. 2. వారి జాతీయ పతాకాలు ఒక్కటి కావలె. 3. పార్లమెంట్‌లు ఏకమై ప్రభువుల సభకు పదహారు మంది ప్రతి నిధులుగా స్కాట్లండ్ ప్రభువులందరు చేరి పార్లమెంట్‌కు ఎన్నుకొనవలె. స్కాచ్ ప్రభువులను రాజు కొత్తగా ఏర్పరచరాదు. 4. కామన్స్ సభకు స్కాచ్ ప్రజా ప్రతినిధులను 45 మందిని ఎన్నుకొనవలె. 5. స్కాచ్ జాతీయ

ఋణాన్ని ఇంగ్లండ్ తీర్చవలె. 6. ఇంగ్లండ్ చెల్లించే ప్రతి 20 లక్షల పౌనులకూ స్కాట్లండ్ 48 వేల పౌనులు చెల్లించవలె. 7. స్కాచ్ జాతి చట్టాలు, వారి న్యాయ స్థానాలు నిలిచి ఉంటాయి. రెండు పార్లమెంట్లు రద్దయ్యేలోగా ఆయా దేశాల చర్చీలు - స్కాట్లండ్‌లో ప్రెస్బిటేరియన్ చర్చి, ఇంగ్లండ్‌లో ఆంగ్లికన్ చర్చి - పై వాటిని స్థిరపరుస్తూ శాసనాలు చేసినాయి. ఈ శాసనాలను గ్రేట్ బ్రిటన్ పార్లమెంట్ మిగతా షరతులతో బాటు ధ్రువ పరిచింది. ఈ ఐక్యము 1707 లో అమలులోకి వచ్చింది.

స్కాట్లండ్ వేరై పోతుందేమో ననే భయము, రెండో జేమ్స్ కుమారుని స్కాట్లండ్ వారు తమ దేశానికే కాక ఇంగ్లండ్‌కు కూడా రాజును చేయటానికి ప్రయత్నిస్తారేమోననే భయము, అట్లా జరిగితే తమ తమ ప్రొటెస్టెంట్ మతాల కేమి భంగం, కలుగుతుందోననే జంకు - ఇవి రెండు దేశాలు సంఘటితం కావడానికి తోడు పడినాయి. స్కాట్లండ్‌లో జన సామాన్యం ఇంగ్లండ్‌తో ఐక్యానికి సుముఖం కాదు. ఐక్యం కోరిన స్కాచ్ పార్లమెంట్ స్కాచ్ ప్రజలకు ఆనాడు సరిఅయిన ప్రతినిధి గాదు. అయినా ఐక్యంవల్ల ఉభయదేశాలకు లాభమే కలిగింది. ఎప్పుడూ నెత్తిపైన శత్రు దేశం కూర్చొని ఉన్నదనే భయము ఇంగ్లండ్‌కు తీరిపోయింది. ఐక్యానికి ముందు స్కాట్లండ్ చాలా బీద దేశము. ఐక్యం తరవాత యూరప్ లోని భాగ్యవంతమైన దేశాలలో స్కాట్లండ్ ఒకటి అయింది. బ్రిటిష్ సామ్రాజ్యాన్ని తూర్పు దేశాలలో, అమెరికాలో వ్యాపింపజేసిన ఖ్యాతి స్కాట్లండ్ సైనికులదే.

## మంత్రివర్గ విధాన వికాసము

ఇది అనీ రాణి కాలంలో ప్రాముఖ్యంలోకి వచ్చి నలుగురిచేత గుర్తింపును పొందింది. రాణి సమక్షంలో మంత్రివర్గ సభ్యులు వారానికొక పర్యాయం సమావేశమై అన్ని ముఖ్య విషయాలను చర్చించి, నిర్ణయాలను తీసుకొనేవారు. ప్రీవీ కౌన్సిల్ సాధారణ పరిపాలనా విషయాలను చూసుకొనేది. మంత్రివర్గంలోని సభ్యులు పరస్పర విరుద్ధ భావాలను వ్యక్తం చేస్తూ, ఒకే అభిప్రాయాన్ని కలిగి ఉండేవారు కాదు. ఈ మంత్రివర్గం హఠాత్తుగా ఏర్పడ లేదు. ఒకరినొకరు అర్థం చేసుకొని మంత్రివర్గం ఏ విధంగా పనిచేయాలనేది క్రమేణా గుర్తించబడింది. దాదాపుగా వారు రాణి సేవకులుగా మెలిగేవారు. రాణి వారి నందరిని తన గుప్పిట్లో పెట్టుకొనేది. అనీ రాణి అయినప్పుడు విగ్ పక్షానికి పార్లమెంట్‌లో మెజారిటీ ఉన్నది. మంత్రివర్గంలో టోరీ, విగ్ పక్షాలవారు ఉన్నారు. కాని అనీ టోరీలవైపే మొగ్గు చూపేది. ఆమె ముఖ్యమంత్రి మారల్‌బరో ప్రత్యేకంగా ఏ ఒక్క పార్టీకి చెందినవాడు కాదు. ఫ్రాన్స్‌తో యుద్ధం సాగించడానికి ఎవరు తోడ్పడినా అతడు వారి సహాయం పొందేవాడు. అతని భార్యమాట రాణికి వేదవాక్కు. క్రమంగా విగ్‌లను తొలగించి వారి స్థానంలో టోరీలను ఆమె నియమించ సాగింది. తత్ఫలితంగా అది త్వరలోనే ఇంచుమించు టోరీ మంత్రివర్గమే అయింది. ఈ విధంగా ఏర్పడిన మంత్రివర్గం నామ మాత్రంగా 1710 వరకు అధికారంలో ఉంది. ఈ మంత్రివర్గం ఏర్పడటానికి గొడాల్ఫిన్, మారల్‌బరోలే ముఖ్య కారకులు. మంత్రివర్గ సభ్యులందరు వీరి చెప్పుచేతలలో ఉండేవారు. ఈ మంత్రివర్గంలో మారల్‌బరో, గొడాల్ఫిన్‌లు ప్రధానులు. మిగతా వారు నామమాత్రం మంత్రులు. మొదట అతివాద టోరీలు తొలగింపబడి, వారి స్థానంలో మితవాద టోరీలు నియమింపబడినారు. విగ్‌లు యుద్ధాభిమానులు

కాబట్టి, టోరీల స్థానంలో విగ్‌లను నియమించి, మారల్‌బరో విగ్ మెజారిటీ మంత్రివర్గాన్ని ఏర్పాటు చేసినాడు. కాని మితవాద టోరీ నాయకుడు హార్లీ 1708 లో అధికారంలోకి రావటానికి కుట్ర చేయగా టోరీ ఒక్కడూ లేకుండా చేసి సంపూర్ణ విగ్ మంత్రివర్గాన్ని మారల్‌బరో సాధించినాడు ఈ మంత్రివర్గం 1710 వరకు అధికారంలో ఉంది. టోరీ మత ప్రచారకుడైన డాక్టర్ సాచెవిరిల్ 1709 లో గైఫాక్స్ కేస్ దినోత్సవ సందర్భంలో సెయింట్ పాల్ చర్చిలో ఉపన్యసిస్తూ, మహోన్నత విప్లవ సిద్ధాంతాలను తీవ్రంగా విమర్శించడంతో, విగ్ మంత్రివర్గం అతనిని అభిశంసన చేయాలని పట్టుబట్టింది. మంత్రివర్గం తీసుకొన్న చర్య సఫలీకృతమైనా, చివరకు అది దాని పతనానికే దారి తీసింది. మంత్రివర్గ చర్యను ప్రజాభిప్రాయం వ్యతిరేకించడంతో విగ్ మంత్రివర్గాన్ని తొలగించడానికి ఆనీకి అవకాశం వచ్చింది. ఆమె సంపూర్ణ టోరీ మంత్రివర్గాన్ని ఏర్పాటు చేసింది 1688 మహా విప్లవం తరవాత ఒకే పక్షానికి చెందిన మంత్రివర్గం ఏర్పాటు కావడం ఇదే ప్రథమం. ఈ మంత్రివర్గమే కొద్దిపాటి మార్పులతో 1714 వరకు అధికారంలో ఉంది.

ఆనీ పెక్కు సందర్భాలలో తనకు వ్యక్తిగంగా ఇష్టంలేని మంత్రుల నియామకాన్ని, మంత్రివర్గ ఏర్పాటును అంగీకరించింది. ఈ విధంగా ఆమె ప్రవర్తించడంతో మెజారిటీ పార్టీకి చెందినవారినే మంత్రులుగా నియమించాలనే సిద్ధాంతం అమలులో ఉండి కాదు. తనకు తన మంత్రులకు అవసరమైన మద్దతు సులభంగా లభిస్తున్నందున ఆమె అటువంటి ఏర్పాటును ఒప్పుకొన్నది. ఆనీ కాలంలో సంభవించిన సంఘటనల దృష్ట్యా మంత్రివర్గం పార్లమెంట్ మీద ఆధారపడటం, సంయుక్త మంత్రివర్గం కన్న ఒకే పార్టీకి చెందిన మంత్రివర్గానికి అధిక బలం, సుస్థిరత ఉంటుందన్న సత్యం వెల్లడి అయింది. ఆనీకి రాజకీయ విషయాలలో తగినంత అభిలాష లేకపోవడంవల్ల అంతర్జాతీయ సమస్యలపట్ల సమృద్ధిగా పరిజ్ఞానం లేనందున, మంత్రివర్గమే అన్ని నిర్ణయాలు చేసేదనే విషయాన్ని గుర్తుంచుకోవలె. విలియమ్, ఆనీల కాలంలో మంత్రివర్గ విధాన వికాసంలో ఎంతో అభివృద్ధి కన్పిస్తుంది. సాధించిన అభివృద్ధి కంటె సాధించవలసినదే ఎక్కువ ఉంది. ఆనీ మరణించేనాటికి, మంత్రివర్గం ఒక నిర్దుష్టమైన వ్యవస్థగా తయారై ఒక వైపు ప్రభుత్వ విధానాలను, మరియొకవైపు పార్లమెంట్ చర్యలను అజమాయిషీ చేస్తూ, రాజ్య విధానాలను నిర్దేశించేది. ఇంతకు పూర్వంవలె మంత్రివర్గం రహస్య కాబాల్ మంత్రివర్గం మాదిరి పార్లమెంట్ అధికారానికి బెదదగా భావించబడేది కాదు. మంత్రివర్గ సమావేశాలకు రాణి తప్పక హాజరవుతూ ఉండేది. అయితే ఈ మంత్రి వర్గానికి ప్రధాన మంత్రి లేదు. మంత్రివర్గం సమష్టిగా పార్లమెంట్‌కు బాధ్యత వహించాలనే ఆచారం ఇంకా అమలులోకి రాలేదు. ఏ పక్షానికి అధిక సంఖ్యాబలం ఉంటుందో ఆ పక్షం నుంచి మంత్రివర్గమేర్పడి దేశాన్ని పరిపాలించే విధానం అన్ని లక్షణాంతో సమగ్ర స్వరూపం పొందటం మొదటి హానోవరియన్ రాజు కాలంలో జరిగింది.

## విగ్ మంత్రివర్గ పతనము

1709 నవంబరు 5 వ తేదీన సెంట్‌పాల్ కెథీడ్రెల్‌లో గైఫాక్స్ స్మారక దినం నాడు పాత టోరీ సిద్ధాంతాలైన సాత్విక విధేయతను (Passive obedience), నిర్విరోధ విధిని (duty of non-resistence) ప్రశంసిస్తూ - 1688 విప్లవ సూత్రాలను తీవ్రంగా

ఖండించటంవల్ల మంత్రివర్గంవారు సచీవరెల్‌ను ఇంపీచ్ చేయించినారు. రాజును ఎదుర్కొన టానికి ప్రజలకు, పార్లమెంట్‌కు హక్కు ఉన్నదని, శతాబ్దాలుగా ఇంగ్లీష్ రాజకీయాల చరిత్ర ఈ సిద్ధాంతాన్ని రుజువు చేస్తున్నదని మంత్రివర్గం వాదన. ఎదిరించరానిది శాసన సభాధి కారం గాని కార్యనిర్వాహక వర్గాధికారం (Executive) కాదని టోరీల ప్రతి వాదము. మంత్రివర్గము ఇంపీచ్‌మెంట్‌లో గెలిచినా ప్రజలలో కలిగిన తీవ్ర అసంతృప్తిని ఉపయోగించు కొని, విగ్ మంత్రివర్గాన్ని రాణి రద్దు చేసింది. 1688 విప్లవాన్ని సమర్థించటం మంత్రివర్గం విధి అని బర్క్ సమర్థించినాడు. కాని సచీవరెల్‌ను ఇంపీచ్ చేయనంత మాత్రాన కొంప మునగదనీ ప్రజలలో ఆనీ పట్ల భక్తితోబాటు స్టూవర్ట్ వంశం పట్ల అభిమానమున్నదనీ తమ అభిప్రాయాలను ప్రకటించటానికి ప్రజలకు హక్కున్నదనీ వాక్స్వాతంత్ర్యము ప్రజాపరి పాలనా విధానానికి, పార్టీపరిపాలనకు మూల స్తంభం వంటిదనీ విగ్ మంత్రివర్గం గుర్తించ లేక పోయింది. విగ్‌లను పదభ్రష్టులను చేసి ఆనీ పూర్తి టోరీ మంత్రివర్గాన్ని ప్రతిష్ఠించింది. కాని ఆ సమయానికి పార్లమెంట్‌లో విగ్‌లు మెజారిటీలో ఉన్నారు. ఈసారి కూడా ఇంతకు ముందు రెండు పర్యాయాలు జరిగినట్లుగా మంత్రివర్గంలో మార్పుచేసిన తరవాత జరిపిన జనరల్ ఎన్నికలో టోరీలు కామన్స్ సభకు అధిక సంఖ్యలో ఎన్నికయినారు. ఒక విధంగా చూస్తే మంత్రివర్గానికి ప్రజామోదం లేదని పాలక వర్గానికి (Executive) తోచినప్పుడు దానికి ప్రజామోద ముందో లేదో జనరల్ ఎన్నిక జరిపి రుజువు చేసుకొనటానికి అధికార ముందనే విషయం ఆనీ కాలంలో జరిగిన ఈ మార్పులు చెప్పకనే చెబుతున్నాయి. కాని ప్రజాభిప్రాయం తన చర్యను ఆమోదిస్తున్నదో లేదో అనే యోచన ఆమెకు కలిగిందని మాత్రం చెప్పలేము. మార్ల్‌బరో భార్యపై రాణి అనుగ్రహం తప్పటంతో ఆమెకూ ఆమె భర్తకూ ఆయన మంత్రివర్గానికీ పతనం సంభవించింది. అయినా నెమ్మదిగా ఇంగ్లండ్‌లో కాబినెట్ మంత్రివర్గ స్థాపన ముందుకు పోతున్నదని తరవాతి చరిత్రాంశాలనుబట్టి అనటానికి వీలయింది. మొదట మొదట మంత్రివర్గంలో మార్పులు జరిగినప్పుడు యుద్ధానికి బాగా తోడ్పడగల మంత్రివర్గాన్ని ఏర్పాటుచేసుకొనే కోరికే ఆ మార్పులకు కారణము. కాని అను భవం వల్ల నేర్చుకొన్న దేమంటే ఏకపక్ష మంత్రివర్గం సంకీర్ణ మంత్రివర్గం కంటె ఎక్కువ స్థిరత్వ మున్నటువంటిదని, ఈ ఏకపక్ష మంత్రివర్గంతోబాటు అదే పక్షం కామన్స్‌లో మెజారిటీలో ఉన్నట్లయితే పార్లమెంట్‌కు, మంత్రివర్గానికి సంఘర్షణ లేకపోవడమేగాక సహకార మధికంగా ఉంటుందని. ఈ సత్యాన్ని ఇంతకు ముందెప్పుడూ మూడో విలియం కాలంలో కూడా ఇంత విశదంగా తెలుసుకోవటం జరగలేదు. ఆనీ గతించేటప్పటికి ఒకవైపు ఏకపక్ష మంత్రివర్గం ప్రభుత్వ విధానాల నిర్వహిస్తూ పోగా ఆ మంత్రివర్గ విధానాలను, పరిపాలనను కామన్స్ సభలోని అదే పక్షం నిర్ణయిస్తూ సమర్థిస్తూ ఉండే కాబినెట్ విధానం చక్కగా రూపు దిద్దుకొన్నది. ఆ మంత్రివర్గం పట్ల ప్రజలలో వైముఖ్యము, అసహనము అంతరించి పోయినాయి. కాబినెట్ మంత్రుల సమావేశంలో రాజు అధ్యక్షత వహించటం, వహించి తన ఇష్టానికి అనుకూలంగా కాబినెట్ విధానాలను, నిర్ణయాలను తీర్చిదిద్దటం సంభవిస్తూనే ఉన్నది. ఇంకా మంత్రివర్గంలో సర్వాధికారిగా ప్రధాని ఒకడుండే విధానం సమకూరలేదు. అతనికి ఇతర మంత్రులు లోబడి ఉండటం, మంత్రులందరూ మంత్రివర్గ నిర్ణయాలకు విధిగా కట్టుబడి ఉండవలెననటం, మంత్రివర్గ విధానాన్ని కామన్స్‌లోని మెజారిటీ సభ్యులు తోసిపుచ్చినట్లయితే

మంత్రివర్గమంతా రాజీనామా లిచ్చి తొలిగిపోవలసి ఉండటం, దానితో బాటు కామన్స్ సభను రద్దుచేసి ప్రజాభిప్రాయాన్ని తెలుసుకోడానికి జనరల్ ఎన్నికలు జరపటం - అనే ఈ లక్షణాలింకా కాబినెట్ విధానంలో అమరుకొనలేదు. అయినా ఆనీ రాణి రాజ్యపాలనాంతానికి కాబినెట్ మంత్రివర్గ విధానానికి రాజమార్గ మేర్పడిందని ఘంటాపథంగా చెప్పవచ్చు.

ఆనీ చనిపోవటానికి (1714) కొంతకాలం ముందు టోరీ మంత్రివర్గం పడిపోయి విగ్ మంత్రివర్గం అధికారంలోకి వచ్చింది. విగ్‌లు హానోవీరియన్‌లు ఇంగ్లండ్ రాజులు కావడానికి సుముఖులు. ఫ్రాన్స్‌తో స్పెయిన్‌తో యుద్ధాలకు సుముఖులు. టోరీలు స్టూవర్ట్ వంశం వారిని తిరిగి రాజులను చేయవలెననే అభిలాష గలవారు. 1715 లో రెండో జేమ్స్ కుమారుడు మూడో జేమ్స్ స్కాట్లండ్ ప్రజా సహాయంలో ఇంగ్లండ్‌కు రాజు కావలెననే ప్రయత్నం చేసినాడు. 1745 లో అతని కుమారుడు ఛార్లెస్ ఆ ప్రయత్నమే మళ్ళీ చేసినాడు. అందుచేత మొదటి, రెండో జార్జి రాజులు టోరీలను నమ్మక విగ్ మంత్రివర్గాలనే పూర్తిగా నమ్ముకొన్నారు. తత్ఫలితంగా 1714 నుంచి 48 ఏళ్ళు విగ్ మంత్రివర్గాలు, విగ్ కామన్స్ సభలు పరిపాలనాధికారాన్ని గుత్తగా తీసుకొన్నాయి. విగ్ పార్టీలో మూడు తెగలవారున్నారు: i. అత్యంత భాగ్యవంతులైన భూస్వాములు. ii. ధనికవర్గము, వర్తక శిఖామణులు - వారి సంఖ్య. సంపద క్రమంగా పెరగటం ప్రారంభమయింది. iii. ఆంగ్లికన్‌లు లేదా ప్రాటెస్టంట్ శాఖలు.

ఇక టోరీలలో గొప్ప భూస్వాములలో కొందరు, ఇంచుమించు చిన్న భూస్వాములందరూ, సామాన్య మత గురువులు ఇంచుమించు అందరూ, నాన్‌కన్‌ఫార్మిస్ట్‌లు గాని బీదలు కూడా ఉన్నారు. సంఖ్యలో విగ్‌లే టోరీలకంటె తక్కువ కాని దేశ సంపదలో వారి సొత్తు సగం కంటె హెచ్చు. వారు సమర్థులు, ఉత్సాహశీలులు. ధనికవర్గం వారయినా ఉదార విధానాలపై వారికి మక్కువ ఎక్కువ. మొదటి జార్జికి ఇంగ్లీష్ భాష రవ్వంత కూడా రాదు. రెండో జార్జికి వచ్చిన ఇంగ్లీష్ రవ్వంతే. అందుచేత ఆ భాషలో మాట్లాడటానికి సిగ్గుపడేవాడు వారు మంత్రివర్గ సమావేశాలకు చాలా దూరంగా ఉంటేవారు. విగ్‌లను పూర్తిగా నమ్ముకొన్నారు. టోరీ లంటే వారికి ఎక్కడలేని అనుమానమే. అందుచేత కాబినెట్ మంత్రివర్గం వారి కాలంలో సర్వ లక్షణ సంపన్నమయింది. పారిశ్రామిక విప్లవం జరిగింది. వారి కాలంలోనే ఇండియా కెనడాలను ఫ్రెంచి వారినుంచి గెల్చుకొన్నది. 13 అమెరికన్ కాలనీల సంపూర్ణ పరిణామంవల్ల, పారిశ్రామిక విప్లవంవల్ల ఇంగ్లండ్ ప్రపంచదేశాలన్నిటిలో వారి కాలంలోనే భాగ్యవంతిమయింది. ఈ అర్ధ శతాబ్దాల కాలం విగ్‌లు అధికారం అనుభవించి ఇంక 150 ఏళ్ళ కాలం ఇంగ్లండ్ ప్రాభవ ఔన్నత్యాలకు గట్టి పునాదులు వేసినారు. బ్రిటిష్ రాజ్యాంగ పరిణామాన్ని ఆనీ రాణి పరిపాలనాంతం నాటికి చాలా ముందుకు తీసుకొని పోయిన వారు ఈ విగ్ పక్షం వారే.

# 10

# మొదటి హనోవీరియన్ రాజులు-
# కాబినెట్ మంత్రివర్గ పరిణామము

**(క్రీ. శ. 1714-60)**

1714 జులై 27వ తేదీ వరకు హానోవీరియన్‌లకు రాజ్యం సంక్రమించవలెననే పార్టీకిచెందిన ఆక్స్‌ఫర్డ్ ప్రభువు కోశాధిపతిగా ఉన్నాడు. 30వ తేదీనాడు ప్రీవీ కౌన్సిల్ సలహా మేరకు ష్రూస్‌బరీ ప్రభువు ఆ పదవికి నియమితుడయిన రెండో నాడే ఆనీ మరణించింది. ష్రూస్‌బరీ విగ్ పార్టీకి చెందినవాడు మంత్రివర్గము, టోరీలు ఆయనతో సహకరించి హానోవీరియన్ వంశంవారైన జార్జి I ను ఇంగ్లండ్ రాజు చేసినారు. విగ్‌ల అనుగ్రహం వల్లనే తాను ఇంగ్లండ్‌కు రాజయినట్లు జార్జి రాజుకు తెలుసు.

17వ శతాబ్దంలో ఇంగ్లీష్ రాజ్యాంగం చాలా ఒడుదుడుకులకు లోబడవలసి వచ్చింది. మొదటి ఇద్దరు స్టూవర్ట్‌ల కాలంలో పార్లమెంట్‌కు సంపూర్ణ శాసనాధికారం ఆర్థిక అధికారము ఉన్నదా లేదా? రాజు తన ప్రత్యేకాధికారాలను (Prerogatives) ఉపయోగించి ఆ విషయాలలో పార్లమెంట్ అధికారాన్ని వమ్ము చేయగలడా లేదా? ఈ ప్రశ్నలను గురించి రాజూ పార్లమెంట్‌లు పోరాడి రాచరికమే రద్దుఅయి ఇంగ్లండ్‌లో సైనిక బలం మీద ఆధారపడే గణ రాజ్యాన్ని స్థాపించడం, దానిని పడదోసి పార్లమెంటే స్టూవర్ట్ వంశాన్ని పునరుద్ధరించడం, రెండో ఛార్లెస్, రెండో జేమ్స్ రాజులు ఒకరు పరోక్షంగా, రెండో వారు ప్రత్యక్షంగా తమ మత విధానాన్ని, విదేశ రాజనీతిని ఇంగ్లండ్‌లో ప్రభావితం చేయడం, రెండో జేమ్స్ దేశ భ్రష్టుడు కావటం, తత్ఫలితంగా చాలా పరిమితాధికారాలతో మేరీవిలియమ్‌లు ఆనీ రాణి పరిపాలకులు కావటం చదివినారు. కాని పార్లమెంట్ శాసన ఆర్థిక అధికారాలను ఎన్నడూ కాదనలేకున్నా విలియమ్ తానే రాజ్యానికి ప్రధాన మంత్రిగా, విదేశాంగ మంత్రిగా, సర్వ సైన్యాధ్యక్షుడుగా పరిపాలించటాన్ని బట్టి ఇంగ్లీష్ రాజు పదవి ఎంత బలహీనమైనదో ఎవ్వరూ గుర్తించలేకపోయినారు. విలియమ్‌పై ప్రజలకున్న గౌరవము, ఆనీ రాణి బ్రిటిష్ రాజ వంశానికి చెందిందనే అభిమానము రాజు, పార్లమెంట్ బలాబలాలలో వచ్చిన మార్పును జనులు గమనించకపోవడానికి తోడ్పడినాయి. రాజుతో ప్రజలు అధికారానికి ఢీకొనవలసిన అవసరం లేకున్నా పార్లమెంటే ఇంచుమించు ఒక శతాబ్దం పోరాడి రాజునుంచి తీసుకొన్న అధికారాన్ని చేజిక్కించుకొని అనుభవించటానికి విగ్, టోరీ పార్టీలు ఒకదానితో ఒకటి పోటీ పడటంతో రెండు పక్షాలూ మంత్రిపదవులకై రాజు మీద ఆధారపడవలసి రావటంచేత విలియమ్ ఆనీల పలుకుబడి అధికంగానే ఉండేది. టోరీ, విగ్ పక్షాలు రెండూ తాము బ్రిటిష్ పరిపాలకులు కావటానికి తోడ్పడినందువల్ల రెండు పార్టీలనూ మంచి చేసుకోవలెననే సదుద్దేశంతోనూ వీలైనప్పుడల్లా విగ్గులనుంచీ, టోరీలనుంచీ తమ మంత్రులను

తీసుకొనే విధానాన్నే వారు తెలివిగా అవలంబించినారు. పరిస్థితుల ప్రాబల్యంవల్లనే అప్పుడప్పుడు పూర్తి టోరీ మంత్రివర్గాన్నిగాని విగ్ మంత్రివర్గాన్నిగాని వారు నియమించినారు. ఫ్రాన్స్‌తో యుద్ధం సాగించినంతకాలం విలియమ్. అనీలకు బ్రిటిష్ ప్రజానీకం జేజేలు కొట్టింది. హానోవీరియన్‌ల మీద టోరీలకు ఏమాత్రం అభిమానం లేదు. అందుచేత హానోవీరియన్‌లు విగ్ పార్టీ అధికారంలో ఉన్నంతకాలం తమ రాచరికానికి ఎట్లాంటి భంగమూ ఉండదని విగ్ పార్టీ మంత్రివర్గాలనే ఆదరించినారు, అభిమానించినారు. విగ్ పార్టీకి హానోవీరియన్‌లపై గౌరవం లేదు. తమ అనుగ్రహంవల్ల రాజులైన వారుగదా ఆ హానోవీరియన్‌లు. కాని వారు రాజ్యాన్ని పోగొట్టుకొని స్టూవర్ట్ వంశంవారే తిరిగి రాజులు కావడం సంభవించినట్లయితే తాము పదభ్రష్టులు కావడం తథ్యమని విగ్‌లకు తెలిసిన విషయమే. అందువల్ల వారు హానోవీరియన్ వంశంవారి పక్షం వహించి స్టూవర్ట్ పక్షం వారితో విరోధంగా ఉన్నారు స్టూవర్ట్ వంశాన్ని పునః ప్రతిష్ఠించవలెనని 1715 లో, తిరిగి 1745 లో బ్రిటన్ ఉత్తర కౌంటీలలో కొన్ని ప్రయత్నాలు జరిగినాయి. కాని వాటిని చాలా తేలికగా అణిచివేయడమయింది టోరీ పక్షానికి రాజాదరణ లేనందువల్ల, బలం లేకపోవటంచేత అర్థశతాబ్దకాలం ఇంగ్లీష్ రాజకీయ జీవితం ఎట్లాంటి కలతలు లేకుండా సాగిపోయింది. మూడో విలియమ్‌వలె మొదటి జార్జి పడమటి ఐరోపాలోని అన్ని రాజ్యాల వ్యవహారాలలోనూ తలదూర్చే వాడు కాడు. అతనికి ఇంగ్లండ్ రాజకీయాలలోనే శ్రద్ధ లేదు. అతనికి కావలసినదంతా పితృసంబంధమైన హానోవర్ రాజ్యక్షేమము, హానోవర్‌కూ ఇతర జర్మన్ రాజ్యాలకున్న వ్యవహారాలలో హానోవర్‌కు లాభం కలిగేటట్లు చూడటం. అతడు ఇంగ్లండ్‌కు రాజయినప్పుడు ఇంచుమించు 50 ఏళ్ళవాడు. అతనికి ఇంగ్లీష్ అక్షరం రాదు నేర్చుకోవలెననే ప్రయత్నం కూడా అతడు చేయలేదు. అతడు రాజైన కొంత కాలానికే వాల్‌పోల్ మంత్రి అయిన తరవాత భాషా సంబంధమైన ఇబ్బంది అతనికి తొలిగిపోయింది. ఇద్దరికి అంతంతమాత్రం లాటిన్ భాష తెలిసిన కారణంచేత మంత్రివర్గంలో జరిగే విషయాలను తెలిసీ తెలియని లాటిన్‌లోనే రాజుకు తెలియజేసే పని వాల్‌పోల్‌పై పడింది. ఇంగ్లండ్ రాజయినందువల్ల జార్జికి ఐరోపాలో హోదా పెరిగింది. చేతినిండా పుష్కలంగా డబ్బు వచ్చిపడింది. ఇంగ్లండ్ రాజుగా తన పదవినిబట్టి తనకు చెందిన ప్రత్యేక రాజ్యాధికారాలు నిలుపుకోవలెననే కోరిక అతనికి లేదు. పార్లమెంట్ అధికారాల పెరుగుదలను అరికట్టవలెననే ఆలోచన అంతకంటే లేదు. ఇంగ్లండ్‌లోని పార్టీ రాజకీయాలను గురించి అతనికి తెలిసినదంతా విగ్‌లు రాజ్యాన్ని తమ వంశం వారి చేతుల నుంచి తొలగిపోకుండా చూసితీరుతారనే విషయమే. అందుచేత సామాన్య పరిపాలననూ హానోవర్‌కు సంబంధించని విదేశ వ్యవహారాలనూ అతడు విగ్‌లకు ఏ సంకోచం లేకుండా అప్పజెప్పినాడు. అది కాబినెట్ అధికారాన్ని దోహదం చేయటానికి ఎంతైనా తోడ్పడింది.

1727 లో రెండో జార్జి రాజు అయినాడు. అతనికి ఇంగ్లండ్ రాజకీయాలు బాగా అవగతమయ్యేవి. వాటిలో ఆయనకు హానోవర్ రాజకీయాలందున్నంత శ్రద్ధా ఉండేది. కాని మొదటి జార్జి కున్నన్ని శక్తి సామర్థ్యాలు అతనికి లేవు. కాని శక్తి సామర్థ్యాలు మొదటి జార్జికి ఉండీ, రెండో జార్జికి లేకా ఒకటే అయినది. అతడు రాజ్యానికి వచ్చే ముందు (1721) నుంచి కొన్ని ఏళ్లుగా మంత్రివర్గ నాయకుడుగా ఉన్న వాల్‌పోల్ అధికారంలో బాగా కుదురు

కొని ఉన్నందువల్ల అతనిని రెండో జార్జి పదవినుంచి తొలిగించలేక పోయినాడు. రెండో జార్జ్ రాజైన పిమ్మట ఇంకొక పన్నెండేళ్ళు వాల్‌పోల్ అధికారం సాగింది. 1717 నుంచి మొదటి జార్జ్ కాబినెట్ సమావేశాలకు వచ్చి వాటి కధ్యక్షత వహించటం మానివేసినాడు. రెండో జార్జ్ ఆ సంప్రదాయాన్నే సాగించినాడు. జార్జి రాజు సతీమణికి వాల్‌పోల్ మీద ప్రత్యేకాభిమానం ఉండేది. ఆమె ఆడించినట్లు ఆడేవాడు మొదటి జార్జి. వాల్‌పోల్ మాట పార్లమెంట్‌లో వేదవాక్కుగ చెలామణి అవుతుందనే రహస్యం ఆమె చక్కగా గ్రహించినది. అందుచేత రెండో జార్జి వాల్‌పోల్‌కు ఏమీ అడ్డు చెప్పేవాడు కాదు. పైగా రాజకీయ సంప్రదాయాలను మన్నించవలెననేదే అతని మతము. ఫలితంగా అతడు రాజ్యంచేసిన 33 ఏళ్ళూ విగ్ పార్టీ పరిపాలన, కాబినెట్ మంత్రివర్గ అధికారమూ నిర్విఘ్నంగా సాగినాయి. నలభై ఏళ్ళకు మించి ఒకే రాజకీయ పక్షమూ ఆ పక్షానికే చెందిన మంత్రివర్గమూ అధికారంలో ఉండటం, ఆ మంత్రివర్గం వారు ఒక్క నాయకుని మాటకు కట్టుబడి ఉండటం, ప్రజలకూ పార్లమెంట్‌కూ పరిచితమై ఉన్నందువల్ల ఈ విధానంలో ఉండే ప్రత్యేక లాభాలను అన్ని పక్షాల వారూ గ్రహించగలిగినారు.

మొదటి ఇద్దరు జార్జ్ రాజుల స్వభావం కాబినెట్ విధాన పరిణామానికి అవకాశమిచ్చిందేగాని ఆ పరిణామానికి ముఖ్య కారకుడు సర్ రాబర్ట్ వాల్‌పోల్. ఒకవైపు మంత్రివర్గానికి నాయకత్వమూ ఇంకొకవైపు కామన్స్ సభా నాయకత్వమూ వహించటమేగాక ఆ మంత్రివర్గానికీ కామన్స్ సభకూ ప్రతినిధిగా వాటికీ రాజుకూ మధ్యవర్తిగా ఉన్న ప్రధాన మంత్రుల పరంపరలో వాల్‌పోల్ మొదటి వాడు. ప్రధానమంత్రి (Prime Minister) అని పిలిపించుకోవటంలో అతడు అయిష్టత చూపించినా నిజానికి ఆ పదానికి అన్ని విధాలా అర్హుడైన మొదటి వ్యక్తి వాల్‌పోలే. ఆ పదవికి తనకు తెలియకుండా సృష్టికర్త అయినాడతడు. నాయకత్వంలో అతనితో పోటీపడిన బోలింగ్ బ్రోక్, కార్టరెట్ లంత ప్రతిభావంతుడు కాడు. వాల్‌పోల్ మహావక్తా కాదు. తన వాదాన్ని అందరూ అర్థంచేసుకొనగలిగే విధంగా స్పష్టంగా వివరించే శక్తి మాత్రం అతనికి కావలసినంత ఉంది. ఎంతో వైవిధ్యం ఉండే అనేక సమస్యలను ఆకళించుకొని వ్యవహారాలను జయప్రదంగా నడిపించగలిగిన కార్యదక్షత అతని సొత్తు. అతడు అధికార లాలసుడే. తన అధికారాన్ని నిలుపుకొనటానికి, ఎన్నికలలో తన పక్షం వారిని గెలిపించటానికి పార్లమెంట్ సభ్యులకు ధనమిచ్చి వారి వారికి పదవులూ బిరుదులూ లాభసాటి స్థానాలూ ఇచ్చి లోగట్టుకొని తన పార్టీ మెజారిటీని ఇంచుమించు ఇరవై ఏళ్ళు అతడు నిలుపుకోగలిగినాడు. స్వార్థపరుడై పదవికి అంటిపెట్టుకొని ఉండక తన నాయకత్వం వల్ల దేశానికి లాభం కలిగేటంత కాలమే అతడు పదవిలో ఉండి ఇక ప్రయోజనకారి కాదని తోచిన క్షణమే మంత్రిత్వాన్ని నిశ్చితంగా వదలుకొన్నాడు. ఆనీ మృతిచెందినప్పుడు స్టూవర్ట్ వంశాన్ని తెచ్చిపెట్టవలెనని ప్రయత్నంచేసి విఫలులైన టోరీలు శిక్షలకు భయపడి దేశం వదిలి పారిపోయినారు. అందుచేత చాలాకాలం విగ్ మంత్రివర్గానికి పార్లమెంట్‌లో ప్రతిపక్షమే లేదు. కొన్నాళ్ళకు ప్రతిపక్షా లేర్పడినా అందులో పదవులనుంచి తొలగిన విగ్గులే చేరినారు. టోరీలపై ద్వేషం తగ్గి తిరిగి చేరి వాదు కుదటబడేనాటికి వారికి హానోవేరియన్‌లపై కక్ష గట్టవలెననే కోరిక అంతరించి దాని స్థానంలో రాజుపట్ల, అతనికి ఇంకా మిగిలిఉన్న అధికారంపట్ల మంచి మనస్సేర్పడింది. ఇది 18 వ శతాబ్దపు టోరీల చిత్త ప్రవృత్తి. 19 వ

శతాబ్దంలో రాజుకు మిగిలిన పరిపాలనాధికారా లేమీ లేవు. అందువల్ల విగ్‌లు అతిత్వరగా విప్లవకరమైన మార్పులు తెచ్చిపెట్టకుండా అడ్డుపడటమే టోరీ ప్రతిపక్షం వారు తమ ముఖ్య కర్తవ్యమనే నిశ్చయానికి వచ్చినారు.

మంత్రివర్గంలో మొదటి ఇద్దరు జార్జ్ రాజుల కాలంలో (1714-60) అప్పుడప్పుడు కొన్ని మార్పులు కలిగినాయి. మొదటి కాబినెట్లో ప్రముఖుడు టౌన్‌షెన్డ్ ప్రభువు. వాల్‌పోల్‌కు అందులో ఉన్నది అప్రధాన స్థానము ఒక్క సంవత్సరం తిరిగేలోగా ఆయన ఎక్స్‌ఛెకర్‌కు ఛాన్సలర్ అయినాడు. 1717 లో మంత్రివర్గంలో చీలికలేర్పడి వాల్‌పోల్, టౌన్‌షెన్డ్‌లు కాబినెట్‌ను విడిచిపోవలసి వచ్చింది. 1720 లో వాల్‌పోల్ మంత్రివర్గంలో ప్రవేశించినా అతడు కాబినెట్‌కు నాయకుడైనది 1721 లోనే. ఆనాటి నుంచి 21 ఏళ్ళు అతని ప్రధాన మంత్రిపదవి అవిచ్ఛిన్నంగా సాగింది. ఈ కాలంలో కాబినెట్ విధానం అనేక ముఖ్య లక్షణాలను సంతరించుకొని రూపు దిద్దుకొన్నది. ఈ పరిణామానికి ప్రధానంగా వాల్‌పోలే బాధ్యుడు.

మొదటి జార్జ్ కాబినెట్ సమావేశాలకు అధ్యక్షత వహించటం మానినందువల్ల కాబినెట్ మంత్రులు స్వేచ్ఛగా సంప్రదింపులు జరుపుకోవటానికి వీలయింది. రాజు సమక్షంలో ఈ స్వేచ్ఛను మునుపు మంత్రులెన్నడూ అనుభవించలేదు. జార్జ్‌కి ఇంగ్లీష్ భాష తెలిసే ఉంటే కాబినెట్ సమావేశాలకు రావద్దని, అధ్యక్షత వహించరాదని మంత్రులతనిని నిర్బంధించి ఉండలేరు. తనంతట తాను తన అధికారాన్ని తగ్గించుకోవటానికి జార్జ్ రాజు అంగీకరించి ఉండడు. కాబినెట్ సంస్థలో రెండో ముఖ్య లక్షణం మంత్రులలో ఒకరు ప్రధానమంత్రి కావడం. ఈ సంస్థ కొరకు ప్రధానమంత్రి అవసరమని ఆ పదవిని ఎవ్వరూ సృష్టించలేదు. రాజు అధ్యక్షతన కొనసాగి ఉంటే ప్రధానమంత్రి ఆవశ్యకత ఎవ్వరికీ తోచిఉండేదే గాదు. అన్ని విధాలా తమకంటె వాల్‌పోల్ అధిక సమర్థుడనీ రాజుతో లాటిన్‌లో సంభాషించ గలవాడు అతడొక్కడేననీ పార్లమెంట్‌లో తమ పార్టీవారందరినీ కూడగట్టుకొని రాగలనేర్పు అతనికున్నంత మరెవ్వరికీ లేదనీ మంత్రివర్గంలోని వారందరికీ అతడు నమ్మకం పుట్టించ గలిగినందువల్ల అతడు ప్రధానమంత్రి అయినాడు. ఆ పదవిని కొంతకాలం నిర్వహించిన తరవాత ఆ పదవి తప్పక అవసరమనే నమ్మకము అందరికీ కలిగింది. ఇది ఇట్లా ఉండగా 1733 లో పన్నుల విధానాన్ని సంస్కరించదలచి వస్తూత్పత్తి పన్ను చట్టాన్ని (Excise Bill) వాల్పోల్ పార్లమెంట్‌లో ఉపపాదించినాడు. దానికి ప్రచండ ప్రతికూలోద్యమాన్ని ప్రజలు లేవనెత్తినారు. ప్రభు సభలోని ప్రధాన ప్రభుత్వోద్యోగులు కొందరు, మంత్రులలో కొందరు తీవ్రంగా ప్రతిఘటించినారు. తన చట్టాన్ని బలపరచి ఉండవలసిన మంత్రులు దానిని ఎదిరించినందువల్ల మంత్రిపదవుల నుంచి వారిని తొలగించటానికి వాల్‌పోల్ ఏమాత్రం వెనుదీయలేదు. తరవాత ప్రభువుల సభలో ఆ చట్టం ఓడిపోగా ఓటమికి తోడ్పడిన ప్రభుత్వోద్యోగులను వెంటనే వాల్పోల్ బర్తరఫ్ చేసినాడు. అంతేగాని తాను తన పదవికి రాజీనామా చేయలేదు. మంత్రివర్గ సభ్యులందరూ ప్రభుత్వ విధానానికి కట్టుబడి ఒక్క మాటపై నిలవవలెనని ఆ విధానానికి ప్రతికూలత చూపదలచిన వారు తమ మంత్రి పదవులకు రాజీనామా లిచ్చి ప్రభుత్వ ముపపాదించే చట్టాన్ని బహిరంగంగా ఎదిరించవచ్చునని వాల్‌పోల్ సుస్పష్టం చేసినాడు. అందువల్ల అతడు తోటి మంత్రులకు అభిప్రాయ ప్రకటన స్వేచ్ఛ

ఇవ్వక పగబూపినాడనే తీవ్ర విమర్శలకు గురిఅయినాడు. ఏమయితేనేమి ?, ఇకమీద కాబినెట్ మంత్రివర్గము ఏకగ్రీవంగా వ్యవహరించవలెననే సిద్ధాంత స్థాపనకు వాల్పోల్ ముఖ్య కారకు డయినాడు. మంత్రివర్గ విధానంతో విరోధించదలచిన మంత్రి రాజీనామా ఇచ్చి వైదొలగకుంటే అతనిని మంత్రివర్గం నుంచి వెళ్ళమనే అధికారం ప్రధానమంత్రికి ఉన్నదని ఆయన రుజువు పరిచినాడు. ఇట్లా కాబినెట్ లక్షణాలలో ఇంకొక ప్రధాన లక్షణ మేర్పడటానికి అతని చర్య దారి తీసింది.

వాల్పోల్‌కు కామన్స్ సభలో మెజారిటీ ఉన్నది. అయినా పార్లమెంట్‌కు వెలపల తీవ్రంగా ప్రకటించిన ప్రజాభిప్రాయాన్ని మన్నించి వస్తూత్పత్తి పన్ను చట్టాన్ని అతడు వదులుకొన్నాడు. రాజుకంటె, మంత్రివర్గానికంటె హెచ్చు అధికారం తనకు ఉన్నదని భావించే పార్లమెంట్ ప్రజల అభిప్రాయం ఏ విధంగా ప్రకటితమైనా తమ కది శిరసావ హించ దగిందని అంగీకరించి నట్లయింది. ఇంతకూ వార్తా పత్రికలకు బహుళ ప్రచారం లేని కాలమది.

1739 లో స్పెయిన్ దేశంపై యుద్ధానికి ఇంగ్లీష్ ప్రజలు కాలుదువ్వ సాగినారు. వాల్‌పోల్ స్వభావరీత్యా యుద్ధాలకు ప్రతికూలుడు. యుద్ధాలు ప్రజాభివృద్ధి కార్యక్రమాలకు నిరోధకాలని అతని నమ్మకం. యుద్ధం నడిపించటం తనకు ఇష్టంలేక రెండు మారులతడు రాజుకు రాజీనామా పంపినాడు. కాని రాజు పట్టుబట్టగా అతడు ఇంకొక మూడేళ్ళు ప్రధాన మంత్రిగా ఉండటం సంభవించింది. తన వివేచనకు సమ్మతంగాని విధానాన్ని నిర్వహించ టానికి పూనుకోవడం కాబినెట్ విధానానికి విరుద్ధమైన పని. దానికి తగినట్లే యుద్ధ వ్యవహా రాలు ఇంగ్లీష్ ప్రజలకు ఏమంత అనుకూలంగా లేకపోయినాయి. అయినా 1741 జనరల్ ఎన్నికలో పార్లమెంట్‌లోని వాల్పోల్ (విగ్) పక్షం వారే కొద్ది మెజారిటీ సాధించినారు. 1742 జనవరిలో అతని పార్టీకంటె ప్రతికూల పక్షానికి ఒక్క వోట్ అధికంగానూ, అయిదు దినాల తరవాత (ఫిబ్రవరి రెండో తేదీనాడు) 16 ఓట్లు అధికంగానూ రాగా తన మంత్రివర్గ సభ్యులందరి రాజీనామాలతో బాటు తన రాజీనామా కూడా వాల్పోల్ రాజుకు అందజేసినాడు. రాజు అతనిని ఆర్ఫర్డ్ ప్రభువును చేయగా అతడు ప్రభు సభలో సభ్యుడయినాడు. అంతకు ముందు ఎన్ని పర్యాయాలు రాజు అతనిని ప్రభువును చేస్తానని అన్నా వాల్పోల్ నిరాకరించి నాడు. పరిపాలనాధికారం ఇంగ్లండ్‌లో ప్రభువుల సభకు లేదని, అది కామన్స్ సభలో ప్రతిష్ఠితమై ఉన్నదని, ప్రధానమంత్రికి తగినదని కామన్స్ సభా సభ్యత్వమేగాని ప్రభు సభా సభ్యత్వం కాదని అతని దృఢ విశ్వాసము.

ఈ విధంగా తమకు ఇష్టంగాని మంత్రివర్గాన్ని తొలగించటానికి ఇంపీచ్‌మెంట్ వంటి తీవ్ర చర్యలకు పూనుకోనక్కరలేదని, మంత్రివర్గంతో తాము సహకరించటానికి నిరాకరిస్తే చాలునని కామన్స్ సభవారు తెలుసుకొన్నారు. అయినా వాల్‌పోల్‌ను ఇంపీచ్ చెయ్యవలెననే ప్రయత్నం ఒకటి జరగకపోలేదు.

జార్జి రాజు వాల్‌పోల్‌ను ఎంత అభిమానించినా మంత్రిపదవిలో ఉంచటం అతనికి వీలుకాలేదు 1744 లో కార్టరెట్‌ను మంత్రిపదవి నుంచి తొలగించటం తనకు ఇష్టం కాక పోయినా అతనిని పదభ్రష్టుని చేయటం చూస్తూ ఉండవలసి వచ్చింది. తనకెంత అయిష్ట మయినా 1746 లో పిట్‌ను మంత్రివర్గంలో చేర్చటాన్ని అడ్డగించలేక పోయినాడు.. మొదట

పిట్ మంత్రి కాగూడదన్నాడు. బాత్, గ్రాన్‌విల్ (కార్టరెట్) ప్రభువులు పిట్‌ను చేర్చుకొన కుండా మంత్రివర్గాన్ని ఏర్పాటు చేయజూచినారు కాని కామన్స్ సభలో పలుకుబడి ఉన్న విగ్ నాయకులు పిట్ లేని మంత్రివర్గంలో చేరటానికి ఒప్పుకోలేదు.

1756 లో ఏడేళ్ళ యుద్ధం (Seven Years' War) ఇంగ్లండ్, ఫ్రాన్స్‌ల మధ్య ప్రారంభమయింది. 1757 లో పిట్ మంత్రివర్గంపై రెండో జార్జ్ మళ్ళీ దాడిచేసి పిట్‌ను బర్తరఫ్ చేసినాడు. కాని అతని స్థానంలో మంత్రిగా రావటానికి ఎవరూ అంగీకరించలేదు. కామన్స్ సభలో న్యూకాజిల్ ప్రభువుకు అధిక సంఖ్యాకుల తోడ్పాటు ఉన్నందువల్ల అతడు పిట్‌తో కలిసి మంత్రివర్గాన్ని ఏర్పాటుచేయగా రాజు ఏమీ చేయలేక మిన్నకుండవలసి వచ్చింది. మంత్రివర్గాన్ని ఏర్పాటుచేసే అధికారం రాజుకు లేదని ఇంకా ఎవ్వరూ అనలేదు గాని కామన్స్ సభలో బలంలేనివారు మంత్రులు కావడంగాని, బలంలేని వారిని తనకు ఇష్టులని రాజు మంత్రులుగా నియమించగలగడంగాని అసాధ్యమని తేలిపోయింది. అంతేగాక పార్ల మెంట్‌కు బాధ్యత వహించిన మంత్రుల సలహాలు పాటించక తనకు ఇష్టంవచ్చిన విధానాన్ని రాజు ఇకమీద అనుసరించలేడనీ స్పష్టమయింది. ఏ మంత్రిగాని రాజు ఒత్తిడివల్ల తనకు నచ్చని విధానాన్ని అవలంబించడం పోయి కామన్స్ సభలోని అధిక సంఖ్యాకులు ఆమోదించిందే ప్రజామోదం పొందిన విధానమని పరిగణించే కాలం వచ్చింది

పార్లమెంటరీ పరిపాలనా విధానంలో సాధికారమైన రాజకీయపక్షంతో బాటు పార్ల మెంటరీ ప్రతిపక్షానికి కూడా స్థాన మేర్పడింది. ఆ ప్రతిపక్షం రాజ్యాంగ మూల సిద్ధాంతాలను ఆమోదించిందే. మంత్రివర్గం చేసే పొరపాట్లు గమనించి వెలికితీసి పార్లమెంట్ సమావేశాలలో తీవ్రంగా విమర్శించటం, వీలైతే మంత్రివర్గం పట్ల పక్షపాతమున్న వారికి నచ్చ జెప్పి తమ పక్షంలో వారు చేరేటట్లు వోటర్లలో అధిక సంఖ్యాకులు తమ విధానాన్ని ఆమోదించేటట్లు ప్రచారం సాగించి రాబోయే ఎన్నికలలో వోట్లు అధికంగా సంపాదించి ప్రభుత్వాధికారాన్ని చేపట్టి తమ కార్యక్రమాన్ని పరిపాలనలో అమలుపరచటం పార్లమెంటరీ ప్రతిపక్షం వారి విధ్యుక్త ధర్మము. మొదటి ఇద్దరు హానోవేరియన్ రాజుల కాలంలో ఈ పార్లమెంటరీ ప్రతిపక్షం రూపొందింది.

పూర్వం ప్రివీ కౌన్సిల్ సభ్యుల సంఖ్య పెరిగినకొద్దీ వారిలో కొద్దిమంది రాజుకు ఆంతరంగిక ప్రివీ కౌన్సిల్‌గా ఏర్పడినట్లే రాజు మంత్రుల సంఖ్య వృద్ధిచెందుతూ పోగా ఈ ఇద్దరి రాజుల కాలంలో ఆంతరంగిక మంత్రివర్గ మొకటి పరిపాలనావసరాల ఒత్తిడివల్ల ఏర్పడింది. రహస్యాలోచనలకు, కార్యవర్గ విధాన నిశ్చయానికి కొద్దిమంది సభ్యులున్న ఆంతరంగిక మంత్రివర్గం అత్యావశ్యకమయింది. బాహ్య మంత్రివర్గ (Outer Cabinet) మొకటి, దాని ప్రధానాంగంగా దాని హృదయ స్థానంలో ఆంతరంగిక మంత్రివర్గ (Inner Cabinet) మొకటి పరిణామ మొందినాయి.

మొదటి ఇద్దరు హానోవేరియన్ రాజుల కాలంలో ప్రజలకు, పార్లమెంట్ ఎంతవరకు ప్రాతినిధ్యం వహించిందో తెలుసుకోదగ్గ విషయము మన కాలంలో పార్లమెంట్‌ను ప్రజలకు నిజమైన ప్రతినిధి అనటం చెల్లుతుందిగాని 18 వ శతాబ్దంలో పార్లమెంట్‌ను ప్రజా ప్రతినిధి సభ అనటం ఎంతమాత్రం సార్థకం గాదు. ఆనీ చనిపోయిన నాటినుంచి 1770 వరకు పార్ల మెంటరీ వ్యవహారాలలో నాయకత్వంవహించిన విగ్ పార్టీవారు టోరీలకంటె అధికంగా

ఉదార రాజకీయాలలో అభిలాష చూపిన వారేకాని వారి నాయకులు ప్రభు వంశాలకు చెందిన వారు ; కామన్స్ సభను తమ ఇష్టం వచ్చినట్లు ఆడించగలిగినవారు. లాంకాస్ట్రియన్ల కాలంలో ఉన్న ఎన్నికల విధానంలో మూడు శతాబ్దాలుగా ఎట్లాంటి మార్పులూ లేవు. ప్రజలు తమ గ్రామాలు వదిలి పట్టణాలలో నివాసా లేర్పరచుకోవటం తరతరాలుగా సాగటంవల్ల గ్రామాలలో ఉన్న వోటర్ల సంఖ్య జనసంఖ్యతోబాటు క్షీణించటం ధనికవర్గం తన పలుకుబడి గట్టి చేసుకోవటానికి చాలా తోడ్పడింది. గ్రామాల ప్రతినిధులుగా తమ మాట శిరసావహించే వారిని ఎన్నుకొనేటట్లు చేయటానికి వారు తమ ధనాన్ని కుమ్మరిస్తుండేవారు. 1742 లో చాలామంది ప్రభుత్వోద్యోగులు, పెన్షన్‌దారులు రెండువందల మంది వరకు కామన్స్ సభలో ఉన్నట్లు తెలుస్తుంది వారు ప్రభుత్వానికి దాసులే కదా. 1780 నాటి కామన్స్ సభ్యులలో చాలామంది ఆరువేల మంది వోటర్లు మాత్రమే ఎన్నుకొన్నవారు. కామన్స్ సభ్యులు 658 మందిలో వారి నియోజిత సభ్యులుగానే పరిగణించవచ్చు.

పై పరిస్థితుల ఫలితంగా 18 వ శతాబ్దాన పార్లమెంట్ సభ్యులలో లంచగొండితనము, ధనవంతుల ప్రాబల్యము, స్వార్థపరత్వము అధికంగా ఉండేవని, మంత్రివర్గానికి సభ్యులను తమ చెప్పుచేతులలో ఉంచుకోవటానికి అవకాశాలు అధికంగా ఉండేవని గ్రహించవచ్చు. లాభసాటి కమిషన్లు, పదవులు, బిరుదులు ఇస్తామని ఆశచూపి కామన్స్‌లో అధిక సంఖ్య సభ్యులను ప్రభుత్వ పక్షంవారు తమ గుప్పిటిలో ఉంచుకొనగలిగినారు. అవినీతికరమైన పద్ధతులు అవలంబించి కామన్స్ సభలో అధిక సంఖ్యాకులను కూడగట్టుకోవటంలో దారి చూపినవాడు వాల్‌పోల్ అని, ఆ విద్యలో ఆతడు ఆరితేరిన వాడని, కామన్స్ సభ్యుల వోట్లను తారుమారు చేయటంలో న్యూకాజిల్ ప్రభువు వాల్‌పోల్ తలదన్నినవాడని అంటారు. ఎన్నికలలో వోటర్లను, తరవాత కామన్స్ సభ్యులను లంచాలిచ్చి, పదవులు ఇస్తామని ఆశ జూపి లోగట్టుకోవటంలో 18 వ శతాబ్దం మొదటి సగంలో కలిగిన అనుభవంవల్ల తన రాజరికాన్ని, అధికారాన్ని పునరుద్ధరించుకోవటానికి మూడో జార్జ్ రాజు అద్భుతంగా ప్రయత్నించినాడు.

మొదటి ఇద్దరు జార్జ్ రాజుల పరిపాలనా కాలంలో ప్రధానంగా గమనించవలసింది కాబినెట్ మంత్రివర్గ పరిణామము. ఇదేగాక ప్రస్తావించవలసిన చారిత్రకాంశాలు కొన్ని ఉన్నాయి. ఆనీ కాలంలో చేసిన తాత్కాలిక ఆంగ్లికన్ మత స్వీకార శాసనము, ప్రొటస్టెంట్ సంఘవిభేద నిషేధ శాసనము (Conformity Act, the Schism Act) అనే ఈ రెండు చట్టాలను అధికారానికి వచ్చిన విగ్ పక్షం రద్దు చేసింది. అందువల్ల ఇకమీద ఆంగ్లికన్ పక్షానికి చెందిన ప్రొటస్టంట్ శాఖలవారు తమ తమ మత విశ్వాసాలను, పూజా విధానాలను యథేచ్ఛగా అవలంబించవచ్చు. విగ్ నాయకులు మత పరీక్షాశాసనాన్ని, కార్పొరేషన్ చట్టాన్ని గూడా రద్దు చేయటానికి ప్రయత్నం చేసినారు. కాని ఆంగ్లికన్లుగాని ప్రొటస్టంట్లకు ప్రభుత్వోద్యోగా లివ్వడం, కార్పొరేషన్ పట్టణంలో వారిని ఉండనిచ్చి, సంఘంలో వారి పలుకుబడిని వృద్ధి కావించుకొనటానికి వసతులు కల్పించటం ఆంగ్లికన్లు ఓర్వలేని, వారి ఔదార్యానికి మించిన విషయాలయినాయి. దీనిని గురించి పట్టుపడితే విగ్‌ల అధికారానికి, హానోవీరియన్‌ల రాజ్యానికి ముప్పు రాగలదని జంకి ఆ ప్రయత్నం నుండి విగ్ మంత్రివర్గం విరమించుకొన్నది. కాని ఈ రెండు చట్టాలను రద్దు చేయకున్నా ఏటేటా

వాటిని అతిక్రమించినవారు ఆ చట్టాలు విధించిన శిక్షలకు పాత్రులు కాకుండా కాపాడటానికి క్షమాశాసనాన్ని (Indemnity Act) పార్లమెంట్ ఆమోదించటం అప్పటినుంచి ఒక ఆచారమయింది.

*ఏడేళ్ళ చట్టము:* 1715 లో మొదటి జార్జి రాజైన కొద్ది కాలానికే స్కాట్లండ్‌లోను, ఇంగ్లండ్ ఉత్తర ప్రాంతంలోను జాకొబైట్ పక్షం వారు రెండో జేమ్స్ కుమారుని రాజు చేయవలెనని తిరుగుబాటు లేవదీసినారు. సరిగా ఆ నాటికి మూడేళ్ళ చట్టం ప్రకారం పార్ల మెంట్‌కు సాధారణ ఎన్నికలు జరపవలసిన సమయం వచ్చింది. ప్రజలు జాకొబైట్ విప్లవాన్ని గురించి ఉద్రేకం చెంది ఉన్నప్పుడు ఎన్నికలు జరపటం ఉచితంగాదని తలచి ఇకమీద సాధారణ ఎన్నికల ఫలితంగా ఏర్పడిన పార్లమెంట్‌కు ఆయుః ప్రమాణం సామాన్యంగా ఏడేళ్ళని, ఆ సమయానికి అధికారంలో ఉన్న పార్లమెంట్ అంతకాలం పదవిలో ఉంటుందని శాసనం (ఏడేళ్ల చట్టము) చేయడమయింది. తన జీవితాన్ని మూడేళ్ల నుంచి ఏడేళ్ళు పొడి గించుకొనటానికి ఆ పార్లమెంట్‌కు హక్కు లేదని, ప్రజలకే అట్లా శాసించే అధికారముందని అప్పుడు తీవ్ర విమర్శలు చేయడమయిందిగాని సర్వాధికార సమన్వితమైన పార్లమెంట్‌కు ఆ చట్టాన్ని చేసే హక్కు మాత్రం ఉండదనటం వితండవాదమే అయినా పార్లమెంట్ జీవితం మూడేళ్ళు ఉండటం ఎంత అసంగతమో, ఏడేళ్ళుండటం కూడా అంత అప్రశస్తమే. ఏడేళ్ల కాలంలో ప్రజాభిప్రాయం మారి ప్రభుత్వం ప్రజలకు నిజమైన ప్రతినిధి కాకుండా పోవ టానికి ఎంతో వీలుంది. కాని మంత్రివర్గానికి, దాని విధానాలకు కొంత స్థిరత్వం సమకూరు తుందనే మాట కొంత నిజమే.

*ప్రభుపదవీశాసనము (The Peerage Bill):* కొత్తగా ప్రభుపదవికి వ్యక్తులను నియమించటానికి, రాజుకుండే అధికారాన్ని పరిమితం చేయటానికి మంత్రిమండలి 1719 లో ప్రభు పదవీశాసనాన్ని కామన్స్ సభలో ఉపపాదించింది. ఆనాటికున్న ప్రభువుల సంఖ్యకు మించి ఆరుగురికంటె ఎక్కువమంది నూతన ప్రభువులను రాజు నియమించరాదని ఈ చట్టం శాసించటానికి ప్రయత్నం చేసింది. ఆనాటి వరకు స్కాట్లండ్ ప్రభువులకు 16 మంది ప్రతి నిధులను ప్రభువుల సభకు పంపే అధికారం ఉండేది. దానికి బదులు వంశ పారంపర్యంగా 25 మంది స్కాటిష్ ప్రభువులకు ప్రభు సభాసభ్యత్వాన్ని ప్రసాదించటానికి ఈ చట్టం ఉపపాదన చేసింది. ఈ చట్టమే శాసనమై ఉంటే ప్రభువర్గం చాలా పరిమితమై నిలిచి పోయేది. ఉన్నత ప్రభువులు కొద్దిమంది పరిపాలనాధికారాన్ని, ప్రభువుల సభను చేజిక్కించు కొని ఉండేవారు. కడపటి ప్రభువుల సభకు దుర్గతి పట్టేది. ప్రజా సభలో వాల్‌పోల్‌తో బాటు చాలామంది విగ్‌లు ఈ చట్టాన్ని ఖండించినారు. అందుచేత ఇది శాసనం కాలేదు. ఈ చట్టాన్ని 1719 లో పార్లమెంట్ ఆమోదించి ఉంటే 1882 లో పార్లమెంట్ సంస్కరణ శాసనం సాధ్యమయ్యేది కాదు. ఆ శాసనాన్ని అప్పటి ప్రభువుల సభ నిరాకరించబోగా అది ఆమోదం పొందటానికి ఎంతమందిని ప్రభు సభకు కొత్తగా నియమించవలసి ఉంటుందో అంత మందిని ప్రభుత్వం నియమించగలదని బెదిరించి ఆ పార్లమెంటరీ సంస్కరణ చట్టానికి ప్రభుత్వం వారు ప్రభు సభ ఆమోదాన్ని పొందగలిగినారు.

ప్రివీ కౌన్సిల్ క్షీణించగానే దానితోబాటు అధ్యక్ష ప్రభువు (Lord President) పదవి ప్రాధాన్యాన్ని పోగొట్టుకొంది. మంత్రివర్గంలో ఈనాడు కూడా పై పేరు కలిగిన

మంత్రి ఒకడు ఉన్నాడు కాని ఈ మంత్రి నిర్వహించే పరిపాలనా కార్యమేమీ లేదు. ప్రజా జీవితంలోను, పార్లమెంట్‌లోను పార్టీ పలుకుబడికి అతడు ముఖ్యుడని భావించేవారు. పరిపాలనా భారాన్ని వహించని వ్యక్తికి ఈ అధ్యక్ష ప్రభువు హోదా ఇచ్చేవారు. కడపటి కోశ ప్రభువు ష్రూస్‌బరీ డ్యూక్. అతనిని ఆ పదవికి ఆనీ రాణి తాను మరణశయ్యలో ఉండి నియమించింది. అనంతరం కోశాధికారాన్ని ఒక కమిషన్ వశం చేసినారు. కోశ ప్రభువులని ఈ కమిషన్ సభ్యులను పిలుస్తారు. వీరిలో ప్రథమ కోశ ప్రభు (First Lord of the Treasury) స్థానాన్ని సామాన్యంగా ప్రధానమంత్రి అలంకరిస్తున్నాడు. ప్రథమ కోశ ప్రభువు నిర్వహించే పని ఏమీ లేదు మంత్రుల కార్యనిర్వహణాన్ని, అనేక శాఖల పరిపాలనాన్ని సమన్వయం చేస్తూ దొరతనాన్ని ఒకే తాటిపై దేశ ప్రతినిధిగా నడిపిస్తూ రాజ్యానికి ఏకైక నాయకుడైన ప్రధాన మంత్రికి పరిపాలనా భారాన్ని అంటగట్టటం న్యాయం కాక పోవటంవల్ల అతనికి ప్రథమకోశ ప్రభుపదవి ఇస్తున్నారు. మిగతా కోశ ప్రభువులకూ కోశానికే సంబంధించిన విధులేమీ లేవు ; ఇతర కార్యాలకే వారిని నియోగిస్తున్నారు. ప్రస్తుతం కోశ నిర్వహణకు బాధ్యుడైన మంత్రి ఎక్స్ ఛెకర్ చాన్సలర్. ఈ పేరుగల మంత్రిపదవిని మూడో హెన్రీ కాలంలో మొదట సృష్టించటమయింది కాని ఆ పదవి మొదటి జార్జ్ పరిపాలనలోనే ప్రాముఖ్యాన్ని సంతరించుకొంది. ఎక్స్‌ఛెకర్ చాన్సలర్ ప్రభువర్గానికి చెందినవాడు. కోశపు కమిషన్ ఏర్పాటయిన నాటినుంచి ఎక్స్‌ఛెకర్ చాన్సలర్‌కు సభలోనే సభ్యత్వము ఉండేది.

మొదటి ఇద్దరు జార్జ్ రాజుల కాలంలో వాల్‌పోల్ నాయకత్వాన అనేక ఇతర సందర్భాలు కారణంగా ఏకపక్ష మంత్రివర్గ మెట్లా వేరూనుకొన్నదో చదివినారు. ఆ మంత్రివర్గానికి విధాన మొక్కటే ; నాయకుడొకడే ; అతని విధానాన్ని కాదన్న మంత్రికి ఆ కాబినెట్‌లో స్థానము ఉండదు. అతని విశ్వాసాన్ని పోగొట్టుకొన్న మంత్రి కాబినెట్ నుంచి వెలి కావలసిన వాడే. కామన్స్ సభలో అధిక సంఖ్యాకుల విశ్వాసాన్ని పోగొట్టుకొన్నవాడు ప్రధానమంత్రి అయితే తన సహమంత్రు లందరితోబాటు రాజీనామా చేయటం, మంత్రి మాత్రుడయితే కాబినెట్ నుంచి తాను వైదొలగటం అనే లక్షణాలు కూడా కాబినెట్ అమర్చుకొంది. కాని మంత్రివర్గం ఏ రాజకీయ పక్షానికి చెందిందో ఆ పక్షం సభ్యులు తమ మంత్రివర్గ విధానాలను సమర్థించవలసి ఉంటుందని, ప్రతిపక్ష సభ్యులతో చేతులు కలిపి తమ పక్ష మంత్రివర్గాన్ని పదభ్రష్టం చేయటానికి యత్నించరాదని రాజకీయాలలో పాత్ర వహించే వారు గ్రహించలేదు. మంత్రివర్గ పదవులు పోగొట్టుకొన్న విగ్‌లు టోరీలతో చేరటం కూడని పనిగా భావించే కాలం ఇంకా రాలేదు. దీనికి తోడు ప్రతిపక్షం వారి రాజకీయ మతాన్ని బాలింగ్ బ్రూక్ ప్రభువు "దేశభక్తి గల రాజు" "Patriot King" అనే తన గ్రంథంలో ఇట్లా వివరించినాడు : రాజకీయ పక్షాలకు అతీతుడయి ఉండి ఉభయ రాజకీయ పక్షాలనుంచి అర్హులైన వారిని తన మంత్రులుగా గ్రహించి ప్రజలందరి మేలు సాధించటానికి రాజు కృషి చేయవలె. ఈ అభిప్రాయాన్ని రుజు బుద్ధితోనే ఆమోదించేవారు. ఆ 18 వ శతాబ్ది పూర్వార్థంలోనే గాక ఉత్తరార్థంలోనూ అనేకులు ఉండటంవల్లనే మూడో జార్జ్ రాజు కొంతకాలం తన మంత్రివర్గాలను ముప్పతిప్పలు పెట్టగలిగినాడు. చాథామ్ ప్రభువు కుమారుడు పిట్ ప్రధానమంత్రి పదవికి వచ్చిన తరవాతగాని కాబినెట్ మంత్రివర్గ విధానం బాలారిష్టదోషాలు గడిచి పాటునబడి రాటు దేలలేదు.

# 11

# మూడో జార్జ్ 1760-1820 బ్రిటిష్ రాజ్యాంగ పరిణామము

మూడో జార్జ్ పరిపాలించినది ఒక సంధి కాలము. ఆయన రాజ్యానికి వచ్చేటప్పటికి ఏడేళ్ల యుద్ధము సగం జరిగింది. యుద్ధంలో మొదట దెబ్బతిన్నా విజయ పరంపరలను ఇంగ్లండ్ ఒడుచుకొనటం ఆరంభించింది. విలియమ్ పిట్ యుద్ధనీతి విశారదత్వం ఈ విజయాలను ప్రోది చేసింది. ఆయన అత్యంత ప్రతిభావంతుడు. సమర్థుడు. అందుకని యువకుడూ అధికారలాలసుడూ అయిన జార్జ్ అయనను చూసి ఓర్వలేక పోయినాడు. జార్జ్ చాలా పసివాడుగా ఉన్నప్పుడే అతని తండ్రి వేల్స్ రాకుమారుడు మరణించగా అతనిని తల్లి పెంచింది. "జార్జ్! రాజువు నీవు; రాజుగానే ఉండు" అని చిన్నప్పటినుంచి అతనిని ఆమె ఉద్బోధించేది. మొదటి ఛార్లెస్‌వలె, ట్యూడర్ రాజులవలె రాజుగా ఉండవలెనని ఆయన ఎన్నడూ వాంఛించలేదు. 1688 విప్లవమైన తరవాత మూడవ విలియమ్ ఎట్లాంటి రాజ్యాధికారాన్ని అనుభవించినాడో అట్లాంటి రాజ్యాధికారాన్ని తాను చేబట్టవలెనని అతని కాంక్ష. మొదటి ఇద్దరు జార్జ్ రాజుల కాలంలో వారి చేతకానితనంవల్ల, ఇంగ్లీష్ రాజకీయాలను సరిగా అర్థం చేసుకోనందువల్ల రాజరికానికి నష్టప్రదమైన అధికారాలను తాను రాజైన తరవాత తిరిగి రాబట్టుకోవలెనని, మొదటి ఇరవయ్యేళ్లూ మూడో జార్జ్ అనేకవిధాల పట్టుదలతో ప్రయత్నాలు సాగించినాడు. రాజరికాన్ని గురించి ఆయన అభిప్రాయాలను తీర్చి దిద్దినవి బాలింగ్‌బ్రూక్ ప్రభువు రచించిన "దేశభక్తి పూరితుడైన రాజు" అనే గ్రంథమూ బ్లాక్‌స్టన్ ఇంగ్లీష్ శాసనాలను గురించి వ్రాసిన వ్యాఖ్యానాలు (Commentaries on the Laws of England) అతడు చురుకైనవాడు కాడు. ఆ లోపాన్ని మొండితనంతోను శ్రమించే గుణంతోను ఆయన భర్తీ చేసుకొన్నాడు. ఆయన మొదటి ఇరవై ఏళ్లలో మంత్రివర్గం తరవాత మంత్రివర్గాన్ని, మంత్రి తరవాత మంత్రిని మారుస్తూపోయినా మంత్రివర్గ విధానానికి వ్యతిరేకంగా పార్లమెంట్ సభ్యులను వోటు చేయవలెనని ప్రోత్సహించటానికి "రాజమిత్రులు" (The King's Friends) అనే తన అనుచరులను ప్రయోగించినా అది ఎవ్వరికీ ఆ కాలంలో వింతగా తోచలేదు.

1760 లో విలియమ్ పిట్ యుద్ధ మంత్రి. విదేశనీతి, యుద్ధనీతి అతని అధీనంలో ఆనాడున్నాయి. యుద్ధం ముగిసేదాక ఆయన జోలికి పోవడానికి జార్జ్ తలపెట్టలేదు. కాని రాజైన మరుక్షణం నుంచి జార్జ్ తన కిష్టులైన వారితో మంత్రివర్గాన్ని భర్తీ చేయ మొదలు పెట్టినాడు. ఆ విషయంలో ఆయన విలియమ్ పిట్‌ను సంప్రదించలేదు. ఇన్నాళ్ళు రాజు పేరిట పదవులు, ఉద్యోగాలు, బిరుదులు కాంట్రాక్టులూ మంత్రివర్గమే పంచిపెట్టేది. ఈ పంపకాన్ని అంతా ఇప్పుడు జార్జ్ తన చేతులలోకే తీసుకొన్నాడు. తన గురువైన బ్యూట్ ప్రభువును పిట్‌తోగాని, మంత్రివర్గ నాయకుడైన న్యూకాజిల్‌తోగాని సంప్రదించకుండా ప్రివీ

కౌన్సిల్ సభ్యుడుగాని, మంత్రివర్గ సభ్యుడుగాను ఆయన నియమించినాడు. ఫ్రాన్స్‌తో జరుగుతున్న యుద్ధము ప్రజానష్టాన్ని కలిగిస్తుందని ప్రివీ కౌన్సిల్‌లో ఆయన ఉపన్యసించినాడు. మొదటి ఇరవై ఏళ్ళలో పరిస్థితుల ప్రాతికూల్యం వల్ల అప్పుడప్పుడూ తప్ప సామాన్యంగా ఆయన పరిపాలించినంత కాలం (మతిచెడి అతని స్వాధీనంలోలేని కొన్ని ఏళ్ళు కాదుగాని) మంత్రుల నియామకంలోనూ, పార్లమెంట్ ప్రివీ కౌన్సిళ్ళకు పంపే తన అభిప్రాయ ప్రకటనలలోనూ మొదటి జార్జ్ నుంచి ఈనాటి వరకు ఏ ఇంగ్లీష్ పాలకుడు ప్రదర్శించనంత స్వాతంత్ర్యాన్ని మూడో జార్జ్ రాజు అనుభవించినాడు. కాబినెట్ సమావేశాంలో తాను అధ్యక్షత వహించవలెనని పట్టుబట్టక పోయినా, రాజ మిత్రుల మూలంగా పరిపాలన విషయంలో, పార్లమెంట్ ముందున్న శాసనాల విషయంలో తన అభిప్రాయాన్ని సభ్యులకు తెలిపి వారు తన ఇష్టానికి అనుకూలంగా వోటు చేయవలెనని ఆయన నిర్బంధించేవాడు. ఏడేళ్ల యుద్ధం త్వరగా ముగిసి సంధి అయ్యేదాక తాను ఓర్పు వహించి పిట్‌ను మంత్రివర్గ పదవిలోనే కొనసాగనీయ దలచుకొన్నాడు గాని సంవత్సరం తిరిగేలోగా ఫ్రాన్స్‌తో కలవడానికి సంసిద్ధమవుతున్న స్పెయిన్‌పై యుద్ధం ప్రకటించవలెనని పిట్ చేసిన సూచనను కాబినెట్ త్రోసిపుచ్చటంవల్ల ఆయన తన పదవికి రాజీనామా చేసినాడు. మూడో జార్జ్ రాజైన $1\frac{1}{2}$ ఏళ్ళకు బ్యూట్ ప్రధానమంత్రి అయినాడు. జార్జ్ రాజయినప్పటి నుంచి పది ఏళ్లలో ఏడు మంత్రివర్గాలు మారినాయి. దీనికి కారణం విగ్ పక్షాన్ని విచ్ఛిన్నం చేయవలెననే కోరికతో జార్జ్ మాటి మాటికి మంత్రివర్గ వ్యవహారాలలో జోక్యం కల్గించుకొనటమే. అధికార వాంఛ, స్వార్థపరత్వము, పరస్పర ద్వేషాలు విగ్ పక్షంలో కలిగించిన చీలికలు రాజు ప్రయత్నాలకు తోడైనాయి. 1770 లో నార్త్ ప్రభువు ప్రధానమంత్రి అయినాడు ; ఆ పదవిలో 12 ఏళ్లు ఉన్నాడు. నిజానికి ఆ కాలంలో ప్రధానమంత్రి రాజే. నార్త్ చేయవలసిన పని పార్లమెంట్‌లో రాజు నిర్ణయాలను సమర్థించటం. సమర్థించటానికి ఆయన అంతగా కష్టపడవలసింది కూడా లేదు. న్యూకాజిల్ అవినీతికరమైన మార్గాలు అవలంబించి ప్రభుత్వానికి పార్లమెంట్‌లో అధిక సంఖ్యా బలాన్ని సంపాదించే పద్ధతి ఇది అని మూడో జార్జ్‌కి దారి చూపించినాడు. ఆ విద్యలో జార్జ్ అరితేరి గురువును మించిన శిష్యుడయినాడు. సభ్యుల స్వార్థాభిలాషను వినియోగించుకోవటమే గాక తనతో కలిసిరాని వారిని దారికి తేవడానికి శిక్షా విధానాన్ని కూడా ఆయన అవలంబించినాడు. ఉదాహరణకు పిట్ పదవీ విరమణ చేసిన తరవాత బ్యూట్ ప్రభువు ప్రధానమంత్రి అయి ఫ్రాన్స్‌తో రాజీ ప్రయత్నాలు మొదలు పెట్టగా వాటిని విమర్శించిన డెవన్‌షైర్ అనే ప్రివీ కౌన్సిల్ సభ్యునీ కాన్వే, బారీలనే సైనికాధికారులనూ న్యూకాజిల్, గ్రాఫ్టన్, రాకింగ్‌హామ్‌లనే లార్డ్ లెఫ్టినెంట్‌లనూ (Lord Lieutenants) మాత్రమేగాక వారిపై ఆధారపడినవారిని, సామాన్య ప్రభుత్వోద్యోగులను రాజు ఉద్యోగాల నుంచి తొలిగించినాడు (1764). రాజు కాబినెట్ మంత్రుల విధానాలను భంగం చేస్తుండగా పై కారణాలవల్ల కామన్స్ సభ ఏమీ చేయలేక చూస్తూ ఉండవలసి వచ్చింది. రాజ మిత్రులు బాహాటంగా మంత్రుల ఉపపాదనలకు రాజు సమ్మతించటం లేదని, వాటికి అనుకూలంగా వోటు చేసిన సభ్యులను తన విరోధులుగా పాటిస్తాడని ప్రచారం చేసేవారు. 1765 లో మంత్రివర్గ మేర్పరచిన రాకింగ్‌హామ్ ప్రభువు విగ్ పార్టీకి చెందినవాడు. రాజుకు అయిష్టుడు. రాజు తన మిత్రులను ఆయన మంత్రివర్గాన్ని పడదోయటానికి ఉపయోగించినాడు. 1766లో

రాకింగ్‌హామ్ రాజీనామా చేయవలసి వచ్చింది. కాబినెట్ విధాన ప్రాధాన్యాన్ని ఇంగ్లీష్ రాజకీయాలలో ఉండేవారు ఇంకా అర్థం చేసుకోనందువల్ల, జనసామాన్యం రాజుకు, విగ్ నాయకులకు మధ్య జరుగుతున్న వివాదాలను గురించి శ్రద్ధ వహించనందువల్ల, ధనికవర్గం జమీన్దారీ పక్షమయిన విగ్గులపై ఎట్లాంటి సానుభూతినీ చూపనందువల్ల, కామన్స్ సభ్యు లనేకులు అవినీతిపరులు, స్వార్థపరులూ బనందువల్ల, కామన్స్ సభ్యులు నిజమైన ప్రజా ప్రతినిధులు కానందువల్ల, వారిలో 192 మంది ప్రభుత్వోద్యోగులే అయినందువల్ల, వారిని లోగట్టుకొని తన కయిష్టులైన మంత్రులను జార్జ్ ముప్పతిప్పలు పెట్టగలిగినాడు. 1766 లో పిట్, గ్రాఫ్టన్‌లు మంత్రివర్గాన్ని ఏర్పరిచినారు. 1768 లో పిట్ మంత్రిత్వం వదలుకొన్నాడు. విగ్ పార్టీలో ఏర్పడిన చీలికలను చూసి 1770 లో గ్రాఫ్టన్ మంత్రివర్గం రాజీనామా చేయగా నార్త్ ప్రభువును రాజు ప్రధానమంత్రిగా చేసినాడు. నార్త్ ప్రభువును అమెరికన్ కాలనీలపట్ల రాజు అనుసరిస్తున్న విధానం వినాశకరమని తెలియకపోలేదు. అందువల్ల మాటి మాటికి తన పదవికి రాజీనామా చేయజూసినాడు కాని రాజు మాటను కాదనలేక 1782 దాకా ప్రధాన మంత్రిపదవి వెలిగించినాడు. 1776 లో అమెరికన్ కాలనీలు తాము ఇంగ్లండ్‌నుంచి విడివడి నామని ప్రకటించినాయి. 1781 లో అమెరికా సంయుక్త రాష్ట్రాలు అనే పేర తమ రాజ్యాంగాన్ని నిర్మించుకొని స్వతంత్ర రాజ్యాన్ని ఏర్పరుచుకొన్నాయి.

జార్జిరాజు అనుసరిస్తున్న విధానం అర్థశతాబ్దంగా రూపొందుతున్న పార్లమెంటరీ కాబినెట్-ప్రజాపరిపాలనా విధానానికి ప్రత్యక్ష విరుద్ధమైనదని పరిమిత రాజరికపు (limited monarchy) బురఖాతో ప్రజాభిప్రాయానికి, దాని ప్రతినిధిఅయిన పార్లమెంట్‌కు బాధ్యత వహించని రాజు యథేచ్ఛాపరిపాలనమే అని విగ్ నాయకులకు అర్థంగాకపోలేదు. అందువల్ల 1780లో జాన్ డన్నింగ్ చేసిన "రాజు పలుకుబడి వృద్ధిపొందింది, ఇంకా పెరిగిపోతుంది-దానిని తగ్గించితీరవలె" అన్న ఉపపాదనను కామన్స్‌సభలో అధిక సంఖ్యాకులు ఆమోదించినారు. నార్త్ రాజీనామా చేయగా విధిలేక విగ్ మంత్రివర్గాలను-వరుసగా రాకింగ్‌హామ్, షేల్బర్న్, ఫాక్స్—నార్త్ సంయుక్త (Coalition) మంత్రివర్గాలను రాజు అంగీకరించవలసినవాడయినాడు. 18 అమెరికన్ కాలనీలను బలిగొన్న రాజు విధానాన్ని ప్రజలూ, పార్లమెంటూ గర్హించటంవల్ల జార్జి తలవంచవలసి వచ్చింది. వీలైతే తన వ్యక్తిగత రాజ్యపాలనాన్ని అయన ఉద్ధరించి ఉండేవాడేకాని విగ్ మంత్రివర్గాలను పడదోసిన పిట్ (The Younger Pitt) రాజనీతి వ్యవహార జ్ఞానము కాబినెట్ పరిపాలనా విధానాన్ని కాపాడి అది దేశంలో శాశ్వతంగా వేరూనేటట్లు చేసింది. జార్జ్ రాజు కాబినెట్ అధికారాన్ని తగ్గించడానికి ఎంత ప్రయత్నించినా 1784 నుంచి నిత్యపరిపాలనా విషయాలలో ప్రధానమంత్రి, అతని మంత్రిమండలి నిజమైన అధికారాన్ని చెలాయించినారు. పిట్ రాజనీతజ్ఞతవల్ల కాబినెట్ పరిపాలనా విధానం పరిరక్షింపబడింది. 1798 నుంచి పార్లమెంట్‌లోని అత్యధిక సభ్యుల మద్దతును పిట్ పొందినాడు. జార్జ్ రాజు అయిష్టంగానే పిట్‌ను సమర్థించినాడు. ఇంగ్లండ్‌లోని ప్రజాభిప్రాయం కూడ ప్రభుత్వ విధానాలను బలపరచింది. పిట్ మంత్రిమండలి ప్రజల స్వేచ్ఛను భగ్నపరచడానికి ప్రయత్నించ నందువల్ల, ప్రభుత్వ విధానాలకు మరింత బలం చేకూరింది. పిట్ ప్రజాభిప్రాయాన్ని తనకు అనుకూలంగా మలుచుకున్నాడు. మొత్తం మీద జార్జ్ రాజు కాబినెట్ అధికారాలను తగ్గించటానికి ప్రయత్నించి విఫలుడైనాడని చెప్పవలసి ఉంటుంది.

పిట్ మంత్రివర్గాలను గురించి వినటానికిముందు జాన్ విల్కిన్ ప్రజాభిప్రాయ ప్రకటన స్వాతంత్ర్యానికి చేసిన సేవను తెలుసుకొనవలసి ఉంది. జాన్‌విల్కిన్ విగ్‌పార్టీలో అతివాద వర్గానికి చెందినవాడు. అయిన ఐల్స్‌బరీ నియోజకవర్గ ప్రతినిధి. 'నార్త్ బ్రిటన్' పత్రికకు అధిపతి. బ్యూట్ రాజీనామా చేసిన తరవాత ఫ్రాన్స్ దేశంతో చేసుకొన్న సంధిని ప్రశంసిస్తూ రాజు చేసిన ఉపన్యాసాన్ని నార్త్‌బ్రిటన్ పత్రికలో విల్కిన్ ఖండించినాడు. మాననష్టపు వ్రాతకని విల్కిన్‌ను నిర్బంధంలోకి తీసుకొన్నారు. పార్లమెంట్ సభ్యుని రాజద్రోహానికి తప్ప మరే ఇతర నేరానికి నిర్బంధించరాదని రాజ్యాంగ శాసనము. ఈ శాసనాధారంతో విల్కిన్‌ను నిర్బంధించినారు. అటువంటి అనిశ్చిత నిర్బంధాజ్ఞ (General Warrant) పై విల్కిన్‌నేగాక అధికారులకు అనిష్టులైనా వారిని ఎవరినైనా నిర్బంధంలోకి తీసుకోవచ్చు. ఆ పత్రికలో వ్రాతలువ్రాసిన వారిని, అచ్చొత్తించిన వారిని, ప్రకటించిన వారిని ఎవరినైనా ఎందరినైనా పోలీసులు తమ అధీనంలోకి తీసుకోవచ్చు. 1765 లో సామాన్య నేరాల న్యాయ స్థానము (Court of Common Pleas) ఆ నిర్బంధాలు న్యాయసమ్మతాలు కావని తీర్పు ఇచ్చినాయి. ఆ నిర్బంధాలను 1766 లో కామన్స్‌సభ ఖండించింది.

కోర్టువారు మాననష్టం నేరాన్నిగురించి తీర్పు ఇచ్చేదాకా వేచి ఉండలేక నార్త్ బ్రిటన్ సంచిక మాననష్ట, రాజ ద్రోహకరమైన వ్రాతలు ప్రచురించిందని. దానిని తగులబెట్టించవలెనని తీర్మానిస్తూ కామన్స్ సభవారు విల్కిన్‌ను సభనుంచి వెళ్ళగొట్టినారు. లండన్ సామాన్య ప్రజ అది అన్యాయమని విల్కిన్ పక్షం వహించినా కామన్స్ సభవారి, అధికారుల ఆగ్రహానికి జంకి ఇంగ్లండ్‌నుంచి విల్కిన్ పరారీ అయినాడు. కోర్టు విచారణకు నిలుపక పారిపోయినందువల్ల విల్కిన్‌ను శాసన రక్షణనుంచి బహిష్కృతుని చేస్తూ తీర్మానించడమయింది. కొన్ని ఏళ్ళ తరవాత ఉద్రేకాలు చల్లారగా విల్కిన్ దేశానికి తిరిగివచ్చి మిడిల్‌సెక్స్ ప్రతినిధిగా కామన్స్ సభకు ఎన్నికయినాడు. కాని అంతలోనే స్టేట్ సెక్రటరీ వేమౌత్ ప్రభువుపై నిందాకరమైన వ్రాతలు ప్రకటించినందువల్ల కామన్స్ అతని సభ్యత్వాన్ని తొలిగించింది. మిడిల్ సెక్స్‌లో తిరిగి ఎన్నికలు జరగగా విల్కిన్ పోటీచేసి సభకు ఎన్నికయినాడు. కామన్స్ సభ మండిపడి విల్కిన్ ఎన్నికకు నిలవడానికి అర్హతలేనివాడని, అందుచేత వోట్ల సంఖ్యలో అతనికి తరవాతి వాడైన కర్నల్ లట్‌రెల్ కామన్స్ సభ్యుడయినట్లు తీర్మానించింది. ఈ తీర్మానం రాజ్యాంగ విరుద్ధమైనది. ప్రతినిధులను ఎన్నుకోవలసినది నియోజకవర్గంలోని తన సభ్యులను కామన్స్ సభ తానే ఎన్నుకోవటం అర్థంలేని పని.

సభలో జరిగే చర్చలను, వ్యవహారాలను బహిరంగపరచటం పార్లమెంట్ తన సభ్యుల హక్కులకు భంగకారిగా చాలా కాలంగా పాటిస్తూ ఉండేది. తామన్న మాటలకు, వెలిబుచ్చిన అభిప్రాయాలకు సభ్యులు రాజాగ్రహానికి గురియై ప్రభుత్వం చేతిలో శిక్ష పొందవలసి వచ్చుననే భయమున్నంతకాలం ప్రజాభిప్రాయాన్ని స్వేచ్ఛగా సభలో ప్రకటించలేకపోయినారు. ఈ స్థితి ఉన్నంతకాలం నిజమైన ప్రజాభిప్రాయం ఏర్పడదు ; ప్రకటితం కాదు. వాదవివాదాలకు సభలో స్వేచ్ఛ లేకపోతే ఏది ఉత్తమమైన విధానమో తేటపడదు. అయినా ప్రభుత్వ భయంతో లోకంలో వ్యాపించే వార్తలను రాజు నమ్మరాదని, పార్లమెంట్‌లో జరిగే కార్యాలను గురించి నమ్మదగినది పార్లమెంట్ రిపోర్టులేనని కామన్స్ సభ అపుడపుడు రాజును ప్రార్థించటం వాడుకలో ఉంది. వార్తా పత్రికలు సభ్యుల చర్చలను ప్రకటించటం సభ్యుల హక్కు-

లకు భంగం కలిగించే పనిగా భావించి వాటిని కామన్స్ శిక్షించటం కూడా అప్పుడప్పుడు జరుగుతుండేది విద్యా వ్యాప్తివల్ల ప్రజలు పత్రికలు చదవటం ఎక్కువగా వ్యాపించటంవల్ల తమ ప్రతినిధులు పార్లమెంట్‌లో ఎట్లా తమ విధులను నిర్వహిస్తున్నారో మంత్రుల అభిప్రాయా లెట్లా ఉన్నాయో తెలుసుకోవలెననే కుతూహలం ఇంగ్లండ్ ప్రజలలో చాలా వృద్ధిపొందింది. అందువల్ల వార్తాపత్రికలు తాము సేకరించ గలిగినంతవరకు పార్లమెంటరీ వ్యవహారాలను గురించి వార్తలను ప్రకటించసాగినాయి. పత్రికలు తమ సంక్షిప్త లేఖకులను (Short Hand Reporters) పార్లమెంట్ సమావేశాలకు పంపడానికి పార్లమెంట్ అనుమతించనందువల్ల జ్ఞాపకంపై ఆధారపడి వారు వార్తలను పత్రికలకు అందచేసేవారు. వార్తాహరులు, పత్రికలు రాజకీయావేశాలకు లోబడకపోరు కాబట్టి వారు ప్రచురించే వార్తలు, వ్యాఖ్యలు ఒక్కొక్క ప్పుడు అతిశయోక్తులుగాను, సత్యదూరాలుగాను ఉండటంవల్ల కామన్స్‌కు పత్రికల వారిపై ఆగ్రహం కలిగి, వాటి ప్రకటన స్వాతంత్ర్యాన్ని శిక్షార్హం చేయటంలో ఆశ్చర్యమేమీ లేదు.

1771 లో విల్కిన్ ప్రోద్బలంవల్ల కొన్ని వార్తా పత్రికలు సభ్యుల పేర్లిచ్చి కామన్స్ సభలోని వారి ఉపన్యాసాలను ప్రకటించినాయి. తక్షణమే వాని ముద్రాపకులను నిర్బంధం లోకి తీసుకోవలెనని కామన్స్ సభ తీర్మానించింది. ముద్రాపకులు ఆ తీర్మానాన్ని లెక్కచేయ లేదు. వారిని నిర్బంధించవలెనని రాజుచేత ప్రకటన చేయించి ఆ ప్రకటనలో పేర్కొన్న మిల్లర్, ష్వీబిల్‌లను నిర్బంధంలో ఉంచినారు. ఆ ప్రకటనలో ఏ చట్టాన్ని వారు అతిక్ర మించినారో చెప్పలేదు కాబట్టి వారిని నిర్బంధించటం చట్ట విరుద్ధమంటూ లండన్ కార్పొరేషన్ మేయర్, ఆల్‌డర్‌మాన్ విల్కిన్‌లు ఇద్దరూ ష్వీబిల్, మిల్లర్‌లను విడుదలచేయించినారు. వారిద్దరి పక్షాన ప్రజలు ప్రకటించిన మహోత్సాహానికి జంకి కామన్స్ సభ ప్రజాభిప్రాయా నికి తల ఒగ్గింది. 1884 వరకు ప్రేక్షకుల గాలరీలో పత్రికల ప్రతినిధులు కూర్చొని విన్న చర్చలను వీలైనంతవరకు జ్ఞప్తిలో ఉంచుకొని తమ పత్రికలలో ప్రకటన కిచ్చేవారు. పార్ల మెంట్ చర్చలను ప్రకటించటమే నేరమనేమాట ఇంతటితో సమసిపోయింది. సత్యదూరమైన వార్తలు మాత్రమే ఇకపై శిక్షార్హమయినవి. ఈ విధంగా పత్రికా స్వాతంత్ర్యాన్ని, ప్రజాభి ప్రాయ ప్రకటన స్వాతంత్ర్యాన్ని పోరాడి సాధించిన ఘనత విల్కిన్‌కు దక్కింది. ప్రజల స్వాతంత్ర్యం మరొక్కమెట్టు పైకి పోయింది. పార్లమెంట్ సభ్యులు తమను ఎన్నుకొన్న వారి అభిప్రాయాలను గౌరవించవలసిన అవసర మేర్పడింది. క్రమంగానే సభ్యులు ఒక చట్టానికి అనుకూలంగాగాని ప్రతికూలంగాగాని వోటు చేసినారో లేదో ఈ పత్రికలు ప్రక టించడం మొదలు పెట్టినాయి. పార్లమెంట్ సభ్యులలో ప్రజలపట్ల తమ బాధ్యతను గుర్తించ టంలో శ్రద్ధ, ప్రజలలో రాజకీయ చైతన్యం బాగా వృద్ధి పొందినాయి.

1771 లో విల్కిన్ జయప్రదంగా సాగించిన ఉద్యమానికి 21 ఏళ్ల తరవాత 1792లో ఫాక్స్ ప్రవేశపెట్టిన మాననష్టమైన వ్రాతల శాసనాన్ని (Libel Act) పార్లమెంట్ ఆమో దించటంవల్ల పరిపూర్ణత కల్గింది. మాననష్టకరవు వ్రాత అని ప్రభుత్వంగాని, పార్లమెంట్ గాని భావించేది పత్రికల దృష్టిలో చాలా సబబైన విమర్శనం కావచ్చు. ఇట్లాంటి వ్రాతల మీద శిక్ష వేయటంగాని వేయకపోవడంగాని న్యాయాధికారి చిత్తవృత్తిపై ఆధారపడిన విష యము. సామాన్యంగా న్యాయాధికారులు ప్రభుత్వాధికారం వైపు మొగ్గు చూపేవారుగా ఉండటం వల్ల వారిచ్చే న్యాయం పత్రికల వారికి అన్యాయంగా పరిణమించేది. అందుచేత ఒక వ్రాత

నిందాకరము, మాననష్టకరము అయినదా కాదా జడ్జి నిర్ణయించక ఆ నిర్ణయాన్ని ఒక విధంగా ప్రజలకు ప్రతినిధులైన జ్యూరీలకు వదలివేయవలెనని 1792లో ఫాక్స్ ప్రవేశపెట్టిన శాసనము నిబంధించింది. తరువాత పత్రికలు తమ వ్రాతల తీవ్రతలో పేట్రేగిపోయినవి. ప్రభుత్వాన్ని బెదదిట్టినా ఆ వ్రాతలవల్ల ప్రజలను శాంతి భంగకారులైన చర్యలకు ప్రోత్స హించనంత కాలం, పత్రికలు నిర్భయంగా వ్యవహరించగలిగినాయి. మంత్రులూ పార్లమెంట్ సభ్యులూ పత్రికల అభిప్రాయమంటే భయపడవలసిన నూతన యుగం ప్రజాపరిపాలన చరిత్రలో ఆవిర్భవించింది.

1782 సం. తరవాత మూడో జార్జ్‌కి తన మంత్రులతోను, పార్లమెంట్‌తోను సంబం ధాలు బాగున్నాయి. అమెరికన్ కాలనీలు మాతృదేశాన్ని ఎదుర్కోవటానికి చాలా కాలంగా ఇంగ్లండ్ అనుసరిస్తున్న వలస విధానమే ముఖ్యకారణము. ఈ విధానంలోని ముఖ్యోద్దేశము కాలనీలు మాతృదేశ పరిశ్రమలకు కావలసిన ముడి సరకులను చౌకగా సరఫరాచేసి యంత్రాలు తయారుచేసిన వస్తువులను కొనుగోలు చేస్తుండవలెనని, కాలనీల ఈ దిగుమతి ఎగుమతులు బ్రిటిష్ ఓడలే చేయవలెనని ఇంకొక నిర్బంధం ఉండేది. ఇతర బ్రిటిష్ కాలనీల నుంచిగాని, సామ్రాజ్యం నుంచిగాని, ఇతర స్వతంత్రదేశాల నుంచిగాని వస్తువులను మొదట ఇంగ్లండ్‌కు పంపి తరవాత ఇంగ్లండ్ కాలనీలకు పంపవలెనని, ఈ వ్యాపారమంతా బ్రిటిష్ ఓడలలోనే జరగవలెనని నిబంధన ఉండేది. ఇంగ్లండ్‌లో తాము అనుభవించలేని మత స్వాతంత్ర్యాన్ని కోరి అమెరికాలోని ఇంగ్లీష్‌వారు కాలనీలను ఏర్పరిచినారు. ఏడేళ్ళ యుద్ధంలో 13 అమెరికన్ కాలనీల రక్షణకు ఇంగ్లండ్ చాలా వ్యయం చేసిందని, ఇంగ్లండ్ నుంచి అమెరికాకు పంపే కాగితాలు, గాజుసామాను వంటి వస్తువులపై కొంత దిగుమతి పన్ను విధించవలెనని, కొను గోళ్ల, అమ్మకాల, ఋణాల వ్రాతకోతలు బ్రిటిష్ స్టాంపు కాగితాలపైనే జరగవలెనని మూడో జార్జ్ మంత్రులు పట్టుబట్టినారు. బ్రిటిష్ పార్లమెంట్‌లో అమెరికన్‌లకు ప్రాతినిధ్యం ఇవ్వందే ఆ పార్లమెంట్ వేసే పన్నులను తాము కట్టమని అమెరికన్‌లు ఎదురు తిరిగినారు. పన్నులు విధించే, శాసనాలు చేసే అధికారాలకోసం బ్రిటిష్ ప్రభుత్వంతో పోరాడిన బ్రిటిష్ జాతివారే అమెరికన్ కాలనీల వారనేమాట మూడో జార్జ్ మరిచిపోయినాడు. ఆయన నార్త్ ప్రభువువంటి తన మంత్రుల సలహాలను సరకుచేయక బలప్రయోగంచేసి కాలనీల వారిని దారికి తేవలెనని ప్రయత్నించినాడు. ఫలితంగా 1776 జూలై నాలుగవ తేదీన 13 కాలనీల ప్రతినిధులూ సమావేశమై ఇంగ్లండ్‌తో సంబంధాన్ని తెంచుకొని తమ స్వాతంత్ర్యాన్ని ప్రకటించినారు. అయిదేళ్ళు వారు స్వతంత్ర అమెరికన్ రాష్ట్ర రాజ్యాంగ నిర్మాణానికి పరిశ్రమించినారు. 1781 లో అమెరికన్ సంయుక్త రాజ్య సృష్టి జరిగింది. ఆ రాజ్యాంగ పీఠికలో మానవులంతా స్వతంత్రులుగా సమానులుగా పుట్టినారని ఉద్ఘాటించినారు. ఈ ఉద్ఘాటనలు భావికాలంలో రాజకీయాది స్వాతంత్ర్యాలకు, మానవత్వానికి ఇంగ్లండ్, ఫ్రాన్స్ మొదలైన దేశాలలో పోరాడిన స్వాతంత్ర్య యోధులందరికీ ధైర్యోత్సాహాలను ఇచ్చినాయి.

విగ్ నాయకుడు చార్లెస్ ఫాక్స్, నార్త్ ప్రభువులు కలిసి షెల్‌బర్న్ ప్రభువు మంత్రి వర్గాన్ని కూలదోసి తమ మంత్రివర్గాన్ని ఏర్పరచినారు. కాని తమ అధికారాన్ని నిలుపుకోవ టానికి వారు తొక్కిన అడ్డదారులు చూసి పార్లమెంట్ సభ్య అనేకులు వారిని అసహ్యించు కొన్నారు. 1783 లో ఇండియా పరిపాలనను చక్కబరచటానికి ఒక చట్టాన్ని (Bill for

the better Government of India) ఫాక్స్ ప్రవేశపెట్టినాడు. కామన్స్ సభలో నెగ్గిన ఆ బిల్లు ప్రభువుల సభలో చర్చకు రాగా అక్కడ దానిని ఓడించటానికి, ఆ బిల్లు కనుకూలంగా వోటుచేసిన వారిని తన శత్రువులుగా పరిగణిస్తానని ప్రచారం చేయటానికి టెంపిల్ ప్రభువును రాజు నియమించి ఆ బిల్లు ప్రభువులసభ తోసివేసేటట్లు చేయగలిగినాడు. వెంటనే ఫాక్స్ - నార్త్ మంత్రివర్గాన్ని ఆయన రద్దు చేసినాడు. ఛాథామ్ ప్రభువు రెండో కుమారుడైన 24 ఏళ్ళ విలియమ్ పిట్‌ను ప్రధానమంత్రిని చేసినాడు. షెల్‌బర్న్ ప్రభుత్వంలో ఎక్స్‌ఛెకర్ ఛాన్సలర్‌గా ఉన్నవాడే ఈ పిట్. ఆయన మంత్రివర్గానికి పార్లమెంట్‌లో మెజారిటీ లేదు. అందువల్ల పార్లమెంట్‌ను సమావేశపరచకుండా కొన్ని నెలలు పిట్ పరిపాలన చేసి ప్రజాభిప్రాయం తన కనుకూలమయ్యేదాక చూసి పార్లమెంట్‌ను రద్దు చేయించి ఎన్నికలు జరిపించినాడు. 1784 లో జరిగిన పార్లమెంట్ సాధారణ ఎన్నికల (General Elections) ఫలితం పిట్‌కు అనుకూలమయింది. అంతటితో 1688 నుంచి 1784 దాకా అధికారంలో ఉన్న విగ్ పార్టీ పతనమై ఇంచుమించు ఒక 45 ఏళ్ళు టోరీ పక్షం రాజ్యచక్రం తిప్పింది. కాని టోరీ మంత్రివర్గ మేర్పడినా అధికారం మాత్రం ఆయన ఆశించినట్లు రాజు చేతులలోకి రాలేదు. పాపం పసివాడుగదా అని రాజు అనుకొన్నాడు గాని విలియమ్ పిట్ ఏకై వచ్చి మేకై తేలినాడు. (17 ఏళ్ళు ఆయన ప్రధానమంత్రిత్వం సాగింది). రాజు ఆడించినట్లు ఆడే వాడు కాడు. పిట్ అయినా రాజు పలుకుబడి అంతరించిందని అనలేము. 1707 లో ఇంగ్లండ్ స్కాట్లండ్‌లను ఒక పార్లమెంట్ అధికారం కింద సంఘటితం చేసినట్లే ఐర్లండ్‌ను బ్రిటన్‌తో కలపవలెనని ప్రయత్నంచేస్తూ ఐరిష్ కాథలిక్‌లను లోగట్టుకొనటానికి పార్లమెంట్‌కు కాథలిక్‌లు ఎన్నిక కారాదనే నిబంధనను రద్దు చేయిస్తానని పిట్ మాట ఇచ్చినాడు. కాని జార్జి ఎంతమాత్రం దానికి సమ్మతించలేదు. తన అసమ్మతి తెల్పటానికి పిట్ రాజీనామా చేసినా తిరిగి మంత్రివర్గాన్ని ఏర్పాటుచేసినా తాను ఆ విషయంలో పట్టుబట్టినట్లయితే రాజు పిచ్చివా డవుతాడన్న భయంతో కాథలిక్‌లకు పార్లమెంటరీ సభ్యత్వాన్ని అనుమతించే ప్రయత్నాన్ని అప్పటికి విరమించినాడు. పిట్ మరణానంతరం 1807 వ సంవత్సరాన కాథలిక్‌లకు పార్ల మెంట్ ప్రవేశం కలిగించే ప్రయత్నాన్ని తాము ఎంతమాత్రం చేయబోమని మాట ఇవ్వవలె నని గ్రెన్‌విల్ మంత్రివర్గాన్ని రాజు కోరగా అది ఆ విధంగా చేయటానికి నిరాకరించినందు వల్ల ఆ మంత్రివర్గం పతనమయింది.

## విలియమ్ పిట్ పాత్ర

1784 సాధారణ ఎన్నికలలో అసాధారణ విజయం సాధించి, ప్రధానమంత్రి పదవి చేపట్టేనాటికి పిట్ వయస్సు ఇరువదిఅయిదు సంవత్సరాలు మాత్రమే. 17 సంవత్సరాలు ప్రధానమంత్రిత్వాన్ని నెరపినాడు. టోరీ మంత్రివర్గానికి పెద్ద అయినా, ఉదారభావాలు కల వాడు. చాలావరకు తండ్రి భావాలనే సంతరించుకున్నాడు. పార్లమెంటరీ సంస్కరణలు చేయాలనీ, కాథలిక్‌లపట్ల, ఐర్లండ్‌పట్ల ఉదార విధానాన్ని అనుసరించాలనీ, వర్తక వాణిజ్యా లను పెంపొందించాలనీ, వలస రాజ్యాలను అభివృద్ధిచేయలనీ, నిష్కళంక పరిపాలనా వ్యవస్థను ఏర్పాటుచేయవలెనని కాంక్షించినాడు. తన అభిప్రాయాలను ప్రకటించి వాటికి వ్యతి రేకత ప్రబలంగా ఉన్నదని గ్రహించిన తర్వాత, వాటిని ఆచరణలో పెట్టేందుకు ప్రయత్నం

చక పోవడమే అతనిలో ప్రగాఢంగా కనపడే లోపము. ఉదాహరణకు రిఫారమ్ బిల్లు ప్రతి పాదించి దానికి తన అనుయాయులే వ్యతిరేకత చూపినప్పుడు, పిట్ దానిని ఉపసంహరించు కున్నాడు. అయితే పరిపాలనాదక్షుడుగా పేరు పొందినాడు. ప్రభుత్వ ఖర్చును తగ్గించి, పరి పాలనా విధానాన్ని నిర్దుష్టంగా తీర్చిదిద్దినాడు. అవినీతిని, లంచగొండితనాన్ని రూపుమాపినాడు. ధనికవర్గాల మద్దతు సంపాదించి, ప్రభువుల సభలో వారికి ఎక్కువ ప్రాతినిధ్యం కల్పించి నాడు. స్వేచ్ఛా వ్యాపారవిధానాన్ని, వలస రాజ్య అభివృద్ధిని కాంక్షించినాడు. ఫ్రాన్స్‌తో వ్యాపారసంధి చేసుకొని, ఇంగ్లాండ్ ఫ్రాన్స్‌ల మధ్య వ్యాపారాన్ని వృద్ధిచేసినాడు. కెనడా ప్రభుత్వ వ్యవస్థను నెలకొల్పి, ఆ దేశంలో స్వాతంత్ర్య బీజాలను నాటినాడు. భారతదేశంలో కంపెనీ ప్రభుత్వ వ్యవస్థలోని లోపాలను సవరించడానికి 1784 లో పిట్ ఇండియా చట్టం ద్వారా, బోర్డ్ ఆఫ్ కంట్రోల్ సంఘాన్ని ఏర్పాటుచేసి కంపెనీ పరిపాలనపై ఇంగ్లండ్ ప్రభుత్వ ఆధిక్యతను నెలకొల్పినాడు. పిట్ రూపొందించిన విదేశ విధానంవల్ల ఇంగ్లాండ్ కోల్పోయిన ప్రతిష్ఠను తిరిగి సంపాదించుకుంది. ఫ్రాన్స్‌తో చేసుకున్న వ్యాపార సంధి ఉభయదేశాలమధ్య సంబంధాలను మెరుగుపరచింది. 1768 నుంచి ప్రష్యా, ఇంగ్లాండ్‌ను వ్యతిరేకిస్తునే ఉంది. అటువంటి ప్రష్యాతో పిట్ మంచి సంబంధాలను నెలకొల్పి, ఇంగ్లాండ్, ప్రష్యా, హాలెండ్‌ల మైత్రిని దృఢతరం చేసినాడు. ఇంగ్లాండ్‌కు కీర్తి ప్రతిష్ఠలు సంపాదించే విదేశీ విధానాన్ని అవలంభించినాడు. పిట్ గొప్ప పరిపాలనాదక్షుడు ; రాజనీతిజ్ఞుడు. పిట్ రాజనీతిజ్ఞత వల్లనే కాబినెట్ పరిపాలనా విధానం ఇంగ్లండ్‌లో శాశ్వతంగా నెలకొన్నది.

## మత స్వాతంత్ర్యము : రాజకీయాలు

17 వ శతాబ్దంలో మత పాషండత్వము, వైషమ్యాలు రాజకీయాలను ఎంత కలుషితం చేసినాయో స్టూవర్ట్ రాజుల చరిత్రవల్ల తెలుసుకొన్నారు. కాని 18 వ శతాబ్దంలో మతావేశ, మతద్వేషాలు చాలావరకు చల్లారినాయి. కాథలిక్ - ప్రాటస్టెంట్ వివాదాలు, ఆంగ్లికన్, తదితర ప్రాటస్టెంటెల కలహాలు హనోవేరియన్ వంశం పరిపాలించటం మొదలైనప్పటి నుంచి అడుగునబడి పోవడంతో అనాంగ్లికన్ ప్రాటస్టెంట్‌ల పట్ల సంఘం కొంత ఔదార్యాన్ని చూపించసాగింది. పిమ్మట కాథలిక్‌లను పీడించే శాసనాలేవీ మొదటి జార్జ్ పరిపాలనానికి తరవాత రాలేదు. కాని సామాన్యజనంలో మత విషయాలలో మూర్ఖత్వం మాసిపోలేదు. 1778 లో సర్ జార్జ్ సెవిల్ చట్టం కాథలిక్‌లు భూములను కొనుగోలు చేయవచ్చునని అనుమతించడమేగాక తమ మతానుసారం మతకర్మలు చేయించే కాథలిక్ పురోహితునికి పూర్వ శిక్షాస్మృతిలో ఉన్న యావజ్జీవ కారాగారశిక్షను రద్దు చేసింది. అందుకని ప్రజలు ఉద్రేకించి దౌర్జన్యచర్యలకు పాల్పడినారు (1780) ఈ దౌర్జన్యకాండను గార్డన్ విప్లవ చర్యలు అంటారు. మతసహనోద్యమం క్రమంగా బలం పుంజుకొని 1798 సంవత్సరానికి కాథలిక్‌లు, అనాంగ్లికన్ ప్రాటస్టెంట్‌లు మత విద్యా విషయాలలో సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని పొందినారు. వారు ఆస్తి సంపాదించుకొనరాదనే నిషేధం తొలిగిపోయింది. కాని 1789 లో దౌరన్యపూరితమైన ఫ్రెంచ్ విప్లవం ఇంగ్లండ్ ప్రజలలో రేకెత్తించిన భయాలవల్ల ఈ మత సహనోద్యమం ఇంతకంటె ముందుకు పోలేకపోయింది.

*గ్రేట్ బ్రిటన్, ఐర్లండ్‌ల పార్లమెంటరీ ఐక్యము* (1800): ఏడో హెన్రీ కాలంలో లార్డ్ డెప్యూటీ సర్ ఎడ్వర్డ్ పాయినింగ్స్ ప్రకటించిన ఒక ఐరిష్ స్టాట్యూట్ ప్రకారం ఆర్థిక విషయకంగాని మరే ఇతర విషయాన్ని ప్రివీ కౌన్సిల్ ఆమోదంలేకుండా ఐరిష్ పార్లమెంట్ చర్చకే తీసుకోరాదు. మొదటి జార్జ్ కాలపు ఒక ఇంగ్లీష్ స్టాట్యూట్ ఐర్లండ్ ప్రజలకు సంబంధించిన వ్యవహారాలలో శాసనాలు చేయటానికి ఇంగ్లీష్ పార్లమెంట్‌కు అధికార మిచ్చింది. ఈ చట్టాలను రద్దుచేయవలెనని ఐరిష్ స్వచ్ఛంద సైనికుల నాయకుడు హెన్రీ గ్రాటన్ ఉద్యమం లేవనెత్తినాడు. అమెరికన్ కాలనీలతో ఇంగ్లండ్ పోరాటం తీవ్ర దశలో ఉన్నకాలమది. అందువల్ల 1782 లో రాకింగ్‌హామ్ మంత్రివర్గం ఆ రెండు శాసనాలను రద్దు చేయించింది. ఫలితంగా ఐరిష్ పార్లమెంట్‌కు సంపూర్ణ స్వతంత్ర శాసనాధికారం లభించింది. కాని ఐర్లండ్‌కు సంపూర్ణ స్వాతంత్ర్యం లభించిందని దాని అర్థం కాదు. ఎందుకంటే ఐరిష్ పార్లమెంట్‌కు ఐర్లండ్ పరిపాలక వర్గంపై ఎట్లాంటి అధికారం లభించలేదు. ఐరిష్ ప్రభుత్వా నికి తలవంటివాడైన లార్డ్ డెప్యూటీపై పెత్తనం వాటిని నియమించిన అప్పటి ఇంగ్లీష్ మంత్రివర్గం వారిది. 1793 లో ఐరిష్ పార్లమెంటరీ ఎన్నికలలో వోటుచేసే అధికారం ఐరిష్ కాథలిక్‌లకు ప్రసాదించినారు. కాని ఆ పార్లమెంట్ సభ్యత్వానికి పోటీచేసే అధికారం మాత్రం వారి కివ్వలేదు. వారికి వోటింగ్ హక్కుతోబాటు కలిగిన ఇతర లాభాలు, మతా రాధన స్వాతంత్ర్యం, విద్యాలయాలలో ప్రవేశాధికారం, భూవసతి ఉండటానికి కొనుగోలు చేయటానికి స్వాతంత్ర్యం భూమి కొనుగోలు చేయవచ్చునని చెప్పడంవల్ల వారికి ఒరిగిం దేమీ లేదు. మాటిమాటికి తిరుగుబాట్లు, తిరుగుబాట్లు జరిగినప్పుడెల్ల వారి భూములు జప్తు కావడం ఫలితంగా ఆ దేశంలో సాగయ్యే భూమిలోని పదింట తొమ్మిదిపాళ్ళు అప్పటికే ఐర్లండ్‌లో స్థిరపడిన ఇంగ్లీష్, స్కాటిష్ వ్యవసాయదారులదే. పార్లమెంట్ సభ్యత్వం లేకపోవ డమేగాక మునిసిపల్ కార్పొరేషన్ నుంచి కాథలిక్‌లు బహిష్కృతులయినారు. భూ, నౌకా సేనలలో ప్రవేశాన్ని మాత్రం 1793 చట్టం వారికి కల్పించింది. కాథలిక్‌లకు బ్రిటిష్ పరిపాలనపై ద్వేషానికి ఇంకొక కారణం కూడా ఉన్నది. ఐరిష్ ప్రజలలో ఆంగ్లికన్ ప్రొట స్టెంట్‌లు చాలా కొద్దిమంది. కాని ఐర్లండ్‌లోని ప్రభుత్వంవారి చర్చికి, దాని పోషణకు ఐరిష్ కాథలిక్‌లు విధిగా సుంకాలు చెల్లించవలసి ఉండటం వారికి గుండె గాలమై పోయింది. ఇన్ని కారణాలు సమకూడినందువల్ల ప్రొటస్టెంట్లపట్ల, బ్రిటిష్ కాథలిక్‌లకు చెప్పరానంత ద్వేషం ఉండేది. రేపు ఐర్లండ్‌కు స్వాతంత్ర్యం వచ్చినా కాథలిక్ మెజారిటీ ప్రొటస్టెంట్ మైనారిటీ పట్ల కసిదీర్చుకోచూడదా అని అందరికీ అనుమానం ఉండికూడా కాలప్రభావంవల్ల-స్వేచ్ఛా మతసహన వాయువులు అంతటా వీస్తున్నకాలం - కాబట్టి ఐరిష్ ప్రొటస్టెంట్లలోనే ఒక ఉదార మనస్కుల పక్ష మొకటి బయలుదేరింది. వారి నాయకుడే గ్రాటన్. పిట్ కూడా ఉదార మనస్కుడై కాథలిక్‌ల స్థితిగతులను మెరుగుపరచ దలపెట్టినాడు.

ఇది ఇట్లా ఉండగా 1789 లో ఫ్రెంచ్ విప్లవం సంభవించింది. రాజులు, ప్రభువుల, మతగురువుల అవినీతి, భోగలాలసత్వాలూ, జనసామాన్యం పట్ల వారి దార్ష్ట్యచర్యలూ ప్రజాసామాన్యాన్ని ప్రతీకార చర్యలకు పూనుకొనేటట్లు చేసినాయి. సమానత్వము, స్వాతం త్ర్యము, సౌభ్రాత్రమన్న నినాదాలతో బయలుదేరిన ఈ విప్లవం మితిలేని హత్యకాండలకు దిగటంవల్ల ప్రజోద్యమాలంటే ఇరుగు పొరుగు రాజ్యాలలో భీతి వ్యాపించింది. ఐర్లండ్

కాథలిక్ ప్రజలు అ.గాంగ్లికన్ ప్రొటెస్టెంట్‌లను తమతో కలుపుకొని 1798 విప్లవాన్ని ప్రారంభించినారు. ఫ్రాన్స్ సైన్య సహాయం పంపిస్తా నన్నదేగాని ఆ ప్రయత్నం కార్య రూపం తాల్చలేదు. కాని ఈ ప్రొటెస్టెంట్‌లు విప్లవంనుంచి విడిపోయినారు. విప్లవకారుల దౌర్జన్య కృత్యాలూ ప్రొటెస్టెంట్, ఇంగ్లీష్ ప్రభుత్వాల ప్రతికూల హింసాకాండా కాథలిక్ ప్రొటెస్టెంట్‌ల వైమనస్యాన్ని, విద్వేషాన్ని అధికం చేసినాయి. విప్లవం అణిచివేసిన తరవాత ఐర్లండ్‌లోని ఈ అనర్థాలన్నిటికీ మూలమైన ప్రొటెస్టెంట్‌ల ఆధిక్యాన్ని అంతంచేయటానికి పిట్ నిశ్చయించి ప్రత్యేకంగా ఐరిష్ పార్లమెంట్ అనే సంస్థ ఉండరాదని, దానిని రద్దు చేయటానికి ఆ పార్లమెంట్‌లోనే ఒక బిల్లును ప్రవేశపెట్టించి దాన్ని ఆమోదింపజేసినాడు. తన ఉనికిని తానే పోగొట్టుకోటానికి ఆ పార్లమెంటే అంగీకరించటం ఎట్లా సాధ్యమయిందంటే అది నిజమైన ప్రజాప్రతినిధి కాదుగనక. ఐరిష్ పార్లమెంట్‌కు ప్రతినిధులను ఎన్నుకొనే 118 పట్టణాలలో 110 పటణాలు కొద్దిమంది వ్యక్తుల అధీనంలో ఉన్నవి. ఆ వ్యక్తులకు తగిన పరిహారమిచ్చి బిల్లును వారి సమ్మతిని పిట్ సంపాదించినాడు.

*ఐర్లండ్‌ను ఇంగ్లండ్‌తో సంఘటితంచేసే శాసనము* (1800)ః బ్రిటిష్ పార్లమెంట్‌లోని ప్రజాసభకు (House of Commons) ఐర్లండ్ నూరుమంది సభ్యులను ఎన్నుకొనేటట్లు, ఐరిష్ ప్రభువులు 28 మంది ప్రభువులను తమ ప్రతినిధులుగా ఇంగ్లీష్ ప్రభువుల సభకు పంపేటట్లు, ఐరిష్ చర్చికి ప్రతినిధులుగా నలుగురు చర్చి ప్రభువులకు ప్రభువుల సభలో స్థానం ఉండవలసినట్లు ఐర్లండ్ సమైక్యశాసనము నిబంధించింది. ఐర్లండ్‌లో పూర్వ ముండినట్లే ఆంగ్లికన్ చర్చి ఇకముందుకూడా ప్రభుత్వ పోషణలో ఉండవలసినట్లు నిశ్చయించినారు. ఇంగ్లీష్ శాసనాలకు, ఐరిష్ శాసనాలకు వ్యత్యాసం అంతగా లేనందువల్ల రెండు దేశాల ఐక్యానికి పెద్ద అడ్డంకి లేకపోయింది. ఐర్లండ్ - ఇంగ్లండ్ దేశాల మధ్య సంపూర్ణ వ్యాపార స్వాతంత్ర్యాన్ని ఈ చట్టం ఏర్పాటుచేసింది ఐరిష్ ప్రొటెస్టెంటతోబాటు కాథలిక్‌లకు కూడా బ్రిటిష్ పార్లమెంట్‌కు ఎన్నుకొనే హక్కును ఇచ్చి ఐరిష్ - ఇంగ్లీష్ సమైక్యాన్ని సుస్థిరం చేయవలెనని పిట్ ఎంతో ప్రయత్నించినాడుగాని మూడో జార్జ్ ఈ ప్రయత్నానికి సైంధవునివలె అడ్డుపడినాడు. పట్టాభిషేక సమయంలో తాను ఇంగ్లీష్ చర్చి హక్కులను, లాభాలను, బిషప్పుల అధికారాన్ని, ఆధిక్యాన్ని నిలబెట్టుతానని ప్రతిజ్ఞ చేసి ఉన్నానని, ఆ ప్రతిజ్ఞకు భంగకరంగా తానిపుడు పోజాలనని ఆయన గట్టిపట్టు పట్టినాడు. పిట్ నిస్సహాయుడై 1801 లో రాజీనామా నిచ్చి మంత్రివర్గంనుంచి తొలిగిపోవలసి వచ్చింది. 29 ఏళ్ళ తరవాత ఇంకొక కాథలిక్ విప్లవం సంభవించినప్పుడుగాని వారిపై ఉన్న అనేక నిర్బంధాలు రద్దు కాలేదు.

1804 లో పిట్ కడపటిసారి ప్రధానమంత్రి అయినప్పుడు ఫాక్స్‌ను తన మంత్రివర్గంలో చేర్చుకోజూసినాడుగాని రాజు పూర్తిగా విరోధించడంవల్ల అది మానుకోవలసి వచ్చింది. 1806 లో పిట్ మరణించగా అతని మంత్రివర్గం కూలిపోయింది. రాజు ఎంత వద్దనుకొన్నా ఫాక్స్ విదేశమంత్రిగా మంత్రివర్గ మేర్పడింది. 1807 లో గ్రెన్‌విల్ మంత్రివర్గం కాథలిక్‌ల మీది నిర్బంధాలను తొలగించే ప్రయత్నం తలపెట్టగా రాజు దానిని రద్దుచేసినాడు. పిట్ మరణానంతరం మధ్య మధ్య విగ్ మంత్రివర్గాలు ఏర్పడినా 1812 లో లివర్‌పూల్ ప్రభువు అధికారానికి వచ్చినప్పటినుంచి 15 ఏళ్ళు ఇంగ్లండ్‌ను టోరీ మంత్రివర్గాలే పరిపాలించినాయి.

లివర్‌పూల్ మంత్రివర్గ మేర్పడటానికి రెండేళ్లకుముందే మూడో జార్జ్‌కి మనశ్చాంచల్యం కలిగి తీరని వ్యాధిగా పరిణమించటంతో ఆయన 1820 లో చనిపోయినా 1810 నుంచే ఆయన పరిపాలనము అంతమయినట్లు భావించవచ్చు.

1801 లో మూడో జార్జ్ కుమారుడు (వేల్స్ రాకుమారుడు) రాజప్రతినిధి కావడానికి తనకు తప్ప మరెవరికీ యోగ్యతలేదని వాదించినాడు. ఈ వాదాన్ని నిరాకరిస్తూ ఈ సందర్భాలలో పార్లమెంటే సర్వాధికారి అని కొన్ని నిర్బంధాలు విధిస్తూ వేల్స్ రాకుమారునే రాజప్రతినిధిని చేస్తూ పార్లమెంట్‌చే పిట్ చట్టం చేయించినాడు. కాబినెట్ మంత్రివర్గం ఇప్పుడు దేశ పరిపాలనలో శాశ్వతస్థానం సంపాదించగా పూర్వం ఇట్లాంటి సందర్భాలలో చేస్తున్న విధంగా రాజ ప్రతినిధికి ప్రత్యేకంగా సలహా సంఘాన్ని పార్లమెంట్ ఏర్పాటుచేయలేదు. అధికారంలోకి రావడానికి ముందే, పార్లమెంటరీ మెజారిటీగల కాబినెట్ మంత్రివర్గపు సత్తాను రుచిచూసిన నాలుగో జార్జ్‌గానీ ఆయన తరవాత పాలించిన బ్రిటిష్ కిరీటాధిపతు లెవరుగానీ కాబినెట్ మంత్రివర్గాన్ని నిర్వీర్యము, నిరర్థకము చేయటానికి మూడో జార్జ్‌వలె ప్రయత్నించినవారు లేరు.

# 12
# పార్లమెంటరీ సంస్కరణలు

**(Parliamentary Reforms)**

18 వ శతాబ్దంలో విశేష ప్రచారం పొందిన ప్రసిద్ధులైన ఫ్రెంచ్ గ్రంథకర్తలలో ముఖ్యులు వాల్తేర్, రూసో, మాంటెస్క్యూ, డిడిరో మొదలైనవారు. 1688 నాటి రక్త రహిత విప్లవం (The Bloodless Revolution) తరవాత ఇంగ్లండ్ సాధించిన సర్వతో ముఖాభివృద్ధి మాంటెస్క్యూ (1689-1755) వంటి ఫ్రెంచి పండితుల దృష్టిని ఆకర్షించింది. మాంటెస్క్యూ రచించిన 'శాసనాల తత్వము' (The Spirit of the Laws) అనే గ్రంథంలో న్యాయశాఖ, శాసనశాఖ, కార్యనిర్వాహక (పరిపాలన) శాఖలు ఇంగ్లండ్‌లో వేరుపడి ఉండటమే బ్రిటిష్ జాత్యాభివృద్ధికి ముఖ్యకారణమని ఆయన వివరించినాడు. అనేక ప్రభుత్వ విధానాలను పరిశీలన చేసినాడు. మంత్రులు, సామంతులు చేసే దుశ్చర్యలను, క్రైస్తవ మతాచారాలను, మతగురువుల భోగలాలసత్వాన్ని వాల్తేర్ (1694-1788) తీవ్రంగా విమర్శించినాడు. మత గ్రంథాలపై మూఢ విశ్వాసం కూడదన్నాడు. రూసో (1712-1778) తన 'Discourses on Arts and Sciences' లో ఆదిమానవులు సహజంగా దయ, న్యాయబుద్ధి కలవారని, సొంత ఆస్తులు ఎప్పుడేర్పడినాయో అప్పుడే వారిలో అసమానత్వము, స్వార్థపరత్వము ప్రబలిపోయినాయని, ప్రభుత్వము, పరిపాలితులు, శిక్షా విధానము అవసరం వల్ల ఏర్పడినాయని వాదించినాడు. స్వేచ్ఛ, సమానత్వము మానవునికి జన్మతః కలిగిన హక్కులని, స్వేచ్ఛా జీవిగా జన్మించి నా మానవుడు అన్ని దేశాలలో శృంఖలాబద్ధుడై ఉన్నాడని ఆయన విమర్శించినాడు. ప్రభుత్వాధికారం ప్రజలలో నిక్షిప్తమైనదని, పరిపాలకులు ప్రజా సేవకులని, వారిచేత నియమితులయినారని, వారి పరిపాలన ప్రజలను తృప్తిపరచకుంటే వారిని తొలగించి ఇతర పరిపాలకులను ఏర్పాటు చేసుకోటానికి ప్రజలకు సర్వాధికారమున్నదని ఆయన ఘోషించినాడు. ఆ విధంగా ఆయన ప్రజాస్వామ్యానికి జనకుడైనాడని స్వాతంత్ర్య ప్రియులు ప్రశంసించినారు. స్వేచ్ఛా సమానత్వాలను సమర్థించే వాక్యాలను అమెరికన్ విప్లవకారులు తమ రాజ్యాంగ శాసన పత్రికలో పొందుపరిచినారు. ఆ కాలం వాడయిన థామస్ పెయిన్ "మానవుని హక్కులు" (Rights of Man) అనే తన పుస్తకంలో అమెరికన్ (1776), ఫ్రెంచ్ (1789) ప్రజా విప్లవాలను ప్రోత్సహించే, సమర్థించే వ్రాతలు లిఖించినాడు. ఈ పెయిన్ మత స్వాతంత్ర్య ప్రియుడు. అంటే స్వాతంత్ర్యమెక్కడ ఉందో అది నా దేశమని అనటంతో తృప్తిపడక ఏ దేశంలో స్వాతంత్ర్యం లేదో అదే నా దేశమని ప్రకటించి ఫ్రెంచ్ ప్రజల స్వాతంత్ర్య సమరంలో పాల్గొనటానికి విప్లవ కాలంలో ఫ్రాన్స్‌కు తరలివెళ్ళినాడు. బ్రిటిష్ ప్రజలలో ఫ్రెంచి రచయితలు మత, ఆర్థిక, రాజకీయ స్వాతంత్ర్యాలను దర్శించి అన్ని విధాలా అది అప్పటి వారి అభ్యుదయానికి కారణమని భావించినారు.

*అమెరికన్ సంయుక్త రాష్ట్రాల స్థాపన:* అమెరికన్ కాలనీలకు వలసపోయి అక్కడ 13 కాలనీలను స్థాపించినవారు ప్రధానంగా ఆంగ్లజాతివారు. ఆ వలసరాష్ట్రాలు వేటికవి మాతృదేశ ప్రభుత్వంతో సంబంధా లేర్పరచుకొన్నవి. వారికి ఎట్లాంటి ఆర్థిక, రాజకీయ స్వాతంత్ర్యమూ లేదు. వారికున్న పరిపాలనాధికారాలు బ్రిటిష్ రాజూ, బ్రిటిష్ పార్లమెంటూ ప్రసాదించినవే. ఆ పార్లమెంట్‌లో అమెరికన్ ప్రజలకు ఎట్లాంటి ప్రాతినిధ్యమూ లేదు. ఇతర దేశాలతో స్వతంత్రంగా వర్తకం సాగించే హక్కు కూడా ఆ కాలనీలకు లేదు. మాతృదేశంలో లేని మత స్వాతంత్ర్యాన్ని కోరి వారు అమెరికాకు వలసపోయినారు. అమెరికాకు పోవడానికి ముందు ఇంగ్లండ్‌లోని ప్రజాస్వామ్యానికి, పార్లమెంటరీ అధికారాలకు అలవాటు పడినారు. అవి తమ పూర్వులవల్ల తమకు సంక్రమించినవని తలచేవారు. ఇప్పుడు ఫ్రెంచ్ రచయితల వ్రాతలవల్ల సమానతా స్వాతంత్ర్యాలు బ్రిటిష్ జాతివారి వారసత్వం కాదని, మానవజాతికి సృష్ట్యాదినుంచి హక్కులని అమెరికన్ వలసలలోని జనులు తెలుసుకొన్నారు.

*మతవిధానము:* మతవిద్వేషాలు రాజకీయాలనూ ఇంగ్లీష్ ప్రజల జీవితాన్నీ 17 వ శతాబ్దంలో అంతకుముందెన్నడూ లేనంతగా కలుషితం చేసినాయి. రాజులను ప్రజలను సుఖసంతోషాలకు దూరం చేసినాయి. ఒక్క మతానికిచెందిన అనేక క్రైస్తవ శాఖలవారు తమ నమ్మకాలలోని విభేదాలను గోరంతలు కొండంతలు చేసి పరస్పర వినాశాన్ని ఎంతగా కాంక్షించినారో చూస్తే ఇంత వైపరీత్యముంటుందా అని తోచవచ్చుకాని ట్యూడర్ పరిపాలకులు తమ మత విధానాన్ని శిరసావహించని వారిని వందలకొలదిగా మంటలపాలు చేయటం చూసి 18 వ శతాబ్దంలో ఇట్లాంటి మారణకాండ లేదుకదా అని సంతోషించవచ్చు. ప్రభుత్వమవలంబించిన మత విశ్వాసాలను, పూజా విధానాలను వ్యతిరేకించిన వారిని ఏ విధంగానూ హింసిచలేదు కాని (i) అటువంటి వారికి ప్రభుత్వోద్యోగాలను సున్న చుట్టినారు. (ii) విశ్వవిద్యాలయాల నుంచి విద్యార్థులను, అధ్యాపకులను వెళ్లగొట్టినారు. (iii) ఉపాధ్యాయవృత్తి నుంచి తీసివేసినారు. (iv) పార్లమెంట్‌లో ప్రవేశం నిరాకరించినారు. (v) చర్చి ఉద్యోగాలనుంచి తొలగించినారు. (vi) బహిరంగంగా ఇతర మతశాఖల వారు తమ ప్రార్థనాదికాలు చేసుకోకుండా నిషేధించినారు. (vii) అన్నిటికంటె అనర్థకరమైనది ఆంగ్లికన్‌లు కాని వారిని పురబాహ్యులను చేయటం. ఇన్ని విధాల నిషేధాలకూ నిర్బంధాలకూ గురిఅయిన అనాంగ్లికన్‌లు క్రమంగా అంచెలవారిగా స్వాతంత్ర్యం పొందినారు. చివరకు క్రైస్తవేతరులైన యూదులు కూడా మతస్వాతంత్ర్యంలో లాభాలను 19 వ శతాబ్దాంతానికి పొందినారు. మత స్వాతంత్ర్యం పొందినవారికి ఆ స్వాతంత్ర్యంతోపాటు ఇతర పౌరసత్వ లాభాలు కూడా సిద్ధించినాయి.

ఫ్రాన్స్‌తో యుద్ధం ఆరంభమైన సమయాన కాథలిక్ - అనాంగ్లికన్ ప్రాటెస్టెంట్‌ల పిల్లల చదువుల విషయంలో, ఆస్తి సంపాదనలో, మతారాధనలో అంతకుముందున్న న్యాయ శాసనాలు విధించిన నిర్బంధాలు తొలగించినారు. ఫ్రెంచి యుద్ధ జ్వాలలు ఐరోపాను ఆవరించిన తరవాత మూడో జార్జ్ మరణకాలం వరకు మత స్వాతంత్ర్యోద్యమం కొంతవరకు స్తంభించిందనే చెప్పవలసి ఉన్నది. ఇంగ్లీష్ - ఐరిష్ పార్లమెంట్‌లు 1800 లో సమైక్యం కావటానికి ముందు ఐర్లండ్‌లో ఐరిష్ కాథలిక్‌లకు ప్రవేశమున్న సివిల్, మిలిటరీ ఉద్యోగమేదైనా ఇంగ్లండ్‌లో వారు చేయవచ్చునని 1813 లో పార్లమెంట్ ఒక చట్టం చేసింది.

1817 లో సైనిక, నౌకోద్యోగుల ప్రమాణ శాసనము కాథలిక్‌లు, ఆంగ్లికన్‌లుకాని ప్రొటెస్టెంట్‌లు భూనౌకాసైన్యాలలో ఏ ఉద్యోగానికయినా అర్హులన్నది. కాని పరీక్షా శాసనమూ, కార్పొరేషన్ చట్టమూ రద్దు కానందువల్ల ప్రభుత్వ సేవలోగాని, కార్పొరేషన్ సేవలోగాని చేరగోరినవారు ఇంగ్లీష్ చర్చి పద్ధతుల ప్రకారం దేవతా నైవేద్యాన్ని స్వీకరించవలసి ఉంది. అయినా ఏటేటా ఈ చట్టాన్ని ఉల్లంఘించిన వారిని రక్షించటానికి క్షమాశాసనం ఏర్పాటు ఉండేది. కాని కాథలిక్‌లు రాజు చర్చికి పరమోన్నతాధికారి అని ప్రమాణం చేయటానికి అంగీకరించనందువల్ల, దేవతా ప్రసాదం క్రీస్తు రక్త మాంసాలు మాత్రం కావని ప్రమాణం చేయటానికి అంగీకరించనందువల్ల, ప్రవక్తలను పూజించమని ఒప్పుకొనకపోవటంవల్ల మునిసిపల్, ప్రభుత్వపు ఉద్యోగాలలో చేరటానికిగాని పార్లమెంట్ సభ్యులు కావడానికిగాని వీలులేక పోయేది. ఐర్లండ్‌లో కాథలిక్‌లకు వోటున్నా గ్రేట్ బ్రిటన్‌లో వారికి ఆ హక్కును ఇంకా ఇవ్వలేదు. ఈ విధంగా అనేక విధాల కాథలిక్‌లు, ఆంగ్లికన్ ప్రొటెస్టెంట్లు ఇంకా చట్టరీత్యా ఎన్నో ఇబ్బందులకు పాల్పడుతూ ఉండేవారు.

1828 - *నైవేద్య పరీక్షాశాసనము రద్దు* (*Removal of the Sacraments Test*): 20 ఏళ్లగా పై శాసనాన్ని, కార్పొరేషన్ చట్టాన్ని రద్దుచేయవలెననే సూచన ఎన్నిసార్లు చేసినా కార్యరూపం తాల్చలేదు. జాన్ రసెల్ ప్రభువు 1828 లో ఈ రెండు చట్టాలను గురించి విచారించటానికి ఒక కమిటీని నియమించవలెనని ఉపపాదించినాడు. తరవాత అయన ఇంగ్లీష్ చర్చిలో ఆచరణలో ఉన్న విధానంగా నైవేద్యం పుచ్చుకోకుండా ఉద్యోగార్హత రాదనే చట్టాన్ని రద్దుచేయవలెననే చిత్తు చట్టాన్ని ప్రవేశపెట్టినాడు. టోరీనాయకుడు పీల్ ఈ చట్టానికి అనుకూలుడు. అయన సలహాను అనుసరించి ఒక సవరణతో ఆ చట్టాన్ని పార్లమెంట్‌చేత ఆమోదింపజేసినాడు. ఏ ఉద్యోగంలోనైనా ప్రవేశించటానికి పూర్వమే ఆ పదవివల్ల తనకు లభించే అధికారాన్ని, పలుకుబడిని ఆంగ్లికన్ చర్చికి వ్యతిరేకంగా తాను ఉపయోగించనని ప్రకటిస్తే చాలునని ఆ సవరణ. ఆ సవరణను ప్రధానమంత్రి వెలింగ్టన్ ఆమోదించినాడు. ఆ ప్రకటనలో తాను క్రైస్తవమతంలో విశ్వాసం ఉంచి చేస్తున్నానని ఆ వ్యక్తి చెప్పవలె. యూదులు ఆ మాట అన్నతరవాతగాని వారికి పై శాసనంవల్ల ఉద్యోగ లాభం సిద్ధించలేదు. 1800 - పార్లమెంటరీ ఐక్యశాసనం ద్వారా ఐరిష్ కాథలిక్‌లకు ప్రొటెస్టెంట్లతో రాజకీయసమానత్వం సమకూర్చవలెనని పిట్ చేసిన ప్రయత్నం మూడో జార్జ్ మూర్ఖత్వంవల్ల విఫలమయిన తరవాత ఇంగ్లీష్ స్కాటిష్ కాథలిక్‌లు అల్పసంఖ్యాకులు కాబట్టి ఊరుకొన్నా అధిక సంఖ్యాకులైన ఐరిష్ కాథలిక్‌లు తిరుగుబాటు లేవదీస్తామని బెదిరించ సాగినారు. డేనియల్ ఓ కానెల్ అనే ఐరిష్ కాథలిక్ బారిస్టర్ నాయకుడుగా వారు కాథలిక్ సంఘాన్ని స్థాపించినారు. ఐర్లండ్ అంతటా సభలు జరిగి ఉద్రేకపూరితోపన్యాసాలు చేయడం జరిగింది.

1828 లో ఇంగ్లీష్ మంత్రివర్గంలోని ఫిట్జ్ జెరాల్ అనే ఐరిష్ ప్రొటెస్టెంట్ పార్లమెంట్ ఎన్నికకు పోటీచేసినాడు. తాను ఎన్నికైనా ఓ కానెల్ పార్లమెంట్ సభ్యుడు కాలేడు. అయినా అయన పోటీచేసి ఫిట్జ్ జెరాల్‌ను ఓడించినాడు. వెలింగ్‌టన్ ప్రభువు, సర్ రాబర్ట్ పీల్ వారి టోరీ మంత్రివర్గమూ ఐరిష్ కాథలిక్‌లతో యుద్ధం తప్పదని నిశ్చయించినారు. నాలుగో జార్జ్ రాజూ, బిషప్పులలో అధిక సంఖ్యాకులూ కాథలిక్‌లకు లొంగరాదని వాదించి

నారు. ఇంగ్లీష్ ప్రజలలోనూ ప్రభువుల సభలోనూ అధిక సంఖ్యాకుల అభిప్రాయం కూడా అదే. కాని వెల్లింగ్‌టన్ పట్టుదలవల్ల 1829 లో కాథలిక్‌ల అనర్హతల తొలగింపు చట్టం పార్లమెంట్ ఆమోదాన్ని పొందింది. నాలుగో జార్జ్ ఇష్టం లేకున్నా దానికి అంగీకరించవలసి వచ్చింది.

*కాథలిక్‌ల అనర్హతల తొలగింపు చట్టము (1829):* దీనిలోని అంశాలు : 1. గ్రేట్ బ్రిటన్‌లోని కాథలిక్‌లకు ఓటింగ్ హక్కును ఇవ్వడం. 2. ఐరిష్, బ్రిటిష్ కాథలిక్‌లు పార్లమెంట్‌లోని రెండు సభలకు ఎన్నుకోబడవచ్చు. 3. అన్ని మునిసిపల్, ప్రభుత్వ, న్యాయశాఖోద్యోగాలకు కాథలిక్‌లకు అర్హత ఉన్నది. 4. కాని చర్చి కోర్టుల న్యాయాధికార పదవులకు, ఐరిష్ లార్డ్ లెఫ్ట్‌నెంట్ పదవికి, బ్రిటన్‌లో రాజప్రతినిధి పదవికి ఇంగ్లండ్‌లోను ఐర్లండ్‌లోను ఛాన్సలర్ ప్రభుపదవికి కాథలిక్‌లకు అర్హతను కల్పించ లేదు. 5. జెసూట్లకు అట్లాంటి కొన్ని మత సంఘాల సభ్యులకు విరుద్ధమైన నిబంధనలను ప్రొటస్టెంట్ అతివాదుల కళ్ళనీరు తుడవటానికి చట్టంలో చేర్చడమయింది.

కాథలిక్‌లకు ప్రొటస్టెంట్‌లతోబాటు రాజకీయ సమానత్వం ఇప్పటికి లభించింది. కాని ఎన్నడో ఇచ్చి ఉండవలసిన ఈ వరాన్ని ఇన్నాళ్ల కిచ్చినా ప్రభుత్వానికి కాథలిక్‌ల మెప్పేమీ రాలేదు. రచ్చకెక్కి ఆందోళనచేసి బెదిరించి సంఘాలేర్పరచి ఏ హక్కైనా సంపా దించవచ్చునని ప్రజలు గ్రహించినారు. రాజకీయాలలో బహిరంగ ప్రచార యుగంలో బ్రిటిష్ ప్రజలు ప్రవేశించినారని చెప్పవచ్చు.

*పార్లమెంట్‌లో ఇతర మతవర్గాలు:* క్వేకర్లు, మొరేవియన్‌లు, ప్రత్యేకతావాదులు (Separatists) అనే వారు పార్లమెంట్‌లో ప్రవేశించడం నిషేధించే శాసనమేమీ లేకున్నా రాజభక్తి ప్రమాణం కూడా మొదట చేయవలసి ఉన్నందువల్ల ఇప్పటిదాకా పార్లమెంట్ సభ్యులు కాలేదు. అసలు ప్రమాణం చేయడమే వీరి మనస్సాక్షికి విరుద్ధమట. 1837 లో పై అతివాదశాఖల సభ్యులు ప్రమాణానికి బదులుగా మనసారా బ్రిటిష్ పౌరుని ధర్మాలను నిర్వ హించగలమని చెబితే చాలునని శాసనం చేయడమయింది. అనాంగ్లికన్‌లలో కొందరికి ఈ క్వేకర్లు మొదలైనవారికి వలెనే (రాజభక్తి) ప్రమాణం చేయటంలో అభ్యంతరమున్నది. వారందరికి ఇప్పుడు పార్లమెంట్‌లో ప్రవేశం లభించింది. ఏ యే ఉద్యోగాలలో చేరితే ప్రమాణం చేయవలసి ఉన్నదో, ఆ ప్రమాణమేమో ఈ చట్టంలో ఇకముందు చెప్పనవసరం లేకుండా పోయింది.

*యూదుల (Jews) పార్లమెంట్ ప్రవేశము:* అనాంగ్లికన్‌లకు, కాథలిక్‌లకు ఉద్యోగ ప్రవేశము, పార్లమెంటరీ సభ్యత్వం లభించిన తరవాత కూడా బైబిల్ పట్టుకొని రాజభక్తి ప్రమాణం చేయవలసి ఉండటంవల్ల యూదులకు మతసహనచర్యలవల్ల ఏ మాత్రం లాభించ లేదు. "క్రైస్తవమత విశ్వాసిగా" అంటూ ప్రమాణం చేయవలసి ఉండటంవల్ల మునిసిపల్, ప్రభుత్వం ఉద్యోగాలలో యూదులకు ప్రవేశం లభించటం లేదు. 1830 లో యూదుల అనర్హతలను తొలగించటానికి ప్రవేశపెట్టిన చట్టాన్ని, తరవాత ఉపపాదించిన ఈ ఇతర చట్టాలను పార్లమెంట్ తిరస్కరించింది. 1844 నాటి చట్టం యూదులకు కార్పొరేషన్ పట్టణాలలో ప్రవేశార్హత కల్పించింది. 1847 లో కామన్స్ సభకు ఎన్నికైన యూదు కోటీశ్వ రుడు రాత్ చైల్డ్ ప్రభువు క్రైస్తవుడనని ప్రమాణం చేయడానికి నిరాకరించినదువల్ల కామన్స్

సభ్యుడు కాలేదు. 1858, 1867 నాటి చట్టాలు పార్లమెంట్‌లో ప్రవేశానికి యూదులు క్రైస్తవ ప్రమాణం చేయవలెననే ఇబ్బందులను తొలగించినాయి.

*అనాంగ్లికన్ ప్రొటెస్టెంట్లకు విశ్వవిద్యాలయాలలో ప్రవేశము:* 1581 నుంచి ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీ మెట్రిక్యులేట్లు 39 నిబంధనలను అంగీకరించవలసి ఉండేది. 1616లో డిగ్రీలు తీసికొనే వారిపై మాత్రమే పై నియమాన్ని కేంబ్రిడ్జ్ యూనివర్శిటీ విధించింది. కేంబ్రిడ్, ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీలు రెంటిలోను స్కాలర్‌షిప్, ఫెలోషిప్‌లు, హోదాలు, ఉద్యోగాలు అంగ్లికన్‌లకు మాత్రమే ఇచ్చేవారు. 1834 లో ఈ అన్యాయాన్ని సవరించటానికి ప్రయత్నం చేసినా 1854 నుంచి అనాంగ్లికన్‌లకు డిగ్రీలు ఇవ్వవచ్చునని రెండు విశ్వవిద్యాలయాలూ నియమం చేసినాయి. 1871 లో యూనివర్శిటీ పరీక్షా శాసనానికి సవరణ జరిపి ఏ కొద్ది మందికో తప్ప మిగతా ఉద్యోగాలలో అనాంగ్లికన్‌లకు ప్రవేశ మిచ్చింది.

*1868 లో నిర్బంధంగా చర్చి సుంకాల వసూలు రద్దు:* జనులందరూ కాథలిక్ మతానికి చెందిన వారయినప్పుడు గ్రామంలోని చర్చి పోషణకు ప్రతి కుటుంబమూ కొంత చెల్లించే పద్ధతి మొదలయింది. కాని అంగ్లికన్ చర్చి పోషణకు అనాంగ్లికన్‌లు తాము ఎందుకు రేట్లను చెల్లించవలెనని ఆక్షేపించ సాగినారు. తమ తమ చర్చీలకి తాము ఇచ్చుకొనవలసి ఉండగా అంగ్లికన్ చర్చిని ఉద్ధరించే భారం కూడా తమపై మోపటం న్యాయంకాదని అంగ్లికన్ చర్చికి వారు రేట్లు చెల్లించటం నిరాకరించినారు. చాలా కాలం ఈ విషయంలో తర్జన భర్జనలు జరిగిన తరవాత 1868 లో గ్లాడ్‌స్టన్ ప్రధానమంత్రిగా ఉన్నప్పుడు ఈ నిర్బంధపు చర్చి సుంకాలను రద్దుచేసే శాసనం చేసినారు. ఐచ్ఛికంగా చర్చి సుంకాలను చెల్లించటానికి ఏర్పాట్లు జరిగినాయి.

*ఐరిష్ చర్చి తొలగింపు:* 1869 లో ఐర్లండ్‌లో అధిక సంఖ్యాకులు కాథలిక్‌లు. వారు పోగా మిగిలిన ప్రొటెస్టెంట్లలో స్కాచ్ ప్రెస్బిటీరియన్‌లు అధిక సంఖ్యాకులు. మిగిలిన అంగ్లికన్‌ల సంఖ్య అత్యల్పము. అయినా వారి చర్చికని, మతగురువులకని వ్యయంచేసే ప్రభుత్వ ధనం హెచ్చు. ఇంగ్లీష్ ప్రొటెస్టెంట్ల రాజ్యం ఐర్లండ్‌లో స్థాపించటానికి ముందున్న కాథలిక్ మతాదాయాలన్నీ ప్రభుత్వం అంగ్లికన్ చర్చి పరం చేసింది. మతగురువుల సంఖ్య అంగ్లికన్‌ల అవసరాలకు మించి ఉన్నది. క్రమంగా 18వ శతాబ్దంలో దానిలో దుర్లక్షణాలు చాలా ప్రవేశించినాయి. దానిని కాథలిక్‌లూ, ప్రెస్బిటీరియన్‌లూ ఉభయులూ ద్వేషించ సాగినారు. కాథలిక్‌ల అనర్హతలు తొలగించిన తరవాత చాలా కాలానికి 1896 లో దొరతనం వారి అంగ్లికన్ చర్చిని, దాని ప్రత్యేక ప్రభుత్వాదాయాలను గ్లాడ్‌స్టన్ మంత్రివర్గం రద్దు చేసింది. దాని ప్రతినిధులుగా అంతదాకా బ్రిటిష్ ప్రభువుల సభలో ఉన్న నలుగురు ఉన్నత ఐరిష్ చర్చి ఉద్యోగుల సభ్యత్వము ఊడిపోయింది.

*మరికొన్ని ఇబ్బందుల తొలగింపు:* జననాలు, మరణాలు, నామకరణాలు, పెళ్ళిళ్లను గురించిన వివరాలు గ్రామంలోని చర్చి రిజిస్టరులో చాలా శతాబ్దాలుగా నమోదు అవుతుండేవి. బిడ్డల పుట్టుకను గురించి సాక్ష్యం కావలెనని కోరే తలిదండ్రులు తమ బిడ్డలకు అంగ్లికన్ పద్ధతుల ప్రకారం ఊరిలోని అంగ్లికన్ చర్చిలో నామకరణాలు విధిగా చేయించవలసి ఉంది. అనాంగ్లికన్‌ల పెళ్ళిళ్ళ విషయంలో 1753 లో హార్డ్‌విక్ ప్రభువు చేయించిన వివాహశాసనం యూదులు, క్వేకర్‌లుగాని ఇతర ప్రజల వివాహాలు గ్రామంలోని చర్చి (పారిష్) లోనే

ఆంగ్లికన్ కర్మల ప్రకారం జరిపి తీరవలెనని విధించింది. అది ఆంగ్లికన్ మతగురువులకూ, నాన్ ఆంగ్లికన్‌లకూ, ఉభయులకూ కూడని పనిగా తోచింది. చనిపోయిన వారు అనాంగ్లికన్ లయినా ఆంగ్లికన్ చర్చి ఖనన విధానం ప్రకారం వారి చర్చి ఆవరణలోనే పూడ్చవలసి వచ్చింది. చాలా మందికి ఈ పద్ధతులు హృదయశల్యాలయినాయి. అందువల్ల జాన్ రసెల్ ప్రభువు 1886 లో పుట్టుకలూ, చావులూ, పెళ్ళిళ్లు వారి వారికి ఇష్టమైన మత విధానం ప్రకారంగాని, ఏ మతవిధానమూ లేకుండా గాని చేసుకొనవచ్చునని అవి ప్రభుత్వోద్యోగిచేత రిజిష్టర్ చేయించవలెనని శాసనం చేయించినాడు. చర్చిలో పెళ్ళి జరిగినా అద్వైనాన్ని మత గురువు పెళ్ళిళ్ళ రిజిస్ట్రార్‌కు తెలియజేయవలెనని ఈ చట్టం నియమించింది.

ఇక శవాలను పూడ్చే విషయంలో గ్రామ చర్చి ఆవరణంలో ఆ కర్మను నిర్వహించే వ్యక్తి ఇష్టానుసారం ఏ మతవిధి ప్రకారమైనా మతవిధి లేకుండానైనా వారి వారి మతగురువుల చేత జరిపించవచ్చునని 1881 లో ఖనన చట్టాల సవరణ శాసనం నియమం చేసింది.

న్యాయస్థానాలలో సాక్ష్యము: ఇంగ్లీష్ కామన్ లా (Common Law) ప్రకారం, అనాదిగా అమలులో ఉన్న విధానం ప్రకారం ప్రమాణం చేయకుండా ఎవ్వరూ న్యాయ స్థానంలో సాక్ష్యము ఇవ్వటానికి వీలులేదు. క్రైస్తవులలో అనేక శాఖలవారికి ఇట్లా ప్రమాణం చేయటం మనస్సాక్షికి విరుద్ధ చర్య. అందువల్ల సాక్ష్యం ఇవ్వడానికి కొందరు అంగీకరించే వారు కారు. సాక్ష్యం ఇవ్వని వారికి న్యాయశాస్త్ర రక్షణ ఉండదు. 1889 డెన్‌మాన్ చట్టం ప్రకారం క్వేకర్, మొరేలియన్, ప్రత్యేక వాదుల్ల విషయంలో ఉన్నట్లే వారి వారి ఇష్టప్రకారం ప్రమాణం చేయవచ్చునని, లేదా తాము నిజమే చెబుతున్నామని ధ్రువపరిచి సాక్ష్యమిస్తే చాలునని నిర్ణయమయింది. 1888 నాటి ఇంకొక చట్టం ప్రమాణం చేయటంలో తన మనస్సాక్షికి నమ్మకం లేదన్న వ్యక్తి "నేను నిజం చెబుతున్నాను; నిజం కాక తదన్యం చెప్పటం లే"దని ధ్రువపరిచి క్రిమినల్ వ్యాజ్యాలలో సాక్ష్యం ఇవ్వవచ్చునని శాసించింది.

ఈ విధంగా 19 వ శతాబ్దంలో దశలవారిగా మతస్వాతంత్ర్యం విస్తరించింది. దానితో బాటు రాజకీయంగా కూడా వ్యక్తి స్వాతంత్ర్యం వృద్ధిచెందింది. కాని రాజకీయ రంగంలో ప్రజల హక్కులకోసం 1782 నుంచి ఒక శతాబ్దానికి పైగా (1918 వరకు) నిరంతర పోరాటం జరగకుండా సామాన్య ప్రజలకు, కార్మికులకు పార్లమెంటరీ సభ్యత్వమూ, దేశ పరిపాలనలో భాగమూ లభించలేదు. 1500 కు ముందు రాజకీయాధికారం జమీన్‌దారుల, జాగీర్‌దారుల్ల హస్తగతమయి ఉండేది. 16, 17 శతాబ్దాలలో భూస్వాములైన ప్రభువులు ట్యూడర్ల నిరంకుశ విధానంవల్ల, స్టూవర్ కాలపు అంతర్యుద్ధాలవల్ల చితికిపోగా సముద్రాంతర సీమలతో వర్తకం సాగించి లక్షాధికారులైన వణిక్ప్రభువులు, యంత్ర పరిశ్రమలను స్థాపించి కోటీశ్వరులైన పారిశ్రామికులు పార్లమెంట్ రెండు సభలను చేజిక్కించుకొని 18 వ శతాబ్దంలో రాజకీయ ప్రాబల్యాన్ని సంపాదించి ప్రజల పేరిట పరిపాలనాధికారాన్ని స్వార్థానికి వినియోగించుకొన్నారు. ఈ దుస్థితి నుంచి ప్రజాసముదాయాన్ని విముక్తంచేసి దేశపరిపాలనలో వారిని మాననీయులైన భాగస్వాములను చేసే ప్రయత్నాలు 19, 20 శతాబ్దాలలో పెద్ద ఎత్తున సాగి విజయవంతం కాగా ఈనాడు బ్రిటిష్ ప్రజారాజ్యం సార్థకమయింది.

## ప్రజాస్వామ్యవాద వ్యాప్తి

శాసనసభకు బాధ్యత వహించిన కాబినెట్ మంత్రివర్గ ప్రాముఖ్యాన్ని గురించి పిట్ తనను వ్యతిరేకించిన కామన్స్‌తో సాగించిన పోరాటంవల్ల బ్రిటిష్ ప్రజలు కొంత గ్రహించ గలిగినారు. పూర్తిగా వారు గ్రహించడానికి ఇంకొక 25 ఏళ్ళు పట్టినాయి. 1786 లో అమెరికా సంయుక్తరాష్ట్రాల రాజ్యాంగం నిర్మించినప్పుడు శాసనసభకు బాధ్యత వహించిన కార్యనిర్వాహక వర్గ ప్రాశస్త్యం అమెరికన్ నాయకుల మనసుకు వచ్చిఉంటే స్వతంత్రంగా వ్యవహరించే న్యాయ, శాసన, పరిపాలన శాఖలను సృష్టించి ఉండేవారు. కాబినెట్ విధానం పరిణతి పొందకపోతే అమెరికన్ రాజ్యాంగ నిర్మాతలు ఇంగ్లండ్‌లో మూలబడిన ప్రభుత్వో ద్యోగుల ఇంపీచ్‌మెంట్ విధానాన్ని బాధ్యతలు విస్మరించే ప్రభుత్వోద్యోగులను శిక్షించటానికి ఉత్తమ ఆయుధంగా తమ రాజ్యాంగంలో పొందుపరిచి ఉందరు. 1791 లో బ్రిటిష్ పార్ల మెంట్ కెనేడియన్ రాజ్యాంగాన్ని నిర్మిస్తూ శాసన సభకు బాధ్యత వహించే మంత్రివర్గాన్ని దానిలో పొందుపరచలేదు. 18 వ శతాబ్దం ఉత్తరార్ధంలో బ్లాక్‌స్టన్ అనే న్యాయశాస్త్రవేత్త తన వ్యాఖ్యానాలలో (Commentaries) గాని, డిలోమి ఫ్రెంచి చదువరులకోసం రచించిన ఇంగ్లీష్ ప్రభుత్వాన్ని గురించిన గ్రంథంలోగాని ఇంగ్లీష్ కాబినెట్ విధానాన్ని గురించి ప్రస్తావించలేదు. బ్రిటిష్ రాజకీయవేత్తలకు కాబినెట్ విధానాన్ని గురించిన పూర్తి గ్రహింపు 19 వ శతాబ్దం పూర్వార్థంలోగాని కలగలేదు.

18 వ శతాబ్దాంతానికి ఇంకొక్క ప్రభుత్వ లక్షణంకూడా ప్రజల దృష్టిని ఆకట్టు కొంది. పార్లమెంట్‌లో అధిక సంఖ్యాబలంగల పక్షాన్ని ప్రతిబింబించేది కాబినెట్ అయితే ఆ మెజారిటీ పార్టీతోబాటు దాన్ని, దాని విధానాలను విమర్శించే ప్రతిపక్షం కూడా అవసర మనేదే ఆ లక్షణము. ఈ ప్రతిపక్షమే లేకుంటే మంత్రివరంవారు ప్రజాభిప్రాయాన్ని తాము మన్నించవలసిన అవసరాన్ని విస్మరించే భయం కలగవచ్చు. ఈనాడు ప్రతిపక్షంలో ఉన్న వారు రేపటి అధికారపక్షంగా మారవచ్చుననే జ్ఞానం రాజకీయవేత్తల మనస్సులలో క్రమంగా చోటు చేసుకొనసాగింది.

ఆదిలో ప్రీవీ కౌన్సిల్‌లోని అంతరంగిక పక్షంగా రూపుదిద్దుకొన్న కాబినెట్ క్రమంగా ఆ ప్రీవీ కౌన్సిల్‌ను మూలకు నెట్టివేసిన తరవాత తాను సంఖ్యలో పెరగసాగింది. దానిలో ప్రధాన ప్రభుత్వోద్యోగులతోబాటు కొత్తగా స్పష్టమయిన ప్రభుత్వశాఖల అధిపతులకు కూడా ప్రవేశం కలిగింది. కాబినెట్ సభ్యుల సంఖ్య అదే పనిగా పెరుగుతూ పోగా దానిలోనూ అత్యంత ప్రముఖులైన మంత్రులు రహస్య మంత్రివర్గంగా ఏర్పడటం జరిగింది. పరిపాలనా విధానాన్ని నిర్మించే బాధ్యత ఆ రహస్య మంత్రిమండలిదై, ఆ మండలికే కాబినెట్ అనే పేరు పరిమితమయి ఇతర మంత్రుల కూటమికి మంత్రివర్గమనే పేరు స్థిరపడిపోయింది. సామ్యవాద వ్యాప్తి కారణంగా ప్రభుత్వ బాధ్యతలు విపరీతంగా పెరిగిపోతున్న ఈ 20 వ శతాబ్దంలో ఒక్కొక్కప్పుడు మంత్రివర్గ సభ్యుల సంఖ్య యాభైకి మించగా కాబినెట్ హోదా గల మంత్రుల సంఖ్య అయిదారింటికి పరిమితమైన సందర్భాలు ఎన్నో ఉన్నాయి.

## 18 వ శతాబ్దంలో కామన్స్ సభ

మొదటి జార్జ్ రాజులు ఇద్దరి కాలంలో ప్రభుత్వంలో తడపటిమాట పార్లమెంట్‌లోని

దిగువసభ అయిన కామన్స్ సభదే అయింది. కాని 18 వ శతాబ్దంలో ఎప్పుడుగాని, కామన్స్ సభ ప్రజలకు నిజమైన ప్రతినిధి అయి ఉండలేదు. నిరంకుశులైన రాజులను ఎదిరిస్తూ నార్మన్, ప్లాంటజెనెట్ రాజుల కాలంలో 'మహాసభ' (The Great Council) సభ్యులైన పెద్ద భూస్వాములు, లెన్‌కాస్ట్రియన్ రాజుల కాలంలో ఎగువ సభ సభ్యులైన ప్రభువులు తమ అభిప్రాయాలే ప్రజల అభిప్రాయాలని చాటినారు. ఇక ట్యూడర్లకాలంలో రాజులు, రాజులు ప్రభువుల విషయంలో, ప్రజల విషయంలో ఎన్ని ఘోరాలు చేసినా అటు ప్రభువుల సభగాని, ఇటు కామన్స్ సభగాని రాజుల అత్యాచారాలను గురించి నోరెత్తిన పాపాన పోలేదు. స్టూవర్ట్ రాజుల కాలంనుంచి ప్రభువులు, కామన్స్ సభ్యులు కలిసి రాజకీయ విషయాలలోను పరిపాలనలోను రాజుల పెత్తనాన్ని తగ్గించటానికి కృషి చేసినారు. స్టూవర్ట్ పరిపాలన అంతమయ్యే నాటికి రాజులను అధికారహీనులను చేసి పరిపాలనాధికారాన్ని కామన్స్ సభ చేపట్టింది. 18 వ శతాబ్దంలో ప్రభువుల సభలో నిజంగా మిగిలిఉన్న అధికారం అంతగా లేదు. ఇక కామన్స్ సభ ప్రజాసామాన్యానికి ఎంతమాత్రం ప్రాతినిధ్యం వహించి ఉన్నదో పరిశీలిస్తే ఆశ్చర్యం కలగకపోదు. ప్రతిదేశంలోనూ అన్ని కాలాలలోనూ పరిపాలనాధికారం హస్తగతం చేసుకొన్న రాజులుగాని, సైనికాధికారులుగాని, జమీన్‌దారులుగాని, ధనికవర్గంగాని ప్రజలకు నిజమైన ప్రతినిధులమని చెప్పుకోదగినవారు లేరు. 18 వ శతాబ్దంలో ప్రజాప్రాతినిధ్యం ఎంతమాత్రంగా పరిపాలకులలోను, వారి పరిపాలనా విధానంలోను ప్రతిబింబించింది అనేది చూడదగిన అంశము.

18 వ శతాబ్దంలో ప్రజలకు పూర్తి ప్రాతినిధ్యం వహించే సభగా పార్లమెంట్‌ను పరిగణించటానికి వీలులేదు. ధనికవర్గం వారి ఆధీనంలో ఉన్న నియోజకవర్గాలుగల అధీన పట్టణాలు (Pocket boroughs), పాడుపడ్డ పట్టణాలు (Rotten boroughs) చాలా కొద్దిమంది వోటర్లున్న అన్ని ప్రాంతాలలోనూ ఉన్నాయి. ఆ వోటర్ల వోట్లనుకొని తమకు ఇష్టులైనవారు కామన్స్ సభకు ఎన్నుకోబడేటట్లు చూడటానికి కొద్దిమంది సంపన్నులకు వీలుండేది. ఎన్నికలలోనేగాక ఎన్నికల తరవాత కూడా కామన్స్ సభ్యులకు ధనాశ చూపి తమకు ఇష్టం వచ్చిన చట్టాలకు వారు వోటు చేసేటట్లు ధనికులు చూసేవారు. 18 వ శతాబ్దంలో అమలులో ఉన్న ఎన్నికలను గురించిన చట్టాలను 15 వ శతాబ్దం పూర్వార్ధంలో చేయడం జరిగింది. మూడు శతాబ్దాలు గడిచేటప్పటికి అనేక కారణాలనుబట్టి ప్రజలు ఒక ప్రాంతంనుంచి ఇంకొక ప్రాంతానికి కదిలిపోతుండటంవల్ల అనేక పట్టణాలు పల్లెలయినాయి. పల్లెలు పట్టణాలైనాయి. విశేష జనసంఖ్యగల పట్టణాలకు చాలా కొద్ది ప్రాతినిధ్యం మాత్రమే. శిథిలమైన గ్రామాలకు, పట్టణాలకు మారిన జనసంఖ్యనుబట్టి ప్రాతినిధ్యం ఉండేది.

ఆనాటి కామన్స్ సభా నిర్మాణంలో ఇంకొక తీవ్రమైన లోపంకూడా ఉన్నది. 1742 సంవత్సరం లెక్కల ప్రకారం ఆ సభలో ప్రభుత్వోద్యోగుల, పెన్షన్‌దారుల సంఖ్య రెండు వందలు. 1770 లో నార్త్ ప్రభువు ప్రధానమంత్రి అయినప్పుడు కామన్స్‌లో 192 మంది సభ్యులు ప్రభుత్వోద్యోగులు. 1780 లెక్కలను బట్టి కామన్స్ సభ్యులలో సగంకంటె ఎక్కువ మంది కేవలం 6000 మంది వోటర్లు ఎన్నుకొన్నవారు. ఆ సభ్యులు కూడా కొద్దిమంది ప్రముఖులచేత నియమితులయినవారే. ఈ పరిస్థితులలో కామన్స్ సభ్యులలో అనేకులు రాజకీయ సిద్ధాంతాలకు, అభిప్రాయాలకు కట్టుబడి ఉండటం చాలా అరుదైన విషయము. ఏ

రాజకీయ నాయకుని అనుచరవర్గంలో చేరితే తమకు, తమ వారికి ధనలాభ, పదవీలాభాలు కలుగుతాయో ఆ నాయకునే అంటి పెట్టుకొని ఉండేవారు. అంతేగాక పార్లమెంట్‌లో ఈ నాడొక నాయకుని కూటంలో ఉండే సభ్యుడు మరుదినం వేరొక నాయకుని అనుచరవర్గంలోకి మారిపోవటం సర్వసామాన్య దృశ్యంగా ఉండేది. ఈ మహానుభావులను నిజమైన ప్రజా ప్రతినిధులు అనటం హాస్యాస్పదము. పరిస్థితులిట్లాంటివి కనకనే మూడో జార్ రాజైన తరవాత ఇరవై ఏళ్ళకు మించి పార్లమెంట్ అధికారాన్ని కాదనకుండానే దానిని తనచేతిలో కీలుబొమ్మగా చేసి తన ఇష్టం వచ్చినట్లు ఆడించగలిగినాడు.

1782 లో పిట్ ప్రధానమంత్రి కావడంతో కాబినెట్ విధానం ఒకవైపు స్థిరపడటం జరిగింది. దానితోబాటు ప్రభుత్వోద్యోగులు కామన్స్ సభ్యులుగా ఉండే దురాచారాన్ని, పార్లమెంటరీ ప్రాతినిధ్యంలో ఉన్న లోపాలను నిర్మూలించటానికి పిట్ సిద్ధపడినాడు. ఈ ప్రయత్నంలో ఆయన పూర్తిగా విజయం సాధించలేకపోయినా సాధించినంతవరకు అది పరిపాలనలో మూడో జార్ ఆధిపత్యాన్ని తొలగించింది. 1782 లో మొత్తం వోటర్ల సంఖ్యలో ఎనిమిదోవంతు కంటె ఎక్కువగా ఉన్న రెవిన్యూ ఉద్యోగులను వోటర్ల జాబితానుంచి తొలగించినారు. వారందరూ ప్రభుత్వం కోరిన విధంగా వోటు చేసేవారు. సామాన్యంగా పార్లమెంట్ సభ్యులతో నింపిన ఉద్యోగాలు విశేష సంఖ్యలో రద్దు అయినాయి. కాంట్రాక్టర్ల పార్లమెంట్ సభ్యత్వాన్ని నిషేధించడం జరిగింది. రహస్య పెన్షన్‌ల పద్ధతికి స్వస్తి చెప్పడమయింది. వీటన్నిటికంటే పార్లమెంట్ సభ్యులలో నీతి నెలకొనటానికి తోడ్పడింది. ప్రజల వ్యక్తిగత జీవితాలలో 18 వ శతాబ్దాంతాన పరిపాటిగా కనిపించిన సత్ప్రవర్తనాభిలాషేనని జి. బి. ఆడమ్స్ అభిప్రాయము. చాటుగా లంచాలు పుచ్చుకొనటం, తమ పలుకుబడిని కూడని మార్గంలో ఉపయోగించటం అంతటితో అదృశ్యం కాలేదు. కానీ (న్యూకాజిల్, మూడో జార్జి రాజు) పార్లమెంట్ సభ్యులను లోగట్టుకొనటం కోసం అనుసరించిన సిగ్గుమాలిన విధానాలు మాత్రం ఇక ముందెవ్వరూ అంత బట్టబయలుగా అవలంబించలేదు.

## పార్లమెంటరీ సంస్కరణకు దారితీసిన పరిస్థితులు

**ఫ్రెంచి విప్లవము:** 1789 ఆదిలో ఇంగ్లండ్‌లోని ఉదార రాజకీయ భావాలున్నవారు ఫ్రెంచ్ విప్లవాన్ని గురించి విని మహోత్సాహాన్ని ప్రదర్శించినారు. సమానత్వ, స్వాతంత్ర్య, సోదర భావాలను గొప్ప చేస్తూ పోయిన ఫ్రెంచి విప్లవం కొద్ది కాలంలోనే ప్రజా మారణ హోమానికి పూనుకోగా, సమానతా, స్వాతంత్ర్య, సహోదరత్వాలు విప్లవాగ్నిలో జాడిద కాగా బ్రిటన్‌లోని పిట్, బర్క్ మొదలయిన రాజకీయవేత్తలు సమానతా, స్వాతంత్ర్యాలపట్ల తమకున్న ఉత్సాహానికి కళ్ళెం వేయకపోతే ఫ్రాన్స్ దేశంలో సంభవించినట్లే ఇంగ్లండ్‌లోను అనర్థాలు జరగగలవని తలచినారు. ఫలితంలో ఇంగ్లండ్‌లోని సంస్కరణోద్యమం తాత్కాలికంగా వెనకపడింది. సామ్రాజ్య, సముద్రాధిపత్య, ప్రపంచ వాణిజ్యాలకోసం ఇంగ్లండ్, ఫ్రాన్స్ దేశాలు ఉత్తర అమెరికాలో, ఇండియాలో, ఐరోపాఖండంలో సముద్రం మీద జరిపిన పోరాటంలో వాటర్లూ (1815) విజయానంతరం ఫ్రెంచ్ బెడద తప్పిపోగా అంతకాలమూ సంస్కరణోత్పన్నానికి ఇంగ్లండ్‌లో పడిఉన్న అడ్డుకట్ట తొలగిపోయింది. తరవాత ఫ్రెంచ్ రచయితల వ్రాతలు ఇంగ్లండ్‌లోని సంస్కరణోద్యమం మీద తమ ప్రభావాన్ని చూపినాయి.

*పారిశ్రామిక విప్లవము:* 18 వ శతాబ్ది మధ్యంలో పరిశ్రమలలో ఆవిరి యంత్రాలను ఉపయోగించటం ఆరంభమయినది. ఆవిరియంత్రాల వాడుక మొదట నూలు తీయటానికి, వస్త్రాల నేతకు పరిమితమై ఉండి క్రమంగా ఎన్నో ఇతర పరిశ్రమలకు వ్యాపించింది. బొగ్గు, ఇనుము తవ్వకాలు వృద్ధికావడమేగాక ఆవిరివల్ల నడిచే రైళ్ళు స్టీమరులూ దేశమంతటా ముడి సరకులను రేవులనుంచి కర్మాగారాలకు, ఉత్పత్తి అయిన వస్తువులను రేవులకు, అక్కడి నుంచి విదేశాలకు చేరవేయటానికి విశేష సంఖ్యలలో పనిచేయసాగినాయి. ధన ప్రవాహం బ్రిటిష్ రాజకీయాలలోను, సాంఘిక, ఆర్థిక జీవితంలోను కొత్త సమస్యలను తెచ్చి పెట్టింది. వేలకొద్ది కార్మికులు పట్టణాలలో క్రిక్కిరిసి గుమిగూడినందువల్ల వారిలో రాజకీయ చైతన్యం వెల్లి విరిసింది. కొన్ని పటణాలిప్పుడు పల్లె పట్టులుకాగా కొన్ని గ్రామాలు పరిశ్రమలకూ వ్యాపారానికీ కేంద్రాలైన పెద్ద నగరాలయినాయి. ఈ కొత్త నగరాలకు పార్లమెంటరీ ప్రాతినిధ్యం లేకపోవటం, పదుల సంఖ్యలలో వోటరులుండే గ్రామాలకు ఎక్కువ సంఖ్యలో ప్రతినిధులుండటం అనే వైపరీత్యం కళ్లకు కొట్టవచ్చినట్లు కనిపించటాగింది. నలభై షిల్లింగుల ఆదాయమిచ్చే సొంత భూమి కలిగినవారికి వోటింగ్ హక్కు అనేమాట కిపుడు విలువలేకుండా పోయింది. పార్లమెంట్‌లో సగానికి మించి సభ్యులు కొద్దిమంది భాగ్యవంతుల చెప్పుచేతులలో ఉండి వారిచేత నియమితులైనందువల్ల కామన్స్ సభ ప్రజల ప్రతినిధి కావడం హాస్యాస్పదమై పోయింది. అందువల్ల పార్లమెంటరీ ఎన్నికలలో ధనవంతుల ప్రాబల్యాన్ని తగ్గించే పార్లమెంటరీ ప్రాతినిధ్య విధాన సంస్కరణము 19 వ శతాబ్దంలో ప్రధాన సమస్యగా పరిణమించింది. పారిశ్రామిక విప్లవం మొదట గ్రామపరిశ్రమల మీద, వ్యవసాయం మీద పెద్ద దెబ్బతీయగా భూస్వాములు, జమీన్‌దారులు పరిశ్రమ వాణిజ్యాలపై దృష్టి మళ్ళించవలసి వచ్చింది. వారు పరిశ్రమలవల్ల, వాణిజ్యంవల్ల కోటీశ్వరులవుతున్న కుటుంబాల వారితో వియ్యమందగా నూతన ధనిక వర్గం ఒకటి బయలుదేరి సామాన్య ప్రజల ఆర్థిక, సాంఘిక జీవితాలను తమ కబంధ హస్తాలలో చిక్కించుకొనటంతో కార్మికుల సమస్యలను తీర్చి వారికి న్యాయాన్ని చేకూర్చటం ఉదార రాజకీయ వాదుల లక్ష్యమయింది. క్రమంగా కార్మికజనానికి పార్లమెంటరీ ప్రాతినిధ్యం లేనిదే మేలు కలగదనే భావం 19 శతాబ్దం ఉత్తరార్ధంలో విస్తారంగా వ్యాపించింది. ఇన్ని నూతన సమస్యలు ప్రజల దృష్టిని ఆకట్టుకొనటంతో బాటు ప్రపంచ వ్యాప్తమైన తమ సామ్రాజ్య, వాణిజ్యాలు బ్రిటిష్ ప్రజల దృక్పథాన్ని విశాలం చేసినాయి. కొత్త జాతులు, వారి నాగరకతలు, మత విశ్వాసాలూ పరిచితాలైన కారణంవల్ల, మత విషయాలలో వారికి పూర్వ శతాబ్దాలలో ఉన్న సంకుచిత బుద్ధి, పరమతాల పట్ల అసహనము, ద్వేషము సన్నగిల్లటం వల్ల, 18 వ శతాబ్ది ఉత్తరార్ధం నుంచి మతసహనాన్ని ప్రతిఫలింప జేసే అనేక (మత సంస్కరణ) శాసనాలను చేయసాగినారు. రాజకీయాలలోను, ఆర్థికంగాను స్వాతంత్ర్యాన్ని అభిమానించే జాతి మత, సాంఘిక విషయాలలో స్వేచ్ఛా వ్యతిరేక విధానాలను చాలాకాలం సహించలేదు.

## ప్రాతినిధ్య సంస్కరణ

నియోజిత సభ్యుల సంఖ్యను తగ్గించటం, జనసంఖ్యనుబట్టి నియోజక వర్గాల ప్రతినిధుల సంఖ్యను తగ్గించటం లేదా హెచ్చించటం పార్లమెంటరీ ప్రాతినిధ్య సంస్కరణంలో

ముఖ్య ఘట్టాలు. ఛాతామ్ ప్రభువైన (తండ్రి) పిట్ ఈ సంస్కరణావసరాన్ని గురించి 1770 లో పార్లమెంట్‌లో ప్రస్తావించినాడు. 1776 లో అనేక సంస్కరణలు సూచిస్తూ ఒక చిత్తు చట్టాన్ని పార్లమెంట్‌లో ప్రతిపాదించడమయింది. కాని ఐహు సంఖ్యాకులు దానికి వ్యతిరేకంగా వోటు చేసినారు. 1780 లో ఆ సంస్కరణ శాసనాన్ని రిచ్మండ్ ప్రవేశ పెట్టగా దానికి అదే గతి పట్టింది. 1782 లో ప్రాతినిధ్య విధానంలోని లోపాలను విచారించటానికి ఒక సంఘాన్ని నియమించవలెనని పిట్ చేసిన ప్రతిపాదన 20 వోట్లు తక్కువై ఓడిపోయింది. అయినా తన పట్టుదల వదలక 1783 లో తాను కోరిన మార్పులను వేరు వేరు తీర్మానాల ద్వారా పిట్ పార్లమెంట్‌లో ప్రతిపాదించినాడు కాని ప్రయోజనం లేకపోయింది.

1784 లో పిట్ ప్రధానమంత్రి అయినాడు. పార్లమెంట్ ప్రాతినిధ్యాన్ని సవరించవలెనంటూ ఎన్నో విన్నపాలు ప్రభుత్వానికి వచ్చినాయి. 1785 లో ప్రాతినిధ్య సంస్కరణను కోరుతూ సమగ్రమైన తీర్మానాన్ని పిట్ ప్రవేశపెట్టినాడు కాని అది కామన్స్ సభలో ఓడిపోయింది. తీర్మానానికి అనుకూలుర సంఖ్య కంటే ప్రతికూలుల సంఖ్య 74 ఎక్కువ. సంస్కరణల వల్ల తాము అనుభవిస్తున్న లాభాలను పోగొట్టుకొనటానికి కామన్స్ సభ్యులనేకులు ఇంకా సిద్ధపడలేదు.

ఇంతలో (1789) ఫ్రాన్స్‌లో విప్లవం వచ్చింది. స్వాతంత్ర్యం పేరిట ఆ దేశంలో ప్రజ్వరిల్లిన మానవమారణహోమం ఇంగ్లీష్ ప్రజలలో - పరిపాలనాధికారం అనుభవంలో ఉన్న వారిలో - స్వాతంత్ర్యమన్నా, ప్రజల హక్కులన్నా, పార్లమెంటరీ ప్రాతినిధ్య విధాన సంస్కరణమన్నా అనుమానభయోద్రేకాలను రెచ్చగొట్టింది. సామాన్య ప్రజలు వోటింగ్ విధానంలో మార్పులను కోరినా 1790 లో అటువంటి ప్రతిపాదనను పార్లమెంట్ తోసిపుచ్చింది. 1792, 1793, 1797 సంవత్సరాలలో గ్రే చేసిన పార్లమెంటరీ సంస్కరణ ప్రతిపాదనలు పార్లమెంట్‌లో వీగిపోయినాయి. 1792 లో ఇన్నాళ్ళూ సంస్కరణ పక్షపాతి అయిన పిట్ "అపాయకరమైన మార్పులను చేయటానికి ఇది తగిన తరుణం కాదని, ఆ మాటనుబట్టి తనను సంస్కరణవిరోధిగా భావించరాదని ప్రకటించినాడు. ఫ్రెంచ్ విప్లవం ఈ విధంగా ప్రజా రాజ్యాన్ని ఇంగ్లండ్‌లో విస్తరింపజేయటానికి ప్రయత్నించిన రాజకీయోద్యమాన్ని నలభై ఏళ్ళు వెనకకు నెట్టింది. ఈ అనర్థమింతటితో ఆగలేదు. ఎడ్మండ్ బర్క్ (ప్రముఖ ఉదార రాజకీయవాది) 1790 లో ఫ్రెంచ్ విప్లవకారుల అత్యాచారాలను ఖండిస్తూ వ్రాసిన "ఫ్రెంచ్ విప్లవంపై తలపోతలు" అనే గ్రంథం వెంట వెంట 30 ముద్రణలు జరిగి అమ్ముడుపోయింది. ఇట్లా ఉండగా 1793 లో ఫ్రాన్స్ ఇంగ్లండ్‌పై యుద్ధం ప్రకటించింది. ఏ యే దేశాలలో ధనికవర్గం వారు, పరిపాలకులు ప్రజలను పీడిస్తున్నారో ఆ యా దేశాలలో తిరుగుబాటు చేసినవారికి తాము సాయపడగలమని అంతకుముందే ఫ్రెంచ్ విప్లవకారులు ప్రకటించి ఉన్నారు. ఫ్రాన్స్ దేశాన్ని చుట్టుముట్టిన దేశాలలోని కిరీటధారులు అనేకులు ఫ్రెంచ్ ప్రజారాజ్యాన్ని నేలరాయటానికి కాలుదువ్వటం ఆ ప్రకటనకు కారణమయినా కలవారిలో అది ప్రజోద్యమ మంటే తీవ్ర వ్యతిరేకభావాన్ని ప్రజ్వలింప జేసింది. ఈ వ్యతిరేక భావాన్ని థామస్ పెయిన్ వ్రాసిన "మానవుని హక్కులు" (Rights of Man) అనే గ్రంథము, దానికి ప్రజలలో కలిగిన ప్రచారము మరింత ఘనీభవింపజేసినవి. ఫలితంగా అనేక నిర్బంధ శాసనాలు చేయడమయింది. వాటిలోని ముఖ్యాంశాలు: (1) ఇంగ్లండ్‌లోని

పరదేశీయులపై అనేక నిర్బంధాలు విధించటం (2) విచారణ జరపకుండా కారాగారంలో ఉంచడానికి వీలుగా హేబియస్ కార్పస్ చట్టాన్ని తాత్కాలికంగా నిలుపుచేయటం (3) నిందితుని తలకు చుట్టడానికి వీలుగా కొత్త రాజద్రోహ శాసనాన్ని చేయటం (4) దేశద్రోహాన్ని ప్రోత్సహించే సభలపైన, సంఘాలపైన నిషేధ శాసనాలుచేసి వాటిలో కొన్నిటిని బలప్రయోగంతో అణిచివేయడం జరిగింది. రాజద్రోహమవునో కాదో నిర్ణయించే అధికారం పూర్తిగా మాజిస్ట్రేట్ల కివ్వడమయింది (5) ముద్రణాలయాలపై నిర్బంధాలు: వాటి అధికారులు, గ్రంథాలను ప్రచురించినవారు, రచించినవారు తీవ్ర శిక్షలకు గురి కావటం (6) రాజద్రోహపు వ్రాతలను నిషేధించే రాజ ప్రకటనలు (7) సైనికులను అల్లర్లను అణిచివేయడానికి నియమించటం (8) విప్లవం రానున్నట్లు మాటిమాటికి పార్లమెంట్‌ను హెచ్చరించటం సర్వసాధారణ మయింది.

వీటన్నింటికంటె గొప్ప అన్యాయాలను న్యాయస్థానాలే చేసినాయి. సర్వత్రా వ్యాపించిన భయము న్యాయాధికారులను ఆవేశించటం చేత తగిన సాక్ష్యం లేకుండా వారు నేరాలను మించిన శిక్షలను విధించేవారు. ఫ్రాన్స్ ఓడిపోగా దాని భయము అంతరించిన తరవాత ఈ నిరంకుశ చర్యలను గర్హించినవారు ఉన్నారు గాని ఎన్ని అన్యాయాలు జరుగుతున్నా వాటిని ఆ కష్టకాలంలో ఖండించినవారుగాని, కలుగజేసుకొన్నవారుగాని లేరు. ఫ్రెంచి విప్లవ యుద్ధాల ఫలితంగా 1793 తరవాత విగ్ పార్టీలోని మితవాదులను టోరీ మంత్రివర్గంలోకి తీసుకొన్నారు. ఉదార రాజకీయ లక్ష్యాలతో వారు ఫాక్స్ నాయకత్వం కింద కొత్త విగ్ పక్షంగా ఏర్పడినారు. యుద్ధకాలంలో దేశంలోని అన్ని పక్షాలవారూ పిట్ నాయకత్వాన్ని ఆమోదించి ప్రజాస్వాతంత్ర్యంపై ప్రభుత్వం విధించిన నిర్బంధాలను దేశభక్తి ప్రేరితులై సహించినారు. వ్యక్తి స్వాతంత్ర్యానికి అతీతులై ప్రజల దూషణలకు విగ్ అతివాదులు ఫాక్స్ నాయకత్వంలో ప్రచారం సాగించినారు. ఆ కాలంలో రాజకీయ పక్షాలు అవలంబించిన ప్రచార పద్ధతులను చూస్తే మొదటి సంస్కరణ శాసనానికి (The First Reform Bill-1832) ముందు అర్ధశతాబ్దిగా ప్రజలను తమ రాజకీయాలకు సుముఖులను చేసుకొనటానికి ఇంగ్లండ్‌లోని రాజకీయ పక్షాలు ప్రజాభిప్రాయసేకరణనే అనుసరిస్తుండేవని తెలుస్తుంది. సమాజాలు, సంఘాలు, కరపత్రాలు, పత్రికలలో వ్యాసాలు, సభలు, ఊరేగింపులు, నివేదనలు (Petitions), రాయబారాలు, రాజుకు విన్నపాలు - ఇట్లాంటివి ఆ కాలంలో సర్వసామాన్యాలయినాయి. ప్రజల సమస్యలపై సమానాభిప్రాయా లున్నవారందరూ వేరు వేరు రాజకీయ పక్షాలుగా ఏర్పడి పనిచేయటంవల్ల కలిగే లాభాలను ఆ కాలానికే గుర్తించటం ఆరంభించినారు. నెపోలియన్ పతనమైన తరవాత, ఫ్రాన్స్‌వల్ల ఇంగ్లండ్‌కున్న భయం తీరిపోయిన తరవాత, ఫ్రెంచ్ విప్లవ విజృంభణతో ఆగిన బ్రిటిష్ పార్లమెంటరీ సంస్కరణోద్యమం తిరిగి బలం పుంజుకొంది. పారిశ్రామిక విప్లవం ఫలితంగా చిరకాలంగా ఉన్న భూస్వాముల ప్రాభవం తగ్గి పరిశ్రమాధిపతుల, వణిక్ప్రభువుల ప్రాధాన్యం హెచ్చింది. వారితోబాటు మధ్యతరగతి ప్రజలు కూడా ప్రాముఖ్యంలోకి రాసాగినారు. కాని వీరికి, శిథిలావస్థలో ఉన్న పాత పట్టణాలలోని పౌరులకు పార్లమెంట్‌లో ప్రాతినిధ్యం లేదు. ఆ కారణంవల్ల ప్రాతినిధ్య విధాన సంస్కరణకు, పార్లమెంటరీ నియోజకవర్గాల పునర్నిర్మాణానికి, కొత్త, పాత పట్టణాల మధ్య కామన్స్ స్థానాల పంపకంకోసం తలయెత్తిన ఉద్యమానికి వీరి అండదండలు

లభించినాయి. పంట పొలాలను పచ్చిక బయళ్ళుగా మార్చి ఉన్ని ఎగుమతుల మూలంగా లక్షలార్జించటానికి ప్రయత్నించిన భూస్వాముల చర్యలవల్ల పొలాలు పోగొట్టుకొని యంత్ర పరిశ్రమలతో పోటీ చేయలేక కుటీర పరిశ్రమలను విడనాడి నూతన యంత్ర పరిశ్రమలకు కేంద్రాలయి క్రిక్కిరిసిన నగరాలలో కార్మికుల జీవితాలు శోచనీయాలయినాయి. కర్మాగారం యజమానులు చాలీ చాలని కూలీ ఇవ్వడం, మేలు రకం యంత్రాలు కనిపెట్టే కొద్దీ నిరుద్యోగుల సంఖ్య అధికం కావడం ; మగవారిని కాదని స్త్రీలను, బాల బాలికలను, కార్మికులుగా నియమించి వారి చేత మితిమీరి పనిచేయించే విధానము, వీధి పంచలలో బతుకులు గపుడుతూ అవినీతికి, మద్యభూతానికి, అనారోగ్యానికి చిక్కిన కార్మికులలో కూడా 'స్వాతంత్ర్యము, సమానత్వము, పార్లమెంటరీ ప్రాతినిధ్యము' అనే నినాదాలు వ్యాపించడం రాజకీయ చైతన్యం కలిగించినాయి. ఉదార రాజకీయ ఆశయాలకు ప్రసిద్ధికెక్కిన కాబ్డెన్, జాన్ రసెల్ ప్రభువు, పీల్, బ్రైట్, గ్లాడ్ స్టన్‌లు, ఉదార ఆర్థిక విధానాలకు పేరుపొందిన రాబర్ట్ ఓవెన్, మానవతా వాదానికి తనను అంకితం చేసుకొన్న విలియం కాబెట్ మొదలయిన యువకులు పార్లమెంటరీ రాజకీయాలలో అప్పుడే అడుగు పెట్టినారు. కాని అనేక పార్లమెంట్ సభ్యుల మనస్సులు ఇంకా సంకుచితాలై మార్పంటే ఉలికిపడే స్థితిలో ఉన్నాయి. అనేకులింకా భూస్వామ్యవర్గాల అధీనంలోనే ఉన్నారు. తత్ఫలితంగా ప్రభుత్వం స్వాతంత్ర్యోద్యమాన్ని, సామ్యవాద ప్రచారాన్ని అణిచివేయటానికి తీవ్ర చర్యలు తీసుకొన్నది. ఆ తీవ్ర చర్యలలో పీటర్లూ అనే చోట సంభవించిన కార్మికుల హత్యాకాండ ఒకటి. కొత్త రాజద్రోహ శాసనాలను చేయడ మయింది. ఆయుధాలు ధరించరా దన్నారు. హేబియస్ కార్పస్ చట్టాన్ని తాత్కాలికంగా ఉపసంహరించినారు. సభా స్వాతంత్ర్యంపై నిర్బంధాలు విధించడమయింది. కాని కార్మికోద్యమం ఆగిపోలేదు. 1824 లో కార్మికులు తమ స్థితిగతులను బాగుపరచుకొనటానికి సంఘాలేర్పాటు చేసుకోరాదనే చట్టాలు రద్దు చేసినారు. వ్యక్తి స్వేచ్ఛను పెంపొందించే ఇంకొక చర్య 1822-23 లో లివర్‌పూల్ మంత్రివర్గం కావించింది. లివర్‌పూల్ టోరీ పక్షం వాడయినా బ్రిటిష్ శిక్షాస్మృతి కాఠిన్యాన్ని ఎంతో తగ్గించినాడు. 19 వ శతాబ్దారంభంలో ఆ శిక్షాస్మృతిలో రెండువందల నేరాలు మరణశిక్ష విధించతగినవిగా ఉన్నాయి. 35 విధాల ఫోర్జరీ నేరాలకు, ఎన్నో చిన్న నేరాలకు మరణశిక్ష విధించటానికి వీలున్నది. 1822-30 సంవత్సరాల మధ్య శిక్షాస్మృతిలో అనేక సవరణలు జరిగి మరణశిక్షను పెద్ద నేరాలకు మాత్రమే విధించినారు. క్రిమినల్ నేరాలను విచారించే పద్ధతులలో కూడా అభివృద్ధి సాధించడ మయింది. ప్రజాక్షేమాన్ని కోరి చాలా వస్తువులపై దిగుమతి పన్నులు తగ్గించటం, దిగుమతులపై నిషేధాలు రద్దు చేయటం, ఎగుమతులపై ఎగుమతి దారులకు విరాళాలు రద్దు చేయడం, కార్మికులు వలసపోవటం మీద నిషేధం తొలగించటం ఈ కాలంలో జరిగినాయి. ఈ విధంగా వ్యక్తి స్వేచ్ఛను, వ్యాపార స్వేచ్ఛను సమకూర్చే సంస్కరణలు చేయడంవల్ల ప్రాతినిధ్య విధాన సంస్కరణకు దారి సుగమమయింది.

1797 లో గ్రే ప్రతిపాదించిన పార్లమెంటరీ సంస్కరణ శాసనం విఫలమైన తరవాత 1809, 1810, 1818, 1819 సంవత్సరాలలో సంస్కరణకు యత్నాలు జరిగినా కామన్స్ సభ వ్యతిరేకించటంతో వీగిపోయినాయి. జాన్ రసెల్ ప్రభువు ఎన్నిసారులు ఓటమిచెందినా నిరుత్సాహపడక 1820, 1822, 1823, 1826, 1828, 1830 సంవత్సరాలలో ప్రయ

త్నించినాడు. ఇన్ని ప్రయత్నాల ఫలితంగా ప్రజాభిప్రాయం క్రమంగా పార్లమెంటరీ ప్రాతినిధ్య విధాన సంస్కరణకు సుముఖమయింది.

ఈ సందర్భంలో ఒక విషయాన్ని గుర్తు ఉంచుకోవలె. ఇప్పటివరకు సంస్కరణలను సూచిస్తూ అనేక చట్టాలు పార్లమెంట్‌లో ప్రవేశ పెట్టబడినప్పటికి, అవి అన్నీ సఫలీకృతం కాలేదు. అయితే సంస్కరణల కోసం ప్రయత్నాలు నివేదనల రూపంలోను, బహిరంగ సమావేశాల ద్వారాను ఉధృతం చేయబడినవి. ప్రజాభిప్రాయాన్ని గమనించమని వోటర్లు పార్లమెంట్‌కు ఎన్నో నివేదనలు సమర్పించినారు. 1780 తర్వాత విపరీతంగా బహిరంగ సమావేశాలు జరిగినాయి. ఈ ప్రయత్నాలను భగ్నపరచడానికి, పార్లమెంట్ 1795 లో ఒక చట్టాన్ని చేసింది. బలప్రయోగం ద్వారా పార్లమెంట్ మీద ఒత్తిడి తీసుకొనిరాకూడదని శాసించబడింది. తరవాత 50 మందికి మించి వ్యక్తులు రాజకీయ సమావేశాలు జరపకూడదని పార్లమెంట్ ఉత్తర్వు చేసింది. పార్లమెంటరీ సంస్కరణల కోసం ప్రయత్నాలు, ఉద్యమాలు కొనసాగించబడినవి. ఇవి ప్రజాభిప్రాయాన్ని మన్నించకుండా పార్లమెంట్ తప్పించుకోలేదు అన్న విషయాన్ని స్పష్టం చేసినాయి.

పార్లమెంటరీ ప్రాతినిధ్య సంస్కరణల కోసం రాజకీయ సంఘాలు కూడ ఏర్పడినాయి. 1780 లో మేజర్ కార్ట్‌రైట్ రాజ్యాంగ సమాచారాన్ని సేకరించడానికి ఒక సంఘాన్ని స్థాపించినాడు. ఇతడే హాంప్‌డన్ క్లబ్బుల స్థాపనకు కారణభూతుడైనాడు. 1792 లో ఉన్నత వర్గానికి, మధ్యతరగతికి చెందినవారు "ప్రజా స్నేహితులు" అనే పేరుతో ఒక సంఘంగా ఏర్పాటు అయినారు. 1812 నుంచి యూనియన్, హాంప్‌డన్ క్లబ్బులు సార్వత్రిక వోటింగ్ విధానం ప్రవేశపెట్టవలెనని ఆందోళనలు ప్రారంభించినాయి. పార్లమెంట్ ప్రజాభిప్రాయాన్ని మన్నించేందుకు పత్రికలు కూడ ఒక ప్రముఖ సాధనంగా తయారయినాయి.

1830 లో ఐరోపాలో సంభవించిన ఉదారవాద విప్లవాలు ఎన్నో మార్పులను తెచ్చినాయి. ఫ్రాన్స్‌లో పదో ఛార్లెస్ పదభ్రష్టుడై, అతని స్థానంలో లూయీ ఫిలిప్ రాజై రాజ్యాంగబద్ధ రాచరికపు వ్యవస్థను ప్రవేశపెట్టినాడు. ఈ ఉదారవాద తిరుగుబాట్ల ప్రభావం పశ్చిమ ఐరోపామీదనేగాక, ఇంగ్లాండ్‌ను గూడ ప్రభావితం చేసింది. ఈ ఉద్యమం ఇంగ్లాండ్‌లో పార్లమెంటరీ సంస్కరణకు దారి తీసింది. నాలుగో జార్జ్ కాలంలో పార్లమెంట్‌లోని విగ్‌లు ప్రాతినిధ్య విధాన సంస్కరణకు పూనుకున్నారు.

1830 లో నాలుగో జార్జ్ మృతిచెందగా నాలుగో విలియమ్ రాజయినాడు. కామన్స్ సభకు ఎన్నికలు జరిగి సంస్కరణ కనుకూలురైన సభ్యులు అధిక సంఖ్యలో కామన్స్ సభ్యులయినారు. టోరీ మంత్రివర్గం రాజీనామా చేయవలసిరాగా గ్రే ప్రభువు, అతని పక్షంవారు అధికారంలోకి వచ్చినారు. జాన్ రసెల్ ప్రభువు 1831 మార్చి నెలలో సంస్కరణ శాసనాన్ని కామన్స్ సభలో ఉపపాదించినాడు. అది రెండుసార్లు కామన్స్ ఆమోదం పొందినా కమిటీ దశలో ఓడిపోయింది. పార్లమెంట్ రద్దై తిరిగి ఎన్నికలు జరగగా సంస్కరణానుకూలురు అధిక సంఖ్యలో కామన్స్ సభలో ప్రవేశించినారు. సంస్కరణ శాసనం కామన్స్ సభలో నెగ్గింది కాని ప్రభువుల సభ దానిని తోసిపుచ్చింది. టోరీ మంత్రివర్గాన్ని ఏర్పాటు చేయుటానికి వెలింగ్‌టన్ ప్రభువు ప్రయత్నించినాడు. కాని రాబర్ట్ పీల్ వంటి ప్రముఖులే

దానిలో చేరటానికి నిరాకరించినారు. కామన్స్ సభ గ్రే మంత్రివర్గంలో తనకు విశ్వాసమున్న దని తీర్మానించింది. నాలుగో విలియం సంస్కరణల చట్టంలో కొన్ని మార్పులు చేయటానికి గ్రే వర్గాన్ని ఒప్పించవలెనని చూపినాడు కాని వా రంగీకరించలేదు. గ్రే సలహాపై ప్రభువుల సభలో చట్టం ఆమోదించటానికి అవసరమయినంతమందిని ప్రభుసభకు నియోజించటానికి విలియమ్ అంగీకరించినాడుగాని మనస్ఫూర్తిగాకాదు. అందువల్ల వెల్లింగ్‌టన్ ప్రభువుకు అతని పక్షంవారు చట్టంపై వోటు చేసే సమయానికి ప్రభు సభలో ముఖం తప్పిస్తే ఈ బెడద తప్పిపోతుందని చెప్పి పంపించినాడు. అతడు అట్లా చేయగా మొదటి పార్లమెంటరీ సవరణ చట్టం శాసనమయింది (1882). ఈ వ్యవహారాన్ని బట్టి ఒక్క నిజము రుజువయింది. ఏ చట్టాన్ని గురించి కామన్స్ సభ పట్టుబట్టినా ప్రభు సభ కొంతవరకు మాత్రమే అది శాసనం కాకుండా చూడగలదు కాని చివరకు లొంగిపోక తప్పదని తేలిపోయింది.

*పార్లమెంటరీ సంస్కరణ శాసనము (1882)*: 2000 కంటె తక్కువ జనసంఖ్య ఉన్న 56 పట్టణాలకు ప్రాతినిధ్యం తీసివేసినారు. నాలుగు వేలమంది కంటె తక్కువ జన సంఖ్య ఉన్న ముప్పయి పట్టణాలు ఒక్కొక్క ప్రతినిధి చొప్పున పోగొట్టుకొన్నవి. 22 పటణాలకు (అందులో కొన్ని లండన్ నగర భాగాలు) ఇద్దరేసి ప్రతినిధులను ఎన్నుకొనే హక్కు వచ్చింది. వాటికంటె తక్కువ ప్రాముఖ్యంగల ఇరవై ఒక్క పట్టణాలు ఒక్కొక్క సభ్యుని కామన్స్ సభకు ఎన్నుకొనే హక్కు పొందినాయి. కౌంటీలు మునుపటికన్నా 65 మంది సభ్యులను అధికంగా కామన్స్ సభకు పంపే హక్కు సంపాదించినాయి. స్కాటండ్‌కు ఎనిమిది మందిని, ఐర్లండ్‌కు అయిదుగురిని అధికంగా కామన్స్ సభకు ఎన్నుకొనే ఏర్పాటు జరిగింది.

*వోటింగ్ హక్కును గురించి చేసిన నిబంధనలు*: కౌంటీలలో మునుపటివలె 40 షిల్లింగ్‌లు సంవత్సరాదాయమిచ్చే సొంత భూమి ఉన్న వారికే గాక సంవత్సరానికి 50 పౌన్లు మక్తా చెల్లించే భూఖామందులకు అన్నిరకాల రైతులకు వోటింగ్ హక్కు ఇవ్వడం జరిగింది. పట్టణాల్లో సంవత్సరానికి 10 పౌన్లు అద్దె రాగల ఇళ్ళలో ఉన్నవారికే వోటుహక్కు వచ్చింది. స్కాటండ్, ఐర్లండ్‌లకు ప్రత్యేక సంస్కరణ చట్టాలను చేసినారు.

*1882 సంస్కరణ శాసన ఫలితాలు*: కామన్స్ సభకు వోటర్ల మొత్తం సంఖ్య నూటికి 50 వంతులు పెరిగింది కాని కామన్స్ సభా స్వరూపంలో మార్పేమీ రాలేదు. వోటింగ్ అవినీతి సంపూర్తిగా సమసిపోలేదు. వోటర్‌గా రిజిస్ట్రేషన్ కావడానికి కావలసినన్ని అర్థంయులు వస్తున్నందువల్ల చెప్పదగినంతగా వోటర్ల సంఖ్య వృద్ధికాలేదు. ఆస్తిపరులకు, పెద్ద కుటుంబాల వారికి స్థానికంగా ఉన్న పలుకుబడి తన ప్రభావాన్ని కామన్స్ సభపై ఆ తరవాత కూడా చూపగలిగింది. సంస్కరణ పక్షంలోని అతివాదులకు తగినంతగా సంస్కరణ జరగ లేదని అసంతృప్తి కలిగిన ఫలితంగా ఇంకా కొన్ని మార్పులు త్వరలోనే జరిగినాయి. కాని కార్మికులలో ఆర్థిక, రాజకీయ కారణాలవల్ల అసంతృప్తి పెచ్చు పెరిగిపోయింది. 1882 నాటి సంస్కరణ శాసనం ఈ తరగతికి చెందినవారికి వోటింగ్ హక్కునుగాని, పార్లమెంటరీ ప్రాతినిధ్యాన్నిగాని అంతగా ప్రసాదించలేదు. కొన్ని పట్టణాలలో కార్మికులు తమకున్న వోటు హక్కును పోగొట్టుకొన్నారు. కొత్తగా వోటింగ్ హక్కును పొందినవారు సామాన్యంగా మార్పులను ఆమోదించే వారే. అయినా దౌర్జన్య పూరితమైన విప్లవాన్ని గర్హించేవారే.

శిథిలమైన నగరాలకు ప్రాతినిధ్యం లేకుండా చేయటంవల్ల కామన్స్ సభమీద ప్రభువుల ప్రభావం తగ్గిపోయింది. మంత్రివర్గంలోని వ్యక్తు లింకా కామన్స్ సభను తమ ఇష్టం వచ్చి నట్లు ఆడించటం లేదు. కౌంటీ ప్రాతినిధ్యం పెరిగినందువల్ల భూస్వామిక వర్గానికి కామన్స్‌లో సభ్యత్వం హెచ్చినా పారిశ్రామిక విప్లవంవల్ల బలపడిన మధ్యతరగతి వారి మాటే తరవాతి 35 ఏళ్ళలో పార్లమెంట్‌లోని దిగువ సభలో చెలామణి అవుతుండేది.

ప్రభువుల సభలో భూస్వామి వర్గం వారిదే పైచేయి. కాని రెండు సభల మధ్యా మైత్రీ భావం చెడింది. తీవ్ర భేదాభిప్రాయం కలిగినప్పుడు మాత్రం డ్యూక్ వెల్లింగ్‌టన్ మాటను మన్నించి ప్రభువుల సభ లొంగిపోవటంవల్ల అనర్థం జరగలేదు. వారసత్వం ద్వారా ఏర్పడిన ప్రభు సభ ఎన్నికల మూలంగా ఏర్పడిన కామన్స్ సభ అభిప్రాయాన్ని మన్నించటమే తగిన పని అని వెలింగ్‌టన్ వంటి ప్రభువులు వివేకాన్ని ప్రదర్శించటంవల్ల ఇంగ్లండ్ క్రమంగా 1867 లో జరిగే పార్లమెంటరీ సంస్కరణల వైపు సాగిపోయింది.

## 1832–1867 మధ్య జరిగిన మార్పులు

పారిశ్రామిక విప్లవం 1832 తో ఆగిపోలేదు. ఇంగ్లండ్ మారుమూల ప్రదేశాలలోను గూడా ఒండొంటితోను, సముద్రతీరాన ఉన్న రేవు పట్టణాలతోను కలుపుతూ రైల్వేలను నిర్మించింది 1832 తరవాతనే. 1840–60 ల మధ్య స్వేచ్ఛా వర్తక సిద్ధాంతాలు వ్యాపించి నాయి. 1849 లో నౌకాయాన శాసనాలను రద్దు చేయటంవల్ల సముద్రాంతర దేశాలతో బ్రిటిష్ వ్యాపారం ఎన్నో రెట్లు పెరగటం సంభవించింది. ఇకమీద బ్రిటిష్ దీవులనుంచి ఇతర దేశాలకు ఏ దేశపు నౌకలలోనైనా వ్యాపార వస్తువులను తీసుకొనిపోవచ్చు. 1850 నాటి ధాన్య శాసనాలను పీల్ మహాశయుడు రద్దు చేసినాడు. ఈ శాసనాలు విదేశాలనుంచి వచ్చే చౌక ధాన్యంపై దిగుమతి పన్నులు విధించటంవల్ల బ్రిటిష్ భూస్వాములు పండించే ధాన్యాన్ని లాభసాటిగా అమ్మటానికి వీలు కలుగుతుండేది. పారిశ్రామిక నగరాలలో నివసించే కార్మికులకు పై చట్టాల రద్దువల్ల చౌక ధాన్యం లభించింది ధాన్య శాసనాలతోబాటు ఇతర దిగుమతి పన్నులను రద్దు చేయడంవల్ల (1850) ఇంగ్లండ్ స్వేచ్ఛా వ్యాపారసీమ అయింది. జనసామాన్యం సుఖాన్ని, స్వాతంత్ర్యాన్ని దృష్టిలో ఉంచుకొని 1833 లో బ్రిటిష్ కాలనీల లోని బానిసలకు దాస్య విముక్తి చేస్తూ వారి యజమానులకు నష్టపరిహార మిప్పిస్తూ చట్టం చేయడమయింది. రాజకీయ స్వేచ్ఛను సద్వినియోగం చేయటానికి ప్రజలు విద్యావంతులు కావడం అవసరం కాబట్టి 1833 లో పాఠశాలలు నిర్మించటంలో సాయపడటానికి ప్రభుత్వానికి 20,000 పౌన్లు మంజూరు చేసినారు. అంతకాలం విద్యాబోధన మత సంస్థల చేతులలో ఉన్నది. 19 వ శతాబ్దాంతానికి అది ప్రభుత్వాధీనమై జాతి భావ్యభివృద్ధికి తోడ్పడగలిగింది. సామాన్య ప్రజలకు అందుబాటులో ఉండేటట్లు పెన్నీ (అణా) కే జాబులు నడిపే వీలు కల్పించినారు. 1834 లో కొత్తగా బీదలకై ఒక శాసనాన్ని మునుపటి శాసనంలోని లోపాలను సవరిస్తూ చేయడమయింది. ఈ మేలేగాక ప్రజారాజ్య విధానానికి దోహదకారి అయిన, ఫాక్టరీ కార్మికులకు అభ్యుదయాన్ని చేకూర్చే అనేక శాసనాలను చేసినారు. ఫాక్టరీలలో 13 ఏళ్ళకు లోబడిన బాలబాలికలను కార్మికులు తీసుకోరాదనే చట్టంతో ప్రారంభించి క్రమంగా

ఇన్ని గంటలకు మించి పని చేయించరాదని, స్త్రీలను గనులలోపలి పనులకు నియోగించరాదని అభ్యుదయకారులైన అనేక కార్మిక శాసనాలను 19 వ శతాబ్దంలో చేయడమయింది.

విద్యావ్యాప్తితోపాటు 1830 వ సంవత్సరంలో యూరపియన్ రాజ్యాలలో సంభవించిన ప్రజా విప్లవాలు, 1832 నాటి బ్రిటిష్ పార్లమెంటరీ సంస్కరణ శాసనం ప్రజా సామాన్యంలో రాజకీయ చైతన్యాన్ని ప్రజ్వలింపజేసినాయి. పార్లమెంటరీ విధానంలో తీవ్రమైన మార్పులు రానిదే, సామాన్య ప్రజానీకానికి పార్లమెంట్‌లో ప్రాతినిధ్యం లభించనిదే సర్వతోముఖమైన అభ్యుదయం సాధ్యంకాదనే అభిప్రాయం దేశమంతటా తీవ్రంగా వ్యాపించింది. తత్ఫలితంగా ఇంగ్లండ్‌లోని రాజకీయాతివాదులు ఛార్టిస్ట్ ఉద్యమాన్ని లేవదీసినారు.

ఛార్టిస్ట్ ఉద్యమము (1836-1848): ప్రజలు కోరే రాజకీయ సంస్కరణల పత్రాన్ని (People's Charter-1839) సిద్ధపరిచి తమ కోరికలను సాధించటానికి ఛార్టిస్టులు (Chartists) ప్రచండమైన ఉద్యమాన్ని సాగించినారు. ఈ ఉద్యమానికి బలమిచ్చింది దేశవ్యాప్తమైన కార్మికుల ఆర్థిక దుస్థితి. ఆర్థిక పరిస్థితులు మెరుగైన కొద్దీ ఛార్టిస్ట్ ఉద్యమం పలుకుబడి తగ్గి క్రమంగా అది మూలబడిపోయింది.

ఛార్టిస్టుల కోర్కెలు ఆరు: (1) అర్హతలు విధించకుండా ప్రతి పురుషునికి ఒక వోటు ఇవ్వటం. (2) తాము నిర్దేశించిన వ్యక్తులకే వోటు చేయమని బలవంతులు నిర్బంధించకుండా రహస్యంగా వోటు చేసే వీలు కల్పించటం. (3) ఏటేటా పార్లమెంట్ సభ్యులను ఎన్నుకొనటం - అట్లా ఎన్నుకొనే పద్ధతి ఉంటే పార్లమెంట్ సభ్యులు వోటర్లపట్ల తమ బాధ్యత మరచిపోలేరు. (4) బీదలు కూడా పార్లమెంట్ సభ్యులు కావడానికి వీలుగా కామన్స్ సభ్యులకు వేతనాలు ఏర్పాటు చేయటం. (5) పార్లమెంట్ ఎన్నికలు జరిగేటప్పుడు కామన్స్ సభ్యత్వానికి పోటీ చేయటానికి ఆస్తిని ఒక అర్హతగా పాటించరాదనటం. (6) నియోజక వర్గాలు సమాన ప్రజాసంఖ్య లున్నవిగా ఉండవలెననటం. ఈ కోర్కెల పత్రాన్ని రచించిన వ్యక్తి ఫ్రాన్సిస్ ప్లేస్. ఈ పత్రానికి మాతృకలు: (i) జాన్ కార్ట్‌రైట్ వ్రాసిన సంస్కరణ పథకము (Plan of Reform-1776), (ii) 1780 లో డ్యూక్ రిచ్‌మండ్ ప్రతిపాదించిన ప్రజల చట్టము (People's Rights Measure).

ఈ ఉద్యమం మొదటి దశలోని (1836-39) కారణాలు: మధ్యతరగతి ప్రజలు మొదటి సంస్కరణ శాసనానికి ముందే తమకెన్నో ఆశలు చూపికూడా 1832 చట్టంలో విస్మరించినారని ఆరోపించటం; ఆర్థిక మాంద్యంవల్ల, 1834 నాటి బీదల శాసనంవల్ల బీదలకు కలిగిన అసంతృప్తి; పరిశ్రమలలో యంత్రాలు ప్రవేశపెట్టటంవల్ల వ్యాపించిన నిరుద్యోగ బాధలు; ఇకముందు సంస్కరణ లనవసరమని జాన్ రసెల్ ప్రభువు చేసిన ప్రకటన.

ఈ దశలో కొన్నిచోట్ల బెదరింపులు, కొన్నిచోట్ల కొన్ని దౌర్జన్య చర్యలు జరిగినాయి. వాటివల్ల కలిగిన ఫలితం మాత్రం సున్న. 1839 లో ఈ ఆరు మార్పులను కోరుతూ తయారైన పత్రం ప్రకటించగానే బీదలలో మహోత్సాహం వెల్లివిరిసింది. 12,80,000 మంది చేవ్రాళ్ళతో ఆ పత్రాన్ని కామన్స్ సభకు నివేదించటానికి ప్రయత్నించగా కామన్స్ సభ దానిని నిరాకరించింది.

*ఛార్టిస్ట్ ఉద్యమము - రెండో దశ* (1839-1848): ధాన్య శాసనాన్ని రద్దుచేస్తే ధాన్యం ధరలు పడిపోతాయని, పడిపోతే పారిశ్రామికులు కార్మికుల వేతనాలను తగ్గిస్తారని ఛార్టిస్టులు ఆ శాసనాన్ని రద్దు పరచటం ఆమోదించలేదు. వారు క్రమంగా సామ్యవాదాన్ని ఆదరించేవారయినారు. యూరప్ దేశాల చరిత్రలో కూడా 1830వ సంవత్సరంవలె, 1848వ సంవత్సరము విప్లవకాలము. ఆ ఏడు ఛార్టిస్టుల ఉద్యమము ఒక కొలిక్కి వచ్చింది. 60 లక్షల మంది చేవ్రాళ్ళు చేసిన సంస్కరణలను కోరే మహజర్‌ను 5 లక్షల మంది ప్రభుత్వాని కందించటానికి లండన్‌లోని కెన్సింగ్‌టన్ ఉద్యానవనంలో సమావేశం కావలెనని నిశ్చయించి నారు. ప్రభుత్వం వారిని ఊరేగింపు తీసుకొని పోనీయలేదు. ఈ ప్రదర్శనను భగ్నం చేయటానికి ప్రభుత్వం 2 లక్షలమంది కానిస్టేబిల్స్‌ను సిద్ధం చేసింది. ఉత్త అలజడి తప్ప జరిగిందేమీ లేదు. కాని కార్మిక జనంలో ఈ అసంతృప్తి గూడు కట్టుకోనీయటం వివేకం కాదనే అభిప్రాయం విగ్ టోరీ లిద్దరిలో గట్టిపడటంవల్ల వారు కొత్త పార్లమెంటరీ సంస్కర ణలు కావించటంలో తామంటే తామని కార్మికపక్ష బలాన్ని తమ తమ పక్షాలకు కూడగట్టు కోవటానికి ముందుకు ఉరికినారు. 1832కు ముందు తరంలో విగ్‌లు అధికారంలో ఉండి తరవాతి తరంలో లేకపోలేదు. జాన్ రసెల్ ప్రభువు పార్లమెంటరీ ప్రాతినిధ్య సంస్కర ణోద్యమానికి తిరిగి పూనుకొని 1852 లో తాను ప్రధానమంత్రిగా ఉన్నప్పుడు, 1854 లో కాబినెట్ మంత్రిగా ఉన్నప్పుడు కొత్త సంస్కరణ శాసనాలను ప్రతిపాదించినాడు. కాని వాటిని వోటింగ్ దాకా తీసుకొని పోలేదు. పార్లమెంటరీ సభ్యత్వానికి ఆస్తిని ఒక అర్హతగా చాలా కాలంగా పాటించలేదు. కాని 1858 లో ఆ ఆస్తి అర్హతా నిబంధన రద్దు కావించడ మయింది. 1859 లో మితవాద పక్ష (Conservative party) మంత్రివర్గంలో డెర్బీ ప్రభువు సంస్కరణ శాసన మొకటి ప్రతిపాదించినాడు గాని కామన్స్ సభ దానిని నిరాక రించింది. జనరల్ ఎన్నికలు జరిగి మితవాద పక్షం ఓడిపోయి ఉదార పక్షం అధికారం లోకి వచ్చింది. జాన్ రసెల్ ప్రభువు తన సంస్కరణ శాసనాన్ని ప్రతిపాదించినాడు కాని దానిని వెనుదీసుకోవలసి వచ్చింది. 1866 లో ఆ ప్రయత్నం ఇంకొకసారి చేసి ఓడిపోయిన రసెల్ మంత్రివర్గం రాజీనామా చేయగా మితవాదులు అధికారానికి వచ్చినారు. ఆ పక్షం వారైన డిస్ రేలీ 1867 లో రెండో సంస్కరణ శాసనాన్ని కామన్స్ సభలో ఉపపాదించి నాడు. కామన్స్‌లోని అధిక సంఖ్యాకులు ఉదార పక్షం వారేగాని వారు డిస్ రేలీ ప్రతిపాద నను బలపరిచినారు. వారు కోరిన సవరణలతో అది శాసన మయింది.

## ప్రజా ప్రాతినిధ్య శాసనము (1867)
## (Representation of the People Act)

వోటర్ల కుండవలసిన అర్హతలు సర్వత్రా - విశేషించి పట్టణాలలో - తగ్గించడమయింది. పట్టణాలలోని అందరు గృహస్థులూ పది పౌన్లు బాడుగ చెల్లిస్తూ అద్దె గదులలో ఉండేవారూ వోటర్లయినారు. నేర్పరులైన పట్టణ కార్మికులు అనేకులకు ఈ విధంగా వోటు హక్కు లభిం చింది. మధ్యతరగతి వారికి 1832 సంస్కరణ శాసనంవల్ల లభించిన రాజకీయ ప్రాబల్యం తగ్గింది. చిన్న పట్టణాలు కొన్ని తమ ప్రాతినిధ్యాన్ని కోల్పోయినాయి. దీనివల్ల 52 మంది సభ్యులు కాకుండా పోయినారు. కొత్తగా 18 పటణాలకు ప్రాతినిధ్యం లభించింది. కొన్ని

పెద్ద పట్టణాలకూ, నగరాలకూ ఒక్కొక్క సభ్యుడు అదనంగా వచ్చినాడు. ఇంగ్లీష్ కౌంటీలకు మొత్తం మీద 25 మంది సభ్యులను హెచ్చించినారు. లండన్ విశ్వవిద్యాలయానికి ఇంకొక ప్రతినిధి లభించినాడు. కౌంటీలలో వోటు హక్కు సంవత్సరానికి 12 పౌన్లు బాడుగ తేగల ఇళ్ళలో ఉండే వారికే ఇవ్వడంవల్ల కౌలుదారయిన రైతు లంతా వోటు హక్కు పొందినారు. 1868 లో ప్రత్యేక శాసనాల ద్వారా స్కాచ్, ఐరిష్ పట్టణ ప్రజలకు గృహ స్వామ్యపు అర్హత ఇవ్వడం జరిగింది. కామన్స్‌లోని ఇంగ్లండ్ ప్రతినిధులపై ఆధారపడి వోటు సంఖ్యలో అయిదుగురు, ఐరిష్ ప్రతినిధుల సంఖ్యలో ఇద్దరు తగ్గినారు. ఆ ఏడు స్థానాలను స్కాట్లండ్‌కు ఇచ్చినారు. మొత్తం మీద కొత్తగా పదిలక్షల మంది వోటర్లు నమోదు అయినారు. వారి సంఖ్య ఇంచుమించు మునుపు ఉన్న దానికంటె రెండింతలయింది పట్టణ ప్రతినిధుల సంఖ్య 134 శాతం పెరిగింది. కొన్ని పట్టణాలలో వోటర్లు మూడింత లయినారు. అయిదు పట్టణాలలోను, ఏడు కౌంటీలలోను పరిమిత దామాషా ప్రాతినిధ్య విధానం ప్రవేశ పెట్టడమయింది. అవి ఒక్కొక్కటి ముగ్గురు సభ్యులను కామన్స్ సభకు ఎన్నుకొనేవి కాని అక్కడి వోటర్ ఇద్దరు అభ్యర్థుల కంటె ఎక్కువ మందికి వోటు చేయరాదనే ప్రజా ప్రాతినిధ్య శాసనానికి ప్రభువుల సభ ఉపపాదించిన సవరణను పార్లమెంట్ ఆమోదించింది. అందుచేత మూడు స్థానాలు తమ పక్షమే గెల్చుకోవలెననే కాంక్షతో వోటర్లు వోట్లను నమోదు చేయటంలో తగిన సూచనలను వారికివ్వటానికి స్థానికంగా రాజకీయ పక్షాలు ప్రత్యేక శ్రద్ధ తీసుకోవటంతో రాజకీయ పక్షాల నిర్మాణం బాగా దృఢ పడింది. నియోజక వర్గాలలోని వోటర్లు కామన్స్ సభ్యులు తామెన్నుకొన్న తమ ప్రతినిధులు కాబట్టి వారు బాధ్యత వహించవలెనని, తమ అభిప్రాయాలను మన్నించవలెనని పట్టు బట్టినారు. 1868 లో జరిగిన జనరల్ ఎన్నికలలో లిబరల్ పార్టీ మితవాద పక్షాన్ని ఓడించగా గ్లాడ్‌స్టన్ ప్రధానమంత్రి అయి 1874 దాకా అధికారంలో ఉండి ప్రజానుకూలమైన శాసనాలెన్నో చేయించినాడు. వాటిలో రహస్య వోటింగ్ శాసనము (1872) ప్రజా ప్రాతినిధ్యాన్ని సార్థక పరచటానికి ఎంతో తోడ్పడింది. వోటర్‌లు బహిరంగంగా వోటు చేసేటట్లయితే స్థానికంగా పలుకుబడిగలవారు, ధనికవర్గం వారు తమను పీడిస్తారనే భయంతో తమ మనస్సాక్షికి విరుద్ధంగా వోట్ చేయవలసి వస్తుంది. ఈ ప్రమాదం నుంచి రక్షించటానికే రహస్య వోటింగ్ శాసనం చేసినారు. కాని ప్రజ లెవ్వరిని అభిమానిస్తున్నారో తెలపటానికి వెనుదీస్తే ప్రజాభిప్రాయ మేర్పడటానికి వీలుండదని, వోటర్‌లలో పిరికితనం ప్రోత్సహించటం ప్రజారాజ్యానికి మేలుకాదని కొందరీ చట్టాన్ని విమర్శించినవారు లేకపోలేదు. ఈ విమర్శలను ప్రజాభిప్రాయం లెక్క చేయలేదు. కాని ఇది 1918 సంవత్సరానికి గాని శాశ్వతంగా శాసనం కాలేదు.

***వోటర్లను ప్రలోభపరచకుండటానికి తీసుకొన్న చర్యలు:*** సంస్కరణ శాసనాలవల్ల, వోటర్లు మిలియన్‌ల సంఖ్యకు పెరగటంవల్ల లంచాలిచ్చి ఆశపెట్టి అంతమంది వోట్లను కొనటం చాలా కష్టసాధ్యమైన పని. ఇంకా సంఘంలో రాజకీయ చైతన్యం, ఆర్థిక సుస్థితి పెరగటంవల్ల ధనాశకు లోబడి తమ నమ్మకాలకు, రాజకీయ పక్షానికి ద్రోహం చేసే వారి సంఖ్య చాలా పడిపోయింది. దీనికి కారణం వార్తా పత్రికల సంఖ్యాభివృద్ధి ; వాటిని చదివే వారి సంఖ్యాభివృద్ధి. ఎన్నికలలో అవినీతికరమైన పద్ధతు లవలంబించి గెల్చినవారిని విచారించి శిక్షించటానికి మేలు మార్గాలు ఆచరణలోకి రావటం కూడా మంచి ఫలితాన్ని ఇచ్చింది.

18 వ శతాబ్దంలో చాలా కాలం ఎన్నికల వ్యాజ్యాలు కామన్స్ సభ్యులందరూ కమిటీగా ఉండి పరిష్కరించేవారు. కామన్స్ సభలోని మెజారిటీ పార్టీకి అనుకూలించే విధంగా అవి పరిష్కార మయ్యేవి. 1770 లో ఎన్నిక వ్యాజ్యాలు విచారణకు కామన్స్ సభ్యులెన్నుకొన్న 40 మంది నుంచి 18 మందిని ఏరి పార్లమెంట్ పక్షాలు ఒక్కొకటి ఒక్కరిని నియోగించి అట్లా ఏర్పడిన వారు ఒక కమిటీ అయి ఆ వ్యాజ్యాలను పరిష్కరించేవారు. కాని ఈ కమిటీ పనికూడా తృప్తికరంగా లేనందువల్ల 1868 లో ఈ వ్యవహారాన్ని ఉన్నత న్యాయస్థానాల న్యాయాధిపతులకు అప్పగించడమయింది. ఎన్నికలలో అవినీతిని శిక్షించటానికి తీవ్రమైన శాసనాలు వచ్చినాయి. వాటిలో 1883 లో గ్లాడ్‌స్టన్ మంత్రివర్గం చేసిన చట్టంవల్ల అవినీతి మార్గాలు కొంతవరకు నిరోధించబడినాయి. నియోజకవర్గాల పరిమితినిబట్టి ఎన్నికల ఖర్చులు నిర్ణయించడమైంది. ఎన్నికల ఏజంట్‌లు జమా ఖర్చులను చెప్పవలసి వచ్చింది. ఎన్నికలలో పోటీచేసే వ్యక్తులు శాసన విరుద్ధంగ ప్రవర్తించిన మునుముందు ఎన్నికలలో పోటీ చేయడానికి వీలు లేకుండా చేయబడింది. అవినీతిని నిరోధించడానికి ఎన్ని ఆంక్షలు విధించబడినా, ఈ చట్టం అవినీతి చర్యలను పూర్తిగా మాన్పలేక పోయింది. మొత్తం మీద 1883 చట్టంవల్ల అక్రమ మార్గాలు అరికట్టబడినవి. బాహాటంగా వోట్లలోను లంచాలివ్వటం ఆగిపోయిందని చెప్పవచ్చు. నూతన మార్గాలను అన్వేషించడానికి ఈ చట్టం వీలు కలిగించింది.

## ప్రజా ప్రాతినిధ్య శాసనము (1884)

గ్లాడ్‌స్టన్ 1880 లో రెండోసారి ప్రధానమంత్రి అయినా 1884 దాకా కొత్త ప్రాతినిధ్య శాసనాన్ని ప్రతిపాదించలేదు. దేశమంతటా ప్రాతినిధ్య సంస్కరణలు కోరుతూ సభలు జరిగినాయి. ప్రజాప్రాతినిధ్య శాసనం కామన్స్ సభ ఆమోదించి పంపిందిగాని సభ స్థానాలను సవరించే చట్టాన్ని ప్రాతినిధ్య సవరణ శాసనంతోబాటు ప్రవేశ పెటలేదనే కారణంవల్ల ప్రభువుల సభ దానిని తోసిపుచ్చింది. కాని గ్లాడ్‌స్టన్ అవసరమయినపట్ల ప్రభువుల సభ నిర్మాణాన్ని మార్చవలసి ఉంటుందని విక్టోరియారాణికి సూచించినాడు. ప్రతిపక్ష నాయకుడు సాలిస్‌బరీ రాణి సలహా విని గ్లాడ్‌స్టన్‌తో మాట్లాడి సభ్యత్వ స్థానాల పంపకాన్ని గురించి అతనితో సమాధానపడడంవల్ల తరవాతి సమావేశంలో 1884 ప్రజాప్రాతినిధ్య చట్టాన్ని పార్లమెంట్ ఆమోదించింది.

కౌంటీలలోను పట్టణాలలోను వోటర్‌కు ఉండవలసిన అర్హతలు సమానం చేయడం జరిగింది. గృహస్థులకు సంవత్సరానికి 10 పౌన్లు బాడుగ చెల్లిస్తూ ఇతరుల ఇళ్ళలో కాపురం చేసే వారికే కౌంటీలలో పట్టణాలలో ఉన్నట్లే అర్హత విధించడమయింది. 21 ఏళ్ళు నిండిన ప్రతివాడు ఉద్యోగరీత్యాగాని, చేసే సేవనుబట్టిగాని, యజమాని ఉన్న ఇంట్లో కాక ఆ గృహావరణలోని ఇంటిలో ఉన్నా ఆ ఇల్లు సంవత్సరానికి పది పౌన్ల బాడుగ నిచ్చేది అయితే అతనికి ఈ 1884 చట్టాన్ని బట్టి పార్లమెంట్ ఎన్నికలలో వోటు లభించింది. ఇంగ్లండ్, స్కాటండ్‌లలోని సేద్యపు కూలీలందరూ ఐర్లండ్‌లోని సన్నరైతులూ ఇప్పుడు వోటర్ లయినారు.

*కామన్స్ సభ్యత్వస్థానాల పునర్విభజన శాసనము (1885)*: కామన్స్‌లోని సభ్యత్వస్థానాలను 658 నుంచి 670 వరకు పెంచడమయింది. ఇంగ్లండ్‌కు 465 స్థానాలు, వేల్సుకు

30 స్థానాలు, స్కాట్లండ్‌కు (అదనంగా 12 స్థానాలు - అంటే మొత్తం మీద) 72, ఐర్లండ్ 103 గా ఈ 670 స్థానాలను విభజించడమయింది. జనాభా దామాషానుబట్టి చూస్తే నాలుగింటిలో ఇంగ్లండ్‌కు తక్కువ ప్రాతినిధ్యమూ ఐర్లండ్‌కు మిగత మూడింటికంటే ఎక్కువ ప్రాతినిధ్యమూ లభించింది. కొన్ని నియోజకవర్గాలకు ఒక్క సభ్యునికి మించిన ప్రాతినిధ్యం ఉండనిచ్చినా గ్రేట్ బ్రిటన్ ఐర్లండ్‌లలో అధిక భాగాన్ని కామన్స్‌కు ఒక్క సభ్యుని మాత్రం ఎన్నుకొనే సమాన జనసంఖ్య ఉన్న 617 నియోజకవర్గాలుగా విభజించడమయింది. వోటర్లుగా నమోదు చేయించుకొనే విధానాన్ని సులభం చేయడం మూలంగా వోటర్లసంఖ్య విస్తారంగా పెరిగింది. ఇంగ్లండ్‌లో అన్నిచోట్ల 'సమాన జనసంఖ్య, సమాన ప్రాతినిధ్యము' అనే సూత్రాన్ని పాటించినారని చెప్పటానికి వీలులేదు.

15,000 మందికి తక్కువ జనసంఖ్య ఉన్న పట్టణాలకు ఒక్కొక్క సభ్యుడు చొప్పున ప్రాతినిధ్యం తగ్గించినారు. లండన్ నగరానికి ఇద్దరు సభ్యులు తగ్గినారు. జనాభా ఐదువేలకు, లక్షా అరవైఐదు వేలకు మధ్యస్థంగా ఉండే పటణాలకు కామన్స్‌కు ఇద్దరిని ఎన్నుకొనే హక్కును అట్లే ఉంచినారు. రట్‌లాండ్ కౌంటీ సభ్యులలో ఒకడు తగ్గినాడు. జనాభాను బట్టి సభ్యుల సంఖ్యను నిర్ణయించటం కొన్నిచోట్ల లాభించింది. ఉదాహరణకు 1867 చట్టం ప్రకారం కామన్స్‌లో లివర్‌పూల్ పటణానికి మూడు స్థానాలున్నాయి. 1887 చట్టము ఆ పట్టణాన్ని ఒక్కొక్కటి కామన్స్‌కు ఒక్కొక్క సభ్యుని వంతున ఎన్నుకొనే సమాన జనసంఖ్య ఉన్న తొమ్మిది నియోజకవర్గాలుగా విభజించింది. అదే విధంగా మిడిల్ సెక్స్ కౌంటీని ఏడు నియోజకవర్గాలుగా విభజించింది. కాని పార్లమెంటరీ స్థానాల పంపకాన్ని గురించి పూర్వమున్న విధానాన్ని 1885 చటం పూర్తిగా విడవలేదు. యూనివర్సిటీలకు కామన్స్ సభలో మునుపున్న ప్రాతినిధ్యం తగ్గించలేదు.

1884 నాటి ప్రజా ప్రాతినిధ్య శాసనమూ 1885 నాటి కామన్స్ సభ్యత్వాల పునర్విభజన శాసనమూ బ్రిటిష్ దీవులలో ప్రజా రాజ్యాన్ని చాలా విస్తృతపరిచినా యనటంలో ఏ మాత్రం సందేహం లేదు. స్త్రీలకు వోటు హక్కు, శాసన సభ్యులయ్యే హక్కు 20 వ శతాబ్దానికిగాని లభించలేదు. కార్మికులు కర్షకులు పార్లమెంట్ సభ్యులు, మంత్రివర్గ సభ్యులు కావటానికి ఇంకో రెండు తరాలు వేచి ఉండవలసినా ఈ రెండు చట్టాలు దానికి దారిని మాత్రం సుగమం చేసినాయి.

*పార్లమెంట్ సభ్యులలో అవినీతి క్షీణించటం:* 18 వ శతాబ్దాంతానికే లంచాలూ భరణాలూ ఉద్యోగాలూ ఆశచూపి పార్లమెంట్ సభ్యులను అవినీతిపరులను చేయటం చాలా వరకు ఆగిపోయింది. పిట్, బర్క్ మొదలయిన సచ్ఛీలుల సద్వర్తనం కొంతవరకు సత్ఫలితాలకు దారి తీసింది. ఇంకా పార్లమెంట్‌లో సభ్యులు ప్రవర్తించే విధం పత్రికా పఠనం వ్యాపించిన కారణంవల్ల, రాజకీయ చైతన్యమూ రాజకీయ విషయాలలో శ్రద్ధ హెచ్చిన కారణంవల్ల నియోజకవర్గాల సునిశిత విమర్శకు గురి కావటం సంభవించింది. నియోజక వర్గాలలోని ప్రతి రాజకీయ పక్షమూ తమ అభిప్రాయాలను తమ ప్రతినిధులు మన్నించవలె నని పట్టుబట్టటంవల్ల పార్లమెంట్ సభ్యులేగాక మంత్రివర్గాలు కూడా ప్రజాభిప్రాయం మొగ్గు చూపుతున్నదో పరిశీలించి తదనుగుణంగా ప్రవర్తించటానికి క్రమంగా అలవాటు పడినారు. జీతభత్యాలు ఏ పదవులకు ముడిపెట్టబడినాయో ఆ పదవుల వారికి పార్లమెంట్ సభ్యత్వం

లేకుండా చేస్తూ 1782 నుంచి కొన్ని చట్టాలు వచ్చినాయి నాలుగో విలియమ్ రాజయినప్పుడు వంశపారంపర్యంగా రాజులు అనుభవిస్తున్న ఆదాయాలు జాతీయంచేసి వాటికి బదులు సంవత్సరానికి కొంత ధనం మంజూరు చేసినాడు. విక్టోరియా రాణి ఆ మొత్తం కొంత తగ్గించింది. పెన్షన్‌లకని ప్రత్యేకించే ధనం కూడా తగ్గించింది. ఈ మార్పులవల్ల పార్లమెంట్ సభ్యులను లంచమిచ్చి తమవైపు తిప్పుకొని తిరిగి నిరంకుశత్వాన్ని నెలకొల్పటానికి రాజులకు పూర్వమున్న అవకాశం లేకుండా పోయింది. క్షీణించిన నియోజక వర్గాలయిన పట్టణాల ప్రాతినిధ్యం తొలగించివేసినందువల్ల రాజులకు, మంత్రులకు పార్లమెంట్ సభ్యులను అవినీతి పరులను చేయటానికి, వారి వోట్లను కొనటానికి వీలుండదు. 19వ శతాబ్దాంతానికి దేశ పరిపాలన నిజమైన ప్రజా ప్రతినిధి పరిపాలనగా ఇన్ని విధాల పరిణామం పొందింది.

*

# 13

# రాజకీయపక్షాలూ, మంత్రివర్గాలూ

15 వ శతాబ్దంలో లంకాస్ట్రియన్, యార్క్‌స్టపక్షాల అంతర్యుద్ధాలతో ఇంగ్లండ్ నిండిపోయింది. ఈ పక్షాలను రాజకీయ పక్షాలనటంకంటె ముఠాలనటమే మేలు. రాజకీయ సిద్ధాంతాలను అవలంబించి వారు పోరాడేవారు కారు. ట్యూడర్‌ల కాలంలో ప్రజలంతా రాజుల నిరంకుశత్వం కింద మగ్గినవారు కాబట్టి రాజకీయ పక్షాల ప్రసక్తే లేదు. విశేష రాజ్యాధికారమెవరిది? ప్రజలదా, రాజుదా? అనే రాజకీయ సిద్ధాంతాలకు సంబంధించిన వివాదాలను మొదటిసారిగా రచ్చకు తెచ్చినవారు స్టూవర్ట్ రాజులు. మొదటి ఛార్లెస్ కాలంలో రాజుపక్షం, పార్లమెంట్ పక్షం అని రాజకీయవాదులు రెండు తెగలుగా చీలిపోయినారు. సార్వభౌమాధికారం రాజుదని కొందరు - కాదు పార్లమెంట్‌ది అని కొందరు - వాదించినారు. ప్యూరిటన్‌లు సైనికాధికారాన్ని, పార్లమెంటరీ అధికారాన్ని చేజిక్కించుకోగా రాజు పక్షంవారు వారిని రౌండ్ హెడ్‌లని వెక్కిరిస్తే రాజు పక్షంవారిని కెవలియర్‌లని ప్యూరిటన్‌లు ఎత్తిపొడిచినారు. రెండో ఛార్లెస్ కాలంలో మొదటి పక్షంవారికి విగ్‌లని, రెండో పక్షంవారికి టోరీలని పేర్లు వచ్చినాయి టోరీలనేది ఆదిలో ఐరిష్ దోపిడీ ముఠాల పేరు. మత విషయాలలో అతివాదానికి దిగిన స్కాటిష్ ప్రజలకు మితవాదులు పెట్టిన పేరు విగ్‌లు. విగ్ అంటే పులిసిన పాలని అర్థము. రెండో ఛార్లెస్ తమ్ముడైన జేమ్స్‌ను కాథలిక్ అని రాజపదవినుంచి దించడానికి పార్లమెంట్‌లో ప్రతిపాదించిన మినహాయింపు చట్టాన్ని (Exclusion Bill) వ్యతిరేకించిన వారికి టోరీలని బలపరచిన వారికి విగ్‌లని పేర్లు స్థిరపడినాయి.

మూడో విలియమ్, ఆనీ రాణుల కాలంలో అత్యంత భాగ్యవంతులు, ఉన్నత కుటుంబాల వారు అయిన భూభామందులు, వణిక్ప్రముఖులు, ధనికవర్గంవారు, నాన్ ఆంగ్లికన్‌లు విగ్ వర్గంలో ఉండేవారు.

మధ్యతరగతి భూస్వాములు చర్చిలోని సామాన్యోద్యోగులు, ఆంగ్లికన్‌లు అయిన పేదవారు టోరీ పక్షానికి చెందినవారు. టోరీలలో ప్రభు కుటుంబాలు తక్కువ. విగ్‌లు టోరీలకంటె తక్కువే కాని దేశంలో సగంకంటె ఎక్కువ సంఖ్య వారిదే. ఉత్సాహవంతులు, సమర్థులు వారిలో ఎక్కువ. వారు రాజకీయాలలో టోరీలకంటె ఉదారాశయులు. మూడో విలియమ్‌కు, ఆనీ రాణికి రెండు పక్షాలనుంచి సమర్థులైన వారిని, తమ విధానాలకు తోడ్పడే వారిని మంత్రులుగా నియమించవలెనన్న ఉద్దేశమున్నా మంత్రివర్గ సమావేశాలలో రెండు పక్షాల వాదోపవాదాలతో ఏ కార్యమూ అనుకూలపడేది కాదు. అందువల్ల విధిలేక తమ యుద్ధ కార్యక్రమాలతో సహకరించే విగ్ పక్షం వారికే వారు మంత్రి పదవులు కట్టబెట్టవలసి వచ్చింది. ఆనీ రాణి ఫ్రెంచ్ యుద్ధాలతో విసిగి ఫ్రాన్స్‌తో సమాధానానికి రాదలచినప్పుడు టోరీ మంత్రివర్గాన్ని ఏర్పాటుచేసింది. కాని ఆమె చివరికి విగ్‌లను మంత్రులుగా చేసుకోవలసి వచ్చింది. దానికి రెండు కారణాలున్నాయి. టోరీలు స్టూవర్ట్ వంశాన్ని పునరుద్ధరించవలెనని

సంకల్పించటం మొదటి కారణము. రెండో కారణము స్థిరీకరణ శాసనం. (Act of Settle-
ment) ప్రకారం హానోవేరియన్ రాజులను ఇంగ్లండ్ సింహాసన మెక్కించటానికి విగ్
పక్షము కంకణం కట్టుకోవటం. ఆ విధంగా 1714 సం. లో మంత్రివర్గంలో ప్రవేశించిన
విగ్‌లు మొదటి, రెండో జార్జ్ రాజుల పరిపాలనా కాలంలో అధికారంలో నిల్చి పోయినారు.
మొదటి జార్జ్ ఇంగ్లండ్ రాజు కావటానికి ముందు జర్మనీ దేశంలోని హానోవర్‌కు రాజుగా
ఉన్నందువల్ల మొదటి నుంచీ ఇతర జర్మనీ రాజ్యాలకు, హానోవర్ రాజ్యానికి మధ్యఉన్న
సంబంధ వ్యవహారాలలో అతని కుండే శ్రద్ధ ఇంగ్లండ్ రాజకీయాలలో, టోరీ విగ్‌ల పరస్పర
స్పర్థలలో ఉండేది కాదు. ఆయనకు ఇంగ్లీష్ భాష అక్షరం రాదు. రెండో జార్జ్‌కి ఇంగ్లీష్
అసలే రాదనలేముగాని వచ్చీరాని తన ఇంగ్లీష్‌తో మంత్రివర్గ సమావేశాలలో అధ్యక్షత
వహించే ధైర్యం అతనికి లేదు. ఇక ఆయన తండ్రికి, మంత్రిమండలి అధ్యక్షపదవికి ఆమడ
దూరము. జార్జ్ రాజు లిద్దరికీ విగ్‌లు అధికారంలో ఉంటే తమ వంశము సుస్థిరంగా వర్ధిల్లు
తుందనే గట్టి నమ్మకము. ఈ పరిస్థితులు ఇంగ్లండ్‌లో ఏకపక్ష మంత్రివర్గ స్థాపనకు దారి
తీసినాయి.

## కాబినెట్ విధాన పరిణామము

కాబినెట్‌ను ఎవరూ సృష్టించలేదు. క్రమంగా పరిస్థితుల ప్రాబల్యంవల్ల అది పరిణామం
పొందింది. దాని పరిపూర్ణ వికాసానికి చాలా దశాబ్దాలు పట్టినాయి. ఇంగ్లీష్ రాజ్యాంగ శాస
నాలలో కాని, ఆ రాజ్యాంగాన్ని గురించి 18వ శతాబ్దిలో వ్రాసిన గ్రంథాలలోకాని కాబినెట్
ప్రస్తావన లేదు. అయినా ఆ దేశపరిపాలన మాత్రం కాబినెట్ హస్తగతమై ఉండేది. 17వ
శతాబ్దంలో రాజులే మంత్రులలో తమకు అత్యంత విశ్వాసపాత్రులైన కొందరిని రహస్య
సమావేశాలకు పిలిచి పరిపాలనా సమస్యలను చర్చిస్తూ ఉండేవారు. మంత్రులు కాని వారిని
కూడా పిల్చి వారితో సంప్రదించే ఆచారం పూర్వము ఉండేది. అట్లాంటి వారు రాజుకు
స్వాధీనులు. 18వ శతాబ్దంలో మంత్రివర్గంలోని అభ్యంతర (Inner) మంత్రిమండలి కామన్స్
సభలోని అధిక సంఖ్యాకుల రాజకీయ పక్షపు విశ్వాసాన్ని పొంది వారి ఇష్టానిష్టాలను
పాటించవలసి వచ్చేది. 1688 సం. లో వచ్చిన విప్లవం పరిపాలనలో ఈ మార్పు తెచ్చి
పెట్టింది. 'కాబినెట్' అనే పదాన్ని మొట్టమొదట బేకన్ తన వ్యాసాలలో వాడినాడు.
స్టూవర్టుల కాలానికి ప్రీవీ కౌన్సిల్ సభ్యుల సంఖ్య ఊరికే పెరిగిపోయింది. దాని పేరునుబట్టే
ఆదిలో అది రాజుల రహస్యమంతనాలకు ఉద్దేశించిందని గ్రహించవచ్చు. స్టూవర్ట్ ప్రీవీ
కౌన్సిల్ సభ్యులలో అనేకులకు ఆ పదవికి కావలసిన శక్తి సామర్థ్యాలు కాని, తెలివితేటలు
కాని లేవు. యోగ్యత ఉన్న కొద్దిమందే స్టూవర్టుల అంతరంగిక మంత్రులైనారు. వారిలో
కొందరు రాజు మిత్రకోటిలోనివారు. కొందరు ఉన్నతోద్యోగులు. మరికొందరు పరిపాలనాను
భవ మున్నవారు. ఈ అంతరంగిక మంత్రివర్గ తీర్మానాలకు ప్రీవీ కౌన్సిల్ తన ఆమోద
ముద్ర వేసేది. ప్రజాభిప్రాయము ఈ రహస్య మంత్రివర్గానికి ఎప్పుడూ సుముఖంగా లేదు.
దీనిలోని సభ్యులెవరో తెలియకపోయేది. అంతేకాక దీని నిర్ణయాలకు ఎవరినీ బాధ్యులనటానికి
వీలుండేది కాదు. రాజ్యాంగ శాసనము ప్రీవీ కౌన్సిల్‌లోనే కాని దానిలోని ప్రత్యేక మంత్రి
వర్గాన్ని గుర్తించనే లేదు. ఇన్ని కారణాలనుబట్టి ఈ రహస్యకూటమిని ఎందరో గర్హించే

వారుకాని తన అవసరాలనుబట్టి రెండో ఛార్లెస్ తన కిష్టులైన వారితో సంప్రదించటం ఎవ్వరూ అరికట్టలేక పోయినారు. మొదట క్లారెండన్ మొదలైన మంత్రులు నలుగురితోను, తరవాత కాబాల్ (Cabal) అని ప్రజలు గర్హించిన మంత్రులు ఐదుగురితోను ఆయన సంప్రదించే వాడు. కొంతకాలం ప్రీవీ కౌన్సిల్ చేసే పనినిబట్టి దానిని కొన్ని కమిటీలుగా విభజిస్తే పరిపాలనకు అనుకూలంగా ఉంటుందని అన్నారు. కాని అంతమాత్రం చేత కాబినెట్ పరిణామాన్ని ఎవ్వరూ అరికట్టలేక పోయినారు. రెండో ఛార్లెస్ వలెనే రెండో జేమ్స్ మూడో విలియమ్‌లు తామేరుకొన్న కొద్దిమందితోనే మంతనాలు సాగించేవారు. స్థిరీకరణ శాసనము రాజ కార్యాలను ప్రీవీ కౌన్సిల్‌లోనే సాగించవలెనని నిర్ణయించినా పై కారణాలవల్ల ఆ తీర్మానము అమలులోకి రాలేదు. మూడో విలియమ్ తన మంత్రులను నియమించటంలో రాజకీయ పక్షాలకు అతీతుడై వ్యవహరించవలెనని చూసినాడు. కాని కామన్స్ సభలో అధిక సంఖ్యాకులయిన రాజకీయ పక్షం వారి తోడ్పాటుతో కాని పరిపాలన సాగదనీ ఆ పక్షం సభ్యులను మాత్రమే మంత్రులుగా చేసుకొంటేనే కాని ఆ తోడ్పాటు సాధ్యం కాదనీ గ్రహించినాడు. 1688 వ సం. విప్లవం తెచ్చి పెట్టిన పరిస్థితులవల్ల హానోవేరియన్‌లకు రాజ్యం సంక్రమించటంవల్ల క్రమంగా నూరేళ్ళ పాటు బ్రిటన్‌లో ఏకపక్ష మంత్రివర్గ పరిపాలనలో విగ్ పార్టీ ఆధిక్యం సుస్థిరమయింది.

మొదటి జార్జ్ రాజు ఇంగ్లీష్ అసలే రాకపోవటంవల్ల, రెండో జార్జ్ వచ్చీరాని ఇంగ్లీష్ వల్ల కాబినెట్ సమావేశాలలో అధ్యక్షత వహించటం మానుకొన్నారు. అప్పటినుంచి బ్రిటన్ రాజు తన అంతరంగిక మంత్రివర్గ సమావేశాలకు రాకపోవటం ఒక ఆచారమయింది. అధ్యక్షత వహించటం రాజెప్పుడు మానుకొన్నాడో మంత్రులలో ప్రముఖుడైన వ్యక్తి ఆ స్థానాన్ని ఆక్రమించటం అనివార్యమూ పరిపాటీ అయింది. ఆ వ్యక్తి మంత్రులలో మాత్రమే ప్రముఖుడైతే చాలదు. ఆయన ఆ ప్రభుత్వ పక్ష విశ్వాసాన్ని చూరగొన్న పార్టీనాయకుడుగా ఉండవలె. అట్లాంటి వ్యక్తే క్రమేణా ప్రధానమంత్రి (Prime Minister) గా వ్యవహరిస్తూ వచ్చినాడు. కాని మొదట్లో చాలా కాలంవరకు నిజంగా ప్రధానమంత్రులన్న పేరుకు అర్హులైన వారు కూడా ఆ పేరు తగిలించుకోవటానికి వెనుదీసేవారు. 1878 సం. లో జరిగిన బెర్లిన్ కాంగ్రెస్ సందర్భంలో ఆ పేరు మొదటిసారి బహిరంగంగా వినిపించింది.

## ప్రధానమంత్రి (Prime Minister)

ప్రధానమంత్రి అధికారాలన్నింటినీ నిర్వచించే శాసనాలు లేవు. అవి పరంపరాగతమైన సంప్రదాయాలవల్ల సిద్ధించినవే. ప్రభుత్వంలో ఏ శాఖ పరిపాలన బాధ్యతనైనా తన కిష్టమున్నప్పుడే స్వీకరించవచ్చు. ప్రధానమైన పరిపాలన శాఖలను పైన వేసుకొన్నవారు లేకపోలేదుగాని కార్యభారము రవంతయినా లేని మొదటి కోశ ప్రభు పదవిని అధిష్ఠించిన పరిపాలనా శాఖ లన్నింటి పైనా అజమాయిషీ చేసే ప్రధానమంత్రులు మాత్రం ఉన్నారు. ఒక్కొక్కప్పుడు ప్రభుత్వ శాఖలోని ప్రతి చిన్న విషయానికీ అతడు పోడు. ఏ కార్యక్రమం ప్రభుత్వకోశంపై అధికంగా ఒత్తిడి చేస్తుందో దానిని ఆ యా శాఖల మంత్రులు ప్రధానమంత్రి దృష్టికి విధిగా తేవలసిందే. ప్రతి పరిపాలన శాఖా మంత్రీ తన శాఖకు పేరు రావలెననే ఉద్దేశంతో సరికొత్త ప్రణాళికలు వేసి అధికావసరాలను పెంచుకోవటం సహజమే అయినా

మంజూరు చేసేవాడు ప్రధానమంత్రి అవుతాడు. అంతేకాక ప్రభుత్వ పక్ష విధానాలకు భిన్నమైన ప్రతిపాదనలు ఏ మంత్రి అయినా ప్రవేశపెడితే వాటినిగురించి ప్రధానమంత్రే కాక కాబినెట్ మంత్రులందరూ యోచించవలసిన అవసరము ఉంది. విదేశ వ్యవహారశాఖా కార్యదర్శికి వచ్చే ప్రతి లేఖా, ఆయన పంపే ప్రతి లేఖా ప్రధానమంత్రికి సమర్పించవలసిందే. దాని కర్థం విదేశ రాజనీతికి ప్రత్యేక బాధ్యత ప్రధానమంత్రిదని.

ప్రభుత్వశాఖ లన్నింటి కార్యనిర్వహణకు సంబంధించిన విషయాలలో కాబినెట్‌కు బ్రిటిష్ రాజుకు ప్రధానమంత్రే మధ్యవర్తి. మంత్రివర్గపు అభిప్రాయాలను రాజుకు, రాజు అభిప్రాయాలను మంత్రివర్గానికి చేరవేయవలసినవాడు ప్రధానమంత్రే. ఇతర మంత్రులు ఎవ్వరూ ఈ బాధ్యతను పైన వేసుకోరు. మంత్రివర్గ విధానాన్నిగురించి రాజుకు, దానిపై రాజు అభిప్రాయాన్ని మంత్రివర్గానికి వివరించవలసినవాడు ప్రధాన మంత్రి. అతనిని కాదని ఏ ఇతర మంత్రీ రాజుతో సంప్రదించే అధికారం లేదు. ఒకవేళ అటువంటి పరిస్థితి ఏర్పడితే ఆ మంత్రిని కాబినెట్ నుంచి ప్రధానమంత్రి బహిష్కరిస్తాడు. అది వీలుకాకపోయిన పక్షంలో తన మంత్రివర్గం రాజీనామాను ప్రధానమంత్రి రాజుకు సమర్పిస్తాడు. కాని ప్రభుత్వ విధానానికి సంబంధించని పరిపాలనా విషయాలనుగురించి రాజు ఏ శాఖా మంత్రినైనా అడిగి తెలుసుకోవచ్చు.

కాబినెట్‌కూ రాజుకూ మధ్యవర్తి అయినట్లే కాబినెట్‌కూ పార్లమెంట్‌కూ మధ్యవర్తిగా వ్యవహరించే బాధ్యతా అధికారమూ ప్రధానమంత్రికి ఉన్నాయి. పార్లమెంట్ సభలు రెండింటిలోను ఒక మంత్రి దేనిలో సభ్యుడో, దాని సభ్యులకు తాను తన శాఖ సామాన్య వ్యవహారాలను తెలియజేయవచ్చు. ఆ శాఖ అనుసరించే విధానాలను ప్రధానమంత్రే వివరించవచ్చు. లేదా అతని అనుమతితో ఆ పని ఆ శాఖ మంత్రికూడా చేయవచ్చు. ఏ సభలో ప్రధాన మంత్రి సభ్యుడో ఆ సభా నాయకుని హోదాతోబాటు ప్రభుత్వ విధానాలకు బాధ్యత వహించి సమర్థించవలసిన భారం కూడా అతని మీదే ఉంది.

సామాన్యంగా పార్లమెంట్ ఎన్నికలు జరిగిన తరవాత రాజకీయ పక్షంలోని అధిక సంఖ్యాకులు ఎన్నుకొన్న ప్రధానమంత్రి సిఫారస్ మీదనే రాజు మంత్రి మండలిని నియమిస్తాడు. తన పక్షంలోని అత్యంత సమర్థులనూ, పలుకుబడి ఉన్నవారినీ ఆయన తన మంత్రులుగా తీసుకొనవచ్చునని మన మూహించవచ్చు. ఆ విధంగా జరగకపోతే వచ్చే దుష్ఫలితాలకు ప్రధానమంత్రి సిద్ధపడి ఉండవలసిందే. మంత్రివర్గ మేర్పడిన తరవాత పరిపాలనకు సంబంధించిన ప్రతి ముఖ్యవిషయాన్ని ఆయన దానితో సంప్రదిస్తాడు. మంత్రులలో ఎవ్వరయినా ప్రధానమంత్రితోను ఇతర మంత్రులతోను ఏకీభవించలేక పోతే ఆ మంత్రి మంత్రివర్గం నుంచి విధిగా తొలిగిపోవలసి ఉంటుంది. లేదా నలుగురితోబాటు తాను నడుచుకోవటానికి ఒప్పుకోవలసి ఉంటుంది. తాను మంత్రిగా ఉన్న కాలంలో మంత్రివర్గ విధానాలను సమర్థించవలసిన వాడే కాని బహిరంగంగా విమర్శించటానికిగాని, విరుద్ధంగా నడచుకోటానికిగాని వీలు లేదు. ఏ మంత్రి అయినా ప్రధానమంత్రి అభిప్రాయాలతో ఏకీభవించకపోయినా ప్రధాని అభిప్రాయానుసారం నడచుకోవలసిందే. లేదా తమ మంత్రి పదవులు వదిలి ప్రధాన మంత్రికి వ్యతిరేకంగా పార్టీలో ప్రచారం చేసి అతనిని ఆ పదవినుంచి పడదోయవచ్చు. ఒక్కొక్కప్పుడు ప్రధానమంత్రితో అభిప్రాయ భేదాలు తీవ్రంగా వచ్చినట్లయితే ప్రతిపక్షా

లతో చేతులు కలిపి ప్రధానమంత్రిపై విశ్వాసరాహిత్య తీర్మానం పెట్టి నెగ్గించి స్వపక్ష మంత్రివర్గ పతనానికే కాక నూతన మంత్రివర్గ స్థాపనకు, లేదా పార్లమెంట్ సభ రద్దుకు, సాధారణ ఎన్నికలు తిరిగి జరపడానికి కారకులు కావచ్చు.

*కాబినెట్ పనిచేసే విధము:* కాబినెట్ సభ్యులందరు ప్రివీ కౌన్సిల్ సభ్యులు. ప్రివీ కౌన్సిల్ సభ్యులు ప్రివీ కౌన్సిల్ రహస్యాలను బహిరంగంగా ప్రకటించమని ప్రమాణాలు చేస్తారు. అట్లా చేయనినాడు వారు ఆ కౌన్సిల్‌లో చేరటానికి అర్హత లేదు. మొన్న మొన్నటి వరకు కాబినెట్‌లో జరిగే వ్యవహారాలను, మంత్రులు చెప్పే మాటలను లిఖించే పద్ధతి లేదు. ఆ సమావేశాలలో ఉపన్యాసాలు జరగవు. జరిగేవి సంప్రదింపులు, చర్చలు మాత్రమే. సమావేశాంతానికి మంత్రులందరూ ఏకాభిప్రాయానికి వచ్చి ఆ అభిప్రాయానికి తీర్మాన రూప మిస్తారు ఆ తీర్మానానికి అందరూ బాధ్యులే. పరిపాలన సవ్యంగా, శీఘ్రగతిలో సాగటానికి కాబినెట్ సంస్థ ద్వారానే సాధ్యమవుతుంది. ఏకరాజ నియంతృత్వంలో ఉన్నట్లు ప్రజా పరి పాలనలో ప్రభుత్వ నిర్ణయాలు జాప్యం లేకుండా కార్యరూపానికి రావటం సాధ్యం కాదు. అయినా కాబినెట్ విధానము ఇట్లాంటి ఆలస్యాన్ని చాలావరకు తగ్గించటమే కాక ప్రభుత్వ విజయానికి అవసరమయ్యే పరిపాలనారహస్య గోపనానికి ఏకరాజ, నియంతృత్వ విధానాల వలె తోడ్పడుతుంది. ఒకవైపు ప్రజాభిప్రాయాన్ని ప్రతిబింబించే మంత్రివర్గ పరిపాలనకు వీలు కలిగిస్తుంది. ప్రజాభిప్రాయం మారే కొద్దీ కామన్స్‌లోని రాజకీయ పక్షాల బలాలు మారటంవల్ల ప్రభుత్వ విధానాలను మార్చటానికి విప్లవాలు అవసరము. సామాన్యంగా కామన్స్‌లో రెండు పక్షాలుండటంవల్ల మిశ్రమంత్రివర్గాలవలె బ్రిటిష్ కాబినెట్‌లు బలహీనంగా అస్థిరంగా ఉండవు. తమ పార్టీని, ప్రతిపక్షాన్ని రెచ్చగొడితే తమకు పతనం సంభవిస్తుందని మంత్రివర్గాలూ మంత్రివర్గాన్ని పడగొడితే ఈసారి జరిగే ఎన్నికలలో తన పార్టీ పక్షాన అభ్యర్థిత్వం లభించకపోవచ్చుననీ లభించినా పార్లమెంట్ సభ్యత్వం చేజారి పోవచ్చుననీ కామన్స్‌లోని సభ్యులూ పార్లమెంట్ జీవితంలో మధ్యంతరంగా జనరల్ ఎన్నికలు జరపవలసి వచ్చే పరిస్థితులను తెచ్చి పెట్టరు. అందువల్ల బ్రిటన్‌లోని పార్టీ ప్రభుత్వాల స్థిరత్వం తమ విధానాలను అమలుజరపటానికి అవకాశం ఇస్తున్నది. ప్రభుత్వ పక్షం మారినప్పుడల్లా పరి పాలనా విధానం మారదా అంటే - ఆ అనర్థం పార్టీల మధ్య దాటరాని విభేదాలు ఉన్నప్పుడే గాని, రాజ్యాంగ మూల సిద్ధాంతాలపై వారికి ఏకాభిప్రాయమున్నప్పుడు సంభవించదని చెప్ప వచ్చు. 16 వ శతాబ్దంలో కాథలిక్ - ప్రాటస్టెంట్ల మధ్య, 17 వ శతాబ్దంలో రౌండ్ హెడ్ - కెవలియర్ల మధ్య ఉన్నంత తీవ్ర వైషమ్యాలుంటే కాబినెట్ విధానం సాధ్యంకాదు. 18 వ శతాబ్దం నుంచి విగ్ - టోరీలమధ్య, 19 వ శతాబ్దంలో లిబరల్ - కాన్సర్వేటివ్‌ల మధ్య, 20 వ శతాబ్దంలో లేబర్-కాన్సర్వేటివ్‌ల మధ్య అట్లాంటి వైషమ్యాలుగాని, ఆవేశాలుగాని, తీవ్ర రాజకీయ విభేదాలుగాని లేవు. అందువల్ల కాబినెట్ విధానం ఇంగ్లండ్‌లో విజయవంతమయింది.

17 వ శతాబ్దంలో కాబినెట్ విధానం స్థిరపడకముందు మంత్రిని తొలగించటానికి పార్లమెంట్ ఇంపీచ్‌మెంట్ పద్ధతిని ఆశ్రయించేది. ఆ ఇంపీచ్‌మెంట్ కాబినెట్ విధానం స్థిర పడిన తరవాత అనవసరమయింది.

కాబినెట్ విధానానికి ఒక రూపం దిద్దిన వ్యక్తి రాబర్ట్ వాల్‌పోల్. మొదటి, రెండో జార్జ్ రాజుల కాలంలో 1721 సం. నుంచి 1742 సం. వరకు మంత్రివర్గానికి, పార్లమెంట్‌కు

ఆయన మధ్యవర్తిగా ఉండేవాడు. విదేశ వ్యవహారాలలో తన ఇష్టానికి వ్యతిరేకంగా ప్రవర్తించిన కార్టరెట్ మంత్రిని నిర్బంధించి అతడు రాజీనామా ఇచ్చేటట్లు చేసి మంత్రివర్గంలో ప్రధానమంత్రి నాయక స్థానాన్ని వాల్‌పోల్ స్థిరీకరించినాడు. పార్లమెంట్‌లో అధిక పక్ష బలాన్ని కూడగట్టుకొని పరిపాలనలో, కాబినెట్‌లో, పార్లమెంట్‌లో ఏకచ్ఛత్రాధిపత్యం వహించినాడు. టోరీలతో నిండిన కామన్స్ సభ తన విదేశ రాజనీతిని గర్హించి తనపై విశ్వాస రాహిత్య తీర్మానాన్ని ఆమోదించగానే మంత్రులందరితో బాటు తాను రాజీనామా చేసి పదవీ విరమణ చేసినాడు. ఆ విధంగా కాబినెట్ మంత్రివర్గపు ఏకత్వాన్ని, ప్రధాని (Prime Minister) నాయకత్వాన్ని, కాబినెట్ పరిపాలనా విధానపు ఏకత్వాన్ని, మెజారిటీ పార్టీకి మంత్రివర్గ బాధ్యతనూ స్థాపించి కాబినెట్ మంత్రివర్గ విధానానికి వాల్‌పోల్ జనకుడైనాడు. కామన్స్ సభ్యులలో అనేక మందిని తన పక్షానికి తిప్పుకోవటానికి వారిని అనేక ప్రలోభాలకు వాల్‌పోల్ గురిచేసినమాట నిజమే. లోప భూయిష్టమైన పార్లమెంట్ ఎన్నిక వర్గాలు, ఎన్నిక విధానాలు వాల్‌పోల్ అధికార స్థాపనకు తోడ్పడిన మాట నిజమే. అయినా హానోవీరియన్‌లు రాజులు కావటంవల్ల వచ్చిన అవకాశాలను పూర్తిగా ఉపయోగించుకొని ఈనాడు ప్రజా రాజ్యాల విజయానికి కారణమైన కాబినెట్ విధానాన్ని సృష్టించిన కీర్తి మాత్రం వాల్‌పోల్‌కే దక్కింది. కాలం గడిచేకొద్దీ దానిలోని లోపాలు ఏ విధంగా సర్దుబాటయినాయో ముందు తెలుసుకోవచ్చు. వాల్‌పోల్ కాలంలో తరవాత కొన్ని తరాల వరకూ కాబినెట్ అన్నా, ప్రధానమంత్రి అన్నా ప్రజలలోను, పార్లమెంట్‌లోను కొంత ఏహ్యభావము, విరోధ దృష్టి నిల్చి ఉండేవి. అందువల్ల వాల్‌పోల్ తనను ప్రధానమంత్రి అని పిలవటానికి అంగీకరించ లేదు. రహస్య మంత్రివర్గాలకు, నిరంకుశత్వానికి అంగాంగి భావమున్నదని అనేకులు చాలా కాలం తలుస్తూ వచ్చినారు. ధనము, బలము, వంశము, ప్రతిష్ఠ ఉన్న విగ్ ప్రముఖులు ప్రధానమంత్రి అన్న ఒక్క వ్యక్తికి దాసోహ మనటాని కిష్టపడలేదు. టోరీలు రాజు అధికారాన్ని తగ్గిస్తుందని కాబినెట్ విధానాన్ని నిరసించినారు. హానోవీరియన్‌ల రాకతో పరిపాలనలో ప్రాముఖ్యం లేకపోయినందువల్ల టోరీలు కాబినెట్ పద్ధతిని ఆమోదించలేదు. కాని మూడో జార్జ్ రాజయిన తరవాత విగ్‌ల పతనంతోబాటు తాము రాజకీయ వనవాసంనుంచి విముక్తి పొంది ఏనాడు రాజ్యాధిపత్యానికి రావటానికి వీలయిందో ఆనాటి నుంచీ కాబినెట్ విధానంతో ముడిపడిన ప్రజాప్రాతినిధ్య పరిపాలనా విధాన విజయానికి టోరీలూ, విగ్‌లూ సహకరించినారు. ఈ శుభ పరిణామం 'చాతామ్ ప్రభువు కుమారుడు ప్రధానమంత్రి అయ్యే దాకా రాలేదు. దీనికి అప్పుడపుడు మూడో జార్జ్‌ని పట్టి పీడిస్తూ ఉన్న మానసిక అనారోగ్యం కూడా చాలవరకు తోడ్పడింది. ఫ్రెంచ్ విప్లవశక్తులు, నెపోలియన్ విజృంభణవల్ల ఏర్పడిన భయము పరిపాలనాధికారం సర్వమూ పిట్ చేతులలో కేంద్రీకృతం కావడానికి కారణాలయి నాయి. ఆ విధంగా కాబినెట్ విధాన విజయానికి అవి ఉపకరించినాయి. మూడో జార్జ్‌కి మానసికారోగ్యం సరిగా ఉంటే అతడు బహుశా పార్లమెంట్ ద్వారానే పార్లమెంటరీ ప్రజా పరిపాలనా విధాన వినాశనాన్ని, కాబినెట్ విధాన నిర్మూలనాన్ని సాధించి ఉండేవాడు. 18 వ శతాబ్దంలో కాబినెట్ విధానం ప్రయోజనాన్ని ప్రజలు గుర్తించలేదు. రాజు పార్టీల కతీతుడై ఉండటమే శ్రేయస్కరమని అనేకుల మతము. స్టూవర్ట్‌ల ప్రత్యక్ష నిరంకుశత్వాన్ని ఎదిర్చి పోరిన బ్రిటిష్ ప్రజలు మూడో జార్జ్ ప్రచ్ఛన్న నిరంకుశత్వాన్ని ఎదుర్కోవలసివ

అవసరాన్ని గుర్తించలేదు. పార్లమెంట్ ఎన్నికల విధానంలోని లోపాలు, పార్లమెంట్ సభ్యుల అవినీతి బ్రిటన్‌లోని ప్రజారాజ్యాన్ని అపహాస్యం చేసినాయి. 18 వ శతాబ్దాంతానికే ప్రజాశక్తి బలపడుతూ వచ్చి పార్లమెంటరీ ప్రాతినిధ్యం కోసం జనసామాన్యం తహతహ లాడే పరిస్థితులు ఏర్పడి అవి క్రమంగా 19 వ శతాబ్దంలో పార్లమెంటరీ ప్రాతినిధ్యంలోనూ ఎన్నికల విధానంలోనూ సంస్కరణలకు దారి తీసిన విషయాన్ని లోగడ వివరించడం జరిగింది.

## 19 వ శతాబ్దంలో ప్రజాభిప్రాయము

పార్లమెంటరీ ప్రాతినిధ్యంలోని లోపాల తొలిగింపు, ఎన్నిక వర్గాల మధ్య సభ్యత్వ స్థానాల పంపకము కామన్స్ సభ ఆధిపత్యాన్ని నెలకొల్పినాయి. పార్లమెంట్‌లో సభ్యులు చేసే చర్చలు, ఉపన్యాసాలు సవివరంగా పత్రికలు అచ్చువేయడంవల్ల ప్రజానీకపు రాజకీయ పరిజ్ఞాన మెక్కువయింది. పార్లమెంట్‌లోనూ బయటా ప్రసిద్ధ రాజకీయ నాయకులు ఉపన్యాసా లివ్వటం సామాన్య విషయమయింది. ఇవన్నీ పత్రికలకు వ్రాసేవారి వాదాలకు కావలసినంత విషయ సామగ్రిని అందజేసినాయి. 1855 సం. లో పత్రికలపై స్టాంప్ పన్ను, 1861 లో పత్రికలకు కావలసిన కాగితాలపై పన్నూ రద్దు అయినాయి. అందువల్ల వార్తా పత్రికలు చాలా చౌక ధరకు దొరికేవి. వాటిని చదివే వారి సంఖ్య కూడా పెరిగింది. పార్లమెంట్ లోపల జరిగే చర్చలకంటె పార్లమెంట్‌కు బయట ప్రజలు పబ్లిక్ సమస్యల మీద చర్చలు చేసి నిర్ణయాలకు రావటం సాధారణమయిపోయింది. ఈ విధమైన చర్చ లింత విరివిగా సాగటానికి రాజకీయ పక్షాలు తమ విధానాలను ప్రజలలో ప్రచారం చేయటంలో విశేష శ్రద్ధ వహించటమే కారణము

రాజకీయ పక్షాలు : ఇవి మొదటి ఛార్లెస్ కాలంలోనే పార్లమెంట్‌లో స్థిరపడినాయి. కాని పార్లమెంట్‌లో కాకుండా బయట దేశ వ్యాప్తంగా రాజకీయ పక్షాల ఏర్పాటు 18 వ శతాబ్ది మధ్యకాలంలో విశేషంగా సాగింది. దీనికి వోటర్ల సంఖ్య లక్షలలో పెరగటం బాగా తోడ్పడింది. పక్షాలను బలపరిచి వాటి ప్రణాళికలను, సిద్ధాంతాలను ప్రచారం చేసి ప్రజల దృష్టిని ఆకట్టుకోవటం అత్యవసరమయింది. తత్ఫలితంగా రాజకీయాలు సంపాదన కుపకరించే అనేక వృత్తులలో ఒక ముఖ్య వృత్తిగా ఏర్పడటం తటస్థించింది. ఏ ప్రణాళికను ఏ విధంగా ప్రచారం చేస్తే ప్రజలు తమ పక్షాన్ని ఎక్కువగా ఆదరిస్తారో తీవ్రంగా ఆలోచించవలసిన విషయ మయింది రాజకీయ పక్ష నాయకులు స్థానికంగా పనిచేసే తమ ఏజంట్లతోను, వోటర్ వర్గాలతోను పరిచయాన్ని, సంబంధాలను పెంచుకొని కట్టుదిట్టాలు చేసుకోవటం ప్రారంభించి నారు. పక్షానికి బలమిచ్చే వ్యక్తి ఎవ్వడు? అతడు పార్టీ పట్ల విశ్వాసంతో ఉంటాడా? లేదా? అతనికి వోటర్ల అభిమానం సంపాదించే వ్యక్తిత్వము, నేర్పరితనము ఉన్నవా? పార్టీ ప్రణాళికలను భక్తి శ్రద్ధలతో బలపరిచే వాడేనా? అనే అంశాలపై రాజకీయ నాయకులు శ్రద్ధ వహిస్తూ వచ్చినారు. పార్లమెంట్‌కు సభ్యుడుగా నిలబడే వ్యక్తి ఎన్నికకు ముందే పార్టీ ప్రణాళికకు, స్థానిక పార్టీ శాఖకు, వోటర్లకు ప్రమాణ పూర్వకంగా కట్టుబడవలసి వచ్చింది. సభ్యులై పార్లమెంట్‌లో చర్చలు విన్న తరవాత అభిప్రాయాలను తదనుగుణంగా మార్చు కొనే స్వాతంత్ర్యాన్ని పార్లమెంట్ సభ్యులు ముందే కోల్పోయినారు.

పార్టీకి మరో ప్రత్యేక లక్షణమేమిటంటే తాత్కాలికంగా ఒకానొక నిర్దిష్ట లక్ష్య సాధనకు ఏర్పడి తరవాత అంతరించే సంఘాలు కూడా ఉంటాయి. ఉదాహరణకు కొన్ని : 1. కాథలిక్ సంఘము - కాథలిక్‌ల ఇబ్బందులను, కానిసత్వాన్ని తొలిగించటాని కేర్పడే సంఘము. 2. ధాన్య శాసన నిరోధక సంఘము (Anti - Corn Law League). 3. రాజకీయ సంస్కరణలను ప్రవేశపెట్టడానికి కృషిచేసే నిమిత్తం ఏర్పడిన సంఘాలు. ఇవి ప్రజాభిప్రాయాన్ని తీర్చిదిద్దటంలోను, ప్రజలలో ఉత్సాహాన్ని పుట్టించటంలోను చాలా గట్టి కృషి చేసినాయి. కొన్ని సందర్భాలలో తాము కోరే సంస్కరణలు పార్లమెంట్ చేయక పోతే దౌర్జన్యపూరిత విప్లవాన్ని లేవనెత్తగలమని కొన్ని సంఘాలు బెదిరించటం కూడా సంభవించింది. ఇట్లాంటి ప్రత్యేక సంఘాలు తాత్కాలికంగానైనా పార్లమెంట్ సంస్థ ప్రాముఖ్యాన్ని తగ్గిస్తూ ఉండేవి.

1832, 1867, 1868, 1884, 1885 ల నాటి పార్లమెంటరీ ప్రాతినిధ్య సవరణ శాసనాలు ప్రజా ప్రతినిధి సభగా పార్లమెంట్‌కు ఉన్న ప్రాముఖ్యాన్ని ఎన్నో రెట్లు పెంచి నాయి. కామన్స్ సభ ప్రభుత్వ విధానాలను నిర్ణయించటంలోనే గాక పరిపాలనా కార్యక్రమం లోని సూక్ష్మాతి సూక్ష్మ విషయాలను, విమర్శనలో నిర్ణయంలోను ప్రధాన పాత్ర వహించే స్థితికి వచ్చింది. మంత్రివర్గ నిర్మాణంలో రాజుకు మిగిలిన అధికారమేమీ లేదు. పార్టీ నాయకుడూ ప్రధానమంత్రీ అయిన వ్యక్తి సూచించిన వారినే మంత్రులుగా రాజు నియమిస్తాడు. విశ్వాసరాహిత్య తీర్మానము కామన్స్ సభ ప్రకటించగానే మంత్రిగాని మంత్రివర్గమంతాగాని రాజీనామాచేసిపోవటం సర్వ సామాన్యమైంది. సాధారణ ఎన్నికల ఫలితాలను బట్టి పార్టీల బలాబలాలు తెలిసిన వెంటనే వోటర్‌ల విశ్వాసం పోగొట్టుకొన్న మంత్రివర్గం రాజీనామా సమర్పించుకోవలసి ఉంటుంది. మంత్రివర్గానికి పక్షబలము అధికంగా ఉన్నంత కాలము మంత్రివర్గాల మాటకు ఎదురు ఉండదు. వందల కొద్దీ ఉండే పార్లమెంట్ సభ్యులు నిలకడగా మంత్రివర్గాలను బలపరుస్తారా అన్న సందేహానికి ఆస్కారమే లేదు. మంత్రివర్గ సభ్యులకు తమ స్థానాలు కాపాడుకోవటంలో ఎంత శ్రద్ధ ఉంటుందో తొందరపడి సాధారణ ఎన్నికలను నెత్తికి తెచ్చుకోరాదనే విషయంలో పార్లమెంట్ సభ్యులకు అంత శ్రద్ధ ఉంటుంది. పూర్వం ప్రముఖులైన వ్యక్తులు తమ పలుకుబడిని నిలుపుకోవడానికి తమ అధీనంలో ఉన్న నియోజక వర్గాల నుంచి కామన్స్ సభ్యులను తమ చేతిలో పెట్టుకొని ఉండేవారు. ఎన్నికయిన వారి స్వార్థానికి భంగం కలిగితే మంత్రివర్గానికి ఎదురు తిరగటానికి వెనకాడే వారు కాదు. ఆ ప్రముఖ వ్యక్తులను మంత్రివర్గం నమ్ముకొని ఉండటానికి వీలయ్యేది కాదు. వారిని ఎదుర్కొవటానికి పట్టణ ప్రతినిధులైన కామన్స్ సభ్యులు కూడా జంకేవారు. ఈ సంస్కరణ శాసనాలు అమలులోకి వచ్చిన తరవాత కామన్స్ సభ్యుల అస్వతంత్రత పెరిగిపోయింది. పార్టీ నాయక వర్గానికి వారు దాసోహమనక ఏ మాత్రం తప్పలేదు. స్వతంత్రమైన అభిప్రాయాలు ప్రకటించినా ఆ నాయకుల కరుణాకటాక్షాలకు దూరమై రాబోయే ఎన్నికలలో పార్టీ అభ్యర్థిత్వానికి టిక్కెట్ దొరకదేమోనన్న భయం పార్లమెంట్ సభ్యులకు ఉండేది. ఈ విధంగా వారి స్వాతంత్ర్య బుద్ధి సర్వనాశనము అయింది. ఒకవేళ పార్టీని కాదని స్వతంత్రుడుగా పోటీకి నిలబడి జవాడు కామన్స్‌కు ఎన్నికయ్యే అవకాశం ఏ మాత్రం లేకపోయేది. పార్టీ నిధులు, యంత్రాంగము, అనుచర కోటి, వార్తా పత్రికలపై పార్టీ నాయకులకున్న పలుకుబడి, అది

కారము పార్టీ ప్రాభవాన్ని దశ దిశలా వ్యాపింపజేసి స్వతంత్రంగా కామన్స్ సభ్యత్వానికి ప్రయత్నించే వ్యక్తికి ఎన్నిక అయ్యే అవకాశము ఏ మాత్రం లేకుండా చేసినాయి. సభ్యత్వం పోగొట్టుకొన్న వ్యక్తులకు ఒక్కొక్కప్పుడు ప్రజా జీవితంతో స్థానం లేకపోవడమేకాక జీవనాధారం కూడా లేని గతి తటస్థించవచ్చు. ఇటువంటి కారణాలవల్ల క్రమంగా 19 వ శతాబ్దంలో అడుగుపెట్టే నాటికి పార్లమెంట్ సభ్యుడు నూటికి నూరుపాళ్ళు రాజకీయ పక్షపు ప్రతినిధి అయినాడు. పార్టీ నాయకత్వానికి, వోటర్లకు ఎంత అవినాభావ సంబంధ ముంటుందో అంతవరకే కామన్స్‌లోని పార్టీ సభ్యుడు వోటర్లకు సంపూర్ణ ప్రాతినిధ్యం వహించి పార్టీ చెప్పినట్లు పార్లమెంట్‌లో ప్రవేశ పెట్టిన చట్టాలపై వోటు చేసే పార్టీ యంత్రాంగానికి సాధనమైనాడు. దానివల్ల ప్రభుత్వ పక్షానికి కామన్స్‌లో తనకున్న సంఖ్యాధిక్యం (మెజారిటీ) పడిపోతుందనే భయము ఏ మాత్రం లేదు. మితిమీరి ప్రవర్తిస్తే రాబోయే ఎన్నికలలో ప్రతిపక్షం అధిక సంఖ్యలో కామన్స్‌కు ఎన్నిక అవుతుందేమోనన్న భయము మంత్రివర్గ నిరంకుశ ధోరణులకు అంకుశంగా పని చేస్తుంది. కాబినెట్ మంత్రివర్గాల శాసనాధికారము: 1882 నాటి సంస్కరణ శాసనానికి ముందు ఏ మంత్రివర్గమూ తాను ప్రతిపాదించిన చిత్తు చట్టాన్ని పార్లమెంట్ తోసివేసిందన్న కారణం మీద పదవీ విరమణం చేయలేదు. కాని ఈనాడు అట్లాంటి పరిస్థితిలో ఆ చట్టం అమలులోకి వస్తే ఏ మంత్రివర్గమూ పదవుల కంటిపెట్టుకొని ఉండ లేదు. రాజీనామానైనా చేయవలె. లేదా ఆ చట్టాన్ని ముఖ్య సమస్యగా తీసుకొని సాధారణ ఎన్నికలు జరిపి ఆ సమస్య ప్రజామోదం పొందిందని రుజువైనా చేయవలె. ఒక సభ్యునికి తన కిష్టమైన చిత్తు చట్టాన్ని పార్లమెంట్‌లో ప్రతిపాదించే హక్కు ఉంది. కాని అది అంత ప్రయోజనకారిగా ఉండలేదు. ప్రభుత్వ కార్యక్రమం బాగా విస్తరించడంవల్ల మంత్రివర్గం ప్రవేశపెట్టే చిత్తు చట్టాలను చర్చించి ఆమోదించటానికే పార్లమెంట్ సమావేశానికి వ్యవధి చాలక వాయిదా వేయటం సంభవిస్తూ ఉంటే సభ్యుడు ఒక్కడే స్వబుద్ధితో యోచించి ప్రతిపాదించిన చిత్తు చట్టానికి సమయము ఎక్కడ ఉంటుంది? ఒకవేళ ఉపపాదించనిచ్చినా ఆ చిత్తు చట్టాన్ని ఏదో ఒక దశలో ఉపసంహరించవలసి వస్తుంది. ఇప్పటికే పార్లమెంట్ చేసే చట్టాలకు మితిలేకుండా ఉంది. ఒక చిత్తు చట్టాన్ని న్యాయశాస్త్ర ధోరణిలో మంత్రుల కార్యవర్గాలు, పార్లమెంట్‌లోని అన్ని పక్షాల ప్రనితిధుల కమిటీలు విమర్శించిన తరవాత కామన్స్ సభలో మూడుసార్లు, ప్రభువుల సభలో మూడుసార్లు పఠించిన తరవాత అది శాసనమవుతూ ఉంటుంది. ఇన్ని దశలలో ఒక సభ్యుని ప్రత్యేక శాసనాన్ని విపర్శ పునర్విమర్శలు చేయటానికి అవకాశము ఉండదు. కొత్త చట్టాలకుగాని పాత చట్టాల సవరణకుగాని అవసరమున్నదా? లేదా? అన్న విషయము వాటిని అమలుచేసే మంత్రివర్గాలకు తెలిసినంతగా ప్రత్యేక సభ్యునికి తెలిసే అవకాశం లేదు.

మంత్రివర్గాల అంతరంగిక ఐక్యము: మూడో జార్జ్ కాలంలో ఉండే రాజమిత్రుల పక్షం వంటిది మంత్రమండలిలో ఉండే అవకాశము సంస్కరణ శాసనాలు వచ్చిన తరవాత సాధ్యం కాలేదు. ప్రధానమంత్రి విధానంతో సంపూర్ణంగా ఏకీభవించని మంత్రికి కాబినెట్ సభ్యత్వము ఉండదు. కాబినెట్‌కు, కామన్స్‌లోని ప్రభుత్వ పక్షానికి మధ్య ఉండే ఐక్యం కంటె కాబినెట్ మంత్రుల మధ్య ఐక్యము అత్యవసరమని వేరే చెప్పనక్కరలేదు. కాబినెట్ మంత్రుల మధ్య, కామన్స్ సభలోని ప్రభుత్వ పక్ష సభ్యుల మధ్య భేదాభిప్రాయాలు ఎక్కు

వయితే పార్టీ తన అధికారాన్ని త్వరలోనే పోగొట్టుకొంటుంది. అందువల్ల మంత్రివర్గ విధానంతో ఏ మంత్రి ఏకీభవించడో ఆ మంత్రి ఓర్పుతో తన అభిప్రాయాన్ని సహమంత్రులకు, ప్రధానమంత్రికి అంతరంగికంగా నచ్చచెప్పటం సముచితమైన పని. ఆ విధమైన స్వతంత్ర వృత్తి ఉన్న మంత్రిని ప్రధాని తప్పక మంత్రిమండలి నుంచి బహిష్కరిస్తాడు. అందువల్లనే తన మనస్సుకు, వివేక దృష్టికి ఒక విధానము సంపూర్ణంగా దుష్టమని తోచినా మంత్రి బహిరంగంగా దానిని సమర్థించటం చూస్తూ ఉంటాము. పార్లమెంట్‌లోని అధిక సంఖ్యాకుల పక్షం నుంచి మంత్రివర్గాన్ని ఏర్పరిచే పరిస్థితులలో ఇది అనివార్యమవుతూ ఉంటుంది.

19-20 శతాబ్దాలలో ప్రభుత్వ కార్యభారం విపరీతంగా పెరిగిందన్న విషయం ముందే ప్రస్తావించడం జరిగింది. మంత్రివర్గపు పరిపాలన ప్రజారాజ్యంలో జనామోదం పొందటానికి ప్రజల అవసరాలన్నింటినీ తీర్చవలసి ఉంటుంది ప్రజావసరాలు నిరంతరం పెరిగిపోతున్న కాలమిది. సామ్యవాద సిద్ధాంతాల వ్యాప్తి, నిరంతర విజ్ఞాన శాస్త్రాభివృద్ధి సుఖ జీవనానికి సాయపడే వస్తూత్పత్తి పెంపు మానవ జీవితాలనే కాక ప్రభుత్వ కార్యకలాపాలను కూడా క్లిష్టతరం, కష్టసాధ్యం చేస్తూ ఉన్నాయి. ప్రభుత్వ విధులు పెరిగిపోతున్నాయి. కాబట్టి సంస్కరణ శాసనాల అనంతరం పరిపాలకవర్గంలో అనేక శాఖలు పుట్టుకొని వస్తున్నాయి.

## కేంద్ర ప్రభుత్వము

గడిచిన నూరేళ్ళలో కేంద్ర ప్రభుత్వంలో అనేక కొత్త కొత్త శాఖ లేర్పడినాయి. వాటితోబాటు కార్య సౌలభ్యం నిమిత్తం పాతశాఖల పునర్నిర్మాణం కూడా సాగుతూ ఉంది.

**స్టేట్ కార్యదర్శులు :** 1707 సం. కు ముందు స్కాట్లండ్‌కు ఒక స్టేట్ కార్యదర్శి (Secretary of State), ఇంగ్లండ్‌కు ఒక స్టేట్ కార్యదర్శి ఉండేవారు. రెండు దేశాలూ కలిసిపోయిన తరవాత - అంటే 1745 సం. విప్లవం అణిగిపోయేదాకా - స్కాట్లండ్ వ్యవహారాల నిర్వహణకు మరో కార్యదర్శిని నియోగించేవారు. ఏడేళ్ళ యుద్ధం (1763) తరవాత కాలనీల వ్యవహారాలను చూడటానికి మరో సెక్రటరీ నియమితుడయినాడు. కాని 1782 లో 13 అమెరికన్ కాలనీలు స్వతంత్రించడంవల్ల ఈ సెక్రటరీ పదవి రద్దయింది. మిగిలిన స్టేట్ సెక్రటరీలలో ఒకరు విదేశవ్యవహారాలు, మరొకరు దేశవ్యవహారాలు చూడటానికి నియమితులయినారు. దేశవ్యవహార మంత్రికి బరిష్ కాలనీల వ్యవహారాలను అప్పగించినారు. ఫ్రెంచ్ యుద్ధకాలంలో కాలనీలను, కొంత సైనిక పరిపాలనను ఒక సహాయ కార్యదర్శికి స్వాధీనం చేసినారు. క్రిమియన్ యుద్ధకాలంలో యుద్ధకార్యాలను ప్రత్యేకంగా ఒక కార్యదర్శి చూడవలసి రాగా కాలనీల పరిపాలనకు నాలుగో కార్యదర్శిని నియమించనారు. 1858 లో ఇండియా పరిపాలనను తూర్పు ఇండియా వర్తక సంఘం బ్రిటిష్ ప్రభుత్వానికి బదలాయించింది. అప్పుడే ఇండియాకు స్టేట్ కార్యదర్శి నియామకం జరిగింది. 1858 నాటికి స్టేట్ కార్యదర్శుల సంఖ్య అయిదు. అవసరమైనప్పుడు ఏ శాఖ కార్యదర్శి అయినా మరోశాఖ విషయాలను చూడటం చట్టం అనుమతిస్తుంది. ఈ అయిదుగురికీ కాబినెట్ మంత్రి హోదా ఉంది.

హోదానుబట్టి దేశీయ కార్యదర్శి కార్యదర్శులలో మొదటివాడు. ఇతని విధు లనేకము ; రాజు ఇచ్చే సమాధానాలు పంపడం, రాజ్యంలో శాంతిభద్రతలు కాపాడటం, న్యాయ పరిపాల

నకు ఏర్పాట్లు చేయటం. కారాగారాలు నగరాల పోలీస్ సిబ్బంది ఇతని అధీనంలో ఉంటాయి. రాజు తన ప్రత్యేకాధికారం పురస్కరించుకొని ఎవరిని క్షమించవలెనో సూచించే పనికూడా ఈయనదే. ఈ విషయాలలో ఐర్లండ్‌కు కూడా ఇతడే అధికారి. కాని ఐరిష్ పరిపాలన బాధ్యత ముఖ్య కార్యదర్శిది. మొదట అతడు ఐరిష్ లెఫ్టినెంట్ ప్రభువుకు లోబడి ఉండే వాడు. తరవాత అతడు స్వతంత్రంగా వ్యవహరించే మంత్రి అయినాడు.

2. *విదేశ వ్యవహారాల కార్యదర్శి విధులు:* ఇతర స్వతంత్ర రాజ్యాలతో బ్రిటిష్ దేశానికున్న వ్యవహారాలను ఇతడు పరిశీలిస్తాడు. విదేశాలకు రాయబారులను, రాజనీతి ప్రవర్తకులను (diplomatic agents) నియమించటంలో రాజుకు ఇతడు సలహాదారు. విదేశ వ్యవహారాలకు సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాలను ఇతడు చూస్తాడు. విదేశాలలో బ్రిటిష్ పౌరులు కష్ట నష్టాలకు గురి అయితే వాటికి పరిహారం రాబట్టవలసిన బాధ్యత కూడా ఇతనిదే

3. *యుద్ధకార్యదర్శి:* నేలమీద యుద్ధంచేసే సేనలకు సంబంధించిన అన్ని వ్యవహారాలలోను ఇంచుమించు సంపూర్ణాధికారము ఇతని చేతులలో ఉంది.

4. *కాలనీల స్టేట్ కార్యదర్శి:* కాలనీలకు మాతృదేశంతో ఉండే సర్వసంబంధాలనూ ఇతడు చూస్తాడు. కాలనీలకు గవర్నర్ల నియామకము, వారి ఉద్యోగ విరమణ ఇతని సలహా మీదనే జరుగుతాయి. కాలనీలలోని శాసనసభలు చేసే శాసనాలను ఇతని సలహాపై రాజు వీటో చేస్తాడు. స్వపరిపాలన అనుభవించే కాలనీల ప్రజలకూ మాతృదేశానికి మధ్య సంప్రదింపులు సాగించేది ఇతడే. స్వాతంత్ర్య వాంఛ పెరిగిపోతున్న ఈ కాలంలో స్వపరిపాలనాధికారాలను, ఆర్థిక వ్యాపారాది విషయాలలో హెచ్చు స్వాతంత్ర్యాన్ని కాలనీల ప్రజలు కోరటం సర్వసామాన్యమయింది. ఒక పక్క కాలనీల ప్రజలను సంతృప్తిపరచవలె; మరోపక్క మాతృదేశ క్షేమాన్ని కాపాడవలె. ఈ రెండింటిని దృష్టిలో పెట్టుకొని ప్రణాళికలను వేసే బాధ్యత, వాటి నిర్వహణ ఈ కార్యదర్శి పనులు.

5. *ఇండియా స్టేట్ సెక్రటరీ (Secretary of State for India):* 1783 పిట్ ఇండియా బిల్ ప్రకారం తూర్పు ఇండియా వర్తక సంఘం సొంతదారుల సభ (Court of Proprietors) పై అజమాయిషీకి డైరెక్టర్ల బోర్డ్‌ను స్థాపించడం జరిగింది. దానికొక అధ్యక్షుని నియమించి అతనికి బ్రిటిష్ కాబినెట్‌లో స్థాన మిచ్చినారు సొంతదారులకు ఇండియా ప్రభుత్వానికి మధ్యసాగే వ్రాతకోతలు ఈ అధ్యక్షుని ద్వారా జరగవలె. ఇండియాలోని రాష్ట్ర గవర్నర్ల, గవర్నర్ - జనరల్, కౌన్సిలర్, సైనికాధికారుల నియామకాలు, అధికారాలు డైరెక్టర్ల బోర్డు అధ్యక్షుని సమ్మతికి లోబడవలసినట్లు, రాజనీతి వ్యవహారాలపై కడపటి మాట అతనిదే అయ్యేటట్లు ఏర్పాటు జరిగింది. 1813, 1833, 1853 నాటి ఛార్టర్ శాసనాలు క్రమంగా అన్ని పరిపాలనాధికారాలను బ్రిటిష్ కాబినెట్ పరం చేసినాయి. 1858లో కంపెనీని తొలిగించి కంట్రోల్ బోర్డ్ అధ్యక్షుని స్థానే ఇండియా స్టేట్ సెక్రటరీని, అతనికి సలహాలివ్వటానికి ఇండియా కౌన్సిల్‌ను పార్లమెంట్ శాసనము ఏర్పాటు చేసింది. ఈ కౌన్సిల్ సభ్యులలోని సగం మంది ఉన్నతోద్యోగులు ఇండియా పరిపాలనలో అనుభవం గడించిన వారు. గవర్నర్ జనరల్‌కు (రాజ ప్రతినిధికి), గవర్నర్లకు సలహా ఇచ్చే సంఘాలు (Councils) ఉన్నా అ సలహాలను గవర్నర్లూ, గవర్నర్ జనరలూ తమ కిష్టమైతేనే పాటిస్తారు. అట్లాగే ఇండియా కౌన్సిల్ అభిప్రాయాలను ఇండియా స్టేట్ సెక్రటరీ స్వీకరించ

వచ్చు; నిరాకరించనూ వచ్చు. ఇండియా రాజ ప్రతినిధికి ఇంచుమించు సార్వభౌమాధికార మున్నా బ్రిటిష్ కాబినెట్‌కు, దానిలో సభ్యుడైన ఇండియా స్టేట్ సెక్రటరీకి శాసన రీత్యా బాబేదారే. ఈ ఇద్దరిలో ఎవ్వరి మాట సాగుతుంది అనేది వారి వారి వ్యక్తిత్వాలపై ఆధార పడుతూ ఉండేది. పైవి కాక ఇతర పరిపాలన కార్యాలు చూసే బోర్డులు ఇంకా కొన్ని ఉన్నాయి. వాటి అధ్యక్షులకు మంత్రిమండలిలో స్థానాలున్నాయి. అటువంటి బోర్డులలో ముఖ్యమైనవి కొన్ని: (1) విద్యా విషయాల బోర్డ్ (2) వాణిజ్య బోర్డ్ (3) నౌకాసైన్యపు బోర్డ్ (4) స్థానిక పరిపాలన బోర్డ్ (Board of Admirality).

6. *విద్యావిషయాల బోర్డ్ అధ్యక్షుడు:* ప్రారంభవిద్య నిమిత్తం ప్రభుత్వం మొదటి సారి 1834 లో విరాళమిచ్చింది. 1839 లో విరాళాన్ని ఎక్కువ చేసింది. విరాళాన్ని సద్విని యోగం చేయడానికి ప్రీవీ కౌన్సిల్ కమిటీ ఏర్పాటు అయింది. 1856 సం. లో ప్రీవీ కౌన్సిల్ ఉపాధ్యక్షుని పై కమిటీకి అధ్యక్షుడుగా చేయడం జరిగింది. 1870 సం. లోనూ, తరవాత వచ్చిన ప్రారంభ విద్యా శాసనాలవల్లనూ విద్యాశాఖ కార్యభారం పెరిగింది. ప్రభుత్వ విరాళాలు లక్షలు దాటినాయి. ప్రభుత్వమే ప్రారంభ విద్యా వ్యాప్తికి బాధ్యత వహించి సెకండరీ, టెక్నికల్, యూనివర్సిటీ విద్యావిధానాలలో ఎక్కువ ఐక్యం కల్గించుకోవడం మొదలు పెట్టింది. 1899 సం. లో ప్రీవీ కౌన్సిల్ కమిటీ స్థానంలో బోర్డ్ ఒకటి ఏర్పాటు అయింది. కాని దాని సర్వాధికారాలను దాని అధ్యక్షుడే చెలాయించేవాడు. అతనికి కాబినెట్ మంత్రి హోదా ఉండవచ్చు, లేకపోవచ్చు.

7. *వాణిజ్యబోర్డ్ అధ్యక్షుడు:* ఈ బోర్డ్ చాలా కాలం ప్రీవీ కౌన్సిల్ కమిటీలలో ఒకటిగా ఉండేది. 1862 సం. లో దానికి బోర్డ్ హోదా కల్పించినారు. వ్యాపారంలోను, వ్యవసాయంలోను ఉపయోగపడే గణాంకాలను (Statistics) అది సేకరించి ప్రకటిస్తుంది. క్రమమైన కొలతలు, తూనికలు జన వ్యవహారంలో ఉండేటట్లు చేస్తుంది. దివాలా చట్టాన్ని పేటెంట్ల చట్టాన్ని అది అమలు పరుస్తుంది. రైల్వే, ట్రామ్‌వే కంపెనీల మీద, నీరు, గాస్, విద్యుద్దీపాలు మొదలైన వాటి మీద ఈ బోర్డ్‌దే పెత్తనము. రేవుల, లైట్ హౌస్‌ల, వర్తకపు ఓడల మీది అధికారము బోర్డ్‌దే. ఆ బోర్డ్‌లో పని అధికారమూ అధ్యక్షునివే. బోర్డ్ సభ్యుల దేమీ లేదు.

8. *నౌకాదళ బోర్డ్ మొదటి అధ్యక్షుడు* (First Lord of the Admirality): రాయల్ నౌకాదళంపై అధికారి మొదట ఉన్నత అడ్మిరల్ ప్రభువు (Lord High Admiral). 1708 సం. లో నౌకాదళం ఉన్నత అడ్మిరల్ ప్రభువు పదవిని కమిషన్ పరం చేసినారు. తరవాత నౌకాదళ వ్యవహారాలను నౌకాదళ బోర్డ్‌కు మార్చినారు. కాని దీని అజమాయిషీని ఈ బోర్డ్, ఇతర బోర్డులు పంచుకొన్నాయి. 1832 సం. లో నౌకాదళ సర్వ వ్యవహారాల యాజమాన్యాన్ని నౌకాదళం బోర్డ్ (Admirality Board) అధీనం చేసినారు. ఆ బోర్డ్ సర్వాధికారికి మొదటి ప్రభువు (First Lord) అని పేరు. ఆ బోర్డ్‌లోని ఇతర సభ్యు లతనికి సలహాదారులు మాత్రమే. ఈ మొదటి ప్రభువుకు కాబినెట్‌లో స్థిరమైన స్థాన ముంది.

9. *స్థానిక ప్రభుత్వపు బోర్డ్ అధ్యక్షుడు:* స్థానికాధికారులు 19 వ శతాబ్దానికి ముందు నిరంకుశులై ఉండేవారు. వారి పరిపాలనపై ప్రభుత్వం పరిశీలించేది కాదు. పేదల

శాసనాన్ని అమలు జరపటంలో వారు కాఠిన్యం చూపేవారు. పేదల ఇక్కట్లు తొలిగించటం. తగిన పనులు కల్పించటం, పోషణ భృతిని ఇవ్వటం, గృహనిర్మాణం మొదలయినవాటికి కావలసిన ధనాన్ని సేకరించటం సరిగా చేసేవారు కారు. పేదల సుంకాలను (Poor-rates) సరిగా వసూలు చేసేవారు కారు. విద్య, ఆరోగ్య రక్షణ, న్యాయపరిపాలన మొదలైన విష యాలలో తగిన శ్రద్ధ చూపేవారు కారు. అందువల్ల స్థానికాధికారుల విధినిర్వహణపై అజ మాయిషీ అవసరమని గుర్తించి ప్రభుత్వము 1834 సం. లో పేదల చట్టానికి సవరణ శాసనం చేసి పేదలకు భృతి సరిగా అందుతున్నదో లేదో చూడటానికి కమిషనర్‌లను నియమించింది. 1847 సం.లో కమిషనర్‌ల స్థానంలో బోర్డ్‌ను స్థాపించడం జరిగింది. ఆ తరవాత సంవత్సరం లోనే ఆరోగ్యపు బోర్డ్ ఏర్పాటు అయింది. స్థానికాధికారులు వ్యాధినివారణోపాయాలు అవలంబిస్తు న్నారో లేదో గమనించి ఆ జాగ్రత్తలు వారు తీసుకొనేటట్లు చూసే బాధ్యత ఈ బోర్డ్‌కు ఉంది. ఈ బోర్డ్ 1858 సం. లో రద్దయింది. అది చేసే పనులు దేశీయ కార్యదర్శి, ప్రీవీ కౌన్సిల్ పంచుకొన్నారు. క్రమంగా స్థానిక జనసంఖ్య చాలా పెరగటంవల్ల 1871 సం. లో ప్రత్యేకంగా స్థానిక పరిపాలనకు ఒక బోర్డ్ స్థాపించినారు. 1858 సం. లో దేశీయ కార్య దర్శికి, ప్రీవీ కౌన్సిల్‌కు ప్రజారోగ్య రక్షణకోసం అప్పగించిన కార్యాలను పేదల బోర్డ్ నిర్వహించే పనులను ఈ స్థానిక పరిపాలన బోర్డ్ పరం చేసినారు. పేరుకు బోర్డేకాని నిజానికి తత్కార్య నిర్వాహకుడు బోర్ అధ్యక్షుడే. అతనికి కాబినెట్ హోదా కూడా ఉంది. 1919 సం. లో స్థానిక పరిపాలన బోర్డ్ కార్యనిర్వహణకు ఆరోగ్యమంత్రి పదవిని సృష్టించినారు.

*కార్యనిర్వాహక వర్గంలోని ఇతర శాఖలు:* 1. పోస్ట్‌మాస్టర్ జనరల్ అధిపతిగా పోస్ట్ ఆఫీస్‌శాఖ. 2. మొదటి కమిషనర్ సర్వాధిపతిగా నిర్మాణాల బోర్డ్ (Board of Works). దీనిని 1851 సం. లో నెలకొల్పినారు. రాజోద్యానవనాలను, ఇతర ప్రభుత్వ భవనాలను పరిరక్షించే పని ఈ బోర్డ్‌ది. 3. వ్యవసాయ బోర్డ్ : 1889 వ సం. శాసనం ప్రకారం ఇది స్థాపితమయింది. వ్యవసాయ సంబంధమైన లెక్కలను ఇది ప్రచురిస్తుంది. పశు వ్యాధులను అరికట్టే పని కూడా ఇది చేస్తుంది.

ప్రభుత్వ బాధ్యతలు, అవసరాలు పెరిగే కొద్దీ పరిపాలన శాఖలు ఈ విధంగా పెరిగి పోతున్నాయి. కార్మిక జనానికి కామన్స్‌లో ప్రాతినిధ్యం లభించే కొద్దీ వారి అవసరాలను ప్రభుత్వం తీర్చవలసిన బాధ్యత ఉంది కనక పరిపాలక శాఖలు అభివృద్ధి అయినాయి. 19 వ శతాబ్దారంభంలోనే పరిపాలనాధికారం సర్వమూ రాజునుంచి పార్లమెంట్‌కు ఎట్లా సంక్రమిం చిందో ముందే చదివినాము. అంతేకాక శాసనాధికారం కూడా ఈ శతాబ్దంలో పార్లమెంట్ నుంచి మంత్రిమండలి చేతులలోకి పూర్తిగా జారిపోయింది. దీనికి దారి తీసిన కారణాలు (1) పార్లమెంట్‌లోని ప్రభుత్వ పక్ష సభ్యులు మంత్రివర్గంలోని తమ నాయకుల మాటను తిరస్కరించలేక పోవటం, (2) ప్రజల అభిప్రాయాలకు మంత్రివర్గాలు ఎక్కువ విలువ నివ్వటం, (3) ఆరువందల మందికి మించి సభ్యులున్న పార్లమెంట్‌లో ఎన్నో చిక్కులతో కూడుకొన్న చిత్తు చట్టాలు విపులంగా చర్చించటానికి అవకాశం లేకపోవటం. (4) ఆ పని మంత్రిమండలిలోనే ఎక్కువ తృప్తికరంగా జరగటానికి వీలుండటం. వీటివల్ల శాసనాధి కారం పేరుకు పార్లమెంట్‌ది అయినా నిజానికి మంత్రివర్గానిదే.

19 వ శతాబ్దారంభంలో కాబినెట్ మంత్రుల సంఖ్య 12 కు మించలేదు. ఆ శతాబ్దం

మధ్యలో అది 15 కు పెరిగింది. శతాబ్దాంతానికి ఇరవై అయింది. ఈ పెరుగుదల ఇప్పటికీ సాగుతునే ఉంది. కాని మంత్రులందరికి కాబినెట్ హోదా ఇవ్వటం లేదు.

19 వ శతాబ్దాంతానికి మంత్రి స్థానాల వివరాలు ఈ విధంగా ఉండేవి: నియతంగా కాబినెట్‌లో స్థానమున్న మంత్రులు పదకొండు మంది. వారు: (5) స్టేట్ కార్యదర్శులు అయిదుగురు. (6) నౌకాశాఖా ప్రథమ ప్రభువు (First Lord of the Admirality). (7) కోశాగార ప్రథమ ప్రభువు. (8) సామాన్యంగా ప్రధానమంత్రే కోశాగార ప్రథమ ప్రభువు కూడా. కాని కోశాగార విధులను నిజంగా నిర్వహించేది బొక్కసం ఛాన్సలర్ (Chancellor of the Exchequer). (9) ఉన్నత ఛాన్సలర్ ప్రభువు (Lord High Chancellor) - ఇతడు ప్రభువుల సభకు అధ్యక్షుడు. (10) ప్రీవీ కౌన్సిల్ అధ్యక్ష ప్రభువు (Lord President of the Privy Council). ఇతనికున్న పనులు అంత భారమైనవి కావు. అవి ఎప్పుడోకాని చేయనవసరం లేదు. (11) రహస్య ముద్రి కాధికారి (Lord Privy Seal). ఇతడు చేయవలసిన పనులే లేవు. ప్రీవీ కౌన్సిల్ అధ్యక్ష ప్రభువూ రహస్య ముద్రి కాధికారీ వీరిద్దరూ ప్రభు సభాసభ్యులు. ప్రభుత్వ పక్షంలోని పరి పాలనా శాఖలను సమర్థవంతంగా నిర్వహించలేని వారికి ఈ రెండు పదవులూ ఇస్తారు.

వీరు కాక ఇతర పరిపాలనాశాఖల మంత్రులను కొంతమందిని అప్పుడప్పుడు కాబినెట్ లోకి తీసుకొంటారు. సాధ్యమైనంతవరకు హెచ్చు మందినే కాబినెట్‌లో చేర్చుకోవలెననే అభి ప్రాయం ప్రచారంలో ఉంది. ఒక్కొక్క మంత్రిత్వశాఖ కార్యభారము, ప్రాముఖ్యం పెరిగి పోవటంవల్ల ఆ యా మంత్రులకు కాబినెట్ హోదా ఇవ్వటం న్యాయమనిపిస్తుంది. కాబినెట్‌లో ప్రవేశ మివ్వకపోతే తన పార్టీలో తన పట్ల అసంతృప్తి వ్యాపిస్తుందేమోనని ప్రధానమంత్రికి భయము. కానీ కాబినెట్ మంత్రుల సంఖ్య హెచ్చే కొద్దీ - పూర్వ శతాబ్దాలలో ప్రీవీ కౌన్సిల్ విషయంలో జరిగినట్లే - కాబినెట్‌లో పార్టీ ప్రముఖులు, సమర్థులు, అత్యంత విశ్వాస పాత్రులు అయిన కొద్ది మందినీ ప్రధానమంత్రి తనలో చేర్చుకొని ఆంతరంగిక మంత్రివర్గాన్ని (Inner Cabinet) ఏర్పరిచే లక్షణాలు 19 వ శతాబ్దంలో కూడా కన్పిస్తున్నాయి.

# 14

# స్థానిక ప్రభుత్వము

బ్రిటన్ స్థానిక ప్రభుత్వ విధాన సంస్కరణలు 1884 నాటి బీదల చట్టపు సవరణ శాసనంతో (Poor Law Amendment Act) ఆరంభమై 1894 నాటి స్థానిక ప్రభుత్వ శాసనంతో అంతమవుతున్నాయి.

1884 నాటి బీదల చట్టపు సవరణ శాసనానికి పూర్వం ఇంగ్లండ్‌లోని పరిపాలనా విధానము: ట్యూడర్ పరిపాలకుల కాలంలో ఒక స్థితికి వచ్చిన స్థానిక ప్రభుత్వ విధానము మార్పు లంతగా లేకుండా 1884 వరకు నిల్చిపోయింది. ఈ విధానంలో స్థానిక పరిపాలనా సంస్థలు మూడు రకాలుగా ఉండేవి. అవి: 1. కౌంటీలూ, కౌంటీలలోని పట్టణాలు, 2. పట్టణ గ్రామమండలాలు. 3. గ్రామాలు (Parishes) "దీనిని స్థానిక పరిపాలన అనటం కంటె స్థానిక స్వపరిపాలన మనటం మేలు" అని జి. బి. ఆడమ్స్ అభిప్రాయము. కేంద్ర ప్రభుత్వం స్థానిక ప్రభుత్వ వ్యవహారాలలో జోక్యం కలగజేసుకోదు. స్థానికాధికారులకే అక్కడ పరిపాలనలో స్వాతంత్ర్య మున్నందువల్ల ఆడమ్స్ ఆ విధంగా అభిప్రాయపడినాడు. కాని స్వపరిపాలన అన్నప్పుడు స్థానికంగా ఉండే ప్రజా సామాన్యానికి అందులో భాగ ముందనికాని, ఆ అధికారులను వారెన్నుకొనేవారని కాని, వారి కా అధికారం ఉందని కాని అభిప్రాయపడితే అది పొరపాటే. కౌంటీలలో స్థానికాధికారులుగా ఉండటానికి కొంత ఆస్తి ఉన్నవారే అర్హులు. వారు కౌంటీలను అదుపులో ఉంచుకోవడమే కాక గ్రామాలపై అజమాయిషీ చేసేవారు. వారిలో ప్రధానులయిన న్యాయశాంతి రక్షకులకు (Justices of the Peace) అనేకాధికారాలు ఉండేవి. ఆస్తిలేని వారికి కౌంటీ పరిపాలనలో ఏ స్థానమూ లేదు. స్టూవర్ట్ రాజుల కాలంలో దేశంలో వ్యాపించిన అలజడులలో, అనిశ్చిత పరిస్థితులలో కౌంటీలలోని ఆస్తి పరులు స్థానిక వ్యవహారాలలో ఎంతో పలుకుబడి సంపాదించినారు. పట్టణాలలో పరిస్థితులు ఇంతకంటె అధ్వానంగా ఉండేవి. ఇక గ్రామాల సంగతి మరింత శోచనీయము.

*గ్రామ పరిపాలన:* పట్టణాలలోగాని, కౌంటీలలోగాని స్థానిక స్వపరిపాలనకు గ్రామమే పునాది. బీదల పోషణకు రేట్లు చెల్లించేవారి సమావేశమే గ్రామ పరిపాలనా సంస్థ. ఈ సమావేశము వెస్ట్రీలో జరిగేది కాబట్టి ఈ సభను వెస్ట్రీ అనేవారు. దాని సభాపతికి ఇన్‌కమ్ బెన్ట్ (Incumbent) అని పేరు. వెస్ట్రీ ముఖ్యోద్యోగులు: చర్చి వార్డెన్‌లు, బీదల పర్యవేక్షకులు (Surveyors of the poor), రహదార్ల సర్వేయర్. వారి పేర్లను బట్టే వారు నిర్వహించే పనులు తెలుసుకోవచ్చు. వెస్ట్రీ స్థానిక చర్చి వ్యవహారాలను చూస్తుంది. ఆ పనులు చూసేవారు చర్చి వార్డెన్‌లు. బీదల రేట్‌లను వసూలుచేసి లంగర్ ఖానాలను ఏర్పాటు చేసి బీదలకు పనులు కల్పించి పోషించే పని బీదల పర్యవేక్షకులది. గవర్నమెంట్ రోడ్లు కాని రోడ్లను సరియైన స్థితిలో ఉంచే పని రహదారుల సర్వేయర్‌లు చూసేవారు. వైశాల్యంలో,

జనసంఖ్యలో, సంపదలో ఒక పారిష్‌కు మరొక పారిష్‌కు సమత్వం లేదు. సామాన్యంగా రేట్‌లు చెల్లించే వారికిగాని వారి ఉద్యోగులకుగాని శ్రద్ధా సామర్థ్యాలు సున్న.

*కార్పొరేషన్ ఉండే పట్టణాలు:* సామాన్యంగా పురాతన పట్టణాలన్నీ కార్పొరేషన్ ఉండే పట్టణాలే. నిర్మాణంలో, నిర్వహించవలసిన విధులలో, అధికారాలలో ఒకదానికి మరొక దానికి సమానత్వం లేదు. భిన్న స్థానికాచారాలు, వాటిని అనుమతించే పార్లమెంట్ చేసిన భిన్న భిన్న శాసనాలు సమానత్వం లేనందుకు కారణాలు. పౌర పరిపాలనాధికారం చాలా కొద్దిమందికి పరిమితమై ఉండేది. ఒక్కొకచోట పట్టణ కౌన్సిల్ సభ్యులకే ఆ కౌన్సిల్‌ను ఎన్నుకొనే అధికారం ఉండేది. ఈ సభ్యులు తమ విధి నిర్వహణలో శ్రద్ధ వహించేవారు కారు. కార్పొరేషన్‌లు చాలావరకు అవినీతికి పాల్పడి పదిమంది ఆస్తిని స్వార్థాని కుపయోగించుకొనేవి. పారిశ్రామిక విప్లవంవల్ల పటణాలు జనసమ్మర్ధంతో అడ్డదిడ్డంగా పెరిగినందువల్ల పట్టణారోగ్య, పారిశుద్ధ్య సమస్యలు తలెత్తినాయి. ఈ సమస్యలను పరిష్కరించటానికి కావలసిన ధనంగాని, అధికారాలుగాని ఈ కార్పొరేషన్‌లకు ఉండేవికావు. పారిశ్రామిక విప్లవం వల్ల ఏర్పడిన కొత్త పట్టణాలు చాలావరకు కార్పొరేషన్‌లు కాలేదు. పూర్వపు జామీన్ ఊర్ల (manors) వలెనో, గ్రామ, శతగ్రామాలవలెనో వాటి పరిపాలన జరుగుతూ ఉండేది. ఏ పటణమైనా పెద్ద ఎత్తున అభివృద్ధి కార్యక్రమం చేపట్టదలిచినప్పుడు ఆ పనికి ప్రత్యేకాధికారిని నియమించే అధికారాన్ని పటణసభకు ఇస్తూ పార్లమెంట్ ప్రత్యేక శాసనం చేయవలసి ఉండేది.

*మండలాలు (Counties):* కౌంటీల పరిపాలన సంస్కరణకుముందు చాలాకాలంగా ఇంగ్లండ్‌లో ఉన్న కౌంటీలు 56. ఇవిగాక పూర్వం కౌంటీహోదాలో ఉన్న కౌంటీబరోలు (County-boroughs) అనే పటణాలు ఉండేవి. వీటిలో లండన్ నగరము (28 చదరపు కి. మీ. మేర), దాని చుట్టూ ఉన్న లండన్ కౌంటీ కంటె వేరయి ప్రత్యేకమైన మేయర్ ప్రభువు పరిపాలనలో ఉండేది. లండన్ కౌంటి కౌన్సిల్ ఇతర కౌంటీ కౌన్సిల్‌ల వంటిదయినా పరిపాలించటంలో, దానికి విశేషాధికారాలున్నాయి. లండన్ కౌంటీని, కౌంటీబరోలను వలెనే పట్టణాలు (boroughs) గా విభజించడం జరిగింది. వీటి సంఖ్య 28.

ప్రతి కౌంటీలోని స్థానిక పరిపాలనను మేజిస్ట్రేట్‌ల కోర్టుకు అప్పగించినారు. వీరుకాక నిర్ణీతమైన ఆస్తిపరులనుంచి లెఫ్టినెంట్ ప్రభువు (Lord Lieutenant) నియోగించే న్యాయ శాంతి రక్షకులకు (Justices of the Peace) స్థానిక పరిపాలనలో న్యాయాధి కారంతోబాటు పలువిధాలైన పరిపాలనాధికారాలు ఉండేవి. చాలా విషయాలలో గ్రామాధి కారులపై వీరు పర్యవేక్షణ జరిపేవారు. సామాన్యంగా ఈ న్యాయ శాంతి రక్షకులు పరిపాల నలో ఎక్కువ శ్రద్ధ వహించకపోయినా పొదుపుగా నీతితో పరిపాలన సాగించేవారు కనుక వారిపట్ల విద్వేషభావం అంతగా ఉండేది కాదు. అందువల్ల మూడు పార్లమెంటరీ సంస్కరణ చట్టాలయిన తరవాతగాని కౌంటీ పరిపాలనను సంస్కరించే ప్రయత్నాలు జరగలేదు.

## స్థానిక ప్రభుత్వ సంస్కరణ

గ్రామ, పట్టణ, మండల పరిధులలో పరిపాలన సంస్కరణలు 1834 నాటి పేదల చట్టపు సవరణ శాసనంతో ఆరంభమై 1894 నాటి స్థానిక ప్రభుత్వ శాసనంతో సమాప్త మయినాయి.

*బీదల చట్టపు సవరణ శాసనము (1884)*: 1882 నాటి సంస్కరణ శాసనం చేయించి ప్రసిద్ధుడైన గ్రే ప్రభువు మంత్రివర్గం బీదల చట్టం ఏ మాత్రం అమలులో ఉందో విచారణ చేయటానికి ఒక కమిషన్‌ను ఏర్పాటు చేసింది. ఆ కమిషన్ వారు తమ విచారణ ఫలితంగా ఒక నివేదిక ప్రభుత్వానికి సమర్పించినారు. గ్రామపరిపాలన ఎంత లోప భూయిష్టంగా ఉందో ఆ నివేదికవల్ల బట్టబయలయింది. బీదల కందిచ్చే సహాయము ఒక పద్ధతిలో లేదు. అర్హులైన వారందరికీ సహాయం లభించడం లేదు. 'దరిద్ర పోషక గహాల'లో చేరిన వారు తిండి తిప్పలు తిన్నగా లేనందువల్ల ఎప్పుడూ నకనకలాడే కడుపులతో ఉండే వారు. శక్తికి మించిన పని వారిచే చేయించటం, వారి పోషణకు ఇచ్చే డబ్బులో చాలాభాగాన్ని అనాథగృహాల పాలకవర్గ సభ్యులు తమ స్వార్థానికి వినియోగించుకోవటం బీదల సాహాయ్య విధానంలో ఉన్న సర్వసామాన్యమైన లోపాలు ఛార్లెస్ డిక్స్ రచించిన "ఆలివర్ ట్విస్ట్" అనే నవల ఈ అనర్థాలను కళ్ళకు కట్టినట్లు వర్ణించింది. బీదల సాహాయ్యనిధికి వసూలుచేసే విరాళాలు ఇచ్చేవారి శక్తికిమించి ఉండేవి. ఇవ్వగలిగిన వారినుంచి తగినంతగా వసూలు చేసే వారు కారు. తమ తిండికోసం ఊరివారి దాక్షిణ్యంపై ఆధారపడటానికి ఇష్టపడక ఉన్నంతలో సర్దుకొని చాలీచాలని బతుకులు గడిపే వారిపై ఈ రేట్ల భారం పడటం ఈ బీదల చట్టాన్ని అమలుజరపటంలో కనబడే మరో అన్యాయము. అందువల్ల కొందరు గృహస్థులు సాయాన్ని కోరే బీదల పేర్ల కింద తమ పేర్లను కూడా నమోదు చేయించుకొనేవారు. కూలి చేసుకొని బతకవలసిన జనంలో దేహదార్ఢ్యమున్న సోమరిపోతులు కొందరు బీదల లెక్కలో చేరేవారు. తాము పోషించవలసిన తలిదండ్రులను బీదల గృహాలకు అప్పగించి తమ భారం ఊరిపై వేసి నిశ్చింతంగా ఉండే కుమారులు కూడా ఉండేవారు.

బీదల చట్టపు సవరణ శాసనం బీదల సాహాయ్య కార్యక్రమాన్ని ఒక గ్రామానికి ఇరుగుపొరుగున ఉండే (15 నుంచి 20 దాకా) గ్రామాల కూటమికి విస్తరించింది. ఈ గ్రామాల ప్రతినిధులు బీదల రక్షకుల సంఘంగా (Board of Guardians of the Poor) ఏర్పడి బీదల సాహాయ్య కార్యక్రమాన్ని అమలులో పెట్టేవారు. ఈ రక్షకులు సామాన్యంగా పూర్వపు గ్రామాధికారులకన్న చదువుకొన్నవారు, సత్ప్రవర్తన కలవారు.

*బీదల రక్షకుల బోర్డ్‌చేసే పనులు*: బరో కౌన్సిల్ కార్పొరేషన్‌లు, పారిష్ కౌన్సిల్‌లు చేసే పనులలో వ్యత్యాసమంతగా లేదు. స్థానిక పన్నుల వసూళ్ళు, వాటి ఖర్చు, ప్రాథమిక విద్యాబోధన, ఆరోగ్య సంరక్షణ, ప్రజారోగ్యము పోలీస్ విధులు (Police functions) ఈ కార్య నిర్వహణలో శాంతి న్యాయ రక్షకులు పాల్గొనేవారు. ఇవికాక బీదల ఉద్ధరణ బీదల గృహాల (assylums) యాజమాన్యంతో బాటు రోడ్ల, వంతెనల అజమాయిషీ గూడా స్థానిక సంస్థలకు ఉండేది. స్థానిక పరిపాలనా కార్యనిర్వహణ ప్రధానంగా కమిటీలు చూస్తాయి. ఈ కమిటీలు కౌన్సిలర్‌లు కాని వారి సహకారం కూడా తీసుకొంటూ ఉండేవి.

1884 నాటి బీదల చట్టపు సరవణ శాసనం ప్రకారం బీదల రక్షకుల బోర్డులు ఏర్పాటు అయినాయి. అవి తమ విధులను చక్కగా నెరవేరుస్తున్నాయో లేదో పరిశీలించ డానికి ప్రభుత్వం కమిషనర్‌లను నియమించింది. అంతకుముందు స్థానిక ప్రభుత్వాధికారులు చట్ట విరుద్ధమైన పనులను చేసినప్పుడే వారి పరిపాలనలో కేంద్ర ప్రభుత్వం జోక్యం కలి గించుకొనేది. గ్రామాధికారులపై కౌంటీ మేజిస్ట్రేట్‌లకు కొంత పెత్తనం ఉండేది కాని అది

చాలావరకు పైపై పెత్తనమే. అది క్రమబద్ధమయింది కాదు. కార్పొరేషన్‌ల మీద, కౌంటి కౌన్సిళ్ళ మీద ఎవరి అజమాయిషీ ఉండేది కాదు. గ్రామాధికారులు పరిపాలనలో ఎంత అసమర్థులైనా సోమరులైనా అవినీతిపరులైనా ప్రజలు ఊరుకోవలసిందే ఈ దుస్థితి నుంచి ప్రజలను ఉద్ధరించటానికి కేంద్ర ప్రభుత్వం స్థానిక స్వపరిపాలనా సంస్థల వ్యవహారాలలో కలుగజేసుకోవలసిన అవసరం వచ్చింది. 1884 నాటి బీదల చటం సవరణ శాసనం ఆ పనికి పూనుకొంది. తరవాత అగి ఒక్కొక్క స్థానిక పరిపాలనా శాసనం చేసేకొద్దీ స్థానిక స్వపరిపాలన క్రమంగా సన్నగిల్లి కేంద్ర ప్రభుత్వ సంపూర్ణాధికారం కిందికి వచ్చింది.

మునిసిపల్ కార్పొరేషన్‌ల శాసనము (1835), 1832 నాడు సంస్కరణ శాసనము అమలు కాకముందు మునిసిపల్ కార్పొరేషన్‌ల అధికారా లనుభవించే వారి వర్గానికి చెందిన వారే కామన్స్ సభలో అధిక సంఖ్యలో ఉన్నందువల్ల కార్పొరేషన్‌ల పరిపాలనలోని లోపాలను చక్కబరచటానికి చేసే ప్రతి ప్రయత్నమూ వ్యర్థమవుతూ ఉండేది. కాని పై సంస్కరణ శాసన ఫలితంగా ఆ వర్గం వారి రాజకీయ ప్రాభవం దెబ్బతిన్నది. 1835 లో మెల్‌బోర్న్ ప్రభువు ప్రవేశపెట్టిన కార్పొరేషన్‌ల సంస్కరణ శాసనాన్ని అందువల్ల వారు అడ్డుకొనలేక పోయినారు లండన్ పట్టణాన్ని తప్పించి మిగిలిన కార్పొరేషన్‌ల కౌన్సిళ్ళ పరిపాలనాంగాలను రద్దుచేసి వాటన్నింటినీ ఆ శాసనం సమాన స్థాయిలోకి తెచ్చింది. స్థానిక పాలనలో ప్రజానీకానికి ఎక్కువ ప్రాతినిధ్యం ఉండవలెనని దీని ముఖ్యాశయము.

గడచిన మూడేళ్ళు బీదల సహాయం రుసుము (Poor Rate) చెల్లించిన పట్టణ వాసులకు పట్టణ, నగర కౌన్సిల్ సభ్యులను ఎన్నుకొనే అధికారము ఉంది. ఆ కౌన్సిల్ సభ్యులు కొంతమంది ఆల్‌డర్‌మన్‌ను ఎన్నుకోవలసి ఉంటుంది. కౌన్సిల్ సభ్యులు ఆల్‌డర్‌మన్ (Alderman) కలిసి సమావేశమై మేయర్‌ను ఎన్నుకోవలె. ఆ మేయర్ ఉద్యోగ కాలపరిమితి ఒక సంవత్సరము. ఆల్‌డర్‌మెన్ ఆరేళ్ళు, కౌన్సిలర్‌లు మూడేళ్లు పదవులో ఉంటారు. మేయర్, ఆల్‌డర్‌మన్, కౌన్సిలర్‌లతో కలిసి పట్టణ కౌన్సిల్ ఏర్పడుతుంది. కౌన్సిల్ సమావేశాలు బహిరంగంగా జరగవలె. ప్రభుత్వ కోశాధికారులు, కౌన్సిల్ లెక్కలను ఏటేటా తనిఖీ చేస్తారు. నగర కౌన్సిల్ ముఖ్య కర్తవ్యాలు: వీధులలో దీపాలు వెలిగించటం, ఊరి కాపలా. ఇవి కాక ప్రజారోగ్య శాసనాలు, కార్మిక గృహశాసనాలు మరికొన్ని బాధ్యతలను విధించినాయి.

1835 లో స్కాట్లండ్‌లో ఉన్న కార్పొరేషన్‌లు, 1838 లో ఐర్లండ్‌లోని కార్పొరేషన్‌లు, ఇంగ్లండ్ అనుమతించిన 1835 నాటి మునిసిపల్ కార్పొరేషన్ చట్టంలోని సూత్రాలను సంస్కరిస్తూ శాసనాలు చేయడం జరిగింది.

చాలా చిన్న పట్టణాలను 1835 నాటి ఇంగ్లీష్ మునిసిపల్ కార్పొరేషన్‌ల శాసనం నుంచి మినహాయించడం జరిగింది. 1838 లో అనేక విధాలైన చిన్న పట్టణాల కౌన్సిళ్ళు రద్దయినాయి. 1838 నాటి చట్టం వాటిని రద్దుచేసి, ఏ పట్టణమయినా టౌన్ కౌన్సిల్‌ను పొందవచ్చునని అనుజ్ఞ ఇచ్చింది. కొన్ని పెద్ద పట్టణాల ప్రజలు తరవాత పార్లమెంట్‌ను అర్థించి నూతన విధానంలో పట్టణ కౌన్సిల్‌లు కావలెనని అనుమతి పొందినారు. పట్టణ నామానికి అనర్హమైన గ్రామాలను, పల్లెలను పట్టణ పరిసర ప్రాంతాలను వలెనే పాలించడం జరుగుతూ ఉంది. లండన్ నగర స్థానిక పరిపాలనలో మాత్రం ఇతర నగరాల పరిపాలనలో

జరిగిన మార్పు లేమీ జరగలేదు. లండన్ నగరము థేమ్స్ నదికి ఉత్తరంగా టవర్‌కూ టెంపిల్ బారుకూ మధ్య ఉండే ఒకటిన్నర చ. కి మీ. ప్రాంతము. దానికి వెలపలనున్న నగరానికి లండన్ కౌంటీ అని పేరు. దీనిని ఇతర కౌంటీలవలెనే పరిపాలిస్తున్నారు. దీని కౌంటీ కౌన్సిల్‌కు మాత్రం ఇతర కౌంటీ కౌన్సిళ్లకంటె కొన్ని విస్తృతాధికారా లున్నాయి.

*ప్రజారోగ్య శాసనాలు (1848-75):* పూర్వం ప్రజారోగ్య పరిరక్షణ స్థానిక స్వపరిపాలనా సంస్థల పరిధిలో ఉండేది కాదు. 19వ శతాబ్దంలో ప్రజారోగ్య రక్షణ పట్టణ కౌన్సిళ్ల, గ్రామ స్వపరిపాలనా సంస్థల ప్రధాన కర్తవ్య మయింది. ఈ స్థితి 1848-75 మధ్య కాలంలో పార్లమెంట్ చేసిన ప్రజారక్షణ శాసనాల ఫలితము. వీటివల్ల కార్పొరేట్ పట్టణాలు కాని జనసమ్మర్దమైన ప్రాంతాలలో ప్రజ లెన్నుకొన్న స్థానిక సంఘాలకు ఆరోగ్య రక్షణ కార్యం అప్పగించినారు. ఆరోగ్య రక్షాధికారమున్న సంఘాలు ప్రజలకు నీరు లభించే టట్లు చూడటమే కాక మురికి నీటి పారుదలకు కూడా శ్రద్ధ వహించవలసి ఉంటుంది. నగరంలో పరిశుభ్రత, వైద్యాలయాలు, శ్మశానాలు నిర్మించటం వీటి విధులు. మునిసిపల్ పట్టణాలలో రోడ్ల మరమ్మత్తు, వాటి శుభ్రత చూడటం, అభివృద్ధి కార్యాలు నిర్వహించటం వీటి కర్తవ్యమే. ఈ చట్టాలవల్ల సంక్రమించిన అధికారాలను అమలు జరపడంలో ఆ యా సంఘాలు ఎక్కువ శ్రద్ధ వహిస్తున్నాయి. పట్టణ కౌన్సిళ్ళు నిర్వహించే కార్యక్రమంలో ఆరోగ్య రక్షణ ప్రధానమయింది. దానికయ్యే ఖర్చుకు స్థానిక సంఘాలు వెనుదీయటం లేదు. పై బాధ్యతలేకాక స్థానిక సంఘాలు ప్రారంభ విద్య, గ్రంథాలయ నిర్వహణ, గృహనిర్మాణాలు, ఉద్యానవనాల పోషణ, శ్మశానాల పాలన, రాకపోకలకు బస్సులు నడపటం, మునిసిపాలిటీ అధ్వర్యాన కొన్ని వ్యాపారాలు సాగించటం మొదలయినవి నిర్వహిస్తాయి.

*స్థానిక పరిపాలనా శాసనము (1888); కౌంటీలలో స్థానిక ప్రభుత్వము:* 1888 నాటికి మూడు పార్లమెంటరీ సంస్కరణ శాసనాలు చట్టాలయినాయి. వాటి ఫలితంగా 21 ఏళ్ళు నిండిన బ్రిటిష్ రాజ్యంలోని పురుషులు ఇంచుమించు అందరూ పార్లమెంట్ ఎన్నికలలో పాల్గొనవచ్చు. దేశపరిపాలన విషయంలో ప్రజా ప్రతినిధులను ఎన్నుకోవటానికి అలవాటు పడిన ప్రజలు కౌంటీల స్థానిక పరిపాలన కూడా ప్రజా ప్రతినిధుల ద్వారా జరగవలెనని కోరటం సహజమే. ఈ 1888 స్థానిక పరిపాలనా శాసనం ఇంగ్లండ్‌లో చిరకాలం నుంచి ఉన్న 52 కౌంటీలను స్థానిక స్వపరిపాలన దృష్ట్యా 62 కౌంటీలుగా పునర్విభజన చేసింది. ఇవిగాక పురాతన కాలంలో కౌంటీలుగా ఉన్న పట్టణాలు, 50,000 జనాభాకు పెరిగిన పటణాలు, ఇకముందు ఆ సంఖ్యకు పెరగబోయే పట్టణాలూ కౌంటీబరోల హోదాకువచ్చినాయి. ఈ కౌంటీ బరోలు 60 ఉన్నాయి. ఈ కౌంటీ బరోలలో ఏర్పడిన స్థానిక సంస్థలకు పట్టణ కౌన్సిళ్లని పేరు. 62 కౌంటీలలోని స్థానిక పరిపాలనా సంస్థలకు కౌంటీ కౌన్సిల్ అని పేరు. కౌంటీ బరోలు కౌంటీల నుంచి వేరయినాయి.

కౌంటీ కౌన్సిల్ నిర్మాణము కార్పొరేట్ పట్టణ కౌన్సిల్ నిర్మాణంకంటె భిన్నం కాదు. రేట్లు చెల్లించినవారు కౌన్సిల్ సభ్యులను ఎన్నుకొంటారు. ఆ కౌన్సిల్ సభ్యులు కొంతమంది ఆల్‌డర్‌మన్‌ను ఎన్నుకొంటారు. ఈ విధంగా ఎన్నుకొన్న కౌన్సిల్ సభ్యులూ ఆల్‌డర్‌మన్ కలిసి సమావేశమై ఒక అధ్యక్షుని ఎన్నుకొంటారు. వీరిలో అధ్యక్షుని (Chairman) ఉద్యోగ కాలపరిమితి ఒక్క సంవత్సరము. కౌన్సిల్ సభ్యులు మూడేళ్ళు. ఆల్‌డర్‌మన్

ఆరేళ్ళు పదవిలో ఉంటారు. కౌన్సిల్ సభ్యులు, ఆల్డర్‌మన్, అధ్యక్షుడు చేరితే కౌంటీ కౌన్సిల్ ఏర్పడుతుంది. కౌంటీ బరోలకు, కౌంటీలకు మధ్యస్థంగా ఉండే బరోలు (Boroughs) జిల్లాలలో స్థానిక పరిపాలనలో ఉంటాయి. అక్కడి కౌన్సిల్ సభ్యులు, తమ కౌన్సిళ్ళకు ఆల్డర్‌మన్‌ను ఎన్నుకోరు.

*కౌంటీ కౌన్సిల్ పరిపాలించే విషయాలు:* పోలీస్‌వారిపై పెత్తనము, మాదక వస్తువుల అమ్మకానికి అనుమతిలివ్వటం అనే ఈ రెండు అధికారాలనూ న్యాయ, శాంతి రక్షకులు, కౌంటీ కౌన్సిల్‌తో కలిసి ఒక స్థాయీ సమితిగా ఏర్పడి చెలాయించేటట్లు నిర్ణయించ బడింది. మిగిలిన కార్యాలన్నీ కౌంటీ కౌన్సిల్ బదిలీ చేయడం జరిగింది. ఇవికాక స్థానిక పరిపాలనా విధానంలో అట్టడుగున ఉన్న స్థానిక సంస్థల పనులు కొన్ని, కేంద్ర ప్రభుత్వం ఇన్నాళ్లూ చూసిన అల్ప విషయాలు కొన్ని కౌంటీ కౌన్సిల్ అధీనమయినాయి. జిల్లా కౌన్సిల్ స్థానికారోగ్య రక్షణ, పబ్లిక్ రహదార్ల రక్షణ చూస్తుంది. పబ్లిక్ రహదార్లను కౌంటీ కౌన్సిళ్ళ అధీనంలో ఉంచినారు. కారొనర్‌ను (coroner) ఎన్నుకొనే అధికారం పూర్వం కౌంటీలలోని స్వతంత్ర భూస్వాముల కుండేది. 1888 నాటి స్థానిక పరిపాలన శాసనము ఆ అధికారాన్ని కౌంటీ కౌన్సిల్‌కు ఇచ్చింది. అసలు పాతలండన్ నగర వైశాల్యము ఒకటిన్నర చదరపు కి. మీ. అని దాని చుట్టూ ఉన్న ప్రాంతాన్ని ఒక కౌంటీ కౌన్సిల్ కింద ఉంచేవారని దానికి ఇతర కౌంటీ కౌన్సిళ్లకు లేని విశేషాధికారా లిచ్చినారని పరిపాలనా సౌలభ్యానికి ఈ లండన్ కౌంటీని 28 బరోలుగా చేసినారు.

స్థానిక *పరిపాలనా శాసనము (1894):* 1888 నాటి స్థానిక పరిపాలనా శాసనము ప్రధానంగా కౌంటీలలోని స్థానిక పరిపాలనాన్ని సంస్కరించి క్రమబద్ధం చేయటానికి ఉద్దేశించింది. 1894 నాటి స్థానిక పరిపాలనా శాసనం గ్రామాల (Parishes) లోని స్థానిక పరిపాలనాన్ని సంస్కరించి దానిని చర్చి పరిపాలననుంచి వేరుచేసి బలిష్ఠం చేసినారు. స్థానికంగా ఉండే చర్చి పరిపాలనాన్ని ఈ శాసనం చర్చ్ వెస్ట్రీ అధికారానికి వదిలివేసింది. ఇక మీద స్థానిక పరిపాలన చేయవలసింది పారిష్ కౌన్సిల్ వారు పారిష్‌లో ఉండి పార్లమెంట్ ఎన్నికలలో వోటు హక్కు ఉన్నవారు, పేదల రక్షకులను కౌంటీ కౌన్సిల్ సభ్యులను ఎన్నుకొనే హక్కుండేవారునూ ఈ కౌన్సిల్ సభ్యులను ఎన్నుకొంటారు. ఆ పారిష్‌లో ఉండే 300 మందికి మించిన ప్రజలుంటే వారికి పారిష్ కౌన్సిల్‌ను ఎన్నుకొనే అధికారముంటుంది. ఆ కౌన్సిల్ వారు తమ అధ్యక్షుని ఎన్నుకొంటారు ఈ అధ్యక్షుడు పూర్వముండే ఇన్‌కంబెన్ట్ (incumbent) స్థానాన్ని ఆక్రమించినాడు. చర్చ్‌వార్డెన్ పని చర్చ్‌కు సంబంధించిన విధులు నిర్వహించటం మాత్రమే. పారిష్ కౌన్సిల్ అధికారాలను 1894 నాటి శాసనం బాగా పెంచింది. పూర్వం న్యాయ శాంతి రక్షకులు పేదల ఓవర్‌సీర్‌లను నియమించేవారు. ఆ అధికారాన్ని ఈ శాసనం పారిష్ కౌన్సిల్‌కు మార్చింది. పట్టణాలలోనూ నగరాలలోనూ ఉండే పారిష్ విభాగాలకు 1894 నాటి చటము అన్వయించటం లేదు.

స్థానిక పరిపాలనా సంస్థలు నాలుగు: 1. కార్పొరేషన్ నగరాలు, కార్పొరేటెడ్ పట్టణాలు 2. పట్టణాలు (Boroughs) 3. కౌంటీలు, గ్రామ మండలాలు 4. గ్రామాలు, గ్రామాల యూనియన్‌లు. కాని సామాన్యంగా అవి నిర్వహించే కార్యక్రమంలో ఎక్కువ వ్యత్యాసాలు లేవనే చెప్పవచ్చు. ఉన్నా అవి ప్రత్యేకంగా శాసనాలలో పేర్కొన్నవే. ఉన్న

వ్యత్యాసం ముఖ్యంగా వేరు వేరు అంతస్తులలో ఏర్పడిన ఈ స్థానిక పరిపాలనా సంస్థలు గ్రామం నుంచి పై పై అంతస్తుకు పోయేకొద్దీ వాటి బాధ్యత, అధికారాల పరిధి విస్తృతం కావటంలోనే ఉంది. స్థానిక సంస్థల అధీనంలో ఉండే ముఖ్య పరిపాలనాంశాలు : విద్య, ఆరోగ్యము, పారిశుద్ధ్యము, బీదలకు సహాయము, అనాథ రక్షణాలయాలు, రహదార్లు, వంతెనలు - వీటి నిర్వహణ, నిర్మాణాలను ఆయా కమిటీలు చూస్తాయి. స్థానిక కౌన్సిళ్ళలో సభ్యులు కానివారి సహాయం ఈ కమిటీలు కోరవచ్చు.

## స్థానిక పరిపాలన సంస్కరణలు

1902 లో పాఠశాలా సమితి (School Board) స్థానంలో పెద్ద పట్టణాలలోను, కౌంటీలలోను ఉండే కౌన్సిళ్లకు కమిటీలు ఏర్పరిచినారు. 1929 లో బీదల రక్షకుల బోర్డులకు బదులు ప్రజా సహాయ సమితులు ఏర్పడినాయి. ఈ విధంగా ప్రజా సహకారావశ్యకతను కొంతైనా అవి గుర్తించినాయి.

1963 లో లండన్ స్థానిక పరిపాలనా విధానం చాలా మార్పు చెందింది. అసలు లండన్ నగరంలో పరిపాలనాధికారం పూర్వమున్నట్లే సామాన్య సమితి సభ (Court of Commcn Council) వారి దయినా లండన్ మహానగరంలోని పట్టణ విభాగాలు పునర్నిర్మితా లయినాయి. పూర్వం ఆ విభాగాలు 28. ఇప్పుడవి 80 కౌంటీ బరోలకు మించిపోయినాయి. వీటి పరిపాలనలో కౌంటీ కౌన్సిళ్లకు ఏ మాత్రం జోక్యం లేదు. ఈ కౌంటీ బరోలు కాక తక్కిన మహానగరాన్ని 61 పరిపాలనా మండలాలు (Administrative Counties) గా విభజించినారు. ఒక్కొక్క పరిపాలనా మండలాన్ని పట్టణ సీమలుగా (Urban Districts), గ్రామ సీమలుగా (Rural Districts), గ్రామ సీమలను చర్చి పల్లెలుగా విడదీసినారు. కౌంటీల ఎల్లలలో కౌంటీ బరోలు కాని బరోలు కౌంటి కౌన్సిల్ అధికారానికి లోబడి ఉన్నాయి. ఇన్ని విధాలైన స్థానిక పరిపాలనా సంస్థలతోబాటు మురుగునీటి డ్రైనేజి, రేవుల పరిపాలన చూడటానికి ఇతర ప్రత్యేక స్థానిక పరిపాలనా సంస్థలు ఎన్నో ఏర్పడినాయి. లండన్ మహానగరాన్ని అనేక విభాగాలుగా చేసినారు. వాటి పరిపాలనా కార్యాలు ఒక పద్ధతిలో లేవు.

## స్థానిక పరిపాలనా సంస్థలను ఎన్నుకొనే విధానము

1945 వరకు పారిష్‌లలో బీదల పోషణకు సుంకాలు (poor rates) చెల్లించే వారందరూ పారిష్ సభాసభ్యులు. వారే స్థానిక పరిపాలన సంస్థ లన్నింటిని ఎన్నుకొనే వారు 21 ఏళ్ళు నిండి బీదల పోషణ సుంకాలు చెల్లించేవారు (స్త్రీలు, పురుషులు). ఈ ఎన్నికలలో పాల్గొంటారు. 1945 లో వీరే కాక పార్లమెంట్ ఎన్నికకు వోటు హక్కు ఉన్నవారిని కూడా స్థానిక సంస్థల వోటర్లుగా చేర్చినారు. స్థానిక సంస్థల ఉద్యోగులకు వేతన మిచ్చే బాధ్యత ఈ ఓటర్లకు ఉంది. స్థానిక సంస్థలను ఎన్నుకొనే హక్కు ఉన్న వారి సంఖ్య కామన్స్ ఎన్నికలలో వోటు హక్కు ఉన్నవారి సంఖ్య కంటె హెచ్చయినా స్థానిక సంస్థల ఎన్నికలలో వోటు చేసే వారి దామాషా చాలా తక్కువ ; చాలా స్థానాలకు పోటి కూడా ఉండదు. బీదల పోషణకు రేట్ చెల్లించే వారు, ఆస్తి గలవారు, స్థానికంగా సంవత్సరం పాటైనా నివాస

మున్నవారు, వోటు చేయటానికి అర్హులు. కాని కౌన్సిల్ ఉద్యోగికి జీదల భరణం పొందే వారికీ కౌన్సిల్ కంట్రాక్టర్లకు వోటర్‌లుగా ఉండే హక్కు లేదు. కౌంటీ కౌన్సిల్ సభ్యుల లోను మూడింట రెండు వంతుల మందికి మూడేళ్లపాటు సభ్యత్వమున్నా వారిలో మూడో వంతు సభ్యులు ఏటేటా సభ్యత్వం నుంచి విరమించుకోవలసి వస్తుంది. మిగిలిన 1/8 వ వంతు ఆల్డర్‌మెన్. వీరిని మిగిలిన 2/8 వ వంతు వారు (అంటే ఎన్నికయిన సభ్యులు) ఎన్ను కొంటారు. ఆల్డర్‌మెన్ పదవీ కాలం ఆరేళ్ళు. స్థాయీ సంఘాలవంటి కొన్ని బోర్డులను ఎన్నికయిన కౌన్సిళ్ల సభ్యులు ఎన్నుకొంటారు. మరికొన్ని కమిటీల సభ్యులను కేంద్ర ప్రభుత్వం నియమిస్తుంది. ఒకొ్కక్కప్పుడు సమితి సభ్యులు కౌన్సిల్ ఎన్నుకొన్న వారైనా వారితోపాటు పని చేయటానికి ఇతరులను కొందరిని కలిపి కమిటీకి ఎన్నుకొంటారు.

స్థానిక పరిపాలనా సంఘాల అధికారాలు పార్లమెంటరీ స్టాట్యూట్‌ల ద్వారా నిర్ణయించి నవి. ఆ స్టాట్యూట్‌లు ఆ యా సంఘాలు విధిగా చేయవలసిన, చేసే విధులను నిర్ణయిస్తారు. ప్రభుత్వం నియమించే సభ్యులు అనేక స్థానిక సంఘాల కార్యాలు నిర్వహించడంవల్ల స్థానిక పరిపాలనా రంగంలో ప్రజా ప్రతినిధుల పాత్ర నానాటికి సన్నగిల్లుతూ ఉంది. జీతంలేని ఎన్నికైన వ్యక్తులు స్థానిక పరిపాలకులైనా వారికి ఎన్ని విషయాలలోనో సలహాలిచ్చే ప్రభుత్వోద్యోగులు, సాయపడే ప్రభుత్వోద్యోగులు ఎందరో ఉంటారు. స్థానిక సంస్థలు ప్రత్యేక ప్రణాళికలు ప్రవేశ పెట్టదలచుకొన్నప్పుడు ఆ కార్యక్రమాలతో సంబంధమున్న మంత్రులు స్టాట్యూట్‌లకు లోబడిన ఆజ్ఞలు కొన్ని జారీ చేస్తూ ఉంటారు. ప్రత్యేకంగా ఒక మంత్రిత్వ శాఖకు చెందని విషయంలో దేశీయ వ్యవహారాల మంత్రి ఆమోదంతో ఆజ్ఞలు జారీ చేస్తూ ఉంటారు. కొన్ని స్థానికోద్యోగులను మంత్రు లామోదించవలసి ఉంది. ఒకొ్కక్క సమయంలో స్థానికోద్యోగులలో తగవులు వస్తేనో స్థానిక సంస్థలు తమలో తామో లేదా పౌరులతోనో తగాదా పడితేనో మంత్రులు విచారణ జరిపించి తీర్పు లిస్తారు.

## స్థానిక స్వపరిపాలనా సంస్థల ఆర్థికవ్యవస్థ

స్థానిక సంస్థల స్వపరిపాలనాధికారము ఆర్థిక పరాధీనతవల్ల పరిమితమవుతూ ఉంది. వాటికి ఆదాయం నాల్గు విధాలలో వస్తుంది: 1. స్థానికంగా ఆ సంస్థలు విధించే పన్నులవల్ల 2. వాటి స్వాధీనంలో ఉండే రాబడి ఇచ్చే ఆస్తులవల్ల 8. కేంద్ర ప్రభుత్వ విరాళాలవల్ల 4. ఆ యా మంత్రివర్గాల అనుమతితో చేసే ఋణాలవల్ల. ఈ విధంగా వచ్చే ఆదాయంలో స్థానికమైన పన్నులవల్ల లభించేది నాలుగోవంతు మాత్రమే. ఈ నాలుగు విధాల ఆదాయాలు కేంద్ర ప్రభుత్వం అనుమతికి లోబడి ఉంటాయి. స్థానిక సంఘాలు తమ ఆస్తులు అమ్మవలె నన్నా అప్పులు చేయవలెనన్నా కేంద్రప్రభుత్వ మంగీకరించవలె. కేంద్ర ధన సహాయం కూడా వారి అనుగ్రహం మీద ఆధారపడి ఉంటుంది. అప్పుడప్పుడు కేంద్ర ప్రభుత్వం కొన్ని పక్రశమలను స్థానిక సంస్థల పన్నులనుంచి మినహాయించటం కూడా జరుగుతుంది. అందువల్ల స్థానిక సంస్థలకు కలిగే ద్రవ్య నష్టాన్ని కేంద్ర ప్రభుత్వం పూరించవలసి వస్తుంది. 1930 నుంచి స్థానిక సంస్థలు ఏటా వ్యయంచేసే మొత్తాన్నిబట్టి వారికి పన్నులవల్ల వచ్చే ఆదాయాన్ని దృష్టిలో ఉంచుకొని కేంద్ర ప్రభుత్వం ఏయేటి కాయేడు మంజూరు చేసే బ్లాక్ గ్రాంట్ పద్ధతి (Block grant system) ఆరంభమయింది. ఇదిగాక విద్య, పోలీస్

శాఖలపై ఆ సంస్థలు చేసే వ్యయంలో కొంత శాతం కేంద్ర ప్రభుత్వము పూర్వమిచ్చినట్లే వాటికి ఇస్తుంది. ప్రభుత్వం మంజూరు చేసే మొత్తాన్ని ఆడిట్‌కు లోబడి ఇష్టం వచ్చినట్లు స్థానిక సంస్థలు వ్యయం చేయవచ్చు. ఈ మొత్తాలను మొదట కౌంటీలకు, కౌంటీ బరోలకు ప్రభుత్వం అందచేస్తుంది కౌంటీ బరోలకు ఇచ్చిన విరాళాలను వెచ్చించటంలో సంపూర్ణ స్వాతంత్ర్య ముంది. కాని కౌంటీలు అంతర్భాగాలకు వాటి జనాభా నిష్పత్తి ప్రకారం పంచి ఇచ్చి మిగిలించే ఖర్చు పెట్టవచ్చు.

స్థానిక సంస్థలు ఆస్తి విలువలనుబట్టి పౌరులు చెల్లించవలసిన పన్నుల వంతును నిర్ణయిస్తాయి. కౌంటి బరోలలో రేట్‌లను నిర్ణయించటానికి స్వతంత్రమైన అధికారమున్న సంస్థ ఉంది. కౌంటీలలోని స్థానిక పరిపాలనా సంస్థ తమ ఉపయోగానికై విధించే రేట్లతోబాటు కౌంటి కౌన్సిల్ సూచించినట్లు దాని అవసరాలకోసం కొంత పన్ను వసూలు చేయవలసిన బాధ్యత ఉంది. రేట్‌ల నిర్ణాయక సంఘం సంవత్సరానికి ఆస్తివల్ల ఎంత బాడుగ రావచ్చునో లెక్కకట్టి దానినిబట్టి పన్నెంత విధించవలసిందో తేలుస్తుంది. పన్ను తగ్గింపుకోసం త్రైమాసిక న్యాయస్థానానికి (Quarter Sessions), ఉన్నత న్యాయస్థానానికి (High Court), ప్రభువుల సభకు అపీలు చేసుకోవచ్చు. నిశ్చితమైన రేట్‌ను అయిదేళ్లలోగా మార్చటానికి వీలులేదు. బాడుగకు ఉన్న వారే రేట్ చెల్లించేటట్లు ఏర్పాటు చేసుకోవచ్చు.

ఈ రేట్లవల్ల లభించే ద్రవ్య వ్యయం కూడా ఆడిట్‌కు లోబడి ఉంది. బరోలు తప్ప మిగిలిన స్థానిక పరిపాలనా సంస్థలన్నీ ఏటా తమ లెక్కలను జిల్లా ఆడిటర్‌కు నివేదించవలసి ఉంది. అయినా స్థానిక సంస్థ చేసిన వ్యయాన్ని కొంత అమోదించకపోతే ఆ మొత్తాలు వ్యయం చేసినవారు అచ్చుకోవలసి ఉంది. బరోలు కూడా విద్య, ఆరోగ్యము, సాంఘిక సంక్షేమం మొదలయిన కొన్ని అంశాలపై చేసిన వ్యయాన్ని ఆడిట్ అధికారులకు నివేదించవలసి ఉంది. ప్రభుత్వ మిచ్చే ధన సహాయాన్ని స్థానిక సంస్థ గ్రహించినప్పుడు ప్రతి విషయంలోనూ అది కేంద్ర ప్రభుత్వ పరిశీలనకు, అధికారానికి లోబడక తప్పదు. విద్య, పోలీస్ పద్దులపై చేసిన వ్యయాన్ని పరిశీలనాధికారులు (Inspectors) ఆమోదించకపోతే అయిన వ్యయంలో తన భాగాన్ని మంత్రివర్గం మంజూరు చేయదు. స్థానిక సంస్థలకు వ్యయం చేయటానికి పూర్తి స్వేచ్ఛ ఉన్న ద్రవ్యాల విషయంలో కూడా, మంత్రివర్గం జోక్యం చేసుకోవటానికి కొన్ని స్టాట్యూట్‌ల వల్ల అధికారముంది. స్థానిక సంస్థల అభివృద్ధి ప్రణాళికలను ఆయా విషయాలకు సంబంధించిన మంత్రివర్గాలు ఆమోదించవలసి ఉంది. స్థానిక సంస్థలను కొన్నింటిని పునర్నిర్మించటానికి కమిటీలను ఒక దానితో ఒకటి సమ్మిళితం చేయటానికి అధికార దుర్వినియోగమన్న కారణంతో తాత్కాలికంగా వాటిని తొలిగించటానికి మంత్రులకు అధికారముంది. ప్రభుత్వ శాసనాలకు లోబడి స్థానిక సంస్థలు చేసుకొనే అనుబంధ నియమాలను మంత్రు లామోదించవలసి వస్తుంది.

స్థానిక సంస్థల స్థితిలో 20 వ శతాబ్ది మధ్య భాగంలో విప్లవాత్మకమైన మార్పు వచ్చింది. వాటి బాధ్యతల వ్యాప్తి తగ్గిపోయింది. మొదటి ప్రపంచ యుద్ధానంతరం 1930 ప్రాంతంలో దేశాన్ని ఆవరించిన ఆర్థిక మాంద్యం స్థానిక సంస్థలపై ఉండే పేదల సహాయ్య కార్యక్రమం భారాన్ని ఎక్కువ చేసింది. ఈ భారం 1934 లో కొంత తగ్గింది. 1948 జాతీయ జీవిత భీమాపథకం దానిని పూర్తిగా తొలిగించింది. అదే సంవత్సరం ఏర్పాటైన

జాతీయారోగ్య సేవా పథకం వైద్యాలయాల నిర్వహణాన్ని, ఆరోగ్య సేవకుల (Health Visitors) పథకాన్ని, మాతా శిశురక్షణ భారాన్ని స్థానిక సంస్థలనుంచి తొలిగించి ప్రభుత్వం తీసుకొన్నది. స్థానిక సంస్థల వ్యయభారం ఈ విధంగా చాలా తగ్గింది. కాని గాస్, విద్యుచ్ఛక్తి సరఫరాలను జాతీయం చేయటంవల్ల వాటి మూలంగా ఇన్నాళ్ళు లభించిన ఆదాయాన్ని స్థానిక సంస్థలు పోగొట్టుకొన్నాయి. బాధ్యతలు ఒక్కొక్కటి స్థానిక సంస్థల పరిధినుంచి ప్రభుత్వం స్థాపించే ఇతర ప్రత్యేక సంఘాల అధీనం చేస్తూపోతే ప్రజా పరిపాలనకోసం ఏర్పడిన ఈ స్థానిక సంస్థలు ప్రాముఖ్యాన్ని క్రమంగా కోల్పోతాయి. ప్రజల ఆర్థిక రాజకీయ జీవితం ప్రభుత్వాధీనం అవుతుంది. జాతీయ సాహాయ్య సంఘము (National Assistance Board) 1948 లో పునర్నిర్మితం కాకముందు నిరుద్యోగి సాహాయ్య సంఘ మొకటి 1934 లో ఏర్పడింది. ప్రాంతీయ వైద్యాలయ సంఘాలు (Regional Hospital Boards), గాస్ కౌన్సిల్, విద్యుచ్ఛక్తి కౌన్సిల్ మొదలయినవి ఇటువంటి ప్రత్యేక సంఘాలు. మంత్రిమండలి పూర్వం స్థానిక ప్రజా సంఘాలతో పంచుకొన్న తమ పరిపాలనా భారాన్ని ఇప్పుడీరకం ప్రత్యేక సంఘాలతో పంచుకొన్నది. పూర్వం నిర్వహించిన పరిపాలనా కార్యాలు అనేకం ప్రభుత్వ నిర్వహణనుంచి తొలిగిపోయినా స్థానిక సంస్థల పరిపాలనా వ్యయం మాత్రం తగ్గింది కాదు. తగ్గకపోగా 1914 లో 934 లక్షల పౌన్‌లు అయింది ; 1960 నాటి కది 18,600 లక్షల పౌన్‌లకు పెరిగింది. దీనికి ముఖ్య కారణాలు కొన్ని పేర్కొవచ్చు : సామ్యవాద వ్యాప్తి ; బ్రిటిష్ రాజకీయాలలో కార్మిక పక్షానికి ఏర్పడిన ప్రాబల్యము ; బంగారం తవ్వకాలు, అధిక వస్తూత్పత్తి, జాతీయ - అంతర్జాతీయ వ్యాపారాభివృద్ధి. జీవిత ప్రమాణాల పెంపు, నాణేల విలువలో క్షీణత. వీటివల్ల సర్వత్రా జరిగినట్లే, స్థానిక ప్రభుత్వ రంగంలోనూ పరిపాలనా వ్యయం విపరీతంగా పెరిగిపోయింది. అందువల్ల స్థానిక పరిపాలనా సంస్థలు విశేషంగా కేంద్ర ప్రభుత్వ ధన సహాయం మీద ఆధారపడవలసి వచ్చింది. 1914 లో అవి ఖర్చు చేసిన 934 లక్షల పౌన్‌లలో 225 లక్షల పౌన్‌లు ప్రభుత్వ మివ్వగా 1960 లో వ్యయపరిచిన 18,600 లక్షల పౌన్‌లలో ప్రభుత్వం వంతు 7,540 లక్షల పౌన్ లయింది. స్థానిక సంస్థల పరిపాలనా వ్యయం పెరిగిన దామాషాలో రేట్లు చెల్లించే వారిచ్చే మొత్తం పెరగటం లేదు. ఈ సమస్యా పరిష్కారానికి రెండే మార్గాలు : స్థానిక సంస్థలు చేసే పనులు కొన్ని కేంద్ర ప్రభుత్వం స్వీకరించటమో లేదా స్థానిక సంస్థల పరిపాలనా వ్యయాన్ని ప్రభుత్వమే భరించటమో. ఈ రెండింటిలో ఏదీ ఇప్పటికి జరగలేదు కాని ప్రభుత్వం స్థానిక పరిపాలనా సంస్థలకిచ్చే ధన సహాయం మాత్రం నానాటికీ పెరిగిపోతూ ఉంది. 1958 లో ఉమ్మడిగా ఇంత మొత్తమని స్థానిక సంస్థల కిచ్చి వాటిని ఒకే పద్దు కింద ఖర్చు చెయ్యవలె అనే పద్ధతి అమలులోకి వచ్చింది. ఇచ్చిన మొత్తం చాలనప్పుడు లోపాన్ని ప్రభుత్వం భర్తీ చేస్తుంది. ఆ విధంగా ప్రభుత్వం ఇచ్చే మొత్తం రేట్ల వసూలువల్ల వచ్చిన రాబడినిబట్టి ఉంచేటట్లు నిర్ణయించింది. కేంద్ర ప్రభుత్వ మిచ్చే ధన సహాయం మీద ఇంతగా స్థానిక పరిపాలనా సంస్థలు ఆధారపడవలసి వచ్చినందువల్ల వాటి స్వాతంత్ర్యం ఎంతో సన్నగిల్లింది.

ఇన్ని సంస్కరణ శాసనాలు రూపుదిద్దిన స్థానిక పరిపాలనలో స్థానిక స్వపరిపాలన ఎంతవరకు నిల్చి ఉంది ? ఆ పరిపాలనాన్ని ఎంతవరకు ప్రజా ప్రభుత్వ మనవచ్చు ? అనే ప్రశ్నలు పుట్టవచ్చు. స్థానిక ప్రభుత్వం ఇంకా ధనాధికుల హస్తగతమై ఉండేనాని మధ్య

తరగతి ప్రజలలో తక్కువ స్థాయిలో ఉన్నవారికి, సామాన్య జనానికి అందులో భాగ స్వామ్యం లేదని జి. బి ఆడమ్స్ అభిప్రాయము. ఈ 25 ఏళ్ళలో లేబర్ పక్షం పలుకుబడి చాలా పెరిగినందువల్ల ప్రజా స్వామ్యానికి కూడా స్థానిక పరిపాలనలో కొంత స్థానం లభిం చిందని అనుకోవచ్చు. కాని ఈ స్థితిని వోటర్‌లు మార్చదలుచుకొంటే వారిని అడ్డుకొనే శక్తి ఏదీ లేదని అన్నారు. కాని స్థానిక ప్రభుత్వం ధనికుల చేతులలో ఉందా ? ప్రజాసామాన్యం చేతులలో ఉందా ? అనే మాట అటుంచనిచ్చి బ్రిటన్‌లోని స్థానిక పరిపాలనా సంస్థ లన్నింటి పైనా - అవి ఏ స్థాయికి చెందినవైనా - కొన్ని కేంద్ర ప్రభుత్వ శాఖలకు పర్యవేక్షణ, పెత్తనం ఉందన్న మాట మరవకూడదు. ఈ శాఖల మంత్రు లయిదుగురు కాబినెట్ హోదా ఉన్నవారున్నారు. దేశీయ వ్యవహారాల మంత్రి పర్యవేక్షణలో ఉన్న విషయాలలో స్థానిక రక్షణ దళము (Local Police), స్థానిక పారిశుద్ధ్యం ఉన్నాయి. (2) స్థానిక ప్రభుత్వపు బోర్డ్ బీదల సాహాయ్య కార్యక్రమంలో, పారిశుద్ధ్య విషయంలో, స్థానిక సంస్థల ఆదాయ వ్యయాల విషయంలో జోక్యం చేసుకొంటూ ఉండేది. ఇక విద్యా బోర్డ్, వ్యాపార బోర్డ్, వ్యవసాయ బోర్డ్‌లు స్థానిక విద్యా, వాణిజ్య, వ్యవసాయ విషయాలలో కలగజేసుకొంటూ ఉండేది.

పై కేంద్ర ప్రభుత్వ శాఖలు స్థానిక పరిపాలనా సంస్థలకు పంపే ఆజ్ఞలను శాసనాలు గానే శిరసావహించవలె. ఆజ్ఞలు, విధులు సక్రమంగా అమలు జరుగుతున్నాయో లేదో తెలుసు కోవటానికి ఆయా కేంద్ర ప్రభుత్వాధికారులు పర్యవేక్షకులను (Inspectors) నియమిస్తారు. స్థానిక పరిపాలన సంస్థలు సూచనలు, పథకాలు ఏమైనా పంపితే వాటిని తోసిపుచ్చే అధికారం పై ప్రభుత్వ శాఖలవారి కుంది. ఈ కేంద్ర మంత్రిత్వ శాఖలు స్థానిక సంస్థలకు ఆయా విష యాలలో సమర్థులైన వారినుంచి సలహాలను, సాంకేతిక సహాయాలను అందజేయటంలోనే తోడ్పడుతుండేవి. మంత్రిత్వ శాఖలలోని ఉద్యోగులు మంత్రులతోబాటు ఉద్యోగవిరమణ చేయరు. ఏ రాజకీయ పక్షము పార్లమెంట్‌లో అధికారపక్షమైనా వారి ఉద్యోగాల కేమీ ముప్పు లేదు. స్థానిక సంస్థలు పోనుపోను ఆ మంత్రిత్వ శాఖలలోని పెర్మనెంట్ ఉద్యోగులపై ఆధారపడటం పరిపాటి అయింది. ఆ కారణంవల్ల స్థానిక ప్రభుత్వ సంస్థలు స్థానిక ప్రజా స్వపరిపాలనా సంస్థలుగా ఉండటం మాని, ప్రధానంగా కేంద్ర ప్రభుత్వ పరిపాలనాంగాలుగా పరిణమించినాయి. స్థానిక స్వపరిపాలనం కేంద్ర ప్రభుత్వ పరిపాలనా భారాన్ని తగ్గించ టానికి ఉపకరిస్తుందని, జాతీయ ప్రభుత్వ రంగంలో స్థానిక పరిపాలనానుభవంతో గడిదేరిన వారు మరింత సమర్థంగా పనిచేస్తారని స్థానిక స్వపరిపాలనాన్ని సమర్థించేవారు సామాన్యంగా వాదిస్తారు. కాని కేంద్ర ప్రభుత్వ శాఖలు నిరంతరం తమ అధికారాన్ని విస్తరించటానికి చేసే ప్రయత్నాల ఫలితంగా ఈ ప్రయోజనాలు అంతగా సమకూర లేదు. స్థానిక ప్రజలు గుర్తించేవరకు కేంద్ర ప్రభుత్వం గుర్తించలేదనే వాదం ఉంది. కాని ఆ స్థానికావసరాలను స్థానిక పరిపాలనా సంస్థలు తీర్చవచ్చు గదా ! ఆ అవసరాలు తీర్చటానికి కేంద్ర ప్రభుత్వ ధన సహాయం కావలసి ఉంటుంది. కాబట్టి స్థానిక సంస్థలపై కేంద్రం పెత్తనమూ తప్పదు గదా అని వాదించవచ్చు. ఈ సందర్భంలో స్థానిక పరిపాలనంలో ముఠా తత్వాలు, స్వార్థ పరత్వము, అసమర్థత, సోమరితనము, ప్రజాహిత కార్యాలలో అశ్రద్ధలవల్లనే కేంద్ర ప్రభుత్వ శాఖల పెత్తనం పెరిగింది. జాతీయ ప్రయోజనాలు సాధించటానికి దేశ ప్రజాళి

ప్రాయము ప్రతిబింబించే కేంద్ర మంత్రివర్గం మాటల కెక్కువ మన్నన, పథకాల కెక్కువ చెల్లుబడి ఉండటం న్యాయమే. ఈ సందర్భంలో మన రాష్ట్ర పంచాయతీ రాజ్య మెంతవరకు సత్ఫలితాలను ఇస్తున్నది. దానిపై రాష్ట్ర ప్రభుత్వ మెంతవరకు అధికారం చెలాయిస్తున్నది? పంచాయతీలను ఎందుకు రద్దు చేయకూడదు? అని ఇటీవల మన ప్రభుత్వం చేస్తున్న ఆలోచన గమనార్హము.

## న్యాయపరిపాలన సంస్కరణలు

1882 నాటి మొదటి సంస్కరణ శాసనానంతరం న్యాయశాస్త్రంలోను, న్యాయ పరిపాలనా సంస్థలలోను వచ్చిన సవరణలు స్థానిక పరిపాలనా సంస్థలలో అమలు జరిపిన సంస్కరణలంత ప్రముఖమైనవే. పార్లమెంటరీ ప్రాతినిధ్యం తెచ్చిపెట్టిన మార్పులవల్ల మానవతా దృష్టి, పౌరుల స్వేచ్ఛాసమత్వాలపై అనురక్తివల్ల న్యాయశాస్త్రంలో అభివృద్ధిని సాధించినాయి. 1886 లో దోష విచారణా విధాన సంస్కరణవల్ల ముద్దాయికి న్యాయవాదిని ఏర్పాటుచేసుకొనే హక్కు, న్యాయ స్థానంలో దాఖలు చేసిన ప్రతికూల సాక్ష్యాన్ని తెలుసుకొనే అవకాశం ఏర్పడినాయి. అందువల్ల ముద్దాయి పక్షాన వాదించే న్యాయవాదికి అతడు నిర్దోషి అయినా శిక్ష పడకుండా రక్షించటానికి ఎక్కువ వీలు ఉంటుంది. 1887 కు పూర్వం మరణశిక్ష విధించదగిన నేరాల సంఖ్య అత్యధికంగా ఉండేది. కొద్దిపాటి దొంగతనాలు, చిన్న నేరాలు చేసినవారికి మరణశిక్ష విధించకుండా 1917 నాటి శాసనం కట్టుదిట్టం చేసింది. హత్యానేరాలు, రాజద్రోహం మొదలయిన పెద్ద నేరాలు రుజువైనప్పుడే మరణశిక్ష విధించేటట్లు పై శాసనం నిర్ణయించింది. 1886, 1887 నాటి శాసనాలు మొదలుపెట్టిన మార్పులను వాటి ననుసరించి చేసిన అనేకమైన స్టాట్యూట్‌లు పూర్తి చేసినాయి. వాటివల్ల న్యాయపరిపాలన నుంచి క్రౌర్యము, పక్షపాతము చాలావరకు తొలిగిపోయింది. పరిస్థితుల ప్రాబల్యంవల్ల, పెంపకంలోని లోపాలవల్ల, సహవాసదోషంవల్ల, దారిద్ర్యం ఒత్తిడివల్ల మానవుడు నేరాలు చేయటం సంభవిస్తుందనే అభిప్రాయం క్రమంగా సంఘంలో బలపడింది. నేరాలు చేసే ప్రవృత్తి ఒక్కొక్కప్పుడు మానసిక జాడ్య ఫలితమనీ అందువల్ల నేరస్తునిపై సంఘం పగ తీర్చుకోకుండా సానుభూతిలో ఆ మానసిక వ్యాధిని నివారించే మార్గాలవలంబించవచ్చుననీ మన స్తత్వ శాస్త్రపరిశోధనలు చేసే ప్రబోధము, నేర విచారణలో, క్రిమినల్ న్యాయవిభాగంలో దయా ధర్మాలు దృష్టిలోకి తేవడానికి వీలయింది. 1907 లో క్రిమినల్ అపీలు న్యాయ స్థానం అవతరించి శిక్షపడిన వ్యక్తులకు అప్పీల్ చేయటానికి పరిపూర్ణమైన అవకాశం కలిగింది. సివిల్ న్యాయం కోరేవారు వ్యయ ప్రయాసలతో కూడిన క్లిష్టమైన విధానాన్ని (procedure) అనుసరించవలసి ఉంది. అది కొన్ని శతాబ్దాలుగా అమలులో ఉంది. 1882లో దానిని కొంత సడలించినారు. ఈ మూడు న్యాయస్థానాలూ ఒకే విధమైన న్యాయవిధానాన్ని అనుసరించేటట్లు నిర్ణయించడం జరిగింది. 1852 లో చేసిన రెండు స్టాట్యూట్లు విధానంలోను, సామాన్య న్యాయస్థానాల సిబ్బందిలోను ముఖ్యమైన మార్పులు చేసినాయి. ఛాన్సరీ న్యాయ స్థానాలలో కూడా విధానానికి సంబంధించిన మార్పులు చేసినారు. ఈ సవరణలు సామాన్య న్యాయానికి (Common law), ధర్మానికి (Equity) ఉన్న వ్యత్యాసాన్ని తొలిగిస్తాయి. ఛాన్సరీ న్యాయస్థానాలు కొంత సంఘటితపడినాయి.

పై సంస్కరణలు 1873 లో ఆరంభమై వరసగా 1910 వరకు వచ్చిన న్యాయస్థాన పునర్నిర్మాణ శాసనాలకు దారి సుగమం చేసినాయి. 1873 లో అత్యున్నత న్యాయస్థాన శాసనము ఉన్నత న్యాయస్థానా లన్నింటినీ ఐక్యం చేసింది. లెంకాస్టర్, డర్‌హామ్ న్యాయ స్థానాలను అత్యున్నత న్యాయస్థానంతో కలిపివేసినారు. ఈ రెండు మండలాల్లోను ఈక్విటీ న్యాయస్థానాలు మాత్రమే మిగిలినాయి. పూర్వపు ఉన్నత న్యాయస్థానాలు 1873 లో ఏర్పాటైన అత్యున్నత న్యాయస్థాన విభాగా లయినాయి. కాని 1880 లో ప్రివీ కౌన్సిల్ జారీచేసిన అజ్ఞ రాజ న్యాయస్థాన విభాగంలో సామాన్య న్యాయస్థానాన్ని (Court of Common Pleas), కోశ న్యాయస్థానాన్ని (Exchequer Court) ఐక్యం చేసింది. అప్పటినుంచి ఉన్నత న్యాయస్థానము మూడు విభాగాలుగా పనిచేయసాగింది: (1) రాజ న్యాయస్థానము (King's Bench Court). (2) ఛాన్సరీ (Chancery) న్యాయస్థానము. (3) ఒకే విభాగంగా పనిచేసే ప్రొబేట్ (Probate), వివాహ విచ్ఛేద (Divorce) నౌకాదళ (Admirality) న్యాయస్థానాలు (ధార్మిక) న్యాయ, సామాన్య న్యాయాలను ఒక్క న్యాయాధిపతే ప్రసాదించే పద్ధతి ఆరంభమయింది. సామాన్యంగా ఒక్క న్యాయాధిపతే న్యాయస్థానాన్ని అధిష్ఠించి న్యాయపాలనం చేస్తాడు. రాజ న్యాయస్థానంలో న్యాయాధిపతి సామాన్యంగా జ్యూరీ సాయం తీసుకొంటాడు. నేర విచారణ (Criminal trials) సంచార న్యాయస్థానాలలోను, లండన్ నగరంలోని కేంద్ర క్రిమినల్ న్యాయస్థానంలోను ఇప్పుడు జరుగుతూ ఉంది. ఇద్దరో అంతకంటె ఎక్కువ మందో న్యాయాధిపతులు విభాగ న్యాయ స్థానంగా (Divisional Court) ఏర్పడి కింది వ్యాజ్యాలను పరిష్కరిస్తున్నారు. దిగువ న్యాయస్థానాల తీర్పులపై అపీళ్లు, అంతకుముందు జ్యూరీల సాయంతో విచారించిన వ్యాజ్యాల పునర్విచారణ జరగవలెనని చేసే విన్నపాలు, డివిజనల్ కోర్ట్ విచారించవలెనని న్యాయాధిపతి నిర్ణయించిన వ్యాజ్యాలు, మాన్‌డమస్, ప్రొహిబిషన్, సర్టియోరరీ వ్యాజ్యాలు ఉన్నత న్యాయస్థానం విచారణ చేయవలసిన వ్యాజ్యాలను కొంతవరకు సంచార న్యాయస్థానాలు (assize courts on circuit) పరిష్కరిస్తాయి

అత్యున్నత న్యాయస్థానం రెండు శాఖలుగా పనిచేస్తుంది. అందులో ఒకటి ఉన్నత న్యాయస్థానము (High Court). రెండోది అపీల్ న్యాయస్థానము (Court of Appeal). ఉన్నత న్యాయస్థానాలు వివిధ విభాగాలలో అనుసరించే వ్యాజ్య విచారణ విధానం ప్రసాదించే న్యాయము సాధ్యమైనంతవరకు ఏకీభావంతో ఉంటాయి. ఉన్నత న్యాయస్థానం తీర్పులపై చేసే విన్నపాలు పరిష్కరించే పని అపీల్ కోర్ట్ చూస్తుంది. దాని తీర్పులపై అపీల్ అత్యున్నత న్యాయస్థానంగా ఏర్పడిన ప్రభువుల సభ వినవచ్చు. 1873 లో సివిల్ వ్యాజ్యాలలో అపీళ్ళు విచారించే న్యాయస్థానము కింది సభ్యులతో ఏర్పడింది: 1. అయిదుగురు న్యాయ ప్రభువులు (Lords Justices) 2. ఉన్నత న్యాయస్థానంలోని మూడు విభాగాల ముఖ్య న్యాయాధిపతులు 3. ఛాన్సలర్ ప్రభువు నియమించే మాజీ ఛాన్సలర్ ప్రభువులు ముగ్గురు 4. అపీళ్లను న్యాయస్థాన విచారణకు తెచ్చే మాస్టర్ ఆఫ్ ది రోల్స్ (Master of the Rolls). ఈ అపీల్ న్యాయస్థానము పూర్వం ఎక్స్‌చెకర్ ఛాంబర్, ఛాన్సరీ, అపీల్ న్యాయ ప్రభువులు నిర్వహించే పనులు చూడటానికి నిర్దిష్టమయింది. 1876 నాటి అపెలెట్ అధికార శాసనము (Appellate Jurisdiction Act) అపీల్ న్యాయస్థానంపై ప్రభువుల సభ

తాలూకు అత్యున్నత న్యాయ పరిపాలనాన్ని స్థాపించింది ఈ న్యాయాధికారాన్ని నిర్వహించే వారు సామాన్య అపీళ్ళ న్యాయ ప్రభువులు (Lords of Appeal in Ordinary), పూర్వం ఉన్నత న్యాయాధికారం వెలయించిన ఇతర ప్రభువులు. వీరు ఛాన్సలర్ ప్రభువు అధ్యక్షతన సమావేశమయ్యేవారు.

క్రిమినల్ వ్యాజ్యాలలో 1907 వరకు అపీల్ చేసే ఏర్పాటు లేదుకాని వ్యాజ్యానికి ఒక శాసనము అన్వయిస్తుందా లేదా అని ప్రభుత్వ ప్రత్యేక వ్యాజ్యాల న్యాయస్థానాన్ని (Court of crown cases reserved) అడగవచ్చు ఆ న్యాయసానమే నేరారోపణము లోపభూయిష్టమైనా, విధించిన శిక్ష న్యాయశాసన విరుద్ధమైనా విచారించి న్యాయాన్ని ప్రసాదించవచ్చు. 1907 లో క్రిమినల్ అపీళ్ళ న్యాయసానము ఏర్పాటయింది. రాజ న్యాయసాన న్యాయాధిపతులే క్రిమినల్ అపీల్ కోర్ట్ న్యాయాధికారులు. వారు న్యాయశాస్త్ర విషయమైన సందేహాలను క్రిమినల్ అపీల్ వ్యాజ్యం విషయంలో పరిష్కరిసారు. కింది కోర్టులో విచారించిన న్యాయాధికారి అనుమతిగల వ్యాజ్యాలనుగాని తమకు నేరుగా దాఖలు చేసిన అపీళ్లను గాని ఈ క్రిమినల్ అపీల్ కోర్ట్ న్యాయాధిపతులు పరిష్కరిస్తారు.

*స్థానిక న్యాయపాలనము:* దేశాన్ని అయిదువందల జిల్లాలుగాను, ఆ జిల్లాలను కొన్ని సంచార న్యాయపరిపాలనా మండలాలుగాను 1846 లో విభజించినారు. ఈ మండల న్యాయస్థానాలను కౌంటీ కోర్టులని పిలిచేవారు. కౌంటీ కోర్టులని వీటికి పేరు పెట్టినా ఈ కౌంటీలకు పూర్వపు కౌంటీలతో ఎట్టి సంబంధమూ లేదు. ఈ న్యాయస్థానాల తీర్పులపై ఉన్నత న్యాయస్థానం (High Court) లో అపీల్ చేయవచ్చు. ఆ హైకోర్ట్ తీర్పుపై అపీల్‌ను ప్రభుసభా న్యాయస్థానానికి తీసుకొనిపోవచ్చు. అంతగా ప్రాముఖ్యం లేని వ్యాజ్యాలను సాధారణంగా కౌంటీ కోర్టులలోనే దాఖలు చేయవచ్చు. ఈ కోర్టుల న్యాయాధికారం 20 వ శతాబ్దంలో విస్తరించింది. శాంతి న్యాయరక్షకుల (Justice of the Peace) న్యాయస్థానాలు స్థానిక క్రిమినల్, పోలిస్ కోర్టులుగా ఈ నాటికీ వ్యవహరిస్తున్నాయి. ఈ కోర్టులు పెట్టీ సెషన్స్‌గాను త్రైమాసిక సెషన్స్‌గాను పనిచేస్తున్నాయి.

*బ్రిటిష్ డొమినియన్‌లలో ప్రివీ కౌన్సిల్ న్యాయాధికారము:* న్యాయపరిపాలనా రంగంలో బ్రిటిష్ డొమినియన్‌ల సర్వస్వతంత్రాధికారము (Sovereignty) 1888, 1844 నాటి పార్లమెంటరీ శాసనాలు ప్రివీ కౌన్సిల్ అపెలెట్ అధికారానికి డొమినియన్ న్యాయస్థానాల తీర్పులు లోబడినట్లు చేయటంవల్ల పరిమితమయింది. కెనడాలోని కేంద్ర, రాష్ట్రీయ ఉన్నత న్యాయస్థానాల తీర్పులపై ప్రివీ కౌన్సిల్‌కు అపీల్ చేసుకోవటానికి సంపూర్ణ స్వేచ్ఛ నిచ్చినారు. 1900 నాటి ఆస్ట్రేలియా రాజ్యాంగ శాసనంవల్ల రాష్ట్రీయ ఉన్నత న్యాయస్థానాల తీర్పులపై ప్రివీ కౌన్సిల్‌కు నిరాటంకంగా అపీల్ చేసుకొనే అధికారం లభించింది. ఆస్ట్రేలియా కామన్‌వెల్త్ ఉన్నత న్యాయస్థానాల తీర్పులపై అపీల్ చేయటానికి ప్రివీ కౌన్సిల్ ప్రత్యేకానుమతి అవసరమనీ కొన్ని రాజ్యాంగసంబంధమైన వ్యాజ్యాలలో కామన్‌వెల్త్ ఉన్నత న్యాయస్థానమే అనుజ్ఞ ఇవ్వవలసి ఉంటుందనీ 1900 నాటి ఆస్ట్రేలియా రాజ్యాంగ శాసనం విధించింది. దక్షిణాఫ్రికా నుంచి ప్రివీ కౌన్సిల్‌కు అపీళ్ళు చేయటానికి ముందున్న నిర్నిబంధమైన హక్కును దక్షిణాఫ్రికా చట్టం రద్దుచేసింది. ఏయే విషయాలలో ప్రివీ కౌన్సిల్‌కు అపీల్ చేయటానికి దాని ప్రత్యేకానుమతిని కోరవచ్చునో ఆ యా విషయాలను పరిమితం చేయటానికి

ఆ చట్టం దక్షిణాఫ్రికా పార్లమెంట్‌కు అధికారమిచ్చింది. కాని ఆ పరిమిత శాసనాన్ని దక్షిణాఫ్రికా గవర్నర్ జనరల్ అనుమతించవలసి ఉంటుంది. ప్రివీ కౌన్సిల్‌కు అపీల్ చేయటానికి.అనుమతి (బ్రిటిష్) సామ్రాజ్య శాసనంలో ఉంది. కాబట్టి ఈ మూడు డొమినియన్‌లలో ఏదీ తనంత తాను దానిని తొలిగించ లేదు. దానికున్న శాసనాధికారం దాని సీమాంతాల (territorial limits) కే పరిమితమై ఉండటంవల్ల ఈ అపీల్ హక్కును ఏ డొమినియన్ శాసన సభా రద్దు చేయలేదు. 1937 లో అమలులోకి వచ్చిన 1935 నాటి భారత ప్రభుత్వ శాసనం ఇండియాలోని ఉన్నత న్యాయస్థానాల తీర్పులపై ప్రివీ కౌన్సిల్‌కు ఉన్న అపెల్లెట్ అధికారాన్ని తొలగించకపోయినా భారత రాష్ట్రీయ ఉన్నత న్యాయస్థానం తీర్పులపై అపీళ్లను విచారించే అధికారమున్న భారత సమాఖ్యా న్యాయస్థానాన్ని (Federal Court of India) స్థాపించింది. దానికి బ్రిటిష్ పాలిత రాష్ట్రాలపైనే కాక స్వదేశ సంస్థానాలపైన కూడా న్యాయనిర్వహణాధికారాన్ని ఇచ్చింది. రాజ్యాంగాన్ని వ్యాఖ్యానించే అధికారం కూడా భారత సమాఖ్యా న్యాయస్థానానికి 1935 నాటి భారత ప్రభుత్వ శాసనం ద్వారా సంక్రమించింది దీని నిర్ణయాలపైన ప్రివీ కౌన్సిల్‌కు అపీల్ చేసే అధికారాన్ని 1935 నాటి చట్టం తీసివేయలేదు కాని 1950 జనవరి 26 తేదీని నూతన ఇండియన్ యూనియన్ ఆవిర్భవించటంతో బాటు భారతదేశీయ పరమోన్నత న్యాయస్థానము (The Supreme Court of India) స్థాపించిన నాటినుంచి భారత సమఖ్యా న్యాయస్థానము స్వతంత్ర భారదేశానికి పరమోన్నత న్యాయస్థాన మయినందువల్ల దాని తీర్పులపైగాని, రాష్ట్ర ఉన్నత న్యాయస్థానం తీర్పుల నుంచిగాని ప్రివీ కౌన్సిల్ జ్యుడిషియల్ కమిటీకి అపీల్ చేసుకొనే పూర్వపు హక్కు రద్దయింది.

బ్రిటన్‌లోని ఉన్నత న్యాయాధిపతులను నియమించేది బ్రిటిష్ మంత్రివర్గమే. కాని ఒక్కసారి నియమితుడైన న్యాయాధిపతి ఆమరణమో లేదా తనంతతాను ఉద్యోగం నుంచి విరమించుకొనేదాకానో ఆ పదవిలో ఉండవచ్చు. ఉద్యోగ కాలంలో అతని జీతాన్ని తగ్గించటానికి ప్రభుత్వానికి అధికారం లేదు. అవినీతికి పాల్పడిన న్యాయాధిపతిని పార్లమెంట్‌లోని రెండు సభలూ తొలిగించవలసిందని రాజును అర్థిస్తేకాని ఆ పదవినుంచి అతనిని తొలగించటానికి ఎవ్వరికీ అధికారం లేదు. ఈ కారణాలవల్ల నిష్పక్షపాతంగా నిర్భయంగా స్వతంత్రంగా తీర్పు లిచ్చి పౌరుల స్వాతంత్ర్యాన్ని రక్షించటంలో బ్రిటిష్ న్యాయపరిపాలనా శాఖ సాటిలేని కీర్తిని ఆర్జించింది.

# 15
# 20వ శతాబ్దంలో పార్లమెంటరీ సంస్కరణ శాసనాలు

## 1. ప్రభుసభా సంస్కరణ–1911

1832 నుంచి 1885 వరకు చేసిన పార్లమెంటరీ సంస్కరణ శాసనాల ఫలితంగా బ్రిటిష్ దేశ పరిపాలనలో రాజాధికారం పూర్తిగా అంతరించింది. తత్ఫలితంగా రాజులతో శతాబ్దాలుగా పోరాటం సాగించి విజయం పొందిన పార్లమెంట్‌కు పరిపాలనాధికారం హస్తగతమై ఉంటుందని అనుకోవటం సహజము. ఆ సంస్కరణలవల్ల పూర్వం ఎన్నడూ లేనంతగా కామన్స్ సభ్యులు అత్యధిక సంఖ్యాకులకు ప్రతినిధులైన మాట నిజమే. కాని దానివల్ల కామన్స్ సభకు రావలసిన ప్రాధాన్యం మంత్రివర్గం చేతులలోకి జారిపోయింది దానికి అనేకమైన ఇతర కారణాలున్నాయి. ఆ విధంగా జరగకుండా చేయటానికి కామన్స్ సభ చేయలేకపోయింది. పోనీ ఎన్నికలలో జయాపజయాల మీద అంతగా ఆధారపడ నక్కరలేని, చాలావరకు వంశ పారంపర్యమైన సభ్యత్వం ఉన్న ప్రభువుల సభ అయినా మంత్రివర్గం వారి ఆధిక్యాన్ని ఆధిపత్యాన్ని నిరోధించటానికి ప్రయత్నించలేదా ? అంటే అట్లాంటి ప్రభుసభా ప్రయత్నాలను భగ్నం చేసే విషయంలో కామన్స్ సభ మంత్రివర్గాలతో మాటి మాటికి జోక్యం కలిగించు కొంది. ప్రభువుల సభ నిర్వీర్యం చేయటానికి జరిగిన ప్రయత్నాలలో తీవ్రమయినది 1911 పార్లమెంటరీ శాసనము. దేశంలోని ఇతర రాజకీయ పరిస్థితులు కూడా ఆ ప్రయోజనాన్ని చేకూర్చటానికి తోడ్పడినాయి. కాని దానివల్ల పార్లమెంట్ రెండు సభలలో కామన్స్ సభ తన ఆధిక్యాన్ని సాధించినట్లు కనబడినా, నిజానికి లాభించింది మంత్రి వర్గానికే. కామన్స్ సభలో ప్రభుత్వపక్ష సంఖ్యాధిక్యం వందకు మించి ఉండటం సామాన్య లక్షణమయినప్పటి నుంచి మంత్రివర్గ బలం చాలా హెచ్చింది. ప్రభుత్వ విధానాలపై తమ అభిప్రాయాలు మారినందు వల్ల వోటర్‌లు కామన్స్‌లోని తమ ప్రతినిధులపై ఎంత ఒత్తిడి తెచ్చినా వారిలో మంత్రివర్గం ప్రతిపాదించే చట్టాలకు వ్యతిరేకంగా వోట్ చేయటానికి సాహసించేవారు ఎక్కువ మంది ఉండరు. తాము ప్రతిపాదించిన చట్టాలకు వ్యతిరేకంగా వోట్ చేసేవారు తమ పక్షంలోనే ఎక్కువ మంది ఉన్నారనే సూచనలు కనిపిస్తే, పార్లమెంట్‌కు బయట మారిన ప్రజాభి ప్రాయాని కనుగుణంగా, ముందు జాగ్రత్తపడి తమ విధానాలను మార్చుకోవటానికి వెనుదీసిన మంత్రివర్గము 1885 కు అనంతర కాలంలో ఒక్కటీ కనిపించదు. ప్రజాభిప్రాయం మారిందా? లేదా? అనే విషయంలో సందేహం వస్తే పార్లమెంట్‌ను రద్దుచేసి, జనరల్ ఎన్నికలు జరి పించమని రాజుకు సలహా ఇవ్వటానికి ఒప్పుకోని ఏ ప్రధానమంత్రి కూడా 1885 కు తరవాత సామాన్యంగా మనకు కానరాడు. తమ పక్షం మంత్రివర్గాన్ని ఓడించటం కోసం ప్రతి పక్షాలతో చేతులు కలపటం పార్లమెంట్ అధికార పక్షాల చరిత్రలో అనూహ్యమైన, అసాధా

రణమైన విషయము. మధ్యంతరరంగా ఎన్నికలు జరిగినట్లయితే, తమపక్ష నాయకులకు వ్యతిరేకంగా కృషిచేస్తే తమను ఆ పార్టీ పక్షంలో వారు ఎన్నికకు నిలబెట్టే ఆశలేదు ; ప్రతిపక్షంవారు తమ ప్రతినిధులుగా అట్లాంటి స్వపక్ష విద్రోహులను వరించే అవకాశమూ అంతగా ఉండదు. 1885 తరవాతి కాలంలో ఒక్కొక్క దశాబ్దం గడిచేకొద్దీ ఎన్నికలలో పోటీచేసే వారికయ్యే వ్యయం విపరీతంగా పెరుగుతూ ఉండటంవల్ల దొరతనపు పక్షం వారేకాక ప్రతిపక్ష సభ్యులు కూడా పార్లమెంట్ జీవితాన్ని మధ్యలో కత్తిరించటానికి పూనుకోరు. జనరల్ ఎన్నికలలో ఈసారి తమ పక్షానికి స్థానాలు అధికంగా లభించి తీరుతాయని నమ్మకం ఉంటేనే కాని ప్రభుత్వాన్ని కూలదోసేటంత సాహసానికి వారు పూనుకోరు. ఇటు కామన్స్ సభ్యులు గాని అటు మంత్రిమండలిలోనివారుగానీ దేశంలోని ప్రజాభిప్రాయం ఏ దిక్కుగా వీస్తున్నదని గమనిస్తూ దానిని అనుసరించి పార్లమెంట్ సమావేశంలో నడుచుకోవటం ఈ శతాబ్ది కాలంలో బాగా నేర్చుకొన్నారు. తాము ప్రతిపాదించే చిత్తు చట్టం గెలిచి తీరవలెననే పట్టుదల ఉన్నప్పుడు మంత్రిమండలి సభ్యులు ఆ ప్రతిపాదన ఓడితే తాము రాజీనామా లివ్వటానికి సిద్ధంగా ఉన్నామని తమ పక్ష సభ్యులను బెదిరిస్తే వారు ఆ చట్టానికి వ్యతిరేకంగా వోట్ చేయటం మానుకొంటారు. ఈ కారణాలవల్ల కామన్స్ సభకు మంత్రివర్గానికి ఒక నూరేళ్ళుగా సంఘర్షణలు రావటం అరుదు మంత్రివర్గానిదే సామాన్యంగా పైచేయి అయింది. కాని ప్రభువుల సభకు కామన్స్ సభకు ఆధిక్యంకోసం జరిగిన కుమ్ములాటలో కామన్స్ సభకే చివరికి విజయం లభించింది. విజయం సాధించి, ఆ విధంగా, తాను మద్దతుచేసే (కాబినెట్) మంత్రివర్గాన్ని అది చాలా బలపరిచింది. కడకు కామన్స్ సభగాని, ప్రభువుల సభగాని మంత్రివర్గాలను ఎదిరించి నెగ్గలేనంత బలహీనమయినాయి.

## ప్రభువుల సభా నిర్మాణము

1861 లో బెర్క్లీ ప్రభుసభా సభ్యత్వాన్ని గురించిన వ్యాజ్యం తీర్పువల్ల జమీన్‌దారీతనానికి, ప్రభుసభా సభ్యత్వానికి ఉన్న సంబంధం తెగిపోయింది. గతంలోవలె ప్రభుత్వంతో బాటు ప్రభుసభా సభ్యత్వం కోరే ప్రభువు తన పూర్వులలో ఒక్కరికి ప్రభువుగా చేస్తూ దొరతనం వారిచ్చిన అనుజ్ఞ పత్రం (Letters Patent) తో పాటు, ప్రభుసభకు ఆహ్వానం కూడా పంపినట్లు రుజువు చేయవలసి వచ్చింది కాని ప్రభుసభా నిర్మాణంలో - కామన్స్ సభా నిర్మాణంలో 1832 - 1885 మధ్య కాలంలో జరిగినట్లు చెప్పతగినంతగా మార్పులు రాలేదు. స్టూవర్ట్ రాజులు తమ కాలంలో ప్రభుసభకు 94 మందిని కొత్తగా చేర్చినారు. విలియమ్ ఆనీల్ స్కాట్లండ్ ప్రతినిధి ప్రభువులు కాక, తక్కిన ప్రభు సభా సభ్యుల సంఖ్యను 178 కి పెంచినారు. మొదటి జార్జ్ రాజు లిద్దరూ తమవంతుకు తాము కొత్త ప్రభువులను నియమించినారు. అయినా మూడో జార్జ్ రాజయిన నాటికి ఆ సంఖ్య 174 కు మించలేదు. మూడో జార్జ్ సృష్టించినవి 388 ప్రభు పదవులు. కాని వాటిలో 1860 నాటికి శిలం కాకుండా నిల్చి ఉన్నవి 128 మాత్రమే. 1860 లో మొత్తం ప్రభువుల సంఖ్య 460. ప్రభువుల సంఖ్య పెరగకుండటానికి కొన్ని ప్రభు కుటుంబాలు ఇతర ప్రభు కుటుంబాలతో ఐక్యం కావటం మరొక కారణము. విక్టోరియా పాలనలో మొదటి 28 ఏళ్లలో కొత్త ప్రభు పదవి ఒకటి ఏర్పడగానే పాత ప్రభు కుటుంబం ఒకటి అంతరించింది. అట్లయినా ఈ శతాబ్దంలో జనసంఖ్య

వృద్ధి కావటంవల్ల ఆరోగ్య శాస్త్రాభివృద్ధితో పాటు ఆరోగ్య రక్షణ విషయంలో అందరూ ఎక్కువ శ్రద్ధ తీసుకోవటం వల్ల అధికారంలోకి వచ్చిన రాజకీయ పక్షాలు తమ బలం హెచ్చించుకోవటం కోసం కొత్త ప్రభు స్థానాలను సృష్టించటంవల్ల ప్రభుసభా సంఖ్యలు అదే పనిగా పెరిగిపోయినాయి. ఏడో ఎడ్వర్డ్ రాజైనప్పుడు 591 గా ఉన్న ఆ సంఖ్య ఐదో జార్జ్ సింహాసన మధిష్ఠించేనాటికి 623 అయి, 1919 మార్చి మాసాంతానికి 698 కి పెరిగింది. 1905-1919 మధ్య కాలంలో 149 కొత్త ప్రభు పదవులను ఏర్పరిచి ఈ వృద్ధికి కారకులైనవి లిబరల్, మిశ్రమ మంత్రివర్గాలు. కుమారుడు పిట్ (The Young Pitt) దేశ పరిశ్రమలలో, వాణిజ్యంలో, విజ్ఞాన శాస్త్రంలో, సారస్వతరంగంలో ప్రసిద్ధికెక్కి వచ్చిన వారిని ప్రభువుల సభకు నియోజించటానికి తన విధానంగా పెట్టుకొన్నాడు. కాని ఈ విధానంవల్ల రాజకీయాలలో ఉదార వైఖరిని చూపించేదిగా ప్రభుసభ మారలేదు. ఆ ప్రభు సభలో సభ్యులైతే చాలు. అంతకుముందు ఉదార రాజకీయ వాదులుగా ఉన్నవారు కూడా మితవాదులుగా మారిపోవటం సంభవించేది. 1880-1910 మధ్యకాలంలో-మితవాదులు (Conservatives) అధికారంలో ఉన్న 34 ఏళ్లలో 181 ప్రభువులను సృష్టించినారు. ఉదారులు (Liberals) తాము అధికారంలో ఉన్న 45 ఏళ్లలో 270 ప్రభువులను ప్రభుసభకు నియోజించినారు కాని 1911 నాటికి లెక్క తీయగా ఉదార పక్ష ప్రభువుల సంఖ్య 105 మాత్రమే.

1881 లో డెర్బి ప్రభువు తన ఉపన్యాసంలో ఈ విధంగా ప్రభువుల సభను గురించి తన అభిప్రాయం తెలిసినట్లు ఆడమ్స్ తన ఇంగ్లీష్ రాజ్యాంగ చరిత్రలో ఉదహరించినాడు : "ప్రభువుల సభకున్న హక్కులు లేవు ; అది నిర్వహించే విధులు అంతకంటె లేవు". కాని నిజానికి ప్రభుసభాస్థితి ఆయన నిరసించినంత శోచనీయంగా లేదు. కామన్స్ సభలోవలె కాక ప్రభు సభలో చర్చలు నిదానంగా తీరికగా జరగటానికి వీలుంది. చిత్తు, చట్టాలలోని ముఖ్యాంశాల మీదనే ప్రభుసభ తన దృష్టిని కేంద్రీకరిస్తుంది. అక్కడి సభ్యులలో చాలామంది పరిపాలనలో, ప్రజా వ్యవహారాలలో అనుభవపరులు. ఆరితేరిన వారు. క్షుణ్ణంగా చట్టంలోని ప్రధానాంశాలను తూర్పారబట్టగల వాద నైపుణ్యం వారిలో అనేకులకున్నది. ఇక కామన్స్ సభలోనా, వినేవారి రాజకీయ విజ్ఞానాన్ని పెంపొందించే ఉపన్యాసాలు అక్కడ చాలా అరుదనే చెప్పవచ్చు. ప్రభుసభ చేసే సవరణలు సామాన్యంగా కామన్స్ సభ ఆమోదాన్ని పొందుతునే ఉన్నాయి. ఒక్కొక్కప్పుడు కామన్స్ చేసిన తీర్మానాన్ని ప్రభువులు తోసివేయటం కూడా లాభదాయకంగా పరిణమిస్తున్నది. త్వరపడి కామన్స్ ప్రజాభిప్రాయ విరుద్ధమైన చట్టాన్ని ఆమోదించినా దానిని పునర్విమర్శించటానికి కామన్స్ సభ్యులకు మరొక్క అవకాశమివ్వటమో జనరల్ ఎన్నికలు జరిపి ప్రజల యథార్థాభిప్రాయాన్ని తెలుసుకొనే వీలు కలిగించటమో ప్రభుసభా తిరస్కారంవల్ల సాధ్యమవుతున్నది. ఆ విధంగా గ్లాడ్‌స్టన్ రెండో ఐరిష్ హోమ్ రూల్‌బిల్ విషయంలో జరిగిందనటం ప్రభుసభా నిరోధంవల్ల వచ్చే లాభానికి నిదర్శనంగా పేర్కొనవచ్చు. అయినా ఉదార భావాలతో కూడుకొన్నట్టి అభివృద్ధికరాలైన మార్పులకు ప్రభుసభ సామాన్యంగా విరోధించేదే అని చెప్పటానికి మనం వెనుదీయ నక్కరలేదు. 1888 లో చర్చి మిగులు ఆదాయాలు ప్రజోపయోగాలైన కార్యాలకు వినియోగించవలెననే తీర్మానాన్ని ప్రభువులు ప్రతిఘటించినట్లే, 1869 లో ఐర్లండ్‌లోని ప్రాటెస్టెంట్ చర్చిను ప్రభుత్వమిక భరించనక్కరలేదనే తీర్మానాన్ని ఎదిరించినారు. రహస్యపు వోటింగ్

చట్టాన్ని, 1884 సంస్కరణ శాసనాన్ని, 1893 ఐరిష్ స్వయం పరిపాలన శాసనాన్ని (Irish Home Rule Bill) ప్రభుసభ విరోధించింది. అదే విధంగా స్థానిక పరిపాలనా శాసనాన్ని ఎదిరించటమే కాక కార్మికులకు వచ్చే అపాయాలకూ, నష్టాలకూ యజమానులు పరిహారం చెల్లించవలెనన్న బిల్‌ను నిరుపయోగం చేసే విధంగా సవరణలు చేసిన ప్రభుసభపై ఉదార పక్షంవారు మండిపడి ఆ సభ స్వరూపాధికారాలను తీవ్రంగా సవరించనైనా సవరించవలె లేదా ఆ సభను తుద ముట్టించటమైనా కావలెనని పట్టుబట్టినారు. 1906 లో లిబరల్ పక్ష మంత్రివర్గం తిరిగి అధికారంలోకి వచ్చింది. ఫలితం ప్రభుసభకు కామన్స్‌కు మళ్ళీ సంఘర్షణ ఆరంభమయింది. పార్లమెంటరీ ఎన్నికలలోనూ కౌంటీ కౌన్సిల్ ఎన్నికల లోనూ ఏ వోటర్‌కుగానీ ఒకటికంటె ఎక్కువ వోట్ ఉండరాదనే చట్టాలను కూలదోయటానికి జరిగింది అదేగతి భూమినిగురించి ఇళ్ళ వసతులనుగురించి ప్రతిపాదించిన నాల్గు బిల్‌లకు, లైసెన్సింగ్ బిల్‌కు పట్టింది మంత్రివర్గం ప్రతిపాదించిన విద్యా శాసనానికి తీవ్రమైన సవరణలు ప్రభుసభ చేయటంవల్ల ఆ చట్టాన్ని ప్రభుత్వం ఉపసంహరించవలసి వచ్చింది. అందువల్ల 1907 లో కామన్స్ సభ కింది విధంగా ఒక తీర్మానం చేసింది : "ప్రజా ప్రతినిధులను బట్టి వ్యక్తమయ్యే ప్రజాభిప్రాయానికి, ఒక పార్లమెంట్ తన జీవితకాలం ముగిసేలోగా, కార్యరూప మివ్వటం వీలయ్యేటట్లు ప్రజాసభ ఆమోదించిన తీర్మానాలను మార్చటానికి తిరస్కరించటానికి ప్రభుసభకున్న అధికారం పరిమితం గావింపవలె." ఇది ఇట్లుండగా పార్లమెంట్ సభ్యులకు జీతాలిచ్చే పద్ధతి ఆచరణలోకి వచ్చింది. దీనివల్ల ప్రత్యేక హోదాలు, సంపదలు అనుభవించే ప్రభుసభకు, అట్లాంటివి అనుభవంలో లేని సభ్యు లనేకులుండే కామన్స్ సభకు, ఉన్న కొద్దిపాటి సామరస్యమూ తెగిపోయింది.

పైన చెప్పిన దానినిబట్టి కామన్స్ సభ ఆమోదించిన ప్రతి చిత్తు చట్టాన్ని పనిబూని ప్రభుసభ పడగొట్టటమో, నిరర్థకం చేయటమో జరిగిందని అనుకోరాదు. 1906, 1910 మధ్య కాలంలో ప్రభుత్వం ప్రతిపాదించిన 818 చిత్తు చట్టాలలో 18 మాత్రమే ప్రభుసభల తిరస్కరించింది. ఆ 18 లో కొన్నింటిని డీసివేయకపోయినా, తీవ్ర సవరణలకు గురి చేసి నందువల్ల, అందులో ప్రధానమైనవని ప్రభుత్వం భావించిన ఐదింటిని ప్రభుత్వమే ఉపసంహరించుకొంది.

## 1909 బడ్జెట్ తిరస్కరణ

1671 తరవాత ధన సంబంధమైన శాసనాలను సవరించటానికి ప్రభుసభకు అధికారం లేదనే సూత్రం పాటిస్తున్నారు. సవరించటానికి అధికారం లేకున్నా బడ్జెట్‌ను ఉన్నదున్నట్టుగా తోసివేసే అధికారం మాత్రం ఆ సభకు లేకపోలేదు. 1860 లో కామన్స్ సభ కాగితంపై పన్నులను రద్దుచేయ పూనగా ప్రభుసభ నిరోధించిన నాటినుంచి, దబ్బుతో ముడిపెట్టిన తీర్మానాలన్నింటిని కలిపి ఒకే బడ్జెట్‌గా ప్రతిపాదించే పద్ధతి ఆచరణలోకి వచ్చింది. బడ్జెట్‌ను సంపూర్తిగా తిరస్కరించటం ప్రభుత్వాన్ని స్తంభింపచేయటమే అయింది. అట్లాంటి తీవ్ర చర్యకు పూని 1909 సంవత్సరపు బడ్జెట్‌ను ప్రభుసభ తోసివేసింది. ఈ బడ్జెట్ ప్రతిపాదనలలో భూమి విలువలను పునర్నిర్ణయం చేసి అసంపాదితాదాయాలపై పన్నులు విధించవలెననీ, సంపదపై పన్నులను హెచ్చించవలెననీ సూచనలు జరిగినాయి. బడ్జెట్‌ను అమాంతం తోసి

చేస్తే జనరల్ ఎన్నికలు జరిగి 1895 లో తాము ఐరిష్ హోమ్ రూల్ బిల్‌ను తోసివేసి నప్పుడు జరిగినట్లు ప్రభుత్వ పక్షము ఓడిపోవచ్చుననే ఆశలో ప్రభుసభ ఈ విధంగా చేసింది. (30-11-1909).

1910 జనవరిలో ఎన్నికలు జరిగినాయి. కామన్స్ సభలో లిబరల్ సభ్యుల సంఖ్య 274 కు తగ్గినా, కార్మిక పక్షం సభ్యులు 41 మంది, ఐరిష్ జాతీయవాదులు 82 మంది వారితో చేరి, తాము ప్రతిపాదించ దలచుకొన్న బడ్జెట్‌లోని ముఖ్యాంశాలను ప్రస్తావన చేస్తూ బడ్జెట్ ప్రభుసభ ఒకవేళ తోసివేసినట్లయితే ధన సంబంధ శాసనాల విషయంలోనే కాక ఇతర చట్టాల విషయంలోనూ ప్రభుసభ అధికారాలను పరిమితం చేయటానికి తాము తీసుకో దలిచిన చర్యలను గురించి వారి నాయకుడు అస్క్విత్ హెచ్చరిక చేసినాడు. అనంతరము 1909 బడ్జెట్ పునః 1910 వ సంవత్సరపు బడ్జెట్‌గా ఉపపాదించిన కామన్స్ సభ దానిని ఆమోదించి పంపగా ప్రభుసభ దానికి తన అంగీకారం తెలిపింది. కాని ఐరిష్ జాతీయ వాదులూ, కామన్స్‌లోని ఇతర అతివాదులూ ధన సంబంధమైన బిల్‌లను ఇతర చట్టాలను తోసివేయటానికి ప్రభుసభకున్న అధికారాన్ని పరిమితం చేయవలెనని పట్టు పట్టటంతో వ్యవ హారం మొదటికి వచ్చింది. కాని మే నెలలో ఏడో ఎడ్వర్డ్ మరణంతో వివిధపక్షాల ప్రతినిధుల సమావేశాలలో నలుగురు సమ్మతించే విధంగా పార్లమెంట్ బిల్‌ను రూపొందించవలెననే ప్రయత్నాలు జరిగినాయి. కాని అవి విఫలం కాగా జనరల్ ఎన్నికలు (1910 డిసెంబర్) జరిపి, ప్రభుసభ అధికారాలను వమ్ముచేసే వీటో చట్టాన్ని ; కామన్స్ సభలో అస్క్విత్ ప్రభుత్వం ప్రవేశపెట్టి ఆమోదించింది. ఈ చట్టాన్ని ప్రభుసభ నిరోధించే పక్షంలో అవసర మైతే 500 మంది దాకా కొత్త ప్రభువులను నియోజించటానికి ఐదో జార్జ్ రాజు అంగీకరించి నాడనే వార్త బహిరంగం అయింది అందుచేత చట్టానికి వ్యతిరేకులైన ప్రభువులు తమ సభకు రాకుండ మానుకోనైనా మానుకొన్నారు, వచ్చినా దానిపై వోటు చేయటమైనా మాను కొన్నారు. 1911 పార్లమెంట్ శాసనము ఈ విధంగా చట్టమయింది.

## 1911 పార్లమెంట్ శాసనము

ఇప్పుడున్న ప్రభుసభా స్థానంలో వారసత్వంపై ఆధారపడిన, ప్రజామోదంతో నిర్మాణ మయిన అనుబంధ శాసనసభ (Second Chamber) ను స్థాపించవలెనని ఈ శాసన సభ (House of Commons) ఉద్దేశిస్తూ ఇట్లా తీర్మానిస్తున్నది :

1. ప్రజాసభ (House of Commons) ఆమోదించిన ధన సంబంధ శాసనం (Money bill) ప్రభుసభకు చేరిన నెలలోగా ఆ ప్రభుసభ అంగీకరించకున్నా, పార్ల మెంటరీ శాసనం కావచ్చు. ధన సంబంధ శాసనమౌతుందో కాదో నిర్ణయించే అధికారం కామన్స్ సభాధ్యక్షునిది. అతని నిర్ణయంపై ఏ న్యాయస్థానానికీ అపీల్ లేదు.

2. ధనేతర శాసనం ఏదైనా కామన్స్ సభ వరుస సమావేశాలు మూడింటిలో ఆమో దించి నట్లయితే ప్రభుసమ్మతి లేకున్నా అది పార్లమెంటరీ చట్టమవుతున్నది. కాని ఆ విధంగా చట్టం కావటానికి అది కామన్స్ సభ మొదటి సమావేశంలో రెండో సారి చదివిన నాటినుంచి ఆ సమావేశానికి మూడో సమావేశంలో ఆమోదించే నాటికి రెండేళ్ళు గడచి ఉండవలె. మరి ఆ బిల్లు మొదటి సమావేశంలో ప్రవేశపెట్టిన రూపంలోనే కదపబడవలెను ఏ మార్పులూ

చేర్పులూ లేకుండా ఉండవలె. ఒకవేళ మార్పులు, చేర్పులున్నప్పుడు, అవి కాలం గడచినందు వల్ల చేర్పటం అవసరమైనవని కామన్స్ స్పీకర్ (సభాధ్యక్షుడు) ధ్రువపరిచినా చాలు, కాదా ప్రభుసభ వాటిని ఆమోదించి పంపగా, కామన్స్ సభయొక్క అంగీకారాన్ని అవి పొంది ఉండవలె. ఈ మార్పులు చేర్పులు పొందుపరిచిన సవరణ బిల్‌ను పార్లమెంట్ ప్రత్యేకంగా ఆమోదించినా చాలు.

8. పై రెండు చట్టాల ఫలితంగా కామన్స్ సభ ప్రాముఖ్యం హెచ్చింది కాని జనరల్ ఎన్నికలతో ఏర్పడిన కామన్స్ సభ జీవిత ప్రమాణాన్ని ఏడేళ్లనుంచి అయిదేళ్ళకు ఈ 1911 పార్లమెంట్ శాసనం తగ్గించింది. ఆ విధంగా కామన్స్ సభపై వోటర్ల పెత్తనమూ, ప్రభావమూ హెచ్చినాయి.

## 1911 పార్లమెంట్ శాసన ఫలితాలు

"రాజకీయంగా రాజు ప్రాముఖ్యాన్ని ఈ చట్టం బలహీన పరిచింది. ఎగువ సభను శక్తిహీనం చేసింది. నియోజక వర్గాలకు విన్నవించకుండా ఒక చిత్తు చట్టంపై చర్చ సుదీర్ఘం కానివ్వకుండా కత్తిరించవలెననే ప్రతిపాదనవల్ల శాసనసభ్యులకు దానిని విపులంగా స్వేచ్ఛగా, చర్చించటాని కవకాశంలేకుండా చేసి శాసనాలు చేయటంపై మంత్రివర్గానికున్న అధికారాన్ని ఈ 1911 చట్టం పటిష్ఠం చేసింది." (టాన్‌వెల్ నాన్‌మీడ్) "1911 సంవత్సరాని కిటీవల ఏ మంత్రివర్గం ప్రభుసభపై ఆధారపడవలసి వచ్చిందిగానీ, ప్రభుసభ ప్రాతికూల్యంవల్ల దాని ఉనికికి అపాయం కల్గిందిగానీ లేదు. ఈ చట్టం ఉద్దేశించింది ఈ ప్రయోజనమే గాని ప్రభుసభను నిర్వీర్యం చేయటం కాదు" (David Lindsay Keir). కామన్స్ సభ మనస్సు ఉంచిన చట్టాన్ని శాసనం కాకుండా ఆపివేయటానికిచ్చిన రెండేళ్ల అవకాశం రెండేళ్ళకంటె మించరాదని ఈ 1911 చట్టం అన్నదే కాని రెండేళ్ళు కామన్స్ అభిలషించే శాసనాన్ని అంతకాలం అమలులోకి రాకుండా చేయటానికి ప్రభుసభ సాహసించగలదని ఎవ్వరూ అనుకో లేదు. మొదట కామన్స్ సభ ఒక చట్టాన్ని ఆమోదించి ప్రభుసభ కంపిన తరవాత, రెండే ళ్ళయ్యేటప్పటికి దానిని గురించి ప్రజల, కామన్స్ సభ్యుల అభిప్రాయాలే మారిపోవచ్చు. 1911-1939 మధ్యకాలం రెండు చట్టాలు మాత్రమే శాసనాలు కాకుండా దీర్ఘకాలం ఆపడం జరిగింది. అవి ఐరిష్ హోమ్‌రూల్ చట్టమూ వెల్ష్‌చర్చి సంస్థలకూ ప్రభుత్వానికి ఉన్న సంబంధాన్ని విచ్ఛేదం చేసే శాసనము (Welsh Disestablishment Act of 1914). మొదటి ప్రపంచ యుద్ధం 1914లో ప్రజ్వలించిన కారణాన ఆ రెంటిని ఆమోదించిన పార్లమెంటే వాటి అమలును వాయిదా వేసింది. వాయిదా తీర్మానాన్ని ప్రభుసభ మనసారా ఆమోదించినదని వేరుగా చెప్పనక్కర లేదు.

"రెండు ప్రపంచయుద్ధాల మధ్యకాలంలో, కామన్స్ సభ ఆమోదించి పంపిన చట్టాల స్వరూపాన్నే మార్చివేసే సవరణలను వాటిలో పొందుపరిచి మొదట, ఆ చట్టాలవల్ల కామన్స్ సభ ఉద్దేశించిన ప్రయోజనాలను ప్రభుసభ చెడగొట్టిన సందర్భాలు చాలా ఉన్నాయి (D. L. Keir). అయిదేళ్ళ పార్లమెంట్ జీవిత ప్రమాణమన్నా, రెండు ప్రపంచ యుద్ధాలకాలంలో తప్ప అయిదేళ్ళు నిలిచిఉన్న కామన్స్ సభ ఒక్కటి మాత్రమే. వోటర్ అభిప్రాయాలలో వచ్చే మార్పులను ఎప్పటికప్పుడు గమనించవలసిన అవసరం ఒకవైపు, పార్టీ నాయకుల, మంత్రుల

కనుసన్నలలో మెలగవలసిన అవసరం మరొకవైపు తోడించగా స్వాతంత్ర్యంలేని, కామన్స్ సభ అర్ధ శతాబ్దానికి పైబడి ప్రాముఖ్యం పోగొట్టుకొన్న సంస్థగా తయారైంది.

1911 పార్లమెంట్ శాసన ఫలితంగా బ్రిటిష్ రాజ్యాంగం కొంతభాగం లిఖిత రాజ్యాంగ మయిందని కొందరు వ్యాఖ్యానించినారు. ఈ మాట రాజ్యాంగానికి సంబంధించిన శాసనా లన్నింటిని గురించి చెప్పవచ్చు కాని బ్రిటిష్ రాజ్యాంగం ప్రధానంగా వ్రాతపూర్వకంగా లేని రాజ్యాంగమన్న సత్యం మరిచిపోరాదు. 1911 పార్లమెంట్ శాసనం అంతకుముందు ఆచరణలో ఉన్న కార్యసరళిని శాసనబద్ధం చేసిందేకాని కొత్తపద్ధతి నేమీ సృష్టించలేదు. హక్కుల చట్టం (The Bill of Rights) 17వ శతాబ్దిలో రాజు అధికారం పొందిన పరిణామాన్ని శాసన లిఖితం చేసినట్లే, 1688కి తరవాతి కాలంలో ప్రభుసభా స్థితిలోను అధికారంలోను కలిగిన పరిణామాన్ని 1911 పార్లమెంట్ చట్టం శాసన లిఖితం చేసింది. ఆర్థికేతర (non-fiscal) శాసనాలను రెండేళ్ళ కాలం చట్టాలు కాకుండా నిలవడానికి 1911 శాసనం ప్రభువుల సభకు ఇచ్చిన అధికారాన్ని కామన్స్ సభ 1949లో పరిమితం చేసింది. ఆ వ్యవధి కాలం ఒక్క సంవత్సరానికి తగ్గించినారు. 1951లో కామన్స్ సభ మరణ శిక్షను శిక్షాస్మృతి నుంచి తొలగిస్తూ తీర్మానించింది, ప్రభువుల సభ దానిని నిరాకరించింది అయినా కామన్స్ సభ పేచీ పెట్టక ప్రభుసభ చర్యకు సమ్మతించింది ప్రభువుల సభను తనకొక పోటీ సంస్థగా కాక శాసనాలు చేయటంలో ప్రత్యేక పాత్ర నిర్వహించవలసిన సంస్థగా కామన్స్ సభ గుర్తించే స్థితికి వచ్చిందని దీని కర్థము. ప్రభు సభలో జరిగే విపులమైన చర్చలు, ఆ సభ్యుల వాద నైపుణ్యము, వారు చేసే అనుభవపూర్వకమైన సూచనలు కామన్స్ సభలో అరుదుగా కనిపిస్తాయి. పరిపాలకులుగా మాత్రమేగాక, ప్రజా జీవితంలో పలు రంగాలలో ప్రసిద్ధికాంచిన వారందరు సభ్యులుగా నియుక్తులౌతారు. వివాదాస్పదం కాని చిత్తు చట్టాలను ప్రభుసభ క్షుణ్ణంగా చర్చించి, సవరించి ప్రజా సభకు పంపటంవల్ల దానిని చర్చించటం కోసం ఎక్కువ కాలం వృథా కాదు. 1945-50 సంవత్సరాలలో కామన్స్ సభ వెంట వెంట అనేక శాసనాలను కొద్ది కాలంలో చేయవలసి వచ్చినప్పుడు, వాటినిగురించి తీరికగా చర్చించి ప్రభుసభ వాటిని సరిదిద్ది దిగువ సభకు పంపటంవల్ల కామన్స్ సభకు కాలం బాలా కలిసి వచ్చిందనీ మంచి శాసనాలు చేయటానికి వీలయిందని డేవిడ్ లిండ్ సే కీర్ తన "అధునాతన బ్రిటిష్ రాజ్యాంగ చరిత్ర"లో తెలిపినాడు. ప్రైవేట్ బిల్ (ప్రభుత్వం కాక ఇతర పార్లమెంట్ సభ్యులు ప్రతిపాదించే చిత్తు చట్టము) లను చక్కగా తీర్చి పంపటంలోను ప్రభుసభ బాలా ఉపకరిస్తుంది. ప్రభుసభా సభ్యులు జరగబోయే ఎన్నికలలో తమ సభ్యత్వం ఊడిపోతుందనే భయం లేని వారు. అందువల్ల నిర్భయంగా, స్వతంత్రంగా ప్రభుత్వ విధానాలను, చిత్తు చట్టాలను విమర్శించటానికి వీరికి వీలైనంతగా పార్టీ సభ్యులైన కామన్స్‌లోని వారికి వీలుండదు. ఎన్నికల కోలాహలంలో పాల్గొనటాని కిష్టంలేని వ్యక్తులు కొందరుంటారు. వారి శక్తి సామర్థ్యాలు, ధీవిశేషము, అనుభవ సంపదలవల్ల ప్రయోజనాలను పొంది, పరిపాలనా సౌష్ఠవాన్ని పెంపొందించిన ప్రభుత్వానికి ప్రభుసభ రాజమార్గ మయింది. అట్లాంటివారిలో కొందరిని మంత్రివర్గంలో చేర్చుకోవటానికి ప్రభుత్వానికి సాధ్యమవుతూ ఉన్నది కామన్స్ సభ ఆమోదించిన చట్టాన్ని [illegible] [illegible] ఉండే ప్రభుసభ సభ్యులు కొందరు యోచించవచ్చు. దానిని సునిశితంగా విమర్శించటానికి ప్రభుసభకు చాలినంత కాలం 1949 చట్ట మేర్పాటు చేసినట్లే. కాని ఎన్ని

విధాల ప్రభుసభ ప్రాముఖ్యాన్ని చెప్పినా కామన్స్ సభతో సమాన స్థానం దానికుందని చెప్పజాలము. ఎంతకాలం ఈ సత్యాన్ని ప్రభుసభ గుర్తించదో అంతకాలమూ రెండు సభలకూ సంఘర్షణ తప్పదు.

1832 నుంచి కామన్స్ సభ యొక్క ఆధిక్యాన్ని నిరాఘాటంగా స్థాపించటానికి చాలా ప్రయత్నాలు జరిగినాయి. ప్రభుసభా నిర్మాణ విధానం సంస్కరించటానికి చాలా సూచనలు చేసినారు. 1832 సంస్కరణ శాసనాన్ని ప్రభుసభా సభ్యులైన బిషప్‌లు ఇంచుమించు అందరూ ప్రతిఘటించినారు. అందువల్ల బిషప్‌లనున్న శాసనాధికారాలు, న్యాయాధికారాలు తొలగించవలెనని 1834 లో ఒక ప్రతిపాదన జరిగింది. 1869 లో రస్సెల్ ప్రభువూ, 1884, 1888 సంవత్సరాలలో రోస్‌బరీ ప్రభువూ ప్రభుసభా సంస్కరణ ప్రతిపాదనలు గావించినారు. ప్రభుసభ వంశానుగత సభ్యత్వాన్ని తొలగించి, దాని స్థానంలో ఎన్నిక సభ్యత్వాన్ని స్థాపించవలెనని ఒకవైపు, ప్రభు సభాధికారాలను తగ్గించవలెనని మరొకవైపు ఈ సంస్కరణ సూచనలు రెండు మార్గాలలో సాగినాయి. వంశానుగత సభ్యత్వానికి మారు ఎన్నిక సభ్యత్వాన్ని స్థాపించిన కామన్స్ సభతోపాటు ప్రభుసభ తాను కూడా ప్రజాభిప్రాయానికి ప్రతినిధిని అనవచ్చు. ఫలితంగా దాని అధికారాలు హెచ్చినా హెచ్చవచ్చు. అది కామన్స్ సభ కిష్టం లేదు. అందువల్ల కామన్స్ సభ చేసే శాసన ప్రతిపాదనలు చట్టం కాకుండా ఎంతకాలం నిలుపుదల చేయటానికి ప్రభుసభకు అధికారం ఉండవచ్చు? అనే విషయం ప్రభుసభా నిర్మాణాన్ని గురించిన చర్చలలో ప్రధానాంశమయింది, వాటి ఫలితమే 1911, 1949 పార్లమెంట్ శాసనాలు.

1911 పార్లమెంట్ చట్టం పీఠికలో ఎన్నికపై ఆధారపడేటట్లుగా ప్రభుసభను నిర్మాణం చేయటానికి కామన్స్ సభ ఉద్దేశమని స్పష్టీకరించడమయింది. కాని అప్పటికి ఆ పని చేయటానికి 1911 చట్టం పూనుకోలేదు. ప్రభుసభ అధికారాన్ని తగ్గించటంతో అది తృప్తి పడింది 1911 చట్టంవల్ల రాజు స్థానం చాలా బలహీనమయిందనీ ఎగువ సభ శక్తిహీనమయిందనీ నియోజకవర్గాలకు నివేదించకుండా చర్చా విరమణ తీర్మానించి, కామన్స్ సభలో స్వేచ్ఛగా చర్చ జరగనివ్వకుండా చేసి మంత్రివర్గం తన ఇష్టం వచ్చిన చట్టాలను శాసనాలు చేసుకో కలిగిందనీ టాన్‌వెల్ లాంగ్‌మిడ్ అభిప్రాయము. 1911 చట్టం మంత్రివర్గాధికారాన్ని ఎంత వరకు హెచ్చించి ప్రభుసభను నిర్వీర్యం చేసిందనే విషయంలో అభిప్రాయ భేదముంది. అయినా ప్రభుసభను ప్రజారాజ్య విధానానికి అనుగుణంగా పునర్నిర్మించవలెననే విషయంలో చాలామంది పార్లమెంట్ సభ్యులు ఏకీభవించినారు. అయినా 1911 తరవాత మూడేళ్ళు పార్లమెంట్‌లో ఈ విషయమై ఏ కదలికా లేదు. 1914 మొదటి ప్రపంచ యుద్ధ మారంభం కావటంతో 1917 వరకు ఈ సమస్యను గురించి అనుకొన్నవారు లేరు. ఆ సంవత్సరం (1917) ఆగస్టులో బ్రైస్ ప్రభువు అధ్యక్షుడుగా ఈ విషయాన్ని చర్చించి కామన్స్ సభకు నివేదించటానికి ఒక కమిటీ నియుక్తమయింది. (1) ఎగువ సభకు ఉండదగిన అధికారాలు ఏవి? (2) రెండు సభలకు అభిప్రాయ భేదాలుంటే వాటిని సర్దుబాటు చేయటానికి ఉత్తమ పద్ధతి ఏమిటి? (3) రెండో సభ నిర్మాణంలో చేయదగిన మార్పులేమిటి? ఈ మూడు విషయాలను విచారించి నివేదించవలసి బ్రైస్ కమిటీని కామన్స్ సభ కోరింది. 1918 ఏప్రిల్‌లో బ్రైస్ ప్రభువు నివేదికను సమర్పించినారు. ఆ నివేదికలోని [illegible]

(1) కామన్స్ సభ ఆమోదించి పంపిన చిత్తు చట్టాలను పరిశీలించి, వాటిలో సవరణలను చేయటం (2) వివాదాస్పదం కాని విషయాలతో కూడిన చిత్తు చట్టాలను తామే ప్రతిపాదించి కామన్స్ సభకు పంపటం. (3) తొందరపాటుతో చట్టాలు శాసనాలుగాకుండా, వాటి పూర్వాపరాలు, సాధకబాధకాలు ప్రజలు విచారించి వాటిపై తమ అభిప్రాయాలను ప్రకటించటానికి తగినంత కాలవ్యవధిని కల్పించటానికి సాయపడటం. (4) ప్రధానమైన విషయాలను సమగ్రంగా చర్చించటానికి కార్యభారం హెచ్చయినందువల్ల కామన్స్ సభకు వీలులేనప్పుడు తామే పనిచేసి, లోపరహితమైన శాసనాలు పార్లమెంట్ నుంచి వెలువడటానికి సాయపడటం అనే నాల్గు విషయాలు ప్రభుసభ కర్తవ్యాలు. అంతేగాని, ఆర్థిక విషయాలలోను, మంత్రిమండలి నియామకంలోను మంత్రిమండలి పతనంలో ప్రభు సభకు ఎంత మాత్రం ప్రసక్తి ఉండరాదు.

ఇక, రెండో సభ నిర్మాణాన్నిగురించి బ్రైస్ కమిటీ చేసిన సూచనలివి: పరిపాలనలో ప్రజా జీవితంలో ఆరితేరినవారు, అనుభవశాలులు. సామ్రాజ్య విషయాలలో పరిజ్ఞాన మున్నవారు, జాతీయ జీవన ప్రధాన రంగాలలో నేర్పరితనం ప్రదర్శించినవారు, పార్టీ రాజకీయాలలో తీవ్రవాదులు గానివారు రెండో సభ సభ్యులై ఉండటం సముచితమని బ్రైస్ కమిటీ అభిప్రాయపడింది రాజ్యాంగంలో ప్రభుసభ స్థాన మెటువంటిదై ఉండవలెనన్న ప్రశ్నకు బ్రైస్ కమిటీ సమాధానమేమంటే, ప్రజాసభతో (కామన్స్‌సభ) సమానాధికారాలు ప్రభుసభకు ఉండరాదని; ఆ సభలో ఏ రాజకీయ పక్షాభిప్రాయాలకుగానీ స్థావరంగా ఆధిక్యం ఉండరాదని; మొత్తం మీద ఏ ఒక రాజకీయ సమస్యపైన, ప్రజలు ఏ విధమైన అభిప్రాయంతో ఉన్నారో తెలపగలిగే విధంగా ప్రభుసభా సభ్యత్వం అమరి ఉండవలెనని; వ్యక్తిగతంగా ఆ సభ సభ్యులు అతి సమర్థవంతులై, ఘనత వహించినవారై ఉండవలెనని ఆ బ్రైస్ నివేదిక తన అభిప్రాయాన్ని వెలిబుచ్చింది కాని ప్రజలలో ఏయే గణానికి (group) ఎంతెంత ప్రాతినిధ్యం ఉండవలె? ఆయా ప్రతినిధులను నిర్ణయించే వారెవరు? నిర్ణయించే విధాన మేమిటి? అనే విషయాలపై కమిటీలో ఏకాభిప్రాయం కుదరలేదు. కాని అధిక సంఖ్యాకుల ఆమోదం పొందిన విధానమిది: i. అనాటికున్న ప్రభువుల వర్గంనుంచి ఒక వంతుకు కొత్త రెండో సభలో సభ్యత్వం ఉండవలె. ii. అధిక సంఖ్యాకులు ప్రజలు ఎన్నుకొన్నవారై ఉండవలె. అయినప్పుడు వారికి ప్రజల సహకారం, బలం లభిస్తాయి. ఈ ప్రయోజనం సాధించటంకోసం సభలో రెండు విభాగాలుండవలె. (a) ఒక విభాగం సభ్యుల సంఖ్య 246. కామన్స్ సభ్యులు భౌగోళికంగా వేర్వేరు గణాలుగా ఏర్పడి, ఆ గణాలీ 246 మందిని ఎన్నుకోవలె. (b) రెండు సభల స్థాయీ సంఘ మొకటి మరి 81 మందిని ఎన్నవలె. ఈ 327 మందికి సభ్యత్వకాలం 12 ఏళ్ళు. ప్రతి నాల్గేళ్లకు 246 మందిలో మూడోవంతు మంది, 81 మందిలో మూడోవంతు మంది పదవీ విరమణ చేయవలె. (c) ఛాన్సలర్ ప్రభువు పదవి విరమణచేసిన ఛాన్సలర్ ప్రభువులూ, న్యాయాధిపతి ప్రభువులు (law lords) ఉద్యోగరీత్యా, - ప్రభుసభా న్యాయ పరిపాలనం చేసే పక్షంలో - రెండో (ఎగువ) సభ సభ్యులై ఉండవలె. పై సంస్కరణ సూచనలు సూచనలుగానే నిల్చిపోయినాయి. 1911 పార్లమెంట్ శాసనము "వంశానుగత సభ్యత్వ స్థానంలో ప్రభువుల సభలో ప్రజ లెన్నుకొనే సభ్యులను ప్రతిష్ఠించటం కామన్స్ సభ సంకల్పం కాని అది వెంటనే అమలుపరచటానికి వీలులేకుంది" అనే అభిప్రాయాన్ని

వ్యక్తపరిచింది. ఆ అమలుపరచటం అప్పుడే కాక ఇప్పటికీ వీలుకాకుండా ఉంది. దీనికి ఆశ్చర్యపడవలసిన అవసరం లేదు. పైన సంకల్పించిన విధంగా ఎగువసభ నిర్మాణాన్ని సంస్కరించటమే జరిగే పక్షంలో ఎగువసభ సభ్యత్వం దిగువసభ సభ్యత్వం కంటె విలక్షణంగాను ఉత్తమంగాను ఉండటం తటస్థించి, అది ప్రజల మన్ననకు కామన్స్ సభకంటె ఎక్కువ పాత్రం కాగలదు. ఆ పరిణామాన్ని ఏ కామన్స్ సభ చేజేతులా తెచ్చి పెట్టుకోదు. మారిన పరిస్థితులవల్ల బ్రిటిష్ ప్రజారాజ్యంలో ఏర్పడిన దిగువ సభ ప్రాబల్యాధిక్యాన్ని ప్రభుసభ మూర్ఖంగా గుర్తించకుండటం నిరంతరం సాధ్యం కాదు. అందువల్ల ప్రభు సభను ఎక్కువ ప్రజా ప్రతినిధి అయ్యేటట్లు చేసి తన కుత్తుకమీదికి ఏ కామన్స్ సభ తెచ్చుకోదు. అందువల్ల ఈనాటికిని బ్రిటిష్ పార్లమెంట్‌లోని ఎగువసభా నిర్మాణం ఈ విధంగా ఉంది.

(1) i 1707 వ సంవత్సరంలో ఇంగ్లాండ్, స్కాట్లండ్‌లు ఐక్యంకాక ముందు ప్రభు పదవులలో ఉన్నవారు. ii 1707 స్కాట్లండ్‌తో ఐక్యమయిన నాటికి, 1800 లో గ్రేట్ బ్రిటన్ (ఇంగ్లండ్, స్కాట్లండ్‌లు కలసిన దేశానికి పేరు) ఐర్లండ్‌లు ఐక్యమయిన నాటికి మధ్య కాలంలో సృష్టించిన ప్రభు పదవులవారు. iii 1800 లకు ఇటీవల సృష్టి అయిన ప్రభు పదవులలో ఉన్నవారు. ఈ తరగతుల ప్రభువులు వంశానుగతంగా ప్రభుసభా సభ్యత్వ మున్నవారు ప్రభుసభ సభ్యుల సంఖ్యలో వీరు పదివంతులలో తొమ్మిదోవంతుకు మించిన వారు. (2) రాజ వంశపు రాకుమారులు; రాజ కుటుంబంలోని వారు కొందరు, ఈ 2, 3 తరగతుల వారు ప్రభుసభా సమావేశాలకు రావటంగాని ఆ సభా వ్యవహారాలలో పాల్గొనటం కాని ఉండదు (3) పార్లమెంట్ జనరల్ ఎన్నిక సందర్భంలో స్కాటిష్ ప్రభువులు ఎన్నుకొన్న 16 మంది ప్రభు ప్రతినిధులు వీరి సభ్యత్వం ఇతర కామన్స్ సభ్యులకున్నట్లే ఆ పార్లమెంట్ జీవితకాలం మాత్రమే (4) ఐరిష్ ప్రభువులు ఎన్నుకొన్న ప్రతినిధి ప్రభువులు 28 మంది. వీరిది జీవితాంత సభ్యత్వము (5) చర్చి ప్రభువులు: ఇద్దరు ఆర్చి బిషప్‌లు - కాంటర్‌బరీ, యార్క్ ఆర్చి బిషప్‌లు; 24 మంది బిషప్‌లు (6) ప్రభు సభకు శాసనాధికారమే కాక, న్యాయ విచారణాధికారం కూడా ఉన్నందువల్ల, ప్రభు సభలోని న్యాయాధికారుల సంఖ్యను వృద్ధిచేయటం కోసం రాజు నియమించే సామాన్య అప్పీల్ న్యాయాధిపతులు అధుగురు.

ఎగువసభ సంస్కరణాన్నిగురించి కొన్ని ప్రతిపాదనలు 1918 కి తరవాత జరిగినాయి గాని ఏ మంత్రివర్గం ఇప్పటికీ ఈ విషయమై శ్రద్ధ చూపిందికాదు. ఆ సమయం వచ్చి నప్పుడు బ్రైస్ కమిటీ చేసిన సూచనలు కొన్ని కార్యరూపం దాల్చవచ్చు. ప్రభుసభ నిర్మాణ విషయమై 1958 లోను, 1963 లోను జరిగిన మార్పులను ప్రస్తావించి, బ్రిటిష్ రాజ్యాంగంలో ప్రభుసభ స్థానాన్ని గురించిన చర్చను ఇంతటితో విరమించవచ్చు.

1958 లో జీవిత పర్యంతం అమలులో ఉండే ప్రభు పదవిని రాజు సృష్టించవచ్చు నని, ప్రభు పదవికి పురుషులతోబాటు స్త్రీలు కూడా అర్హులని, ఒక స్టాట్యూట్ నిర్ణయించింది. ఈ స్టాట్యూట్ ప్రభు సభా సమావేశాలకు హాజరయిన వారికి జీతాలు ఇవ్వటానికి హాజరు కాని వారికి సెలవివ్వటానికి ఏర్పాటు చేసింది. 1963 లో ప్రభు పదస్థులైన స్త్రీలకును, స్కాటిష్ ప్రభువులు అందరికీ ప్రభుసభా సమావేశానికి రండని (Writs of Summons) పిలుపు పత్రాలు పంపవచ్చునని, అవి అందుకొన్నవారు ప్రభుసభలో హాజరు కావచ్చునని

చట్టం చెబుతూ ఉంది. 1801 ఐర్లండ్ - ఇంగ్లండ్ దేశాల పార్లమెంట్‌లను ఐక్యం చేసిన శాసనం ప్రకారం ఐరిష్ ప్రభువులు బ్రిటిష్ పార్లమెంట్‌లోని ప్రభు సభకు 28 మంది ప్రతినిధి ప్రభువులను వారి. జీవిత పర్యంతమూ ఎన్నుకోవటానికి హక్కు ఉంది. వారితో పాటు ఐరిష్ బిషప్‌లు తమ ప్రతినిధులుగా నలుగురు బిషప్‌లను (రొటేషన్ పద్ధతిలో) బ్రిటన్‌లోని ప్రభుసభకు ఎన్నుకోవచ్చునని 1801 చట్టం అనుమతించింది ఐరిష్ ప్రభువులు తమ ప్రతినిధులను ఈ విధంగా ఎన్నుకోవలెనని ఏ ఏర్పాటు లేనందువల్ల బ్రిటిష్ ప్రభు సభలో ఐరిష్ ప్రభువుల ప్రాతినిధ్యం మూలబడింది.

ఈ చట్టం చేయటంలో పార్లమెంట్ ముఖ్యోద్దేశం వేరొకటి. ప్రభువైనవాడు, ఆ కారణంవల్ల తనకు లభించిన ప్రభుసభా సభ్యత్వాన్ని విసర్జించటానికి ఈ చట్టం వీలు ఇచ్చింది ప్రభువు కావడానికి ముందు కామన్స్ సభా రాజకీయాలలో ప్రముఖ స్థాన మలంకరిస్తూ ఉన్న వ్యక్తి సాధారణంగా దిగువసభ సభ్యత్వాన్ని వదలుకోవటానికి ఒప్పుకోడు. పూర్వం ప్రభువులు అయినవారు అయిష్టతతోనే తమ కామన్స్ సభా జీవితానికి తిలాంజలు లిచ్చినారు. బ్రిస్టల్ ఆగ్నేయ ప్రాంతానికి కామన్స్ సభలో ప్రతినిధి అన్‌థోని వెడ్‌వుడ్‌బెన్, వారసత్వం వల్ల స్టాన్స్‌గేట్ ప్రభువైనాడు గాని తన కామన్స్ సభ్యత్వం పోగొట్టుకోవటం ఆయనకు ఇష్టం కాదు. తన ప్రభు పదవిని విసర్జించటానికి సిద్ధమై, కామన్స్ సభకు ఎన్నికకు నిలిచి గెలిచినాడు కాని ఆయనకు కామన్స్ సభ్యత్వానికి పోటీ చేయటానికే చట్ట మొప్పదని, అతని ప్రత్యర్థిని సభ్యుడన్నారు. కాని పై చట్టం శాసనం కాగానే బెన్ ప్రత్యర్థి రాజీనామా చేసి అతనికి కామన్స్ సభ్యుడు అయ్యే వీలు కల్గించినాడు. హోమ్, వైకౌంట్ హేల్షామ్ మొదలైన ప్రభువులు మరికొందరు తమ ప్రభు పదవులకు స్టాన్స్‌గేట్ ప్రభువు చేసినట్లే రాజీనామా చేసినారు. ఒక్కసారి తన దొరతనాన్ని విసర్జించిన వ్యక్తికి వంశానుగతమైన ప్రభు పదవి (lordship) ఇచ్చే వీలులేదు. అది అతని జీవిత పర్యంతమైంది మాత్రమే అయితే ముందొక సారి రాజీనామా చేసిఉన్నా అనంతరకాలంలో ప్రభు పదవిని అంగీకరించవచ్చు. ఈ చట్టం వల్ల ప్రభువుల సభ హోదా తగ్గిందని కొందరి అభిప్రాయము. కాని ఇది సరిఅయిన అభి ప్రాయం కాదని, 1911 సంవత్సరానికి తదుపరి కామన్స్ సభా తీర్మానాలకు సవరణ చేయటంలో ప్రజల మన్ననలందిన కామన్స్ సభతో సర్దుకోరాని విభేదాలు రాకుండా జాగ్రత్త పడగల్గిన ప్రభు సభకు పెద్ద సవరణల భయంగాని, రద్దు అయ్యే భయంకాని ఉందని తనకు తోచటంలేదని సర్ డేవిడ్ లిండ్‌సేకర్ అంటున్నాడు. కామన్స్ సభకంటె ఎక్కువైన లేదా సమానమైన ప్రజాభిప్రాయానికి తాను ప్రతినిధిని అని పోరాడనంత కాలము ప్రభుసభ ఉనికికి భయం లేదు.

## 1911 కు తరవాత ఎన్నిక హక్కు, ఎన్నికవర్గాలను గురించిన సంస్కరణ

1914-1918 మధ్య సంభవించిన మొదటి ప్రపంచ యుద్ధ ఫలితంగా బ్రిటిష్ పార్లమెంట్ నిర్మాణంలో ప్రజా పరిపాలనా విధానాన్ని విస్తరింపచేసి దానికి పుష్టినిచ్చే సంస్కరణలు అనివార్యాలయినాయి. యుద్ధ మారంభమయినప్పుడు సైన్యంలో బ్రిటిష్ యువకులు స్వచ్ఛందంగా చేరేవారు. క్రమంగా సైనిక సేవ నిర్బంధం కావటంతో యౌవనవంతులై బ్రిటిష్ ప్రజానీకంలో యుద్ధంలో చేరని వారే అరుదైనారు. ప్రజా స్వాతంత్ర్యాన్ని కాపాడటానికి కింత

త్యాగాలు చేసినవారికి దేశ పరిపాలనలో అవకాశమివ్వటం తమ కనీస ధర్మంగా కృతజ్ఞతా భావ పూరితులైన రాజకీయ నాయకులు భావించినారు. కామన్స్‌లోని వివిధ రాజకీయ పక్షాల నాయకులు (1916) సభచేసి దీనిని చర్చించగా ప్రాతినిధ్య శాసనంలో తీవ్రమైన మార్పులు చేయందే ఈ లక్ష్యం నెరవేర్చటానికి వీలుకాదని తేలింది. వయోజనులందరికి, వారికి ఆనాడున్న శాసనం ప్రకారం ఉండవలసిన యోగ్యతలున్నా, లేకున్నా, వోటు హక్కు ప్రసాదించవలసి ఉంటుందని ఉదార రాజకీయవాదులు గ్రహించినారు. యుద్ధకాలంలో మగవారంతా సైనిక సేవ చేయగా, మాతృదేశ పరిపాలనలో వారి స్థానాలను దేశభక్తి పూరితులైన బ్రిటిష్ స్త్రీలు ఆక్రమించి ప్రశంసనీయంగా ప్రభుత్వానికి తోడ్పడినారు. స్త్రీలు ప్రజా జీవితంలో అన్ని రంగాలలోను కష్టించటానికి, ఒక్క యుద్ధరంగంలో తప్ప తమ సైనికుల విజయానికి ఆయుధ నిర్మాణ కర్మాగారాలలో సైతం పనిచేయటానికి సమర్థులు కాగా, పార్లమెంట్ ఎన్నికలలో వోటు చేయటానికి, కామన్స్‌లో సభ్యురాండ్రై ప్రజలకు ప్రాతినిధ్యం వహించటానికి పనికిరాకపోతారా ? అని బ్రిటిష్ స్త్రీలు ఈ సమయంలో, ప్రపంచ రాజకీయోద్యమం లేవదీసినారు. స్త్రీలకు వోట్ హక్కు ఉండవలెనని వాదించేవారు (Female Ruffragists) త్వరలోనే ప్రజా జీవితాన్ని ఒక్క కొలికికి దెచ్చినారు. స్త్రీలకు వోటు హక్కు ప్రాతినిధ్యమూ ఇస్తే ప్రజలలో అధిక సంఖ్యాకులు స్త్రీలుగాబట్టి, దేశపరిపాలన ఆడవాళ్ళ చేతులలోకి పోతుందని, అంతకంటె దేశా నర్థకమైంది మరొకటి ఉండబోదని పురుష పుంగవులు కొందరు తీవ్రంగా స్త్రీ ప్రాతినిధ్యాన్ని నిరసించగా, వారిని స్త్రీలు బహిరంగంగా అవమానాలకు గురి చేసినారు. కామన్స్ సమావేశం జరిగేటప్పుడు లోన ప్రవేశించి సభాశాంతికి వీలైనన్ని విధాల భంగం కలిగించినారు. కడకు బ్రిటిష్ కామన్స్ సభకు స్త్రీలను రాజకీయ సమానత్వాన్ని ప్రసాదించక తప్పింది కాదు.

1916 లో ప్రధానమంత్రి కోరగా స్పీకర్ (కామన్స్ అధ్యక్షుడు) అన్ని రాజకీయ పక్షాలకు స్థానము ఉండే విధంగా, 27 మంది కామన్స్ సభ్యులను, అయిదుగురు ప్రభువులను సమావేశపరిచినాడు. ఆ సభ 1917 జనవరిలో, అప్పటికి ప్రధానమంత్రిగా ఉన్న లాయడ్ జార్జ్‌కి తన నివేదికను సమర్పించింది. ఆ నివేదిక చేసిన సూచనలను 1917 మార్చిలో కామన్స్‌లోని అత్యధిక సంఖ్యాకులు ఆమోదించగా, ఆ సూచనలపై ఆధారపడిన 'ప్రజా ప్రాతినిధ్య శాసనం (1918)' ను 1918 ఫిబ్రవరి నెలలో పార్లమెంట్ ఆమోదించింది. ఇంతకుముందు చేసిన ప్రజా ప్రాతినిధ్య శాసన మేదీ 1918 శాసనమంత తీవ్రమైన మార్పులను తెచ్చిపెట్టలేదు. అయినప్పటికీ దానిని చెప్పదగినంత నిరోధం లేదు. అందుకు కారణాలు అప్పుడు సర్వపక్ష మిశ్రమ మంత్రివర్గం అధికారంలో ఉండటం, స్త్రీలు యుద్ధకాలంలో చేసిన సేవపై ఏర్పడిన కృతజ్ఞతా భావము.

1918 ప్రజా ప్రాతినిధ్య శాసనము, 1882, 67 శాసనాలవలెనే ఎన్నికదారుల సంఖ్యను హెచ్చించింది ; పార్లమెంటరీ స్థానాలను పునర్విభజనమూ చేసింది. వోటుకు పూర్వమున్న ఆస్తి అర్హతలను రద్దుచేసి ; పట్టణాలలో మండలాలలో ఉన్న వోటర్ల అర్హతలను ఏకం చేసింది. వోటింగ్ హక్కులను స్త్రీల కిచ్చింది. కాని పురుషులతో, ఆ విషయంలో, సమానతను చూపలేదు. ఒక వ్యక్తికి ఒక్క వోటు మాత్రమే ఉంచింది. యూనివర్సిటీ విద్యార్థులను [illegible], వారి ఎన్నికలు దామాషా ప్రాతినిధ్య పద్ధతి (Proportional

Representation) జరగవలెనన్నది. వోటర్‌లు నమోదు క్రమబద్ధము, సులభం చేసింది. కామన్స్ సభ్యత్వానికి పోటీచేసే వ్యక్తి ఎన్నికల సందర్భంలో వ్యయం చేయగల మొత్తాన్ని నిర్ణయించింది.

వోటర్ కావటానికి మూడు అర్హతలలో ఏ ఒకటి ఉన్నా చాలునన్నదీ శాసనము ; i ఒక ప్రదేశంలో కనీసం ఆరు నెలలు నివాసమున్న, ii కనీస మూరు నెలలు వ్యాపార స్థలం ఉన్నా. iii విశ్వవిద్యాలయ పట్టమున్నా స్త్రీ విషయంలో దానికి సమనార్హత ఉన్నా చాలు నివాసమున్న ఇల్లుగాని, వ్యాపార స్థలంగాని వోటర్ ఆస్తి కా నక్కరలేదు. వ్యాపార స్థలమన్నది ఏటా పది పౌన్‌లకు తగ్గని బాడుగ విలువ గలదై వోటర్ ఉండి తన వృత్తిని, వ్యాపారాన్ని చేసుకొనేదై ఉండవలె.

పురుషుడు, వోటర్‌గా ఒక పార్లమెంటరీ నియోజకవర్గంలో నమోదు కావటానికి 21 ఏళ్ళు ఉన్నవాడే కాక, పై చెప్పిన అర్హతలలో ఒకటి అతనికి ఉండవలె. ఈ రెండు అర్హతలతో బాటు చట్టం పేర్కొన్న అనర్హతలలో ఏదీగాని అతనికి ఉండరాదు. అనర్హతలకు ఉదా : క్రిమినల్ నేరానికి శిక్ష పొందినవాడు, పిచ్చివాడు వోటర్ కారాదు. వోటర్‌గా తాను ఏ వయోజనవర్గంలో నమోదు కా గోరుతున్నాడో ఆ నియోజకవర్గంలోని యూనివర్సిటీ డిగ్రీ అతనికి ఉండవలె ఆ డిగ్రీ యూనివర్సిటీ ఇచ్చిన 'గౌరవ' డిగ్రీ కారాదు. వోటర్‌ల రిజిస్టర్ సంవత్సరానికి రెండుసార్లు (ఆరేసి నెలల కొకసారి) తయారవుతున్నది

మొదటి జేమ్స్ కాలంలో యూనివర్సిటీలు మొదటిసారి నియోజకవర్గాలు అయినాయి అపుడు ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్ యూనివర్సిటీలు నియోజకవర్గాలు 1867 లండన్ విశ్వవిద్యాలయం నియోజకవర్గమయింది. ఆ సంవత్సరమే గ్లాసో, అబర్డీన్, ఎడింబ్రో, సెంట్ ఆండ్రూస్ విశ్వవిద్యాలయాలు నాల్గింటిని రెండు నియోజకవర్గాలుగా చేసినారు, ఈ నాలుగు స్కాచ్ యూనివర్సిటీలలోనూ ఐరిష్ యూనివర్సిటీలలోను వోటర్ అర్హత ఇంగ్లీష్ యూనివర్సిటీలకు భిన్నంగా నిర్ణయమయింది.

స్త్రీ వోటర్ అర్హతలు : ముప్పై ఏళ్ళు వయసున్న, స్థానిక పరిపాలనా సంస్థకు వోటర్ అయినా, లేదా అట్లాంటి వోటర్ అయినా, లేదా అట్లాంటి వోటర్ భార్య అయినా, న్యాయశాస్త్ర సంబంధమైన అనర్హతలేకున్న స్త్రీ పార్లమెంటరీ నియోజకవర్గంలో వోటర్‌గా నమోదు కావచ్చు. స్థానిక ప్రభుత్వరంగంలో వోటర్ ఏడాదికి అయిదు పౌన్‌ల బాడుగ తేగల ఇల్లుగాని, స్థలంగాని నివాసంగా కలవారై ఉండవలె. పై అర్హతలతో బాటు నియోజకవర్గంలో ఆరు నెలల నివాసమూ స్త్రీ వోటర్‌కు ఉండవలసిందే

పురుషుడైన ఒక వోటర్ ఒక నియోజకవర్గంలో నివాసముండి ఇతర నియోజకవర్గాలలో (రెండు లేక అంతకు మించిన) వ్యాపార స్థలాలుండే - దానితోపాటు యూనివర్సిటీ డిగ్రీ కూడా అతనికుంటే నివాస స్థలమున్న నియోజకవర్గంలో పార్లమెంట్‌కు జరిగే ఎన్నికలలో వోటర్‌గా పాల్గోవచ్చు వ్యాపార స్థలాలున్న నియోజకవర్గాలలో ఒకదానిలోగాని, లేదా యూనివర్సిటీ నియోజకవర్గంలోగాని ఆ రెంటిలో ఏదో ఒక దానిలో అదనంగా వోటు చేయవచ్చు స్త్రీ వోటర్ కూడా స్థానిక ప్రభుత్వరంగంలో తన భర్తకుగాని తనకుగాని వోటుంటే తన పేర నమోదైన నియోజకవర్గంలో ఒక వోటు వేయవచ్చు. తప్పనిసరైన ఇతర అర్హతలు కూడా ఉంటే అమెకు రెండో వోటు కూడా వేసే హక్కు ఉంటుంది రెండు వోట్లుండ

మించి వేసే హక్కు పురుషునికిగాని స్త్రీకిగాని లేదు. ఇద్దరుగాని, అంతకంటె ఎక్కువమంది సభ్యులనుగాని కామన్స్ కెన్నుకోవలసిన విశ్వవిద్యాలయ నియోజకవర్గాలు దామాషా ప్రాతినిధ్య పద్ధతిని ఎన్నికలో అవలంబించే ఏర్పాటు చేసినారు 1918 ప్రజా ప్రాతినిధ్య శాసనము స్త్రీలకు పార్లమెంటరీ ఎన్నికలలో వోటర్‌గా పాల్గొనే అధికారం కలిగించిందిగాని కామన్స్ సభకు ఎన్నుకోవటానికి అవకాశమివ్వలేదు 21 ఏళ్ళు కాక 30 ఏళ్ళు వయోనిర్ణయము స్త్రీ వోటర్‌లకు నిర్ణయించటానికి కారణమైన స్త్రీ వోటర్‌ల అధిక సంఖ్యలను గురించిన భయమే స్త్రీలకు కామన్స్ సభ్యత్వం నిరాకరించటానికి తోడ్పడింది. కాని వోటు అనే అస్త్రము స్త్రీల కిచ్చిన తరవాత పార్లమెంట్ వారికి కామన్స్ సభ్యత్వాన్ని చాలాకాలం తోసిపుచ్చలేక పోయింది. 1918 లో చేసిన మరొక శాసనం స్త్రీలకు కామన్స్ సభ్యత్వార్హతను ప్రసాదించింది ఆ చట్టంవల్ల 1919 లో జన్మతః అమెరికన్ అయిన ఆసర్ సతి కామన్స్ సభా సభ్యురాలు కావటానికి వీలు కలిగింది.

1918 పార్లమెంటరీ సంస్కరణ చట్టం నియోజకవర్గాలను సవరించి, సభ్యత్వ స్థానాలను తిరిగి పంపకం చేసింది 1885 కామన్స్ స్థానాల పంపకపు శాసనం మొత్తం స్థానాలు 670 గా నిర్ణయించగా, ఈ 1918 శాసనం స్థానాల సంఖ్యను 707 కు పెంచింది వీటిలో ఇంగ్లండ్ వేల్స్‌లకు 528 స్థానాలు, స్కాట్లండ్‌కు 74, ఐర్లండ్‌కు 105 వచ్చినాయి. 1922లో దక్షిణ ఐర్లండ్ స్వతంత్ర ఐరిష్ రాజ్యంగా రూపొందటంవల్ల బ్రిటిష్ పార్లమెంట్ అధికారం కింద నిలిచిపోయిన ఉత్తర ఐర్లండ్‌కు కామన్స్ సభలో 13 స్థానాలు మాత్రమే నిర్ణయం కావటంవల్ల కామన్స్ సభ్య స్థానాల సంఖ్య 615 అయింది.

'ఒక్క నియోజక వర్గము - ఒక్క సభ్యుడు' అనే సూత్రమే సామాన్యంగా అవలంబించినారు కాని లండన్ నగరము ; కొన్ని ఇతర పట్టణాలు , పైన చెప్పినట్లు, ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయాలు, కొన్ని ఇంగ్లీష్ విశ్వవిద్యాలయాల కూటమి, రెండేసి కామన్స్ స్థానాలకు ప్రతినిధుల నెన్నిక చేయవలసి వచ్చింది నాల్గు స్కాచ్ యూనివర్సిటీల కూటమి మాత్రం ముగ్గురు కామన్స్ సభ్యులను ఎన్నుకోవచ్చు నన్నారు ఇంగ్లండ్, వేల్ష్, స్కాట్లండ్ లలో 70000 మంది వోటర్‌లకు ఒక్క ప్రతినిధి వంతున, ఐర్లండ్‌లో 43000 మంది వోటర్‌లకు ఒక్క ప్రతినిధి వంతున ఎన్నుకొనే నిర్ణయం జరిగింది కాని, 50000 జనాభా ఉన్న ప్రతి పట్టణానికి ప్రత్యేకంగా ఒక్క సభ్యుని కామన్స్‌కు ఎన్నుకొనే హక్కు ఇచ్చినారు. సభ్యత్వ స్థానాలను పంచటంలో సామాన్యంగా నియోజకవర్గాలలోని జనసంఖ్య సమానంగా ఉండేటట్లు జాగ్రత్త వహించినారు. 50000 జనాభా లేని 44 పట్టణాలు ప్రత్యేక ప్రాతినిధ్యాన్ని పోగొట్టుకొన్నాయి. కాని పట్టణ ప్రతినిధుల మొత్తం సంఖ్య మునుపటికంటె 36 కు పెరిగింది. మండల ప్రతినిధుల సంఖ్య పూర్వంకంటె అయిదు తగ్గింది. విశ్వవిద్యాలయ ప్రతినిధుల సంఖ్యకు, కొత్తగా విశ్వవిద్యాలయాలు కొన్ని ఏర్పడటంవల్ల అయిదు కలిసింది. ఇంగ్లండ్‌కు అదనంగా లభించిన కామన్స్ సభా స్థానాలు 31 కాగా, వేల్ష్, స్కాట్లండ్, ఐర్లండ్‌లకు రెండేసి అధిక స్థానాలు మాత్రమే లభించినాయి. ఈ విధంగా కామన్స్ సభ్యుల సంఖ్యను 1918-19 నియోజకవర్గాల పునర్నిర్మాణ శాసనము ఏడువందల ఏడింటికి పెంచింది. ఈ పెంపుదల పల్లెపట్టుల ప్రాతినిధ్యంలోగాక విశేషంగా పట్టణవాసుల ప్రాతినిధ్యంలో జరగటంవల్ల కామన్స్ సభ ప్రధానంగా పారిశ్రామికుల, శ్రామికుల, ఉద్యోగి

వర్గాల, వ్యాపారాది వృత్తు లవలంబించేవారి, విద్యావంతుల, పెట్టుబడిదారుల ప్రతినిధి అయిందే కాని వ్యవసాయదారుల, బీద కర్షకుల, కొద్దిపాటి పెట్టుబడితో సాగించే పరిశ్రమలందున్న సామాన్య జనులమాట అంతగా సాగే సభ కాకుండా పోయింది. భూస్వామి వర్గాలకు పెట్టని కోటగా శతాబ్దాలుగా ఉన్న ప్రభువుల సభ నిర్వీర్యం అయిన తరవాత, సామాన్య వ్యవసాయ దారుల మాటకు బ్రిటిష్ రాజకీయాలలో ఏ మాత్రం స్థానముండటం సాధ్యమో ఊహించవచ్చు. ఈ శతాబ్దపు మొదటి సగంలో జరిగిన రెండు ప్రపంచ యుద్ధాల అవసరంలో కార్మిక జనుల ప్రాముఖ్యం, కామన్స్ సభా ప్రాతినిధ్యం కొంత పెరిగినా మిశ్రమ మంత్రివర్గం (సర్వపక్ష మంత్రివర్గం) లో కార్మిక పక్షం భాగస్వామి అయినా స్వతంత్రంగా మంత్రివర్గాన్ని నెలకొల్పి దేశాన్ని కొంతకాలం పాలించినా కార్మికపక్షం ఇతర పార్లమెంటరీ పక్షాల సాయంవల్ల సహనం వల్ల అధికారంలో ఉన్నదేగాని, తనంతట తాను, తన కాళ్ళపై నిలువకల్గినంత పార్లమెంటరీ సభ్య సంఖ్యాధిక్యం దానికెన్నడూ లభించింది కాదు. ఆ మాట అని, సామ్యవాదం వ్యాపించిన ఈ శతాబ్ది మధ్యంలో కన్సర్వేటివ్ పక్షం ఎంత సంఖ్యాబలం పెంచుకొని మంత్రివర్గాన్ని ఏర్పాటుచేసినా కార్మికపక్షం వారి మాటను పూర్తిగా కాదనగలిగి లేదు. 1918 ప్రజా ప్రాతినిధ్యపు శాసనము గ్రేట్ బ్రిటన్, ఉత్తర ఐర్లండ్ రాజ్యంలో వోటర్‌ల సంఖ్యను పూర్వ ముంచిన 80 లక్షల నుంచి 200 లక్షలకు పెంచిన కారణంవల్ల దేశం మొత్తంమీద సామాన్య స్థితిపరులకు బ్రిటిష్ రాజకీయాలలో ప్రాముఖ్యం చాలా వృద్ధి పొందింది. బ్రిటిష్ రాజకీయాలలో వారి ప్రాముఖ్యం వృద్ధిపొందిన దామాషాలో కామన్స్ సభా ప్రాముఖ్యం ఎందుకు వృద్ధి పొందలేదో, ఈ శతాబ్దంలో బ్రిటిష్ రాజకీయపక్షాల మంత్రివర్గాల స్థితిగతులలో కలిగిన పరిణామాలను చర్చించే సందర్భంలో ముందు ప్రకరణాలలో వివరిస్తాము.

# 16

# స్వతంత్ర ఐరిష్ రాజ్యస్థాపన

**( Formation of the Irish Free States )**

1800-01 సంవత్సరంలో ఐర్లండ్ బ్రిటిష్ పార్లమెంటరీ పరిపాలన కిందికి తెస్తూ ఆ పార్లమెంట్‌లో ఐర్లండ్‌కు ప్రాతినిధ్యం ఇచ్చినారు, కాని సంపూర్ణ స్వాతంత్ర్యం తమ దేశానికి కావలెనని కోరే ఐరిష్ దేశభక్తులగో అతివాదులకు అసంతృప్తి పోలేదు. 1800 ఐరిష్ - బ్రిటిష్ సమైక్య శాసనం రద్దుచేసి ఐర్లండ్‌కు ప్రత్యేక పార్లమెంట్‌ను సాధించటానికి ఓకానెల్ ప్రచండ ఉద్యమాన్ని లేవదీసినాడు. 1848 లో తమ లక్ష్యసాధన కోసం అతివాదులు తిరుగుబాటు చేసినారు. కాని ఆ తిరుగుబాటు అణిచివేయటంతో కొన్ని ఏళ్ళపాటు ఐర్లండ్ వేరు కావలెననే నినాదం వినిపించలేదు. దౌర్జన్య విధానాన్ని తోసిపుచ్చి, రాజకీయాందోళన మూలంగా ఐర్లండ్‌కు స్వాతంత్ర్యం సంపాదించవలెనని ఐరిష్ జాతీయవాదులు న్యాయవాది అయిన సర్ ఐజాక్ బట్ నాయకత్వంలో 1870-71 లో ఒక రాజకీయపక్షాన్ని స్థాపించినారు. హోమ్‌రూల్ (స్వయంపాలన) అనే పదాన్ని బట్ సృష్టించినాడని అంటారు బ్రిటిష్ పార్లమెంట్‌కు లోబడిన ప్రత్యేక ఐరిష్ పార్లమెంట్ డబ్లిన్‌లో స్థాపితం కావలెనని, అది పరిమితమైన స్వపరిపాలనను ఐర్లండ్‌కు ప్రసాదిస్తుందని హోమ్‌రూల్ లీగ్ ఆందోళన సాగించింది. ఆయన (బట్) 1879 లో మరణించగా, హోమ్‌రూల్ పార్టీ ఛార్లెస్ స్టీవర్ట్ పార్‌నెల్‌ను నాయకునిగా వరించింది. ఇతడు సంపూర్ణ ఐరిష్ స్వాతంత్ర్య స్థాపన తమ పార్టీ వారి ఉద్దేశమని ప్రకటించినారు.

1829, 1850 శాసనాలు ఐర్లండ్‌లోని వోటర్‌ల సంఖ్యను చాలా తగ్గించినాయి. 1850 చట్టం 12 పౌన్‌ల ఆదాయమున్న వారికి వోటు పరిమితం చేయటంవల్ల ఐరిష్ వోటర్‌ల సంఖ్య అంతకు ముందుండిన 272000 నుంచి 164000 కు పడిపోయింది. 1867 శాసనము పట్టణవాసులలో 4 పౌన్‌ల ఆదాయంగల వారికి వోట్ హక్కు ఇవ్వటంవల్ల, బాడుగ ఇళ్ళలో ఉన్న వారికి కూడా వోట్ హక్కు ఇవ్వటంవల్ల పట్టణ నియోజకవర్గాలలోని వోటర్‌ల సంఖ్యను 30000 నుంచి 40000 కు పెంచింది. కాని 1884-85 పార్లమెంటరీ సంస్కరణ శాసనాలు ఐరిష్ వోటర్‌ల సంఖ్యను ఒక్క పెట్టున 2 లక్షల నుంచి 7. లక్షలకు పెంచినాయి. చిన్న చిన్న పట్టణాలు కొన్నింటికి ప్రత్యేక నియోజకవర్గాలు రద్దుచేయటంవల్ల గ్రామ నియోజకవర్గాల ఆధిక్యం వృద్ధి పొందింది. 1888, 1894 ఇంగ్లీష్ స్థానిక స్వపరిపాలనా శాసనాల వంటి శాసనాలే ఐర్లండ్‌లోనూ కావటంవల్ల పట్టణ, మండల, గ్రామీణ కౌన్సిల్‌లు సాపించటంతో ఐరిష్ స్వాతంత్ర్య పక్షానికి ఐర్లండ్ దేశమంతటా మారుమూల ప్రదేశాలలో కూడా పలుకుబడి బాగా హెచ్చింది ఐరిష్ ప్రజల అవసరాలకు తగినట్లు ఐరిష్ సంస్థలను సవరించవలె, స్థాపించవలె అనే ఉద్యమాలు బలాన్ని పుంజుకొన్నాయి. ఐరిష్ ప్రొటెస్టెంట్ చర్చి

పోషణభార మింత కాలం ప్రభుత్వమే మోస్తూ ఉండటం కేథలిక్‌లకు కన్నెర్రగా ఉంది. ప్రభుత్వ ప్రొటెస్టెంట్ చర్చి విభాగాన్ని రద్దు చేయవలెనని 1868 లో ఒక ఉద్యమం ఆరంభ మయింది. 1869 దానిని రద్దుచేస్తూ శాసనం వచ్చింది. రైతులకు భూమిని దఖలు పరిచే భూఖామందులకు పరిహారం చెల్లించటంకోసం ఇచ్చిన ఋణాలను ఆ రైతులు 45 ఏళ్లలో తీర్చుకోవచ్చుననే ఏర్పాటు జరిగింది. 1878 లో సెకండరీ విద్యావిధానము, 1879 లో ఐరిష్ రాజ్య విశ్వవిద్యాలయం ప్రవేశపెట్టటంతో ఐర్లండ్‌లో విద్యావంతుల సంఖ్య వృద్ధి పొంద టానికి వీలయింది. 1870, 1908 సంవత్సరాల మధ్యకాలంలో చేసిన భూసంస్కరణ శాసనాలు "దున్నేవానిదే భూమి" అనే విధానాన్ని అమలు పరిచినాయి. పశ్చిమ ఐర్లండ్‌లో జనసమ్మర్దం విశేషంగా ఉండటం చూసి దాని నివారణకు తగిన చర్యలు తీసుకొన్నారు. వ్యవసాయాభివృద్ధికి ప్రత్యేకంగా ఐరిష్ వ్యవసాయ సంఘము (Irish Agriculture Board) ఏర్పడింది. పరిపాలనా సౌష్ఠవంకోసం అనేక విధాలైన ప్రభుత్వ సంస్థలు దేశ మంతటా ఏర్పడినాయి.

ఇన్ని విధాలైన సంస్కరణల ఫలితంగా, ఉత్తర ఐర్లండ్‌లోని ఇంగ్లీష్ - ప్రొటెస్టెంట్ అల్‌స్టర్ ప్రాంతంలో ఉన్న విధంగానే, దక్షిణ ఐర్లండ్‌లోనూ కేథలిక్ ఐరిష్ ఐకమత్యం బలపడింది. ఐరిష్ స్వాతంత్ర్యోద్యమాని కది దోహదకారి అయింది. భూస్వామిత్వమూ స్థానిక స్వపరిపాలనా సంస్థలలోనేగాక ఇతర ప్రభుత్వ శాఖలలోనూ ఏర్పడిన ఐరిష్ కేథలిక్, ఉద్యోగుల ఆధిక్యమూ వృథా పోలేదు. లార్డ్ లెఫ్టినెంట్ పదవికి, ఐరిష్ ముఖ్య కార్యదర్శి పదవికి బ్రిటిష్ జాతివారే నియమితులైనా ప్రభుత్వ శాఖాధిపతులుగా ప్రొటెస్టెంట్‌లైన ఐరిష్ జాతీయులనే నియమిస్తున్నా మొత్తం మీద ఐరిష్ పరిపాలనలో కేథలిక్ ఐరిష్ వారి ప్రాబల్యం చాలా హెచ్చింది. అందువల్ల బ్రిటిష్ కాబినెట్‌లో మితవాదులున్నా (Conservatives), ఉదారు (Liberals) లున్నా, కేథలిక్ ఐరిష్ జాతివారి సహకారం లేనిదే ఐరిష్ దేశ పరి పాలన సాగించటం పోను పోను మరింత అసాధ్యమయింది.

ఈ పరిస్థితులలో ఛార్లెస్ స్టివర్ట్ పార్‌నెల్ ఐరిష్ జాతీయ స్వాతంత్ర్య పక్షానికి నాయ కత్వాన్ని చేపట్టటం జరిగింది. 1848 లో ఐరిష్ తిరుగుబాటు దారులను అణిచివేయటంలో బ్రిటిష్ పరిపాలకులు అవలంబించిన దౌర్జన్య చర్యలు ఐరిష్ దేశభక్తులు మరిచిపోలేదు. ఈ విధంగా ఉండగా ఐర్లండ్ కాటకం, దుర్భిక్షమూ వ్యాపించినాయి. భూములనుంచి భూస్వాములు పంపివేసిన రైతుల దుఃస్థితికి ఆర్థిక మాంద్యం తోడయింది. నేరాల సంఖ్య పెరిగింది. బ్రిటన్‌తో తెగతెంపులు చేసుకోవలెననే భావం ఐరిష్ కేథలిక్‌లలో బలపడి పోయింది. 1885 లో ఏకసభ్య నియోజకవర్గాల ప్రతిష్ఠాపనవల్ల ఐరిష్ ఉదార పక్షంవారు ఎన్నికలలో చాలామంది ఓడిపోయినారు. 108 సానాలలో 85 స్థానాలను పార్‌నెల్ పార్టీవారే గెలుచు కొన్నారు. బ్రిటన్‌తో ఏ రాజకీయ సంబంధమైనా ఉండవలెనని వాదించటమే ప్రమాదకరమని భావించే పరిస్థితులు ఐర్లండ్‌లో ఏర్పడినాయి. అయినా 1886 లో బ్రిటిష్ ప్రధానమంత్రి అయిన గ్లాడ్‌స్టన్ అనే లిబరల్ పక్ష నాయకుడు ఐరిష్ రాజకీయ వ్యవహారాలు చెడిపోయే లోగా ఐరిష్ దేశ పరిపాలనను బ్రిటిష్ రాజుకు లోబడి, ఐరిష్ జాతి వారికే అప్పగించవలెనని నిశ్చయించినారు. పార్లమెంట్‌లోని చాలామంది ఐరిష్ సభ్యులు ఐరిష్ అంతరంగిక వ్యవహా రాలలో సంపూర్ణ స్వాతంత్ర్యం ఇస్తే బ్రిటిష్ జాతీయ వ్యవహారాలలో బ్రిటిష్ పార్లమెంట్

పెత్తనానికి డబ్లిన్‌లోని ఐరిష్ పార్లమెంట్ అధీనం కావటానికి అంగీకరించినట్లే కనిపించినారు. సమయం వచ్చినప్పు డీ విధానానికి కట్టుబడి వారు ఎంతవరకు నిలవగలరనే విషయంలో చాలామంది బ్రిటిష్ వారికి అనుమానము ఉంది.

## 1886 ఐరిష్ హోమ్ రూల్ చట్టము (Irish Home-rule Bill of 1886)

ఉత్తర, దక్షిణ ఐర్లండ్‌లని వేరుచేయక, ఐర్లండ్ దేశానికంతా డబ్లిన్ నగరంలో ఏక శాసన సభను (Uni-Cameral Legislature) నెలకొల్పవలెననీ, అందులో రెండు భాగాలు - (1) ఎన్నుకొనేది, (2) ఎన్నుకొననిది ఉండవలెనని, అవి అన్యోన్యం ఒకటి మరొక దానిపై అదుపుగా ఉపయోగపడవలెనని ఈ శాసన సభకు ఒక్క పోలీస్ వ్యవహారాలలో తప్ప, మిగిలిన అన్ని విషయాలలోను పాలకశాఖ (Executive) పై పెత్తనం ఉండవలెనని, 1886 హోమ్‌రూల్ బిల్ విధించింది. ఐరిష్ ప్రొటెస్టెంట్ మతానికి రక్షణ లేర్పాటు చేసింది. బ్రిటిష్ పార్లమెంట్ రెండు సభలలోనూ ఐరిష్ వారికి ప్రాతినిధ్యం ఆ తరవాత ఉండదన్నది కాని, రాజపదవి, అన్యదేశ వ్యవహారాలు, దేశరక్షణ, వలసదేశాలు రేవు సుంకాలు బ్రిటిష్ పార్లమెంట్ అధీనంలో ఉండవలెనని ఈ హోమ్‌రూల్ బిల్ నిబంధించింది. స్థానికంగా పన్నులు విధించే అధికారం ఐరిష్ పార్లమెంట్‌కే ఇచ్చినప్పటికి ఏటేటా ఐరిష్ ప్రభుత్వం సామ్రాజ్య వ్యయానికై $32\frac{1}{2}$ లక్షల పౌన్‌లు చెల్లించవలెనని ఈ చట్టం విధించింది.

గ్లాడ్‌స్టన్ రెండో మంత్రివర్గమూ దాని తరవాత అధికారానికి వచ్చిన సాలిస్‌బరీ ప్రభువు మంత్రివర్గమూ పార్‌నెల్‌తో ఆంతరంగిక విషయాలలో ఐరిష్ వారికి స్వాతంత్ర్యం ఇచ్చే చాలా సూచనలను చర్చించినాయి. పార్‌నెల్ పక్షపు కామన్స్ సభ్యులు సాలిస్‌బరీ మంత్రివర్గ స్థాపనకు తోడ్పడినారు గ్లాడ్‌స్టన్ లిబరల్ పార్టీలో అతివాదులు జోసెఫ్ ఛాంబర్లేన్ నాయకత్వం కింద, బ్రిటిష్ దీవులలోని నాలుగు ప్రాంతాలకు స్వపరిపాలన ఇవ్వవలెననీ సామ్రాజ్య వ్యవహారాలను ఆ నాల్గింటికి ప్రాతినిధ్యం వహించే సామ్రాజ్యపు పార్లమెంట్ (Imperial Parliament) పాలించవలెనని ఒక సూచన చేసినారు. దీనివల్ల పరిపాలనా సౌష్ఠవం పెంపొందుతుందని వారు వాదించినారు కాని శతాబ్దాల పరిణామంగా చాలా కడగండ్లు గడిచి గడించిన బ్రిటిష్ దీవుల ఐకమత్యాన్ని ధారపోయటానికి పార్లమెంట్‌లో అధిక సంఖ్యాకు లంగీకరించలేదు గ్లాడ్‌స్టన్ సూచనలను అతివాదులు హర్షించలేదు. మితవాదుల్లా ఆమోదించ లేదు అది చాలనట్లు అల్‌స్టర్ మొదలైన ఉత్తర ఐరిష్ మండలాలూ గ్లాడ్‌స్టన్ చట్టానికి వ్యతిరేకత చూపినాయి అవి ఐరిష్ భూసంస్కరణోద్యమంతో, రాజకీయోద్యమాలతో ఇంత కాలం ఏ సంబంధమూ పెట్టుకోలేదు. ఐరిష్ హోమ్‌రూల్‌కు అంగీకరిస్తే విద్యాహీనులై, మూఢభక్తిపరులై, పురోహితదాసులై, రాజద్రోహులైన ఐరిష్ కేథలిక్కులకు తాము దాసులు కాగలరనే భయం వారిలో తిష్ఠ వేసింది. ఐరిష్ స్వరాజ్య సాపనవల్ల ఇన్ని శతాబ్దాలుగా వారనుభవిస్తూ ఉన్న లాభసాటి ఆధిపత్యానికి తిలాంజలి వదలవలసి వస్తుందని ఐరిష్ ప్రొటెస్టెంట్‌లు హోమ్‌రూల్ బిల్‌ను వ్యతిరేకించటంలో ఆశ్చర్యం లేదు. బ్రిటిష్ దీవుల రాజకీయ ఐక్యాన్ని కోరే పక్షంవారు, ఐరిష్ వారూ, బ్రిటన్‌లూ గ్లాడ్‌స్టన్ చట్టాన్ని విరోధించినారు.

కామన్స్ సభలోని ఉదారపక్షము రెండు చీలికలైనందువల్ల కామన్స్ సభలోనే అది ఓటమి పొందింది.

## 1893 ఐరిష్ హోమ్‌రూల్ చట్టము

ఈ రెండో హోమ్‌రూల్ చట్టం కూడా గ్లాడ్‌స్టన్ ప్రతిపాదించిందే. కాని మొదటి చట్టం చేసిన ప్రతిపాదనలకు భిన్నంగా, ఈ చట్టం ఐర్లండ్‌కు ద్వంద్వశాసన సభ (Bi-Cameral Legislature) ఉండవలసినట్లూ, రెండు శాసన సభలకూ సభ్యులు ఎన్నుకోవలసినట్లూ, బ్రిటిష్ జాతీయ వ్యవహారాలలో ఐరిష్ ప్రజల మాటకు చోటుండటానికి వారు బ్రిటిష్ కామన్స్ సభకు మునుపటివలె 103 మందినిగాక, 80 మంది ప్రతినిధులను ఎన్నుకోవలసినట్లు ఏర్పాటయింది. ఈ 80 మంది ఐరిష్ సభ్యులకు, ఐరిష్ వ్యవహారాలు, సామ్రాజ్య వ్యవహారాలు చర్చించేటప్పుడు మాత్రమే కామన్స్ సభలో స్థానముండేటట్లు చిత్తు చట్టం సూచించినా, చివరకు అది శాసనరూపం దాల్చేటప్పటికి ఈ పరిమిత ఐరిష్ ప్రాతినిధ్యం తొలగించబడి అన్ని వ్యవహారాలలోను ఆ 80 మంది సభ్యులకు పూర్తి ప్రాతినిధ్యాధికారం ఉండేటట్లు చట్టం సవరించింది. ఈ రెండో చట్టంలోని నిబంధనలు ఐరిష్ కేథలిక్‌లకు ఆమోదాలు కావచ్చునేమోకాని బ్రిటిష్ దీవుల సంఘటన అభిలషించే వారికి, అల్‌స్టర్ ఇంగ్లీష్ - ప్రొటస్టెంట్ అతివాదులకు అవి అవాంఛనీయాలైనాయి.

ఈసారి ఐరిష్ హోమ్‌రూల్ చట్టం కామన్స్ సభ ఆమోదాన్ని పొందిందిగాని, ప్రభు సభ దానిని తోసిపుచ్చింది. ఈ చట్టము ఓడినప్పటికి పార్లమెంట్ రద్దయి జనరల్ ఎన్నికలు జరగలేదు. 1912 వరకూ ఐరిష్ స్వపరిపాలన విషయం అడుగున పడింది. 1895-1906 మధ్యకాలంలో బ్రిటిష్ దేశ ఐక్యపక్షం వారు (Unionists) హోమ్‌రూల్ ఉద్యమాన్ని అణచటానికి తీవ్ర చర్యలు తీసుకొన్నారు. ఈ విధానం విఫలమైనందున 1906 తరవాత కొంతకాలం బ్రిటిష్ ప్రభుత్వం ఐరిష్ స్వతంత్రవాదులను బుజ్జగించి మంచి చేసుకోవలెనని చూసింది. ఆ విధంగా వారి ఉద్యమాన్ని బలహీన పరచవలెనని బ్రిటిష్ ప్రభుత్వాశయము. ఈ విధానం లిబరల్ పక్షానికి చెందిన ప్రధాన కార్యదర్శి అగస్టిన్ బిర్రెల్‌ది. ఐర్లండ్‌లో బ్రిటిష్ అధికారవర్గమూ, మిలిటరీ పోలీస్ ఇంగ్లీష్ పరిపాలనను నిలబెట్టవలసిన పరిస్థితి విధిగా ఏర్పడింది. ఆ పరిపాలన కేథలిక్‌లు ఎదురు తిరగనంతకాలం నిల్చి ఉండగలదని స్పష్టమయింది. ఐరిష్ హోమ్‌రూల్ లీగ్ తన అతివాద ధోరణిని ఉపసంహరించుకొన్నది. కాని ఆ లీగ్‌కు వెలుపల సిన్‌ఫిన్ పక్షం వంటి అతివాద, దౌర్జన్య పక్షాలు కొన్ని తలయెత్తినాయి. ఐరిశు జాతీయపక్ష నాయకుడు జాన్‌రెడ్‌మండ్ ఆంగ్లేయులకు ప్రతికూలుడు. అన్యదేశాల సాయం కోరదలచినా బ్రిటిష్ సామ్రాజ్యంలోని ఆస్ట్రేలియా వైపు ఆయన మొగ్గినాడే కాని సామ్రాజ్యానికి వెలుపలి అమెరికావంటి రాజ్యాల సాహాయ్యాన్ని ఆయన అర్థించలేదు. ఐర్లండ్‌కు స్వాతంత్ర్య ప్రదానంవల్ల అనర్థాలు కలుగుతాయేమో అనే భయం చాలావరకు అంతరించి పోయింది. అందువల్ల ఐరిష్ స్వరాజ్యం చూపుమేరలోకి వచ్చింది కాని 1886కు తరవాతి కాలంలో అల్‌స్టర్ నాయకత్వంలో ఉత్తర ఐర్లండ్‌లోని ఇంగ్లీష్ ప్రొటస్టెంట్‌ల పక్షం దృఢపడింది. వారి కెంత మాత్రం కేథలిక్ మెజారిటీకి లోబడిన ఐక్య ఐర్లండ్ స్థాపన సహించలేదు. అట్లాంటి ఉపద్రవాన్ని నిరోధించటానికి అవసరమైన దౌర్జన్య చర్యలకు, విధిలేక

వస్తే బ్రిటిష్ ప్రభుత్వంతోను కేథలిక్ ఐర్లండ్‌తోను యుద్ధానికి ఉత్తర ఐర్లండ్ సంసిద్ధం అయింది. యుద్ధమే వస్తే ప్రొటెస్టెంట్ ఇంగ్లండ్, ఎంతవరకు తమ జాతివారైన ఐరిష్ ప్రొటస్టెంట్‌లకు ఎదురు నిలుస్తుందో ? కేథలిక్ ఐర్లండ్‌తో చేతులుగల్పి, స్వతంత్ర ఐక్య ఐర్లండ్ స్థాపనా ప్రయత్నానికి తోడుపడుతుందో తెలియదు. ఇట్లాంటి పరిస్థితులలో ఐరిష్ హోమ్‌రూల్ బిల్‌ను 1908 లో పార్లమెంట్‌లో సర్ హెన్రీ కాంప్‌బెల్ బానర్‌మాన్ ప్రవేశపెట్టినారు. కాని 1909 లో తన మంత్రివర్గం ప్రతిపాదించిన ఆర్థిక చట్టాన్ని (Finance Bill) ప్రభువుల సభ తోసివేయటంవల్ల పార్లమెంట్ రద్దయింది. దానివల్ల ఐరిష్ హోమ్‌రూల్ చట్టం అడుగున పడింది. 1911 పార్లమెంట్ చట్టం శాసనమైన తరవాత మూడో ఐరిష్ హోమ్‌రూల్ చట్టం కామన్స్ సభలో 1912 సంవత్సరంలో ప్రవేశ పెట్టినారు.

## 1912 ఐరిష్ హోమ్‌రూల్ చట్టము

బ్రిటిష్ సామ్రాజ్య పార్లమెంట్ ఆధిపత్యాన్ని చాటటమేకాక ఈ చట్టం ఐరిష్ పార్లమెంట్ అధికారాలకు మినహాయింపులు కొన్ని కల్పించింది. ఐరిష్ పార్లమెంట్ ద్వంద్వ శాసన సభగా ఉండవలెననీ, ఎగువ శాసన సభలోని సభ్యులను ప్రభుత్వం నియమించవలెననీ దిగువ శాసన సభలోని సభ్యులను వోటర్‌లే ఎన్నుకోవలెననీ, బ్రిటిష్ పార్లమెంట్‌లోని దిగువ సభ (House of Commons) లో ఐరిష్ ప్రజలకు ప్రాతినిధ్య ముండవలెననీ ఈ చట్టం నిర్ణయించింది రేవు సుంకాలు స్వదేశీయ పరిశ్రమల మీద పన్నులతోసహా ఇతర పన్నులు విధించే అధికారాన్ని పూర్వమున్న ఐరిష్ స్వాతంత్ర్య శాసనా లన్నింటి కంటె మించి ఈ (1912) చట్టం ఐరిష్ పార్లమెంట్‌కు ఇచ్చింది. కాని దీని సంకల్పము ఐక్య ఐరిష్ పార్లమెంట్ స్థాపన ఎన్ని రక్షణలు ఉత్తర ఐర్లండ్‌కు కల్పించినా, ఐక్య ఐర్లండ్ స్థాపన వాయిదా చేసే సూచనలెన్ని చేసినా సంఘటిత స్వతంత్ర ఐర్లండ్ సృష్టిని ఉత్తర ఐరిష్ మండలాలు అంగీకరించలేదు. పోనీ, ఐర్లండ్ స్వాతంత్ర్యాన్ని విరోధించిన డౌన్, డెర్రీ, అంట్రిమ్, అర్‌మా, అల్‌స్టర్ మండలాలను ఐక్య ఐర్లండ్‌లో చేర్చక మానుకోవటం మేలేమో అనే యోచన బ్రిటిష్ పార్లమెంట్‌కు తోచలేదు. 1911 లో ప్రభుసభా అధికారాలను కత్తిరించిన తరవాత, 1912 లో ఐరిష్ హోమ్‌రూల్ శాసనాన్ని బ్రిటిష్ ప్రభుత్వం పార్లమెంట్‌లో ప్రవేశపెట్టింది. 1914 లో ఆస్క్విత్ ప్రధానమంత్రిగా ఉన్నప్పుడు పై శాసనం కామన్స్ సభలో నెగ్గినా, ప్రభుసభ తోసివేయలేదు. కాని 1911 పార్లమెంటరీ చట్టాన్ని ఉపయోగించుకొని ప్రభుత్వం దానిని రాజు ఆమోదానికి పంపింది అయినా, స్వతంత్ర ఐర్లండ్ స్థాపన నెత్తురు వరదలు గట్టి పారక సాధ్యమయ్యేటట్లు అగపడలేదు. ఐర్లండ్‌లోని ఉత్తర జిల్లాల ఇంగ్లీష్ ప్రొటస్టెంట్‌లు ఐక్య ఐర్లండ్‌ను స్థాపనను నిరోధించటానికి సైన్య సమీకరణానికి పూనుకొన్నారు. ఇది చూసి దక్షిణ ఐరిష్ కేథలిక్ జిల్లాలు స్వతంత్ర ఐర్లండ్‌ను సాధించటంకోసం యుద్ధానికి నడుం కట్టినారు. ఇంతలో మొదటి ప్రపంచ యుద్ధం రావటంవల్ల. ఐరిష్ హోమ్‌రూల్ బిల్‌ను అమలు జరపటం వాయిదా వేయవలెననే తీర్మానానికి లోబడి ఆ చట్టం రాజు ఆమోదాన్ని పొందింది.

ఇది ఇట్లా ఉండగా హోమ్‌రూల్ పక్షంలోని అతివాదులు బ్రిటన్ యుద్ధంలో తలమున్కలుగా తగులుకొని ఉన్నప్పుడే తమకు అదునైన కాలమని నిష్ఠుం లేవదీసినారు.

డబ్లిన్‌లోని విప్లవకారులను అణిచినా, అక్కడక్కడ ఐర్లండ్ దేశమంతటా ఘాతుక చర్యలు సాగుతూనే ఉన్నాయి. అందువల్ల 1914 హోమ్‌రూల్ శాసనంలో సవరణలు చేయటం అత్యావసరమని బ్రిటిష్ ప్రభుత్వం భావించింది. 1916, 1917 సంవత్సరాలలో అన్ని రాజకీయ పక్షాల మధ్య సంప్రతింపులవల్ల సామరస్యం కుదర్చటంకోసం ప్రయత్నాలు జరిగినాయి. ప్రభుత్వ మవలంబించదలచిన సమాధాన మార్గాలలో ప్రధానమయింది. అల్‌స్టర్ విషయంలో స్వతంత్ర ఐర్లండ్‌లో చేరమని దానిని నిర్బంధించరాదు. 2. మిగిలిన ఐర్లండ్‌కు తగిన స్వపరిపాలనా విధానాన్ని అవలంబించవలె, 3. దక్షిణ, ఉత్తర ఐర్లండ్‌లకు వేర్వేరు ప్రభుత్వాలు ఏర్పాటు చేసినా, ఐర్లండ్ దేశానికంతకు ఏదైనా సమైక్య చిహ్నమైన సంస్థ ఒకటి ఏర్పాటు కావలె. 1916 జూన్ నెలలో వివిధ పక్షాలలోని ప్రముఖుల సభ సమావేశం జరిగింది గాని ఆ సభవారు ఒక ఒప్పందానికి రాలేకపోవటంవల్ల ఆనాటి కధికారంలోనున్న సర్వపక్ష బ్రిటిష్ ప్రభుత్వం ఐరిష్ వ్యవహారాల పరిష్కారానికి నూతన శాసనాన్ని 1920 లో 'ఐరిష్ పరిపాలన శాసనము'నే పేర చేసింది. ఈ శాసనం చేసిన మొదటి పని (i) 1914 ఐరిష్ హోమ్‌రూల్ చట్టాన్ని రద్దుచేయటం. (ii) ఐర్లండ్‌ను రెండు విభాగాలు చేయవలె: ఉత్తర ఐర్లండ్ డౌన్, డెర్రీ, ఆర్‌మా, ఆన్‌ట్రిమ్, టైరోన్, ఫెర్‌మానా కౌంటీల కూటమి. ఇవి పోగా మిగిలిన కౌంటీలు దక్షిణ ఐరిష్ రాష్ట్రమవుతుంది. (iii) ఒక్కొక్క ఐరిష్ విభాగానికి ప్రత్యేక పార్లమెంట్ ఉండేటట్లు, ప్రత్యేక పరిపాలక వర్గం ఒక్కొక విభాగాన్ని పరిపాలించేటట్లు, ఈ శాసనం నిర్ణయించింది. (iv) ఉత్తర ఐర్లండ్ దేశ వైశాల్యంలో ఆరోవంతు, మొత్తం జనాభాలో మూడోవంతు. యంత్ర పరిశ్రమలలో అత్యధిక భాగము ఉత్తర ఐర్లండ్‌లో కేంద్రీకృతమైనాయి. (v) ఐర్లండ్ అంతటికి సమానాంశాల పరిపాలనకు రెండు పార్లమెంట్‌లు నియమించిన సభ్యులతోకూడిన ఒక కౌన్సిల్ స్థాపన కావలె. ఏనాటికైనా ఆ కౌన్సిల్ ఐర్లండ్ అంతటినీ పరిపాలించే పార్లమెంట్‌గా పరిణామం చెందవలెనన్నదే ఐరిష్ పరిపాలన శాసనంలోని ప్రధానాశయము. ఉత్తర ఐర్లండ్ హృదయపూర్వకంగా కాకపోయినా ఈ పరిపాలనా పథకానికి ఒప్పుకోవటం మొదలు తమకు ప్రత్యేకంగా ఒక పార్లమెంట్ ఏర్పడితే ముమ్ముందు ఐక్య ఐరిష్ పార్లమెంట్ స్థాపన ప్రయత్నాన్ని భగ్నం చేయలేకపోమని వా రాశ పడినారు. అందువల్ల ఉత్తర ఐర్లండ్‌కు సంబంధించినంతవరకు 1921 లో, 1920 ఐరిష్ పరిపాలనా శాసనము అమలు జరిగినదనవచ్చు. కాని దక్షిణ ఐర్లండ్‌లో ఆనాటికున్న తీవ్ర పరిస్థితులు పై శాసనాన్ని ఆచరణలోకి తేవటానికి అడ్డు పడినాయి.

20 శతాబ్దారంభంలో సిన్‌ఫీన్ (మాకుమేమే) అనే పేరు వహించిన ఒక అతివాద రాజకీయ సంఘం దక్షిణ ఐర్లండ్‌లో ఉద్భవించింది. క్రమంగా అది దృఢపడింది. ఐరిష్ రాజకీయ పక్షాలన్నిటిలో హెచ్చు పలుకుబడి సంపాదించింది సిన్‌ఫీన్ పక్షము. స్వతంత్ర ఐరిష్ రిపబ్లిక్ స్థాపనమే దీని ఆశయము. 1918 డిసెంబర్‌లో జరిగిన ఎన్నికలలో అన్ని నియోజకవర్గాలలోను ఇది తన అభ్యర్థులను నిలబెట్టి దిగ్విజయం సాధించింది. మితవాదులైన ఐరిష్ జాతీయపక్షం ఎక్కువగా ఓడిపోయింది. ఎన్నికలకు ముందు సిన్‌ఫీన్ అభ్యర్థులు తాము గెలిస్తే పార్లమెంట్‌లో కూర్చోబోమని, స్వతంత్ర ఐరిష్ పార్లమెంట్‌ను స్థాపించగలమని ప్రతిజ్ఞ చేసినారు. గెల్చిన సిన్‌ఫీన్ అభ్యర్థులు 1919 జనవరిలో డబ్లిన్ పట్టణంలో ప్రత్యేకంగా సమావేశమై 'డెయిల్ ఈరియన్' అనే పేరుతో వ్యవహరించినారు. ఈ శాసన

సభ ఐరిష్ స్వాతంత్ర్య ప్రకటన చేస్తూ నూతన స్వతంత్ర ఐరిష్ రాజ్యము "సావర్ సాట్ ఈరియన్" అనే పేరుతో ఉంటుందని తెలియజేసినారు. డెయిల్ ఈరియన్ (Dial Eireann) ఎన్నుకొన్న అధ్యక్షుడు తాను నియమించుకొన్న నలుగురు మంత్రులతో పరిపాలన సాగించినాడు కాని ఆయన చేసే మంత్రుల నియామకం డెయిల్ ఆమోదించవలసి ఉంది. ఈమాన్ డివాలీరా అనే సిన్‌ఫీన్ నాయకుడు మొదటి అధ్యక్షుడుగా ఎన్నికైనాడు 1920 ఐరిష్ పరిపాలనా శాసనం ప్రకారం దక్షిణ ఐరిష్ పార్లమెంట్‌కు ఎన్నికలు 1921 లో జరగవలసి ఉంది. డివాలీరా ప్రభుత్వం ఆ శాసనాన్ని ఒకవైపు తిరస్కరిస్తూ, పార్లమెంట్‌కు ఎన్నికలు మాత్రం జరిపించింది. నాలుగు నియోజకవర్గాలలో తప్ప మిగిలిన నియోజక వర్గాలన్నిటిలో సిన్‌ఫీన్ అభ్యర్థులే గెల్చినారు. ఈ విధంగా రెండో ఈరియన్ డెయిల్ ఎన్నికైనది.

ఇట్లా స్వతంత్ర ఐర్లండ్ స్థాపన నిర్మాణాత్మక మార్గాల ననుసరిస్తూ ఉన్నా సిన్‌ఫీన్ ఉద్యమం దౌర్జన్య మార్గాలు తొక్కడం మానలేదు డెయిల్ ఈరియన్ స్థాపించిన ప్రజా రాజ్యాన్ని వ్యతిరేకించేవారు ఐర్లండ్‌కు దేశద్రోహులని, వారిని నిర్మూలించటం సమర్థనీయమని వాదిస్తూ బ్రిటిష్ ప్రభుత్వోద్యోగులను రక్షక భటులను పనిబూని సినిన్‌ఫీన్ సభ్యులు వధించినారు. హత్య గావించిన వారికి వ్యతిరేకంగా సాక్ష్యమివ్వటానికి ప్రాణభీతివల్ల ముందుకు వచ్చేవారు లేకపోయినారు. ఈ పరిస్థితులలో డెయిల్ ఈరియన్‌కు జరిగే ఎన్నికలలో సిన్‌ఫీన్ పక్షంవారే గెలవటంలో ఆశ్చర్యం లేదు ప్రభుత్వ న్యాయస్థానాలను బహిష్కరిస్తూ వ్యాజ్యాలను పరిష్కరించటానికి ప్రత్యేక సిన్‌ఫీన్ న్యాయస్థానాలను వారు స్థాపించినారు. తమ ప్రత్యేక సైన్యాన్ని, రక్షకభట సంఘాలను వారు నియమించినారు జాతీయ ఋణాన్ని ఏర్పాటుచేయటమే కాక అమెరికా మొదలైన దేశాలలో తమ ప్రభుత్వంపట్ల సానుభూతి సంపాదించటానికి ఈ పక్షంవారు పెద్ద ప్రచారం చేసినారు సిన్‌ఫీనర్‌ల దౌర్జన్యం ప్రతి దౌర్జన్యానికి దారి తీసింది హత్యలను హత్యలచేతనే నిలువరింప సాధ్యమవుతుందనే విశ్వాసంతో ఉద్యోగ విరమణచేసిన సైనిక, రక్షకభట బృందాలనుంచి నియమకాలు చేసి రాయల్ ఐరిష్ పోలీస్ సేనను బ్రిటిష్ ప్రభుత్వం పెంచింది బ్లాక్ ఎండ్ టాన్స్ (The Black and Tans) అనే పేర నల్లని ముసుగులు ధరించి వెళ్ళి, సిన్‌ఫీనర్‌లను, వారి అనుయాయులను చూసిన వారిని చూసినట్లే కాల్చివేయటానికి బ్రిటిష్ ఉద్యోగులు వెనుదీయలేదు. సిన్‌ఫీనర్‌ల ఘాతుక కార్యాలు అధికంగా జరిగిన ప్రదేశాలలో నివసించే ఐరిష్ వారిపై సామూహికంగా అపరాధపు పన్నులు బ్రిటిష్ అధికారులు విధించినారు. హత్యకాండలో ఇరు పక్షాలు పోటీ పడటం చూసి, 1921 జూన్ నెలలో బ్రిటిష్ ప్రధానమంత్రి లాయిడ్ జార్జ్ డివాలీరాను ఈ వివాద పరిష్కారానికి మార్గాలు వెదకటానికి, సంప్రతింపులు జరపటానికి ఒక సమావేశానికి ఆహ్వానించినాడు. ఐరిష్ రిపబ్లిక్‌ను బ్రిటిష్ ప్రభుత్వం గుర్తించినట్లు ఈ ఆహ్వానానికి అర్థం కాదని లాయిడ్ జార్జ్ శ్రమ తీసుకొని వివరించినా, ఆ మాటలను బ్రిటిష్ ప్రజలు అర్థం చేసుకోలేక పోలేదు డివాలీరా సభకు రాలేదుగాని ఐర్, బ్రిటిష్ ప్రభుత్వాల ప్రతినిధులు అక్టోబర్ నెలలో సమావేశమయినారు. బ్రిటన్ సైనిక, నావిక భద్రతను కాపాడే బాధ్యత బ్రిటిష్ ప్రభుత్వానికి వదిలితే డెయిల్ ఈరియన్‌కు ఇతర డొమినియన్ లనుభవిస్తున్న ప్రతిపత్తి, అధికారాలు ఇవ్వటానికి లాయిడ్ జార్జ్ అనుమతించినాడు. కాని డివాలీరా దీని

అంగీకరించ లేదు. అట్లా తా మంగీకరిస్తే ఐర్ రాజ్య స్వతంత్ర సార్వభౌమత్వాలకు క్షతి కలుగుతుందని బ్రిటిష్ కామన్ వెల్త్ సంస్థతో సహకారం కోసం సంధి చేసుకోవటానికి ఐర్లండ్ సంసిద్ధమే అని డివాలీరా వాదించినాడు. సమాధానానికి రాకున్న ఐర్‌పై యుద్ధాన్ని తీవ్రతరం చేయగలమని బ్రిటన్ బెదిరించటంవల్ల డివాలీరా ప్రతినిధులు దిగివచ్చి. గ్రేట్ బ్రిటన్, ఐర్లండ్‌ల మధ్య సంధికై కొన్ని సూత్రాలకు ఒప్పుకోవటానికి అనుమతించినారు. ఈ ఒడంబడికను బ్రిటిష్ పార్లమెంట్ రెండో డెయిల్ పార్లమెంటూ ఆమోదించినాయి. అనంతరం సంధి షరతులను 1922 జనవరి 7 వ తేదీన డెయిల్ ఆమోదించింది. సంధికి అనుకూలురు 64 మంది. ప్రతికూలురు డివాలీరా పక్షంవారు 57 మంది. వారం తరవాత దక్షిణ ఐర్లండ్ పార్లమెంట్‌లోని ప్రజాసభ ఆ సంధిని పునరామోదించింది.

ఆ సంధి షరతులివి : 1. ఐర్లండ్ ఇక ఐరిష్ ఫ్రీస్టేట్ (స్వతంత్ర ఐరిష్ రాజ్యము) అని పిలవవలె. దానికి బ్రిటిష్ డొమినియన్ ప్రతిపత్తి ఉంటుంది. 2. కెనడాకు బ్రిటిష్ పార్లమెంట్, బ్రిటిష్ ప్రభుత్వాలతో ఉన్న సంబంధాలే ఐరిష్ ఫ్రీస్టేట్, గ్రేట్ బ్రిటన్‌ల మధ్య ఉండవలె. 3. బ్రిటిష్ పార్లమెంట్ ఆ సంధిని ఆమోదించిన నెలలోగా ఉత్తర ఐరిష్ పార్లమెంట్ ఐరిష్ ఫ్రీస్టేట్‌లో కలిసి ఉండటానికి అంగీకరించకపోతే ఐరిష్ ఫ్రీస్టేట్ యొక్క ప్రభుత్వంయొక్క అధికారాలకు ఉత్తర ఐర్లండ్ లోబడనవసరం లేదని 1920 ఐరిష్ ప్రభుత్వ శాసనమే ఉత్తర ఐర్లండ్‌కు అన్వయించవచ్చునని ఈ సంధి స్పష్టీకరించింది. నెల గడువు దాటకముందే ఉత్తర ఐరిష్ పార్లమెంట్ ఆ విధమైన కోరిక కోరనూ కోరింది. ఆనాటి (1921) నుంచి ఈనాటివరకు ఉత్తర ఐర్లండ్ గ్రేట్ బ్రిటన్‌తోబాటు బ్రిటిష్ పార్లమెంట్ అధికారానికి లోబడి ప్రత్యేక ఉత్తర ఐరిష్ పార్లమెంట్ పరిపాలిస్తూ ఉంది. 4. ఉత్తర ఐరిష్ పార్లమెంట్ గాని, ఐరిష్ ఫ్రీస్టేట్ పార్లమెంట్‌గాని తన పౌరుల మత స్వేచ్ఛను అరికట్టే శాసన మేదీ చేయరాదు, ప్రత్యేకంగా ఏ మతాన్నీ పోషించరాదు. 5. బ్రిటిష్ దీవుల రక్షణార్థమై ఐరిష్ ఫ్రీస్టేట్ తన తీరంలో రేవులను బ్రిటిష్ ప్రభుత్వాని కప్పజెప్పి, ఇతర సదుపాయాలు కూడా సమకూర్చవలసింది. 6. ఈ సంధిని బ్రిటిష్ పార్లమెంటూ ప్రభుత్వమూ ఆమోదించి, నూతన రాజ్యాంగ నిర్మాణమై, తదనుగుణమైన చర్యలు తీసుకొనేవరకు, దక్షిణ ఐర్లాండ్‌ను ఒక తాత్కాలిక ప్రభుత్వం పరిపాలిస్తూ ఉండవలె.

పై సంధిని బ్రిటిష్ పార్లమెంట్ ''ఐరిష్ ఫ్రీస్టేట్ ఒడంబడిక చట్టము'' చేసి 31-3-1922 తేదీని ఆమోదించింది. ఇక మీద దక్షిణ ఐర్లండ్ నుంచి బ్రిటిష్ కామన్స్ సభకు ప్రతినిధులను ఎన్నుకోవటాన్ని ఈ చట్టం నిషేధించింది. ఐరిష్ ఫ్రీస్టేట్‌కు డొమీనియన్ హోదానిచ్చే ఈ చట్టాన్ని బ్రిటిష్ ఐక్యవాది పక్షం (Unionist Party) వారుకూడా ఆమోదించినారు. ఈ పక్షంవారు దక్షిణ ఐర్లండ్ ప్రత్యేక స్వాతంత్ర్యవాదాన్ని ఇన్నాళ్ళు తీవ్రంగా ప్రతిఘటించినవారే. అట్లా ప్రతిఘటించటానికి కారణం ఉత్తర ఐర్లండ్‌లోని బ్రిటిష్ ప్రొటెస్టెంట్ జనాన్ని దక్షిణ ఐరిష్ కేథలిక్ మెజారిటీ పరిపాలనకు అప్పజెప్పటం వారి కిష్టం కానందువల్లనే, కాని 1922 ఐరిష్ ఫ్రీస్టేట్ శాసనాన్ని దక్షిణ ఐర్లండ్‌కే పరిమితం చేయటంవల్ల, ఉత్తర ప్రొటెస్టెంట్ ఐర్లండ్ స్వాతంత్ర్యానికి చట్టం భంగకారి కానందువల్ల యూనియనిస్ట్ పక్షంవారు బ్రిటిష్ పార్లమెంట్‌లోని ఉదార పక్షంతోను, కామన్స్ సభలోని

కేథలిక్ ఐరిష్ సభ్యులతోను చేతులు కలిపి, ఐరిష్ ఫ్రీస్టేట్ శాసనము పార్లమెంట్ ఆమోదించటానికి సాయపడినారు.

విదేశాల, అందులోను మొదటి ప్రపంచ యుద్ధానంతరం ఉద్భవించిన నవీన రాజ్యాల, రాజ్యాంగాలను పరిశీలించి ఒక కమిటీ చేసిన సూచనలను గమనించి తాత్కాలిక ప్రభుత్వం నూతన రాజ్యాంగం ముసాయిదాను తయారుచేసింది. బ్రిటిష్ ప్రభుత్వంతో సంప్రతింపులు జరిపి దానిలో కొన్ని సవరణలు కూడా పొందుపరిచింది. (నూతన రాజ్యాంగ శాసనం చేయటానికి) రాజ్యాంగ నిర్మాణ సభగా పనిచేసే మూడో డెయ్‌ల్ ఈరియన్‌ను 1922 జూన్‌లో ఎన్నుకొన్నారు. కాని, సంధిని ఆమోదించేవారు దానిని నిరోధించే వారితో అంతర్యుద్ధం చేయవలసి వచ్చినందువల్ల సెప్టెంబర్ నెలకుగాని సమావేశం కాలేకపోయింది చివరికి 25 అక్టోబర్ నాడు ఐరిష్ ఫ్రీస్టేట్ (సార్‌స్టాట్ ఈరియన్ - Saorstat Eireann) శాసనాన్ని ఆకాన్‌స్టిట్యుయెంట్ సభ ఆమోదించింది. ఆ శాసనానికి ఐరిష్ ఫ్రీస్టేట్ రాజ్యాంగమూ, బ్రిటిష్ - ఐరిష్ స్వతంత్ర రాజ్యాల సంధీ అనుబంధాలుగా చేర్చబడయింది. దాని పీఠికలో డెయ్‌ల్ రాజ్యాంగ నిర్మాణ సభగా మారి ప్రజలకున్న న్యాయమైన భగవద్దత్తాధికారాన్ని ఉపయోగించి స్వతంత్ర ఐరిష్ రాజ్యాన్ని స్థాపించినదే ప్రకటన చేర్చినారు. రాజ్యాంగ శాసనంలో ఏ నిబంధనగానీ దాని ననుసరించి చేసిన ఏ చట్టంగానీ బ్రిటిష్ - ఐరిష్ ఫ్రీ స్టేట్‌లు చేసుకొన్న సంధికి విరుద్ధమైతే చెల్లదని నొక్కి చెప్పినారు. ఐరిష్ రాజ్యాంగ శాసనానికి అనుబంధమైన రాజ్యాంగమే 'స్వతంత్ర ఐరిష్ రాజ్య' రాజ్యాంగమని డిసెంబర్‌లో బ్రిటిష్ పార్లమెంట్ ఒక చట్టం చేసింది. 1922 డిసెంబర్ ఆరో తేదీనాడు వెలువడిన రాజ ప్రకటన 'స్వతంత్ర ఐరిష్ రాజ్య' రాజ్యాంగాన్ని అమలులోకి తెచ్చింది.

## స్వతంత్ర ఐరిష్ రాజ్య రాజ్యాంగము

శాసన సభలోని ప్రధాన భాగాలు (Oireachtas) 1. రాజు 2. డిప్యూటీల (ప్రతినిధుల) సభ (డెయ్‌ల్ ఈరియన్) 3. సెనేట్ (Seanad Eireann - సేనాడ్ ఈరియన్). స్వతంత్ర ఐరిష్ రాజ్యపు శాంతి, క్రమస్థితి, సత్పరిపాలనకై శాసనాలు చేసే అధికారం సంపూర్ణంగా ఈ శాసన సభకే ఇచ్చినారు. స్వతంత్ర ఐరిష్ రాజ్య వ్యవహారాలలో బ్రిటన్ పార్లమెంట్ కెట్టి జోక్యం ఉండరాదనే దీని భావము. కాని ఈ రాజ్యాంగాన్ని ఆమోదిస్తూ బ్రిటిష్ పార్లమెంట్ చేసిన శాసనంలో "ఏ యే సందర్భాలలో స్వపరిపాలన మనుభవించే ఇతర బ్రిటిష్ డొమినియన్‌ల విషయమై బ్రిటిష్ పార్లమెంట్‌కు శాసనాలు చేయటానికి అధికారముందో ఆ విషయాలలో స్వతంత్ర ఐరిష్ రాజ్య సంబంధమై చట్టాలు చేయటానికి బ్రిటిష్ పార్లమెంట్ కధికారముంది" అని విశదీకరించినారు. కాని అంతమాత్రంచేత బ్రిటిష్ పార్లమెంట్ ఐరిష్ వ్యవహారాలలో జోక్యం కలగజేసుకొంటుందని తలచటం పొరపాటు. ఒక డొమీనియన్ కోరితేగాని ఆ డొమీనియన్ విషయంలో బ్రిటిష్ పార్లమెంట్ శాసనం చేయదనే సంప్రదాయం అప్పటికే ఏర్పడింది. 1931 వెస్ట్‌మిన్‌స్టర్ స్టాట్యూట్ ఆ సంప్రదాయానికి లిఖిత రూప మిచ్చింది.

ఎన్నిక నిబంధనలు పాటించిన 21 ఏళ్ళు నిండిన స్వతంత్ర ఐరిష్ రాజ్య పౌరులు మాత్రమే డెయ్‌ల్ సభ్యులను ఎన్నుకోవలసినవారు. 1922 స్వతంత్ర ఐరిష్ రాజ్య శాసనం

ప్రకారం 30 ఏళ్లు నిండిన పౌరులందరూ శాసన సభలోని రెండు సభలు ఏర్పరిచిన పేర్ల పట్టిక నుంచి సెనేట్ సభ్యులను ఎన్నుకోవలసి ఉంది. 1928 లో చేసిన రాజ్యాంగ శాసన సవరణల ఫలితంగా, డెయిల్ ఈరియన్, సెనేట్‌ల సభ్యు లందరు కూడి సమావేశమైన సభకు, దామాషా ప్రాతినిధ్య విధానాన్ని అనుసరించి సెనేట్ సభ్యులను ఎన్నుకొనే హక్కు ఏర్పడింది. ఆర్థిక సంబంధమైన చట్టాల విషయంలో డెయిల్ సభకే అధికారము; కాని, సెనేట్ తనకు తోచిన ఆర్థిక సూచనలను డెయిల్‌కు పంపవచ్చు. మిగతా చట్టాలను సవరించ టానికి పరిమితాధికారము, అవి శాసనాలవటంలో కొంత ఆలస్యం చేయటాని కధికారము సెనేట్‌కు ఉంది. రెండు శాసన సభలూ ఆమోదించిన శాసనాన్ని, రాజు పేరిట గవర్నర్ జనరల్ అనుమతించవచ్చు, నిరాకరించవచ్చు, లేదా రాజు అనుమతి పొందటానికి పంప వచ్చు కాని కడపటి రెండధికారాలు నామమాత్రాలేననీ, గవర్నర్ జనరల్ వానిని వినియో గించుకోరాదని అందరికీ తెలిసిన విషయమే నిరాకరించటంలోనూ, రాజానుమతికి పంపటం లోనూ కెనడాలో అనుసరిస్తున్న చట్టము, ఆచారము, సంప్రదాయాలే ఐరిష్ గవర్నర్ జనరల్ కూడా అనుసరించవలెనని ఒక అనుబంధాన్ని రాజ్యాంగ శాసనానికి చేర్చినారు. కెనడాలో ఆ రెండు అధికారాలు చాలా కాలంగా ఉపయోగంలో లేవు ఫలితం స్వతంత్ర ఐరిష్ రాజ్య శాసన సభ ఆమోదించిన శాసనాలు రాజానుమతిని తప్పక పొందుతూ ఉన్నాయి.

రాజ్యాంగానికి సవరణలు కొన్నేళ్ళపాటు సామాన్య శాసనాలవలెనే చేసే వీలుండవలె నని రాజ్యాంగ శాసనకర్తలు భావించి ఎనిమిదేళ్ళ కాలం శాసనసభ కటువంటి సవరణల కధికార మిచ్చి తరవాత శాసనసభ చేసే సవరణలు వోటర్‌ల ఒప్పుదల పొందవలెనని విధించినారు కాని, 1929 లో చేసిన రాజ్యాంగ సవరణ ఆ ఎనిమిదేళ్ళ పరిమితిని పదహారేళ్లకు పెంచి నారు. 16 ఏళ్ల తరవాత రాజ్యాంగ సవరణ మొదట శాసనసభ చేసి తరవాత వోటర్‌ల పట్టీలో ఉన్న వారిలో అధిక సంఖ్యాకులచేగాని, వోట్ చేసిన వారిలో మూడు వంతులలో రెండు వంతుల మందిచేతగాని అది ఆమోదం పొందవలెనని నిబంధన చేసినారు. దాని ఫలితం స్వతంత్ర ఐర్లండ్ జీవితంలో మొదటి పదేళ్లలోను శాసన సభ రాజ్యాంగంలో 18 సవరణలు చేసింది.

## పరిపాలనాధికారం ఎవ్వరిలో నిక్షిప్తం కావలె?

పరిపాలనాధికారం ప్రజలనుంచి సంక్రమించినదని, కార్యనిర్వహణాధికారం రాజు నందు నిక్షిప్తమయిందనీ దానిని కెనడా డొమినియన్‌లో చెలాయిస్తూ ఉన్న విధంగానే రాజ ప్రతినిధి అయిన ఐర్లండ్ గవర్నర్ జనరల్ ఐర్లండ్‌లో రాజకార్య నిర్వహణం గావించవలె నని ఐరిష్ రాజ్యాంగం స్పష్టీకరించింది. రాజ్యాంగ శాసనంలోనూ బ్రిటన్ - ఈరియన్ సంధి లోనూ ఈరియన్‌రాజ్య గవర్నర్ జనరల్‌ను నియమించినట్లే కెనడా గవర్నర్ జనరల్‌ను నియమించవలెనని ఉంది. 1930 సం. కు ముందు బ్రిటిష్ మంత్రివర్గం సూచించిన వ్యక్తినే డొమినియన్ గవర్నర్ జనరల్‌గా రాజు నియమించేవాడు. కాని గవర్నర్ జనరల్‌గా నియ మితుడయ్యే ఆ వ్యక్తి ఆ డొమినియన్ మంత్రివర్గాని కిష్టుడైనవాడుగా ఉండేటట్లు బ్రిటిష్ మంత్రివర్గం చూసేది. అందువల్ల స్వతంత్ర ఐరిష్ రాజ్య గవర్నర్ జనరల్‌గా ఆ రాజ్య మంత్రివర్గం సూచించిన వానినే రాజు నియమిస్తున్నాడు. ఆ ఐరిష్ గవర్నర్ జనరల్ బ్రిటిష్

దొరతనపు 'ఏజంట్' కాదు. ప్రతి సందర్భంలోను తన మంత్రుల సలహాలను అనుసరించి నడుచుకోవలసిన వాడవటంవల్ల తన కార్య నిర్వహణలో అతనికి స్వతంత్ర విచక్షణాధికార మేమీ లేదు. కాని ప్రజాసమస్యల గురించి ప్రభుత్వ మనుసరించవలసిన విధానం విషయంలో తన మంత్రులతో చర్చించి వారిని ఒప్పుకొనేటట్లు చేయటానికి ఆయనకు స్వేచ్ఛ ఉంది.

రాజ్యాంగ శాసనం ప్రకారం, కాబినెట్ అనే కార్య నిర్వాహక సమితికి పన్నెండు మందికి మించని, అయిదుగురికి తగ్గని మంత్రులను - కార్యనిర్వాహక సమితి అధ్యక్షుడు నియమించి డెయిల్ ఆమోదించిన వారిని నియమించటానికి గవర్నర్ జనరల్‌కు అధికార ముంది. వారందరూ డెయిల్ సభ్యులు అయి ఉండవలె. 1929 రాజ్యాంగపు సవరణ చట్టం ఆ మంత్రులలో ఒక్కడు సెనేట్ సభ్యుడై ఉండవలెనని విధించింది. బ్రిటిష్ రాజ్యాంగంలో శాసన సభకు మంత్రులు బాధ్యతవహించి ఉండవలసినట్లు విధించే నిబంధన ఏదీ లేదు. కాని స్వతంత్ర ఐర్లండ్ రాజ్యాంగంలో శాసన సభకు మంత్రులు బాధ్యులని స్పష్టంగా ఉంది. అధ్యక్షుడు డెయిల్‌లో అధిక సంఖ్యాకుల విశ్వాసం పోగొట్టుకొంటే అతడు తాను నియమించిన కార్యనిర్వాహక వర్గంతోబాటు వైదొలగవలసినదేనని విశదమయి ఉంది. గ్రేట్ బ్రిటన్ మంత్రులపట్ల విశ్వాసరాహిత్య తీర్మానం కామన్స్ సభ ఆమోదిస్తే వారు రాజీనామా లివ్వవచ్చుగాని, వారట్లా చేయక పార్లమెంట్‌ను రాజుచే రద్దు చేయించి తిరిగి శాసన సభకు జనరల్ ఎన్నికలు జరిపించే అధికారం వారికి ఉంది. ఈ అధికారాన్నే బెత్తాన్ని చూపించి కామన్స్ సభ్యులలో చాలామంది తమపై విశ్వాస రాహిత్యం ప్రకటించకుండేటట్లు బ్రిటిష్ మంత్రులు చేయగల్గుతున్నారు. ఈ వీలు ఈరియన్ కార్యనిర్వాహక సమితికి లేదు. ఈరియన్ కార్యనిర్వాహక సమితి అధ్యక్షుని పేర్కొనే అధికారం డెయిల్ సభకు ఉంది. దానిలో గవర్నర్ జనరల్‌కు భాగం లేదు. ఐరిష్ రాజ్యాంగంలో ఇంకో చిత్రమైన ఏర్పాటు ఉంది. డెయిల్ నియమించిన వారిని కార్యనిర్వాహక సమితి సభ్యులు కాకుండా ప్రభుత్వంలో ఆయా శాఖలకు మంత్రులుగా నియమించటానికి గవర్నర్ జనరల్ కధికార ముంది. కాని ఈ విధంగా నియమితుడైన మంత్రి, తాను వ్యక్తిగతంగా, తన శాఖ పరిపాలనా నిర్వహణానికి డెయిల్‌కు బాధ్యత వహించవలసి ఉంది. ఇటువంటి మంత్రికి 'విదేశ మంత్రి' (External Minister) అని పేరు. ఇట్టి మంత్రులను నియమించవచ్చుగాని, నియమించితీరవలెననే నిర్బంధ మేమీ లేదు. ఇట్లా నియమితులైనవారు చాలా కొద్దిమందే. 1927 తరవాత నియమితుడైన విదేశ మంత్రి ఒక్కడూ లేదు.

## స్వతంత్ర ఐరిష్ రాజ్యంలో న్యాయశాఖ

ఐరిష్ రాజ్యాంగ శాసనం న్యాయశాఖ నిర్మాణాన్ని శాసన సభకు అప్పగించింది. రాజ్యంలోని వివిధ మండలాలలో న్యాయస్థానాలను, వాటిపైని ఉన్నత న్యాయస్థానాన్ని (High Court), అన్నింటిపై పరమోన్నత న్యాయస్థానాన్ని (Supreme Court) స్థాపించవలెనని రాజ్యాంగ శాసనం సంకల్పించింది. ఉన్నత న్యాయస్థానానికి సివిల్ క్రిమినల్ వ్యాజ్యాలు పరిష్కరించటానికి స్వతస్సిద్ధమైన అధికార ముంది. పరమోన్నత న్యాయస్థానానికి అపీళ్ళను పరిష్కరించటానికి సంపూర్ణమైన అధికారం ఇచ్చినారు. ఈ న్యాయస్థానాల నిర్మాణము, విచారణ విధానము వీటన్నిటికి దిగువ ఉండే స్థానిక న్యాయస్థానాల

స్థాపనము శాసన సభకు అప్పగించడమయింది. కార్యనిర్వాహక సమితి సలహా ప్రకారం న్యాయాధిపతులను గవర్నర్ జనరల్ నియమించవలసిన వాడయినాడు. ఉన్నత, పర మోన్నత న్యాయస్థానాలలోని న్యాయాధిపతులను వారు అవినీతికి పాల్పడినా, అశక్తులైనా తొలగించవచ్చునే గాని ప్రభుత్వం తన ఇష్టం వచ్చినట్లు తొలగించలేదు అప్పుడైనా శాసన సభలోని రెండు సభలు తీర్మానిస్తేగానీ వారిని తొలగించే వీలులేదు అమెరికాలో ఉన్నట్లే స్వతంత్ర ఐర్లండ్‌లో ఉన్నత న్యాయస్థానాలు రాజ్యాంగాన్ని సంరక్షించే బాధ్యతను వహిస్తున్నాయి శాసనాలు రాజ్యాంగ విరుద్ధాలని రద్దుచేయటానికి వాటి కధికారమున్నది. ఉన్నత న్యాయస్థానం తీర్పులపై అపీళ్ళను విచారించి పరిష్కరించే అధికారం పరమోన్నత న్యాయస్థానానికే ఉంది పరమోన్నత న్యాయస్థానం తీర్పు తుదిమాట దాని అధికారం మిగులులేనిది

ఇంత ఖండితంగా పరమోన్నత న్యాయస్థానాధికారం నిర్వచించినప్పటికీ దానికి క్షతిగా, తద్విరుద్ధంగా రాజ్యాంగంలో అనుబంధంగా ఈ మాటలు చేర్చినారు. "పరమోన్నత న్యాయస్థానం తీర్పులపై అపీల్ చేయటానికి సభాధిష్ఠుడైన రాజును ప్రత్యేకానుమతి దయ చేయమని కోరటానికి ఏ వ్యక్తికిగాని అధికారమున్నది అట్లాంటి అనుమతిని ఇవ్వటానికి సభాధిష్ఠుడైన రాజుకు అధికారముంది " అట్లాంటి అపీళ్ళను పరిష్కరించేది ప్రివీ కౌన్సిల్‌లోని న్యాయసమితి (Judicial Committee of the Privy Council) ఆ న్యాయసమితి తీర్పును అమలుచేయటానికి ఆజ్ఞ ఇచ్చేది సభాధిష్ఠుడైన రాజు , అంటే అమలు జరపవలసినది బ్రిటిష్ దొరతనం వారు. ఈ అనుబంధ సూత్రం ఐర్లండ్ స్వపరిపాలనాధికారానికి పెద్ద దెబ్బ అని ఐరిష్ ప్రభుత్వం వాదించింది 1926 లో జరిగిన బ్రిటిష్ సామ్రాజ్య సభలో డొమినియన్ న్యాయస్థానాల నుంచి ప్రివీ కౌన్సిల్ న్యాయసమితికి అపీళ్ళు పంపే విషయం చర్చకు వచ్చింది ఏ డొమినియన్ ప్రభుత్వంపైగాని దాని ఇష్టానికి విరుద్ధంగా ఆ డొమినియన్ న్యాయస్థానాల నుంచి ప్రివీ కౌన్సిల్‌కు అపీళ్ళను బలవంతంగా రుద్దటం బ్రిటిష్ ప్రభుత్వ విధానం కాదనీ బ్రిటిష్ దొరతనం స్పష్టీకరించింది స్వతంత్ర ఐర్లండ్ రాజ్యం నుంచి బ్రిటిష్ ప్రివీ కౌన్సిల్‌కు అపీళ్ళు పంపటాన్ని ఏనాడో మానినారుగానీ 1933 నాటికిగానీ అట్లాంటి అపీళ్ల పంపటాన్ని గురించి రాజ్యాంగంలో చేర్చిన అనుబంధ నియమం తొలగిస్తూ ఐరిష్ శాసన సభ రాజ్యాంగం సవరణ చట్టాన్ని చేయలేదు బ్రిటిష్ పార్లమెంట్ పరిపాలనలో దక్షిణ కేథలిక్ ఐర్లండ్ అనేక అత్యాచారాలకు గురిఅయిన విషయం మరవకపోవటంవల్ల తమ పార్లమెంట్‌కు విశృంఖల అధికారం కట్టబెట్టటానికి ఐరిష్ ప్రజలు వెనకాడినారు అందువల్ల వారు తమ రాజ్యాంగ శాసనంలో తమ జాతీయ, వ్యక్తిగత స్వాతంత్ర్యాలను కాపాడుకోవటానికి కొన్ని ప్రాథమికమైన హక్కులను (Fundmental Rights) గురించి ప్రకటనలను పొందు పరిచినారు. ఇట్లాంటివి ఆనాడు ఏ బ్రిటిష్ డొమీనియన్ రాజ్యాంగ శాసనంలోనూ లేవు

రాజ్యాంగ శాసనపు మొదటి నియమం బ్రిటిష్ కామన్‌వెల్త్ పేర ఉన్న రాజ్యాల కూటమిలో గ్రేట్ బ్రిటన్‌తోను ఇతర డొమనియన్‌లతోను సమాన ప్రతిపత్తి స్వతంత్ర ఐరిష్ రాజ్యానికి ఉన్నదని కంఠోక్తిగా ప్రకటిస్తూ ఉన్నది. ఈ నియమాన్నే 1926 లో జరిగిన బ్రిటిష్ కామన్‌వెల్త్ మహాసభ కింది విధంగా గుర్తించింది. "బ్రిటిష్ కామన్‌వెల్త్‌లోని సభ్య రాజ్యాలన్నీ, స్వతంత్ర ఐరిష్ రాజ్యంతోసహా స్వతంత్ర, సమాన ప్రతిపత్తిగలిగి ఏ ఒక రాజ్యము మరొక రాజ్యానికి తన అంతరంగిక విదేశ వ్యవహారాలలో ఏ విధంగానూ

లోబడి ఉన్నట్టిది గాదు." ఐరిష్ వారి ప్రజారాజ్యాభిమానము, జాతీయభావము ఈ ప్రకటనలో స్ఫురిస్తున్నాయి "రాజకీయాధికారము అంతా పరిపాలనాధికారాలన్నీ ఐర్లండ్ ప్రజల నుంచి సంక్రమించినవే." దీని భావము అవి అన్యజాతి, అన్య ప్రభుత్వాల వితరణవల్ల వారికి లభించినవి గావు. ప్రత్యేక ఐరిష్ పౌరసత్వాన్ని నిర్వచించి, స్పష్టీకరించటమేకాక తమ జాతీయ భాషగా ఐరిష్ భాషను అవలంబించటంలో వారి జాతీయతాభావం ప్రదర్శితమవుతూ ఉంది. అయినా పరిపాలనలో ఐరిష్ భాషతోబాటు ఇంగ్లీష్ భాష వాడటాన్ని కూడా గుర్తించ టంలో వారి రాజనీతిజ్ఞత వెల్లడవుతూ ఉంది. 1. వ్యక్తిస్వేచ్ఛ 2. గృహ స్వాతంత్ర్యము 3. పూజా స్వాతంత్ర్యము, మనస్సాక్షి స్వాతంత్ర్యము, 4. అభిప్రాయ ప్రకటన స్వేచ్ఛ 5. శాంతికి భంగం రాకుండా సభ గూడి సంఘంగా ఏర్పడే స్వేచ్ఛ 6. స్వతంత్ర ఐరిష్ రాజ్య పౌరులకిందరికీ ఉచిత ప్రారంభ విద్యాబోధనకు గల స్వేచ్ఛ – ఈ స్వేచ్ఛలను ఐరిష్ పౌరుల మూలస్వత్వాలని ఘోషిస్తూ ఉంది.

### ఐరిష్ జాతీయవాదులలో చీలికలు

గ్రేట్‌బ్రిటన్ – ఈరియన్ 1921 సంధి ఐరిష్ జాతీయవాదులలో చీలిక లేర్పడటానికి కారణమయింది. 64 మంది సంధి కంగీకరించినా 57 మంది దానిని వ్యతిరేకులవటం ఐరిష్ జాతీయవాదులలో తీవ్ర భేదాభిప్రాయాలున్నవనీ స్పష్టం చేస్తూ ఉంది. స్వతంత్ర ఐరిష్ రిపబ్లిక్‌ను తీవ్రంగా వాంఛించే పక్షానికి నాయకుడు డివాలీరా తన డెయిల్ అధ్యక్షపదవిని వెంటనే వదలుకొన్నాడు. పై సంధి చేసుకొన్న ఐరిష్ ప్రతినిధి వర్గ సభ్యుడు మైకేల్ కాలిన్స్ 1922 జనవరిలో నెలకొల్పిన తాత్కాలిక ఐర్ ప్రభుత్వానికి నాయకత్వం వహించినాడు. ఆరు నెలలు దాటేలోగా అంతర్యుద్ధం వచ్చింది. విప్లవం ఒక్క సంవత్సరం సాగి, 1923 అక్టోబర్ నవంబర్ ప్రాంతానికిగాని అంతమయింది కాదు. అయినా అక్కడక్కడ రహస్య విప్లవ సైనిక సంఘాలు మరికొంత కాలం అలజడులు సాగిస్తూనే ఉన్నాయి. తాత్కాలిక ప్రభుత్వానంతరం స్వతంత్ర ఐరిష్ రాజ్యానికి టిమొతి హీలీ (Thimothy Healy) మొదటి గవర్నర్ జనరల్‌గా నియమితుడైనాడు. విలియమ్ థామస్ కాస్‌గ్రేవ్ కార్యనిర్వా హక సమితికి మొదటి అధ్యక్షుడై పదేళ్ళు 1932 వరకు ఆ పదవిని అలంకరించినాడు. గ్రిఫిత్ కాలిన్స్‌లు ఇరువురూ కొత్త రాజ్యాంగం అమలులోకి రాకముందే గతించినారు. కాస్‌గ్రేవ్ తన పదవీ కాలంలో బ్రిటిష్ కామన్‌వెల్త్ స్వరూప, స్వభావాలలో ముఖ్యమైన మార్పులు తేవటంలో ప్రధానపాత్ర వహించినాడు. 1926 లో జరిగిన బ్రిటిష్ సామ్రాజ్య సభ్య రాజ్యాల సమావేశంలో ఈరియన్ రాజ్య ప్రతినిధులు నాయకత్వం వహించి, బ్రిటిష్ కామన్‌వెల్త్‌లోని రాజ్యాలన్నీ, సమాన స్వతంత్ర ప్రతిపత్తి గలవి అనే సిద్ధాంతం ప్రతిపాదించి దానిని అందరూ అంగీకరించేటట్లు చేసినాడు. ఒక విదేశంతో, స్వతంత్రించి, రాయబారులను పరస్పరం గ్రహించటంలో దారి చూపినది కాస్‌గ్రేవ్ ఆధిపత్యంలో ఉన్న స్వతంత్ర ఐర్లాండ్ రాజ్యమే. 1931 లో బ్రిటిష్ ప్రభుత్వ ప్రమేయం లేకుండా విదేశాలతో సంప్రతింపులు సాగించి సంధి చేసుకొనే మార్గం ఇతర డొమినియన్‌లకు చూపినది ఈరియన్ రాజ్యము.

స్వతంత్ర ఐరిష్ రాజ్యానికి బద్ధులైనవారు ఐరిష్ పార్లమెంట్‌కు ప్రజలు ఎన్నుకొన్న ప్పుడు తమ సభ్యత్వ పదవిలో ప్రవేశించడానికి ముందు, గ్రేట్ బ్రిటన్ ఈరియన్ దేశాల

సంధి పత్రంలో విధించినట్లు బ్రిటిష్ రాజు ఐదో జార్జ్ పట్ల అతని సంతతి వారిపట్ల తాము విశ్వాసం కల్గి ఉంటామని ప్రమాణం చేయటం అసంబద్ధం కాదా అని కొందరు డెయిల్ సభ్యులు తమ ఆక్షేపణ తెలిపినారు. ఐరిష్ జాతీయుడు గ్రేట్ బ్రిటన్ పౌరుడు కావటానికి వీలుండగా, ఈరియన్ బ్రిటిష్ జాతీయ సమాఖ్య (British Commonwealth) లో సభ్య దేశమై ఉంటే అటువంటి ప్రమాణం చేయడం ఉచితమేనని, రాజుపట్ల విశ్వాసం ప్రధానమని, స్వతంత్ర ఐరిష్ రాజ్యం పట్ల భక్తి విశ్వాసాలు చూపుతానన్నదే పార్లమెంట్ సభ్యుడు చేసే ప్రమాణంలో ముఖ్యభాగమని, అందువల్ల ఆ విధంగా ప్రమాణం చేయని ప్రతి నిధిని పార్లమెంట్ సభ్యునిగా అనుమతించటానికి వీలులేదని కాస్‌గ్రేవ్ పట్టుబట్టినాడు.

కొన్ని ఏళ్ళు తీవ్ర రిపబ్లికన్ వాదులు పార్లమెంట్‌కు ఎన్నికయి ప్రమాణం చేయటానికి నిరాకరించినందువల్ల డెయిల్ సమావేశాలకు వారిని రానివ్వలేదు. ఎన్నికయినట్లయితే ఆ విధంగా ప్రమాణం చేస్తానని వాగ్దానం చేసినవారుకాని ఎన్నికలలో పాల్గొనటానికి అనర్హులని 1927 లో చేసిన చట్టం ప్రకటించింది. ఆ చట్టం ఎన్నికయిన తరవాత నిర్ణీతకాలంలో ప్రమాణం చేయనివారి పార్లమెంట్ సభ్యత్వాన్ని రద్దు చేసింది. అందువల్ల విధిలేక పరిస్థితులకు తల ఒగ్గి, డివాలీరా పక్షపు (ఫీయన్నా ఫేల్) సభ్యులు ఆ ప్రమాణంచేసి డెయిల్‌లో ప్రవేశించి పరిస్థితులు తమ కనుకూలించే వరకూ వేచి ఉండటానికి నిశ్చయించినారు. 1927లో డెయిల్ మొత్తం 158 మంది సభ్యులలో డివాలీరా పక్షంవారు 57 మంది. అయిదేళ్ళ తరవాత 1932 లో జరిగిన ఎన్నికలలో ఫీయెన్నా ఫేల్ 72 స్థానాలను గెల్చుకొంది. కార్మిక పక్షం వారు ఏడుగురు, వారితో కలియటంవల్ల వారికి డెయిల్ సభలో మెజారిటీ లభించింది. డివాలీరా పక్షం వారు దీనిని ఉపయోగించుకొని పార్లమెంటరీ సభ్యత్వ ప్రమాణాన్ని తొలగిస్తూ మొదట రాజ్యాంగ శాసనంలో సవరణ చేసినారు. అంత మాత్రాన ఈరియన్ - గ్రేట్ బ్రిటన్‌లు చేసుకొన్న సంధి ఈ ప్రమాణాన్ని విధించటంవల్ల, సంధికి విరుద్ధమైన ఏ రాజ్యాంగ శాసనంగానీ సవరణగానీ చెల్లదని సంధిలో ఉంది. అందువల్ల దీనిని తొలగిస్తూ 1932 మే నెలలో ఒక సవరణ చట్టం చేసి డెయిల్ ఆమోదించి సెనేట్‌కు పంపింది. ఆ సెనేట్‌లో కాస్‌గ్రేవ్ పక్షానికి మెజారిటీ ఉండటంవల్ల రాజ్యాంగ శాసనానికి డెయిల్ ప్రతిపాదించిన సవరణను తొలగించవలెననే తీర్మానం నెగ్గింది. కాని ఆ సెనేట్ సవరణలను డెయిల్ నిరాకరించి, తా ననుకొన్నట్లు రాజ్యాంగ శాసనాన్ని సవరణ చేసింది; రాజుపట్ల, అతని సంతతి పట్ల విశ్వాసం తెలియజేసే ప్రమాణాన్ని ఇకమీద డెయిల్‌కు ఎన్నికయ్యే ఏ సభ్యుడూ చేయవలసి ఉండదు. స్వతంత్ర ఐరిష్ రాజ్యాన్ని రిపబ్లిక్ మార్చే ఉద్యమంలో ఈ సవరణ ప్రధానమయింది.

1933 జనవరిలో శాసన సభకు సాధారణ ఎన్నికలు జరిగినాయి. డెయిల్‌లో మిగతా అన్ని రాజకీయ పక్షాలకు కలిసి వచ్చిన స్థానాలకంటె ఒక్క స్థానమెక్కువగా డివాలీరా పక్షం గెల్చుకొంది. ఈరియన్ రాజ్యాన్ని సంపూర్ణ రిపబ్లిక్‌గా మార్చే ప్రయత్నంలో మిగిలిన చర్యలు కొన్ని వెంట వెంటనే డివాలీరా ప్రభుత్వం తీసుకొంది. 1. ఆ తరవాత గవర్నర్ జనరల్ కాక కార్యనిర్వాహక సమితి పార్లమెంట్ (డెయిల్)కు ఏ యే పరిపాలనా కార్యాల కోసం ఎంతెంత ఖర్చు చేయవలసిందీ సూచించవలెనని డెయిల్ తీర్మానించింది. 2. చట్టాలను గవర్నర్ జనరల్ ఆమోదించక పోవటానికిగాని, హానిని రాజు ఆమోదించకుండటానికిగాని అవ

కాళమిచ్చే నిబంధన రాజ్యాంగ శాసనం నుంచి తొలగించినారు. 8. ఐరియన్ రాజ్య న్యాయ స్థానాలిచ్చిన తీర్పులపై ప్రివీ కౌన్సిల్‌కు అపీల్ చేసే హక్కు రద్దు అయింది. రాజ్యాంగంలో చేసిన ఈ సవరణల ఫలితంగా స్వతంత్ర ఐర్లండ్ పరిపాలనలో రాజుకు స్థానం లేకపోవటమే కాక గ్రేట్ బ్రిటన్‌కూ, స్వతంత్ర ఐరియన్ రాజ్యానికి మధ్య ఉండే సంబంధాలు బలహీన మయినవి. ఈ విధంగా మొదట స్వపరిపాలనను అనుభవించే బ్రిటిష్ కామన్‌వెల్త్ రాజ్యాలలో ఒకటై స్వతంత్ర ఐరిష్ రాజ్యం (Irish Free State) పేర అవతరించిన దక్షిణ ఐర్లండ్, తరవాత ఐర్ (Eire) గా నామాంతరం పొంది, 1949 లో బ్రిటిష్ కామన్‌వెల్త్ నుంచి విడిపడింది. 1936 లో గవర్నర్ జనరల్ పదవిని రద్దు చేస్తూ స్వతంత్ర ఐర్లండ్ ఒక శాసనం చేసింది. జనవాక్య సేకరణ (Referendum) మూలంగా 1937 లో స్వంత్ర ఐరిష్ రాజ్యాంగాన్ని రద్దుచేసి, దాని స్థానంలో ఐరిష్ ప్రజలు తమ రాజ్యాంగాన్ని స్వతంత్రంగా తామే నిర్మించుకొన్నారు.

## 1920 తరవాత ఉత్తర ఐర్లండ్

1920 ఐరిష్ స్వపరిపాలన చట్టాన్ని (Irish Home-rule Act) నిరాకరించి, దక్షిణ ఐర్లండ్ ఉత్తర ఐర్లండ్ నుంచి విడివ, బ్రిటిష్ డొమినియన్‌లలో ఒకటి అయినా ఉత్తర ఐరిష్ ప్రొటస్టెంట్ జిల్లాలు ఆరూ, గ్రేట్ బ్రిటన్ - ఉత్తర ఐర్లండ్ రాజ్యంలో ఒక ప్రత్యేక రాష్ట్ర విభాగంగా ఏర్పడి బ్రిటిష్ పార్లమెంట్‌తో తమ సంబంధాన్ని పోగొట్టుకొన్నవి కావు. 1922 డిసెంబర్ వరకూ ఐరిష్ గవర్నర్ జనరల్ పదవి రద్దు కాలేదు. 24000 నెల సరి జీతము ఉన్న పదవి రద్దు కావటంతో నెలకు 20000 రూపాయల జీతం తీసుకొనే ఇండియా రాజ్య ప్రతినిధే బ్రిటిష్ సామ్రాజ్యంలోని ఉద్యోగులందరిలోను మొదటి స్థానంగల పెద్ద జీతగాడైనాడు. ఆ నెలలో అతని స్థానాన్ని బ్రిటిష్ రాజు నియమించే గవర్నర్ తీసుకొన్నాడు. 1920 చట్టము ఉత్తర ఐర్లండ్‌కు ప్రత్యేకంగా ఒక ద్వంద్వ శాసన సభను ఏర్పాటు చేసింది.

దిగువ శాసన సభలో సభ్యులు 52 మంది. 1929 వరకు వారు దామాషా ప్రాతినిధ్య పద్ధతి ప్రకారం ఎన్నికయినారు. కాని తరవాత చెల్లని వోట్ల మెజారిటీని బట్టి ఎన్నికలో గెలుపు, ఓటమి నిర్ణయించటం జరుగుతున్నది. ఎగువ శాసన సభకు సెనేట్ అని పేరు. సెనేట్ అందులో సభకు 24 మందిని దిగువ శాసన సభ ఎన్నుకోగా, ఇద్దరు తమ పదవి రీత్యా (Exofficio) సభ్యు లవుతున్నారు. ఉత్తర ఐర్లండ్ ఆరు జిల్లాలనుంచి ప్రత్యేక నియోజకవర్గాలు 12 మందిని బ్రిటిష్ కామన్స్ సభకు తమ ప్రతినిధులుగా ఎన్నుకొంటున్నాయి. పరిపాలనా శాఖలు ఏడు. వాటి అధిపతులు ద్వంద్వ శాసన సభలో ఏ సభలోనైనా సభ్యులై ఉండవలె. ఏ శాసన సభలోనైనా వారు ప్రసంగించవచ్చు. ఉత్తర ఐరిష్ పార్లమెంట్ సార్వభౌమాధికారం ఉన్న శాసన సభ కాదు. రాజ్యాంగాన్ని మార్చడానికి దాని కధికారం లేదు. ప్రత్యేకంగా నిర్దేశించిన విషయాలలో ప్రవేశించటానికి దానికి ఏ విధమైన అధికారం లేదు. కాని 1999 ఐరిష్ ప్రభుత్వ శాసనం ఉత్తర ఐర్లండ్ పార్లమెంట్ హోదాను కొంత పెంచింది. ఆ పార్లమెంట్ కోరితేనేగాని ఉత్తర ఐర్లండ్ రాజ్యాంగంలో ఏ విధమైన సవరణ చేయరాదని 1949 చట్టం విధించింది. రాజకీయంగా డొమినియన్ ప్రభుత్వాల పరపతి పెరిగి

ఉన్న ఆ కాలానికి ఉత్తర ఐర్లండ్ ప్రజల రాజకీయాభిప్రాయాలకు బ్రిటిష్ పార్లమెంట్ అంత మాత్రం మన్నింపు ఇవ్వటంలో ఆశ్చర్యం లేదు ఉత్తర ఐరిష్ పార్లమెంట్ స్థానికంగా పన్నులు విధించవచ్చునేగాని ముఖ్యమైన పన్నులన్నీ విధించేది బ్రిటిష్ పార్లమెంటే. ఆ పన్నుల వల్ల వచ్చే ఆదాయానికి ప్రత్యేకంగా లెక్క ఉంచుతున్నారు ఉత్తర ఐర్లండ్‌లోని బ్రిటిష్ సామ్రాజ్య ఉద్యోగాల ఖర్చులు పోగా, సామ్రాజ్య ప్రభుత్వానికిచ్చే విరాళం పోగా మిగిలిన ద్రవ్యం ఉత్తర ఐరిష్ పార్లమెంట్‌కే అప్పజెప్పుతున్నది నిజానికి ఉత్తర ఐర్లండ్‌లోని ప్రభుత్వ ఉద్యోగులను గుర్తించి వ్యయమవుతున్న మొత్తంలో అయిదువంతులలో నాలుగు వంతులు వ్యయం చేసేది ఉత్తర ఐరిష్ ప్రభుత్వమే వ్యవసాయము, గృహవసతి కల్పించటం, ఆరోగ్యము, విద్య మొదలైన శాఖల పరిపాలనలో అది చాలా అభివృద్ధి సాధించింది. సామ్రాజ్య ఉద్యోగుల చేతులలో కొన్ని పరిపాలనా శాఖ ఉండటంవల్ల ఉత్తర ఐర్లండ్‌కు లాభమే కల్గినది.

*ఉత్తర ఐర్లండ్ ప్రభుత్వము, న్యాయశాఖ:* ఉత్తర ఐర్లండ్ కొక ప్రత్యేక న్యాయ శాఖ నిర్మాణం జరిగింది సామాన్య వ్యాజ్యాల తీర్పులపై బ్రిటిష్ ప్రభువుల సభకు అపీల్ చేసుకోవచ్చు. కాని ఉత్తర ఐర్లండ్ రాజ్యాంగానికి సంబంధించే తీర్పులు బ్రిటిష్ ప్రివీ కౌన్సిల్ లోని న్యాయసమితి (Judicial committee) కి నివేదించవలసి ఉంది. నివేదించవలసింది ఉత్తర ఐరిష్ ప్రభుత్వంగాని, బ్రిటిష్ హోమ్ సెక్రటరిగాని ఈ హోమ్ సెక్రటరీ ఉత్తర ఐరిష్ ప్రభుత్వానికి, బ్రిటిష్ ప్రభుత్వానికి మధ్యవర్తి

ఉత్తర ఐరిష్ రాజకీయాలలో ఎప్పుడూ అలజడి ఎక్కువ. ఆ రాజ్యం ప్రజలలో కేథలిక్‌లు తక్కువ - ప్రొటస్టెంట్‌లు అధిక సంఖ్యాకులు. వీరు బ్రిటన్‌తో తమ రాజ్యానికి దృఢమైన, శాశ్వతమైన సంబంధాలుండవలెననే వారు. ఇక కేథలిక్ ప్రజలు, ఉత్తర, దక్షిణ ఐర్లండ్‌లు ఏకరాజ్యమైతే కేథలిక్ ఆధిపత్యం సాధించవచ్చుగదా అని యోచించేవారు. అట్లాంటి కేథలిక్ ఆధిపత్యం భయంవల్లనే ఉత్తర ఐరిష్ ప్రొటస్టెంట్ పౌరులు దక్షిణ ఐర్లండ్‌తో కలిసి ఏక రాజ్యంగా ఏర్పడటానికి తీవ్ర వైముఖ్యం చూపినారు ప్రత్యేక ఉత్తర ఐరిష్ రాజ్యంలో తమది ఆధిపత్యము దక్షిణ ఐర్లండ్‌తో సంయోగమై తమ ప్రాధాన్యం పోగొట్టు కోవటానికి వా రిష్టపడకపోవటంలో ఆశ్చర్యం లేదు వందల సంవత్సరాల పాత పగలు ఐర్లండ్‌లో చల్లారే సూచనలేమీ కానరావటం లేదు. తమకు ప్రత్యేక రాష్ట్ర మేర్పడి అర్ధ శతాబ్దమైనా, ఉత్తర ఐరిష్ ప్రొటెస్టెంట్‌లు తమ ప్రభుత్వంలో కేథలిక్‌లకు తగు స్థానమిచ్చి వారి సద్భావాన్ని సంపాదించవలెననే ప్రయత్నం ఎన్నడూ చేసిన పాపాన పోలేదు. ఫలితము - కేథలిక్‌ల, ప్రొటస్టెంట్‌ల మధ్య ద్వేషానలం ఐర్లండ్‌లో ఈనాటికీ భగ్గుమని మండుతూనే ఉన్నది

## బ్రిటిష్ పార్లమెంట్‌కూ, బ్రిటిష్ సామ్రాజ్యంలో ప్రధాన భాగమైన ఇండియాతోను, ఇతర కాలనీలతోను ఉండిన సంబంధాలు : వాటి పరిణామము

ఇంగ్లండ్ రాజ్యాంగ చరిత్ర ప్రధానంగా ఇంగ్లీష్ ప్రజలకూ ఇంగ్లండ్ ప్రభుత్వానికీ మధ్య ఉండే సంబంధాలూ, వాటి పరిణామానికి చెందిందైనా, రెండో హెన్రీ కాలం నుంచే ఐర్లండ్ వేల్స్ దేశాల ఆక్రమణ ఫలితంగా మొదటి ముగ్గురు ఎడ్వర్డ్ రాజుల కాలంలో

స్కాట్లండ్‌ను ఆక్రమించే ఉద్దేశంతో చేసిన ప్రయత్నాల వల్లనూ (గ్రేట్ బ్రిటన్, ఐర్లండ్) అనే బ్రిటిష్ దీవుల పరిపాలనా సమస్యలతో ఇంగ్లీష్ పార్లమెంట్‌కు విడివడరాని సంబంధం ఏర్పడింది. క్రమంగా, శతాబ్దాలు గడచినకొద్దీ, మొదట్లో వేల్స్‌ను తనలో ఐక్యపరచుకొన్న ఇంగ్లండ్ స్కాట్లండ్ ఐర్లండ్ ప్రాంతాలను గూడా తన ఆధిపత్యం కిందికి తీసుకోగా, అవి పార్లమెంట్ పరిపాలనలోకి 1707 స్కాట్లండ్ ఐక్యశాసనము, 1801 ఐరిష్ ఐక్యశాసనాలవల్ల సంపూర్ణంగా ఎట్లా వచ్చేది. క్రమంగా దక్షిణ ఐర్లండ్ ఏ విధంగా తన స్వాతంత్ర్యాన్ని సాధించింది ఇంతవరకు వివరించడమయింది. కాని ఎలిజబెత్ రాణి పరిపాలన 1603 లో ముగిసేలోగా, బ్రిటిష్ రాజ్యం పొలిమేరలు ఐరిష్ సముద్రము, ఇంగ్లీష్ ఛానల్ (The English Channel), ఉత్తర సముద్రాలను (North Sea) దాటి దూర సముద్రాంతర భూములకు విస్తరించటం మొదలయింది. ఉత్తర అమెరికాలో అట్లాంటిక్ మహాసముద్ర తీరంలో వర్జీనియా కాలనీ స్థాపనతోను, రాణి దానపత్ర ఫలితంగా 1600 సం. లో తూర్పు ఇండియా వర్తక సంఘం ఇండియాలో వ్యాపార కేంద్రాలను ఆరంభించటంతోను బ్రిటిష్ చరిత్ర బ్రిటిష్ కాలనీల, బ్రిటిష్ సామ్రాజ్య చరిత్రగా మారటానికి అంకురార్పణ జరిగింది. దానితోబాటు బ్రిటిష్ పార్లమెంట్ పరిపాలనా పరిధి కూడా దూర సముద్రతీర భూములకు విస్తరించింది. అందువల్ల బ్రిటిష్ పార్లమెంట్‌కు తన సామ్రాజ్యంలో ప్రధాన భాగమయిన ఇండియాతోను, ఇతర కాలనీలతోను ఏర్పడిన రాజ్యాంగ సంబంధాలు, వాటిలో కలిగిన పరిణామాలు, బ్రిటిష్ రాజ్యాంగ చరిత్రలో ప్రముఖ స్థానాన్ని ఆక్రమిస్తున్నాయి.

## బ్రిటిష్ పార్లమెంట్‌కు ఇండియాతో సంబంధాలు

1600 సంవత్సరంలో తూర్పు ఇండియా దీవులతో వ్యాపారం సాగించటం కోసం లండన్ వర్తకుల సంఘానికి ఆజ్ఞా పత్రాన్ని (Charter) ఎలిజబెత్ రాణి అనుగ్రహించింది. ఈ పత్రం వర్తకుల సంఘానికి పరిపాలనాధికారాలే కాక కొన్ని శాసనాధికారాలను కూడా ప్రసాదించింది. 15 ఏళ్ళకు మాత్రమే కంపెనీ జీవితాన్ని 1600 అధికార పత్రం పరిమితం చేయగా మొదటి జేమ్స్ రాజిచ్చిన అధికార పత్రం కంపెనీకి శాశ్వతంగా ప్రాణం పోసింది. 1657 క్రామ్‌వెల్ చార్టర్ కంపెనీకి మూలధనాన్ని శాశ్వతంగా సంఘటితం చేసినాడు. రెండో ఛార్లెస్ 1661 లో ఇచ్చిన చార్టర్ కంపెనీ గవర్నర్‌లకు, వారి కౌన్సిల్‌లకు న్యాయ పరిపాలనాధికారా లిచ్చింది. 1707 వ సంవత్సరంలో ఔరంగజేబ్ పాదుషా చనిపోవటంతో మొగల్ సామ్రాజ్యం విచ్ఛిన్నం కాజొచ్చింది. దేశమంతటా లెక్కలేనంత మంది రాజులు, నవాబ్‌లు ఏర్పడినారు. ఈ అరాజక స్థితిని సిక్, మహారాష్ట్ర విజృంభణము పదింతలు చేసింది. ఈ పరిస్థితులలో పోర్చుగీస్, డచ్, ఫ్రెంచ్, ఇంగ్లీష్ వర్తక సంఘాలు తమ తమ సామ్రాజ్యాలను దేశంలో స్థాపించటం కోసం పరస్పరం తీవ్రంగా పోరాడినాయిగాని 1757 లో ప్లాసీ యుద్ధము, 1759 లో మచిలీపట్నంలో ఫ్రెంచ్ వారి ఓటమి, 1761 లో బక్సార్ యుద్ధము బెంగాల్, బీహార్, ఒరిస్సాలను, కృష్ణా, గోదావరి నదీ ముఖ ప్రాంతాలను ఆగ్రా, అయోధ్య ప్రాంతాలను ఇంగ్లీష్ తూర్పు ఇండియా వర్తక సంఘం అధీనం చేసింది. ఈ దేశంలోని కంపెనీ ఉద్యోగులు తమ అధికారాన్ని, పలుకుబడిని దుర్వినియోగం చేసి, ఫకీర్‌లుగా ఈ దేశానికి వచ్చిన వారు కూడా పాదుషాలుగా తమ దేశానికి వెనుదిరిగిపోగా, తాను సాగించిన

అనేక యుద్ధాల ఫలితంగా తూర్పు ఇండియా సంఘం చాలా అప్పులపాలై బ్రిటిషు ప్రభుత్వానికి ధన సహాయం చేయమని మొరపెట్టవలసి వచ్చింది. ధన మివ్వవలసి వచ్చిన బ్రిటిష్ ప్రభుత్వం ఇదే సమయమని తన పెత్తనాన్ని, అధికారాన్ని కంపెనీ నెత్తిపై రుద్దింది. 1772-78 రెగ్యులేటింగ్ చట్టంతో ఇండియా పరిపాలనలో బ్రిటిష్ పార్లమెంటరీ జోక్యం ప్రారంభమయింది. కంపెనీ పరిపాలన క్రమబద్ధం చేసే ఉద్దేశంతో చేసిన ఈ చట్టం ఇండియాలోని కంపెనీ సేవకులు తమ సొంత లాభం కోసం వ్యాపారం సాగించరాదని, స్వదేశీయుల నుంచి కానుకలు, లంచాలు గ్రహించరాదని శాసిస్తూ, కంపెనీ డైరెక్టర్లు సభాధిష్టులైన గవర్నర్ జనరల్ పంపే లేఖలు బ్రిటిష్ ప్రభుత్వానికి తెలియజేస్తూ ఉండవలెనని ఉత్తరువులు జారీ చేసింది. కంపెనీకి వచ్చే రాబడులను గురించి బ్రిటిష్ మంత్రివర్గంలోని కోశాధిపతికి, సైనిక, సామాన్య పరిపాలనను గురించిన వ్రాతలను బ్రిటిష్ ప్రభుత్వ కార్యదర్శులలో (Secretary of State) ఒకరికి నివేదించవలెనని ఈ చట్టం శాసించింది. ఇండియా గవర్నర్ జనరల్‌కు సలహాలివ్వటానికి కౌన్సిల్‌ను ఏర్పాటు చేయటమేకాక ఆరంభంలో ఆ కౌన్సిల్ నలుగురు సభ్యులను పార్లమెంటే నియమించింది. గవర్నర్ జనరల్‌తో చేరిన ఈ అయిదుగురికి బెంగాల్‌ను పరిపాలిస్తూ బొంబాయి, మద్రాసు గవర్నర్లపై పెత్తనం చేసే అధికారం ఇచ్చింది. అత్యవసర పరిస్థితులలో తప్ప బొంబాయి మద్రాస్ గవర్నర్లు స్వదేశపు రాజులపై స్వతంత్రించి యుద్ధాలు చేయటంగాని, వారితో సంధి చేసుకోవటంగాని కూడదని నిషేధించింది. వారు తమ రాష్ట్రాల పరిపాలనకు చేసే నియమాలు గవర్నర్ జనరల్ అతని కౌన్సిల్ సమ్మతిని పొందవలెనని, గవర్నర్లు గవర్నర్ జనరల్ ఆజ్ఞలను పాటించకపోతే వారిని తాత్కాలికంగా ఉద్యోగాలనుంచి తొలగించటానికి కూడా గవర్నర్ జనరల్ - కౌన్సిల్‌కు అధికార మివ్వడం జరిగింది. బ్రిటిష్ చట్టాలకు విరుద్ధంగాని నియమాలను, ఆజ్ఞలను తన రాష్ట్రం యొక్క సత్పరిపాలన కవసరమైనవి చేయటానికి ఈ కౌన్సిల్ కధికార మివ్వటం జరిగింది. ఆ నియమాలను కొత్తగా స్థాపించిన ఉన్నత న్యాయస్థానంలో రిజిస్టర్ చేయవలసినట్లు, వాటిని రెండేళ్ళలో సభాధిష్టుడైన బ్రిటిష్ రాజు రద్దు చేయవచ్చునని రెగ్యులేటింగ్ చట్టం విధించింది. ఉన్నత న్యాయస్థానానికి కంపెనీ ఉద్యోగులను ఎవరినైనా విచారించి, శిక్షించటానికి ఈ చట్టం అధికారమిచ్చింది. గవర్నర్లుగాని, గవర్నర్ జనరల్‌గాని అతని కౌన్సిల్ సభ్యులుగాని, ఉన్నత న్యాయస్థానపు న్యాయాధీశులుగాని, మరెవ్వరుగాని నేరాలు చేస్తే వారిని ఇంగ్లండ్‌లోని రాజుయొక్క బెంచ్ కోర్ట్ విచారించి శిక్షించవచ్చునని రెగ్యులేటింగ్ చట్టం విధించింది. ఇంకా కంపెనీ సేవలోని ఉన్నతోద్యోగులు లంచాల కాశపడకుండటానికి ఉదార వేతనాలిచ్చి అది సాయపడుతుందని, గవర్నర్ జనరల్‌కు 25000 పౌన్లు, అతని కౌన్సిల్ సభ్యులకు 10000 పౌన్లు, ప్రధాన న్యాయాధిపతికి 8000 పౌన్లు, ఇతర ఉన్నత న్యాయాధీశులకు 6000 పౌన్లు, సాలుసరి జీతాలు నిర్ణయించినారు. గవర్నర్ గవర్నర్ జనరల్‌కి జీతాలు వారి ఉద్యోగ నియామకాలు ప్రచురణ కాగానే ఇంగ్లండ్ బాంక్ (Bank of England) లో వారి ఉద్యోగ కాలము అయిదేళ్ళకు లెక్కచూసి జమకట్టటానికి, వా రిండియాలో ఉన్న కాలంలో వారి ఇతర వ్యయాలు ఇండియా గవర్నమెంట్ భరించటానికి ఏర్పాటు చేసినారు. గవర్నర్ జనరల్ తన కౌన్సిల్ సభ్యులలో అధిక సంఖ్యాకుల అభిప్రాయానికి లోబడి పరిపాలించవలసినట్లు ఒక నియమాన్ని ఈ చట్టంలో చేర్చి అన్ని

విధాలా కంపెనీ వారి ఇండియా పరిపాలన నిరంకుశంగాకుండటానికి, నిర్దుష్టం కావటానికి చక్కని ఏర్పాట్లు చేసింది. అది సాధించటానికి ఆ పరిపాలనపై బ్రిటిష్ మంత్రివర్గం పరిశీలనను, ఆధిపత్యాన్ని నెలకొల్పినందుకు బ్రిటిష్ పార్లమెంట్ ఎంతో సంతోషించింది. కాని పదేళ్ళు కాకముందే రెగ్యులేటింగ్ చట్టంవల్ల సంభవించిన కొన్ని అనర్థాలను తొలగించటానికి 1784 లో అది పిట్ ఇండియా చట్టాన్ని ఆమోదించవలసి వచ్చింది. దానికి ముందు 1781 లో పార్లమెంట్ రెగ్యులేటింగ్ చట్టానికొక సవరణ చట్టాన్ని చేసింది. అది ఉన్నత న్యాయస్థానపు అధికార పరిమితులను నిర్ణయించింది. కంపెనీ ఉద్యోగులను వారి ఉద్యోగ నిర్వహణలో ఉన్నత న్యాయస్థానపు జోక్యానికి చిక్కుకోకుండా, భారతీయులు బ్రిటిష్ న్యాయశాసనాలకు బలి కాకుండా, వారి శాస్త్రాధారాలను మన్నించేటట్లుగా, గవర్నర్ జనరల్ కౌన్సిల్ తమ నియమాలను ఉన్నత న్యాయస్థానంలో రిజిస్టర్ చేసుకోనవసరం లేకుండా, ఈ 1781 సవరణ చట్టం రక్షించింది. రాష్ట్ర న్యాయస్థానాలు 5000 పౌన్ల విలువకు లోబడిన వ్యాజ్యాలలో ఇచ్చిన తీర్పులపై గవర్నర్ జనరల్ కౌన్సిల్‌కు అపీల్ చేయవచ్చునని, ఆ విలువకు మించిన వ్యాజ్యాల విషయంలో బ్రిటిష్ రాజు కౌన్సిల్‌కు అపీల్ ఉంటుందని ఈ సవరణ చట్టం విధించింది. కాని రెగ్యులేటింగ్ చట్టాన్ని అమలుచేయటంలో ఉన్న ఇతర చిక్కులను తీర్చటానికి 1784 లో పిట్ ఇండియా చట్టం అవసరమయింది.

## పిట్ ఇండియా చట్టము

ఎక్స్ చెకర్ ఛాన్సలర్ (Chancellor of the Exchequor), స్టేట్ సెక్రటరీ, నలుగురు ప్రివీ కౌన్సిలర్‌లు మొత్తం ఆరుగురు సభ్యులుగల కంట్రోల్ బోర్డ్ (అజమాయిషీ సంఘము) ను కంపెనీ డైరెక్టర్ల సభపై అజమాయిషీ చేసే పనికోసం ఈ చట్ట మేర్పాటు చేసింది. కంపెనీ ప్రొప్రైటర్ల (సొంతదారులు) సభకు ఇండియా వ్యవహారాలపై ఎటువంటి అధికారము ఉండదు. డైరెక్టర్ల సభలో ముగ్గురు రహస్య సమితిగా ఏర్పాటై, సైనిక, రాజకీయాధి కారాలను చెలాయిస్తారు. కాని వారిపై ఇతర డైరెక్టర్‌లకు సొంతదారుల సభకు ఎటువంటి పెత్తనము ఉండదు. డైరెక్టర్ల రహస్య సమితికి భారతదేశంలోని కంపెనీ ఉద్యోగులకు జరిగే ఉత్తర ప్రత్యుత్తరాలన్నీ ఇకమీద కంట్రోల్ బోర్డులోని సీనియర్ సభ్యుని ద్వారా జరగవలసి ఉంటుంది ఆ సీనియర్ సభ్యుడు బోర్డ్ ఆఫ్ కంట్రోల్ ప్రెసిడెంట్ అనే పేరు వహించి కంట్రోలర్ సంఘాధికారాలన్నీ చెలాయిస్తుంది. ఆ సంఘంలోని ఇతర సభ్యులు నామమాత్రపు సభ్యులు మాత్రమే. కంట్రోల్ సంఘాధ్యక్షుడు బ్రిటిష్ కాబినెట్ మంత్రులలో ఒక్కడవటంవల్ల భారతదేశ పరిపాలన బాధ్యతను బ్రిటిష్ పార్లమెంట్ 1784 నుంచి వహించినట్లయింది. మద్రాసు, బొంబాయి రాష్ట్రాల గవర్నర్‌లు ఎటువంటి పరిస్థితులలోను స్వతంత్రించి గవర్నర్ జనరల్ సమ్మతిలేక స్వదేశ రాజులపై యుద్ధం ప్రకటించరాదు. సంధి చేయటానికి అధికారం గవర్నర్ జనరల్‌దే. అయనకూడా డైరెక్టర్ల సంఘం సమ్మతిలేకుండా యుద్ధం చేయటంగాని, సంధి చేసుకోవటంగాని చేయరాదు. గవర్నర్‌ల, గవర్నర్ - జనరల్ యొక్క కౌన్సిళ్ళ సభ్యుల సంఖ్య మూడింటికి తగ్గించినది. గవర్నర్ జనరల్‌ను మాత్రం బ్రిటిష్‌రాజు ఒప్పుదలతోనే డైరెక్టర్ల సభ నియమించవలసి ఉంటుంది. గవర్నర్‌లను, వారి కౌన్సిల్ సభ్యులను, గవర్నర్ జనరల్ కౌన్సిల్ సభ్యులను నియామకం చేయటానికి డైరెక్టర్ల సభ

కధికార మిచ్చిందిగాని గవర్నర్‌లను, గవర్నర్ - జనరల్‌ను ఉద్యోగాలనుంచి తొలగించే అధికారాన్ని పిట్ ఇండియా చట్టం బ్రిటిష్ రాజుకు ఇచ్చింది. అయినా కాలం గడిచేకొద్దీ కంపెనీ ఉద్యోగులలో ముఖ్యులను నియమించే అధికారం తన కున్నదని కంట్రోల్ సంఘం వాదించసాగింది. వెల్లస్లీ ఇండియా గవర్నర్ జనరల్‌గా ఉన్నప్పుడు ఈ వివాదం న్యాయ స్థానానికి తీసుకొనిపోగా, అది కంట్రోల్ సంఘాని కనుకూలంగా తీర్పు చెప్పింది. కాని 1858 లో ఛార్టర్ చట్టం వచ్చేటంతవరకు కంపెనీ పరిపాలనపై డైరెక్టర్‌ల సంఘానికి కంట్రోల్ సంఘంతోబాటు సమానాధికారాలలో సగం పెత్తనం నిల్చి ఉండేదనే చెప్పవలసి ఉంది. 1. ఇండియా వ్యవహారాలను గురించి విషయ పరిజ్ఞానం కంపెనీ డైరెక్టర్‌ల సంఘాని కున్నంతగాని, దానిలో పదవవంతైన కంట్రోల్ సంఘానికి లేకపోవటం. 2 ఉద్యోగ నియామకాధికారాన్ని చెలాయించటంలో డైరెక్టర్‌ల కంట్రోల్ బోర్డ్ సంఘం వారిని బ్రిటిష్ పరిపాలనాధికారులను సంతోష పెట్టగల్గిన స్థానంలో ఉండటం. 3. తమకు ఇండియావల్ల లభించే చాలా ధనంలో ఒక వంతును డైరెక్టర్‌ల సంఘం బ్రిటిష్ మంత్రివర్గ సభ్యులను, బ్రిటిష్ రాజకీయాలలో ప్రధాన వ్యక్తులను మంచి చేసుకోవటానికి వెచ్చించగల్గి ఉండటం ఈ పరిస్థితులు కంపెనీ డైరెక్టర్‌ల సభ చాలాకు అధికారాన్ని రక్షించినాయి. కాని, కంపెనీవారు భారతదేశంలో రాజ్య విస్తరణ చేయటంకోసం యుద్ధాది ప్రయత్నాలు సాగించేకొద్దీ (మెజా రిటీ), ఉన్న ప్రభుత్వ పక్షంపై ధన సాహాయ్యానికి, సైనిక సాహాయ్యానికి ఆధారపడవలసి ఉండటంవల్ల భారతదేశ పరిపాలనాధికారం పార్లమెంట్ స్వాధీనం గాకుండటానికి వీలులేదని చెప్పవలసి ఉంది. ఇటువంటి పరిస్థితుల ప్రాబల్యమే 1784 పిట్ ఇండియా చట్టం చేసిన డెబ్బై ఏళ్ళలో కంపెనీ ఉనికికి ప్రమాదం తెచ్చిపెట్టి, విశాల సామ్రాజ్యంపై పరిపాలనాధి కారాన్ని బ్రిటిష్ పార్లమెంట్‌కు కట్టబెట్టింది. ఈ కాలంలో భారతదేశ వ్యవహారాలు బ్రిటిష్ రాజకీయపక్షాల వివాదాలలో ప్రధాన పాత్ర వహించసాగినాయి.

1784-1858 *మధ్యకాలంలో ద్వంద్వ పరిపాలన:* ఇట్లా ఒకవైపు బ్రిటిష్ పార్ల మెంట్, మరొకవైపు తూర్పు ఇండియా వర్తక సంఘం భారతదేశంపై ద్వంద్వ పరిపాలన సాగించింది. పార్లమెంట్ 1813, 1833, 1853 సంవత్సరాలలో కంపెనీ అధికారాలను తగ్గిస్తూ, క్రమంగా భారతదేశ పరిపాలనను తన అధీనంలోకి తెచ్చుకొంటూ చట్టాలను చేసింది. 1786 చట్టం తన కౌన్సిల్ సలహాలను గవర్నర్ జనరల్ ఇష్టమైతేనే పాటించవచ్చునని, 1793 చట్టం గవర్నర్ జనరలేకాక రాష్ట్ర గవర్నర్‌లు కూడా తమ కౌన్సిల్‌ల సలహాలను తోసిపుచ్చవచ్చునని శాసించినాయి. 1793 ఛార్టర్ చట్టం తూర్పు ఇండియా వర్తక సంఘం జీవితాన్ని 1813 వరకు పొడిగించింది. కంట్రోల్ సంఘం ఉద్యోగుల వేతనాలు భారతదేశ ప్రభుత్వాదాయాలనుంచి చెల్లింపు కావలెనని ఈ చట్టం విధించింది. కంట్రోల్ సంఘము బ్రిటిష్ పరిపాలక వర్గంలో భాగమైనా, న్యాయవిరుద్ధంగా వారి వేతనాల భారాన్ని భారతదేశము, 1919 లో భారత ప్రభుత్వ శాసనం చేసినంతవరకు మోస్తూనే ఉంది.

1813 *ఛార్టర్ చట్టము:* తూర్పు ఇండియా వర్తక సంఘ జీవితాన్ని మరి 20 ఏళ్ళు పెంచింది. చైనాతో వ్యాపారం చేసే హక్కు ఈ సంఘానికి మాత్రమే ఉంది, భారతదేశంతో వ్యాపారం చేసే హక్కును కంపెనీ డైరెక్టర్‌ల వల్లగాని కంట్రోల్ సభ వల్లగాని లైసెన్స్ పొందిన బ్రిటిష్ పౌరుల కందరికీ ఈ చట్టం ప్రసాదించింది. కంట్రోల్ సభ (Board of

Control) అధికారాలను ఈ చట్టం హెచ్చించింది. భారతీయుల విద్యా వైజ్ఞానికాభివృద్ధి కోసం భారత ప్రభుత్వం ఏటా లక్ష రూపాయలను వెచ్చించవలెనని ఇది నిర్ణయించింది. ఈ విధంగా భారతీయ పౌరుల మనోవికాసానికి కృషి చేయవలసిన బాధ్యత బ్రిటిష్ ప్రభుత్వంపై ఉన్నదని పార్లమెంట్ మొదటిసారిగా గుర్తించింది.

1833 చార్టర్ చట్టము: 1813 లో భారతదేశంతో వర్తకం చేయటానికి మునుపున్న కంపెనీ గుత్తాధికారాన్ని తొలగించినట్లు చైనాతో కంపెనీకి ఉన్న వ్యాపారం చేసే గుత్తాధికారాన్ని తీసివేయటంతో ఆగక, అసలు కంపెనీ తన వ్యాపార వ్యవహారాలను పూర్తిగా కట్టిపెట్టి, భారతదేశ పరిపాలనపై తన శక్తియుక్తులను కేంద్రీకరించవలెనని 1833 చార్టర్ చట్టం నిర్ణయించింది.

కంట్రోల్ బోర్డ్ అధ్యక్షుడు ఇండియా వ్యవహారాల మంత్రి అయినాడు. ఆ బోర్డ్‌లోని ఇతర సభ్యుల స్థానంలో ఇద్దరు మంత్రికి సాయపడే కమిషనర్‌లు నియమితులైనారు. మంత్రి ప్రభు సభాసభ్యుడవటం తటస్థించిన అతని కార్యదర్శి కామన్స్ సభలో అతనికి ప్రతినిధిగా వ్యవహరించవలసి ఉంటుంది. 1833 చట్టం బెంగాల్ గవర్నర్ జనరల్‌కు భారతదేశ గవర్నర్ జనరల్ అని నామకరణం చేసింది. అతని కౌన్సిల్‌లోని ముగ్గురు సభ్యులతో బాటు ప్రత్యేకంగా శాసనాలను పర్యవేక్షించటానికి నాలుగో సభ్యుడు నియమితుడయినాడు. ఈ చట్టంవల్ల భారతదేశ గవర్నర్ జనరల్‌కు రాష్ట్ర ప్రభుత్వాలపై సంపూర్ణాధికారం లభించింది. గవర్నర్‌ల కౌన్సిల్‌లకు శాసనాధికారం తొలగించి గవర్నర్ జనరల్ కౌన్సిల్‌కే శాసనాధికారం పరిమితమైంది. మొదటి శాసన సభ్యుడైన మెకాలే ఆధ్వర్యంలో భారతీయ శిక్షాస్మృతి; సివిల్, క్రిమినల్ వ్యవహార విధాన స్మృతులు రచనలుగా వచ్చినాయి. ఇకమీద విద్యకై భారతదేశ ప్రభుత్వం వెచ్చించే ధనం ఆంగ్లేయ భాషను, వారి విద్యలను, విజ్ఞాన శాస్త్రాలను బోధించటానికి వినియోగించవలెననేగాని సంస్కృత, పర్షియన్ విద్యలను నేర్పటానికి కాదని నిర్ణయం జరిగింది. ఇంగ్లీష్ చరిత్రను, విజ్ఞాన శాస్త్రాలను నేర్పటంవల్ల, ఏనాటికైనా భారతీయులు కల్లు నెయ్యి, పాలు, పెరుగు సముద్రాలున్నాయని నమ్ముతారు. ఇతర అభూతకల్పనలనూ నమ్మే మూర్ఖత్వాన్ని వదిలి, హేతువాద బద్ధమైన వైజ్ఞానిక పథాలలో నడవనేర్చి తమ దేశాన్ని తామే పాలించుకొనే నేర్పును సంపాదించుకోగల్గుతారని మెకాలే ప్రభువు, ఆనాడున్న గవర్నర్ జనరల్ విలియమ్ బెంటిక్ ప్రభువు అభిప్రాయపడినారు. ఆచరణకు రాలేదుకాని, 1793 చార్టర్ చట్టము ఒక అమూల్యమైన ప్రకటన చేసింది. "భారతీయ పౌరుడెవడైనా ఇకముందు అతని మతము, జాతి, వర్ణము, పుట్టిన చోటునుబట్టి కంపెనీ సేవలో ఏ ఉద్యోగానికిగాని అనర్హుడుగా పరిగణించడం కాదు" 1793 చార్టర్ చట్టం భారతదేశ పరిపాలనలో ఏకత్వానికి ముందు రానున్న పార్లమెంటరీ ప్రభుత్వాధిపత్యానికి, భావి భారతీయ అభ్యున్నతి సాధనకు రాజ మార్గాలను ఏర్పరిచింది.

1858 చార్టర్ చట్టము: తూర్పు ఇండియా వర్తకసంఘము పరిపాలనాధికారాలను ఈ చట్టం, పార్లమెంట్ మరొక విధంగా నిర్ణయించేటంతవరకు అనుభవిస్తూ ఉండవచ్చునని అనుమతించింది. కేంద్ర శాసన సభకు ప్రతి రాష్ట్రము సంవత్సరానికి 5000 పౌన్ల జీతం మీద ఒక్కొక్క ప్రతినిధిని పంపవచ్చునన్నది. గవర్నర్ జనరల్ కార్యనిర్వాహక సభలో న్యాయసభ్యునికి శాశ్వత స్థానమిచ్చింది. అత్యున్నత న్యాయస్థానం ప్రధాన న్యాయాధిపతికి

అతని ఉద్యోగరీత్యా పై సభలో సభ్యత్వమిచ్చింది. కార్యనిర్వాహక సభ శాసన సభగా పనిచేసేటప్పుడు నాలుగు రాష్ట్రాల ప్రతినిధులు, ముఖ్య న్యాయాధిపతి, అతనితోబాటు మరొక న్యాయాధిపతి, భారతదేశ సర్వ సేనాధిపతి, గవర్నర్ జనరల్, అతని కార్యనిర్వాహక సభ్యులు నలుగురు, మొత్తం 12 మంది సభ్యులుంటారు. గవర్నర్ జనరల్ కౌన్సిల్‌కు ప్రస్తుతానికి బెంగాల్ కాక ఉపరాష్ట్రాధిపతిని నియమించటానికి అధికారమివ్వటం జరిగింది. భారతదేశంలో ఉద్యోగులను నియమించే అధికారము డైరెక్టర్ల కికమీద ఉండదని, పోటీ పరీక్షల మూలంగా ఉద్యోగులు నియమితులు కావలెనని 1858 చట్టం నిర్ణయించింది. శాసన ప్రతిపాదనలు ప్రత్యేక కమిటీలు విచారించి నివేదించవలెనని, అవి గవర్నర్ జనరల్ శాసన సభలో చర్చానంతరం శాసనాలవుతాయని, శాసన ప్రతిపాదనలు గవర్నర్ జనరల్ ఆమోదాన్ని ముందు పొంది ఉండవలెనని నిశ్చయించడమయింది. 1857 తో భారతదేశంలో రేగిన సైనిక విప్లవాన్ని కంపెనీ చేతకానితనానికి నిదర్శనంగా నిర్ణయించి, 1858 భారతదేశ పరిపాలనా శాసము - కంపెనీని భారతదేశ పరిపాలన నుంచి తొలగించి - భారతదేశ ప్రభుత్వాధికారం బ్రిటిష్ రాజు హస్తగతం చేసింది.

1858 *భారతదేశ పరిపాలనా శాసనము:* గవర్నర్ జనరల్ ఇకముందు రాజ ప్రతినిధిగా ఉంటాడు. కంపెనీ సేనలు రాజు సేనలవుతాయి. కంట్రోల్ సంఘము, డైరెక్టర్ల సంఘము రద్దయి, వాటి స్థానంలో 15 మంది సభ్యులున్న భారతదేశం కౌన్సిల్, ఆ కౌన్సిల్‌న కధ్యక్షుడుగా ఇండియా స్టేట్ సెక్రటరీ (Secretary of State for India) ఏర్పాటయినారు. భారతదేశ కార్యదర్శి బ్రిటిష్ కాబినెట్‌లో ఒక మంత్రి; ఆయనకు సహాయం చేయటాని కొక ఉపకార్యదర్శి ఏర్పాటయినారు. వీరందరి జీతాలు భరించవలసింది భారతదేశ ప్రభుత్వము. ఈ స్థితి 1858 నుంచి 1919 వరకు, భారతదేశ నాయకు లెంత విమర్శించినా మారలేదు. భారతదేశం కౌన్సిల్ సభ్యుని జీతం సాలుకు 1200 పౌన్‌లు. అతని ఉద్యోగానికి కాలపరిమితి లేదు. 15 మంది సభ్యులలో ఏడుమంది కంటె ఎక్కువ మంది నియామకానికి ముందు పదేళ్ళు భారతదేశంలో నివసించినవారై ఉండవలె. డైరెక్టర్ల కోర్ట్ ఏడుగురు భారతదేశం కౌన్సిల్ సభ్యులను నియమిస్తుంది. భారతదేశం ఆదాయ, వినియోగ విషయంలో తప్ప స్టేట్ కార్యదర్శి కౌన్సిల్ అభిప్రాయానికి విధిగా లోబడవలసిన అవసరం లేదు. భారతదేశ పరిపాలనకు బ్రిటిష్ పార్లమెంట్‌కు జవాబుదారీ వహించవలసినవాడు ఇండియా స్టేట్ కార్యదర్శి. గవర్నర్, గవర్నర్ జనరల్ కౌన్సిల్‌ల సభ్యులను నియమించే అధికారము ఇండియా కౌన్సిల్‌ది. ఆ విషయంలో కౌన్సిల్ సలహాను కార్యదర్శి పాటించవచ్చు. గవర్నర్ జనరల్‌తో రహస్యంగా ఉత్తర ప్రత్యుత్తరాలను సాగించే అధికారము ఆయనకుంది. ఏటా భారతదేశ నైతిక, ఆర్థికాభివృద్ధిని గురించి అతడు పార్లమెంట్‌కు నివేదిక సమర్పించవలె. భారతదేశం దొరతనం వారు దానిని ఇండియన్ స్టేట్ కార్యదర్శి సూచనలను అనుసరించి, అతని ఆమోదంతో పరిపాలించవలసినదని నిర్ణయిస్తూ భారతదేశం కౌన్సిల్ ఈ నిబంధనలను చేసింది : నూతన శాసన ప్రతిపాదనలకు భారతదేశ ప్రభుత్వాదాయాలకు, రైతులకు, భారీ ఎత్తున అన్ని నిర్మాణాలకు, కొత్త ఉద్యోగాలను సృష్టించటానికి, అధిక వ్యయంతో కూడుకొన్న అన్ని ప్రణాళికలకు, కాంట్రాక్టులకు, ఇండియా స్టేట్ సెక్రటరీ ఆమోదము అవసరము. ఈ అన్ని ఏర్పాట్ల సారాంశము - 1858 కి పూర్వం భారతదేశాన్ని

తూర్పు ఇండియా వర్తకసంఘం లాభానికి పరిపాలిస్తూ ఉండేది. ఇకముందు బ్రిటిష్ పౌరులందరి లాభాలను, బ్రిటిష్ దేశ ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని పరిపాలన జరుగుతుందని ఏ సమయంలో బ్రిటిష్ మంత్రివర్గమే రాజకీయ పక్షానికి ప్రతినిధిగా ఉండటం తటస్థిస్తుందో ఆ సమయానికి ఆ రాజకీయ పక్షపు ఇష్టానిష్టాల కనుగుణంగా భారతదేశ పరిపాలనా విధానాలుండ బోతాయని గ్రహించవలసి ఉంది.

1858 విక్టోరియా రాణి ప్రకటనను ఈ సందర్భంలో మనము కొంత గమనించవలసి ఉంది. స్వదేశీయ సంస్థానాలను బ్రిటిష్ ప్రభుత్వం తన రాజ్యంలో ఇకముందు కలుపుకోదని, కాని ఆ సంస్థానాధీశుల దుష్పరిపాలన నుంచి వారి ప్రజలను రక్షించటం అవసరమైనప్పుడు జోక్యం చేసుకొనే హక్కును తాను వదులుకోలేదని, తాత్కాలికంగా అట్లాంటి పరిస్థితులలో సంస్థానాల పరిపాలనను తాను స్వీకరించగలదని రాణి ప్రకటన స్పష్టీకరించింది. స్వదేశీ రాజులు పరస్పరంగాగానీ విదేశాలతోగానీ ఏ సంబంధాలూ పెట్టుకోరాదని తెలపటమే కాక వారి సైనికులలో కొంతమందిని తగ్గించినారు. భారతదేశ ప్రభుత్వం ఈ దేశీయుల మతాచారాలలో జోక్యం కలిగించుకోదని వారి న్యాయశాసనాలను మన్నిస్తుందని, భారతదేశంలోని ప్రజలను బ్రిటిష్ సామ్రాజ్యంలోని ఇతర దేశ ప్రజలతో సమానులుగా పరిగణిస్తారని, మతము జాతిని చూడక భారతీయ పౌరులు వారి విద్య, యోగ్యతలనుబట్టి ఏ ఉద్యోగాలకైనా నియమితులు కాగలరని రాణి ప్రకటన స్పష్టం చేసింది. వారి నైతిక, ఆర్థికాభివృద్ధి కోసం అవసరమైన చర్యలు తీసుకోవటం జరుగుతుందని, వారి సౌభాగ్యమే తన బలమని, వారి తృప్తిలోనే తన రక్షణ ఉన్నదని, వారి కృతజ్ఞతకు మించి తనకు వేరే ప్రతిఫలమక్కరలేదని రాణి ప్రకటన ఘోషించింది రాణి ప్రకటనలోని వాగ్దానాలను కొలబద్దలుగా చేసి, భారతీయులు భావికాలంలో తమ పరిపాలకుల చర్యలను విమర్శించటంలో 1885 లో భారత జాతీయ కాంగ్రెస్ సంస్థను స్థాపించినారు. ఇంగ్లీష్ చదువులు ఈ దేశంలో వ్యాప్తి చెంది, బ్రిటన్‌లోను, ఇతర పాశ్చాత్య రాజ్యాలలోను స్వాతంత్ర్యోద్యమాల చరిత్రను భారతీయులు చదివేకొద్దీ, భారతదేశంపై బ్రిటిష్ పార్లమెంట్‌కు సంక్రమించిన పరిపాలనాధికారానికి వారు అడ్డుకట్టలు వేస్తూ పోవటం అనివార్యమయింది 20వ శతాబ్దంలో అడుగు పెట్టేలోగా, భారతదేశ పరిపాలనలో భారత పౌరులకు, వారి అభిప్రాయ ప్రకటనకు కొంత స్థానం ఉండవలెననే సదుద్దేశంతో బ్రిటిష్ పార్లమెంట్ 1861 లోను, 1892 లోను, భారతదేశం కౌన్సిల్‌ల చట్టాలను చేయవలసి వచ్చింది.

1861 ***ఇండియా కౌన్సిల్ చట్టము:*** గవర్నర్ జనరల్ కౌన్సిల్‌కు న్యాయ సభ్యునొకని చేర్చింది. పరిపాలనా కార్యక్రమం ఈ సభ్యులకు పంపిణీ జరిగింది. అతి ముఖ్య విషయాలు గవర్నర్ జనరల్ ఆధ్వర్యంలో ఉంచినారు. శాసన సభగా ఈ కౌన్సిల్ పనిచేసేటప్పుడు ఆరుగురికి తక్కువకాక, 12 మందికి హెచ్చుకాక అదనపు సభ్యులను గవర్నర్ జనరల్ నియమించవలసినట్లు. వారిలో సగం మంది కంటె తక్కువ కాకుండా ప్రభుత్వోద్యోగులు కానివారై ఉండవలెనని, వారి సభ్యత్వకాలం రెండేళ్ళని ఈ చట్టం విధించింది. మద్రాసు, బొంబాయి రాష్ట్రాలలో కార్యనిర్వాహక సభ్యు లిద్దరుకాక, నలుగురికి తగ్గక, ఎనిమిది మందికి హెచ్చుకాక అదనపు సభ్యులను గవర్నర్‌లు నియమించవలెనని వారి పదవీ కాలం రెండేళ్ళని నిర్ణయముంది. కేంద్ర శాసన సభవలెనే రాష్ట్ర శాసన సభలు చేసే శాస

నాలు, శాసనాలు సవరించే చట్టాలు, గవర్నర్ జనరల్ యొక్క, ఆ యా గవర్నర్‌ల సమ్మతి పొందవలెనని 1861 చట్టం విధించింది

*ఈ శాసనసభల శాసనాధికారంపై విధించిన పరిమితులు:* ప్రభుత్వాదాయాలు, ఋణాలు, భారతీయుల మతాచారాలు, స్వదేశీయ సంస్థానాలు, సైనిక విషయాలు – వీటిని గురించి చేయదలచిన చట్టాలకు ముందుగా గవర్నర్ జనరల్ ఆమోదము అవసరము. శాసన సభామోదం పొందిన చట్టాలు కూడా కేంద్రంలో గవర్నర్ జనరల్ యొక్క, రాష్ట్రాలలో గవర్నర్‌ల, గవర్నర్ జనరల్ యొక్క సమ్మతి లేనిదే శాసనాలు కాజాలవు. ఈ శాసన సభలు చేసే ఏ చట్టాలనైనా బ్రిటిష్ పార్లమెంట్ తోసివేయవచ్చు. బ్రిటిష్ పార్లమెంటరీ శాసనాలకు వ్యతిరేకమయిన చట్టాలను, బ్రిటిష్ ప్రభుత్వాధికారానికి భంగంచేసే చట్టాలను శాసన సభలు చేసే వీలులేదు అత్యవసర పరిస్థితు లేర్పడినప్పుడు స్వాధికారంపై శాసనంతో సమానాలైన ప్రకటనలను గవర్నర్ జనరల్ చేయవచ్చు. వాటి జీవిత ప్రమాణం ఆరు నెలలు. ఏ పరిస్థితులలో ఆ విధమైన ప్రకటన చేయవలసివచ్చిందో గవర్నర్ జనరల్ భారతీయ కార్యదర్శికి తెలియజేయవలె. మరొకసారి అట్లాంటి ఆర్డినెన్సో, దానికి సమానమైన శాసనమో చేయకపోతే ఆ ఆర్డినెన్స్ ఆరునెలలుకాగానే రద్దవుతుంది. భారతీయులను శాసన కార్యంలో భారత ప్రభుత్వంతో భాగస్వాములను చేస్తూ బొంబాయి, మద్రాసు రాష్ట్రాలలో శాసన సభలను నెలకొల్పటమేకాక, ముందు ముందు ఇతర రాష్ట్రాలలోను శాసన సభలను స్థాపించటానికి ఈ 1861 కౌన్సిల్ చట్టము అంకురార్పణ చేసింది. 1858 చట్టంవల్ల ఏర్పడిన శాసన సభలో భారతీయులను నియమించటానికి డల్‌హౌసీ చేసిన సూచనను బ్రిటిష్ ప్రభుత్వం తోసిపుచ్చింది. కాని 1862 లో కానింగ్ కేంద్ర శాసన సభకు పాటియాలా మహారాజును, బెనారస్ రాజును, సర్ దిన్‌కర్‌రావులను నియమించటాన్ని ఆమోదించింది.

## 1861, 1892 మధ్యకాలంలో బ్రిటిష్ ప్రభుత్వానికి భారతదేశంతోగల సంబంధాలు

1869 (స్టాట్యూట్) చట్టము ఇండియన్ స్టేట్ సెక్రటరీ కౌన్సిల్ అధికారాన్ని తగ్గించి, ఆ విధంగా సెక్రటరీ బాధ్యతను, అధికారాన్ని పెంచింది. దాని కర్థము పార్లమెంటరీ అధికారం హెచ్చించిందని మాత్రం కాదు. భారతదేశ వ్యవహారాలలో పార్లమెంట్ శ్రద్ధ చూపించనంత కాలం భారతదేశ పరిపాలనపై పెత్తనము ఇండియన్ స్టేట్ సెక్రటరీ చేతుల లోనే ఉంది. సిద్ధాంతరీత్యా చాలాకాలం భారతదేశంలోని ప్రభుత్వానికి ఇంగ్లండ్‌లోని సెక్రటరీ ప్రతినిధి మాత్రమే ఉన్నాడు. కాని 1870 లో ఎర్ర సముద్రమార్గంలో కేబిల్ స్థాపన అయిన తరవాత ఇండియన్ గవర్నర్ జనరల్‌పైన భారతదేశంలోని గవర్నర్‌లపైన (ఇండియన్ స్టేట్ సెక్రటరీ) పెత్తనం పెరిగింది ఆ కారణాన్నిబట్టి భారతదేశ పరిపాలన గురించి పార్లమెంట్ సభ్యులలో ఎరుక, శ్రద్ధ పెరిగినాయి. అత్యవసర పరిస్థితులలో గవర్నర్ జనరల్ స్వతంత్రించి తాత్కాలిక శాసన ప్రకటనలు (Ordinances) చేయగల్గినా, చేసినప్పుడెల్లా తానట్లా చేయడానికి కారణాలేవో ఇండియన్ స్టేట్ సెక్రటరీకి తెలుపుకోవలసి వచ్చింది. కాని రాష్ట్రాలపై గవర్నర్ జనరల్ అధికారం విశేషంగా పెరిగింది. రాష్ట్రాదాయంలో కొంత కేంద్ర ప్రభుత్వం అనుగ్రహించవలసి వచ్చింది. దానివల్ల, రాష్ట్రాల బడ్జెట్‌లు, వారు

ఖర్చు పెట్టదలచిన పద్దులు కేంద్ర ప్రభుత్వామోదాన్ని పొందవలసి ఉండటంవల్ల, కేంద్ర శాసనాలకు రాష్ట్ర శాసనాలు లోబడవలసినవి కావటంవల్ల రాష్ట్రాలు చేయదలచిన శాసనాలకు గవర్నర్ జనరలూ, స్టేట్ సెక్రటరీ ముందు అనుమతి ఇవ్వవలసి ఉండటంవల్ల, తరవాత గవర్నర్ జనరల్ ఆమోదం కానిది రాష్ట్ర శాసనానికి ప్రాణప్రతిష్ఠ లేకపోవటంవల్ల, గవర్నర్ జనరల్‌కు రాష్ట్ర ప్రభుత్వాలపై అధికారం చాలా వృద్ధి అయింది. ఇండియాలో రైల్వే మార్గాలు. తంతి తపాలా సదుపాయాలు వృద్ధికావటంవల్ల రాష్ట్ర గవర్నర్‌ల. వారి కౌన్సిల్‌ల స్వతంత్రాధికారం ఎంతో సన్నగిల్లింది వారి పరిపాలనలో కేంద్ర ప్రభుత్వం జోక్యమెంతో అతిశయించింది. భారతదేశంలోని ఆంతరంగిక పరిపాలనకు బ్రిటన్‌లోని పరిపాలనా విధానము ఒరవడిగా పరిణమించింది. భారతీయ పరిపాలనా విధానంలో ఐక్యం సిద్ధించి, ఆ పరిపాలన కొంత క్రమబద్ధం కాసాగింది. నీటి పారుదల వసతులు, విద్యా, వ్యవసాయాల ప్రోత్సాహము, అటవీ రక్షణము, కరువు లేర్పడిన తావులలో ప్రభుత్వం పీడిత ప్రజలకు సాయమందించే పద్ధతులు - వీటి విషయంలో ప్రభుత్వం ఎక్కువ శ్రద్ధ చూపించటం మొదలు పెట్టింది. ఫలితంగా ప్రజల స్థితి చాలా మెరుగయింది. కాని విక్టోరియా రాణి ప్రకటన వాగ్దానం చేసిన విశేషావకాశాలు భారతీయులకు లభించలేదు. ఆ కారణంగా విద్యావంతులైన భారతీయులలో తమకు ఉన్నతోద్యోగాలు లభించలేదే అనే అసంతృప్తి పెచ్చు పెరిగిపోయింది. దేశ పారిశ్రామికాభివృద్ధిని సాధించటానికి ప్రభుత్వ మేవిధమైన ప్రయత్నం చేయలేదనే విమర్శలు తీవ్రతరమయినాయి. ఈ విమర్శలను దేశ భాషలలో ప్రచురించే పత్రికలు ప్రజలలో విశేషంగా ప్రచారం చేసినాయి. దానివల్ల భారతదేశం దొరతనము 1878 లో ఒక దేశభాషా పత్రికా శాసనం చేసింది. "ఆ పత్రికల సంపాదకులు ప్రభుత్వంపై విద్వేషం రెచ్చగొట్టే వ్రాతలను ప్రచురించబోమని వాగ్దానమైనా చేయవలె, లేదా తాము ముద్రించిన పత్రికల ప్రతులను ప్రభుత్వోద్యోగులకు చూపి, వారి అనుమతి పొందిన తరవాతగాని ప్రజలకు అందించము అనే నియమానికి కట్టుబడవలె" అని 1878 లో గవర్నర్ జనరల్ లిట్టన్ ప్రచురించినాడు. ఈ చట్టాన్ని స్థానిక స్వపరిపాలనకు జనకుడని పేరుపొందిన రిప్పన్ ప్రభువు రద్దు చేసినాడు. దేశ పరిపాలనలో దేశీయులను భాగస్వాములను చేయవలెననే సదుద్దేశమే రిప్పన్ ప్రభువును స్థానిక స్వపరిపాలనను దేశవ్యాప్తం చేసేటట్లు చేసింది. రాజధాని నగరంలో తూర్పు ఇండియా కంపెనీ కాలంనుంచి మునిసిపాలిటీ లున్నాయి. 1842-1862 మధ్యకాలంలో ఎక్కువ జనసంఖ్యగల పట్టణాలలో వాటిని స్థాపించటానికి చట్టాలు తయారయినాయి. సభ్యులలో కొందరిని ఎన్నుకొనే పద్ధతిని మేయో ప్రవేశపెట్టినాడు. ఎన్నికయిన సభ్యుల సంఖ్యను పెంచటమేకాక, పురపాలక సంఘాలకు తమ అధ్యక్షుల నెన్నుకొనే హక్కు నిస్తూ, వాటికి కొంత ఆర్థికాధికారాలు రిప్పన్ ప్రసాదించినాడు. స్థానిక జిల్లా పరిషత్తులను (Local District Boards) కూడా ఆయన స్థాపించినాడు.

భారతీయ న్యాయాధికారులు ఐరోపా దేశస్థులను నేరస్థులైనా విచారించరాదనే నిషేధం తొలగించదలచి యిల్‌బర్ట్‌బిల్ ప్రవేశపెట్టిన రిప్పన్‌ను భారతదేశంలోని తెల్లవారు సంఘ బహిష్కృతునిగా చేసినారు. భారతీయులలో జాతీయ భావాన్ని ఇది మరింత రెచ్చగొట్టింది. 1885 లో భారత జాతీయ కాంగ్రెస్ మొదటి సమావేశం జరిగింది. 1886 లో గవర్నర్ - జనరల్ డఫ్‌రిన్ ప్రభువు, 1887 లో మద్రాసు గవర్నర్ కాంగ్రెస్‌ను అభిమానంతో

చూసినారుగాని, 1888 లో కోటానుకోట్ల భారతీయులను సూక్ష్మాతిసూక్ష్మ సంఖ్య అయిన కొద్దిమంది భారతీయ విద్యార్థికులు తాము ప్రతినిధులమన్నా దానిని బ్రిటిష్ ప్రభుత్వ మంగీకరించజాలదని ఖండితంగా డఫ్‌ఫిరిన్ చాటినాడు. ఈ డఫ్‌ఫిరిన్ ప్రభువే 1888 లో రాజకీయ సంస్కరణలను గురించి సూచనలు చేయటానికి ఒక కమిటీని ఏర్పరిచినాడు. సంకుచిత రూపంలో భారతదేశంలో పార్లమెంట్‌లను ఏర్పాటు చేయవలసిందని, వాటిలో ఎన్నికయిన సభ్యుల సంఖ్య పెంచవలసింటని, వారు ఉద్యోగులుకాని నియోజిత సభ్యులు కూడి మెజారిటీ అయ్యేటట్లు చూడవలసిందని ఈ కమిటీ సూచించింది. కాని, తమ కిష్టంగాని చట్టాలు ఆమోదిస్తే వాటిని రద్దు చేయటానికి తమ కిష్టమైనవాటిని, శాసనసభ నిరాకరించిన వాటిని చట్టం చేయటానికి గవర్నర్‌లకు, గవర్నర్ జనరల్‌కు అధికారం ఉండవలెనని కమిటీ ఒక సలహా ఇచ్చింది. ఈ సూచనల ఫలితమే 1892 భారతీయ (ఇండియన్) కౌన్సిళ్ల శాసనము.

1892 *భారతీయ (ఇండియన్) కౌన్సిళ్ళ చట్టము:* సభ్యులను కేంద్ర, రాష్ట్ర శాసన సభలకు ప్రజలు సూటిగా ఎన్నిక చేయరు. రాష్ట్ర శాసన సభలకు స్థానిక స్వపరిపాలనా సంస్థలు సభ్యులను ఎన్నుకొంటారు. కేంద్ర శాసన సభకు రాష్ట్ర శాసన సభల నుంచి సభ్యులు ఎన్నిక అవుతారు. ఈ విధంగా చట్టం ఏర్పాటుచేసింది. ఈ చట్టం కార్యనిర్వాహక సభలలో భారతీయులకు స్థానము ఇవ్వలేదు. ఉద్యోగులను పరిపాలనగురించి ప్రశ్నలడగటానికి, బడ్జెట్‌ను గురించి విమర్శించటానికి శాసన సభ్యుల కధికారమిచ్చింది. సభ్యులు అడగదలచిన ప్రశ్న లివి అని ఆ దినాలు ముందే తెలుపుకొని ఉండవలె. సభాధ్యక్షుడు ప్రశ్నలడగటానికి అనుమతి ఇవ్వకపోవచ్చు. నిరాకరించటానికి కారణం చెప్పే అవసరం లేదు. అడిగినా, ప్రశ్నలకు ప్రభుత్వ సభ్యులు సమాధానం చెప్పటానికి నిరాకరించవచ్చు. ఇక ప్రజా ప్రతినిధులకు మిగిలింది పూర్వంకంటె ఎక్కువమంది శాసన సభ్యు లేర్పడినారనే తృప్తి ; తమకు లభించిన పరిపాలనాధికారం సున్న అనే అసంతృప్తి ప్రశ్న లడగనిచ్చినా ప్రభుత్వ సభ్యుడిచ్చే సమాధానాన్నిబట్టి ఉదయించే అనుబంధ ప్రశ్నలను సభ్యు లడగరాదనే నిషేధము, ప్రశ్నలవల్ల ప్రభుత్వ విధానాన్ని సంస్కరించటానికి వీలు లేకుండేటట్లు చేసింది. కాని ప్రజా ప్రతినిధులు అడిగే ప్రశ్నలు చేసే ఉపన్యాసాలవల్ల దేశ పరిపాలన గురించి ప్రజలేమనుకొంటున్నారో ప్రభుత్వం తెలుసుకోవటానికి వీలేర్పడింది. కేంద్ర శాసన సభకు పదిమందికి తగ్గక, 16 మందికి హెచ్చక అదనంగా సభ్యులను చేర్చుకొన్నారు. మద్రాసు, బొంబాయి బెంగాల్ కాష్ట్ర శాసన సభలకు 8 మందికి తగ్గక, 20 మందికి హెచ్చక అదనపు సభ్యులుండ వచ్చునని, అదనపు సభ్యులలో అయిదువంతులలో రెండు వంతుల మంది ప్రభుత్వోద్యోగులు కానివారై ఉండవలెనని ఈ 1892 భారతీయ (ఇండియన్) కౌన్సిళ్ళ చట్టం విధించింది. కేంద్ర శాసన సభ్యులు 24 మందిలో 14 మంది ఉద్యోగ సభ్యులు ఎన్నికయ్యే సభ్యులు (ఉద్యోగులు కాని) నల్గురు ; ప్రభుత్వ నియమితులైన సభ్యులు (ఉద్యోగులు కాని) అయిదుమంది. ప్రజలలో జమీందార్‌లకు, సర్దార్‌లకు, యూరోపియన్ వర్తక సంఘాలకు ప్రాతినిధ్యం హెచ్చు ; ఇతర ప్రజా సామాన్యానికి నామమాత్రము. నిస్సారమైన ఈ రాజకీయ సంస్కరణలు అర్ధ శతాబ్దానికి మించి ఆంగ్లేయుల లిబరల్ లిటరేచర్ (Liberal literature) ను, ప్రజారాజ్య స్థాపన చరిత్రను చదివి ఉత్తేజితులైన, స్వేచ్ఛా ప్రియులైన భారతీయులను ఏ విధంగా రెచ్చగొడుతున్నాయో బ్రిటిష్ పరిపాలకు లూహించలేకపోవటం ఆశ్చర్యకరమైన విషయము.

## 1909 భారతీయ (ఇండియన్) కౌన్సిళ్ళ చట్టము

తన పరిపాలనలో అభివృద్ధికరాలైన అనేక పథకాలను ఆచరణలో పెట్టిన వైస్రాయ్ కర్జన్ భారతదేశ రాజకీయాలలో తీవ్రమైన ఆవేశాలను తెచ్చిపెట్టి, భారతదేశము ఇంగ్లండ్‌ల వేర్పాటుకు అంకురార్పణ చేసిన ఘనత సంపాదించినాడు. బెంగాల్‌ను రెండు రాష్ట్రాలుగా 1905 లో, విభజనచేసి, ముస్లిమ్ లధిక సంఖ్యలలో ఉండే తూర్పు బెంగాల్ రాష్ట్రాన్ని ఇతడు సృష్టించినాడు. విభజనను రద్దు గావించవలెనని "వందేమాతం" ఉద్యమాన్ని బెంగాల్ ప్రజలు లేవనెత్తినారు. బ్రిటిష్ సామ్రాజ్యంలోని ప్రాంతాలైన సిలోన్, మలయా, మారిషస్, బ్రిటిష్ గయానా, ఫీజీ, నేటాల్, కెనియా, దక్షిణాఫ్రికా రాష్ట్రాలలో భారతీయులు అవమానాలకు గురిఅవుతూ ఉంటే, బ్రిటిష్ ప్రభుత్వం చూస్తూ ఊరుకోవటం భారతీయులకు క్రోధ కారణమయింది. 1905 లో రష్యన్ సామ్రాజ్యాన్ని జపాన్ యుద్ధంలో ఓడించటం దౌర్జన్య మార్గాలవలంబించి బ్రిటిష్ పరిపాలనను ఈ దేశంలో కూలదోయగలమనే ధైర్యము మన యువకులలో కలిగింది. 1906 లో బ్రిటిష అధికారులపై బాంబులు విసిరే వారనేకులు తయారయినారు. వారి నణచవలెనని గవర్నర్ జనరల్ మింటో దేశద్రోహకరమైన సభలను, బాంబులవంటి పేలుడు పదార్థాలు చేయడాన్ని నిషేధిస్తూ రెండు చట్టాలను చేసినాడు. అతని ప్రభుత్వము 1818 సం. నెంబర్ 3 రెగులేషన్‌ను విరివిగా ప్రయోగించింది. బాలగంగాధర్ తిలక్‌పై ఆరేళ్ళ జైల్ శిక్ష విధించింది. బిపిన్ చంద్రపాల్, లాలాలజపతిరాయ్, హరిసర్వోత్తమరావు, చిదంబరంపిళ్ళె మొదలైన వారి నెందరినో జైళ్ళపాలు చేసింది. కాని, మితవాదులను దువ్వి, తన పక్షానికి తిప్పుకోవలెననే ఉద్దేశంతో, మింటో ప్రభువు, ఇండియా స్టేట్ సెక్రిటరీ మార్లే 1909 భారతీయ (ఇండియన్) కౌన్సిళ్ళ చట్టాన్ని పార్లమెంట్ ఆమోదించేటట్లు చేసినారు. ఈ చట్టం ఉద్దేశం భారతదేశంలో స్వపరిపాలన స్థాపన ఎంతమాత్రం తమ ఉద్దేశం కాదని మింటో, మార్లేలు ఇద్దరూ కంఠోక్తిగా చెప్పినారు. 1909 కౌన్సిళ్ళ చట్టంలోను అంతకుమించిన సత్సంకల్పమేమీ మనకు కనిపించదు.

## 1909 శాసన సంగ్రహము

కేంద్రంలోను, రాష్ట్రంలోను, శాసన సభ సభ్యుల సంఖ్య పెంచడమయింది. కేంద్ర శాసన సభలో గవర్నర్ జనరల్, కార్యనిర్వాహక సభ సభ్యులు తొమ్మిదిమంది కాక గవర్నర్ జనరల్ నియమించిన ఉద్యోగులు 28 మంది, ఉద్యోగులుకాని సభ్యులు 32 మందిలో అయిదుగురు గవర్నర్ జనరల్ నియమించినవారు ఉంటారు. రాష్ట్ర శాసన సభలలోను ప్రభుత్వోద్యోగులు, ఉద్యోగులు కానట్టి గవర్నర్‌చే నియమితులైనవారు, ప్రజలలో కొన్ని వర్గాలచే ఎన్నికయిన వారికంటె అధిక సంఖ్యాకులు, ఎన్నికయిన సభ్యులు ప్రధానంగా భూస్వాముల, బ్రిటిష్, ఇండియన్ వర్తక సంఘాల ప్రతినిధులు. మిగిలినవారు స్థానిక సంస్థల ప్రతినిధులు.

*శాసన సభల కిచ్చిన అధికారాలు:* బడ్జెట్‌ను చర్చించటానికి. బడ్జెట్‌లో నమోదయిన విషయాలపై తీర్మానాలను ప్రతిపాదించటానికి అధికారముంది. కాని రైల్వేలను గురించి ప్రభుత్వ ఋణాలపై చెల్లించవలసిన వడ్డీలను గురించి, ఇంగ్లీష్ చర్చి సిబ్బందిని గురించి

వారు చర్చించరాదు. పరిపాలనగురించి సభ్యులు తీర్మానాలను ప్రతిపాదించవచ్చు కాని అధ్యక్షుడు వాటిని చర్చకు రానీయక నిరాకరించవచ్చు. సభ్యులు ప్రశ్నలు, అనుబంధ ప్రశ్న లడగవచ్చు. దానికి సంబంధమున్న కార్యనిర్వాహక సభ్యుడు సమాధానమివ్వవచ్చు ; ఇవ్వటానికి నిరాకరించవచ్చు. మొదటిసారిగా శాసన సభలో ముస్లిమ్‌లకు ప్రత్యేక ప్రాతినిధ్యం ఇవ్వటం జరిగింది. ప్రజారాజ్య విధానానికి విరుద్ధమైన ప్రత్యేక కుల, మత, వర్గ ప్రాతినిధ్యం ఇంతటితో ఆగిలేదు. 1919 లో సిక్కులకు ప్రత్యేక నియోజకవర్గాలు ఏర్పడినాయి. 1985 లో భారతీయ క్రైస్తవులకు, ఆంగ్లో ఇండియన్‌లకు, యూరోపియన్‌లకు, హరిజనులకు ప్రత్యేక వర్గ ప్రాతినిధ్యం ఏర్పాటు చేయవలసివచ్చింది. ప్రత్యేక వర్గ ప్రాతినిధ్యమనే ఈ అనర్థం ఈనాటికీ ఏదో ఒక రూపంలో మనలను వెంటాడుతూనే ఉంది. ఈ సంస్కరణలతోబాటు, భారతీయులను సంతోష పెట్టటానికి ఇండియా కౌన్సిల్‌లోను, గవర్నర్ జనరల్ కార్యనిర్వాహక సభలోను మొదటి సారిగా కొద్దిమంది భారతీయులను నియమించినారు.

## 1909 ఇండియా ప్రభుత్వ శాసనము

బ్రిటిష్ సామ్రాజ్యంలో ఒక అంతర్భాగంగా ప్రజలకు ప్రాతినిధ్యం వహించగల ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయటమే చివరికి బ్రిటిష్ పార్లమెంట్ యొక్క భారతీయ ప్రభుత్వోద్దేశమని, ఆ స్థితిని అంచెలవారీగా చేరటంకోసం, భారతీయులకు క్రమానుగతంగా స్వపరిపాలనాధికారాలను, వారొక్కొక్క దశలో తమ కిచ్చిన అధికారాలను ఎంతవరకు సద్వినియోగం చేయగలుగుతారో దానినిబట్టి ప్రభుత్వం నిర్ణయం మేరకు అధికాధికంగా ఇవ్వగలరని ఆ లక్ష్య సాధనకోసం తమతో పరిపాలనలో భాగం భారతీయులకు క్రమంగా హెచ్చిస్తూ ఇవ్వగలమని ఇండియా స్టేట్ కార్యదర్శి అయిన మాంటెగూ 1917 ఆగస్‌లో ప్రకటించినాడు.

## 1909 ఇండియా ప్రభుత్వ శాసనము

పూర్వం ఇండియా రాజ్య కార్యదర్శి (Secretary of State for India) కౌన్సిల్ జీతాలు భారతదేశ ప్రభుత్వం ఇస్తూ ఉండేది. ఆ కౌన్సిల్ బ్రిటిష్ పరిపాలక వర్గంలో భాగం కాబట్టి దాని వ్యయం భరించవలసినది బ్రిటిష్ పౌరులుగాని, భారతీయులు కాదనే వాదము చిరకాలంగా ఉండేది. కాని ఇండియన్ కార్యదర్శి భారతదేశ ప్రభుత్వానికవసరమయ్యే కొనుగోళ్ళు మొదలైనవి చేయవలసినవాడై నందువల్ల, ఇటువంటి ఆ విధుల నిర్వహణకు, భారత ప్రభుత్వ ప్రతినిధిగా ఇతర కార్యాల నిర్వహణకు ఇంగ్లండ్‌లో ఇండియా హైకమిషనర్ అనే ఒక అధికారి ఏర్పడినాడు. ఈ హైకమిషనర్, అతని సిబ్బంది వ్యయం భారతదేశ ప్రభుత్వం భరించవలసింది. ఇండియా రాజ్య కార్యదర్శి, అతని సిబ్బంది జీతాలు బ్రిటిష్ బొక్కసం నుంచి చెల్లించవలసినట్లు 1919 చట్టం నిర్ణయించింది. ఈ హైకమిషనర్ ఇండియన్ స్టోర్స్, బ్రిటిష్ దేశంలోనున్న భారతీయ విద్యార్థుల బాగోగులు చూడవలసినవాడు భారతదేశ పరిపాలనలో ఈ చట్టం చేసిన సంస్కరణల ఫలితంగా ఇండియా రాజ్య కార్యదర్శి విధులలోను, అధికారాలలోను కొన్ని మార్పులు వచ్చినాయి.

ఈ సంస్కరణలు భారతీయ రాష్ట్రాలలో ద్వంద్వ ప్రభుత్వ విధానాన్ని ప్రవేశపెట్టి

నాయి. న్యాయము శాంతి భద్రతలు, ఉన్నతోద్యోగి వర్గము, సేన, రక్షణశాఖ, ఆర్థికశాఖ పాలించే వారు కార్యనిర్వాహకవర్గం వారు. మిగిలిన ప్రభుత్వ శాఖలు ఎన్నికయిన సభ్యుల నుంచి ఏర్పడే మంత్రుల అధీనంలో ఉండేవి. వీరొకవైపు గవర్నర్‌కు, మరొకవైపు శాసన సభకు బాధ్యులై ఉంటారు. అవిశ్వాస తీర్మానం పెట్టి శాసన సభగాని, అతని నమ్మకం పోగొట్టుకోవటంవల్ల గవర్నర్‌గాని మంత్రిని అతని పదవినుంచి తొలగించవచ్చు. ప్రజల కుపయోగించే నిర్మాణ కార్యక్రమ నిర్వహణ మంత్రులది. విద్య, ఆరోగ్యము, స్థానిక స్వపరి పాలన, వ్యవసాయము, రహదారుల నిర్మాణము మొదలైన శాఖలు విశేష వ్యయసాధ్యమైనవి పరిపాలించవలసిన వారు మంత్రులు. పరిపాలనకు కావలసిన ద్రవ్యం అనుగ్రహించవలసిన వాడు ఆర్థికశాఖ సభ్యుడు. కార్యనిర్వాహక శాఖల పరిపాలనకు ప్రత్యేకించగా మిగిలిన ద్రవ్యాన్ని మంత్రులు వాడుకొంటారు. చాలకపోతే ప్రజలపై కొత్త పన్నులు వేసి తమకు కావలసిన ద్రవ్యాన్ని వారు సమకూర్చుకోవచ్చు. అట్లాచేసి ప్రజల అభిమానాన్ని వారు పోగొట్టుకోవటానికి సంస్కరణలు వీలు కలిగించినాయి.

రాష్ట్ర శాసన సభలకు ఎన్నికయిన ప్రజా ప్రతినిధులకు మెజారిటీని ఈ సంస్కరణలు కలిగించినాయి. మంత్రులకు, గవర్నర్‌కు, శాసన సభకు, ఏకాభిప్రాయం కుదిరిన అంశాలలో గవర్నర్ జనరల్‌గాని, ఇండియా రాజ్య కార్యదర్శిగాని జోక్యం కలిగించుకో వీలులేదు. అన్యథా జరిగిన ఇండియా రాజ్య కార్యదర్శి ఆమోదానికి లోబడి గవర్నర్ జనరల్ రాష్ట్ర శాసనాన్ని తోసివేయవచ్చు. సవరణకోసం దానిని గవర్నర్, గవర్నర్ జనరల్, ఇండియా కార్యదర్శులు శాసన సభలకు తిప్పి పంపవచ్చు.

స్వదేశీ రాజులతో బ్రిటిష్ ప్రభుత్వానికున్న సంబంధాలు, బ్రిటిష్ వాణిజ్యము, కార్య నిర్వాహకశాఖ పాలించే విషయాలు, గిరిజనులు, ఆటవికులు, హరిజనులు, వెనకబడిన వర్గాలు (Backward classes), అణిచివేయ బడిన వర్గాలు (Depressed classes), ఈ దేశంలో ఉన్న బ్రిటిష్‌వారి మతాచారాల రక్షణ, సైన్యా భద్రత, క్రమశిక్షణ, విదేశాలతో వ్యవహారాలు, ప్రభుత్వ ఋణాలు, ఆదాయాలు, గవర్నర్‌ల, గవర్నర్ జనరల్, ఇండియా రాజ్య కార్యదర్శుల ప్రత్యేక బాధ్యతల, విచక్షణలోని పరిపాలనాంశాలు. వీటి విషయమై శాసన సభలకు లొంగని ప్రత్యేకాధికారాలు గవర్నర్‌లకు గవర్నర్ జనరల్‌కు, ఆ పైన ఇండియా కార్యదర్శికి, అతనిపై బ్రిటిష్ పార్లమెంట్‌కు 1919 ఇండియా ప్రభుత్వ శాసనము అట్లాగే ఉంచింది (Retained). కేంద్రంలో సర్వాధికారాలు గవర్నర్ జనరల్ రాజ ప్రతి నిధివే. అతని కార్యనిర్వాహక సభ్యులు అతనిచే నియమితులై, అతని బాధ్యత వహించిన వారే. 1919 చట్టము కేంద్ర పరిపాలనకు ద్వంద్వ శాసన సభ నేర్పాటు చేసింది. 1909 చట్టంవల్ల ఏర్పాటైన సామ్రాజ్య శాసన సభ (Imperial Legislative Council) కు ఉన్న అంగ నిర్మాణంతో రాజ్య పరిషత్ (Council of State) అనే పేరుతో 1919 చట్టం ప్రకారం ఎగువ శాసన సభ ఏర్పాటయింది. అంటే దానిలో ప్రభుత్వ నియమితులైన అధికార, అనధికార సభ్యుల సంఖ్య హెచ్చు (ఎన్నికయిన ప్రజాప్రతినిధుల సంఖ్య తక్కువ) ధనిక వర్గానికి, మత వర్గాలకు చెందిన నియోజకవర్గాల నుంచి ఎన్నికయినవారే ఆ ప్రజా ప్రతినిధులలో హెచ్చు.

*కేంద్ర శాసనసభ:* ఈ దిగువసభ సభ్యుల సంఖ్య 145. వారిలో 103 మంది ఎన్ని

కయినవారు. మిగిలినవారు ప్రభుత్వ నియమితులు. వారిలో ప్రభుత్వోద్యోగులైన వారి సంఖ్య 25. ఎన్నికయిన 108 మందిలో ముస్లిమ్‌ల ప్రతినిధులు 30 మంది, శిక్కుల ప్రతినిధులు ఇద్దరు, భూస్వాములు ఏడుగురు; యూరోపియన్‌లు, తొమ్మిదిమంది ఇండియన్ వర్తకసంఘ ప్రతినిధులు నలుగురు. ఈ ప్రత్యేక వర్గాల ప్రతినిధులలో సామాన్యంగా ప్రభుత్వ సభ్యులతో కలిసి ఓటు చేసేవారే హెచ్చుమంది. అందువల్ల ప్రభుత్వం కావలెననుకొన్న చట్టాన్ని శాసన సభ తోసివేసే అవకాశంకాని, వారు కూడదనుకొనే శాసనాన్ని ఆమోదించే సందర్భాలుకాని అరుదు. అట్లా ఒకవేళ జరిగినా తాను కోరిన చట్టాన్ని ఉద్ధరించటానికి (Certify), తాను అంగీకరించని చట్టాన్ని నిరాకరించటానికి (Veto) గవర్నర్ జనరల్ కధికారమివ్వడం జరిగింది. ఇదిగాక గవర్నర్ జనరల్ ప్రత్యేక బాధ్యతలైన అంశాలు కొన్ని (His special responsibilities), అతని ప్రత్యేక వివేచనకు లోబడిన కొన్ని విషయాలు ఉండటంవల్ల శాసనసభ చర్చించరాని విషయాల జాబితా చాలా పొడవైనది కావటంవల్ల శాసనసభ కిచ్చిన అధికారాలు చాలా సంకుచితాలయినాయి. చట్టాలను నిరాకరించినప్పుడు, ఉద్ధరించినప్పుడు, ప్రత్యేక బాధ్యతలు వివేచనాధికారాలు వినియోగించేటప్పుడు, తాత్కాలిక శాసనాలు (Ordinances) చేసేటప్పుడు గవర్నర్ జనరల్ చర్యలు ఇండియా కార్యదర్శి ఆమోదానికి లోబడతాయని 1919 పార్లమెంట్ శాసనం విధించింది.

పై సంస్కరణ లోకవైపు భారతదేశానికి ప్రసాదిస్తూనే, విశేష స్వపరిపాలనాధికారం కోసం, రాజకీయ ప్రచారం భారతదేశంలో జరగకుండా నివారించటం కోసం రౌలట్ చట్టమని, భారతదేశ రక్షణ చట్టమని (Defence of India Act) రెండు నిర్బంధ శాసనాలు భారత ప్రభుత్వం ప్రకటించి అమలు జరిపింది. వాటిని ఖండిస్తూ వ్రాతలు వ్రాసిన పత్రికలపై హెచ్చు మొత్తాలు అపరాధాలుగా విధించటంవల్ల సభలు జరపదలచిన వారిని విశేష హింసలకు, అవమానాలకు గురిచేయటంవల్ల దేశంలో తీవ్రమైన ద్వేషం వ్యాపించింది. 1919 లో జరిగిన జలియన్‌వాలాబాగ్ హత్యలు ఈ ద్వేషాగ్నిని ప్రచండంగా ప్రజ్వలింపజేసినాయి. 1921 లో కాంగ్రెస్ గాంధీమహాత్ముని నాయకత్వంలో సహాయ నిరాకరణోద్యమాన్ని లేవదీసింది. శాసన సభలలో చేరి దేశానికి డొమినియన్‌ల ప్రతిపత్తిని సాధించటం కోసం ప్రచారం చేసే ఉద్దేశంతో 1923 లో మోతీలాల్ నెహ్రూ, చిత్తరంజన్‌దాస్, ప్రకాశం మొదలైనవారి నాయకత్వంలో స్వరాజ్ పక్షము ఏర్పడింది. 1929 డిసెంబర్ 31 వ తేదీలోగా డొమినియన్ ప్రతిపత్తిని భారతదేశానికి ఇంగ్లండ్ ఇవ్వకపోతే సంపూర్ణ స్వాతంత్ర్యం కోసం భారతదేశం పోరాటం సాగిస్తుందని 1928 లో జరిగిన కలకత్తా కాంగ్రెస్ ప్రకటించింది. 1930 లో ఉప్పు సత్యాగ్రహోద్యమము, 1931 లో సాత్విక నిరోధోద్యమము సాగిన తరవాత, 1935 లో బ్రిటిష్ పార్లమెంట్ భారతదేశం ప్రభుత్వ శాసనాన్ని ఆమోదించింది.

## 1935 భారతదేశ ప్రభుత్వ శాసనము

భారతదేశాన్ని సంయుక్త రాజ్యంగా రూపు దిద్దవలెనని ఈ శాసనం నిశ్చయించింది. 1919 భారతదేశ ప్రభుత్వ శాసనం చేసినప్పుడు ఈ దేశంలోని స్వదేశ రాజ్యాల సహకారాన్ని (బ్రిటిష్ ఇండియన్ రాష్ట్రాలలో తలెత్తుతున్న జాతీయోద్యమానికి విరుపుగా) పొందటం కోసం సంస్థానాధీశుల సభను స్థాపించవలెనని బ్రిటన్ సంకల్పించింది. ఆ సంకల్పం మేరకు

1921 లో 120 మంది స్వదేశీయ సంస్థానాల ప్రతినిధులతో ఒక సభ ఏర్పాటయింది. స్వదేశీ రాజ్యాలలో ప్రధానమైనవి కొన్ని తమ ప్రతినిధులను ఈ సభకు పంపలేదు. ఈ సభ్యులలో 127 రాజ్యాలకు ప్రతినిధులు 12 మంది, తదితరులు తమ తమ రాజ్యాల ప్రభువులచే నియమితులైనవారు. 327 సంస్థానాలకు ప్రాతినిధ్యం లేనేలేదు ఈ సభకు అధ్యక్షుడు బ్రిటిష్ రాజ్య ప్రతినిధి. ఆయన లేనప్పుడు సంస్థానాధీశుల సభయొక్క ఛాన్సలర్ సభ కధ్యక్షత వహించేవాడు. పూర్వం సంస్థానాధీశుల పరస్పర సంప్రదింపుల నిషేధం జరిగింది. ఇప్పుడటువంటిసంప్రదింపులు భారతజాతీయోద్యమ వ్యాప్తిని అరికట్టటానికి అవసరమని బ్రిటిష్ పార్లమెంట్‌కు తోచింది. 1935 శాసనము ఇంతకంటె తీవ్రమైన మార్పును తెచ్చిపెట్టవలెనని చూసింది సంయుక్త రాజ్యంగా ఏర్పడనున్న భవిష్యద్భారత దేశంలో స్వదేశ సంస్థానాలను భాగస్వాములను చేయదలచి, ఈ శాసనం చేసిన సూచనలివి : కేంద్ర శాసన సభలో బ్రిటిష్ ఇండియన్ రాష్ట్రాల ప్రతినిధులు 250 మంది కాగా స్వదేశ సంస్థానాధీశుల ప్రతినిధులకు 125 స్థానాలు, కేంద్ర రాజ్య పరిషత్‌లో మొత్తం 260 మంది సభ్యులలో 104 గురు సంస్థానాల ప్రతినిధులు. సంస్థానాల ప్రాతినిధ్యం సంస్థానాల విస్తీర్ణానికి, జనసంఖ్యకు ఎంతో మించింది. సంస్థానాలతో పోల్చినట్లయితే బ్రిటిష్ రాష్ట్రాలకు ప్రాతినిధ్యం చాలా తక్కువ. బ్రిటిష్ రాష్ట్రాల ప్రతినిధులు ఆయా రాష్ట్రాల ప్రజలచే ఎన్నికైనవారు. సంస్థానాల ప్రతినిధులు సంస్థానాధీశులచే నియమితులైనవారు. స్వరాజ్య శకటానికి పూన్చిన వృషభాలలో ఒకటి ముందుకు లాగేది, రెండోది చేవ చచ్చిన ముసలిఎద్దు. సంస్థానాధీశులు రాజ ప్రతినిధి బొటన వేలికింద నలిగిపోయేవారు ఒక విధంగా చూసినట్లయితే వారి ప్రతినిధులు బ్రిటిష్ పరిపాలకుల ప్రతినిధులే.

1937 సంవత్సరంవరకు బర్మా, సింహళాలు భారతదేశంలో అంతర్భాగాలై, భారత రాజ ప్రతినిధి అధికారం కింద ఉన్న రాష్ట్రాలు. 1935 భారతదేశ ప్రభుత్వ శాసనం భారత దేశం నుంచి వీటిని తొలగించి బ్రిటిష్ మంత్రివర్గ సభ్యుడైన వలసల సెక్రటరీ (Colonial secretary) అధికారం కిందికి మార్చింది. భారతదేశంలోని అరాచక శక్తులకు అవి బలి గాకుండా ఉండటం కోసం బ్రిటన్ ఈ విధంగా చేసిందని బ్రిటిష్‌వారి వాదము. భారతదేశం చెయిజారిపోతున్నదనే, వీలైనంత కాలం బర్మా, సింహళాలలోనైనా బ్రిటిష్ పెట్టుబడిదారుల లాభసాటి వ్యాపారాలు సాగవలెనని బ్రిటిష్ ప్రభుత్వం చేసినపని ఇది అని భారతీయుల విమర్శ. కరెన్సీ, నాణేల ముద్రణ కేంద్ర శాసన సభ పర్యవేక్షణ నుంచి తొలగించి ఇండియా రిజర్వ్ బాంక్ అధీనం చేసింది 1935 భారతదేశ ప్రభుత్వ శాసనము.

సంయుక్త రాజ్య లక్షణాలలో ఒకటి కేంద్ర రాష్ట్రాల మధ్య పరిపాలనాధికారాల విభజన ; పరిపాలన సాగించేటప్పుడు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు పరస్పరం తమ అధికారాల పరిధి నతిక్రమించినవని భావించటానికి వీలైన సందర్భాలేర్పడవచ్చు ఆ సందర్భాలలో వివాదాలను పరిష్కరించే అధికారమున్న సంయుక్త రాజ్య న్యాయస్థానము ఉండటం మరో సంయుక్త రాజ్య లక్షణము. 1935 భారతదేశ ప్రభుత్వ శాసనం ఆ విధంగా సంయుక్త రాజ్య న్యాయస్థానాన్ని (Federal Court of India) స్థాపించింది. ఈ న్యాయస్థానానికి రాష్ట్ర ఉన్నత న్యాయస్థానాల తీర్పులపై అపీళ్లను పరిష్కరించే అధికారాన్ని ఇచ్చినారు.

1935 భారతదేశ ప్రభుత్వ శాసనం అర్థ వివరణ విషయమై అభిప్రాయ భేదమున్న

ప్పుడు, తానై చెప్పిన తీర్పులపైన ఫెడరల్ న్యాయస్థానం నుంచి ప్రీవీ కౌన్సిల్‌కు అపీల్ చేయవచ్చుననే నిబంధన ఆ చట్టాలలో పొందు పరచడమైంది. రాష్ట్రాల ఉన్నత న్యాయస్థానాల తీర్పులపై ఫెడరల్ న్యాయస్థానం చేసే నిర్ణయంపై ఆ న్యాయస్థానం సమ్మతితోనే ప్రీవీ కౌన్సిల్‌కు అపీల్ తీసుకొని పోవచ్చు. లేదా ప్రీవీ కౌన్సిల్ సమ్మతించినా అటువంటి అపీల్ చేయవచ్చు. ఫెడరల్ న్యాయస్థానము, ప్రీవీ కౌన్సిల్ నిర్ణయించే న్యాయానికి భారతదేశంలోని అన్ని న్యాయస్థానాలు కట్టుబడి ఉండవలసిందే. 1947లో చేసిన ఫెడరల్ న్యాయస్థాన శాసనము రాష్ట్ర ఉన్నత న్యాయస్థానాల తీర్పులపై సరాసరి ప్రీవీ కౌన్సిల్‌కు అపీల్‌ను తీసుకొని పోవటాన్ని నిషేధించింది. 1950 జనవరి 26 తేదీనాడు అమలులోకి వచ్చిన భారతదేశ నూతన రాజ్యాంగం ఫెడరల్ న్యాయస్థానము, ప్రీవీ కౌన్సిల్ రెండింటి స్థానంలో భారత పరమోన్నత న్యాయస్థానాన్ని ప్రతిష్ఠించింది.

1935 భారతదేశ ప్రభుత్వ శాసనము రాష్ట్రాలలో, అత్యధిక సంఖ్యలో ఎన్నికయిన సభ్యులున్న శాసన సభలను ప్రతిష్ఠించటమే కాక, పరిపాలనా శాఖ లన్నింటినీ ఎన్నికైన సభ్యులనుంచి తీసుకొన్న మంత్రుల అధీనం చేసింది. గవర్నర్ ప్రత్యేక బాధ్యతలను (Special responsibilities), సొంత వివేచనలోని విషయాలను (Matters in his individual discretion) అది రద్దు చేయలేదు. కాని గవర్నరూ, ఆతని మంత్రులూ ఏకాభిప్రాయానికి వస్తే గవర్నర్ జనరల్, ఇండియా కార్యదర్శుల ఆమోదానికి శాసనాలను పంపనక్కరలేదని నిర్ణయించింది. ఈ విధంగా 1919 చట్టంవల్ల రాష్ట్రాలలో నెలకొల్పిన ద్వంద్వ ప్రభుత్వాన్ని 1935 శాసనము ఒకవైపు రద్దు చేస్తూ, కేంద్ర ప్రభుత్వంలో అటు వంటి ప్రభుత్వాన్ని అది ఏర్పాటు చేసింది. కాని భారతదేశంలోని రాజకీయ పక్షాలు సహక రించక పోవటంవల్ల కేంద్రంలో ద్వంద్వ ప్రభుత్వ విధానం అమలులోకి రాలేదు. అందువల్ల 1947లో భారతదేశము రెండు చీలికలై బ్రిటన్ దేశంనుంచి రాజకీయంగా విడివడినవరకూ తమ ప్రత్యేక బాధ్యతలతోను, సొంత వివేచనాధికారాలతోను కేంద్ర శాసన సభకు బాధ్యత వహించని పరిపాలన ఇండియా కార్యదర్శి పర్యవేక్షణకు లోబడి, భారతదేశం గవర్నర్ జనరల్ సాగించినాడు.

## 1935 శాసనంవల్ల పార్లమెంట్‌కు భారతదేశానికి ఉన్న సంబంధాలలో వచ్చిన మార్పులు

1935 భారతదేశ ప్రభుత్వ శాసనం భారతదేశానికి – పార్లమెంట్‌తో ఉన్న సంబంధా లలో కొన్ని మార్పులను తెచ్చి పెట్టింది. 1935 శాసనం రాష్ట్రాలలో స్వపరిపాలనను, శాసన సభకు సంపూర్ణంగా బాధ్యత వహించే మంత్రివర్గాలను ప్రవేశపెట్టటంవల్ల రాష్ట్ర పరి పాలనపై గవర్నర్ జనరల్ – ఇండియా కార్యదర్శుల పట్టు చాలా సడలించింది. కేంద్రంలో కొన్ని ప్రభుత్వ శాఖలను శాసన సభకు బాధ్యత వహించే మంత్రులకు అప్పగించటంవల్ల ఇండియన్ స్టేట్ సెక్రటరీ అధికారం కొంత తగ్గినట్లయింది అయినా అనేక విషయాలలో గవర్నర్‌లూ, గవర్నర్-జనరలూ సొంత విచక్షణతోను, ప్రత్యేక బాధ్యతతోను వ్యవహ రించటానికి వీలుండటంవల్ల, వారట్లా వ్యవహరించేటప్పుడు ఇండియన్ కార్యదర్శికి వారి చర్యలను విమర్శించటానికి, మార్చటానికి, అరికట్టటానికి అధికారమున్నది. అందే దేశ

రక్షణ, విదేశ వ్యవహారాలు, అటవీ జాతులు, కొండజాతులు, క్రైస్తవమత సంరక్షణ ఫెడరల్ రైల్వే అధికారవర్గము, ఇండియన్ రిజర్వ్ బాంక్ ఇండియన్ కార్యదర్శి అదుపాజ్ఞల లోని విషయాలయినాయి. హిందూదేశ పరిపాలనా యంత్రాంగంపై రాష్ట్ర కేంద్ర ప్రభుత్వా లకు తానిచ్చే సూచనల ద్వారా ఇండియన్ కార్యదర్శి పెత్తనం చేయగలిగినాడు. ఇండియా పరిపాలక వర్గం వారిని (I. C. S.), ఇండియన్ పోలీస్ వర్గం వారిని (I. P. S.) నీటి పారు దలకు సంబంధించిన ఉన్నతోద్యోగ వర్గం వారిని ఇండియన్ స్టేట్ సెక్రటరీ నియమించే వాడు. గవర్నర్ జనరల్ ఆమోదించిన చట్టాలనుగాని, రాజు ఆమోదానికి కొంత కాలం ఉంచి పంపిన చట్టాలనుగాని ఆమోదించే, నిరాకరించే సందర్భాలలో బ్రిటిష్ రాజుకు సలహా నిచ్చే అధికారము ఇండియన్ కార్యదర్శిదే. భారతదేశ ప్రభుత్వాన్ని గురించిన కౌన్సిల్ ఆజ్ఞలను (Orders-in-Council), గవర్నర్లకు, గవర్నర్ జనరల్‌కు పంపే సూచన లను (Instruments of Instructions) పార్లమెంట్ ఆమోదానికి నివేదించే అధికారమూ ఇండియన్ కార్యదర్శిదే.

1935 చట్టం తెచ్చి పెట్టిన మరో మార్పు ఇండియన్ కౌన్సిల్‌ను రద్దు చేయటం, ఈ చట్టం ప్రకారం ముగ్గురికి తక్కువగాకుండా, ఆరుగురికి మించకుండా తనకు సలహాదారులను నియమించుకొనే అధికారము ఇండియన్ స్టేట్ కార్యదర్శికి లభించింది. ఈ సలహాదారుల ఉద్యోగకాలము అయిదేళ్ళు. వీరిలో సగం మంది అయినా భారతదేశంలో పదేళ్ళ కాలం ఉద్యో గాలు చేసిన వారై ఉండటమేకాక, వారు ఉద్యోగ విరమణచేసి రెండేళ్లకు మించి ఉండరాదు. వారితో సంప్రతించటం, వారి సలహాలను పాటించటం, పాటించకపోవటం ఇండియన్ కార్య దర్శి ఇష్టానికి వదిలివేయటమయింది. అఖిల భారత ఉన్నతోద్యోగుల ఉద్యోగ నిబంధనల విషయమై మాత్రం తన సలహాదారులలో సగం మంది అయినా సమ్మతించనిదే ఇండియన్ కార్యదర్శి ఏమీ చేయరాదని నియమం చేసినారు.

ఇండియన్ హైకమిషనర్ ఉద్యోగం విషయంలో 1935 భారతదేశ ప్రభుత్వ శాసనం తెచ్చిపెట్టిన మార్పేమీ ఎక్కువ లేదు. అతనిని నియమించేది గవర్నర్ జనరల్. తాత్కాలి కంగా అతనిని ఉద్యోగం నుంచి తొలగించటానికిగాని, శాశ్వతంగా తొలగించటానికిగాని గవర్నర్ జనరల్ కధికారమున్నది. పూర్వం ఇండియన్ కౌన్సిల్ నిర్వహిస్తూ ఉన్న పనులను హైకమిషనర్‌కు ఇండియన్ కార్యదర్శి అప్పగించవచ్చు. ఇండియన్ కార్యదర్శి పేర ఆయన కాంట్రాక్టులు ఆమోదించవచ్చు. గవర్నర్ జనరల్ పేర ఇంగ్లండ్‌లో కొనుగోళ్ళు చేయవచ్చు. ఇంగ్లండ్‌లోని ఇండియన్ విద్యార్థుల బాగోగులు చూడటమే కాక, అంతర్జాతీయమైన, సామ్రాజ్య సంబంధమైన ప్రదర్శనలను (Exhibitions) ఏర్పాటు చేయవలసిన వాడు ఇండి యన్ హైకమీషనర్. అతని వేతనము 3000 పౌన్లను భారతదేశం చెల్లించుకోవలె. అతనికి పెన్షన్ లేదు ఉద్యోగకాల పరిమితి అయిదేళ్ళు. తిరిగి ఆ ఉద్యోగానికి అతడు నియమితుడు కావచ్చు.

భారతదేశానికి, ఇంగ్లండ్‌కు ఉన్న సంబంధాలు 1947 బ్రిటిష్ పార్లమెంట్ ఆమోదిం చిన భారతదేశ స్వాతంత్ర్య శాసనంవల్ల తీవ్ర పరివర్తన పొందినాయి.

1935 భారతదేశ ప్రభుత్వ శాసనం 1937 లో అమలులోకి వచ్చినా కేంద్ర శాసన సభలో అధిక స్థానాలు గెల్చుకొన్న కాంగ్రెస్ స్వరాజ్య పక్షం ఆ శాసనం సంకల్పించిన

ద్వంద్వ ప్రభుత్వంలో మంత్రివర్గ మేర్పరచటానికి నిరాకరించింది. ఏడు రాష్ట్రాలలో కాంగ్రెస్ మంత్రివర్గా లేర్పడినాయిగాని, మంత్రివర్గాలను సంప్రదించకుండా భారతదేశం దొరతనము భారతదేశాన్ని మిత్రమండలి పక్షాన రెండో ప్రపంచ యుద్ధంలో చేర్పటంవల్ల ఆ మంత్రి వర్గాలు తమ పదవులకు రాజీనామా చేసినాయి ఆ రాష్ట్రాలలో గవర్నర్‌లు తమ ప్రత్యేకాధి కారాలతో పరిపాలించినారు. వేల సంఖ్యలో కాంగ్రెస్ ప్రముఖులు కారాగారాలలో బందీలు అయినారు. 1942 యుద్ధంలో బ్రిటన్, వారి మిత్రులూ చాలా దెబ్బతిన్నారు. తూర్పు దిక్కున జపాన్ సైన్యాలు మలయా బర్మాలలోకి చొచ్చుకొని వచ్చినాయి సుభాస్ చంద్రబోస్ తన నాయకత్వంలో బర్మాలో భారతదేశ స్వతంత్ర సైన్యాన్ని సమీకరించినాడు. బొంబాయిరేవులో నౌకా సైన్యంలో తిరుగుబాటు జరిగింది. ఈ సందర్భంలో భారతదేశ స్వాతంత్ర్య రక్షణ భారతదేశానికి అప్పగించటం ఉచితమని తోచి బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశ నాయకులతో సంప్రతింపులు జరిపే నిమిత్తం కామన్స్ సభ నాయకుడైన క్రిప్స్‌ను రాయబారం పంపింది. కాని అతడు సూచించిన సంస్కరణలు భారతదేశంలోని రాజకీయపక్షాలు వేర్వేరు కారణాలు చెప్పి ఆమోదించలేదు. క్రిప్స్ రాయబారం విఫలమైన తరవాత "క్విట్ ఇండియా (Quit India)" అనే నినాదంతో స్వాతంత్ర్యోద్యమాన్ని కాంగ్రెస్ లేవదీసింది. వేలకొద్ది భారతీయులు హతం కావటమో, లేదా కారాగారాలలో బందీలు కావటమో జరిగింది. ఆ సమయంలో రష్యా యుద్ధంలో మిత్రమండలివైపు చేరిందనే కారణం చేత ఇండియన్ కమ్యూనిస్ట్ పార్టీ బ్రిటిష్ ప్రభుత్వ యుద్ధ ప్రయత్నాలకు సాయం చేసింది. తిరిగి 1944 భారతదేశంలోని రాజకీయ ప్రతిష్టంభనను పరిష్కరించే ప్రయత్నాలు ప్రారంభమైనాయి. ఇన్నాళ్ళు సమాఖ్య రాజ్య (Federation) స్థాపనకు అంగీకరించని కాంగ్రెస్ పక్షం అంగీకరించింది కాని ఇంతకాలం ఫెడరేషన్ కావలెనంటూ ఉన్న ముస్లింలీగ్ హిందూ ముస్లిమ్‌లు రెండు వేర్వేరు జాతులని కాంగ్రెస్ అంగీకరించవలెనని భారత దేశాన్ని హిందూ ఇండియా, ముస్లిం ఇండియా (పాకిస్తాన్) లని రెండు స్వతంత్ర రాజ్యాలుగా చీల్చవలెనని పట్టుబట్టింది. ఈ రెండింటిలో దేనికీ కాంగ్రెస్ పక్షం అంగీకరించలేదు. 1945 (15 ఆగస్ట్) లో జపాన్‌తో యుద్ధం ముగి సింది. 1945-46 లలో కేంద్ర, రాష్ట్ర శాసన సభలకు ఎన్నికలు జరిగి కొత్త శాసన సభ లేర్పడినాయి. 1945 మార్చి పార్లమెంట్ ఎన్నికలలో అధికార పక్షంగా ఏర్పడిన లేబర్ పక్ష మంత్రివర్గం కొత్త ఇండియన్ స్టేట్ కార్యదర్శి పెథిక్ లారెన్స్ ఆధిపత్యంలో భారత దేశానికి రాయబారం పంపింది. ఆ రాయబారవర్గము అన్ని రాజకీయ పక్షాలతో సంప్రతించి, బ్రిటిష్ భారతీయ రాష్ట్రాలు, స్వదేశ సంస్థానాలు కలిసి ఏకరాజ్యంగా ఏర్పడవలెనని, దానికి తగిన రాజ్యాంగాన్ని, వారెన్నుకొనే రాజ్యాంగ నిర్మాణ సభ ఏర్పాటు చేయవలెనని నిశ్చయిం చింది. కొత్త రాజ్యాంగ స్థాపన జరిగేటంత వరకు వివిధ రాజకీయ పక్షాల ప్రతినిధులతో కూడిన తాత్కాలిక ప్రభుత్వం (Interim Government) పరిపాలన సాగించవలెనని, బ్రిటిష్ వారి దేశం నుంచి వైదొలగినప్పుడు స్వదేశ సంస్థానాలు స్వతంత్ర మవుతాయనీ స్వతంత్ర భారతంతో సంయుక్తమయ్యేదీ, లేనిదీ ఇరుపక్షాలు సంప్రతింపులవల్ల తేల్చుకోవలె నని పెథిక్ లారెన్స్ రాయబారవర్గం స్పష్టం చేసింది. తాత్కాలిక ప్రభుత్వం 2-9-1946 నాడు ఏర్పడిందికాని, దానిలో ముస్లిమ్‌లీగ్ ప్రతినిధులేకాని కాంగ్రెస్ పక్షానికి చెందిన ఏ ముస్లిమ్ మంత్రిగా ఉండరాదని పట్టుబట్టి, 15 అక్టోబర్ వరకు ముస్లింలీగ్ చేరలేదు.

రాజ్యాంగ నిర్మాణ సభ 9-12-46 నాడు సమావేశమైంది. ఆ సభలో ముస్లిమ్‌లీగ్ ప్రతినిధులు చేరలేదు. 1947 లో బ్రిటిష్ మంత్రివర్గము 1948 జూన్ నెల తరవాత భారత దేశంలో బాధ్యత వహించే పరిపాలక వర్గానికి, అది ఒకటిగాని. ఒకటికంటె ఎక్కువ పరిపాలక వర్గాలకుగాని పరిపాలనాధికారం అప్పగించి, తాము ఈ దేశం నుంచి వైదొలగి పోగలమని తమ నిర్ణయాన్ని ప్రకటించింది. ప్రకటించి ఊరుకోక 4-7-47 నాడు భారతీయ స్వాతంత్ర్య శాసనాన్ని పార్లమెంట్‌లో ప్రవేశ పెట్టింది. దానిని 18-7-47 నాడు పార్లమెంట్ ఆమోదించింది.

## 1947 భారతదేశ స్వాతంత్ర్య శాసనము

1947, ఆగస్ 15 వ తేదీ నుంచి భారతదేశము స్వాతంత్ర్యం పొంది పాకిస్తాన్, భారతదేశము అనే రెండు డొమినియన్‌లుగా చీలి పోయింది. భారతదేశంలోని స్వదేశ సంస్థానాలపై బ్రిటిష్ రాజు ఆధిపత్యం అంతరించింది. అతని కిన్నాళ్ళున్న భారతదేశ చక్రవర్తి అనే బిరుద మింతటితో ఊడిపోయింది. స్వదేశ సంస్థానాలు స్వతంత్రమయినట్లూ, అవి వాటిని ఆనుకొని ఉన్న ఏ డొమినియన్‌తో నైనా ఐక్యం కావచ్చుననీ సంప్రతింపులు జరిపి ఒక డొమినియన్‌లో చేరే వరకు, 1935 ప్రభుత్వ చసనము ఇరుపక్షాలకు వర్తిస్తుందని 1947 శాసనం ప్రకటించింది. రెండు డొమినియన్‌లు రాజ్యాంగ నిర్మాణ సభలను ఏర్పరిచి తమ తమ రాజ్యాంగాలను నిర్మించుకోవచ్చుననీ, ఈ లోగా 31-3-48 వరకు గవర్నర్-జనరలూ ఆ తరవాత ఆ యా రాజ్యాంగ నిర్మాణసభ లాలూకు 1935 పార్లమెంటరీ శాసనాన్ని తమ కవసరమని తోచినవిధంగా సవరించుకోవచ్చుననీ బ్రిటిష్ రాజు కిక భారతదేశ డొమినియన్ లపై గాని, వాటి చట్టాలపై గాని ఏ విధమైన అధికారము ఉండదని ఈ డొమినియన్‌లలో ఏదిగాని తాను కోరినట్లయితే బ్రిటిష్ కామన్‌వెల్త్ నుంచి విడిపడటానికి సర్వాధికారం కలిగి ఉంటుందని స్పష్టీకరించటమయింది భారతదేశం స్వతంత్రమైనందువల్ల, ఇండియన్ స్టేట్ సెక్రటరీ పదవి నిరర్థకం కావటంవల్ల రద్దు అయింది. అతనితోపాటు, ఆయన సలహాసంఘము ఇతర ఉద్యోగవర్గాలు అనవసరాలై, ఇంతకాలం వారు చూస్తూ ఉన్న పనిలో మిగిలినది కామన్‌వెల్త్ వ్యవహారాల స్టేట్ సెక్రటరీకి బదిలీ అయింది

ఇండియా రాజ్యాంగ నిర్మాణ సభ (29-8-47) నియమించిన సంఘము తన నివేదికను 21, ఫిబ్రవరి' 48 నాడు సమర్పించింది. అది 26-11-49 నాడు ఆమోదం పొందింది. అది సంపూర్ణంగా 26-1-50 నాడు అమలులోకి వచ్చింది అది సర్వసత్తాక ప్రజాస్వామ్య గణ రాజ్యము (Soveieign Democtatic Republic) సమాఖ్య రూపంలో ఉండే ఒకే రాజ్యము. కేంద్ర శాసనాధికారాలని, రాష్ట్ర శాసనాధికారాలని, ఉమ్మడి రాజ్యాధికారాలని విభజన ఉంది. రాజ్యాంగంలో పేర్కొని మిగులు అధికారాలు కేంద్రానివే. అధికారాలను గురించిన వివాదాలను పరిష్కరించటానికి సమాఖ్య రాజ్యాలలో ఉన్నట్లు పరమోన్నత న్యాయస్థానము (Supreme court) మన రాజ్యాంగంలో ఏర్పాటు అయింది. సమానత్వ. స్వాతంత్ర్య సాధనం రాజ్యాంగ లక్ష్యము. ఈ లక్ష్యాన్ని సాధించటం కోసం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు నిర్వహించవలసిన కార్యక్రమాన్ని రాజ్యాంగ శాసనం విధించింది. పాకిస్తాన్‌లో రాజ్యాంగ నిర్మాణ వ్యవహారం ఇంకా నలుగుతూనే ఉంది. రెండు డొమినియన్‌లూ

బ్రిటిష్ ప్రీవీ కౌన్సిల్‌కు తమ ఉన్నత న్యాయస్థానాల తీర్పుల నుంచి అపీల్‌ను తీసుకొని పోవటాన్ని నిషేధించినాయి. భారతదేశము బ్రిటిష్ రాజును తన రాజుగా గుర్తించటానికి నిరాకరించినా, కామన్‌వెల్త్ సంస్థలో సభ్యత్వాన్ని వదులుకోలేదు. కొంతకాలమైన తరవాత, బ్రిటిష్ కామన్‌వెల్త్ అనే పదంలోని బ్రిటిష్ అనే విశేషణాన్ని తొలగించి, తన సామ్రాజ్య అధీనంలోని జాతులలో ఒక్కొక్కటికి రాజకీయ స్వాతంత్ర్యాన్ని అనుగ్రహించేటప్పుడు, అది కామన్‌వెల్త్ సంస్థలో చేరటానికి ఏ అభ్యంతరమూ దానికి లేకుండేటట్లు చేసినారు. స్వాతంత్ర్య ప్రియత్వానికి పేరుగాంచిన బ్రిటిష్ జాతి తమ సామ్రాజ్యంలోని అధీనజాతులకు ఏ ఏ క్రమంలో స్వరాజ్య ప్రదానం చేసింది ఏ దేశ చరిత్రలోనైనా చెప్పుకోదగిన అధ్యాయము గర్వించదగిన గాథ

## బ్రిటిష్ సామ్రాజ్యంలోని ఇతర ప్రాంతాల రాజకీయ విముక్తి చరిత్ర

స్వపరిపాలనను అనుభవిస్తూన్న బ్రిటిష్ కాలనీలలోని ప్రజలను మాతృదేశంలో దిన దినాభివృద్ధి పొందుతున్న స్వాతంత్ర్యోద్యమం ఉత్తేజితులను చేసింది ఈ కాలనీలలో స్వతంత్ర పరిపాలనాధికార ప్రదానము సౌమ్యమార్గాల ద్వారా అంచెలవారీగా సాగింది. 1867 తరవాత బాధ్యతాయుత ప్రభుత్వ మిచ్చిన కాలనీల సంఖ్య క్రమంగా పెరిగింది 1872 లో కేప్ కాలనీకి, 1892 లో నేటాల్‌కు స్వపరిపాలన మివ్వటం జరిగింది బోయర్ (దక్షిణాఫ్రికా లోని డచ్ ప్రజ) యుద్ధం తరవాత ఇంగ్లండ్ ఆక్రమించుకొన్న రాష్ట్రాలలో పరిస్థితు లనుకూలించినప్పుడు స్వపరిపాలనను ఏర్పాటుచేయగలమన్న వాగ్దానం చెల్లించి, 1906 లో ట్రాన్స్‌వాల్ రాష్ట్రానికి, మరుసటి ఏడు ఆరంజ్‌నది కాలనీకి బాధ్యతాయుత పరిపాలన మొదలయింది. 1909 లో ఈ ఆఫ్రికన్ కాలనీలను ఒకే కూటమిగా చేస్తూ దక్షిణాఫ్రికా సమైక్య శాసనం చేసినారు. నాలుగు కాలనీలలో నాలుగు ప్రత్యేక ప్రభుత్వాలుండటంవల్ల ఇబ్బంది తోచి తమ ఐక్యాన్ని మరింత పరిష్ఠం చేసుకోవలెననే కోరిక నేటాల్‌కు తప్ప, మిగతా కాలనీలకు కలిగింది. అందువల్ల రాష్ట్ర శాసన సభలకు శాసనాధికారము, స్థానిక ఉద్యోగాలపై పెత్తనము, స్థానికంగా పన్నులు విధించటానికి హక్కు ఇచ్చినా, వాటి పరిపాలన కేంద్ర ప్రభుత్వాధీనమయింది. యూనియన్ ప్రభుత్వం నియమించిన పరిపాలకులు (Administrators) రాష్ట్రాలలోని కార్యనిర్వాహక వర్గాలకు అధిపతులయినారు. సంయుక్త రాజ్య లక్షణ మొక్కటి మాత్రం దక్షిణాఫ్రికా రాష్ట్రాల సమాఖ్యలో నిల్చింది. కేంద్రంలో ఏర్పరిచిన ద్వంద్వ శాసన సభల పైసభ అయిన సెనేట్‌లో నాల్గు రాష్ట్రాలకూ సమాన ప్రాతినిధ్య ముంది. ఇట్లా పరిపాలనలో ఏకత్వము, శాసనాలు చేయటంలో ప్రత్యేకత ఉండటంచేత దక్షిణాఫ్రికా యూనియన్ కొంత సమాఖ్య రాజ్య లక్షణంగల ఏక రాజ్యంగా రూపొందింది.

1756-63 మధ్యకాలంలో జరిగిన ఏడేళ్ల యుద్ధకాలంలో అంతవరకూ ఫ్రెంచ్ వారిదై ఉన్న కెనడా రాష్ట్రము ఇంగ్లీష్‌వారి రాజ్యమయింది. ఆరంభంలో ఫ్రెంచ్ కెనడాలతో బాటు ఇంగ్లీష్ కెనడా ఒకటి ఏర్పడింది. క్రమంగా సెంట్ లారెన్స్ నదీ ముఖంలో, న్యూఫౌండ్‌లాండ్ ద్వీపంలోను, న్యూబ్రన్స్‌విక్. నోవాస్కోషియా, ప్రిన్స్ ఎడ్వర్డ్ ద్వీపాలలోను ఇంగ్లీష్ కాలనీ లేర్పడినాయి. హడ్‌సన్ సముద్రతీరాలలోను ఇంగ్లీష్‌వారు కొన్ని వలసలేర్పరిచినారు. కెనడాలోని ఇంగ్లీష్ కాలనీలకు దక్షిణంలో అట్లాంటిక్ సముద్రతీరంలో దక్షిణోత్త

రంగా వ్యాపించిన పదమూడు ఇంగ్లీష్ కాలనీలకు సెంట్ లారెన్స్ నది, ఐదు ఉత్తర అమెరికన్ సరస్సులు (సుపీరియన్, మిషిగన్, హ్యూరన్, ఈరి, అన్టారియోలు) ఎల్లలుగా ఏర్పడినాయి. కెనడా మొదటినుంచి సంయుక్త రాజ్య విధానాన్ని అభిమానించింది. 1871 లో బ్రిటిష్ కొలంబియా, 1878 లో ప్రిన్స్ ఎడ్వర్డ్ దీవి, కెనడా సంయుక్త రాజ్యంలో చేరినాయి. 1869 వరకు హడ్సన్ సముద్ర వర్తక సంఘంవారు, అనంతరం కెనడా డొమినియన్ ప్రభుత్వం పరిపాలించిన ప్రాంతంలో 1870 లో మానిటోబా, 1905 లో సస్కాచ్ ఛెవాన్ (Saskatchewan), అల్బర్టా రాష్ట్రాలు ఏర్పడినాయి. ఇంగ్లండ్పై తిరగబడిన కొత్తలో, సమ్మేళన రాజ్య మేర్పరుచుకొన్న కొద్ది కాలానికే 13 ఇంగ్లీష్ కాలనీలు సంయుక్త రాజ్య విధానాన్ని అవలంబించటం కెనడా ప్రజలలో సంయుక్త రాజ్య విధానంపట్ల ఆదర భావాన్ని కలిగించింది. ముందుముందు ఇంగ్లండ్వల్ల తమ స్వాతంత్ర్యానికి ముప్పు కలగకుండటానికై అమెరికన్ కాలనీలు సంయుక్త రాజ్యంగా మారినట్లే, ఆ సంయుక్త అమెరికన్ రాజ్యంవల్ల తమ భద్రతకు భంగపాటు కలగకుండటానికి కెనడాలోని రాష్ట్రాలు సంయుక్త రాజ్యంగా స్థిరపడినాయి.

ఆస్ట్రేలియాకు ఇరుగుపొరుగు రాజ్యాల బెడద లేదు. ఆ ఖండంలో ఏర్పడిన ఇంగ్లీష్ కాలనీలకు ఆ కారణంగా సంఘటనమై తీరవలసిన పరిస్థితి లేదు. కాని వాటిని ఏదో ఒక విధంగా సమైక్యం చేయటం మేలు అనే యోచనతో 1849 లో బ్రిటిష్ పార్లమెంట్లో ఒక చట్టం ప్రతిపాదితమయింది. కాని అప్పుడా ప్రయత్నం సఫలం కాలేదు. నూతన దక్షిణ వేల్స్ (New South Wales), విక్టోరియా కాలనీల ఎగుమతి, దిగుమతి పన్నుల విధానంలో ఉండే విభేదాలు ఈ సమైక్య ప్రయత్నాలకు చాలాకాలం అడ్డు నిలిచినాయి. కెనడా సమైక్యము వీటికి మళ్ళీ ప్రోత్సాహం కల్గించింది. 1870 లో ఆస్ట్రేలియా సమాఖ్య గురించి విచారణ చేయటానికి ఒక రాయల్ కమిషన్ను నియమించడమైంది సమాఖ్యను ఏర్పాటుచేసే విషయం అందరూ ఆమోదించినారుకాని కొత్త రాజ్యాంగం ఏ విధంగా ఉండవలె అనే విషయం మీద ఏకాభిప్రాయం కలగలేదు. ఆస్ట్రేలియాలో వివిధ ప్రాంతాలమధ్య రాకపోకల సౌకర్యాలు మెరుగయినందువల్ల అమెరికన్లు, యూరోపియన్ జాతులు పసిఫిక్ సముద్ర సీమలలోకి చొచ్చుకొని రావటానికి ఆరంభించటంవల్ల ఆస్ట్రేలియన్లలో సమైక్య వాంఛ దృఢతరమయింది. వారి కోరికపై బ్రిటిష్ పార్లమెంట్ 1888 లో ఆస్ట్రలేషియా సమాఖ్య సమితి (Federal Council of Austral sia) ని స్థాపిస్తూ శాసనం చేసింది. దానికి ఆర్థికాధికారాలుగాని, పరిపాలనాధికారాలుగాని ఇవ్వలేదు పరిమితమైన శాసనాధికారం మాత్రమే ఉంది. నూతన దక్షిణ వేల్స్ న్యూజీలాండ్ సమాఖ్యలో చేరలేదు. కాని ఆస్ట్రేలియన్ కాలనీల పరస్పర సంబంధాలు, ఇతర ప్రపంచంతో సంబంధాలు కలిసి ఉండటానికి అనుకూలించక పోవటంవల్ల ఆ కాలనీలు మరింత ఐక్యం కావలసిన అవసరం పెరిగింది. 1891 లో సమాఖ్య స్థాపించే ఉద్దేశంతో ఒక చిత్తు చట్టం తయారయిందికాని. కలోనియల్ శాసన సభలు దానిని ఆమోదించలేదు కాని సమైక్యం కావలెననే కోరిక బలీయం కావటంవల్ల నూతన రాజ్యాంగ నిర్మాణానికి ప్రత్యేక మొక పార్లమెంట్ 1897 లో సమావేశమయింది. అది సిద్ధపరిచిన చిత్తు చట్టాన్ని ఆమోదిస్తూ బ్రిటిష్ పార్లమెంట్ ఒక శాసనం చేసింది. శాసన విషయాలు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల మధ్య విభజన చెందినాయి. ఈ రెండు పట్టికలలోను ప్రస్తావించని

విషయాలు రాష్ట్ర శాసనాధికారానికి కేటాయించినారు. ఇట్లా రాజ్యాంగ శాసనం ఉదహరించని
అవశిష్టాధికారాలు (Residuary Powers) రాష్ట్రాలకు చెందుతాయనటంలో ఆస్ట్రేలియన్
సమాఖ్య నిర్మాతలు అమెరికన్ (U. S. A.) రాజ్యాంగాన్ని అనుకరించినారు.

న్యూజీలాండ్ రాజ్యాంగము కెనేడియన్, ఆస్ట్రేలియన్ సమాఖ్య రాజ్యాంగాలవలెగాక,
దక్షిణాఫ్రికా రాజ్యాంగాన్ని అనుకరిస్తూ ఏక రాజ్యాంగమయింది (Unitary State-
Constitution) 1851 లో న్యూజీలాండ్‌లో రాష్ట్ర శాసన సభలు స్థాపించినారు. కాని,
అవి 1879 లో రద్దు అయినాయి. వాటి స్థానంలో ఏక రాజ్యమూ (Unitary State), ఏక
రాజ్యాంగమూ ఏర్పాటు అయినాయి

ఇట్లా కాలక్రమంలో న్యూఫౌండ్ లాండ్‌తో కలిసి స్వపరిపాలనమనుభవించే బ్రిటిష్
కాలనీలు ఐదు ఏర్పడినాయి న్యూఫౌండ్ లాండ్ ఏకరాజ్య విధానాన్ని అవలంబించింది.
1907 లో జరిగిన బ్రిటిష్ కాలనీల సమావేశంలో వారు తీసుకొన్న నిర్ణయాన్నిబట్టి వాటికి
డొమినియన్‌లనే నామకరణం చేసినారు డొమినియన్ ప్రతిపత్తి వాటికి వచ్చింది ఈ డొమిని
యన్ ప్రతిపత్తి ముఖ్య లక్షణము శాసన సభకు ఆ దేశపు కార్యనిర్వాహక వర్గపు బాధ్యత,
ఆ శాసనసభ సంపూర్ణ ప్రజాప్రతినిధి అయి ఉండవలసి ఉండటం రెండో ప్రధాన లక్షణము
కాలనీలు డొమినియన్‌లయిన తరవాతకూడా వాటి రాజ్యాంగ పరిణామము బ్రిటిష్ సామ్రాజ్య
ప్రభుత్వమూ, పార్లమెంటూ ఆమోదించవలసి ఉన్నా, కాలనీల అభీష్టానికి అనుకూలమైన
విధంగానే జరిగింది, అట్లా జరగవలెనని ఉభయులూ అంగీకరించిన విషయమే ఎంతవరకు
బ్రిటిష్ ప్రభుత్వం తన శాసనాధికారాన్ని ప్రయోగించవలెననేది నిర్ణయించేవారు డొమినియన్
శాసనసభల శాసనాధికారం పరిమితి నిశ్చయించేవారు. బ్రిటిష్ పార్లమెంట్ సభ్యులే కాక, ఆ
శాసన సభలకు బాధ్యత వహించిన 'బ్రిటిష్ పార్లమెంట్ కే మాత్రం బాధ్యత వహించని
డొమినియన్ మంత్రివర్గా లయినాయి.

కాని, డొమినియన్ శాసనసభల శాసనాధికారానికి హద్దులు లేకపోలేదు శాంతి,
క్రమ విధానము, సత్పరిపాలనకు సంబంధించిన చట్టమేదైనా చేయటానికి డొమినియన్ శాసన
సభల కధికారముందిగాని, వాటి శాసనాలు వాటి పరిహద్దులను దాటి చెల్లవు. అంతేకాక
డొమినియన్‌ల కన్వయించే సామ్రాజ్య పార్లమెంట్ (Imperial Parliament) శాసనానికి
దేనికీ విరుద్ధంగా అవి ఉండరాదని కలోనియల్ శాసనాల చెల్లుబడి చట్టం (Colonial Laws
Validity Act) విధించింది. అన్యదేశాల ఆక్రమణనుంచి డొమినియన్ రక్షించే బాధ్యతా,
అధికారమూ సామ్రాజ్య పార్లమెంట్‌దే. అదే విధంగా డొమినియన్‌ల ఓడ వర్తకం పార్లమెంటరీ-
చట్టాలకు లోబడినట్టిదే. ఏ డొమినియన్ స్వయంగా కోరితే తప్ప పార్లమెంట్ ఆ డొమిని
యన్‌కు అన్వయించే ఏ చట్టాన్నీ చేయరాదనీ, ఒకవేళ చేసినా ఆ చట్టం డొమినియన్ సమ్మ
తిపొందినదే అయి ఉండవలెననే సంప్రదాయం ఆచరణలోకి వచ్చింది. ఒక కాలనీని డొమిని
యన్‌గా మార్చినప్పుడు ఆ మార్పును పొందుపరుస్తూ చేసిన సామ్రాజ్య శాసనము బ్రిటన్
దేశానికీ, ఆ డొమినియన్‌కు ఆ తరవాత ఉండే సంబంధాలను, ఆ డొమినియన్ రాజ్యాంగాన్ని
నిర్ణయించే ప్రధాన శాసనమయింది. కామన్‌వెల్త్‌లో చేరిన ఏక రాజ్యాలలోగాని, సంయుక్త
రాజ్యాలకు చెందిన రాష్ట్రాలలోగాని ఉండే శాసనసభలకు ఆ రాజ్యాంగాలను మార్చే అధికారం
కలోనియల్ శాసనాల చెల్లుబడి చట్టంవల్ల లభించింది. అటువంటి శాసన సవరణాధికారం

అక్షరాలా శాసనంలో పేర్కొనటం జరిగింది. సంయుక్త రాజ్యాలలో ఈ అధికార పరిమితి ఆ రాజ్యాలు చేసుకొన్న ఒడంబడికల మీద ఆధారపడుతున్నది. ఆస్ట్రేలియన్ రాజ్యాంగాన్ని సామ్రాజ్య పార్లమెంట్ ప్రసక్తి లేకుండా సవరించటానికి ఆస్ట్రేలియన్ డొమినియన్ శాసన సభకే అధికారముంది. బ్రిటిష్ డొమినియన్‌లు ఐదింటిలో ఒక్క కెనడా విషయంలో మాత్రం ఆ దేశపు రాజ్యాంగాన్ని సవరిస్తూ శాసనం చేయవలసింది బ్రిటిష్ పార్లమెంట్‌పై ఉంది. మిగిలిన [illegible] తమ తమ రాజ్యాంగాలను సవరించుకోగల్గినందువల్ల వాటిని ఒక విధంగా [illegible]మున్న రాజ్యాలనవచ్చు డొమినియన్‌ల శాసనాధికారాలను తగ్గించవలెననే [illegible] ఇంగ్లండ్‌కు లేదనే చెప్పవచ్చు. కాని డొమినియన్ శాసనసభలు చేసే చట్టాలు డొమిని [illegible] శాసనాల చెల్లుబడి చట్టానికి వ్యతిరేకంగాకాని, ఆ డొమినియన్‌ల పొలిమేరల నతిక్ర మించేవిగాకాని ఉండరాదనే బ్రిటిష్ పార్లమెంట్ ఉద్దేశించింది ఈ పరిస్థితులలో, ఇన్నాళ్ళూ బ్రిటిష్ రాజు ప్రతినిధిగా విశేషాధికారాలు అనుభవిస్తున్న డొమినియన్‌ల గవర్నర్ - జనరల్‌ల స్థితి తారుమారైంది.

### డొమినియన్ ప్రతిపత్తి దృష్ట్యా డొమినియన్ గవర్నర్ - జనరల్ స్థానము

ఇండియా, ఐర్లండ్ గవర్నర్ - జనరల్‌కు తాము పాలించే దేశాల శాసనసభలు చేసే చట్టాలను ఆమోదించటానికిగాని, నిరాకరించటానికిగాని అధికారమున్నదని, వాటిని బ్రిటిష్ రాజు ఆమోదానికి పంపటానికి వారి కధికారమున్నట్లు ముందు తెలిపినాము తనకు గవర్నర్ జనరల్ నివేదించిన చట్టాన్ని తన మంత్రిమండలి సలహాను అనుసరించి ఆమోదించటానికి గాని, నిరాకరించటానికిగాని బ్రిటిష్ రాజు కధికారమున్నది. గవర్నర్ జనరల్ ఆమోదించిన చట్టాన్ని కూడా తన ప్రభుత్వం సలహామీద రాజు తోసిపుచ్చవచ్చు. తన ఆమోద ప్రాతి కూల్యాలు తెలపకుండా డొమినియన్ శాసనాలను, తన విచక్షణపై, రాజామోదానికి నిల్పి ఉంచే అధికారాన్ని, న్యూజిలాండ్, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా రాజ్యాంగాలు తమ గవర్నర్ జనరల్‌ల కిచ్చినాయి తరవాత ఈ సూత్రం ఐరిష్ స్వతంత్ర రాజ్య రాజ్యాంగంలోను ప్రవేశ పెట్టింది. ఓడ వ్యాపార శాసనాలవంటి కొన్ని సామ్రాజ్య శాసనాల విషయంలోను, ప్రత్యే కంగా చట్టంలో పేర్కొన్న కొన్ని విధాల బిల్లు చట్టాల విషయంలోను రాజు ఆమోదాన్ని నిర్బంధంగా ముందు పొందవలసి ఉంది ఒక్క ఐర్లండ్ రాజ్యాంగంలో తప్ప, మిగిలిన డొమినియన్‌ల రాజ్యాంగాలన్నింటిలోను అట్లాంటి సందర్భాలలో బిల్లు చట్టాలను నిషేధించే అధికారమిచ్చే నిబంధన ఉంది.

### డొమినియన్‌లలోని కార్యనిర్వాహక వర్గాలు

పైన చెప్పిన గవర్నర్ జనరల్ అధికారాలు డొమినియన్ కార్యనిర్వాహక వర్గ అధి కారాలను సంకుచితం చేయలేపోవని వేరుగా చెప్పనక్కరలేదు. గవర్నర్ జనరల్‌ను నియ మించేది బ్రిటిష్ రాజు. తన ప్రభుత్వం సూచించిన వ్యక్తినే అతడు గవర్నర్ జనరల్‌గా నియమించేది కాని గవర్నర్ జనరల్ తాము పేర్కొదలచిన వ్యక్తి డొమినియన్ ప్రభుత్వా నికి ఇష్టుడేగదా అని ఆ ప్రభుత్వాన్ని అడిగి దాని సమ్మతిని పొందే సంప్రదాయాన్ని బ్రిటిష్ ప్రభుత్వం మొదటినుంచి పాటించింది. ఈ విధంగా డొమినియన్ గవర్నర్ జనరల్ ఇద్దరు

తల్లుల ముద్దుబిడ్డడు. ఇద్దరికీ తృప్తికరంగా ప్రవర్తించుకోవలసినవాడు. అతడటు బ్రిటిష్ ప్రభుత్వం ఇష్టానికి వ్యతిరేకంగా నడుచుకోనూ లేదు. ఇటు డొమినియన్ ప్రభుత్వం ఇష్టాన్ని కాదననూ లేదు. 1862 లో స్వపరిపాలనను అనుభవిస్తున్న కాలనీలు తమ దేశరక్షణకు కొంత బాధ్యత తామూ వహించవలసి ఉంటుందని కామన్స్ సభ తీర్మానించింది. అయినా ఆ తీర్మానాని కర్థం కాలనీల రక్షణ భారంనుంచి తాము (బ్రిటిష్ ప్రభుత్వం) పూర్తిగా వైదొలగినామని కాదని కామన్స్ సభ స్పష్టీకరించింది. కాని 1871 నాటికి పెద్ద ఎత్తున, డొమినియన్‌ల నుంచి తమ సైనిక, నౌకా దళాలను బ్రిటిష్ దేశం ఉపసంహరించింది. 1877 కు పూర్వం బ్రిటన్ ఏ దేశంతో సంధి చేసుకొన్నా, ఆ సంధి షరతులకు ప్రతి బ్రిటిష్ డొమినియన్ విధిగా కట్టుబడవలసి ఉండేది. 1877 నుంచి బ్రిటన్ ఇతర దేశాలతో చేసుకొన్న సంధికి బ్రిటిష్ డొమినియన్‌లు నిర్నిబంధంగా లోబడనక్కరలేదని బ్రిటిష్ ప్రభుత్వం స్పష్టం చేసింది. 1898 తరవాత బ్రిటన్ చేసుకొన్న సంధినుంచి ఏ డొమినియన్ అయినా, ప్రత్యేకంగా తాను మాత్రం వైదొలగవచ్చునని బ్రిటన్ ప్రకటించింది. అన్యదేశంతో డొమినియన్ చేసుకోదలచుకొన్న సంధిని గురించి సంప్రతించవచ్చునని, కాని తనంత తాను సంధి మాత్రం చేసుకోరాదని స్పష్టీకరించడమైంది. ఈ డొమినియన్‌లు అన్యదేశాలలో రాయబార వర్గాలను గాని, తమ కమిషనర్‌లనుగాని నెలకొల్పటం జరగలేదు. అన్యదేశాలతో ఏదైనా ఒడంబడికను తాము చేసుకొనే సందర్భంలో అది ఒక డొమినియన్‌ను బాధించేదయినట్లయితే ఆ డొమినియన్ ప్రభుత్వంతో తాము ముందుగా సంప్రతించగలమని బ్రిటిష్ ప్రభుత్వం స్పష్టంచేసింది. సంప్రతించినా, కడపటి నిర్ణయం బ్రిటిష్ ప్రభుత్వానిదే అని, సంధి విగ్రహాలు నిశ్చయించే అధికారం కూడా వారిదేనని ఖండితంగా ప్రకటన చేసినారు. అప్పుడప్పుడు బ్రిటన్ పూనుకొనే యుద్ధాలలోగాని, వారిపైకి ఇతరులు తెచ్చిపెట్టే యుద్ధాలలోగాని, చేరకుండా ఉండే హక్కు తమ కున్నదని కొందరు డొమినియన్‌ల ప్రజలు అన్నా డొమినియన్ లేవిగాని ఆ యుద్ధాలలో చేరక తప్పలేదు. 1911 లో కూడా తాము చేసే యుద్ధాలలో తమ సాయం కోరుతూ తమను ముందుగా సంప్రదించకపోవటం భావ్యం కాదని డొమినియన్‌లు ప్రకటించినవిగాని 1914 లో బ్రిటన్ జర్మనీలపై యుద్ధం ప్రకటించినప్పుడు, ఆ యుద్ధంలో చేరని డొమినియన్ లేదు.

### న్యాయ పరిపాలనలో డొమినియన్‌లకు, బ్రిటిష్ దేశానికి ఉన్న సంబంధము

డొమినియన్ న్యాయస్థానాల నుంచి బ్రిటిష్ ప్రీవీ కౌన్సిల్‌కు అపీళ్ళనంత కాలం వాటి సర్వం సహాధికారము అంతవరకు పరిమితమైనట్లే. 1888, 1844 చట్టాలు ఈ అపీల్ అధికారాన్ని నిర్ణయించినాయి. కెనడా రాష్ట్రాలలోని న్యాయస్థానాలు, డొమినియన్ న్యాయస్థానం నుంచి ప్రీవీ కౌన్సిల్‌కు అపీల్ చేసే అధికారానికి పరిమితు లేమీలేవు. ఆస్ట్రేలియన్ రాష్ట్రాలలోని ఉన్నత న్యాయస్థానాల నుంచి ప్రీవీ కౌన్సిల్‌కు ఎవరైనా అపీల్ చేసుకొనే స్వేచ్ఛ ఉన్నా, డొమినియన్ న్యాయస్థానం తీర్పులపై దాని సమ్మతిలేనిది ప్రీవీ కౌన్సిల్‌కు అపీల్ చేయడానికి వీలులేదు. దక్షిణాఫ్రికా న్యాయస్థానాల నుంచి ప్రీవీ కౌన్సిల్‌కు అపీల్ చేసుకొనే హక్కును దక్షిణాఫ్రికా శాసనం తొలగించింది. కాని ఏ ఏ సందర్భాలలో అపీల్ చేయటానికి ప్రీవీ కౌన్సిల్ ప్రత్యేక అనుమతిని కోరవచ్చునో నిర్ణయించే అధికారాన్ని

దక్షిణాఫ్రికా పార్లమెంట్ తనకు ఉంచుకొన్నది. కాని దీనికి గవర్నర్ జనరల్ అనుమతి అవసరము.

## డొమినియన్ ప్రతిపత్తిపై మొదటి ప్రపంచ యుద్ధ ప్రభావము

యుద్ధకాలపు బ్రిటిష్ మంత్రివర్గానికి బ్రిటిష్ సేనా నాయకత్వానికి యుద్ధంలో డొమినియన్ ప్రభుత్వాలిచ్చిన సహకారము వాటి డొమినియన్ ప్రతిపత్తికి భంగకారిగా పనిచేయలేదు. యుద్ధం ముగిసిన తరవాత సంధి షరతులను చర్చించే సభలలో డొమినియన్‌లకు ప్రాతినిధ్యం లభించింది నానాజాతి సమితి (League of Nations) లో వాటికి సభ్యత్వం ఇవ్వటంతో వాటి స్వతంత్ర ప్రతిపత్తి గుర్తించడమయింది ఆ నానాజాతి సమితిలో సభ్యత్వము న్యూఫౌండ్‌లాండ్ కివ్వకపోయినా భారతదేశానికి ఇవ్వటం గమనించదగిన విషయము. ఇట్లా తమ స్వతంత్ర ప్రతిపత్తిని నానాజాతి సమితి గుర్తించటం బ్రిటిష్ సామ్రాజ్య ఐక్యానికి భంగం కల్గించే కొన్ని పరిణామాలకు దారి తీసింది 1928 లో కెనడా ప్రభుత్వం బ్రిటన్‌తో సంప్రతించకుండా వారి ప్రమేయ మేమీలేని విధంగా అమెరికా (U S A) ప్రభుత్వంతో సంధి చేసుకోవటం జరిగింది. టర్కీతో బ్రిటిష్ సామ్రాజ్యం చేసిన యుద్ధం లాసేన్ సంధితో సమాప్తమయింది ఆ సంధివల్ల తమపైబడే బాధ్యతలు నిర్ణయించవలసింది కెనడా ప్రభుత్వమూ, శాసన సభలేకాని బ్రిటన్ కాదని కెనడా స్పష్టం చేసింది. లోకార్నో (Locarno) రాయబారాలలో డొమినియన్‌లు జోక్యం చేసుకోనూ లేదు సంధిపత్రంపై చేవ్రాలు చేయనూ లేదు. ఐర్లండ్ స్వతంత్ర ప్రతిపత్తి ఏ ఏ దశలలో సాధించిందీ ముందే చెప్పినాము. ఐర్ బ్రిటిష్ సామ్రాజ్యం నుంచి వేరుపడటం అనేది డొమినియన్ ప్రతిపత్తి లక్ష్య మసలేకాదు. ఐర్‌కు డొమినియన్ హోదా ఇచ్చిన 1920 పార్లమెంట్ శాసనమూ, దానిని కొంత సవరించిన ఆంగ్లో - ఐరిష్ సంధీ, ఐర్‌కు గవర్నర్ జనరల్‌ను నియమించే అధికారము బ్రిటిష్ రాజుకివ్వటమేకాక, ఆ గవర్నర్ జనరల్ కొన్ని ఐరిష్ శాసనసభ చట్టాలను రాజు ఆమోదానికి నిలపవచ్చుననీ ఐర్ న్యాయస్థానాల నుంచి అపీళ్లను విచారించటానికి బ్రిటిష్ ప్రీవీ కౌన్సిల్ అనుమతించవచ్చుననీ నిర్ణయించినవి అంతేకాక స్వతంత్ర ఐర్ శాసనసభకు ఎనిమిదేళ్ళపాటు రాజ్యాంగ శాసనాలు చేయటాని కధికారముందనీ, అనంతరం ప్రజామోదానికి పెట్టి వారి నిర్ణయం ప్రకారం రాజ్యాంగంలో సవరణలు చేయవచ్చుననీ అవి శాసించినాయి. ఈ విధంగా తనకు సంక్రమించిన అధికారాల నుపయోగించి క్రమంగా గవర్నర్ జనరల్‌కు, బ్రిటిష్ రాజుకు, ప్రీవీ కౌన్సిల్‌కు ఐర్ పరిపాలనలో ఏ ప్రమేయమూ లేకుండేటట్లు ఐరిష్ శాసనసభ (Oireachtas) సాధించింది.

## 1926 సామ్రాజ్య మహాసభ

ఐర్ పోయినంతదూరం పోవాలెననీ, మాతృదేశంతో తెగతెంపులు చేసుకోవాలెననీ ఇతర డొమినియన్లు ఎన్నడూ ప్రయత్నం చేయలేదుగాని, వాటిలోనూ స్వాతంత్ర్య వాంఛలు క్రమంగా ప్రత్యక్షం అయినాయి. ఈ పరిణామానికి దారి తీసినవి బ్రిటన్ తన కాలనీల సహకారం కోరి 1887-1911 మధ్యకాలంలో జరిపిన ఎనిమిది సమావేశాలు, వీటిలో చర్చకు వచ్చిన అంశాలు సామ్రాజ్య రక్షణ, ఎగుమతి దిగుమతులపై సుంకాలు, రాకపోకలను, వలస

రావటం (సామ్రాజ్యంలో ఒక ప్రాంతంనుంచి మరో ప్రాంతానికి) గురించిన ఒడంబడ్డీ ప్రివీ కౌన్సిల్‌కు చేసే అపీళ్ళు మొదలైనవి. ఈ విషయాలలో మాతృదేశంతో కలిసి వ్యవహరించటానికి ఒప్పుకొన్నా, బ్రిటన్‌తో తామూ కలిసి ఒక సంయుక్త రాజ్యంగా మారవచ్చు అనే శంక ఎవ్వరికీ కలగకుండా ఉండే విధంగా కాలనీల ప్రభుత్వాలు జాగ్రత్త వహించినాయి.

మొదటి ప్రపంచయుద్ధం సాగినంతకాలం డొమినియన్‌లూ మాతృదేశమూ కలిసి చాలా అన్యోన్యంగా యుద్ధకాల సామ్రాజ్య మంత్రివర్గంగా ప్రవర్తించినాయి. కాని, యుద్ధం సమాప్తి కాగానే 1921, 1923 సామ్రాజ్య మహాసభలలో వాటి మధ్య ఎంత ఐకమత్య లక్షణాలు ప్రత్యక్షమయినా, వేర్పాటు అభిప్రాయాలు కూడా ప్రస్ఫుటంగా ద్యోతకమైనాయి. విదేశాలతో అవలంబించే విధానాలను గురించి బ్రిటన్‌తోను, ఒండొరులతోను సంప్రదింపులకు డొమినియన్‌లు సిద్ధపడినా బ్రిటన్ అవలంబించదలచిన విదేశ రాజనీతినీ గురించి తమకు తెలియజేస్తూ ఉండవలసిందని పట్టుబట్టినా ఆ విషయంలో తాము ఏ బాధ్యతలనూ వహించడానికి మాత్రం అంగీకరించలేదు. సామ్రాజ్యం సంరక్షణ విషయంలో కలిసి కట్టుగా పనిచేసే సూచనలు బ్రిటన్ ఏమి చేసినా కామన్‌వెల్త్ రాజ్యాల ప్రతినిధులు తామామోదించిన వాటి విషయంలో కూడా విధిగా సహాయపడగలమనే మాట లేదన్నారు. అందువల్ల కామన్‌వెల్త్ మాతృదేశాల సంబంధాలను తరవాత వివాదాలు రాని విధంగా నిర్వచించే ఉద్దేశంతో 1926 లో సామ్రాజ్య మహాసభను బ్రిటన్ సమావేశపరిచింది. బ్రిటిష్ సామ్రాజ్యంలోని కామన్‌వెల్త్ రాజ్యాలకు సంపూర్ణ స్వతంత్ర ప్రతిపత్తి మాత్రమేకాక బ్రిటన్‌తో సర్వ సమానత్వమూ ఉందనీ, హోదాలోనేకాక, వాటి ఆంతరంగిక వ్యవహారాలలోనేకాక, వైదేశిక వ్యవహారాలలో సైతం ఏ కామన్‌వెల్త్ రాజ్యమూ మరొక కామన్‌వెల్త్ రాజ్యానికిగాని, మాతృదేశమైన బ్రిటన్‌కు గాని ఎంత మాత్రమూ లోబడిందనే మాటేలేదని బ్రిటిష్ ప్రభుత్వ ప్రతినిధి స్పష్టం చేసినాడు. డొమినియన్‌ల సార్వభౌమత్వాధికారాన్ని (Sovereignty) ఇంత నిస్సందిగ్ధంగా నిర్వచించినా అవి స్వేచ్ఛగా బ్రిటిష్ జాతుల కామన్‌వెల్త్‌లో చేరిన రాజ్యాలేనని, బ్రిటిష్ రాజుపట్ల భక్తి విధేయతలు వాటిని సమైక్యం చేసినాయని బ్రిటిష్ ప్రతినిధి బాల్ఫర్ ఉద్ఘోషించినాడు. అంతటితో ఆగక బ్రిటిష్ సామ్రాజ్య ఐక్యాన్ని పరిరక్షించటానికి, సబలం చేయటానికి తీసుకోవలసిన చర్యలలో కామన్‌వెల్త్ రాజ్యాలకూ భాగము ఉండి తీరుతుందని ప్రకటన స్పష్టం చేసింది.

*వెస్ట్ మినిస్టర్ శాసనము 1931:* డొమినియన్‌ల దృష్టి తమ స్వతంత్ర ప్రతిపత్తిని పెంచుకోవటం మీద ఉన్నంతగా సామ్రాజ్య ఐక్య పరిరక్షణ మీద లేదు. 1926 సామ్రాజ్య మహాసభ కనంతర మయిదేళ్లకాలంలో మరోరెండు మహాసభలు జరిగి, డొమినియన్‌ల సంపూర్ణ శాసనాధికారంపై మిగిలి ఉన్న బ్రిటిష్ పార్లమెంట్ పెత్తనం తొలగించే ఉద్దేశంతో 1931 లో వెస్ట్ మినిస్టర్ శాసనం చేసినారు. డొమినియన్‌ల కన్వయించే శాసన మేదీ, డొమినియన్‌ల కోరిక మీదగాని బ్రిటిష్ పార్లమెంట్ చేయరాదనేది ఇన్నాళ్ళూ పాటించిన సంప్రదాయము. ఆ సంప్రదాయాన్ని ఈ చట్ట మిప్పుడు శాసనబద్ధం చేసింది ఒకవైపు కాలనీల కన్వయించే శాసనాలు చేసే అధికారం పార్లమెంట్ కింకా ఉన్నట్లూ, మరోవైపు తమ కన్వయించే శాసనాలను పార్లమెంట్ చేయటానికి ముందు నిర్ణయించే అధికారం కాలనీలకే అయినట్లూ 1931 వెస్ట్ మినిస్టర్ శాసనం తాత్పర్యము. ఈ శాసనంతోబాటు ఏ కలోనియల్

శాసనాలుగాని పార్లమెంట్ చట్టాలకు భిన్నమైతే చెల్లవనే చట్టమూ (Colonial Laws Validity Act) రద్దయింది. ఈ చట్టం రద్దుతో డొమినియన్ పార్లమెంట్ చేసే శాసన మేదైనా డొమినియన్ న్యాయస్థానాలకు శిరోధార్యమయింది. కాని సంయుక్త రాజ్యాలు (Federal States)గా రూపొందిన కెనడా, ఆస్ట్రేలియాలలో మాత్రం ఏ ఒక్క శాసన సభకు, తనంతతాను రాజ్యాంగ శాసనాలను (Constitution Act) సవరించే హక్కు లభించలేదు.

1931 వెస్ట్ మినిస్టర్ చట్టంవల్ల తనకు లభించిన అధికారాన్ని వినియోగించి, దక్షిణాఫ్రికా యూనియన్ పార్లమెంట్ 1934లో ఆ చట్టంవల్ల దక్షిణాఫ్రికా యూనియన్‌కు లభించిన హోదాను విశదంచేసే శాసనం (The Status of the Union Act) చేసింది. బ్రిటిష్ పార్లమెంట్ దక్షిణాఫ్రికా యూనియన్ విషయంలో చేసే శాసనమేదీగాని ప్రత్యేకంగా యూనియన్ పార్లమెంట్ కూడా దానిని శాసనంగా మళ్ళీ చేయనిదే చెల్లదని పై చట్టం స్పష్టం చేసింది. యూనియన్ పార్లమెంట్ చట్టాలు ఇంక గవర్నర్ జనరల్‌కుగాని, బ్రిటిష్ రాజుకు గాని శాసనం గాకుండా నిలిపే అధికారము ఉండదని ప్రకటించింది. దీనికి ఒక్క మినహాయింపు మాత్రం చేసినారు. ప్రివీ కౌన్సిల్‌కు అపీళ్ళు చేసే విషయమై చేసే చట్టాలు, దక్షిణాఫ్రికా ప్రభుత్వాధికారానికి బదిలీ చేసిన ఆఫ్రికా రాష్ట్రాల పరిపాలనగురించి చేసిన చట్టాలు అంగీకరించటానికిగాని, నిరాకరించటానికిగాని గవర్నర్ జనరల్‌కు అధికారము తొలగించలేదు. శాసనము అయినా ఆ సందర్భంలో తుది నిర్ణయం చేసేది బ్రిటిష్ రాజేగాని, అతడు దక్షిణాఫ్రికా మంత్రివర్గం సలహాను పాటించవలెనని ఈ శాసనం నిశ్చయించింది. వెస్ట్ మినిస్టర్ శాసనాన్ని ప్రమాణంగా తీసుకొని దక్షిణాఫ్రికా పార్లమెంట్ తన అధికారాలను తగ్గించే ఏ చట్టాన్నయినా సవరణ చేసే అధికారం తనకున్నదని ఉద్ఘాటించింది. ఈ ఉద్ఘాటనను దక్షిణాఫ్రికా ఉన్నత న్యాయస్థానము 1937లో ధ్రువపరిచింది. ఈ విధంగా ముఖ్యంగా ఐర్ (Eire), దక్షిణాఫ్రికాలు రెండూ కామన్‌వెల్త్‌లోని సభ్య రాష్ట్రాల మధ్యనుండే స్నేహ సంబంధాలను బలహీనపరచడంలో ముందంజ వేసినాయి.

ఇట్లా ఉండగా 1936లో ఎనిమిదో ఎడ్వర్డ్ రాజు వివాహమాడదలచిన అమెరికన్ స్త్రీని బ్రిటిష్ ప్రభుత్వం ఆమోదించకపోవటం తటస్థించింది ఆ కారణంగా ఎనిమిదో ఎడ్వర్డ్ తన రాజ పదవిని విడిచిపెట్టినాడు. అతని చర్యను వెస్ట్ మినిస్టర్ శాసనం మేరకు డొమినియన్ పార్లమెంట్‌లు కూడా ఆమోదించవలెనని బ్రిటిష్ ప్రభుత్వం కోరింది. వారామోదించిన తరవాత బ్రిటిష్ పార్లమెంట్ రాజ్యత్యాగాన్ని ఆమోదించే శాసనాన్ని చేసింది. ఈ విధంగా డొమినియన్‌ల సార్వభౌమత్వాధికారం మరోసారి ధ్రువపరిచినట్లయింది. అంతటితో తృప్తిపడక దక్షిణాఫ్రికా పార్లమెంట్, తన రాజరికాన్ని దక్షిణాఫ్రికా విషయంలో ప్రత్యేకించి ఎనిమిదో ఎడ్వర్డ్ విడవనందువల్ల బ్రిటిష్ పార్లమెంట్ చేసిన ఎడ్వర్డ్ రాజ్యత్యాగ శాసనాన్ని ఆమోదించనూ లేదు; నిరాకరించనూ లేదు. ఐర్ రాజ్యం మాత్రం ఇతర కామన్‌వెల్త్ రాజ్యాల చర్య తన కామోదమేనని తెలియజేసింది. ఐర్ విదేశ వ్యవహారాలలో ఐర్ రాజ్య మంత్రివర్గం సలహాననుసరించి బ్రిటిష్ రాజు ప్రవర్తించటం తనకు సమ్మతమే అని ఐర్ పార్లమెంట్ శాసించింది. మొత్తంమీద కామన్‌వెల్త్ రాజ్యాల ధోరణి దేశరక్షణ, వ్యాపారము మొదలైన విషయాలలోనేగాక, యుద్ధాలవల్ల ఏర్పడే అత్యవసర పరిస్థితులలో కూడా తమ

సార్వభౌమత్వాన్ని కొద్దిగానైనా బలహీనపరచగల ఒక కార్యనిర్వాహక వర్గాన్ని సామ్రాజ్య కేంద్రంలో ఏర్పాటు చేసే ప్రయత్నాన్ని హర్షించేటట్లు లేదు. ఇంతలో రెండో ప్రపంచ యుద్ధం (1939-45) వచ్చిపడి ఈ వ్యవహారాన్ని అంతా ఒక కొలిక్కి తెచ్చింది. జర్మనీపై బ్రిటిష్ ప్రభుత్వం యుద్ధం ప్రకటించగానే న్యూజిలాండ్, ఆస్ట్రేలియాలు బ్రిటన్‌తోపాటు యుద్ధంలో దూకినవేగాని తమ స్వతంత్ర ప్రతిపత్తిని గురించిన ప్రశ్నలేమీ లేవదీయలేదు. కాని 1941 లో జపాన్‌మీద విడిగా ఆస్ట్రేలియా యుద్ధం ప్రకటించింది. దక్షిణాఫ్రికా పార్లమెంటూ, కెనేడియన్ పార్లమెంటూ వేర్వేరుగా యుద్ధ ప్రకటనలు చేసినాయిగాని, ఐర్ మాత్రం కడపటివరకు యుద్ధంలో చేరలేదు. ఈ విధంగా ఐర్ తాటస్థ్యం కామన్‌వెల్త్ రాజ్యాల స్వతంత్ర ప్రతిపత్తిని రుజువుచేయగా యుద్ధం సాగినంతకాలం జరిగిన కామన్‌వెల్-బ్రిటిష్ ప్రతినిధుల ప్రధానమంత్రుల సమావేశాలు బ్రిటిష్ కామన్‌వెల్త్ రాజ్యాల ఐకమత్యాన్ని స్థాపించినట్లయింది.

కాని, ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరం మాతృదేశానికి, డొమినియన్‌లకు మధ్య ఉండే సంబంధాలు చాలా సడలిపోయినాయి. అవసరమేర్పడినప్పుడు బ్రిటన్ - డొమినియన్ మంత్రులు సంప్రతించుకోవటమేగాని కామన్‌వెల్త్ - మాతృదేశాలను స్నేహ రజ్జువులతో బంధించే సంస్థ ఏదీ ఏర్పడలేదు. వాటి మధ్యదూరాన్ని పెంచే భిన్న పౌరసత్వ శాసనాలు సిద్ధమైనాయి. ఆస్ట్రేలియా, శ్రీలంక, న్యూజిలాండ్‌ల నుంచి ప్రివీ కౌన్సిల్‌కు అపీల్ చేసే పద్ధతి పూర్తిగా రద్దుకాలేదు కాని, మిగతా సామ్రాజ్య దేశాలనుంచి అపీల్ చేసే విధానం అదృశ్యమయింది. భారతదేశము పాకిస్తాన్‌లు రెండూ 1947 లో రిపబ్లిక్ (గణతంత్ర రాజ్యాలు)[అయినా, కామన్‌వెల్త్ సభ్యత్వాన్ని విడనాడలేదు. మొన్న మొన్న తూర్పుపాకిస్తాన్‌లో తన దమన విధానాన్ని బ్రిటన్ ఆమోదించలేదనే కోపంతో, పాకిస్తాన్ బ్రిటన్ - కామన్‌వెల్త్ దేశాలతో తనకున్న సంబంధాన్ని తెంచుకొన్నది. భారతదేశము, పాకిస్తాన్‌లు గణతంత్ర రాజ్యాలు కాగానే వాటి కామన్‌వెల్త్ సంబంధానికి భంగం కలగకుండా ది బ్రిటిష్ కామన్‌వెల్త్ ఆఫ్ నేషన్స్ (The British Commonwealth of Nations) లోని బ్రిటిష్ అనే విశేషణ పదాన్ని విసర్జించినారు. భారతదేశము పాకిస్తాన్‌లు స్వతంత్ర దేశాలుకావటంతో అనేక బ్రిటిష్ సామ్రాజ్యాంతర దేశాల, బ్రిటన్ ఉదార విధాన ఫలితంగా, ఒకదానివెంట నొకటి స్వతంత్ర దేశాలైనా, కామన్‌వెల్త్‌తో స్నేహ సంబంధాలను అవన్నీ విడనాడలేదు. కాని, 1947 లో బర్మాదేశమూ, 1949 లో ఐర్లండ్ గణతంత్ర రాజ్యమనే పేరుతో ఐర్ దేశమూ కామన్‌వెల్త్ నుంచి విడిపోయినాయి. అదే విధంగా, 1961 లో దక్షిణాఫ్రికా గణతంత్ర రాజ్యమై, కామన్‌వెల్త్‌లో సభ్యత్వాన్ని మానుకొన్నది. 1950 లో న్యూ ఫౌండ్‌లాండ్ కెనడా డొమినియన్‌లో ఒకానొక రాష్ట్రంగా చేరి, తన పూర్వపు డొమినియన్ హోదాను పోగొట్టుకొన్నది.

1956–68 సంవత్సరాల మధ్య బ్రిటిష్ సామ్రాజ్యంలోని 14 దేశాలకు, పూర్వము భారతదేశము, పాకిస్తాన్‌లకిచ్చినట్లే పార్లమెంటరీ శాసనాల మూలంగా బ్రిటన్ స్వాతంత్ర్య ప్రదానం చేసింది. తన సామ్రాజ్యంలోని అనేక ఇతర దేశాలకు బ్రిటిష్ పార్లమెంట్ అంతరంగిక స్వపరిపాలనను ప్రసాదించింది. ఈ విధంగా స్వతంత్రత పొందిన ఆఫ్రికన్ రాజ్యాలలో, దక్షిణాఫ్రికా మొదటిదయితే, ఘానా రెండోది. అది 1957 లో కామన్‌వెల్ రాజ్యాలలో

ఒకటిగా చేరి, 1960 లో గణతంత్ర రాజ్యమయింది. ది గోల్ కోస్ (The Gold Coast), అషాన్టి, ఉత్తరాది రాష్ట్రాలు చేరి ఘనా రాజ్యంగా రూపొందినాయి. నైజీరియాలోని ప్రాక్ పశ్చిమ మండలాలు 1957 లోను, ఉత్తర మండలాలు 1959 లోను, స్వపరిపాలనాధికారాన్ని పొందినాయి ఈ మూడింటికి 1958 లో సంయుక్త కార్యనిర్వాహకవర్గ మేర్పడింది. 1960లో ఆ మూడు రాష్ట్రాలు బ్రిటిష్ రాజు అధికారానికి లోబడిన సంయుక్త రాజ్యంగా మారి, 1963 లో గణతంత్ర రాజ్యంగా వేరుపడినాయి. 1965 నాటికి జాంబియాకు స్వపరిపాలన లభించింది. కెనియా రాజకీయాభివృద్ధి అక్కడి కికూయూ, ఎమ్బూ, మేరూ జాతుల దౌర్జన్య చర్యలవల్ల వెనకబడినా క్రమంగా స్వాతంత్ర్యోద్యమం ఉగాండా, కెనియా, టాంగనీకా, జాంజిబార్ రాష్ట్రాలలో బలం పుంజుకొని క్రమంగా అవి స్వతంత్ర రాజ్యాలయినాయి. భారత దేశంలో జరిగినట్లే 1957 లో ఆ రాష్ట్రాల శాసన సభలలో ఎన్నుకొనే సభ్యుల సంఖ్య పెంచినారు అంతరంగిక వ్యవహారాలలో 1960, 61, 62 సంవత్సరాలలో వరసగా కెనియా, టాంగనీకా, ఉగాండాలకు స్వపరిపాలనాధికారాన్ని, 1963 లో ఈ మూడు రాష్ట్రాలకు సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని బ్రిటిష్ పార్లమెంట్ ఇచ్చింది. 1964 లో ఆ మూడు రాష్ట్రాలు బ్రిటిష్ రాజాధికారాన్ని తొలగించి గణతంత్ర రాజ్యాలయినాయి. మధ్య ఆఫ్రికా రాష్ట్రాలైన దక్షిణ ఉత్తర రొడీషియా, న్యాసాలాండ్‌ను సంయుక్త రాజ్యంగా తీర్చిదిద్దవలెనని 1953 లో చేసిన ప్రయత్నం 1963 నాటికి భగ్నమై, ఉత్తర రొడీషియా జాంబియా రిపబ్లిక్ కాగా, న్యాసా లాండ్ బ్రిటిష్ రాజును తమ రాజుగా గుర్తిస్తూనే స్వతంత్ర రాజ్యంగా ఏర్పడినాయి.

*పశ్చిమ ఇండియా దీవులలో స్వపరిపాలనోద్యమము:* ఇవి 1956 లో సంయుక్త రాజ్యమై, 1962 లో విడిపోయినాయి. విడిపోవటంలో జమైకా ద్వీపము ఒక స్వతంత్ర రాజ్యం గాను, ట్రినిడాడ్ - టొబాగోలు రెండూ కలిసి బ్రిటిష్ రాజును తమ రాజుగా అంగీకరిస్తూ ఒక స్వతంత్ర రాజ్యంగా ఏర్పాటయినాయి. బార్బడోస్ ద్వీపానికి స్వపరిపాలన లభించింది. మిగతా దీవులు బ్రిటిష్ రాజు పరిపాలనలోనే నిల్చినాయి.

*బ్రిటిష్ సామ్రాజ్యంలోని ఆసియా రాజ్యాల ప్రగతి:* 1957 లో మలయా ఒక సంయుక్త రాజ్యమైంది; నాల్గేళ్ళకది సరవాక్, ఉత్తర బోర్నియోలతో కలిసి మలేషియా సంయుక్త రాజ్యంగా పరిణమించింది. దక్షిణ అరేబియాలోని బ్రిటిష్ ప్రాంతాలు సంయుక్త రాజ్యం కాగా, ఏడెన్ రేవు పట్నం దానిలో చేరక విడిగా స్వతంత్రం కావటానికి ప్రయత్నిం చింది. అదే విధంగా 1965 లో సింగపూర్ మలేషియానుంచి వేరుపడింది

మధ్యధరా సముద్రంలోని సైప్రస్‌దీవి గణతంత్ర రాజ్యంగా స్వతంత్రమైనా 1960లో బ్రిటిష్ కామన్‌వెల్త్‌లో చేరింది. నాల్గేళ్ళ తరవాత మాల్టా స్వతంత్రమైనా సైప్రస్ వలెనే కామన్‌వెల్ సభ్యత్వాన్ని విడనాడలేదు. 1966 లో బ్రిటిష్ గయానా మాల్టా తొక్కిన మార్గాన్నే తొక్కింది.

స్వపరిపాలనోద్యమం ఇతర బ్రిటిష్ సామ్రాజ్య ప్రాంతాలలోను వ్యాపించింది. స్వాతంత్ర్య పిపాస ఈ యుగ లక్షణము. క్రమంగా దక్షిణ అరేబియా ప్రాంతంలోను, దక్షిణాఫ్రికాలోను బ్రిటిష్ హైకమిషనర్ పాలనలోవున్న భాగాలలోను, మారిషస్, ఫీజీ, బ్రిటిష్ హాన్‌డూరాలలోను, మిగిలిన పశ్చిమ ఇండియా ద్వీపాలలోను బ్రిటిష్ పార్లమెంట్ అంత రంగిక స్వపరిపాలనను నెలకొల్పింది. ఇవిగాక బ్రిటిష్ రక్షణ కింద ఎంతో కొంత స్వపరి

పాలనను అనుభవించేవి అట్లాంటిక్, ఇండియన్, పసిఫిక్ మహాసముద్రాలలో చెదురుమదురుగా, ఒకదానికొకటి వందలు, వేల మైళ్ళ దూరంలో వెదజల్లినట్లు చాలా చిన్న, పెద్ద ద్వీపాలున్నాయి. ఆ దీవులు అట్లాంటిక్ మహాసముద్రంలోని అసెన్షన్, బహామా, బెర్ముడా; కేమాన్, ఫాక్‌లాండ్, జిబ్రాల్టర్, సెంట్ హెలీనా, ట్రిస్టాన్ కన్హా, కెయికో, బ్రిటిష్‌వర్జిన్ మొదలైనవి; పసిఫిక్ మహాసముద్రంలో గిల్‌బర్ట్, ఎల్లిస్ దీవులు, హాన్‌కాంగ్, న్యూహెబ్రిడీస్. టోంగా, పిట్‌కేరన్, సాలొమన్ ద్వీపాలు; ఇండియన్ మహాసముద్రంలోని మాల్దీవ్, సిషిల్లీ దీవులూ, బోర్నియోలో బ్రూనే సుల్తానేట్ అనే ప్రాంతమూ. వీటిలో కొన్నింటి వైశాల్యం రెండునుంచి 11500 చదరపు మైళ్ళు; జనసంఖ్య నూటినుంది 1,80,000 వరకు పరిమితమై ఉండటంవల్ల స్వతంత్రంగా తమ కాళ్ళపై తాము నిల్చి ఉండటానికి వీటి ధన, బలాలు చాలవు వీటి భద్రత, స్వపరిపాలనా సంస్థలు, వీటిలో వికాసం పొందే అవకాశము బ్రిటిష్ రాజఛత్రం నీడలోనే అని తలచటంలో విపరీతమేమీ లేదు.

ఈ విధంగా ఇరవయ్యో శతాబ్ది ఆరంభంలో ప్రపంచ పరివ్యాప్తమై, రవి అస్తమించని సామ్రాజ్యంగా ప్రకాశించిన బ్రిటిష్ సామ్రాజ్యం అర్ధ శతాబ్దమైనా నిండకముందే భిన్నా భిన్నమైంది. ఇంత విస్తార సామ్రాజ్యాన్ని నిలబెట్టిన సర్వసముద్రాధిపత్యంగాని, ప్రపంచ వ్యాపార రంగంలో పూర్వపు ప్రథమ స్థానంగాని, సిరిసంపదలుగాని బ్రిటన్ దేశానికి ఈనాడు లేవు. కాని ఇదంతా బ్రిటిష్ జాతి ఓటమి కాదని, పతనంగా కన్పించే ఈ పరిణామంతోనే పెనవేసుకొని ఆ దేశపు కీర్తి ప్రతిష్ఠలు బాగా ప్రకాశిస్తున్నాయని తలిచేవారున్నారు. బ్రిటిష్ జాతి స్థాపించిన వలసదేశాలే రాజకీయంగా మొదట స్వాతంత్ర్యం పొందిన బ్రిటిష్ సామ్రాజ్య భాగాలు వీటిలో ఐర్లండ్ తప్ప మిగిలినవి దౌర్జన్య, విప్లవమార్గాలవల్లగాదు. స్వాతంత్ర్యం సంపాదించింది: వా రవలంబించింది సౌమ్య మార్గాలు; పార్లమెంటరీ విధానం. ప్రజలకు ప్రాతినిధ్యం వహించే శాసనసభలు, శాసనసభ్యుల నుంచి ఎన్నుకొన్న మంత్రివర్గాలు; శాసన సభలకు బాధ్యత వహించి చేసే ఆ మంత్రివర్గాల పరిపాలన; ఆ మంత్రివర్గాల పరిపాలనను విమర్శించి, వాటిని పడగొట్టి, పార్లమెంట్‌లో మెజారిటీ సభ్యుల తోడ్పాటుతో మంత్రి పదవులను ఆక్రమింపజూసే ప్రతిపక్షాలు, వయోజనులైన వోటర్ల అభిమానాన్ని పొందటంకోసం రాజకీయ పక్షాలు సాగించే నిరంతర ప్రచారము, వ్యక్తి స్వాతంత్ర్యం మీద వ్యక్తుల ధన, మాన, ప్రాణాల రక్షణావశ్యకతను గురించి నిశ్చయమైన నిష్పక్షపాతమైన న్యాయపరిపాలక శాఖావశ్యకతను గురించి గాఢమైన నమ్మకము – ఇవి ప్రధాన లక్షణాలుగాగల రాజ్యాంగం తరతరాల కృషి ఫలితంగా సాధించిన బ్రిటిష్ జాతి వారసత్వము బ్రిటిష్ వలసరాజ్యాలకు సంక్రమించింది. అది అట్లా సంక్రమించటం సహజమే. దానిలో వింత ఏమీలేదు. ఆ వారసత్వం బ్రిటిష్ పొలిమేరలు దాటి, విభిన్న నాగరకత, విలక్షణమైన రాజకీయానుభవాలు ఉన్న అన్య జాతీయుల సొత్తు కావటం ఆశ్చర్యపడవలసిన విషయము. స్వతంత్ర భారత రాజ్యాంగాన్ని పరిశీలిస్తే దీనికోసం బ్రిటన్ ఈ దేశంలో సాగించిన పరిపాలనా విధానానికి మనమెంత ఋణపడి ఉన్నామో? జాతీయ దురభిమానాన్ని అటుంచి పరిశీలించే వారికి ఎరుకపడకపోదు. భారతీయ ధర్మశాస్త్రాలు, ఈ దేశంలోని అనేక జాతుల ఆచారాలు రోమన్ న్యాయసూత్రాల చేత, ఆంగ్లో – నార్మన్ న్యాయవిధానాలచేత పరిపుష్టి పొంది, వాటితో సమన్వయం చెందిన నూతనావతారము మనలో అద్భుత ప్రమోదాలను కలిగిస్తూ ఉన్నవి. వేద

కాలంనాటి ఆర్యులకు సుపరిచితమైన ప్రజాపరిపాలనాతంత్రం కాలవశాత్తు, అన్యజాతుల ఆక్రమణకు గురిఅయి వారి పరిపాలనా కాలంలో అడుగునపడి, ఇంతకాలానికి తిరిగి తలెత్తి ఫలము ఇవ్వటానికి ఆరంభించటానికి బ్రిటిష్ రాజ్యాంగ విధానంతో మనకు 150 ఏళ్ళుగా ఉన్న సన్నిహిత సంబంధమే ప్రధాన కారణము. శాసనసభల ఎన్నికలలో, రాజకీయపక్షాల ప్రవర్తనలో పరిపాలకులలో, పరిపాలనా క్రమంలో, వ్యక్తి స్వేచ్ఛా విచ్ఛేదకాలైన శాసనాలు రచించటంలో మనము చూపే అవేశాలు, లోపాలు బ్రిటిష్ పరిపాలనా విధానానికి, బ్రిటిష్ పరిపాలకుల తలలకూ అంటగట్టజూసేవారు. ఆ విధంగా ఆ లోపాలు తప్పించుకోలేరు. ఎంతమంచి విత్తనమైనా, మొలకెత్తి చక్కగా ఫలాలిచ్చేదీ, ఇవ్వలేకపోయేదీ దానిని నాటిన క్షేత్రపు సారం మీద ఆధారపడి ఉంటుందనే మాట మనము మరిచిపోరాదు. శతాబ్దాలుగా నిరంకుశ ప్రభువుల కింద సాంఘిక దురాచారాల కింద మగ్గిన భారతీయులు ఈ కొద్ది కాలంలో స్వాతంత్ర్య వాయువులను పీల్చి ఇంత అభ్యున్నతిని సాధించటానికి వేలకొద్దీ ఏళ్ళ విజాతీయ, విమత పరిపాలనకైనా లొంగని చేవ ఈ ఆర్యజాతిలో ఉంది. దానిని కాదనలేముగాని, ఈ సత్పరిణామానికి మనము బ్రిటిష్ పార్లమెంట్‌కు ఎంత ఋణపడి ఉన్నామో విస్మరించటం కృతఘ్నతే అవుతుంది. కాని మొన్నమొనటిదాకా బ్రిటిష్ సామ్రాజ్యాంతర్గత భాగాలై ఉండి, బ్రిటిష్ పరిపాలకుల ఔదార్యంవల్ల స్వాతంత్రం పొందిన అన్నిదేశాలలో బ్రిటిష్ పార్లమెంటరీ విధానం భారతదేశంలో విజయవంతం అయినంతగా ఇతరత్రా కాలేదని అంద రంగీకరించవలసిందే. ఉగాండా, కెనియా, దక్షిణాఫ్రికా వంటి దేశాలలో వెర్రితలలు వేస్తున్న వర్ణ విద్వేషము, నియంతృత్వాభిమానము, వ్యక్తి స్వేచ్ఛా వినాశక విధానాలు దీనికి తార్కాణము. పార్లమెంటరీ పరిపాలనకు సంసిద్ధం కాని జాతులకు రాజకీయ స్వాతంత్ర్యం ఇవ్వటంలో బ్రిటన్ తొందరపడిందా అని తోస్తున్నది. స్వాతంత్ర్యం అనేది రెండంచుల పదను కత్తి - సుశిక్షితుడుగాని బాలుని చేతికిస్తే, స్వపర వినాశనానికది హేతువుకావచ్చు కాని బ్రిటిష్ జాతికి సహజమైన స్వపరిపాలనా విధానంలోని అభిరుచి భారతదేశాన్ని, సముద్రాధిపత్యాన్ని పోగొట్టుకొన్న తరవాత ప్రపంచవ్యాప్తమైన సామ్రాజ్యాన్ని మోయలేనేమో అనే జంకు వారినీ విధంగా రాజకీయ స్వాతంత్ర్యం అనే మహావరాన్ని అర్హతానర్హతలు చూడక, తమ విభిన్న సంస్కృతులు, సంప్రదాయాలు, సాంఘిక, ఆర్థిక రాజకీయ పరిణతిగల జాతులకు ఇచ్చేటట్లు చేసింది. భారతదేశానికి స్వపరిపాలనా ప్రదానాన్ని చేయటానికి ఎన్ని దశలు, అంతర్దశలు, పరీక్షలు విధించినా బ్రిటిష్ పార్లమెంట్ ఆ అంతరాలేమీ విధించక అన్ని విధాలుగా వెనకబడిన ఆఫ్రికన్, తదితర జాతులకు స్వరాజ్యాన్ని ఇవ్వటం చూస్తే మానసికంగా బ్రిటిష్ జాతిలో విప్లవకరమైన మార్పు కలిగినట్లు కనబడుతూంది. ఏదెట్లయినా, బ్రిటన్ నాయకత్వం వహించిన, లేదా ప్రథమ సభ్యత్వమున్న కామన్‌వెల్త్ ఈనాడు, చైనీస్, రష్యన్ అమెరికన్‌ల పోటీలకు, కుమ్ములాటలకు యుద్ధరంగమైన ఐక్యరాజ్య సమితికంటె మిన్నగా నానాజాతి సమితి అని పిలవటానికి అర్హమైనదిగా తోస్తూ ఉన్నది. కామన్‌వెల్త్ సభ్యదేశాలలో పరస్పర సహనం హెచ్చు - దానిలో ఏ ఒక్క రాజ్యం పెత్తనాన్ని ఇతర రాజ్యాలేవీ అంగీకరించవు. సాంఘికంగా, ఆర్థికంగా, రాజకీయంగా ఒండొంటితో సహకరించటానికి దాని సభ్యులందరూ సుముఖులు. అంతరంగిక, వైదేశిక సార్వభౌమత్వాన్ని అనుభవించే కామన్‌వెల్త్ రాజ్యాలీనాడు సంయుక్త రాజ్యంగా కాకపోయినా, ఒక సమ్మేళన రాజ్యంగా రూపొందటానికి

తగిన దశలో ఉన్నాయి. దాని ఉజ్జ్వల భవిష్యత్తు ఉందో, లేదా ఒక నాటికి గట్టిన పూలతో అవి ఒక్కొక్కటిగా రాలిపోతాయో కాలమే నిర్ణయిస్తుంది.

## మొదటి ప్రపంచయుద్ధం మొదలుకొని బ్రిటిష్ రాజకీయపక్షాలలో కాబినెట్ పరిపాలనలో కలిగిన పరిణామాలు

1914 ఆగస్టు నుంచి 1918 నవంబర్ వరకు మొదటి ప్రపంచ యుద్ధం జరిగింది. ఈ కాలంలో రాజకీయ పక్షాలన్నీ తమ విభేదాలను మరిచి యుద్ధంలో విజయాన్ని సాధించే ప్రయత్నంలో మునిగిపోయినాయి. 1916 జనవరిలో 1911 పార్లమెంట్ చట్టం విధించిన అయిదేళ్ల జీవితకాలం ముగిసినా యుద్ధం పేరు చెప్పి 1918 నవంబర్ వరకూ దాని జీవితాన్నది మరి మూడేళ్ళు పొడిగించుకొంది. ఈ చర్యవల్ల బ్రిటిష్ రాజ్యాంగ మెంత సరళ (flexible) మైనదీ, బ్రిటిష్ పార్లమెంట్ యొక్క శాసనాధికార మెంత పరిమితిలేనిదీ, సమగ్రమైనదీ రుజువవుతూ ఉంది. ఈ యుద్ధానికి ముందే కొన్నేళ్ళుగా కామన్స్ సభ బలహీనపడి ఒకవైపు పలచబడుతూ మంత్రివర్గాధికారం మరింత దృఢపడుతూ ఉంది. ఈ శతాబ్దంలో సంభవించిన యుద్ధాల తీరు రాజ్యంలోని సర్వాధికారాలను మంత్రివర్గం చేతులలో సంపూర్ణంగా కేంద్రీకరించింది. వ్యక్తి స్వాతంత్ర్యాన్ని పూర్తిగా రూపుమాపే శాసనాలు, ఆర్థికాధికారాన్ని పూర్తిగా కాబినెట్ హస్తగతం చేసే శాసనాలు మంత్రివర్గం అడిగీ అడగకముందే పార్లమెంట్ ఆమోదించేది. నేరారోపణ లేకుండా, న్యాయస్థానాలచే విచారణ చేయించటం శిక్ష విధింపు లేకుండా వ్యక్తులను రాజ్య క్షేమంపేరిట పరిపాలకవర్గం కారాగారాలలో పడవేయటం పరిపాటి అయింది. 1914 దేశరక్షణ శాసనం శత్రుదేశాల వారికి, వారితో సంబంధమున్న వారికి న్యాయస్థానాలు నిష్కారణ నిర్బంధం నుంచి ఏ రక్షణా ఇవ్వటానికి వీలులేనట్లు చేసింది.

యుద్ధ మారంభమైనప్పుడు అధికారంలో ఉన్నది లిబరల్ పక్ష మంత్రివర్గము. అప్పుడు ప్రధానమంత్రి ఆస్క్విత్. 1915 మే మాసంలో ఇతర రాజకీయ పక్షాలకు చెందిన వారిని కొందరిని చేర్చుకొని సంకీర్ణ మంత్రిమండలిని (Coalition cabinet) ఆస్క్విత్ ఏర్పాటుచేసినాడు. కామన్స్‌లోని ఐరిష్ జాతీయ వాదులు మంత్రివర్గంలో చేరకపోయినా, దానితో సహకరించినారు. యుద్ధావసరాలను బట్టి మంత్రుల సంఖ్య ఇరవైకి పెరిగింది. మంత్రివర్గంగా చేయవలసిన కార్యభారంతోపాటు యుద్ధ కార్యాల నిర్వహణ మితిమీరటంతో 1915 వ సంవత్సరాంతంలోగా ఇరవై మంది మంత్రులలో అర్గురు ప్రధానమంత్రి నాయకత్వం కింద యుద్ధ సమితిగా ఏర్పడినారు. ఆ సమితి సభ్యులైన లాయిడ్ జార్జ్ మితవాద పక్ష నాయకుడైన బోనర్ లాతో చేతులు కలిపి యుద్ధసమితి సంఖ్య నాల్గింటికి మించరాదని, దానిలో ప్రధానమంత్రి ఉండరాదని పేచీ పెట్టి రాజీనామా చేయటంతో, ఆస్క్విత్ మంత్రివర్గం కూలిపోయింది. దాని స్థానంలో లాయిడ్ జార్జ్ మంత్రివర్గ మధికారంలోకి వచ్చింది. లాయిడ్ జార్జ్‌తో పాటు దాని సభ్యు లార్గురు ఉన్నారు. వారిలో ఒక్క కోశాధికారి (Chancellor of the Exchequer) కి తప్ప ఇతరులకు పరిపాలనాభారాన్ని అంటగట్ట లేదు. వీరు యుద్ధ సమితిగా అంతరంగిక మంత్రిమండలి (Cabinet) అయినారు. తక్కిన మంత్రులకు కాబినెట్‌లో స్థానం లేదు. కొత్తగా కార్మిక, నౌకా, వైమానిక, పునర్నిర్మాణాది

పరిపాలన శాఖలు ఏర్పడినా, వాటి అధిపతులు మంత్రి మాత్రులైనారు. కాబినెట్ సభ్యులు చేసే నిర్ణయాలకు కార్యరూప మిచ్చేవారు ఇతర మంత్రులైనారు. కాబినెట్ నిర్ణయాలను పూర్వమున్నట్లు గాక ఇప్పుడు లోక్యంతో మంత్రులకు పంచవలసి రావటంతో మంత్రివర్గ నిర్ణయాలను ప్రివీ కౌన్సిల్ సభ్యులుగా రహస్యంగా ఉంచవలసిన బాధ్యత మంత్రులకు తొలగిపోయింది. అంతటితో ఆగక 1917, 1918 లో పార్లమెంట్‌కు కాబినెట్ కార్య నివేదికలను సమర్పించటం కూడా జరిగింది. దీని కర్థము మంత్రివర్గం కామన్స్ సభకు ఎక్కువ బాధ్యత వహించి ప్రవర్తించసాగిందని కాదు. నిజానికి మంత్రివర్గం ప్రజా బాహుళ్యానికి, వార్తా పత్రికలు ప్రకటించే ప్రజాభిప్రాయానికి ఎక్కువ ప్రాధాన్య మివ్వసాగిందని మాత్రమే మనము గ్రహించవలె. లాయిడ్ జార్జ్‌ను ప్రధానమంత్రి చేసింది కామన్స్ సభకాదు - బ్రిటిష్ ప్రజానీకము 1918 డిసెంబర్‌లో పార్లమెంట్‌కు సామాన్య ఎన్నిక జరిగి, లాయిడ్ జార్జ్ రెండో సంకీర్ణ పక్ష ప్రభుత్వానికి అత్యధిక సంఖ్యా బలాన్ని సంపాదించి పెట్టింది. యుద్ధం ముగిసినా యుద్ధకాలం కాబినెట్‌ను ఇంకా కొంతకాలం సాగించవలెనని లాయిడ్ జార్జ్ చూసి నాడుగాని ఆ విధానానికి పార్లమెంట్‌లోనూ బయటా ప్రాతికూల్యం రావటంతో, ఉపఎన్నికలలో సంకీర్ణ పక్షం అభ్యర్థులు ఓటమి పొందటంవల్ల ప్రధానమంత్రి తన విధానం మార్చుకో వలసి వచ్చింది. కామన్స్ సభలో సామాన్యంగా కాబినెట్ మంత్రులు కనబడక, వారి సహ మంత్రులు - కాబినెట్ అనుసరిస్తున్న పరిపాలనా విధానాలకు కర్తలుగాని వారు సభ్యుల ప్రశ్నలకు సమాధానా లివ్వవలసి రావటం తీవ్ర విమర్శకు గురిఅయింది అందువల్ల యుద్ధానికి పూర్వమున్నట్లు ప్రధాన ప్రభుత్వ శాఖాధిపతులతో కూడిన 19 సభ్యుల మంత్రివర్గాన్ని లాయిడ్ జార్జ్ ఏర్పాటుచేయవలసి వచ్చింది. ఈ విధంగా ఒక్క దెబ్బతో ఇంతకాలం ఇతరత్వం వహించిన కామన్స్ సభ తన ప్రతిష్ఠను తిరిగి పొందగల్గింది. కొంత కాలంగా బ్రిటిష్ దేశాన్ని పార్టీ నాయకుల కూటమి పరిపాలిస్తున్నదేగాని ప్రజాప్రతినిధి సభ అయిన కామన్స్ కాదు అనే ప్రవాదం వ్యాపించి ఉంది ఈ అపప్రథపోయి, చాలా కాలంగా నిద్రించి ఉన్న కామన్స్ సభ ఆత్మ ఇన్నాళ్ళకు మేల్కొన్నది అనే విమర్శ వినవచ్చింది. దానితోబాటు యుద్ధాన్ని విజయవంతంగా నిర్వహించే ఉద్దేశంతో మొదట సమావేశపరిచిన యుద్ధకాలపు సామ్రాజ్య మంత్రిమండలి (The Imperial War Cabinet) కూడా యుద్ధం సమాప్తి కాగానే కూలిపడింది. ఈ మంత్రివర్గము బ్రిటిష్ - డొమినియన్ ప్రభుత్వాల ప్రతినిధిగా పని చేసిన విధం చూసి, ఏనాటికైనా బ్రిటిష్ రాజ్యాలను స్నేహబంధాలతో కట్టివేసే సమ్మేళన రాజ్య కార్యనిర్వాహకవర్గంగా అది పరిణమించగలదనే ఆశలు అడియాసలైనాయి. ఏ విధంగా బ్రిటిష్ డొమినియన్‌లు, తదితర బ్రిటిష్ సామ్రాజ్యాంతర్గత రాజ్యాలు క్రమంగా సార్వభౌమాధికారమున్న స్వతంత్ర రాజ్యాలుగా విడిపోయినాయో మీరు చదివి ఉన్నారు కామన్‌వెల్త్ అనేది ఒకటి ఏర్పడినా దాని సభ్య రాజ్యాలను ఐక్యం చేయగల భావాలు ఎట్లా జాతి విద్వేషంవల్ల బలహీనమవుతున్నాయో దక్షిణాఫ్రికాలోని ఇయాన్‌స్మిత్ పరిపాలనను, ఉగాండాలోని జనరల్ అమీన్ ప్రభుత్వ విధానాలను గమనించే వారికి స్పష్టమవుతుంది. ఒక కామన్‌వెల్త్ రాజ్యంలోని ప్రభుత్వం నీగ్రో జాతివారిని, నల్ల జాతులవారిని పౌరసత్వానికి దూరం చేయటం; మరో రాజ్యంలో స్వజాతివారు కాని బ్రిటిష్ సామ్రాజ్య పౌరులను నానా హింసల పాలుచేసి, వారి సర్వస్వం దోచుకొని దేశ భ్రష్టులను చేయటం చూస్తే మానవతా వాదము

స్వాతంత్ర్య ప్రియత్వము, న్యాయబుద్ధి లేని జాతులకు రాజకీయ స్వేచ్ఛను ఇవ్వటంలో బ్రిటన్ ఎంతో తొందరపడిందని అనిపిస్తుంది

## ప్రథమ ప్రపంచ యుద్ధానంతర బ్రిటిష్ రాజ్యాంగ చరిత్ర

యుద్ధానంతరం యూరప్ ఖండంలోని అనేక రాజ్యాలలో బ్రిటిష్ పార్లమెంటరీ విధానము ముందంజ వేస్తున్నట్లు కనిపించింది. 1911, 1918 పార్లమెంటరీ సంస్కరణ శాసనాల వల్ల స్త్రీ, పురుష విభేదం లేకుండా బ్రిటన్‌లోని వయోజనులందరికీ ఓటింగ్ హక్కు లభించింది. బ్రిటిష్ పౌరు లనుభవిస్తున్న బాధ్యతాయుత ప్రభుత్వ విధానాన్ని క్రొత్తగా ఏర్పాటైన జర్మనీ, ఆస్ట్రియా, పోలండ్, చెకస్లవాకియ, యూగోస్లావియ, ఫిన్‌లండ్, ఎస్తోనియ రాజ్యాలు అవలంబించినాయి ఈ పరిణామము 1919-1921 మధ్యకాలంలో కలిగింది. 1921 లో ఇండియాలో మాంటెగూ - ఛెల్మ్స్‌ఫర్డ్ సంస్కరణాలెట్లా ఒకపాటి ప్రజాపరిపాలనా విధానాన్ని ప్రవేశపెట్టిందీ ముందే చదివి ఉన్నారు. రష్యా (1919), ఇటలీ (1922) లలో స్వాతంత్రోద్యమం ఫలితంగా వ్యక్తి స్వేచ్ఛకు భంగకారులైన ప్రభుత్వాల స్థాపన జరిగింది. అదే విధంగా టర్కీలో ముస్తఫా కమాల్ పాషా, స్పెయిన్‌లో డిరివీరా, జర్మనీ ఆస్ట్రియాలలో అడాల్ఫ్ హిట్లర్ సైనిక నియంతృత్వాన్ని స్థాపించినారు. బ్రిటన్ దేశంలోను నియంతృత్వం ఏర్పడ లేదుగాని, పార్లమెంట్ దాని ప్రాధాన్యం కోల్పోయింది, మెజారిటీ ఉండే రాజకీయ పక్షం నుంచి మంత్రిమండలిని గ్రహించే పద్ధతి కేమీ నష్టం కలగలేదుగాని, మంత్రిమండలులు కామన్స్ సభ చెప్పుచేతలలో ఉండటం మాని, ఆ కామన్స్ సభనే మంత్రివర్గంగా ఏర్పడిన పార్టీ నాయకులు కొద్దిమంది తమ ఇష్టం వచ్చినట్లాడించే పరిస్థితి కలిగింది. 1911 పార్లమెంటరీ శాసనంవల్ల ప్రభు సభకు కోరలు తీసినట్లయింది. ఆ తరవాత మంత్రిమండలి కామన్స్ సభలో తమ పక్షానికి చెందిన సభ్యుల నేదోవిధంగా లోగట్టుకొంటే చాలు. లోగట్టుకొనే మార్గాలు మంత్రిమండలికి ఎన్నడూ ఎన్నో ఉండకపోవు. అసలు పార్లమెంట్‌కు సాధారణ ఎన్నికలు తటస్థించినప్పుడు తమ పక్షం అభ్యర్థులుగా స్వతంత్రించే ప్రవృత్తి ఉన్నవారిని ఏ పార్టీ నాయకవర్గం వరించదు ఆ నాయక బృందాన్ని కాదని స్వతంత్రించి పోటీచేసి ఎంతటి ఘనుడైనా పార్లమెంట్‌కు ఎన్నికయ్యే అవకాశమే ఈనాడు లేదు. మంత్రివర్గం సభ్యులు ఆలోచించేది కామన్స్ సభలో తాము ప్రతిపాదించదలిచే చట్టాన్ని తమ స్వపక్ష సభ్యులలో కొందరు ప్రతిపక్షంతో చేతులుకలిపి ఓడించి తమ పతనానికి కారకులవుతారేమో అని కాదు. అధికార పక్షంలోనివారుగాని, ప్రతిపక్షాలవారుగాని ఏ వ్యవహారాన్ని అంతవరకు రానివ్వరని వారికీ బాగా తెలిసిన విషయమే. పార్లమెంట్‌కు వెలుపలనుండే ప్రజాసమూహాలు తమ చిత్త వృత్తికి తామనుసరించే పరిపాలనా విధానానికి అనుకూలంగా ఉన్నారా, లేదా ప్రతికూలంగా ఉన్నారా అనేదే వారు గమనించేది. సభలలో, పత్రికలలో ప్రకటితమయ్యే ప్రజాభిప్రాయం తమకు సుముఖంగా ఉందా లేదా అనే నిరంతరం వారు ఆలోచించేది. తాము ప్రతిపాదించిన చట్టం వీగిపోయినప్పుడు పదవీ విరమణచేసి ప్రతిపక్షానికి అవకాశమివ్వని మంత్రిమండలులు కామన్స్ సభను మధ్యంతరంగా రద్దుచేసి సాధారణ ఎన్నికల్ని జరిపించమని రాజుకు సలహాచెప్పి ఆ ఎన్నికలలో మెజారిటీతో గెలుపొందిన మంత్రివర్గాలు బ్రిటిష్ రాజ్యాంగ చరిత్రలో లేకపో లేదు. నార్మన్, ఆంజీవిన్ రాజులు పరిపాలించిన కాలంలో మతాధికారులు, ప్రభువులు,

సామాన్య ప్రజలు అనే త్రివర్గాలతో (The Three Estates) కూడుకొన్న పార్లమెంట్ అభిప్రాయాలను రాజులు మన్నించవలసి ఉండేది. క్రమంగా ఉన్నత మతాధికారులు ప్రభుసభ సభ్యులై, తదితర సామాన్య మతాధికారులు పార్లమెంట్ నుంచి వైదొలగిపోగా, బ్రిటిష్ పాలనా యంత్రాంగం నిజంగా రాజు, ప్రభుసభ, ప్రజాసభలనే త్రివర్గాలుగా విభజనమయింది. శతాబ్దాల పరిణామంలో రాజు, ప్రభుసభలు నిర్వీర్యం కాగా పరిపాలనాధికారమంతా ప్రజాసభ (House of Commons) హస్తగతమైనట్లు కనిపించింది. కాని రాజకీయ పక్షాలు సుస్థిరమై, ప్రజలలో రాజకీయ చైతన్యం విస్తరించగా, వాగి విరాట్ స్వరూపం ప్రస్ఫుటంగా ఈనాడు బహిర్గతమవుతూ ఉన్నది. ప్రజానీకం మూలవిరాట్ విగ్రహం కాగా, పార్లమెంట్ సభ్యులు ఉత్సవ విగ్రహాలైనారు. వారికి పరిపాలనను కైంకర్యం చేసే అర్చక బృందము మంత్రివర్గము అయినారు. యుద్ధానంతర కాలంలో ఈ పరిణామక్రమం కింది విధంగా సాగింది.

1919 నుంచి 1933 వరకు, 15 ఏళ్లలో మూడు సంకీర్ణ మంత్రిమండలులు, మూడు మితవాద (Conservative) మంత్రిమండలులు, రెండు కార్మిక పక్ష మంత్రిమండలులు పాలించినాయి. సంకీర్ణ మంత్రిమండలులు మొత్తం మీద అధికారంలో ఉన్నది ఆరేళ్ళ రెండు నెలలు, మితవాద పక్షం మొత్తంమీద అయిదేళ్ళ పది నెలలు, కార్మిక పక్షం మూడేళ్ళు లిబరల్ (ఉదార పక్షం) పార్టీ వారికి ఈ కాలంలో జరిగిన ఐదు ఎన్నికలలోను ఒక్కసారి కూడా కామన్స్ సభలో నాల్గోవంతు కంటె హెచ్చు స్థానాలు లభించలేదు. ప్రధానమంత్రి పదవిని అలంకరించినవారు నల్గురున్నా వారిలో ఒక్కరైనా ప్రభుసభ సభ్యుడు కాదు. లాయిడ్ జార్జ్, బోనర్‌లా, బాల్డ్‌విన్, మాక్‌డొనాల్డ్ అనేవారే ఆ నలుగురు ప్రధానమంత్రులు. 1902 లో ప్రధానమంత్రిగా ఉన్న సాలిస్‌బరీ ప్రభువును, తరవాతి ప్రధానమంత్రిని కామన్స్ సభ్యుల నుంచి మాత్రమే తీసుకొనే ఆచారం స్థిరపడింది. పైన చెప్పిన వారిలో లాయిడ్ జార్జ్ లిబరల్ పక్షం వాడైనా, జనవరి 1919 నుంచి సంకీర్ణ ప్రభుత్వంలో మూడేళ్ల పది నెలల ప్రధానమంత్రిగా పనిచేసినాడు (అంతకుముందు మూడేళ్ల కూడా అతడు ప్రధానమంత్రే). మితవాద పక్షంవాడు బోనర్‌లా ప్రధాని అయిన ఏడు నెలలకే అనారోగ్యంవల్ల విరమించవలసి వచ్చింది. ఆ పక్షానికి చెందిన స్టాన్లీ బాల్‌విన్ మొత్తం మీద అయిదేళ్ళ మూడు నెలలూ కార్మిక పక్షం వాడైన రామ్సే మాక్‌డొనాల్ నాలుగు మారులు అయిదేళ్ళ నాలుగు నెలలూ ప్రధానమంత్రిగా పాలించినారు. ఈ మాక్‌డొనాల్ కార్మిక పక్షం వాడుగా కొంతకాలం, జాతీయ కార్మికపక్షం వాడుగా కొంతకాలము రెండు సంకీర్ణ మంత్రిమండలులలో ప్రధానమంత్రిగా వ్యవహరించినాడు. బోనర్‌లా 1923 లో ప్రధాని పదవినుంచి విరమించినప్పుడు, మితవాద పక్షంలో దానికి కర్జన్ ప్రభువంత అర్హుడైనవాడు మరెవ్వడూ లేడని అందరూ అంగీకరించినా కామన్స్ సభ్యత్వమతనికి లేదనే కారణంతో, రాజకీయానుభవంలో, శేముషీ వైభవంలో ఏ మాత్రం సరిపోని బాల్డ్‌విన్ పక్ష నాయకత్వానికి ఎన్నికయి ప్రధానమంత్రి అయినాడు. 1911 పార్లమెంట్ శాసనము ఆమోదించటంవల్ల బ్రిటిష్ రాజకీయాలలో ప్రభుసభ ప్రాధాన్యం పోగొట్టుకొన్నది. తత్ఫలితంగా, కామన్స్ సభ్యుడు కానివాడు ప్రధానమంత్రి కారాదనే ఆచార మేర్పడింది.

## ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం బ్రిటిష్ రాజకీయ పక్షాలు

ఈ కాలంలో బ్రిటిష్ కార్మికపక్షం తల ఎత్తింది, బలపడింది. మితవాద పక్షాన్ని కొంతవరకు పడదోసి మంత్రిమండలిని చేజిక్కించుకొన్నది. కాని సామాన్యంగా ఎక్కువ కాలం అధికారంలో ఉన్నది మితవాద పక్షమే. కార్మికపక్షం ఒకవైపు బలం పుంజుకొంటూ పోగా మరోవైపు ఉదారపక్షం బలం క్షీణించింది ఆ కార్మిక పక్షమైనా చాలాకాలం అధికారం నిల్పుకోలేదు. లాయిడ్‌జార్జ్ మితవాదులతో కలిసి ఏర్పాటుచేసిన సంకీర్ణ ప్రభుత్వంలో (1919-1922) నైనా మితవాద పక్షానివే కామన్స్ సభలో అధిక స్థానాలు. 1922 అక్టోబర్‌లో సంకీర్ణ మంత్రిమండలి నుంచి మితవాద పక్ష సభ్యులు మానుకొన్నారు. వెంటనే జరిపిన సాధారణ ఎన్నికలలో కామన్స్‌లోని 615 స్థానాలలో 344 స్థానాలు మితవాదులు గెల్చుకొన్నారు. 1918 పార్లమెంట్ శాసనంవల్ల బ్రిటిష్ వోటర్‌ల సంఖ్య విపరీతంగా పెరిగింది. స్త్రీ వోటర్‌లే కాక కార్మికులు మొదలైన సామాన్య జనులలో వోటర్ లయినవారు కూడా చాలా హెచ్చినందువల్ల ఆ తరవాత ఎన్నికలలో మితవాదులు గెలిచే అవకాశమంతగా ఉండజాలదని అనేకులు అభిప్రాయపడినారు కాని 1919 సాధారణ ఎన్నికలలోనూ, 1922 నవంబర్‌లో జరిపిన రెండో సాధారణ ఎన్నికలోనూ కామన్స్ సభలో అధిక స్థానాలు సంపాదించింది మితవాదులే. 1923 డిసెంబర్‌లో జరిగిన మూడో సాధారణ ఎన్నికలో కార్మిక పక్షానికి వచ్చిన స్థానాలకంటె 65 స్థానాలు హెచ్చుగాను, ఉదారపక్షం గెల్చుకొన్న స్థానాలకంటె నూరు అధికంగాను మితవాదులు సాధించినారు కాని, ఉదార, కార్మికపక్ష సభ్యులు చేతులు కలిపినందువల్ల మితవాదులకంటె వారికి మెజారిటీ లభించింది కాబట్టి ఆ రెండు పక్షాలు కలిసి సంకీర్ణ మంత్రిమండలిని ఏర్పాటుచేసినారు. ఈ మంత్రిమండలి పట్టుమని పది నెలలయినా పరిపాలించలేదు. 1924 అక్టోబర్ ఎన్నికలలో మూడు వంతులలో రెండు వంతుల స్థానాలు మితవాదులకు లభించినందువల్ల వారు అధికారంలోకి వచ్చి నాలుగున్నర ఏళ్ళు పరిపాలించినారు 1929 మే ఎన్నికలలో కార్మికపక్షం మంత్రిమండలి ఏర్పాటుచేయగలిగింది. 1924, 1929 మధ్యకాలంలో కొత్తగా 50 లక్షలమంది స్త్రీ వోటర్‌లు నమోదయినారు. 1918 చట్టం 30 ఏళ్ళు నిండిన స్త్రీలుగాని వోటర్‌లు కారాదన్నది గాని 21 ఏళ్ళు నిండిన క్షుద్రవాని కుండే లోకానుభవము, రాజకీయ పరిజ్ఞానం 30 ఏళ్ళు నిండని స్త్రీకి ఉండదనటమే ఏ హేతువాదానికి నిలవనందువల్ల 1928 లో స్త్రీ కూడా 21 ఏళ్ళు నిండితే చాలు, ఆ స్త్రీ వోటర్ కావచ్చుననే శాసనం చేసినారు. ఈ శాసనము స్త్రీ, పురుషులకు వోటింగ్ హక్కు అన్ని విధాలా సమానం చేసింది. అంటే ప్రజారాజ్య విధానం మరో ఘనవిజయం సాధించినట్లు. బ్రిటిష్ రాజ్యం మొత్తం వోటర్‌లలో సగంకంటె హెచ్చుమంది 1928 శాసన ఫలితంగా స్త్రీ వోటర్ లయినారు. 1918 లో స్త్రీలకు వోట్ చేసే హక్కునిచ్చే ప్రతిపాదనకు ఇతరు లందరికంటె హెచ్చుగా విరోధం చూపింది మితవాద పక్షంవారు. ''ఆడ పెత్తనం, తంజీ దొరతనం'' అనే ధోరణిలో మితవాద విమర్శలు సాగినాయి. కాని ఈ భయాలు నిరాధారాలని, 1919, 1922, 1923, 1924, 1928 సాధారణ ఎన్నికలు రుజువుచేసినాయి. ఎట్లాగంటే కార్మిక పక్షంవారు సామాన్యంగా యథేచ్ఛా వ్యాపారానికి (Free trade) అనుకూలురు. మితవాద పక్షంవారు బ్రిటిష్ పరిశ్రమ వ్యాపారాలను విదేశాల పోటీనుంచి కాపాడటానికి సంరక్షక సుంకాలను

(Protective duties) విధించవలెనని వాదించేవారు, అయినా మితవాదపక్షం కామన్స్‌లో 1928 ఎన్నికలలో అధిక సంఖ్యాబలాన్ని గెల్చుకొన్నది దీని అర్థం స్త్రీ కార్మిక వోటర్‌లు పలువురు మితవాద పక్షాన్ని బలపరిచినారని, 1931 అక్టోబర్‌లో జరిగిన సాధారణ ఎన్నికలో మితవాదపక్షం రెండున్నర ఏళ్ళుగా అధికారంలో ఉన్న కార్మిక పక్షాన్ని పడగొట్టి, కామన్స్ సభలో 470 స్థానాలను గెల్చుకొన్నది ఈ ఎన్నిక జరిగింది బ్రిటన్ విశేషించి ఆర్థిక మాంద్యంలో ఉక్కిరిబిక్కిరవుతున్న కాలంలో, మొత్తం బ్రిటిష్ వోటర్‌ల సంఖ్యలో మెజారిటీ స్త్రీ, కార్మి, కర్షకజనులు. బ్రిటన్‌లో అతివాద రాజకీయాలకు చాలా అనువుగా ఉండే కాలమది అని ఎవ్వరైనా అనుకోవచ్చుగాని, బ్రిటిష్ వోటర్‌లు మితవాద పక్షానికి పార్లమెంటరీ చరిత్రలో అంతకుపూర్వం కనీవినీ ఎరగని విజయాన్ని కట్టబెట్టి, పండిన రాజకీయ పరిజ్ఞానాన్ని ప్రదర్శించినారు.

కార్మికపక్షం 1919 నుంచి 1929 వరకు జరిగిన పార్లమెంటరీ ఎన్నికలన్నింటిలో ఉదారపక్షం వారికంటె ఎక్కువ స్థానాలు గెల్చింది. 1931 ఎన్నికలలో ఉదారపక్షం రెండుగా చీలి, పోటీ చేసింది ఈ విచ్ఛిన్న పక్షాలలో ఏదీ కార్మికపక్షం గెల్చుకొన్నన్ని స్థానాలు సంపాదించలేకపోయింది. కార్మికపక్షానికి బలమిచ్చింది కార్మిక సంఘోద్యమము (Trade-union movement), సామ్యవాదము (Socialism) ఇంగ్లండ్‌లో వ్యాపించిన సమష్టివాదము (Collectivism) ఫేబియన్ సామ్యవాదమని ప్రసిద్ధిచెందింది 1884 జనవరిలో బెర్నార్డ్‌షా, గ్రాహామ్‌వాలస్, హెచ్. జీ. వెల్స్, వెబ్ దంపతులు, ఆనీబిసాంట్‌లు ఫేబియన్ సమాజాన్ని (Fanian society) ఇంగ్లండ్‌లో స్థాపించినారు. దౌర్జన్యంతో కూడిన విప్లవం అవసరంలేకుండా వోటర్‌లలో సామ్యవాదాన్ని వ్యాపింపజేసి, పార్లమెంటరీ ఎన్నికలలో విజయాన్ని సాధించి రాజకీయాధికారాన్ని హస్తగతం చేసుకొని, క్రమంగా భూమిని, ప్రధాన పరిశ్రమలను ప్రభుత్వాధీనం చేసుకొని, వాటిని సమాజ ప్రయోజనాలను సాధించే విధంగా నిర్వహించి, పెట్టుబడిదారీ విధానంవల్ల కలుగుతున్న అనర్థాలను నివారించవచ్చునని ఫేబియన్‌ల వాదము. ఏ దేశంలోగాని లాభసాటిగా తాను నిర్వహించగల పరిశ్రమనే ప్రభుత్వం స్వాధీనం చేసుకోవలెనని, అట్లా చేసినప్పుడు పరిశ్రమ యాజమాన్యంనుంచి తొలగించే సొంతదారులకు న్యాయమైన పరిహారమివ్వవలెనని ఫేబియన్‌ల అభిప్రాయము.

1893లో ఒక స్వతంత్ర కార్మిక పక్షాన్ని బ్రిటిష్ కార్మికులు స్థాపించినారు. ఫేబియన్‌ల వలె వీరుకూడా సామ్యవాదాన్ని అమోదించేవారే కాని ఈ పక్షం సభ్యులు ఫేబియన్‌ల వలె ధీమంతులు కారు. 1900లో కార్మికపక్ష ఆశయాలను సాధించవలెనంటే కార్మికులు పార్లమెంటులో తగినంత ప్రాతినిధ్యం సంపాదించి తీరవలెనని, ధనికవర్గం చేతులలో పార్లమెంటు ఉన్నంత కాలం కార్మికులు తమ క్షేమ లాభాలను సంపాదించుకోవటానికి చేసే యత్నాలకు అడ్డు తగులుతూనే ఉంటుందని వారు గ్రహించినారు. ఆదిలో ఏ పరిశ్రమలోగాని కాయకష్టం పడేవారే కాని ఇతరులు కార్మిక సంఘ సభ్యులు కారాదని నిషేధించినా, ఏ పరిశ్రమలోగాని బుద్ధి శక్తితో పనిచేసే వారు కూడా కార్మికులవలెనే పెట్టుబడిదారులు దోచుకొంటున్నారని గ్రహించి అట్లాంటి శ్రామికులను కూడా 1918 సంవత్సరం తరవాత కార్మిక పక్షంలో చేర్చుకోవట మారంభించినారు. 1906 ఎన్నికలలో కార్మికపక్షం (The Labour party) కామన్స్ సభలో 30 స్థానాలు గెల్చుకొన్నది. ఒకప్పుడు ట్రేడ్ యూనియన్‌లను

ఏర్పాటు చేయటమే దేశద్రోహ కార్యంగా పరిగణించిన పార్లమెంట్‌లో ఈ విధంగా కార్మిక పక్షం గౌరవస్థానం సంపాదించింది. యుద్ధం ప్రకటనానికి ముందు ఏనాడూ కామన్స్ సభలో కార్మిక పక్ష సభ్యుల సంఖ్య 50 కి మించలేదు. 1910 ఎన్నికలో ఉదారపక్షం తన పార్ల మెంటరీ అధిక్యాన్ని పోగొట్టుకొని మంత్రిమండలిని తన అధీనంలో నిల్పుకోవలెనంటే కార్మిక పక్షంమీద ఐరిష్ జాతీయవాద పక్షంమీద ఆధారపడవలసి వచ్చింది పార్లమెంటరీ కార్మిక పక్షానికి ధనం, బలం చేకూర్చేవి ట్రేడ్ యూనియన్‌లు. మొదటి ప్రపంచ యుద్ధకాలంలో కార్మిక పక్ష ప్రతినిధులు సంకీర్ణ మంత్రిమండలులలో చేరి దేశానికి సేవచేసినారుకాని, యుద్ధం ముగియగానే వారు పార్లమెంట్‌లో ప్రభుత్వ ప్రతిపక్షంగా వ్యవహరించవలెనని నిశ్చ యించుకొన్నారు ఇట్లా ప్రతిపక్షంగా ఏర్పడినప్పుడు కామన్స్ సభలోని కార్మిక సభ్యుల సంఖ్య ఇంచుమించు అరవై మాత్రమే. 1918 కి పూర్వం కార్మికపక్షం రాజకీయంగా ఒక జాతీయపక్షం కాదు స్థానికంగా ఏర్పడిన కార్మిక సంఘాలు (Trade unions), వ్యాపార సంఘాలు (Trade councils), సామ్యవాదుల సమాజాలు, కొన్ని స్థానిక కార్మిక పక్షాలు (Local labour councils) విడివిడిగా వ్యవహారం నడుపుతూ ఉండేవి. "ఈనాటికి కార్మికపక్ష జాతీయ కార్యనిర్వాహక సమితిలో కార్మిక సంఘాలకున్నంత ప్రాతినిధ్యం స్థానిక కార్మిక పక్షాలకు లేదు" (జెన్నింగ్స్). పార్లమెంట్‌లో కార్మికపక్ష నాయకుణ్ణి ఏ సంవత్సరానికి ఆ సంవత్సరం ఎన్నుకొంటున్నారు. అంటే దాని కర్థం ఏటేటా కొత్త నాయ కుడు ఎన్నికైనాడని కాదుకాని ఆ తంతు మాత్రం జరగవలసి ఉంది. మితవాదపక్ష నాయకు నికి కార్మికపక్ష నాయకుని కుండే స్వాతంత్ర్యం కంటె హెచ్చు స్వాతంత్ర్యము ఉన్నది. అతడు సామాన్యంగా సొంత బాధ్యత మీద ఆ పక్షం విధానమిది అని ప్రకటించటం కద్దు. కాని కార్మికపక్షం సభ్యులు మాత్రం తమ ప్రణాళికను కార్య విధానాన్ని తమ సాంవత్సరిక సమావేశంలో చర్చించి నిర్ణయిస్తూ ఉంటారు.

1918 లో కార్మికపక్షం పునర్నిర్మితమైంది. ఫలితంగా కార్మిక సంఘంతోను, సామ్య వాద సమాజంతోను సంబంధం లేని వ్యక్తులుకూడా ఆ పక్ష సభ్యులు కావటం సాధ్యమైంది.

1918 చట్టం వోటింగ్ హక్కును గురించి చేసిన సవరణల ఫలితంగా పార్లమెంట్ ఎన్నికలలో కార్మికపక్షం అభ్యర్థులకు పడే వోట్ల సంఖ్య విస్తారంగా పెరిగిపోయింది.

| లేబర్‌పార్టీ సాధించిన స్థానాలు | | | | | వోట్ల సంఖ్య | |
|---|---|---|---|---|---|---|
| 1922, | 1923, | 1924, | 1929, | 1931 | 1922, | 1923, |
| 142 | 191 | 151 | 288 | 52 | 4240000, | 4440000, |

| 1924, | 1929, | 1931, |
|---|---|---|
| 5490000, | 8385000, | 6650000 |

ఈ కాలంలో రెండుమారులు కార్మికపక్ష మంత్రిమండలులు ఏర్పడినా వాటికప్పుడు పార్లమెంట్‌లో అధిక సంఖ్యాబలం లేదు. మితవాద పక్షానికి మాత్రం మెజారిటీ ఏనాడూ లేక పోయింది లేదు.

ఈ విధంగా కార్మికపక్షం ఒకవైపు బలపడుతుండగా ఉదారపక్ష బలం క్రమంగా క్షీణించింది. ఈ పక్షంలో కొంత అతివాద ధోరణులుండేవారు విడిపోయి కార్మిక పక్షంలో

చేరినారు ; మితవాద తత్వమున్నవారూ కార్మికపక్షం తీవ్ర వాదాలను చూసి, 1917 లో రష్యాలో జరిగిన విప్లవంవంటి విప్లవం తమ దేశంలో వారెక్కడ తెచ్చి పెడతారో అని భయ పడేవారూ ఉదారపక్షాన్ని వదులుకొని మితవాదపక్షం (Conservative party) లో చేరి పోయినారు. లిబరల్ పార్టీలో నాయకత్వాన్ని గురించి స్పర్ధలు బయలుదేరినందువల్ల అది బలహీనమైంది. 1916 లో ఆస్క్విత్‌ను తోసివేసి లాయిడ్ జార్జ్ లిబరల్‌పక్ష నాయకత్వాన్ని చేజిక్కించుకొన్నందువల్ల ఆస్క్విత్ అనుయాయులు లాయిడ్ జార్జ్ మంత్రిమండలిలో చేర టానికి నిరాకరించినారు. ఈ పక్షంలోని విభేదాలు 1916 లో లాయిడ్ జార్జ్ సంకీర్ణ ప్రభుత్వ మేర్పాటుచేసిన నాటినుంచి 1928 వరకు సాగినాయి. ఆ సంవత్సరం రెండు వర్గాలు ఏకమై నందువల్ల కామన్స్‌లో 159 స్థానాలు లేబర్ పార్టీవారు సాధించుకొన్నారు కాని 1924 ఎన్నిక లోనే పెద్ద దెబ్బ తిన్నారు పార్లమెంట్‌లో 40 స్థానాలకంటె వారెక్కువ గెల్చుకోలేక పోయి నారు. ఎన్నికలో వారి పక్షం అభ్యర్థులకు వచ్చిన వోట్ల సంఖ్యకు, వారికి లభించిన స్థానాలకు సాపత్యమేమీ లేదు

పార్లమెంటరీ ఎన్నికలో ఒక పక్షానికి పడే వోట్ల సంఖ్యకు, అది సాధించే స్థానాల సంఖ్యకు సరిఅయిన నిష్పత్తి లేకపోవటం ఒక్క ఉదారపక్ష విషయంలోనే కాదు ఇతర బ్రిటిష్ రాజకీయ పక్షాలన్నింటి అనుభవంలో ఉండే వైపరీత్యమే అది దానికి కారణం పార్లమెంట్‌కు ప్రజా ప్రతినిధులను ఎన్నుకొనే విధానంలోనే ఉన్నది మొదట్లో పార్లమెంట్‌కు కౌంటీ (జిల్లా) కౌన్సిళ్ళు, పట్టణ కౌన్సిళ్ళు పారిష్ కౌన్సిళ్ళు తమ ప్రతినిధులను ఎన్నుకొనేవి. ఎన్నికయినవారు, ఎన్నుకొనే వారికి చిరపరిచితులు వారి మధ్య సన్నిహిత సంబంధా లుండేవి. అభ్యర్థుల గుణగణాలు ఎన్నికచేసే వారికి తెలియక పోవటం అనేది ఉండదు వర్తమాన కాలంలో ఈ స్థితి తారుమారై వోటర్‌లు భౌగోళిక నియోజక వర్గాలుగా (Territorial constituencies) విభజింపబడినారు. కామన్స్ సభ్యుల సంఖ్య 615 ఈ 615 మందిలో 577 మందిని ఏకసభ్య నియోజకవర్గాలు ఎన్నుకొంటాయి ఒక నియోజకవర్గం మాత్రం ముగ్గురు సభ్యులను ఎన్నుకొన్నా మిగిలిన సభ్యులను ద్విసభ్య నియోజకవర్గాలు ఎన్నుకొంటున్నాయి ఏకసభ్య నియోజకవర్గం నుంచి సభ్యత్వంకోసం పోటీ చేసేవారు ఇద్దరే అయితే పడిన వోట్లలో అధిక సంఖ్య లభించిన వ్యక్తే కామన్స్ సభ్యుడయ్యేది కాని సభ్య త్వానికి ప్రయత్నించేవారు ముగ్గురుకాని అంతకు మించికాని ఉన్నట్లయితే, నియోజకవర్గంలో పడిన మొత్తం వోట్లలో చాలా తక్కువ సంఖ్య వోట్లు తెచ్చుకొన్న వ్యక్తి కామన్స్ సభ్యత్వం పొందే అవకాశం చాలా హెచ్చు. ఈ అనర్థం ఏ విధంగా సాధ్యమవుతుందో తెలిపే ఉదాహర ణను జి. బి ఆడమ్స్ పేర్కొన్నారు. 1922 లో ఒక ఏకసభ్య నియోజకవర్గంలో వోట్ చేసినవారి మొత్తం సంఖ్య 28580 పోటీ చేసినవారు నల్గురూ నాల్గు రాజకీయ పక్షాలకు చెందినవారు. మితవాది, జాతీయ లిబరల్, లిబరల్, కార్మికపక్షాల అభ్యర్థులుగా నిల్చిన నల్గురిలో మొత్తం 28580 వోట్లలో 7666 వోట్లు మాత్రమే తెచ్చుకొన్న కన్సర్వేటివ్ అభ్యర్థి కామన్స్ సభ్యుడైనాడు, మిగిలిన ముగ్గురికి సమోదైన 20914 వోట్లు మురిగిపోయి నట్లే. ఇంతమంది అతనిని అభిమానించకపోయినా ఆ కన్సర్వేటివ్ పార్టీ అభ్యర్థి ఆ నియోజక వర్గంలో వోట్ చెలాయించని వారికి, చెలాయించిన 28580 మంది వోటర్లకు ప్రతినిధిగా ఈ ఎన్నిక విధానంలో భావిస్తున్నారు. ఈ విధంగా అనేక నియోజకవర్గాలలో ఎన్నికలు

జరిగినట్లయితే, మంత్రిమండలిని ఏర్పాటుచేసే మెజారిటీ పార్టీ బహుజనాభిప్రాయానికి నిజమైన ప్రతినిధి కాజాలదు. వారు నిర్వహించే ప్రభుత్వం ప్రజాప్రభుత్వం కాబోదు. ఈ వాదంలోని యథార్థ్యాన్ని ఆడమ్స్ 1922 ఎన్నిక ఫలితాలను కార్కాజంగా చూపి సాధించినాడు 1922 సంవత్సరం నుంచి జరిగిన ఎన్నికలు ఈ సత్యాన్ని మరింత స్థిరపరిచినాయి

| ఎన్నిక సంవత్సరము | రాజకీయపక్షం పేరు | దేశం మొత్తం మీద గెల్చిన వోట్ల శాతం | పార్లమెంట్ సభ్యత్వాల సంఖ్య నిష్పత్తి |
|---|---|---|---|
| 1922 | కన్సర్వేటివ్ పార్టీ | 38% | 344 ; 56% |
| 1922 | లేబర్ పార్టీ | | 142 ; 23% |
| 1922 | ఉదారపక్షం | | 58 ; 7 8% |
| 1923 | కన్సర్వేటివ్ | ఇంచుమించు 38% | 258 , 42% |
| 1924 | ,, | 47% | 412 , 67% |
| 1929 | కార్మిక పక్షం | | 289 , 75% కంటె ఎక్కువ |
| 1931 | కన్సర్వేటివ్ | 56% | 470 |
| 1931 | కార్మిక పక్షం | 30% | 9% కంటె తక్కువ |

ఈ విధంగా భౌగోళిక ఏకసభ్య నియోజకవర్గాలు తక్కువ మంది వోటర్ల ప్రతినిధులను గద్దె ఎక్కించి, ఎక్కువమంది వోటర్ల ప్రతినిధుల అభిప్రాయాలకు విరుద్ధంగా వారు చట్టాలు చేయటానికి, పరిపాలన సాగించటానికి వీలు కలిగిస్తున్నాయి ఏ విధంగా చూసినా ఆ విధమైన ప్రభుత్వం బాధ్యతాయుత ప్రభుత్వం కాజాలదు - ఆ రాజ్యం ప్రజా రాజ్యం కాదు. రాజకీయపక్షాలకు వాటి మెజారిటీకి తగిన నిష్పత్తిలో శాసనసభలో ప్రాతినిధ్య మున్నప్పుడే పౌరునికి పౌరునికిమధ్య సమానత్వం ఉండేది. సమానత్వం లేకుంటే స్వాతంత్ర్యం లేనట్లే. ప్రజారాజ్య విధానానికి పునాదులైన సమత్వ, స్వాతంత్ర్యాలు లేకున్నా దేశంలో న్యాయానికి చోటుండదు. ఈ కారణాన్నిబట్టి, ఇంగ్లండ్‌లో కొన్ని దశాబ్దాలుగా లోపభూయిష్టమైన ఈ ప్రాతినిధ్య విధానాన్ని సంస్కరించవలెననే చాలా విమర్శలు, సూచనలు వచ్చినాయి రాజకీయ పక్షాలలో ఒక్కొక్కటి సాధారణ ఎన్నికలో అది అన్ని నియోజకవర్గాలలోను నిలబెట్టిన అభ్యర్థులందరికీ లభించిన మొత్తం వోట్ల నిష్పత్తని తగినన్ని సభ్యత్వ స్థానాలు పార్లమెంట్‌లో ఉండి తీరవలెననేది వీటిలో ప్రధానమైన సూచన. ఈ విధానానికి పట్టీ ప్రాతినిధ్య (List system) విధానమని పేరు. ఈ సిద్ధాంతం మీదనే నడిచే మరొక విధానము బదలాయింపు చేయదగిన ఒకే వోటు ఉన్న దామాషా ప్రాతినిధ్య విధానం (Proportional representation with the single transferable vote) ఈ విధానం అవలంబించటానికి ద్విసభ్య, లేదా బహుసభ్య నియోజకవర్గాలు అనుకూలించినంతగా ఏకసభ్య నియోజకవర్గాలు అనుకూలించవు. ఈ విధానంలో ప్రతి ఒక వోటర్ ఎన్నికకు నిల్చే అభ్యర్థులలో తన ఇష్టం వచ్చినంత మందికి వారిని తాను అభిమానించే క్రమంలో, వారి పేర్ల ఎదురుగా 1, 2, 3, 4, 5 అని గుర్తించవచ్చు. పోటీ చేసేవారి సంఖ్యనుబట్టి దామాషా (కనీసం) వోట్లయిన రానివారిని పరిగణననుంచి తొలగించి, వారికి

వచ్చిన మొదటి వోట్లను వారి వోటింగ్ పత్రాలలో 2, 3, 4 అనే క్రమంలో గుర్తించనివారికి 1, 2, 3 వ స్థానంలోకి మారుస్తారు. ఈ పద్ధతిలో మొదటి వోట్ల లెక్కింపులో నాలుగో లేదా అయిదో స్థానం వచ్చిన వ్యక్తికి కూడా హెచ్చు సంఖ్యలో రెండో వోట్లుగా గుర్తించినవి మొదటి వోట్లుగా మారి ఎన్నికలో విజయం లభించటం కద్దు. ఈ విధంగా దామాషా ప్రాతినిధ్య విధానంలో వోటర్లు చూపే అభిమాన క్రమాన్నిబట్టి వారి అభిమానానికి విలువ కట్టినందువల్ల అభ్యర్థికి విశేష లాభం కలగటం, వోట్లలో ఒక్కటైనా వృథాకాక సత్ఫలితాలేర్పడుతున్నాయి ప్రతి రాజకీయపక్షం వోటర్లు దానిని ఆమోదించే నిష్పత్తిలో పార్లమెంట్లో ప్రాతినిధ్య పొందుతుంది. ఈ విధానంలో ఇంత గుణమున్నా ఈనాటికి బ్రిటిష్ రాజ్యం ఏకసభ్య నియోజకవర్గాలను త్యజించి, ఈ విధానాన్ని అవలంబించలేదు బ్రిటిష్ రాజ్యాంగాన్ని మాతృకగా గ్రహించిన భారత రాజ్యాంగం కూడా దీనిని అవలంబించింది కాదు.

మొదటి ప్రపంచ యుద్ధ మొకవైపు సాగుతున్నప్పుడే, సాంఘిక, ఆర్థిక, రాజ్యాంగ పునర్నిర్మాణ సమస్యలను గురించి యోచించి ప్రతిపాదనలు చేయటానికి ఒక ప్రత్యేక మంత్రిత్వశాఖను సృష్టించినారు. వీరు చేసిన సూచనలలో మంత్రుల సంఖ్య 10 లేదా 12 కు మించరాదనేది ఒకటి. కాని యుద్ధానంతరం కూడా సామాన్యంగా మంత్రుల సంఖ్య 20 కి తగ్గలేదు మంత్రులు నిర్వహించవలసిన కార్యభారం ఎంతో హెచ్చినందువల్ల మంత్రిమండలికి అనుబంధంగా ఒక శాశ్వత కార్యనిర్వాహకవర్గం ఏర్పడింది దీనిలో ఉద్యోగులసంఖ్య నూటికి మించటం సంభవించింది. కాబినెట్ మంత్రుల సమావేశాలు మాటిమాటికి జరుగుతున్నందువల్ల ఆ సమావేశాలలో మంత్రులు కానివారు, మంత్రిత్వశాఖోద్యోగులు కావటంవల్ల వీటిలో జరిగే చర్చలను లిఖితంచేసే ఆచార మొకటి ఏర్పడినందువల్ల మంత్రిమండలి సమావేశాల గోపనమనేది అసాధ్యమైంది. విక్టోరియా రాణి కాలంలో మంత్రిపదవిలో ఉన్న రాజకీయపక్షం సాధారణ ఎన్నికలో ఓడినప్పుడు, లేదా కామన్స్ సభ మంత్రిమండలిలో తమకు విశ్వాసంలేదని రుజువు చేసినప్పుడు (విశ్వాసరాహిత్య తీర్మానాన్ని ఆమోదించినప్పుడు) ఆ మంత్రిమండలి తొలగిపోవటం జరిగేది. కాని ఈ శతాబ్దంలో, ఈ రెండింటిలో ఏ ఒక్కటి సంభవించకపోయినా మంత్రిమండలికి తా మనుసరించే విధానాలు ప్రజ లామోదించటం లేదని నమ్మకం కలగగానే వారు తమ పదవులకు రాజీనామా చేయటం పరిపాటి అయింది. పత్రికా ముఖంగా వెలువడే ప్రజాభిప్రాయం తమకు ప్రతికూలమైనదని తోచినా, మధ్యంతర ఎన్నికలు కొన్నింటిలో తమ పార్టీ అభ్యర్థులు ఓడిపోవటం సంభవించినా వారు పదవీ త్యాగం చేస్తున్నారు. దీనికి కారణం పైన వివరించినట్లు పార్లమెంట్లో మెజారిటీ ఉండే రాజకీయ పక్షానికి దేశంలోని మొత్తం వోటర్లలో మెజారిటీ ఆమోద మొక్కప్పుడు లేకపోవటమే.

వీటన్నింటికంటె విచిత్రమైన పరిస్థితి 1931 లో సంభవించింది దేశంలో ఏర్పడిన తీవ్రమైన ఆర్థిక మాంద్యంవల్ల, ప్రధానమంత్రి (కార్మికపక్ష నాయకుడైన) మాక్డొనాల్డ్ విషమ సమస్య నెదుర్కోవలసి వచ్చింది. బడ్జెట్‌ను సరిపెట్టవలెనంటే, అతడు ఈ రెండింటిలో ఒకటి విధిగా చేయవలసిందే - 1. పన్నులను విపరీతంగా హెచ్చించనైనా హెచ్చించవలె. లేదా 2 ప్రభుత్వ వ్యయంలో పదికోట్ల పౌన్ల వరకు తగ్గించనైనా తగ్గించవలె. ఈ తగ్గింపు ప్రధానంగాని నిరుద్యోగుల ఇన్సూరెన్స్‌కు చెల్లించే పద్దులో చూపవలసి వచ్చింది. కార్మిక

పక్షంవారు ఈ రెండు ఉపాయాలను తీవ్రంగా ప్రతిఘటించినారు మితవాదపక్ష నాయకుడు బాల్డ్విన్, ఉదారపక్ష నాయకుడు సర్ హెర్బర్ట్ శామ్యూయల్ మాక్ డొనాల్డ్‌ను తాము సమర్థిస్తామన్నారు పర్యవసానం 1931-35 వరకు పాలించిన జాతీయ, సంకీర్ణ మంత్రి మండలిలో నల్గురు కార్మికులు, నల్గురు మితవాదులు, ఇద్దరు ఉదారవాదులు సభ్యులైనారు. ఈ జాతీయ ప్రభుత్వం మాక్ డొనాల్డ్ ప్రధానిగా దేశాన్ని ఎదుర్కొన్న ఆర్థిక సంక్షోభం తొలగినంతవరకు కలిసి పనిచేసింది ఈ విధంగా కార్మికపక్షం మద్దతులేకున్నా, కార్మికపక్ష నాయకుడుగా మాక్ డొనాల్డ్ ప్రతిపక్షాల తోడ్పాటుతో ప్రధాన మంత్రిత్వాన్ని సాగించినాడు. ఈ స్థితి అతనికి కొత్త ఏమీకాదు 1924 లోను, 1929-31 లోను మంత్రిత్వాన్ని చేపట్టిన కార్మిక పక్షానికి పార్లమెంట్‌లో సొంత బలగమేమీ లేదు. చోద్యమైన ఈ పరిస్థితిని గురించి మాక్ డొనాల్డ్ ఈ విధంగా చమత్కరించినాడు: "అధిక జనాభిప్రాయానికి అనుకూలంగా పరిపాలన జరగవలెనంటే పార్లమెంట్‌లోని (మూడు రాజకీయ పక్షాలలో) మైనారిటీ పక్షం నుంచి మంత్రివర్గాన్ని ఏర్పాటు చేయటంకంటె మేలైన ఉపాయం లేదు అటువంటివర్గం దేశ ప్రజలు మెజారిటీ విరోధించే శాసనాలను పార్లమెంట్‌లో నెగ్గించలేదు." 1931-35 సంకీర్ణ ప్రభుత్వంలో మాక్ డొనాల్డ్ మాటకు 1933 నుంచే విలువ లేకపోయింది.

1935 లో అతడు రాజీనామా చేయగానే సాధారణ ఎన్నిక జరిగింది అధిక స్థానాలు మితవాద పక్షానికి లభించినా, మాక్ డొనాల్డ్‌కు ప్రివీ కౌన్సిల్ అధ్యక్ష పదవినిచ్చి, బాల్డ్విన్ ప్రధానమంత్రికా 1937 వరకు జాతీయ సంకీర్ణ మంత్రిమండలి అనే నటన సాగించింది. అనారోగ్యం కారణంగా బాల్డ్విన్ రాజీనామా చేసినందువల్ల 1935 నుంచి ఉపప్రధాన మంత్రిగా ఉన్న ఛేంబర్ లేన్ ప్రధానమంత్రి అయినాడు. 1937 నుంచి 1939 వరకు ఈ సంకీర్ణ జాతీయ ప్రభుత్వం దేశాన్ని పాలించింది. 1939 లో రెండో ప్రపంచ యుద్ధమారంభం కాగానే మంత్రిమండలిని పునర్నిర్మించి విన్‌స్టన్ చర్చిల్‌ను యుద్ధ మంత్రిమండలి సభ్యుని చేసి అతనిని ఆంథోనీ ఈడన్‌ను తన కాబినెట్‌లోకి ఛేంబర్ లేన్ చేర్చుకొన్నాడు. ఉదార, కార్మిక పక్షాలీ మంత్రిమండలిలో చేరలేదు.

1940 లో జర్మనీ విజృంభణకు తాళలేక నార్వేనుంచి ఇంగ్లండ్ తన సేనలను ఉప సంహరించవలసి వచ్చింది. వెంటనే కార్మిక పక్షం మంత్రిమండలి పట్ల విశ్వాస రాహిత్య తీర్మానం ప్రవేశపెట్టింది. అది నెగ్గలేదు కాని ప్రభుత్వానికి తగినన్ని హెచ్చు వోట్లు రాలేదు. సంకీర్ణ ప్రభుత్వ మేర్పాటుచేయటానికి ఛేంబర్ లేన్ సిద్ధపడినా ఆ ప్రభుత్వానికి చర్చిల్ నాయకుడైతే తప్ప; దానిలో కార్మిక పక్షంవారు చేరమని అన్నందువల్ల, ఛేంబర్ లేన్ రాజీ నామా చేయవలసి వచ్చింది. 1940 నుంచి 1945 వరకు చర్చిల్ ప్రధాన మంత్రిగా యుద్ధం సాగించగా జర్మన్ సేనలు మే నెల ఆరంభంలో లొంగిపోయినాయి. ఆ తరవాత సంకీర్ణ ప్రభుత్వంలో ఉండమని సాధారణ ఎన్నిక జరిపించవలెనని కార్మిక పక్షంవారు పట్టు పట్టి నారు. తాత్కాలిక ప్రభుత్వానికి అధిపతిగా చర్చిల్ ఎన్నిక జరిపించినాడు. మితవాదులు చిత్తుగా ఓడిపోవటంవల్ల కార్మికపక్ష ప్రభుత్వం 1945 లో అధికారానికి వచ్చింది. అట్లాంటి దానిలో ప్రధానమంత్రి ఈ మంత్రిమండలి యుద్ధంవల్ల ఏర్పడిన ప్రత్యేక సమస్యలను పరిష్కరించటానికి కృషి చేసింది. 1951 లో జరిగిన సాధారణ ఎన్నికలో మితవాదులు కామన్స్‌లో హెచ్చు స్థానాలు గెల్చుకొన్నందువల్ల, అట్లీ ప్రభుత్వం పడిపోయి, దాని స్థానంలో 1951

సెప్టెంబర్‌లో చర్చిల్ తన మంత్రిమండలిని ఏర్పాటు చేసినాడు. ఇది 1955 వరకు అధికారంలో ఉంది వయోభారంవల్ల చర్చిల్ రాజీనామా చేయగా 1955 సాధారణ ఎన్నిక జరిగింది. అన్‌థోనీ ఈడెన్ మితవాద ప్రభుత్వం నిర్మించినాడు. 1957 ఆరంభంలో అనారోగ్యంవల్ల ఆయన విరమించగా, బ్రిటిష్ రాణి రెండో ఎలిజబెత్ చర్చిల్‌ను సంప్రతించి మాక్మిలన్‌ను ప్రధానమంత్రిగా చేసింది.

1919-1957 మధ్యకాలంలోని మంత్రిమండలుల, రాజకీయ పక్షాల చరిత్రను పరిశీలించే వారికి బ్రిటిష్ రాజకీయ జీవితాన్ని గురించి కింది విషయాలు విదితమైతాయి ప్రజాబాహుళ్యం ఆమోదించే విధానాలు, ప్రజాభిప్రాయమూ ఏ సమయంలోగాని ఆనాటి మంత్రిమండలికి శిరోధార్యాలు. పార్లమెంట్‌లోని రాజకీయ పక్షాలు వాటి నాయక కూటమి ఆదేశాలను అనుసరించి మంత్రిమండలి ప్రతిపాదించే చట్టాలకు అనుకూలంగాగాని ప్రతికూలంగాగాని వోట్ చేయవలసి ఉంటుంది. ఈ నాయకులు వార్తా పత్రికలలో ప్రచురించే అభిప్రాయాలను బట్టి తమ విధానాలను దిద్దుకొంటూ ఉంటారు ప్రతి రాజకీయ పక్షానికి నియోజకవర్గాలలో ఆ పక్షానికి చెందిన సభ్యుల సంఘాలుంటాయి. ఇవి కాక మండల, జాతీయ సంఘాలు తమ పార్టీ సాంఘిక, ఆర్థిక, రాజకీయ విధానాలను తీర్చటంలో తమ పార్లమెంటరీ పార్టీతో సహకరిస్తూ ఉంటాయి. కాని దేశ రాజకీయ జీవితంలో ఆనాటి కానాటికి పుట్టుకొనివచ్చే సమస్యల విషయంలో ప్రధానంగా నిర్ణయం తీసుకొనేది పార్లమెంట్‌లోని అధికార రాజకీయ పక్షమే ఈ నిర్ణయాలు చేయటంలో ఆ పార్టీ నాయకులు ఒక్కొక్క విషయంలో సామర్థ్యమూ, అనుభవమూ ఉన్న తమ పక్షంలోని ప్రముఖులతో సంప్రతిస్తూ ఉంటారు ఆ నిర్ణయాలను వివరించి సమర్థించే బాధ్యత ఆ పక్షం సభ్యులు వహించవలసి ఉంటుంది ఒక్కొక్కప్పుడు కొన్ని నిర్ణయాల విషయంలో ఆ పార్టీ నాయకులు కొంత రహస్య గోపనం చేయటం కద్దు. తమ పార్టీ ఆశయాలనుగురించి, ప్రణాళికలనుగురించి ప్రకటనలు చేయటంలో మితవాద పక్ష నాయకునికి ఉన్నదే స్వేచ్ఛ, కార్మికపక్ష నాయకునికి మాత్రం ఇంగ్లండ్‌లో కార్మిక సంఘాలు (Trade unions), సామాజిక వాద సంఘాలు (Social societies) కార్మిక పక్షాన్ని స్థాపించినాయి. 1918 లోనే స్థానిక కార్మిక పక్షాలు మొదటిసారిగా నెలకొన్నాయి. కార్మిక పక్షం వారి జాతీయ కార్యనిర్వాహక సమితిలో ఈ నాటికీ స్థానిక కార్మికపక్షాల కంటె వివిధ కార్మిక సంఘాలకే ఎక్కువ ప్రాతినిధ్యముంది. ఏటా ఈ సమితి అధ్యక్షుని ఎన్నుకొంటారు. పార్లమెంట్‌లోని కార్మికపక్ష నాయకునికి కూడా ఆ విధంగా ఏటా ఎన్నుకొన్నా, సామాన్యంగా పోయిన సంవత్సరం నాయకునే ఈ సంవత్సరం కూడా ఎన్నుకోవటం కద్దు కార్మిక పక్ష ఆశయాలు, కొత్త సంవత్సరంలో అది అనుసరించదలచిన కార్యక్రమం ఆ పక్షం వారి సాంవత్సరిక సమావేశంలో చర్చించి నిశ్చయించవలసిందేగాని, స్వతంత్రించి తనకై తాను ప్రకటనలు చేసే అధికారం పార్లమెంటరీ కార్మికపక్ష నాయకునికి ఎంతమాత్రం లేదు వివిధ బ్రిటిష్ రాజకీయ పక్షాల జీవితంలోను, అంగ నిర్మాణంలోను ప్రముఖ పాత్ర వహించే ఇతర సంఘాలను కొన్నింటిని ఈ సందర్భంలో ప్రస్తావించవలసి ఉంది. ప్రతిపక్షంలోను స్త్రీల విభాగము, యువక సంఘాలు ఉన్నాయి. పార్టీ ఆశయాలను ప్రజలలో ప్రచారం చేయటానికి స్విన్‌టన్ కన్సర్వేటివ్ కాలేజీ, ఉదారపక్షం వారు నిర్వహించే వేసవి పాఠశాల, కార్మిక కళాశాలల జాతీయ కౌన్సిల్ వంటి విద్యా సంస్థలూ ఉన్నాయి. ఇవికాక ఫేబియన్

సొసైటీ, ప్రిమ్‌రోజ్ లీగ్, రాజకీయ పక్షాల ఏజెంట్ల సంఘాలు మొదలైనవి తమ తమ పార్టీల ఆశయాలనుగురించి నిరంతరం ప్రచారం చేయటంతో అధిక పార్టీలో క్రొత్త సభ్యులను చేరుస్తూ ఉంటాయి. ఎన్నికలలో పార్టీ అభ్యర్థులను గెలిపించే బాధ్యత కూడా ఆ సంఘాలదే. విశేష ద్రవ్యవసతి లేనిది ఇంత బృహత్ కార్యక్రమం సాధ్యం కాదుకదా! ఒక్కొక్క-రాజకీయ పక్షపు కేంద్ర సంఘ వ్యయం ఏటా లక్ష పౌన్లు; సాధారణ ఎన్నికల వ్యయం పది లక్షల పౌన్లకు తగ్గదు ప్రతిపక్షమూ ప్రచారానికే కాక బీద అభ్యర్థుల ఎన్నిక వ్యయాన్ని భరించవలసి ఉంది ప్రతి స్థానిక పక్షమూ, సంఘమూ తన కవసరమయ్యే నిధులను తానే సమకూర్చుకోవలసి ఉంది పార్టీ జాతీయ సంఘానికి స్థానిక సంఘాలు, పార్టీలు విరాళాలు ఏటా చెల్లించవలసి ఉంది 1945కు పూర్వం మితవాద పక్షం పార్టీ నిధులకై తన ధనిక సభ్యుల భూరి విరాళాలపై ఆధారపడేది. కాని ఇటీవల తన స్థానిక సంఘాలిచ్చే సాంవత్సరిక విరాళాలు కొద్దివైనా అవే ఎక్కువ లాభదాయకమని తెలుసుకొంది.

మితవాద పక్షపు కేంద్ర సంస్థను తన (పార్టీ నాయకునికి) పరిశీలన కింద ఉంచుకోవటం అవసరమని డిస్‌రేలి గుర్తించి ఆ విధంగాచేసి, కార్యనిర్వహణకొక పార్టీ మేనేజర్‌ను నియమించినాడు. ఈ కేంద్ర సంస్థ, జాతీయ మితవాద సంఘం విడివిడిగా పనిచేసినా, రెండింటి మధ్య కావలసినంత సహకారముంది ఇదే విధంగా, ఉదారపక్షంలో కూడా స్థానిక నియోజకవర్గాల నాధారంచేసుకొని నిర్మించిన జాతీయ ఉదారపక్ష సంస్థ ఉదారపక్ష కేంద్ర సంస్థ ఉన్నాయి. కాని ఈ పార్టీకి నిధులను వసూలు చేసేది ఉదారపక్ష జాతీయపక్ష సంస్థ గాని కేంద్ర సంస్థ కాదు. ఈ పార్టీ నిధులు కేంద్ర సంస్థ అధీనంలో ఉండక స్థానిక (నియోజక వర్గాలలోని) సంస్థల యాజమాన్యంలో ఉంటాయి.

ఈనాడు బ్రిటిష్ రాజకీయాలలో రెండు ప్రధాన లక్షణాలు కనపడుతున్నాయి. 1. ఏ రాజకీయ పక్షంలోను చేరక, స్వతంత్రంగా సాధారణ ఎన్నికలలో పోటీచేసే వారికి పార్లమెంట్‌కు ఎన్నికయ్యే అవకాశం లేదనే చెప్పవలసి ఉన్నది. 2. 20వ శతాబ్ది ప్రథమార్థంలో ఉండినట్లు ప్రధాన రాజకీయపక్షాలు మూడుగాక రెండైనాయి. వాటిలో ఒకటి మితవాద పక్షము. రెండోది కార్మికపక్షము మొదటి ప్రపంచ యుద్ధకాలంలో మితవాద, ఉదార, కార్మిక పక్షాలకు తోడు స్వతంత్ర ఐర్‌పక్షం చేరి, కొన్నాళ్ళు బ్రిటిష్ రాజకీయాలలో నాల్గు పార్టీలేర్పడతాయా అనే సంశయాన్ని కలగజేసింది. ఐర్ స్వాతంత్ర్యం పొంది వైదొలగటంతో, మూడు పార్టీలు యథా పూర్వంగా ప్రత్యక్షమైనాయి కాని కొంతకాలం లేబర్‌పార్టీలో చీలికలు ఎట్లా ఏర్పడినాయో చదివినారు. కాని క్రమంగా కార్మికపక్షం నిలదొక్కుకొన్నది గాని ఉదార పక్షానికే దుర్గతి పట్టింది. ఉదారపక్షంలోని అతివాదులు కార్మికపక్షంలో చేరటంవల్ల, ఆ పక్షంలోని మితవాద ధోరణులున్నవారు మితవాద పక్షంలో చేరటంవల్ల, ఆ పక్షానికి బ్రిటన్‌లో నిలవ నీడ లేకుండా పోయింది. బ్రిటిష్ వోటర్ సామాన్యంగా తా నభిమానించే పార్టీని ఒక పట్టాన విడిచిపెట్టడు. ఆ పార్టీ విధానంలో తనను ఎంతో ఆందోళన పరిచేటంత తీవ్రమైన మార్పులు వచ్చి పడితేగాని ఆ పార్టీని అతడు వదలడు. లక్ష్యాలలోను విధానాలలోను ముఖ్యమైన విభేదాలుండే రెండు రాజకీయపక్షాలకు చెందకుండా మధ్యే మార్గాన్ని అభిమానించే జనులు ఏనాడైనా దేశంలో ఉంటారు. ఈ తరగతికి చెందినవారికి తమకు నచ్చిన లక్ష్యాలను సాధించటానికి కావలసినంత పట్టుదలకాని, త్యాగశక్తికాని ఉండవు. వారిలో తీవ్ర సంచలనం

కల్గించే పరిస్థితులు సంభవించినప్పుడు వారిలో కొందరు రెండు పక్షాలలో ఏదో ఒక దానిలో చేరి రాజకీయపక్షాల అభ్యున్నతికి, లేదా పతనానికి కారకులవుతూ ఉంటారు. సామాన్య పరిస్థితులలో వారిలో అనేకులు వోటింగ్ జరిగే చోటికి పోవటానికి అశ్రద్ధ చేస్తారు. రెండు రాజకీయ పక్షాలమధ్య వివాదాలు శ్రుతి మించుతాయనే భయం ఉన్నప్పుడు ఆ రెండు పక్షాలలో ఒకదానిలోని మితవాదులు రెండో పక్షంలోని అతివాదులతో కలిసి మూడో పక్షంగా ఏర్పడి రాజ్యాధికారం చేపట్టటం బ్రిటిష్ రాజ్యాంగ చరిత్రలో గమనించవచ్చు. కాని సామాన్యంగా 17 వ శతాబ్దం నుంచి ఈనాటివరకు బ్రిటిష్ రాజ్యాంగ చరిత్ర ప్రధానంగా రెండు రాజకీయ పక్షాలమధ్య ఆ యా కాలాలలో రేగిన స్పర్ధల, వివాదాల, పోరాటాల, వాటి ఫలితాల చరిత్ర అని ఘంటాపథంగా చెప్పవచ్చు. మొదటి రాజపక్షానికి ప్యూరిటన్‌లకూ, తరవాత టోరీలకూ విగ్ పార్టీకి, ఆ తరవాత కన్సర్వేటివ్, లిబరల్ పక్షాలమధ్య, చివరకు కార్మిక కన్సర్వేటివ్‌ల మధ్య ఈ సంఘర్షణ జరిగింది. ఇది అవిచ్ఛిన్నంగా జరగలేదు. దీనికి కారణాలు కాలానుగుణంగా మారుతూ వచ్చినాయి. 19 వ శతాబ్దికి కాని ద్విపక్ష ప్రభుత్వ విధానం రూపు దిద్దుకోలేదు.

i. 1841 సాధారణ ఎన్నికలో మితవాదపక్షం విజయం సాధించినప్పుడు ఆ పార్టీ నాయకుని ఆ కారణంవల్ల మంత్రివర్గ మేర్పాటు చేయటానికి ఆహ్వానించక తీరదనే సత్యం మొదటిసారిగా గుర్తించటమయింది. తరవాత తక్కువ సంఖ్య స్థానాలు గెల్చుకొన్న పార్టీ పార్లమెంట్ ప్రతిపక్షంగా నిలిచి, ప్రభుత్వ చర్యలను నిరంతరం విమర్శిస్తూ సంతత ప్రచారం వల్ల వోటర్‌లలో తగినంత మందిని తమవైపు తిప్పుకొని ఈసారి సాధారణ ఎన్నికలో మెజారిటీ స్థానాలను గెల్చి మంత్రిమండలిని చేజిక్కించుకోవలసి ఉంటుందని స్పష్టపడింది 1841 కి దరిమిలా 150 ఏళ్ళలోనే.

ii. ఈ 150 ఏళ్లలో ఇంకో సిద్ధాంతం స్థిరపడింది మంత్రిమండలిలో ఏ మంత్రివల్ల ప్రజాభీష్ట వ్యతిరేకచర్య జరిగినా దానికి మంత్రిమండలి అంతా బాధ్యత వహించవలసి ఉంటుందనే ఆ సిద్ధాంతము అందువల్ల ఏ రాజకీయ పక్షంగాని తన సభ్యుల మధ్య ఉండే ఐకమత్యానికి భంగం కలిగించే విధానం అవలంబించరాదనేది క్రమంగా దృఢపడింది. కేథలిక్‌లకు మత స్వాతంత్ర్యమిచ్చే చట్టం (Catholic Relief Act) చేసి, పీల్, వెల్లింగ్‌టన్‌లు తమ పార్టీ పతనానికి, విగ్‌లు అధికారంలోకి వచ్చి 1832 సంస్కరణ శాసనం చేయటానికి తోడ్పడినారు. 1846 సంవత్సరంలో ధాన్య శాసనాలు రద్దు (Repeal of the Corn-laws) చేసి పీల్ మితవాద పక్షంలోని భూస్వాములు పార్టీని విడిచిపోయేటట్లు చేసినాడు. తత్ఫలితంగా ఉదారపక్షం చేతులలోకి మంత్రిపదవులు మారినాయి. ఆ పార్టీ 28 ఏళ్ళపాటు అధికారంలో ఉంది గ్లాడ్‌స్టన్ నాయకత్వంలో ఉదారపక్షం 1886 లో ఐర్ స్వపరిపాలనను ఆమోదించినందువల్ల మితవాదపక్షం అధికారంలోకి వచ్చింది. ఈ పక్షము 20 ఏళ్ళపాటు పరిపాలన సాగించింది. మొదటి ప్రపంచ యుద్ధకాలంలో ఆస్క్విత్ నాయకత్వానికి ఎదురు తిరిగి లాయిడ్ జార్జ్ లిబరల్ పార్టీని రెండుగా చీల్చి, తత్ఫలితంగా కార్మికపక్ష ప్రభుత్వాన్ని తెచ్చిపెట్టినాడు పై దృష్టాంతాలవల్ల తేలిన మొదటి సూత్రం పార్టీ ఐక్యానికి కొన్ని సిద్ధాంతాలకు కట్టుబడి ఉండటం అవసరమనేది. రెండోది పార్టీ సభ్యులు కట్టుబడి ఉండవలెననేది. చిన్న చిన్న విషయాలను లేనిపోని ప్రాముఖ్య మిచ్చి పార్టీలో కలతలు రేపే సభ్యులను ఏ

పార్టీ సహించదు తీవ్ర పరిస్థితులలో తప్ప నాయకులపై ఎదురు తిరగరాదని, అట్లా ఎదురు తిరగటంవల్ల స్వపక్ష వినాశనం జరిగి, ప్రతిపక్ష నాయకత్వానికి దారి తీస్తాయి అని ఈనాడు తెలియనివారే లేరు

iii. వోటర్‌లు సామాన్యంగా పార్టీ అభ్యర్థికి వోటిస్తున్నారంటే ఆ పార్టీ ప్రణాళికలపై మోజువల్లకాదు, నాయకులపట్ల వా రేర్పరుచుకొన్న అభిమానాన్ని బట్టి వోట్ చేయటానికి వారు అలవాటు పడి ఉంటారు తమకు తమ పార్టీ నిల్పిన అభ్యర్థిగాని, వారి నూతన ప్రణాళికగాని నచ్చకపోతే, వారొకవేళ వోట్ చేయటానికి మానతారేమోగాని ఇతర పక్షపు అభ్యర్థికి సామాన్యంగా తమ వోట్లు ఇవ్వరు iv. ఈ కారణంవల్ల రాజకీయ పక్షాలు ముఖ్యంగా ఏ పార్టీకి చెందని పౌరుల వోట్లను సంపాదించవలెనని తమ శక్తి యుక్తులను వినియోగిస్తూ ఉండటం చూస్తున్నాము. రాజకీయపక్షాల గతులను అప్పుడప్పుడు తలక్రిందులు చేసేది ఈ తరగతి వోటర్‌లే v. నూటికి 80 మంది వోటర్‌లు వర్గాభిమానాన్ని బట్టి వోట్‌చేసే వారే గాని పార్టీ సిద్ధాంతాలమీద, ప్రణాళికలమీద విశ్వాసం ఉండటంవల్ల కాదు అనేది మరొక సిద్ధాంతము. vi. రాజకీయ పరిజ్ఞానమూ, పరిశీలనా వివేచనలూగల వోటర్‌లు అధిక సంఖ్యలో ఉండే నియోజకవర్గాలలో ఎన్నిక ఫలితాలను గురించి ముందుగా అంచనా వేయలేము. వోటర్‌ల పార్టీ అభిమానాలు ఏ విధంగా ఎన్నికనుంచి ఎన్నికకు తారుమారవుతూండేది పక్క పేజీలోనిది పట్టికవల్ల తెలుసుకోవచ్చు.

ఒక నియోజకవర్గంలో 1955 వోట్ల సంఖ్య — 1959 వోట్ల వివరాలు

| 1955 | | 1959 | | |
|---|---|---|---|---|
| కన్సర్వేటివ్ పార్టీ 25000 | ,, | 17500 | కన్సర్వేటివ్‌ల | నుంచి |
| | | 000 | కార్మికుల | ,, |
| | | 500 | ఉదారవాదుల | ,, |
| | | 500 | సామాన్యంగా వోట్ చేయని వారి | ,, |
| | | 2500 | కొత్త వోటర్‌ల | ,, |
| | మొత్తం | 22000 | | |
| లేబర్ పార్టీ 18000 | | 2000 | కన్సర్వేటివ్‌ల | ,, |
| | | 15000 | కార్మికుల | ,, |
| | | 500 | ఉదారవాదులు | ,, |
| | | 2000 | కొత్త వోటర్‌ల | ,, |
| | | 500 | సామాన్యంగా వోట్ చేయని వారి | ,, |
| | మొత్తం | 20000 | | |




బ్రిటిష్ సామ్రాజ్యము.

| | | | |
|---|---|---|---|
| లిబరల్ పార్టీ 7000 | 750 | కన్సర్వేటివ్‌ల | ,, |
| | 500 | కార్మికుల | ,, |
| | 5500 | ఉదారవాదుల | ,, |
| | 1000 | కొత్త వోటర్‌ల | ,, |
| | 250 | సామాన్యంగా వోట్ చేయని వారి | ,, |
| మొత్తం | 8000 | | |

| | | | |
|---|---|---|---|
| సామాన్యంగా వోట్ చేయనివారు 8000 | 1500 | కన్సర్వేటివ్‌ల | ,, |
| | 500 | కార్మికుల | ,, |
| | 500 | ఉదారవాదుల | ,, |
| | 1000 | కొత్త వోటర్లు | ,, |
| | 1500 | సామాన్యంగా వోట్ చేయని వారు | ,, |
| మొత్తం | 5000 | | |

| | | | |
|---|---|---|---|
| చనిపోయినవారు లేదా నియోజక వర్గాల నుంచి విడిపోయిన వారు | 2000 | కన్సర్వేటివ్‌ల | ,, |
| | 1500 | కార్మిక | ,, |
| | 500 | ఉదారవాదుల | ,, |
| | 500 | సామాన్యంగా వోట్ చేయని వారు | ,, |
| మొత్తం | 4500 | | |

సారాంశము, రాజకీయ పక్షాభిమానము వోటర్‌లలో చాలాకాలం ఒకే విధంగా నిల్చి ఉంటుంది. కొందరిలో ఈ అభిమానము వంశానుక్రమంగా సంక్రమించినా, కొందరిలో ఆ పక్ష నాయకులమీద వారికి ఉండే గారవభావాన్ని బట్టి, ఆ పార్టీ సాంఘిక, ఆర్థిక రాజకీయ సిద్ధాంతాల మీద వారికున్న విశ్వాసాన్నిబట్టి ఆ అభిమానం ఏర్పడటం కద్దు. ఆ పార్టీ సిద్ధాంతాలలో, విధానాలలో తీవ్రమైన మార్పులు కలిగినా, అసమర్థులైన నాయకులు సంభవించినా వోటర్‌లు కొందరు దానిని విసర్జించి వేరు పక్షంలో చేరుతుంటారు. అసంతృప్తి చెందిన అటువంటి వోటర్‌లు నూతన రాజకీయ పక్షాలు స్థాపించవచ్చుగాని, అటువంటి పర్యవసానం బ్రిటిష్ రాజకీయాలలో మనము సామాన్యంగా చూడము. అమెరికన్ ఎన్నికలలో అయినంత గాకున్నా, బ్రిటన్‌లో కూడా ఎన్నికలకు ఎంతో ధనవ్యయ మవుతుంది 300 సభ్యులను గెల్పించదలచుకొన్న పార్టీ 450 కు మించి తన అభ్యర్థులను పోటీకి నిలబెట్టవలసి వస్తున్నది. ఎన్నికకు ఎన్నికకు మధ్య, నియోజకవర్గంలోని పార్టీ కమిటీ, జాతీయపార్టీ సంస్థ పార్లమెంటరీ పార్టీ – ఈ మూడింటి మీద కావలసినంత ధనం వెచ్చించవలసి వస్తుంది. కార్మిక పక్షానికి 40 ఏళ్ల నంతత ప్రచారము, పార్టీ నిధుల సేకరణ పార్టీ సంస్థల నిర్మాణమూ జరిగినగాని పార్లమెంట్‌లో ప్రవేశం సాధ్యం కాలేదు.

# 17

# బ్రిటిష్ రాజ్యాంగము : ప్రధాన లక్షణాలు

పీఠిక : బ్రిటన్ ఏకరాజ్యము (Unitary State). దానిలో శాసనాధికారము సర్వస్వము ఒక్క బ్రిటిష్ పార్లమెంట్‌లో నిక్షిప్తమై ఉంది. సంయుక్త రాజ్యమైన ఉత్తర అమెరికా (The United States of America) లో ఉన్నట్లు శాసనాధికారాన్ని కేంద్ర శాసన సభతో పంచుకొనే రాష్ట్రీయ శాసనసభ లా దేశంలో లేవు. కేంద్ర ప్రభుత్వంతో పరిపాలనాధికారాన్ని పంచుకొన్న రాష్ట్రీయ శాసనసభలు కూడా లేవు. రష్యావంటి సంపూర్ణాధికారం (Totalitarian) ఉన్న రాజ్యాలలో ఉన్నట్లు బ్రిటన్‌లో రాజ్యానికి, సంఘానికి అవినాభావ సంబంధము సమాన వ్యాప్తి లేదు. నూతన భారత రాజ్యాంగంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాధికారాలను, ప్రజల స్వాతంత్ర్యాలను, వేరు వేరు ప్రభుత్వశాఖ బాధ్యతలను, అధికారాలను నిర్వచించే నూతన భారత రాజ్యాంగ శాసనముంది. ఆ విధమైన రాజ్యాంగ శాసనం బ్రిటన్‌లో లేదు. బ్రిటిష్ రాజ్యాంగానికి కొంతవరకు రూపుదిద్దిన శాసనాలు లేకపోలేదు. కాని ఆ రాజ్యాంగాన్ని నిర్ణయిస్తున్నవి ఒక్క కాలం నాటివి కావు. ఆ రాజ్యాంగ విభాగాలను, వాటి పరస్పర సంబంధాలను, విధులను, హక్కులను రాజ్యాంగ శాసనాలతోపాటు ప్రముఖంగా నిర్ణయించే సాంఘిక, రాజకీయ సంప్రదాయాలు (Usages) వేరు వేరు కాలాలలో చేసిన న్యాయస్థానాల తీర్పులు, రాజ శాసనాలు (Charters), నియత శాసనాలు (Statutes) పార్లమెంటరీ శాసనాలు చాలా ఉన్నాయి. సారాంశము, బ్రిటిష్ రాజ్యాంగం సంపూర్ణంగా లిఖితమూ (Written) కాదు, అలిఖితమూ కాదు (unwritten). బ్రిటిష్, ఆంగ్లోశాగ్జన్, నార్మన్, ఫ్రెంచ్, రోమన్ జాతుల సాంఘికాచారాలనుంచి, రాజ్యాంగ శాసనాలనుంచి సంప్రదాయాలనుంచి ప్రాణం పోసుకొన్న పంచకూళ్ల కషాయమది. జాతీయనాయకులు, స్వాతంత్ర్య సమరవీరులు, అనుభవపరులు, విజ్ఞానధనులు తీరికగా, నెలలు, ఏళ్ళు కూర్చుండి రూపు దిద్దిన భారత రాజ్యాంగ శాసనము (1947-1949), అమెరికన్ సంయుక్త రాష్ట్రాల (1776-1781) రాజ్యాంగ శాసనము వంటి శాసనాల ఫలితం కాదీ బ్రిటిష్ రాజ్యాంగము (British Constitution). ఈ రాజ్యాంగ విషయంలో పేర్కొదగిన మరో ప్రత్యేక లక్షణము ఉంది. దానిని మార్చటానికి క్రమ తీసుకోవలసిన ప్రత్యేక శాసన విధానమేదీ నిర్ణీతమైంది లేదు. పరిపాలనలో అతి సామాన్యమైన సవరణలు చేయటానికనుసరించే విధానమే చాలు, రాజ్యాంగంలో విప్లవకరమైన మార్పులు చేయటానికి పార్లమెంట్ విభాగమైన ప్రభు సభగాని, స్వతంత్ర పరిపాలనాధికారం రవంతైనా లేని రాజరికాన్నిగాని రద్దు చేయటానికి పార్లమెంట్ సమావేశంలో ఉన్న సభ్యులు ఒక్క వోట్ ఆధిక్యంతో ఆ విధంగా శాసనం చేస్తే చాలు. రాజ్యాంగంలో మార్పులు తేవలెనంటే అనుసరించవలసిన కష్ట సాధ్యమైన విధానం ఆ యా రాజ్యాంగ శాసనంలోనే పొందుపరచిన అమెరికన్ (U. S. A.) రాజ్యాంగాలవంటి రాజ్యాలు ఉన్నాయి. ఇటువంటి రాజ్యాంగాలను పరుష (Rigid) రాజ్యాంగా లంటాము. రాజ్యాంగా

లన్నింటిలో అత్యంత పరుషమైన (most rigid) రాజ్యాంగం అమెరికాదయితే, అత్యంత సరళమైన రాజ్యాంగము (most flexible) బ్రిటిష్ రాజ్యాంగము. ఇది ఇట్లైనా, బ్రిటిష్ రాజ్యాంగంలో తీవ్రమైన మార్పులు తేవలెననే ప్రయత్నం బ్రిటిష్ జాతి చరిత్రలో సామాన్యంగా కానరాదు. ఏనాటి కానాడు జాతి జీవితంలో పుట్టుకొని వచ్చే ఇబ్బందులు తొలగించుకోవటంతో తృప్తిపడేవారేగాని, అవసరమున్నా లేకున్నా, సిద్ధాంతరీత్యా లేనిపోని ఆవేశాలు పెంచుకొని పైసా లాభానికి రూపాయ వ్యయంచేసే ప్రవృత్తలేని వారు బ్రిటిష్ జాతివారు ఇంకొక ముఖ్య లక్షణము వీరిలో ఉంది. వ్యక్తి స్వాతంత్ర్య పరిరక్షణలో వీరికి శ్రద్ధాసక్తులు ఎక్కువ. ఈ రెండు లక్షణాలే శతాబ్దాలుగా దేశ రాజ్యాంగానికి రూపురేఖలు తీర్చి దిద్దినాయి.

## కార్యనిర్వాహక శాఖ (The Executive)

1. బ్రిటిష్ రాజరికము (The Crown) బ్రిటిష్ రాజ్యంలో సంపూర్ణ ప్రభుత్వాధికారం బ్రిటిష్ రాజపదవిలో ఉన్న వారిలో నిక్షిప్తమై ఉంది. రాజ పదవిలో ఉన్నవానిని అత్యున్నత పరిపాలనాధికారి అనే అర్థంలో వ్యవహరించదలచినప్పుడు 'రాజ'ని పిలుస్తున్నారు. వ్యక్తిగా సంభావించదలిస్తే 'సార్వభౌముడు' (Sovereign) అంటారు. బ్రిటన్ దేశపు రాజు వ్యక్తిగా తనంత తాను రాజపదవికి చెందిన అధికారాలను వాడుకోడు ; ప్రజలనుంచి, ప్రజలచే, పార్లమెంట్‌కు ఎన్నికయిన వారినుంచి వచ్చిన, ప్రజా ప్రతినిధి అయిన పార్లమెంట్‌కు బాధ్యత వహించి పరిపాలించే మంత్రుల సలహామేరకు తప్ప ఆ అధికారాలను బ్రిటిష్ రాజు చెలాయించినాడు. నామ మాత్రమే అతడు పరిపాలకుడు ఇది ఈనాడు బ్రిటిష్ రాజున్న స్థితి. కాని సర్వపాలనాధికారము బ్రిటిష్ రాజుకు పూర్వముండేదని మీకు తెలిసిన విషయమే. అతడు దొరయేగాని దొరతనమతనిది కాదు. అతడు ప్రభువు, సార్వభౌముడు, కాని అతడు దేశాన్ని స్వయంగా పరిపాలించడు ("The King reigns, but does not govern") "బ్రిటిష్ రాజు - రాజైన నాటినుంచి గతించేవరకూ ఏ పని చేసినా, ఆ పనికి బాధ్యత వహించే మంత్రి ఎవరో ఒకడు ఉండనే ఉంటాడు ; ఆ పనిని రాజు ఆ మంత్రి సలహాలపైన చేసినట్లే." - Gladstone. పార్లమెంట్‌ను రాజు సమావేశపరిచినా, వాయిదావేసినా, రద్దు చేసినా, మరో దేశంతో సంధి చేసుకొన్నా, యుద్ధం ప్రకటించినా, అత్యున్నతాధికారులను నియమించినా పార్లమెంట్ సమావేశమైనప్పుడు ప్రారంభోపన్యాసం చేసినా, సొంత బాధ్యతపై అతడు చేసేదేమీ లేదు. అతని కుటుంబ వ్యయము, బిడ్డల వివాహాదుల కయ్యే వ్యయము పార్లమెంట్ మంజూరు చేయవలసిందే. మరో కామన్‌వెల్ దేశాన్ని సందర్శించదలిచినా అది అతని మంత్రిమండలి ఆమోదం లేకుండా జరగదు.

కాని పైన జెప్పిన దానినిబట్టి బ్రిటిష్ సార్వభౌమునికి వ్యక్తిగతంగా దేశ వ్యవహారాలను దిద్దటంలో (అధికారం లేకున్నా), పలుకుబడి లేదనుకోవటం సరికాదు. మంత్రిమండలి మారి మరో మంత్రిమండలి నియమితమయ్యే వరకూ ఉన్నా, మధ్యకాలంలో రాజ్యాధికారమంతా రాజుదే. మెజారిటీ పార్టీ నాయకులలో మంత్రిమండలి ఏర్పాటుచేయమని ఎవ్వరిని కోరవలెనో అది నిర్ణయించే హక్కు రాజుదే. కాని తాను వరించే నాయకుడు ఆ రాజకీయ పక్షంవారు ఆమోదించేవాడై ఉండేటట్లు అతడు జాగ్రత్త వహించవలె. ప్రభుత్వ విధానాన్ని నిర్ణయించటంలోను, దేశపరిపాలనలోను మూడు హక్కులున్నాయని బేజ్‌హాట్ (Bagehot)

"ఇంగ్లీష్ రాజ్యాంగము" అనే తన గ్రంథంలో ఇట్లా పేర్కొన్నాడు అవి : 1. మంత్రి మండలిని సంప్రతించే హక్కు. 2. వారి విధి నిర్వహణలో పరిపాలకులను ప్రోత్సహించే హక్కు, 3 ఒకానొక పనిచేయవద్దని, చేస్తే అనర్థాలు సంభవించవచ్చునని హెచ్చరించే హక్కు (The right to be consulted ; the right to warn ; the right to encourage)

మంత్రి ఏ నిర్ణయం చేసినా, రాజు కాదనడు. అన్ని విధాలా దానికి తన మద్దత్తు ఇస్తారు. కాని ఆ నిర్ణయం చేయటానికి ముందు దానివల్ల కొన్ని అవాంఛితాలు జరగవచ్చునని, మరో విధంగా చేస్తే కొన్ని సత్ఫలితాలు కలగవచ్చునని తన మంత్రిని హెచ్చరించే హక్కు బ్రిటిష్ రాజుకుంది. సంప్రతించటానికి తనకుండే హక్కును గురించి విక్టోరియా రాణి ఈ విధంగా వివరించింది "మంత్రి తాను చేయదలచింది ఇది అని స్పష్టంగా, ముందుగా రాణికి తెలపవలె లేకుంటే తానేమి ఆమోదించేది తెలియకుండా ఆమోదించవలసి వస్తుంది. ఒక విషయాన్ని గురించి చేసిన నిర్ణయాన్ని తాను ఆమోదించిన దానిని మంత్రి స్వతంత్రించి మార్చరాదు తనకు, విదేశాల మంత్రులకు మధ్య జరిగే సంప్రతింపులు తనకు మంత్రి తెలుపుతూ ఉండవలె. తన ఆమోదాన్ని తెల్పుతూ తన చేవ్రాలు తీసుకొనే ముందు తాను ఏది ఆమోదిస్తున్నదీ చదివి తెలుసుకోవటానికి తనకు తగినంత వ్యవధి ఉండవలె" ఈ విధంగా విదేశ వ్యవహారాల మంత్రిని ఆమె ఒక సందర్భంలో తీవ్రంగా మందలించిది సామాన్యంగా మంత్రులు మధ్య వచ్చి, కొంత కాలం పదవిలో ఉండి వెళ్ళేవారు పదేళ్ళు అంతకుమించి రాజుగా ఉన్న వ్యక్తికి పరిపాలనాయంత్రాంగము ఏ విధంగా పనిచేస్తున్నదో అతని మంత్రుల కంటె మరింత చక్కగా తెలిసి ఉండే వీలుంది అంతేకాక అతనికి మంత్రులకున్నట్లు ప్రత్యేక రాజకీయ పక్షాభిమానము ఉండవలసిన అక్కర లేదు. ఏ పార్టీ ప్రభుత్వంలో ఉన్నా రాజు స్థితిలో వచ్చే లాభ నష్టాలు మారవు. ఈ కారణాలవల్ల మంత్రులకు తగిన హితవు చెప్ప టానికి, మందలించటానికి, హెచ్చరించటానికి, ప్రోత్సాహము అందించటానికి ఉండే అవకా శాలు ఎక్కువ. అయితే పరిపాలనపై రాజుకు ఉండే ప్రభావము అతని వ్యక్తిత్వం మీద ఆధారపడి ఉంది.

## బ్రిటిష్ రాజరికం - రాజు అధికారాలు

బ్రిటిష్ రాజరికం వంశానుగతంగా సంక్రమించేది. కాని రాజ పదవి సంక్రమణాన్ని నిర్ణయించే నిబంధనలు చేసే అధికారము పార్లమెంట్‌ది. 1701 స్థిరీకరణ శాసనము (Act of settlement) ఈ వారసత్వాన్ని మేరీ, విలియమ్, ఆనీలకు అనంతరం హానోవర్ రాణి సోఫియా వంశంలో స్థిరపరిచింది బ్రిటన్‌కు ప్రొటెస్టెంట్ కాని వ్యక్తి రాజు కారాదని అతను కేథలిక్ స్త్రీని పెండ్లి చేసుకోరాదని ఈ శాసనం నిర్ణయించింది. రాజు పరదేశాలను చూడ బోయేటప్పుడు, పసివాడుగా ఉన్నప్పుడు, అనారోగ్యంవల్ల, పిచ్చి పట్టటంవల్ల, ఏ ఇతర కారణాలవల్లనైనా పరిపాలించటానికి అనర్హుడైనప్పుడు రాజ ప్రతినిధిని పార్లమెంట్ నియమించవచ్చు 1931 వెస్ట్ మినిస్టర్ శాసనంవల్ల రాజ వంశానుక్రమంలో ఏ మార్పునుగాని బ్రిటిష్ పార్లమెంటేగాక ఇతర డొమినియన్ పార్లమెంట్‌లు ఆమోదించవలసి ఉంటుంది.

**రాజాధికారాలు:** రాజ్యానికి వచ్చినప్పుడు, అదిలోనే రాజు అవసరాలకని, రాజాస్థాన

వ్యయాలకని ప్రతి ఏటా ఇంత నిర్ణీత ద్రవ్యము ఇవ్వవలెనని పార్లమెంట్ మంజూరుచేస్తుంది. ఏ న్యాయస్థానానికి అతడు జవాబుదారీ కాడు. ఏ కారణంవల్లా, అతనిని నిర్బంధించరాదు.

తన రాజపదవినిబట్టి రాజుకున్న అధికారాలలో ముఖ్యమైనవి : అతడు చట్టాలను అమలుపరుస్తాడు. ఉన్నతోద్యోగులను నియమిస్తాడు, తొలగిస్తాడు, పరిపాలనకు. విదేశ వ్యవహారాలను నడిపిస్తాడు విదేశాలతో సంధి చేస్తాడు. యుద్ధాన్ని ప్రకటిస్తాడు. డొమినియన్ లతోను బ్రిటన్ కఠినమైన దేశాలతోను వ్యవహారాలు సాగిస్తాడు. దేశం యొక్క భూ, సముద్ర, విమాన సైన్యాలన్నిటికి అత్యున్నతాధికారి అతడే. పార్లమెంట్ అతని సమ్మతి లేకుండా సమావేశం కారాదు. అతని ఆమోదం లేకుండా పార్లమెంట్ చేసే ఏ చట్టమూ శాసనం కాదు. ప్రీవీ కౌన్సిల్ ఆజ్ఞలు (Orders in privy Council) అతడే జారీ చేయవలసినవాడు.

న్యాయానికి మూలమైనవాడు కాబట్టి న్యాయాధికారులను నియమించేది అతడే. క్రిమినల్ నేరాలకు శిక్ష పడినవారి శిక్షలను తగ్గించటానికి, రద్దు చేయటానికి, అనుభవించగా శేషించిన శిక్షను తోసిపుచ్చటానికి అతనికి అధికారముంది. కాని సివిల్ నేరాలకు విధించిన శిక్షలను, ఇంపీచ్‌మెంట్ ఫలితంగా వేసిన శిక్షలను క్షమించటానికి అతని కధికారం లేదు. ప్రభుత్వం స్థాపించిన చర్చ్ (Established Church) కు అధిపతి అతడు కాబట్టి బిషప్‌లను, ఆర్చిబిషప్‌లను నియమిస్తాడు. స్కాటిష్‌చర్చ్ అధిపతి అయినా అతనికి ఆ చర్చిమీద అధికారమంతగా లేదు. ఏటేటా, సంవత్సరాదినాడు, రాజు జన్మదినంనాడు, రాజు పేరిట. (ఆయన అన్ని గౌరవాలకు మూలకందం కాబట్టి) నూతన బిరుదాలు జాతికి ఏ విధంగానైనా అత్యుత్తమ సేవ చేసిన వారికి ప్రసాదించటం జరుగుతుంది.

## దేశానికి రాజరికం చేసే సేవలు

బ్రిటన్ జాతికి తమ పురాతన సంస్థల కంటిపెట్టుకొని ఉండే స్వభావముంది. జాతీయ వ్యయంలో ఒక శాతంలో చాలా స్వల్పభాగం రాజరికానికై బ్రిటన్ దేశస్థులు భరించవలసి వచ్చేది. బ్రిటిష్ రాజు దొరయేగాని దొరతనమతనిది కాదు ; సార్వభౌముడేగాని ఆయన పరిపాలించడు. బ్రిటిష్ జాతీయ ఐక్యానికి, బ్రిటిష్ డొమినియన్‌లతో కూడిన బ్రిటిష్ సామ్రాజ్యానికి అతడు తలమానికంగా ప్రకాశిస్తాడేగాని, పరిపాలకుడై అధికారం చేయడు. ప్రజాభిప్రాయానుసారం పరిపాలన జరగటానికి అంకుశంగా అతడు పనిచేయటం లేదు. మంత్రివర్గం సలహాకు లోబడి అతడు తన బాధకార్యాలను నిర్వహిస్తున్నాడు. ఇండియా, అమెరికాలవంటి కొన్ని ప్రజారాజ్యాలలో రాజ్యాధిపతులుగా అధ్యక్షులు ఏ విధంగా ఉపకరిస్తున్నారో బ్రిటిష్ రాజ్య పరిపాలనలో బ్రిటిష్ రాజు కూడా అట్లే ఉపకరిస్తున్నాడు. కాని దేశాధ్యక్షుని ఎన్నికలో మనం సామాన్యంగా చూసే స్పర్ధలు, పోటీలు, ద్వేషాలు లేకుండా బ్రిటిష్‌వారు వంశానుగతమైన రాజరికంవల్ల పొందే లాభాలన్నీ పొందగలుగుతున్నారు. బ్రిటిష్ రాజు బ్రిటిష్ రాజకీయ పక్షాలకు అతీతుడు. పక్షపాత బుద్ధిని అతడు అధిగమించినవాడు. పరిపాలనా విధానానికి అవిచ్ఛిన్నత అతనివల్ల లభిస్తున్నది. మానవతానుకంపతో పరిపాలనలో మార్గాన్ని పరిపాలక వర్గానికి అతనివల్ల స్థైర్యము, గౌరవము లభిస్తున్నాయి. మంత్రులు రాజు యొక్క హిత వాక్యాలను ఏ విధమైన అనుమానాలు లేకుండా స్వీకరించగల్గుతున్నారు, అనుసరించగల్గుతున్నారు.

1931 వెస్ట్ మినిస్టర్ స్టాట్యూట్ కారణంగా విశేష స్వతంత్ర ప్రతిపత్తిని పొందిన డొమిని యన్‌ల విషయంలో ఈనాటికి అతని సామ్రాజ్య ఐక్యానికి చిహ్నంగా రాజిస్తున్నాడు. బ్రిటిష్ సమాజంలో ఉత్తమ నైతిక ప్రవర్తనకు, జాతి మర్యాదలకు పరిరక్షణకు దారిచూపే ఉత్తమ పురుషుడుగా (The first gentleman of England) అతడు ప్రకాశిస్తున్నాడు. ప్రపంచ యుద్ధకాలంలో మాటిమాటికి జర్మన్ విమానాలు దాడిచేసి, లండన్ నగరాన్ని తమ విధ్వంసకాండతో భీభత్స పరుస్తున్నప్పుడు మాటిమాటికి రాజు నగరుపై నుంచి దర్శనమిచ్చి పౌరులకు ఐదో జార్జ్ ధైర్యోత్సాహాలను పురికొల్పిన విధానము మరపురాని విషయము. "రాజు మరణించినాడు; రాజు చిరకాలము జీవించుగాక" ("The King is dead : long live the King.") అనే మాటలు బ్రిటిష్ జాతికి బ్రిటిష్ రాజరికానికి ఈనాడున్న ఐక్యసిద్ధిని చాటుతున్నాయి

## 2. మంత్రివర్గము (Ministry), అంతర మంత్రిమండలి (The Cabinet)

బ్రిటన్‌లో ప్రభుత్వ కార్యనిర్వహణ చేసేది పేరుకు రాజైనా (Nominal Executive), నిజంగా పరిపాలన నిర్వహించేది (The real executive) మంత్రిమండలి. ఆ మంత్రిమండలిలోను, అంతర మంత్రిమండలే పరిపాలనా విధాన నిర్ణయంలోను, పరిపాలన ఒక నిర్ణీతపంథాలో నడిపించటంలోను సర్వాధికార సమన్వితమయింది. అంతర మంత్రిమండలి సభ్యులందరూ మంత్రివర్గ సభ్యులైనా, మంత్రిమండలి సభ్యులందరూ అంతర మంత్రిమండలి సభ్యులు కారు ఉదాహరణకు : 1948 లో మంత్రుల సంఖ్య 40 వారిలో యుద్ధ మంత్రి మండలి సభ్యులు తొమ్మిదిమంది మాత్రమే అంతర మంత్రిమండలి వారు. యుద్ధ మంత్రి మండలి (War cabinet)లో లేని ఇతర (కాబినెట్ హోదాగల) మంత్రులు 22 ; ఇతర సాహాయ్యక మంత్రులు తొమ్మిది మంది. 1945 ఆగస్టులో వచ్చిన (లేబర్) కార్మిక పక్ష మంత్రిమండలి సంఖ్య 77. అంతర మంత్రిమండలి వారిందులో 20 మంది. కాబినెట్ హోదా గల మంత్రులు 14 మంది ; సాహాయ్యక మంత్రులు 43 మంది. మంత్రివర్గ సభ్యులందరూ విధిగా పార్లమెంట్ సభ్యులై ఉండవలె. మంత్రిగా నియమితులైనప్పుడు ఒకవేళ పార్లమెంట్ సభ్యుడు కాకున్నా, మంత్రి అయిన ఆరు నెలలలోగా అతడు పార్లమెంట్ సభ్యత్వం సంపాదించుకోవలె ప్రభువుగా అయినా, ప్రభుసభ సభ్యుడైనా చాలు, లేదా ఏదైనా ఒక నియోజక వర్గంనుంచి కామన్స్ సభకు ఎన్నికైనా సరే, ఈ మంత్రులంతా కామన్స్ సభ్యులలో అధిక సంఖ్య వారి విశ్వాసమున్నంత కాలం మంత్రిమండలిలో ఉంటారు.

అంతర మంత్రిమండలి వారంతా మంత్రివర్గ సభ్యులైనట్లే, ప్రీవీ కౌన్సిల్ సభ్యులు కూడా అవుతారు ప్రీవీ కౌన్సిల్ సభ్యులుగా వీరందరు రహస్య శపథము (Oath of secrecy) చేయవలసి ఉంది అంతర మంత్రిమండలి సభ్యులు విధిగా ప్రీవీ కౌన్సిల్ సభ్యులైనా, ప్రీవీ కౌన్సిల్ సభ్యులంతా అంతర మంత్రిమండలి సభ్యులు కారు ఒకసారి ప్రీవీ కౌన్సిల్ సభ్యుడైనవాడు జీవిత పర్యంతం ప్రీవీ కౌన్సిల్ సభ్యుడై ఉంటాడు సామాన్యంగా ప్రీవీ కౌన్సిల్ సభ్యులు 320 మందివరకు ఉన్నారు. కాని కాబినెట్ సభ్యులు 20 కి మించ రాదనే ఒక సంప్రదాయము ఏర్పడి ఉంది. మెజారిటీ పార్టీ నాయకుడు ప్రధానమంత్రిగా, తన సహమంత్రులను పేర్కొంటే రాజు వారిని మంత్రులుగా నియమిస్తున్నాడు. పరిపాలన శాఖ

లను మంత్రులకు పంచి ఇచ్చేది ప్రధానమంత్రే. సంకీర్ణ మంత్రిమండలులు ఏ ఒక రాజకీయ పక్షానికి తగినంత సంఖ్యాబలం లేనప్పు డేర్పడటం గత అర్ధ శతాబ్దంలో అనేక మాపులు సంభవించటం మీకు తెలుసు. మంత్రులను ఎన్నుకోవటంలో ఆయా వ్యక్తులు ప్రభుత్వం స్థిరంగా ఉండటానికి, పరిపాలనా సౌష్ఠవానికి తోడ్పడగలరా, లెదా అనేది ప్రధానమంత్రి ముఖ్యంగా గమనించే విషయము

## అంతర మంత్రిమండలి నిర్వహించే పనులు (Functions of the Cabinet)

1. మంత్రిమండలి అనుసరించదలచిన పరిపాలనా విధానాన్ని నిర్ణయించి, పార్ల మెంట్‌కు నివేదిస్తుంది. 2 ప్రతి పార్లమెంట్ సమావేశంలోను ప్రతిపాదించదలచిన చిత్తు చట్టాలను సిద్ధపరుస్తుంది. దానిని మంత్రులు సమర్థిస్తూ, ప్రతిపక్షాలు చేసే విమర్శలకు సమా ధానాలు చెప్పుకొంటున్నారు. 3 పార్లమెంట్ సమావేశం ఆరంభంలో రాజు చేయవలసిన ఉపన్యాసాన్ని కాబినెట్ ముందుగా ఆమోదించవలసి ఉంది. 4. మంత్రులుగాని ఇతర పార్ల మెంట్ సభ్యులు ఉపపాదించే శాసనాలపట్ల మంత్రివర్గ వైఖరిని వారు నిర్ణయించుకోవలె 5. సంవత్సర ఆదాయ, వ్యయపట్టిక (Budget) చర్చించి నిశ్చయించవలసిన బాధ్యత మంత్రిమండలిది. 6 పరిపాలన శాఖలోని ఉద్యోగులు పార్లమెంట్ నిశ్చయించిన విధానాల కనుగుణంగా ప్రవర్తిస్తున్నారా, లేదా పర్యవేక్షణ చేయవలసింది అంతర మంత్రిమండలే. 7 ఉద్యోగ నియామకాల విషయంలోను, విదేశీయ వ్యవహారాలలోను ప్రభుత్వ విధానాన్ని నిర్ణయించేది అంతర మంత్రిమండలే కాబినెట్ శ్రద్ధ వహించవలసిన మరో ముఖ్య విషయ ముంది 8. వేరు వేరు పరిపాలనా శాఖలు తమ తమ కార్యనిర్వహణలో పరస్పరం సంఘ ర్షణ పడకుండా, ఒక శాఖ చేసేపని ఇతర శాఖల పనులతో సహకరించే విధంగా ఉండేటట్లు గమనించవలసిన గురుతర బాధ్యత అంతర మంత్రిమండలి వహిస్తున్నది

## కాబినెట్ ఉద్యోగి వర్గము (Cabinet Secretariat)

1916 లో కాబినెట్ ఉద్యోగివర్గం ఏర్పాటయింది. వీరు కాబినెట్ మంత్రులకు కార్య నిర్వహణలో సహాయపడుతుంటారు. అంతర మంత్రిమండలికి దానికి సంబంధించిన కమిటీ లకు కావలసిన రికార్డులు సిద్ధం చేయటం, ఇతర విషయసేకరణ వీరు చేయవలసిన పనులు అవి కాబినెట్ మంత్రులకు, కమిటీల సభ్యులకు ముందుగా పంచవలసింది వీరే. కాబినెట్, కాబినెట్ కమిటీల సమావేశాల కార్యక్రమ పట్టికలను ప్రధానమంత్రి, కమిటీ అధ్యక్షుని ఆదేశానుసారం వీరు తయారుచేస్తూ ఉంటారు. కాబినెట్, కాబినెట్ కమిటీల సభ్యులను, వాటి సమావేశాలకు హాజర్ కావలసిందని వీరు ఆహ్వానించవలె. ఆ సమావేశాల నిర్ణయాలను వ్రాసుకొని నివేదికలను సిద్ధపరచవలె. కాబినెట్ తీర్మానాలను, రికార్డులను కాబినెట్ సూచనల మేరకు వీరు భద్రం చేయవలసి ఉంది.

## అంతర మంత్రిమండలి ముఖ్య లక్షణాలు

1. బ్రిటిష్ రాజుకు 1714 లో మొదటి హానోవీరియన్ జార్జ్ రాజయిన నాటినుంచి కాబినెట్‌లో స్థానం లేదు తత్ఫలితంగా పరిపాలనకు ఏ మాత్రం బాధ్యత కూడా అయనకు

లేకపోవటమే గాక పరిపాలనలోని లోపాలకు కాబినెట్ మంత్రులను పూర్తిగా బాధ్యులను చేయటానికి వీలు కలిగింది.

2 పార్లమెంట్‌లో అప్పటికి అధిక సంఖ్యాబలమున్న రాజకీయ పక్షం నుంచి కాబినెట్‌ను నిర్మించే పద్ధతి ఆచరణలోకి వచ్చింది. దానితోబాటు పార్లమెంట్‌లో సభ్యత్వం లేనిదే ఎవరూ మంత్రి కారాదనే సంప్రదాయం ఏర్పడింది.

3 మంత్రులు ఒక్క రాజకీయ పక్షానికి చెందిన వారు కావటంవల్ల వారిని సమాన రాజకీయాభిప్రాయాలు ఒకవేళ అవి వేరైనా, కాబినెట్ సమావేశాలలో వాటినిగురించి వాదోపవాదాలు జరపటానికి మంత్రులకు స్వేచ్ఛ ఉన్నా, బహిరంగంగా కాబినెట్ నిర్ణయించిన విధానాలను వారందరూ సమర్థించవలసినవారే తద్భిన్నంగా వారు సంభాషించరాదు ప్రవర్తించరాదు సంకీర్ణ మంత్రిమండలి భిన్న పక్షాలకు చెందినవారు సభ్యులైనా, ఆ కారణంవల్ల కొన్ని ప్రత్యేకాభిప్రాయాలు వారిలో కొందరికి ఉన్నా, ఆ సంకీర్ణ మంత్రిమండలి వారున్నంత కాలం ఆ మంత్రిమండలి నిర్ణయించుకొన్న విధానాలకు వారు కట్టుబడి ఉండవలసి ఉంది. లేదా వాటిలో ఒకటి తన అంతరాత్మకు విరుద్ధమైందని తోచినా, అట్లా తోచిన మంత్రి తన మంత్రి పదవిని వదులుకొని తన రాజకీయ స్వాతంత్ర్యాన్ని సంపాదించుకోవచ్చు.

4 రాజకీయాలలో వారనుసరించే ప్రతి విధానానికి, చేసే ప్రతి కార్యానికి కాబినెట్ మంత్రులంతా కామన్స్ సభకు ఉమ్మడిగా బాధ్యులు కామన్స్ సభవారి మీద విశ్వాసముంచినంత కాలం వారు పదవిలో ఉంటారు ఆ విశ్వాసం పోగొట్టుకొన్న తక్షణం చట్టమేది వారినట్లా నిర్బంధించకపోయినా, అది సంప్రదాయం మాత్రమే అయినా, వారు మంత్రిపదవుల నుంచి తొలగిపోవలసినవారే కామన్స్ సభ మంత్రులపై తమకు విశ్వాసం పోయిందని ఈ కింది మార్గాలలో ఒక మార్గమవలంబించి ప్రకటించవలె కాబినెట్ మంత్రి ప్రతిపాదించిన చట్టాన్ని తోసిపుచ్చవచ్చు కాబినెట్ విరోధించే చట్టాన్ని మంత్రిగాని కామన్స్ సభ్యుడు ప్రతిపాదించిన దానిని ఆమోదించవచ్చు. మంత్రి ఒకడు తన శాఖ పరిపాలనకు కోరిన ద్రవ్యాన్ని మంజూరు చేయకపోవచ్చు. మంత్రుల జీతాలను నిరాకరించవచ్చు. మంత్రిమండలి పట్ల తీవ్ర విరోధభావం కల్గినప్పుడు, పై పద్ధతులలో దేనిని అనుసరించక సూటిగా మంత్రిమండలిపట్ల విశ్వాసరాహిత్య తీర్మానాన్ని కామన్స్ సభ ఆమోదిస్తుంది.

కామన్స్ సభకు కాబినెట్ మంత్రులు ఉమ్మడిగా బాధ్యులు కావటంవల్ల, వారిలో ఏ ఒక్కడైనా తనకు అప్పగించిన శాఖ విషయంలో అనుసరించే ప్రతి ఒక ముఖ్య విధానానికి, ప్రతి పనికి కామన్స్ ఎదురు తిరిగినట్లయితే కాబినెట్ వారంతా పదవీ విరమణ చేయవలసి ఉంది. దీని కర్థము కాబినెట్‌కు ఏక వ్యక్తిత్వముంది. ఒక వ్యక్తిగా అది శాసనరీత్యా రాజుకు బాధ్యత వహిస్తున్నది. రాజకీయాలలో ఒక వ్యక్తిగా పార్లమెంట్‌కు బాధ్యత వహిస్తున్నది. పార్లమెంట్ విమర్శించే విధానాన్ని కాబినెట్ సమావేశంలో తాను కాదన్నానని ఏ మంత్రి తప్పించుకోలేడు ఆ సందర్భంలో ఆ మంత్రులను నియమించిన రాజు వారిని మంత్రివర్గం నుంచి తొలగిస్తాడు. ఇతర ప్రభుత్వోద్యోగులతోబాటు ఆ మంత్రులూ న్యాయ విరుద్ధమైన తమ చర్యలకు న్యాయస్థానాల విచారణకు శిక్షలకు పాత్రులవుతున్నారు.

5. *ప్రధానమంత్రి ఆధిక్యము:* సిద్ధాంత రీత్యా మంత్రివర్గ సభ్యులంతా సమానులైనా, సమానులలో అగ్రస్థానము ప్రధానమంత్రిది. (Prime-Minister is 'primus

inter pares' first among equals in the cabinet). కాబినెట్ అనే తోరణానికి ప్రధాన కీలకశిల (Key-stone of the Cabinet Arch) అని మార్లీ వర్ణించినాడు. కాబినెట్ సమావేశానికి అతడు అధ్యక్షుడు. ఆ పదవిలో అతనికున్న అధికారం అసమాన మైంది. రాజున్న ప్రజారాజ్యానికి రాజుకాని రాజు ప్రధానమంత్రి ఇక ఆ బ్రిటిష్ రాజు (పేరుకు) రాజైనా, (నిజానికి) రాజు కానివాడు.

*ప్రధానమంత్రి అధికారాలు, విధులు:* రాజు ఆమోదంతో, ప్రధానమంత్రికి ఇతర మంత్రులను నియమించే అధికారము, బర్తరఫ్ చేసే అధికారము ఉన్నాయి అనేకులు అనేక విధాల లాభాలు, గౌరవాలు, బిరుదాలు, ఉద్యోగాలు అమర్చే అధికారము, పలుకుబడి అతని కున్నాయి. సహమంత్రులు తమ శాఖలను పరిపాలించటంలో పుట్టుకొనివచ్చే క్లిష్ట సమస్య లను, గురించి అతనితో సంప్రదిస్తుంటారు ఒక పరిపాలన శాఖకు, ఇతర శాఖలకు పొరపులు కలిగినప్పుడు వాటిని పరిష్కరించేది ప్రధాన మంత్రి కాబినెట్ ఉద్యోగివర్గం మీద అధికారం ఇతనిది. కాబినెట్ నిర్ణయాలను ఆ యా పరిపాలన శాఖలలోని ఉద్యోగులు అమలుపరిచేటట్లు చూడవలసిన వా డితడే పార్లమెంట్‌లోని తన పార్టీకి, కామన్స్ సభకు నాయకుడు ప్రధాని పార్లమెంట్‌కు వెలుపల కూడా తన పార్టీకి అతనే నాయకుడు బ్రిటిష్ డొమినియన్‌ల ప్రధానులతోను, కామన్‌వెల్త్ రాజ్యాల, విదేశాల ప్రభుత్వాలతోను ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపేది ప్రధాన మంత్రే. అతని పార్టీకి అడ్డులేని మెజారిటీ పార్లమెంట్‌లో ఉన్నంతకాలం దేశ రాజకీయాలలో అతని అధికారానికి పరిమితి లేదు అతడు చట్టాలు మార్చగలడు, పన్నులు విధించగలడు, రద్దు చేయగలడు. దేశ సైనిక బలాన్ని అధీనంలో ఉంచుకొని, విదేశాలతో యుద్ధాలు చేయగలడు, రాయబారాలు నడిపించగలడు, విదేశ వ్యాపారాన్ని అదుపులో ఉంచు కొని, దేశీయార్థిక జీవితాన్ని చక్కదిద్దగలడు ఒక్క మాటలో చెప్పవలెనంటే ప్రభుత్వమే అతడు, అతనిదే ప్రభుత్వము రాజకీయ సార్వభౌమత్వమున్న ప్రజలు అతని నాయకత్వం వహించిన రాజకీయపక్షం ప్రణాళికలను ఆమోదించి, సాధారణ ఎన్నికలో ఆ పార్టీకి కామన్స్‌లో అధిక స్థానాలను సమకూర్చి పెట్టటంవల్ల అతనికి ఇంత సంపూర్ణాధికారం లభిస్తున్నది

## బ్రిటిష్ పార్లమెంట్ - ప్రభువసభ

ప్రభు సభలో వేయికి మించి సభ్యులు ఇప్పుడున్నారు. వీరికి రోజుకూ $4\frac{1}{2}$ గినీల వంతున బత్తెము, రానుపోనూ మొదటి తరగతి రైల్వే ప్రయాణానికి అయ్యే వ్యయము ప్రభుత్వం భరిస్తున్నది అయితేనా ప్రభు సభతో సమావేశమయ్యే సభ్యుల సంఖ్య సామాన్యంగా నూటికి మించదు. కొన్ని ప్రభు వంశాలు సంతతిలేక నశించటంవల్ల, జీవిత పర్యంతం మాత్రమే ప్రభు పదమిచ్చిన వారిలో కొందరు మరణించటంవల్ల ప్రభువుల సంఖ్య నిలకడగా ఉండదు ప్రభుసభ సభ్యులు ఐదు విధాలవారున్నారు.

1. వంశానుగతంగా సభ్యత్వమున్నవారు, ప్రభువు గతించినప్పుడు అతని కుమారు లలో పెద్దవానికి ప్రభు పదవి ప్రభుసభా సభ్యత్వం లభిస్తున్నది కాని కొన్ని సందర్భాలలో స్త్రీలు రాణులైనా 1922 లో రోన్‌డా రాణి వ్యాజ్యంలో న్యాయస్థానమిచ్చిన తీర్పును 1958లో జీవిత పర్యంతం ప్రభుపద శాసనం తలకిందులు చేసినంతవరకూ రాణులకు ప్రభుసభలో స్థానం లేకున్నది.

2. స్కాట్లండ్ ప్రభువులంతా సమావేశమై తమలో 16 మందిని ప్రభుసభకు ఎన్ను కొనేటట్లు, వారికా పార్లమెంట్ జీవితకాలం మాత్రం ప్రభుసభ సభ్యత్వము ఉండేటట్లు 1707 ఐక్య శాసనం తీర్మానించింది కాని పైన చెప్పిన 1968 శాసనంవల్ల స్కాటిష్ ప్రభువులంద రికి ప్రభుసభ సభ్యత్వం సిద్ధించింది. (1707 లో స్కాటిష్ ప్రభువుల సంఖ్య 154)

3 *ఐరిష్ ప్రభువులు:* 1801 ఐక్య శాసనం అప్పుడున్న 284 మంది ఐరిష్ ప్రభు వులు తమలో 28 మందిని బ్రిటిష్ ప్రభువుల సభకు జీవిత పర్యంత సభ్యత్వానికి ఎన్నుకో వచ్చునన్నది. 1928 లో ఐర్లండ్ స్వతంత్ర రాజ్యం కాగా, ఆ తరవాత పార్లమెంటొక ఏర్పాటు చేసే వరకూ 28 మంది ఐరిష్ ప్రభు సభ్యుల స్థానాలలో ఏవైనా ఖాళీ పడినప్పుడు వాటికి కొత్త సభ్యులను నియమించరాదనే నిబంధన చేసినారుగాని ఆ విషయంలో తరవాత పార్లమెంట్ ఏ చట్టమూ చేయనందువల్ల క్రమంగా బ్రిటిష్ ప్రభు సభలో ఐరిష్ ప్రభువుల సంఖ్య 1950 నాటికి 8 కి పడిపోయింది.

4. *చర్చి ప్రభువులు:* ఆంగ్లికన్ చర్చికు చెందిన 24 మంది బిషప్‌లు, యార్క్, కాంటర్‌బరీ ఆర్చి బిషప్‌లు వీరికి ప్రభు సభలో సభ్యత్వముంది.

5 *సామాన్య అపీళ్ళ ప్రభువులు (Lords of Appeal in Ordinary):* వీరు ఏడుగురు. వీరిని ప్రభుత్వం సాంవత్సరిక వేతనం మీద నియమిస్తున్నది వీరు తమ జీవిత కాలమంతా ప్రభు సభలో సభ్యులు.

21 ఏళ్ళు నిండనివారికి, దివాలా తీసినవారికి, క్రిమినల్ నేరాలకు దేశద్రోహానికి శిక్ష పడిన వారికి విదేశీయులకు కామన్స్ సభలో స్థానం లేనట్లే, ప్రభు సభలోనూ స్థానం లేదు ప్రభు సభకు అధ్యక్షుడు ఛాన్సలర్ ప్రభువు (Lord Chancellor) ప్రభువు కానివాడు ఛాన్సలర్ ప్రభువు కావటానికి వీలులేదు. ఈయన విధిగా కాబినెట్ మంత్రులలో ఒకడు. శాసనాలను ఆమోదించే సందర్భంలో ముప్పైమంది సభ్యులు తప్పక హాజరై ఉండవలె కాని, ఇతర సమయాలలో ముగ్గురికంటె ఎక్కువమంది (Quorum is three) ఉండవలెనని నిబంధన కోరదు కామన్స్‌సభ, ప్రభుసభ సమకాలంలోనే సమావేశమయినా సమావేశమయ్యే దినాలు, గంటలు వేర కావచ్చు. కామన్స్ సభలో ఉన్నట్టే ప్రభు సభలోను కమిటీలు అనేక మున్నా, ప్రభుసభకు హాజరయ్యేదే చాలా కొద్దిమంది కాబట్టి చిత్తు చట్టాలను దానిలో రెండు సార్లు చదివి, సభకు వచ్చిన వారందరూ కమిటీగా కూర్చుండి వాటిని చర్చించి మూడోసారి ప్రభుసభలో చదివి వాటిని ఆమోదించటం జరుగుతుంది. కామన్స్‌సభ ఆమోదించి పంపిన చట్టమైతే, ప్రభుసభ దానిలో కొన్ని సవరణలు చేసినపట్ల సవరించిన ఆ చట్టాన్ని కామన్స్‌కు తిప్పి పంపుతారు. కామన్స్ దానికి సవరణలు చేసినా, చేయకపోయినా, దానిని ఆమోదించి పంపవలసి ఉంది.

## ప్రభుసభ అధికారాలు

1. *న్యాయపరిపాలనాధికారాలు:* ప్రధాన రాజోద్యోగుల దుశ్చర్యలను, దుష్పరిపాల నను విచారించి శిక్షించే న్యాయస్థానం ఇంపీచ్‌మెంట్ కోర్టు (A court of impeachment) 1805 లో జరిగిన విచారణ ఇంపీచ్‌మెంట్ కట్టకడపటిది. ఇంపీచ్‌మెంట్ అవసరము ఈనాడు లేదు మంత్రుల శాసనసభకు బాధ్యత వహించేటట్లు చేయటానికి విశ్వాస

ధాహిత్య తీర్మానంవంటి ఇతర ఉపాయాలున్నాయి. దక్షిణ ఐర్లండ్ ను మినహాయించగా తక్కిన బ్రిటిష్ దీవులలోని న్యాయస్థానాలన్నింటి తీర్పులపై తెచ్చే అపీళ్ళను పరిష్కరించే అత్యున్నత న్యాయస్థానంగా ప్రభుసభ వ్యవహరిస్తున్నది. పేరుకు ప్రభుసభ న్యాయస్థానమూ దాని సభ్యులు న్యాయాధిపతులూ అయినప్పటికీ ఆ సభ్యులందరూ న్యాయాధిపతులుగా పని చేయటం లేదు. ఆ సభలోని న్యాయ ప్రభువులు (Law Lords), తమ పూర్వ జీవితంలో న్యాయాధిపతులుగా అనుభవమున్నవారు మాత్రమే న్యాయపరిపాలన చేసేది అంటే నిజానికి "న్యాయస్థానంగా వ్యవహరించే ప్రభుసభ కాదు శాసనాలు చేసే ప్రభుసభ" ఆ రెండు వేరు వేరు సంస్థలని మన మనవచ్చు (Ramsay Muir).

2. *ప్రభుసభ – శాసనాధికారాలు:* (a) 1911 వరకు కామన్స్‌సభతోపాటు సమాన శాసనాధికారాలు ప్రభుసభకున్నాయి. ఆర్థిక శాసనాలుకాని ఇతర శాసనాలు కామన్స్‌సభలోనే కాక ప్రభుసభలోను ఉపక్రమించవచ్చు కామన్స్ ఆమోదించి పంపిన బిల్లు చట్టాలను ప్రభుసభ సవరించవచ్చు, ఆమోదించవచ్చు, నిరాకరించవచ్చు. (b) ఆర్థిక శాసనాలను కామన్స్ సభలోనే ఉపపాదించవలె కాని ప్రభుసభ వాటిని తిరస్కరించటానికి, సవరించటానికి అధికారమున్నదిగాని ఆ అధికారాన్ని అంతగా ప్రభుసభ ఉపపాదించుకొన్నదీ లేదు. 1909 లో భూమి విలువల పెరుగుదలపై పన్ను విధిస్తూ కామన్స్‌సభ చేసిన చట్టాన్ని ప్రభుసభ తిరస్కరించగా, 1911 పార్లమెంట్ శాసనాన్ని చేసి కామన్స్‌సభ ఆర్థిక శాసనాలను సవరించటానికి తిరస్కరించటానికి ప్రభుసభకున్న అధికారాలను రద్దు చేసింది. ఆర్థిక శాసనం కామన్స్ సభ ఆమోదించిన నెల దినాలలోగా ప్రభుసభ ఆమోదించకపోయినా చట్టమై తీరుతుందని 1911 పార్లమెంట్ శాసనం విధించింది. పన్నులను విధించే చట్టాలేగాక, ప్రభుత్వ ధనాన్ని నిర్ణీత విధంగా వ్యయం చేయవలెననే చట్టాలు, ఋణాలనుగురించిన చట్టాలు, ప్రభుత్వ ఆదాయవ్యయాల పరీక్ష (audit) కు గురించి చేసే చట్టాలు ఆర్థిక శాసనాలుగా పరిగణించడ మయింది. ఏ చట్టంగాని ఆర్థిక శాసనమవుతుందో కాదో నిశ్చయించే అధికారం కామన్స్‌సభ సభాపతిది (Speaker).

రాజుకు రాజకుటుంబానికి, రాచరికాన్ని పోషించటానికి అయ్యే వ్యయాన్ని మంజూరు చేసే చట్టాన్ని (Consolidated Fund Bill) కామన్స్‌సభ ఎప్పుడూ సవరించదు. వివాదాస్పదం కాని సామాన్య వ్యయశాసనాలు, పన్నులను విధించవలెనని చూసే శాసనాలలో సగమూ కామన్స్‌సభ సామాన్యంగా సవరించవలెనని చూడదు. ఆర్థిక శాసనాల విషయంలో బ్రిటిష్ పార్లమెంట్ ఏక శాసనసభగా వ్యవహరిస్తున్నదని చెప్పవచ్చు.

(c) పార్లమెంట్ జీవితాన్ని అయిదేళ్ళకుపైన పెంచవలెనని చేసే శాసనాలు, ఆర్థిక శాసనాలు కాక తక్కిన పబ్లిక్ చట్టాల విషయంలో కూడా ప్రభుసభ ఆమోదం లేకున్నా కామన్స్ ఆమోదించిన చట్టాలు శాసనాలు కావచ్చు కాని ఇది కొన్ని నిబంధనలకు లోబడి ఉంది: i. అవి కామన్స్‌సభచే వరసగా మూడు సమావేశాలలో ఆమోదం పొందవలె. ఆ సమావేశాలు ఒక పార్లమెంట్‌వి కావచ్చు. లేదా వరసగా ఎన్నికయిన రెండు పార్లమెంట్‌లవి కావచ్చు. ii. మొదటి సమావేశంలో రెండోసారి కామన్స్‌లో దానిని చదివిననాటికీ, మూడో సమావేశంలో కామన్స్ దానిని ఆమోదించిన నాటికీ మధ్య రెండేళ్ల వ్యవధి ఉండవలెనని 1911 పార్లమెంట్ చట్టం శాసించింది. ఏ విషయంలోనైనా ప్రజ లావేశపూరితులై ఉన్న

కాలంలో వివేచనాశక్తి లోపించి, త్వరపడి చేయటాన్ని చట్టం చేసి తీరికగా కూర్చుండి ఇది ఎందుకు చేసినామని విచారించరాదనేది ఈ నిధియమంయొక్క ఉద్దేశము. 1947వ సంవత్స రంలో అధికారంలో ఉన్న కార్మికపక్ష మంత్రివర్గం సామ్యవాద ధోరణిలో ఎన్నో అభి వృద్ధికర పథకాలను అచరణలో పెట్టవలెనని తలపెట్టింది. కాని రెండేళ్ళకాలం తమ పథకాలను వెనకవేసే ప్రభుసభ అధికారాన్ని వారు సహించలేక, 1947లో సామాన్య శాసనాలను చట్టాలు కాకుండా చేసే ఆ సభ అధికారాన్ని ఒక సంవత్సరానికి పరిమితం చేసినారు. ఇన్ని విధాల అధికారం పోగొట్టుకొన్న ప్రభుసభవల్ల ఉపయోగమింక ఏమి మిగిలింది అనే ప్రశ్న బయలుదేరింది.

*బ్రిటిష్ పార్లమెంట్‌లోని ఎగువసభవల్ల లాభము:* ప్రజా రాజ్యాలలో ఎగువ శాసన సభలు ప్రయోజనకారులు కావలెనంటే దిగువ శాసనసభ ఆమోదించి పంపే చట్టాలను సరిదిద్ది మెరుగుపరిచేవిగా ఉండవలనేగాని ప్రజాభిప్రాయానుసారం శాసనాలు చేయటానికి అడ్డుపడే విగా ఉండరాదు. దిగువ శాసనసభతోపాటు తాను కూడా సమానంగా ప్రజా ప్రతినిధినే అని పోటీ పడేదిగా ఎగువ శాసనసభ ఉండరాదు 2 అది ఆ విధంగా పోటీ పడకుండా ఉండ వలెనంటే దాని నిర్మాణం దిగువ శాసనసభ నిర్మాణానికి భిన్నంగా ఉండవలె. దిగువ శాసన సభ లక్షణాలకు భిన్న లక్షణాలు ఎగువ శాసనసభకు ఉండవలె పై మంచి గుణాలు బ్రిటిష్ ప్రభు సభలో ఉన్న విషయం మీకు తెలిసిందే. పుట్టుక కారణంగా సభ్యులైన వారి విషయ మటుంచి చూసినట్లయితే "ప్రభుసభ వ్యవహారాలలో శ్రద్ధ వహించేవారు దేశ పరిశ్రమలలో, వ్యవసాయంలో, విజ్ఞాన రంగంలో, మత ఆర్థిక జీవితంలో ప్రశస్తమైన స్థాన మలంకరించే వారై ఉన్నారు. న్యాయవాదులుగా, రాష్ట్ర పరిపాలకులుగా, రాయబారులుగా పండితులుగా, రాజనీతి వేత్తలుగా, యుద్ధకార్య విశారదులుగా సుప్రసిద్ధులైనవారు ప్రభు సభలో అనేకు లున్నారు" (Ogg) "ప్రభుసభను తీవ్రంగా విమర్శించేవారు సహితం ఆ సభలో జరిగే చర్చలు చాలా ఉన్నత పథంలో నడుస్తాయనేది కాదనలేరు. కర్జన్ (అధునాతన ఈజిప్ట్ నిర్మాత), క్రోమర్ మిల్నర్ (దక్షిణాఫ్రికా గవర్నర్ జనరల్) వంటి సుప్రసిద్ధ పరిపాలకులు సామ్రాజ్య వ్యవహారాలను గురించి చేసే చర్చలు వినదగినవిగానే ఉంటాయి. (మన్రో రచిం చిన "ది గవర్నమెంట్స్ ఆఫ్ యూరప్") (The Governments of Europe).

కామన్స్ సభలో చర్చలు సుదీర్ఘాలుగా ఉండజాలవు. ఒక్కొక్క విషయాన్ని గురించి చర్చాకాలం ఇంతకు మించరాదని సభాపతి ముందే నిర్ణయించటం కద్దు (Guillotine). చర్చ జరుగుతూ ఉండగా చర్చను ఇంతటితో ఆపివేయవలెనని (Closure) ఏ సభ్యుడైనా ప్రతిపాదించవచ్చు మంత్రులు ఉపపాదించే చట్టాలనుగురించిన చర్చలు, పరిపాలనాన్నిగురించి సభ్యులడిగే ప్రశ్నలు, మంత్రులిచ్చే సమాధానాలు, అప్పుడప్పుడు పుట్టే అనుబంధ ప్రశ్నలు సభాకాలాన్ని చాలావరకు హరించటంవల్ల ఏ విషయమూ సాకల్యంగా విచారించటం జరగదు తమకు పార్టీ బలమధికంగా ఉండటంవల్ల తాము ప్రతిపాదించే చట్టాలు కామన్స్‌వారు ఆమో దించరనే భయం మంత్రుల కెన్నడూ ఉండదు. తమ పాతుపాత బలంవల్ల మంత్రుల ప్రతి పాదనలను ఓడించేది లేదని తెలిసినా, తమ నియోజకవర్గంలోని వోటర్ల మెప్పుకోసం ప్రతి పక్షంవారు విజృంభించి ఉపన్యాసాలు చేసినా, ఈ చర్చలనుగురించి పట్టించుకొనేవారు కామన్స్‌సభలో అనేకుల్లు కనబడరు. అధికారపక్షం సభ్యులు తమ విమర్శనా శౌకం

ప్రదర్శించి తమ పక్ష నాయకుల అసూయాద్వేషాలను కొని తెచ్చుకొనే ప్రయత్నం సాహసంగా చేయరు. ప్రభుసభలోని సభ్యులకు తమ చర్చా ఫలితంగా వోటర్‌లను మెప్పించి తమ సభ్యత్వాన్ని కాపాడుకోవలసిన అవసరం లేదు. తమ నమ్మకాలకు అనుగుణంగా, సత్యం మీద దృష్టి ఉంచి, నిర్భయంగా వారు విషయవిమర్శ చేయగలరు. ప్రభుసభ ఎట్లా తీర్మానించినా, అక్కడ సభ్యులెంత వాదకౌశల్యం చూపినా, ప్రభుత్వం పడిపోయే ప్రమాదం ఉండదు. వారి విమర్శలను విని మంత్రిమండలి తమ ప్రతిపాదనలను అవసరం కొద్దీ సవరించటానికి వీలవుతుంది. పార్లమెంటరీ గవర్నమెంట్ ఇన్ ఇంగ్లండ్ (Parliamentary Government in England) అనే తన గ్రంథంలో ప్రభుసభ తన విధిని చక్కగా నిర్వహిస్తున్నదంటూ జెన్నింగ్స్ పండితుడు ఇట్లా వ్రాసినాడు. "ఆర్థిక సంబంధంలేని ఇతర చట్టాలను అది పరిశీలించి చక్కదిద్దుతూ ఉన్నది. సమయంవచ్చినప్పుడది చిత్తు చట్టాలు శాసనాలయ్యేలోగా ప్రజాబాహుళ్యం వాటిని చక్కగా చర్చించటానికి కావలసినంత కాల వ్యవధి ఉండేటట్లు చూస్తూ ఉంది. అందువల్ల ఆవేశాలు చల్లారి వివేకంతో పునరాలోచనలు జరిగేటట్లు అది పట్టుబట్టుతున్నది". "రాజకీయ పక్షాలు తమ స్వార్థ దృష్టితో చూడనవసరం లేని జనులందరికీ మేలు చేసే ప్రధాన విషయాలకు ప్రభుసభ గొప్ప చర్చావేదిక". ప్రజలందరెన్నుకోవటంవల్ల ప్రజల ప్రతినిధి అనదగిన కామన్స్‌సభ అభిమతాలకు అది అడ్డం రాదు కాబట్టి, దాని ఉనికికి ఎవ్వరూ అభ్యంతరం చెప్పనక్కరలేదు.

ప్రభుసభ ఉనికివల్ల కలిగే లాభాలనుగురించి సర్ ఐవర్ జెన్నింగ్స్ తెల్పిన కొన్ని అభిప్రాయాలు కింది విధంగా ఉన్నాయి.

1. కామన్స్ సభలో అనేకులు అనేక విధమైన సవరణలు సూచించటం చిత్తు చట్టాన్ని ఉపపాదించిన మంత్రి వాటిని వృథాచర్చ, కాలవ్యయమెందుకని అంగీకరించటం పరిపాటి. అది ప్రభుసభకు చేరేటప్పటికి అందులో కావలసినన్ని వైరుధ్యాలుండటంలో ఆశ్చర్యం లేదు. ఆ లోపాలు తొలగించి, పూర్వాపరదృష్టితో చట్టాన్ని సవరించి, దానిని ఒక రూపానికి తెచ్చి అమూల్యమైన పని ప్రభుసభ చేస్తున్నది. ఒక విధంగా అది కామన్స్ సభకు ఒక కమిటీగా వ్యవహరిస్తున్నదనవచ్చు.

2. ఈ పని సమర్థులైన న్యాయవాదుల కప్పగిస్తే వారు ప్రభుసభ చేసినంత చక్కగా అంతకంటె మేలుగా చేయలేరా అనవచ్చుగాని, ఆ విధమైన న్యాయవాదుల సంస్థ లేదు. కామన్స్‌సభ నాయకులకు తమ ఉపన్యాసాలను తాము విని ఆనందించటానికే కాలం చాలదు. ఇక విసుగు పుట్టించే ఈ పనికి, చిత్తు చట్టాలను పరిశీలించి సంస్కరించటానికి తీరిక ఎక్కడిది? కామన్స్ సభలోని కమిటీలలోని సభ్యులకు ఆ సమావేశాలకు రావటమే భారంగా తోస్తూ ఉండగా అక్కడ చూసే పనికి అవసరమయ్యే కాగితాలు చదవటానికి ఓపిక ఉండటం అరుదు. ఇట్లాంటి పరిస్థితులలో ఈ కార్యభారాన్ని కొంత మోసి చాలా సాయపడుతున్నది.

*ప్రభుసభను గురించి చేసే ప్రతికూల విమర్శలు:* ఇట్లనేక విధాల సాహాయ్యకారిగా ఉన్న ప్రభుసభనుగురించి ప్రతికూల విమర్శలు వినవస్తున్నాయి. ప్రజారాజ్య విధానానికి వంశానుగతమైన ప్రభుసభ సభ్యత్వానికి పొత్తు కుదరదు. వ్యక్తుల యోగ్యతాయోగ్యతలతో నిమిత్తం లేకుండా వారు తమ కుటుంబాలలో ప్రథమ సంతానమైనంత మాత్రాన ప్రభుసభలో సభ్యత్వం సిద్ధించటం సమర్థనీయం కాదు. శాసన సభ్యులైన వ్యక్తికి గురుతరమైన బాధ్యత

ఉందని అంగీకరించే పక్షంలో, ఆ బాధ్యతను నిర్వహించే సామర్థ్య మొక వ్యక్తికి ఉందా, లేదా అని చూడకుండా అతనికి ప్రభుసభలో స్థానమివ్వటంలో అర్థం లేదు. వంశానుగతమైన రాజరికమెంత సమర్థనీయమో, వంశానుగతమైన ప్రభుసభా సభ్యత్వం అంత సమర్థనీయమే అని వాదించే వారు లేకపోలేదు. కాని ఈ రెండు సంస్థలు నిర్వహించే కర్తవ్యాలు ఒకే విధమైనవి కావు కనక ఈ వాదం చెల్లదని కొందరి సమాధానము. ఈ రెండు సంస్థలు నిరర్థకాలే అని, వీటిని రద్దుచేస్తే దేశానికి వృథా వ్యయం తప్పుతుందనే వారూ ఉన్నారు. మంత్రి వర్గాన్ని దేశిక్కించుకొన్న రాజకీయ పక్షం ప్రభు పదవులను అమ్మకానికి పెట్టి పార్టీకి నిధులను సంపాదిస్తుందని దేశ రాజకీయాలలో ప్రభుసభ ఉనికి అవినీతి వ్యాప్తికి దోహదమిస్తుందని ఒక వాదముంది. ఈ విషయంలో రేగిన అలజడి 1922 లో ఒక రాయల్ కమిషన్ ఏర్పాటుకు కారణమైంది. రాజరికంవల్ల దేశానికి లభ్యమయ్యే రీవికి, దర్పానికి ప్రభుసభవల్ల సొంపు పెంపులు సమకూరుతుందని ఒక వాదముంది. ఈ సొంపు ఈ దర్పం కోరటం పరిణతిచెందని పసి మనస్సులకు లక్షణమని ప్రతివాదులంటున్నారు. ప్రభుసభ సంకుచిత రాజకీయ ప్రవృత్తి గలవారి కంచుకోట అని, ఉదార రాజకీయవాదులు కూడా ప్రభువులుగా అయిన కొద్ది కాలానికే సంప్రదాయ దాసులై, అభివృద్ధి పథకాలకు అడ్డుపడేవారుగా మారటం సర్వసామాన్యంగా సంభవిస్తున్నదని, అందువల్ల ప్రభుసభను రద్దుచేయటమే శ్రేయస్కరమని విమర్శ అప్పుడప్పుడు వినవస్తున్నది ఇంగ్లండ్‌లో కన్సర్వేటివ్ పక్ష మధికారంలో ఉన్న కాలంలో మాత్రం బ్రిటిష్ ప్రభువుల సభ ప్రపంచంలోని ఏ ప్రజారాజ్యంలో ఉండే ఏ ఎగువ సభకు తీసిపోదని పార్లమెంటరీ గవర్నమెంట్ ఇన్ ఇంగ్లండ్ (Parliamentary Government in England) అనే గ్రంథంలో హెచ్. జె. లాస్కి తన అభిప్రాయం వెలిబుచ్చినాడు. అంటే దీని అర్థం ఇతర పక్షాలకు చెందిన మంత్రివర్గాలున్నప్పుడు అది అంత ఆదర్శనీయమైన రెండో శాసన సభగా పరిగణించరాదని భావము

ఇటువంటి ప్రతికూలాభిప్రాయాలున్నవారు అప్పుడప్పుడు ప్రజారాజ్య విధానానికి విరుద్ధం కాకుండేటట్లు ప్రభుసభ నిర్మాణాన్ని సంస్కరించవలెనని చాలా సూచనలు చేసినారు. ఈ సూచనలలోని సామాన్య సూత్రం వంశానుగత ప్రభువుల సంఖ్యను చాలా తగ్గించి ఎన్నుకొన్న ప్రభువుల సంఖ్యను బాగా హెచ్చించవలెనవేదే 80 ఏళ్లకు పూర్వం ప్రభుసభ సభ్యుల సంఖ్యను మూడువందలకు పరిమితంచేసి వారిలో సగం మందిని వంశానుగత ప్రభువులు ఎన్నుకోవలెనని, మిగతా వారిని దేశసేవలో పేరుపొందిన వారిని కామన్స్‌సభ ఎన్నుకోవలెనని ఒక సూచన చేసింది. ఈ సూచన కార్యరూపం దాల్చలేదుగాని, ఈ విధంగా ప్రభుసభ నిర్మాణం సవరించినట్లయితే వేరే ఇబ్బందులు సంభవించి ఉండేవి. అట్లా వచ్చిన ప్రభుసభా సభ్యులు తాము ప్రజా ప్రతినిధులమని చెప్పుకోగల్గేవారు. శక్తి, ప్రతిభ, సామర్థ్యం ఉన్న ఆ సభ్యులు కామన్స్ సభకు వంతపాడటానికి ఒప్పుకోకపోవటమేగాక, ఆ సభతో సమాన ప్రతిపత్తి, సమానాధికారాలు కోరక మానరు. ప్రభుసభ ఇప్పుడున్న విధంగా ఉన్నంతకాలం, కామన్స్ సభ దానిని తనకు ప్రతిస్పర్థిగా భావించబోదు.

ప్రస్తుతానికి ప్రభుసభ గుణాగుణాలను బేజ్‌హాట్ "ది ఇంగ్లిష్ కాన్స్టిట్యూషన్" (The English Constitution) అనే గ్రంథంలో ఈ విధంగా సంగ్రహించినాడు: "లోపరహితమైన కామన్స్‌సభ ఉంటే, ప్రభుసభవల్ల ఉపయోగమే ఉండదు. కామన్స్‌సభ

ప్రజలకు సంపూర్ణ ప్రాతినిధ్యం వహించేదే అయితే, ఎప్పుడూ ఆవేశాలకు లొంగక, హద్దు మీరక, తన ముందుకువచ్చే ప్రతిపాదనలను నెమ్మదిగా, సవిమర్శకంగా యోచించేదీ అయిన ట్లయితే ప్రభుసభ అనవసరమేకాక, అనర్థకరమూ కావచ్చు. కాని ఈనాడది తీరికగా, కామన్స్ తీర్మానాలను పునర్విమర్శ చేసే ఎగువసభగా అత్యంత అవసరము, ఉపయోగకారి అయి ఉంది''.

## కామన్స్ సభ (The House of Commons)

ఇది ద్వంద్వ శాసనసభ అయిన బ్రిటిష్ పార్లమెంట్‌లోని దిగువసభ. ప్రభువులుకాని ఇతర ప్రజాసామాన్యులచే ఎన్నికయిన ప్రజా ప్రతినిధి సభ. దీని సభ్యుల సంఖ్య 640. ఇరవై ఒక్క (21) ఏళ్ళు నిండిన స్త్రీ పురుషులందరూ వీరి నెన్నుకోవటానికి హక్కున్న వోటర్‌లు తాను వోటర్‌గా నమోదైన నియోజకవర్గంలో 3 నెలలకు తక్కువ కాకుండా ఒక వ్యక్తి నివసించి ఉండవలె. న్యాయశాస్త్రము పేర్కొన్న అనర్హతలు లేనివారు మాత్రమే వోటర్‌లుగా ఉండటానికి అర్హులు సామాన్య జనులందరికి ఉన్న ఒక్క వోటేగాక, విశ్వ విద్యాలయ పరీక్షలలో ఉత్తీర్ణులైన వారి, లేదా వ్యాపారార్థం ఏటా పదిపౌన్‌ల బాడుగ వచ్చే గృహమున్న వారికి అదనంగా ఒక్క వోట్ ఉన్నది ఏ సందర్భంలోనూ ఏ పౌరునికి రెండు వోట్లకంటె ఎక్కువ ఉండవు. అయిదేళ్ల కాలానికి కామన్స్ సభను ఎన్నుకొన్నా, అంతకు ముందుగా అది రద్దు కావచ్చు.

## కామన్స్‌సభ అధికారాలు

1. *శాసనాధికారాలు:* గ్రేట్ బ్రిటన్, ఉత్తర ఐర్లండ్, డొమినియన్‌లుగాని బ్రిటిష్ కాలనీల కన్వయించే ఏ శాసనమైనా చేయటానికి బ్రిటిష్ కామన్స్‌సభ కున్న అధికారానికి సిద్ధాంతరీత్యా పరిమితి లేదు. కాని పార్లమెంట్ ఆమోదించి పంపిన శాసనాన్ని రాజు తిరస్కరించవచ్చు. ఆర్థిక సంబంధంలేని చట్టాన్ని, ఒక సంవత్సరకాలం శాసనం కాకుండా ప్రభు సభ ఆపి ఉండవచ్చు. రాజ్యాంగ సంప్రదాయం ప్రకారం రాజు నిషేధము చాలా కాలంగా మూలబడి ఉన్నది ప్రజాసభ గాఢంగా కోరినదానిని వివరికి శాసనం గాకుండా ప్రభుసభ ఏ విధంగాను చేయలేదు. ఇండియాలోను, అమెరికాలోను ఉన్నట్లు శాసనసభ ఆమోదించిన చట్టాన్ని న్యాయస్థానం రాజ్యాంగ విరుద్ధమని కొట్టివేయనూ లేదు. సిద్ధాంతంలో శాసనాధికారం కామన్స్ సభదే అయినా, ఆచరణలో మాత్రం అది మంత్రిమండలిదే అని చెప్పవలసి ఉంటుంది. కామన్స్‌లో శాసనాలయ్యే చిత్తు చట్టాలలో నూటికి 85 వంతులు మంత్రిమండలి సిద్ధంచేసి ప్రతిపాదించినవే. మిగిలిన 15 వంతులు మాత్రమే సభ్యులు తమంత తాము ఉపపాదించేవి.

2. *మంత్రిమండలిపై కామన్స్‌సభ పెత్తనము:* సిద్ధాంతంలో మంత్రిమండలిని తొలగించే అధికారం శాసనసభ కుంది. కాని ఆచరణలో మాత్రం మంత్రిమండలి ఏమి చేసినా శాసనసభ దానిని తొలగించటం చూడము. కాని ప్రభుత్వ విధానంపై చర్చలు జరిపి, ప్రశ్నలువేసి, పార్లమెంటరీ కమిటీలో విమర్శలుచేసి పరిపాలనా విధానంపైని, ప్రభుత్వ కార్యకలాపంపై శాసనసభ ఒత్తిడి తెస్తూ ఉన్నది.

3 *ఆర్థిక విధానంపై, ఆర్థిక పరిపాలనపై శాసనసభ పెత్తనము:* ప్రభుత్వానికి ఏ యే విధాల ఆదాయం సమకూర్చవలెనో, ఏ యే విధాల దానిని వ్యయం చేయవలెనో నిర్ణయించటమేగాక, తమ నిర్ణయాల ప్రకారం ఆదాయం వ్యయమయిందీ లేనిదీ లెక్కలు సరిచూసి నివేదికలు సమర్పించేటట్లు చేసే అధికారం శాసనసభకున్నదిగాని వ్యయాన్నిగురించి కామన్స్‌సభ చేసే సూచనలకు మొత్తం మీద లోబడినా, వ్యయ వివరాలు విధిగా మంత్రిమండలి ఆధీనంలోనే ఉన్నాయి.

4 పరిపాలనలోని బాగోగులనుగురించి ప్రజాభిప్రాయాన్ని తెలియజేసే పరిపాలనాంగం కామన్స్‌సభ.

5. *సమర్థులైన పరిపాలకులను శిక్షణ ఇచ్చే సంస్థ కామన్స్‌సభ:* సభలో జరిగే చర్చలలో సభ్యుల తెలివితేటలు రాజకీయ పరిజ్ఞానము, సామర్థ్యం బయటపడుతున్నాయి. పదనెక్కుతున్నాయి. వాటినిబట్టి రాజకీయనాయకులు వివిధ పరిపాలనా శాఖలకు అర్హులైన మంత్రులను ఏరుకోగలుగుతున్నారు, అనటం నిజమేగాని కొంత కాలంగా ఈ నిజం పార్టీ నాయకుల దుష్టత్వం మాటున మరిగిపోతున్నది. కామన్స్ సభకు వెలపల సాగుతూండే రాజకీయ ప్రచారంలో, వివాద కోలాహలంలో వ్యక్తుల రాజకీయపాటవం బలపడటానికి, నిగ్గుదేలటానికి కావలసినంత అవకాశం లభిస్తున్నది.

శాసన సభాధికారాలు ఇట్లా పలువిధాల మంత్రిమండలి భల్లూకపు పిడికిలిలో చిక్కుకొన్నా, వ్యవహారంలో కామన్స్ సభకు మిగిలఉన్న అధికారాలివి. 1 తమ విశ్వాసాన్ని చూరగొన్న మంత్రిమండలి ఏర్పడేటట్లు చూసి, అది పదవిలో నిల్చి ఉండటానికి సాయం చేయటం, 2. పరిపాలన వక్రగతులు పట్టినట్లు తోచినప్పుడు, విమర్శించి, ప్రజాభిప్రాయానుకూలంగా అది నడిచేటట్లు చూడటం, 3 ప్రజల కష్టనిష్ఠురాలను ప్రభుత్వానికి వెల్లడిచేయటం

## మంత్రిమండలి కామన్స్‌సభను తన అధీనంలో ఉంచుకొన్న విధము

కామన్స్ సభ ఆమోదించే చిత్తు చట్టాలలో నూటికి 85 వంతులు మంత్రిమండలి ప్రతిపాదించినవే వాటిని తీర్చి దిద్దటంలో ప్రధానపాత్ర కాబినెట్‌దే అని వేరుగా చెప్పనక్కరలేదు. ఎనిమిదింట ఏడు వంతులు కామన్స్ సభ తన కాలాన్ని ప్రభుత్వం ప్రతిపాదించే చట్టాల కోసం వినియోగిస్తున్నది. అదీ చాలక, అవసరమైతే దినానికి ఎక్కువ గంటలు కామన్స్ సభ పనిచేసేటట్లు సభ్యుల అనుజ్ఞను మంత్రిమండలి పొందగలదు ప్రభుత్వేతర పక్షాలు ఉపపాదించటానికి ప్రత్యేకించిన కాలాన్ని కూడా సభవారి అనుమతితో మంత్రిమండలి తాను ప్రతిపాదించే శాసనాలను చర్చించటం కోసం వినియోగించగలదు. పార్లమెంటరీ కమిటీలు ఇంచుమించు అన్నీ మంత్రిమండలి చిత్తు చట్టాలకే ప్రథమ స్థాన మిస్తున్నాయి. ఈ చట్టాలను కామన్స్ సభలో ప్రవేశ పెట్టినప్పుడు ప్రభుత్వ పక్ష సభ్యులు తీవ్రంగా విమర్శించటం సామాన్యంగా జరగదు. వారిలో కొందరు ప్రభుత్వం ద్వారా అనుగ్రహంవల్ల కొన్ని లాభాలు పొందేవారు. స్వార్థచింత వారిని ఎట్లాంటి సందర్భంలోను ప్రభుత్వానికి వ్యతిరేకంగా వోట్ చేయనివ్వదు. కామన్స్ సభ్యులందరూ ప్రతికూల పక్షం వారైనాసరే మంత్రివర్గాన్ని ఎంత విమర్శించినా, దానిని ఓడించి తమ ఒత్తిడివల్ల పార్లమెంట్‌ను రద్దు చేయించేటంత దూరం పోరు, సాధారణ ఎన్నిక జరపటమే సంభవిస్తే పార్టీ అభ్యర్థులుగా పార్టీ నాయకులు

తమను ఈసారి నిలబెట్టక పోవచ్చు. నిలబెట్టినా, ఎన్నికలకోసం దుర్భరవ్యయం నెత్తిపై వేసుకోవటానికి ఎవ్వరూ ఇష్టపడరు. ఎన్నికకు ఈ కాలంలో 1000 పౌన్ల నుంచి 1500 పౌన్ల దాకా వ్యయం తప్పదు వ్యయమైనా గెలుపు తప్పదన్న నమ్మకం లేదు. ఇంతా చేసీ, తమకు ప్రతిపక్షులైన వారి విజయానికి తాము సహాయపడినవార్లు కావచ్చు. బ్రిటన్‌లోని మధ్య తరగతి జనం తమ మేలు, కీడులు చక్కగా చూసుకోగలిగినవారు. నాయకుని పేరు చెప్పి, పార్టీ పేరు చెప్పి, వారి కళ్లకు గంతలుగట్టి, గోతిలో తోయటానికి వీలువేదు రాజకీయ నినాదాలు మంత్రాలై పనిచేసి ఆ దేశంలో వోట్‌లను రాల్చవు అందువల్ల కామన్స్ సభ్యులు మంత్రివర్గ సృష్టికర్తలైనా ఆ మంత్రిమండలి పాడే పాటకు అనుగుణంగా తాళం వేసే వారుగా ఉన్నారు ప్రభుత్వం నిషేధించే ఆర్థిక ప్రతిపాదనలు సామాన్యంగా ఓటమి పొందవు వ్యక్తిగతంగా సభ్యులు ఆర్థిక ప్రతిపాదనలు చేయటానికి వీలులేదు మంత్రులు కోరే మొత్తాలను తగ్గించవచ్చేగాని, హెచ్చించటానికి వీలులేదు కాని తగ్గించటం ఎప్పుడూ జరగదని అనవచ్చు. తగ్గించవలెనని ప్రతిపాదనలు చేసేది, 'ప్రభుత్వచర్యనో, విధానాన్నో, విమర్శించటానికి అవకాశం కల్పించుకోవటానికేగాని, ప్రభుత్వాన్ని పడగొట్టటానికే మాత్రం కాదని గ్రహించవలె అసలీ రోజులలో ఏదో ఒక సాంఘిక ప్రయోజనానికై ప్రభుత్వ మింకా ఖర్చు పెట్టవలెనని అడిగేవారేగాని తదన్యులెవరూ లేరు. అందరికి జీవితావసరాలు విపరీతంగా పెరిగి పోతున్న కాలమిది సామ్యవాద వ్యాప్తి ప్రభుత్వాన్ని బహుముఖమైన కార్యకలాపాలను చేపట్టవలెనని ప్రోత్సహిస్తున్నది. బహు వ్యయసాధ్యమైన క్లిష్టమైన ప్రణాళికలు మంత్రిమండలి నిర్వహించవలసి రావటంతో వాటి వివరాలలోకి కామన్స్ సభ్యులంతగా చొరబడరు ప్రజల జీవితంపై, రాజకీయాలపై మంత్రిమండలి ఆధిపత్యానికి మరో కారణముంది ప్రజారాజ్యంలో సార్వభౌమత్వం అయిదేళ్లకోసారి పార్లమెంట్ సభ్యులను ఎన్నుకోవటంతో తృప్తిపడవలసిన ప్రజా సమూహంలో ఒక భాగమైన వోటర్‌లదా? సంవత్సరానికి ఆరునెలలు ఇంట్లో కూర్చుండే పార్లమెంట్ సభ్యులదా? అహోరాత్రాలూ, అయిదేళ్ళకాలమూ, అధికారంలో ఉండి దేశాన్ని పరిపాలించే మంత్రిమండలిదా? ఈ ప్రశ్నకు సమాధానంలోనే మంత్రిమండలి అపరిమితాధికారానికి కారణం నిలిచి ఉంది. ఏ నిమిషంలో ప్రజలపై ఏ భయాన్ని, భారాన్ని వార్లు వేయనున్నారో, అది వార్లు బహిరంగపరచేవరకూ తెలుసుకోవటానికి ఎవ్వరికీ వీలుండదు. వేయికళ్ళతో ప్రభుత్వ చర్యలను కనిపెడుతూ ఉండే వార్తా పత్రికల వారి నిరంతర కృషి వల్లనే ఎప్పుడైనా కొద్దిగా పరిపాలనా రహస్యం బయటికి పొక్కేది ఈ వార్తా పత్రికలు ప్రజా రాజ్యానికి హృదయస్థానం వంటివి. ఇవి లేకుంటే అధికారం రుచిమరిగిన మంత్రివర్యులకు పట్టపగ్గాలుండవు. ప్రజారాజ్యమనే రథంలో సుఖాసీనులై ఊరేగేవారు ప్రజలు. వారెన్నుకొన్న సారథి పార్లమెంట్. ఆ రథాన్ని లాగే గుర్రాలు మంత్రులు. సిడ్నీలో అనే ప్రసిద్ధ రచయిత ఈ పార్లమెంట్ సభ్యులను ఇట్లా చిత్రించినారు: "వారు బహువిధ వ్యాసంగాలలో మున్గి ఉంటారు. కామన్స్ సభ్యులలో సగం మంది తమ విధినిర్వహణలో శ్రద్ధవహించేవారు మిగిలిన సగం వినోదాలలో లీనమై ఉంటారు. చలి పీచేకొద్దీ, గాలి వేడెక్కే కొద్దీ. లండన్ పట్టణం అందిచ్చే సుఖసంతోషాల మత్తిడిలో, పార్లమెంట్ సభ్యులుగా తాము నిర్వర్తించవలసిన విధులకు కట్టుబడి ఉండటం వారికి మరింత కష్టమవుతుంది." "పార్లమెంటరీ విధానం మంత్రుల నిరంకుశత్వానికి తోడ్పడేదే అయినా ఆ నిరంకుశత్వంలో జాపరికం లేదు. ప్రజల

విమర్శలకు నిరంతరం గురిఅవుతూ ఉండేది అది." ఈసారి ఎన్నికలలో పదవినుంచి పడి పోతామేమో అనే భయం వారిని అదుపులో ఉంచి, ప్రజాభిప్రాయం ఏవైపు మొగ్గుతుందా అని ఎల్లప్పుడు గమనించేటట్లు చేస్తుంది.

*పార్లమెంట్ శాసనాలు చేసే విధము:* అధికారపక్షం మాట సాగటానికి ఎట్లా అను కూలిస్తున్నదో ముందు కొంత చెప్పటమయింది మంత్రులు ప్రతిపాదించేవి ప్రభుత్వ చట్టాలు (Government bills). శాసనసభ్యులు ప్రతిపాదించేవి ప్రైవేట్ సభ్యుల చట్టాలు (Private members' bills). మరోవిధంగా కూడా చిత్తు చట్టాలను విభజిస్తున్నారు : 1. పబ్లిక్ చట్టాలు 2. ప్రైవేట్ చట్టాలు. ప్రజలందరికిగాని, అనేకులకుగాని అన్వయించేవి పబ్లిక్ చట్టాలు ఒక వ్యక్తికిగాని కొందరు వ్యక్తుల సమూహానికిగాని (a company), ఒక ప్రదేశానికిగాని అన్వయించే చట్టాలు ప్రైవేట్ చట్టాలు.

పబ్లిక్ చట్టాలు దిగువదశలు గడవవలసి ఉన్నాయి

1. శాసనసభకు నివేదించే దశ : నివేదించటాన్ని ఎదిరించటం సామాన్యంగా ఉండదు. అది అంతట ముద్రణకివ్వటం జరుగుతున్నది. 2 చట్టాన్ని రెండోసారి చదవటం (Second Reading of the Bill). చట్టం వివరాలలోకి సభ్యులు పోరాదుగాని ఆ చట్టం వెనక ఉన్న మూల సూత్రాలను గురించి వారు చర్చిస్తారు.

2. కమిటీ దశ. మూలసూత్రాలు ఆమోదంపొందిన చట్టాలు ఆ యా నిర్ణీతమైన కమిటీలకు పంపుతారు. కమిటీలో చిత్తు చట్టం పూర్తిగా చర్చించి, అవసరమైనచోట్ల సవరించి పార్లమెంట్ సభకు నివేదిస్తారు.

4. రిపోర్టు దశ (Report Stage). ఈ దశలో నివేదించిన చట్టానికి ఏ సభ్యుడైనా సవరణలు ప్రతిపాదించవచ్చు.

5. మూడోసారి చట్టాన్ని చదవటం (Third Reading of a Bill). ఈ దశలో ఎక్కడైనా ఒకమాట మార్చవచ్చుగాని చట్టాన్ని సవరించటానికి వీలు లేదు. దానిని ఆమో దించనైనా ఆమోదించవలె లేదా నిరాకరించనూ వచ్చు.

6 ఆరోదశలో, కామన్స్ ఆమోదించిన చట్టాన్ని ప్రభుసభకు పంపగా అది ఆ పై సభలో దిగువసభలో గడిచిన దశలన్నీ గడిచి 7. చివరకు రాజు ఆమోదానికై పంపుతారు అతడు స్వయంగా తన ఆమోదాన్ని తెలపవచ్చు. కాని అతడు నియమించిన కొందరు కమిష నర్లు చట్టం రాజామోదంతో శాసనమైందని ప్రకటిస్తారు. ఆ విధంగా ప్రకటించనటువంటి చట్టాలను సక్రమంగా చేసిన శాసనాలుగా బ్రిటిష్ న్యాయస్థానాలు భావించవు ; అమలు పరచవు.

*ప్రైవేట్ చట్టాలు:* చిత్తు చట్టాన్ని పిటిషన్‌తో జతపరిచి, ఆ విధమైన పిటిషన్‌లు చూసే పరీక్షకునికి సమర్పించవలె. ఆ చిత్తు చట్టం వార్తా పత్రికలలో ప్రచురితమయిందా, గజెట్‌లో ప్రకటించినారా, ఆ చట్టంవల్ల నష్టపడే వారికి దానినిగురించి నోటీస్‌లు పంపినారా, మొదలైన ప్రశ్న లడిగి, సమాధానాలు పరీక్షకునికి నచ్చితే అది శాసనసభకు సమర్పిస్తారు. రెండోసారి చదవటం కాగానే దాని కెవరు అభ్యంతరం చెప్పకున్నా, అభ్యంతరం లేని చిత్తు చట్టాల కమిటీకి దానిని పంపుతారు. అభ్యంతరం ఉన్నదైనా, దానిని ప్రైవేట్ బిల్లుల కమిటీకి

పంపుతారు. దానిలో సామాన్యంగా నలుగురు సభ్యులుంటారు. సాక్షుల వాఙ్మూలాలు, న్యాయ వాదుల వాదాలు విని ఆ కమిటీ దానిని పరీక్షిస్తుంది. తరవాత అది పబ్లిక్ బిల్లులవలెనే ఇతర దశలు గడిచి శాసనమవుతుంది.

*పార్లమెంటరీ కమిటీల విధానము:* కామన్స్ సభకు సంబంధించిన కమిటీలు అయిదు. సెషనల్ కమిటీలు; స్థాయీ సంఘాలు; ప్రత్యేక కమిటీలు; శాసన సభ్యులందరూ సభ్యులైన కమిటీ; ప్రైవేట్ బిల్ కమిటీలు (Private Bill Committees).

కామన్స్ సభ ఒక్కొక్క సమావేశకాలానికి పరిమితమైన సంఘాలను (Sessional Committees) ఎన్నుకొంటుంది - ఉదా: స్థాయీ సంఘాలకు సభ్యులను ఎన్నుకొనే కమిటీ; ప్రైవేట్ చట్టాల కమిటీ, పబ్లిక్ అకౌంట్ల కమిటీ మొదలైనవి

స్థాయీ సంఘాలు అయిదు వీటిలో ఒకటి స్కాటిష్ వ్యవహారాలను పర్యాలోచించేది కామన్స్ సభలోని స్కాటిష్ నియోజకవర్గాల ప్రతినిధులందరూ, సెలెక్షన్ కమిటీ ఎన్నుకొనే 10 నుంచి 15 మంది ఇతర సభ్యులతో కూడి ఇది ఏర్పడుతుంది. మిగతా నాలుగు స్థాయీ సంఘాలను సెలెక్షన్ కమిటీ వారే నియమిస్తారు ఈ సంఘాల సభ్యుల సంఖ్య 30 నుంచి 50 వరకు ఉంటుంది. స్థాయీ సంఘాలకు కామన్స్ సభలోని వివిధ రాజకీయపక్షాలకు చెందిన వారిని, ఆ యా పక్షాల సంఖ్యా బలముండే నిష్పత్తిలో నియమిస్తారు మంత్రిమండలి ప్రతిపాదించే చిత్తు చట్టాలను ఏ స్థాయీ సంఘానికి పంపించేది కామన్స్‌సభ సభాపతి (స్పీకర్) నిర్ణయిస్తాడు.

*సెలెక్ట్ కమిటీలు:* ఒక్కొక్క దానిలో సభ్యుల సంఖ్య 15. వీరిని ఎన్నుకొనేది కామన్స్ సభవారు ఏ సభ్యులైనా సెలెక్ట్ కమిటీ సభ్యుల పేర్లను ప్రతిపాదించవచ్చు. కామన్స్ సభ ముందున్న, లేదా ఆ సభకు పంపనున్న ఏ చిత్తు చట్టాన్నైనా పరిశీలించటానికి ఈ సెలెక్ట్ కమిటీల నేర్పాటు చేస్తున్నారు. పరిశీలన కాగానే ఆ పరిశీలన కేర్పడిన సెలెక్ట్ కమిటీ అంతరిస్తుంది. సెలెక్ట్ కమిటీకి దాని పరిశీలనకవసరమని తోచేవారిని పిలిచే అధికారమూ, అవసరమైన కాగితాలు, రికార్డులను దాఖల్ చేయమని కోరే అధికారమూ ఉంది.

*కామన్స్‌సభకూ, స్థాయీ సంఘంగా పనిచేసే కామన్స్‌సభకూ ఉన్న వ్యత్యాసము:* కామన్స్‌సభ సభాపతి (Speaker) ఆ సభ స్థాయీ సంఘంగా మారినప్పుడు దానికి అధ్యక్షత వహించడు కొత్తగా పార్లమెంట్ ఏర్పడగానే తన స్థాయీ సంఘాధ్యక్షుని అది ఎన్నుకొంటుంది. స్థాయీ సంఘం సమావేశం కాగానే సభాపతి (Speaker) అధికార వేత్రము (mace) అతని మేజాపై ఉంచుతారు. స్థాయీ సంఘంలో చర్చా నిబంధనల పట్టింపు అంతగా ఉండదు ధన సంబంధమున్న శాసనాలను చర్చించే అధికారం ఈ స్థాయీ సంఘానికి మాత్రమే ఉంది. ప్రైవేట్ సభ్యులు ప్రతిపాదించే చిత్తు చట్టాలను విచారించే సంఘాల సభ్యులు నలుగురికి మించి ఉండరు. వీటిని నియమించేది సెలక్షన్ కమిటీ. కామన్స్ సభ్యులు ప్రతిపాదించే చిత్తు చట్టాలు శాసనాలయ్యే క్రమంపైన చెప్పటం జరిగింది.

## ఆర్థిక విషయాలపై కామన్స్ సభకున్న అధికారము

ఏ యే పన్నులను విధించవలెనో, ప్రభుత్వాదాయాన్ని ఎట్లా వ్యయం చేయవలెనో ఆ నిర్ణయం చేసే అధికారము, ఆదాయ, వ్యయ పరిశీలనాధికారము, ప్రభుత్వాదాయాన్ని

ప్రభుత్వం వెచ్చించవలసిన విధానాన్ని విమర్శించే అధికారము – ఈ నాలుగు కామన్స్ సభకున్న ఆర్థికాధికారాలు.

వివిధ మంత్రిత్వ శాఖలు తమ అవసరాలనుగురించి పంపిన అంచనాల నాధారం చేసుకొని ఎక్స్‌ఛెకర్ ఛాన్సలర్ ఆధిపత్యంలో ప్రభుత్వ కోశాధికారులు ప్రభుత్వాదాయ వ్యయ పట్టికను సిద్ధపరిచి ఫిబ్రవరి మాసాంతంలోగాని మార్చి నెల ఆరంభంలోగాని కామన్స్‌సభకు నివేదిస్తున్నారు. ఆ సభ వెంటనే సప్లై కమిటీ (Supply Committee) గాను, వేస్ అండ్ మీన్స్ (Ways and Means) కమిటీగాను మారి మొదటిది వ్యయాన్ని గురించిన అంచనాలను, రెండోది దానికోసం కావలసిన ఆదాయాన్ని ఏ యే పన్నులవల్ల ఏ రీతి రాబట్టవలసిందీ నిశ్చయించి తమ నివేదికలను కామన్స్ సభకు పంపుతున్నాయి. ఈ నివేదికల నాధారం చేసుకొని కామన్స్‌సభ (i) ఆర్థిక చట్టం (Finance Act), (ii) ఉపకల్పన చట్టం (Appropriation Act) అనే రెండు చట్టాలను చేస్తున్నది. ఏ సందర్భంలోను కంప్ట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ (Comptroller and Auditor-General) అనుమతి లేనిదే ధనం చెల్లించటానికి వీలులేదు ఈ ఉద్యోగిని ప్రభుత్వం నియమించినా, పార్లమెంట్‌లోని రెండు సభలూ అతనిని తొలగించమని రాజుకు నివేదిస్తూ తీర్మానిస్తేగాని తొలగించరాదు. కామన్స్‌సభ కమిటీ ఒకటి పబ్లిక్ అకౌంట్స్ కమిటీ (Public Accounts Committee) అనేది సమావేశమై సంవత్సరం లెక్కలను పరిశీలించి కామన్స్‌కు నివేదించవలసి ఉంది ప్రశ్నల సమయంలోను, చర్చా కాలంలోను సక్రమంగా ప్రభుత్వం వ్యయం చేయకపోతే విమర్శించే అవకాశం కామన్స్ సభ్యులకు దొరకుతుంది. కాని అప్రొప్రియేషన్ చట్టాన్ని జూలై మాసాంతానికిగాని కామన్స్‌సభ ఆమోదించనందువల్ల ఏప్రిల్ మొదటి తేదీనుంచి నాలుగు నెలలలో జరిగే వ్యయాన్ని దాని బాగోగులనుగురించి చర్చించకుండా ముందే జమాఖర్చుల ఓటు (Vote on account) మంజూరు చేసినట్లవుతున్నది. పబ్లిక్ అకౌంట్స్ కమిటీ నిర్దాక్షిణ్యంగా పక్షపాతరహితంగా పనిచేయవలెననే ఉద్దేశంతో ప్రభుత్వ ప్రతిపక్షాలలోని ప్రముఖుని ఒకరిని దాని కధ్యక్షుని చేస్తారు

ప్రభుత్వ వ్యయంలో కొన్ని అంశాలు కామన్స్‌సభ ప్రత్యేకించి ఏటేటా మంజూరు చేయనివి ఉన్నాయి: (i) జాతీయ ఋణంపై చెల్లించే వడ్డీ, (ii) సివిల్ లిస్ట్ అనే పేరుతో రాజకుటుంబ వ్యయం (iii) న్యాయాధిపతుల వేతనాలు, వీటి కవసరమయ్యే ధనము మొత్తంగా కన్సాలిడేటెడ్ నిధి (Consolidated fund) అనే పేర ప్రభుత్వపరంగా ఇంగ్లండ్ బాంక్ (Bank of England)లో ఉంచుతున్నారు.

కామన్స్‌సభకున్న ఆర్థికాధికారం ఎలా పరిమితమయిందని మొత్తంగా చెప్పవచ్చు. మంత్రులు కోరే పన్నులను, వ్యయం పద్దులను మంజూరుచేసే అధికారం, వాటిని తగ్గించే అధికారం, నిరాకరించే అధికారం కూడా కామన్స్‌సభకుండిగాని, నిరాకరించటం సామాన్యంగా జరగబోదు. సాధారణ ఎన్నికలవల్ల సిద్ధపడితేగాని నిరాకరించేటంత దూరం కామన్స్‌సభ పోదు. కొత్త పన్నులనుగాని; ఉన్న పన్నులనూ మంత్రులు కోరిన పన్నులను హెచ్చించడాన్నిగాని ప్రతిపాదించే అధికారం కామన్స్ సభ్యులకు లేదు. ఏ పరిపాలన శాఖకు ఏ ప్రజావసరానికి ఎంత ధన మవసరమయ్యేది పరిపాలక వర్గానికి తెలిసినట్లు కామన్స్ సభ్యునికి తెలిసి ఉండటానికి వీలులేదు. సప్లై కమిటీ సభ్యులుగా, వేస్ అండ్ మీన్స్ కమిటీ

(Ways and Means Committee) సభ్యులుగా జాతీయ ఆదాయ వ్యయాలను ఒక దాని కొకటి సరిపుచ్చి, నిర్ణయించటంలో కామన్స్ సభ్యులు పాత్ర వహించటమేగాక ఆర్థిక చట్టం (Finance Act), ఉపకల్పన చట్టం (Appropriation Act) ఆమోదిస్తారు. తమకు బాధ్యతవహించే కంట్రోలర్ అండ్ ఆడిటర్ జెనరల్ ద్వారా శాసన విరుద్ధంగా ధన వ్యయం కాకుండా చూడగలగటమేగాక, పబ్లిక్ అకౌంట్స్ కమిటీ సభ్యులుగా ఆదాయవ్యయాల లెక్కలను పరిశీలించి, శాసన సభ్యులుగా కామన్స్ చర్చల మూలంగా, ప్రశ్నల మూలంగా జాతీయాదాయం వ్యయమయ్యే విధానాన్ని విమర్శిస్తారు.

యథార్థానికి కామన్స్ సభ అనుభవించే ఆర్థికాధికారం అంతంత మాత్రమే నన్నమాట మరవరాదు ఈ స్థితికి చాలా కారణాలున్నాయి కామన్స్ సభ్యులంతా కమిటీగామారి పని చేయ పూనుకొన్నప్పుడు ఆదాయ వ్యయాలనుగురించి అంచనాలు వారిలో అనేకులకు అర్థం గావు. సమావేశమైనవారు చాలామంది కాపట్నంవల్ల ఉపయోగించే విధంగా, ఆ సభలో చర్చ లుండవు. ఆదాయ, వ్యయాల అంచనాలను సాకల్యంగా చర్చించే అవకాశం లభించదు. మంత్రివర్గం ప్రతిపాదించే పద్దులను తగ్గించినా, నిరాకరించినా, అది విశ్వాస రాహిత్య తీర్మానంగా భావించగలమని బెదిరించినా చాలు సాధారణ ఎన్నికకు జంకి కామన్స్ సభ్యు లా విధంగా చేయరు. అంతేగాక కామన్స్‌లో అధిక సంఖ్యాకులకు ఆర్థిక విషయాలలో శ్రద్ధ సామాన్యంగా ఉండదు ఎడ్మండ్ బర్క్ సుదీర్ఘమైన తన ఉపన్యాసానికి పూనుకోగానే కామన్స్‌లో అధిక సంఖ్యాకులు భోజనాలకు లేచేవారంట ఆ కాలానికి ఈనాటికి కామన్స్ వ్యవహారాలలో సభ్యులు చూపే శ్రద్ధ విషయంలో మార్పేమీ లేదు కామన్స్ చర్చలంటేనే అనేకులకు విసుగు. కామన్స్ సమావేశమై ఉండే ఆరు నెలల కాలంలో నగరంలో చక్కబెట్టుకోవలసిన పనులు వారికెన్నో ! సభా భవనాన్ని అంటి ఉండే గదులలో తిని, తాగి, విశ్రాంతి తీసుకొనే వా రెంతమందో ! ఏ తీర్మానంపై వోట్ చేయవలసిన సమయం వచ్చినా పార్టీ విప్పు (Party-Whip) వచ్చి, వారిని సభా భవనానికి తీసుకొనిపోవడం సర్వసామాన్యమైన దృశ్యము ఇంతకూ, శాసనాలుచేసే విషయాలలో అయినట్లే, ఆర్థిక విషయాలలోను, ప్రభుత్వ పక్ష విధానాలను, కార్యకలాపాలను నిర్ణయించేది, నిర్వహించేది ప్రధానంగా ఆ పార్టీ నాయక శ్రేష్ఠులతో గూడిన మంత్రిమండలేగాని కామన్స్ సభ కాదు. కామన్స్ సభ నిర్వహించే పాత్ర అతి స్వల్పమని దీని సారాంశము.

## కామన్స్ సభాపతి (Speaker)

రాజు అడిగిన దానికి బదులు చెప్పడానికి తమలో ఒకరిని కామన్స్‌సభ ఎన్నుకోవటం చిరకాలంగా వస్తున్న ఆచారమే కాని, 1876 లో సమావేశమైన 'ది గుడ్ పార్లమెంట్' (The Good Parliament) తో స్పీకర్ పదవి ఆరంభమయిందని చెప్పవచ్చు. పది వారాల పాటు పార్లమెంట్ సాగటం అంతకుముందెన్నడూ జరగలేదు. ఆ పది వారాలు కామన్స్ సభ తనకు ప్రతినిధిగా సర్ పీటర్ డిలామేర్‌ను ఏ రోజు కా రోజు ప్రభు సభకు ఎన్నుకొని పంపటం జరిగింది కాని, అతనికి స్పీకర్ అని మాత్రం పిలవలేదు. 1877 తరవాత ఏర్పడిన పార్లమెంట్‌లో హంగర్‌ఫర్డ్ స్పీకర్ అనే పేరుతో కామన్స్ ఎన్నుకొంది. డిలామేర్ మార్చ్ ప్రభువు స్టీవర్డ్ (ఆస్తిపాస్తులు చూసే ఉద్యోగి); హంగర్‌ఫర్డ్ లెంకాస్టర్ ప్రభువు స్టీవర్డ్

డీలామేర్ హన్‌గర్‌ఫర్డ్ లిద్దరు వారి యజమానుల పక్షాన కామన్స్ సభను తమ అధీనంలో ఉంచుకొనే వారు. లెంకాస్ట్రియన్ రాజుల కాలంలో పార్టీ రాజకీయాలలో ప్రముఖ పాత్రను స్పీకర్‌లు నిర్వహించే వారు. ఆ కారణాన తమ పక్షం పతనం కాగానే వారు అధోగతి పాలయ్యేవారు.

ట్యూడర్‌ల కాలంలో రాజోద్యోగులు స్పీకర్లయ్యేవారు. రాజు సూచించిన వారినే కామన్స్ సభ స్పీకర్‌గా ఎన్నుకొనేది తన ఉద్యోగంతోబాటు స్పీకర్ పనీ చూసినందుకు అతనికి ప్రతి సెషన్‌కు నూరు పౌన్‌లు అదనంగా ఇచ్చేవారు ఈ విధంగా ట్యూడర్‌లు కామన్స్ సభను తమ చెప్పుచేతలలో ఉంచుకో చూసేవారు. ఇదే విధంగా మొదటి ఛార్లెస్ కాలంలోను, ఆలివర్ క్రామ్‌వెల్ కాలంలోనూ జరిగింది. రెండో ఛార్లెస్ రాజుగా ఉండగా పార్లమెంట్ మూడోసారి సమావేశమైనప్పుడు కామన్స్‌కు రాజుకు ఘర్షణ జరిగి తమ సభా పతిని కామన్స్ సభ స్వేచ్ఛగా ఎన్నుకోవచ్చునని రాజంగీకరించినాడు. కాని ఆనీ రాణి కాలంలోను, మొదటి ముగ్గురు హనోవేరియన్‌లు పరిపాలించినప్పుడూ స్పీకర్‌ను కామన్స్ సభ స్వేచ్ఛగా ఎన్నుకొనకుండా రాజులు అడ్డు తగలటం మానలేదు అయితే బహిరంగంగా స్పీకర్ ఎన్నికలో రాజు కలగచేసుకోవటం 1694 తో అంతమయింది రాజు అభిమానించిన వ్యక్తిని కాదని, కామన్స్ సభ ఫాలే (Foley) ని తన స్పీకర్‌గా ఆ సంవత్సరం ఎన్నుకొంది. ఈ పాల్‌ఫాలే తన స్వాతంత్ర్యాన్ని అతిగా ప్రదర్శించేవాడు. పార్లమెంట్ కమిటీల చర్చలలో ఇతని జోక్యం చాలా హెచ్చుగా ఉండేది 1728-1761 మధ్యకాలంలో స్పీకర్ ఆర్థర్ ఆన్‌స్లో తన స్వాతంత్ర్యాన్ని చాలా దూరం తీసుకొనిపోయినాడు కామన్స్ సభ్యుల చర్చా స్వాతంత్ర్యాన్ని రక్షించటంలో ఎంతో శ్రద్ధ చూపించినాడు. మైనారిటీ పక్షాలకుచెందిన సభ్యుల హక్కులను నిర్భయంగా మోమోటాలకు లొంగకుండా కాపాడేవాడు. నౌకాదళానికి కోశాధికారిగా ఉన్న కారణంవల్ల రాజు ఇచ్చకానికి ఒక తీర్పు చెప్పినాడని ఆక్షేపణ రాగా వెంటనే ఆ పదవికి ఇతడు రాజీనామా జేసిన ధీరుడు. తరవాత వచ్చిన స్పీకర్‌లు సమకాలంలో ఇతర ప్రభుత్వోద్యోగులుగా ఉండటం మానుకోలేదు. 19 వ శతాబ్దారంభంలో కూడా స్పీకరైనా అబట్ ఐరిష్ ఉద్యోగమండలిలో (చేయవలసిన పని లేకున్నా మంచి జీతముండే) ఒక కొలువులో ఉన్నాడు. ఆన్‌స్లో స్వాతంత్ర్య ప్రియత్వాన్ని మెచ్చి, 1761 లో అతడు స్పీకర్ పదవి నుంచి విరమించినప్పుడు కామన్స్ సభవారు అతనికి మూడువేల పౌన్‌ల పెన్షన్ జారీ చేసినారు ఈ పెన్షన్ పద్ధతి తరవాత వచ్చిన స్పీకర్లందరికి వర్తించేటట్లు చేసినారు.

ఉద్యోగ విరమణ కానిది పెన్షన్ రాదుగదా, పదవీ కాలంలో స్పీకర్‌కు నియమిత వేతనం లేనిది తన ఉద్యోగ నిర్వహణంలో స్వతంత్రంగా వ్యవహరించడానికి అవరోధ మున్నట్లే. 1791 వరకు జీతమనిగాక అందుతున్న ఆదాయము కింద చెప్పిన విధాల లభ్యమవుతున్నది. కామన్స్ సభ్యులు వ్యక్తిగతంగా ప్రతిపాదించే చట్టాలకు చెల్లించే రుసుము. ఈ రుసుము రూపేణ 1761 నుంచి 1791 వరకు సరాసరి ప్రతి సెషన్‌కు 1282 పౌన్‌లు, 5 పౌన్‌లు, స్పీకర్‌గా వ్యవహరించిన ప్రతి రోజుకి బత్తెము, ప్రతి సెషన్‌కు స్టేషనరీ కని 100 పౌన్‌లు, కొత్త పార్లమెంట్ ఆరంభంలో ఉడుపులు మొదలైన వాటికి వెయ్యి పౌన్‌లు, ఇంకో వేయి పౌన్‌లు పళ్ళాలు మొదలైన భోజన సామగ్రికి ఇస్తారు. ఇవిగాక రాజు అడవులనుంచి ఒక మగ దుప్పి ఒక ఆడ జింక ; 126 గాలన్ల ఫ్రెంచ్ ద్రాక్షాసవము, త్రై

ఆదాయాలన్నింటికి బదులు 1790 చట్టం సాలుకు 6000 పౌన్ల జీతాన్ని నిర్ణయించింది వేతన నిర్ణయంతోబాటు స్పీకర్ ఇకమీద ప్రభుత్వం నుంచి లాభసాటి పదవి ఏదీ స్వీకరించ రాదనే నిషేధాన్ని కూడా ఈ చట్టంలో చేర్చినారు. ఈ విధంగా స్పీకర్ స్వాతంత్ర్య రక్షణకు పార్లమెంట్ ఒకవైపు చర్య తీసుకోగా, 19వ శతాబ్దంలో తదనుగుణంగా జనాభిప్రాయం కూడా బలపడింది. స్పీకర్‌లు ఇంకా కొంతకాలం పార్లమెంటరీ కమిటీల సమావేశాలలో పాల్గొంటూనే ఉన్నారు. ఛార్లెస్ అబట్ అనే స్పీకర్ (1802-1817) కేథలిక్‌లపై ఉన్న నిర్బంధాల తొలగింపుకు గ్రాటన్ 1818లో ప్రతిపాదించిన చట్టాన్ని తీవ్రంగా కమిటీలో ప్రతిఘటించటంతో ఆగక, కామన్స సభ దానిని నిరాకరించిన విషయం రాజ ప్రతినిధికి నివేదించే సందర్భంలో తన సంతోషాన్ని అసభ్యంగా వెలిబుచ్చినాడు. అతని పక్షపాత వైఖరిని కామన్స్ సభ్యులు తీవ్రంగా నిరసించినారు. అతని ప్రవర్తనను ఖండించే తీర్మానం ఓడిపోయినా, స్పీకర్‌కు తగు విధంగా చీవాట్లు తగలటం జరిగింది. స్పీకర్‌గా సభలో పక్షాభిమానం ప్రదర్శించటానికెవరూ తరవాత సాహసించలేదు కాని మానర్స్ సటన్ (1817-84) పార్లమెంటరీ కమిటీలలోను, కామన్స్‌కు వెలపలా పార్టీ రాజకీయాలలో ప్రముఖ పాత్ర వహించినవాడే. స్పీకర్ పార్టీ రాజకీయాలకు అతీతుడై ఉండవలెననే సిద్ధాంతాన్ని పట్టుదలతో ఆచరణలో పెట్టిన ఖ్యాతి 1839-57 మధ్యకాలంలో స్పీకర్‌గా ఉన్న షాలెఫేవర్‌కు చెందుతున్నది. కామన్స సభకు లోపల, వెలుపల కూడా, పార్టీ రాజకీయాలలో అతడు పాల్గొనలేదు. పార్టీతో అన్ని విధాల తెగతెంపులు చేసుకొన్నాడు. స్పీకర్‌గా ఒకసారి ఎన్నికైనవాడు ఏ పక్షానికి చెందని వాడవుతున్నాడు కాబట్టి ఇకమీద కామన్స్‌సభ ఎన్నికలలో అతడభ్యర్థిగా నిలిచే పక్షంలో అతనికి ప్రత్యర్థిని ఎవ్వరినీ ఏ రాజకీయపక్షం, పోటీగా నిలబెట్టరాదనే మర్యాద ఒకటి ఏర్పడింది. అయినప్పటికి 1885-1955 మధ్యకాలంలో ఆరు సార్లయినా ఈ మర్యాదను రాజకీయ ప్రతిపక్షాలు ఉల్లంఘించినాయి. అయితే నా మొత్తం మీద ఈ సంప్రదాయాన్ని ఇంగ్లీష్ రాజకీయవేత్తలు ఈనాటికి మన్నిస్తున్నారనే చెప్పవలసి ఉంది. తత్ఫలితంగా ఈనాటి ప్రజారాజ్యాలలోని విధాన సభ లన్నింటిలోనూ బ్రిటిష్ కామన్స్ సభ మంచికి, మన్ననకు, క్రమశిక్షణతో తన వ్యవహారాలు నడుపుకోవటంలోనూ తలమానికంగా ప్రకాశిస్తున్నది.

# 18
# దత్త శాసనాధికారము

పరిమితిలేని ప్రభుత్వాధికారానికై పార్లమెంట్ సాగించిన పోరాటపు చరిత్రగా బ్రిటిష్ రాజ్యాంగ చరిత్రను భావించటం మామూలుగా వస్తున్న ఆచారము. దానికి భిన్నంగా తన సంపూర్ణ శాసనాధికారాన్ని కొంత త్యాగంచేసి, దానిని కొన్ని ప్రభుత్వ శాఖాధిపతులకు, పరిపాలనా సంఘాలకు పార్లమెంట్ దత్తం చేస్తుండటం చాలా విపరీత చర్యగా తోచక మానదు. కాని తన శాసనాధికారాన్ని ఇట్లా ఇతరులకు దత్తం చేయటం ఈ శతాబ్దంలో పార్ల మెంట్‌కు కొత్తగా పుట్టిన బుద్ధి కాదు.

1885 లో ఉన్ని అమ్మకాలు ఇంగ్లాండ్‌లోనే జరగవలెనని పార్లమెంట్ చట్ట మొకటి విధించింది. కాని ఏ యే ఊళ్ళలో ఎప్పుడవి జరగవలెనో, ఏ యే నియమాలకు లోబడి ఆ అమ్మకాలు జరపవలెనో నిర్ణయించే అధికారాన్ని కింగ్స్ కౌన్సిల్‌కి (Kings Council) వదలివేస్తూ ఆ కౌన్సిల్ ఈ సందర్భంలో జారీ చేసే ఆజ్ఞలు పార్లమెంట్ చేసే శాసనాల వలెనే చెల్లుబడి కాగలవని ఆ 1885 చట్టం ప్రకటించింది. ఈ విధంగా పార్లమెంట్ శాసనాధి కారాన్ని ఇతరులకు సంక్రమింపచేసే చట్టాలు ఎన్నో ట్యూడర్ రాజైన ఎనిమిదవ హెన్రీ కాలంలో చేసినారు. వీటిలో ఒకటి, 1581 లో చేసిన సోయర్స్ స్టాట్యూట్ (Statute of Sewers) భూస్వాములపై రేట్లు విధించడానికి, రేట్లు చెల్లించని వారిపై అపరాధాలు విధించి వాటి వసూళ్ళకై అవసరమైన జప్తీలు చేయడానికి కమిషనర్‌లకు అధికారాలు ఇచ్చింది. అంతటితో ఆగక ఆ కమిషనర్‌ల కా చట్టం శాసనాధికారం కూడా ఇచ్చింది. తమ విధి నిర్వహణకు సంబంధించి ఆనాటికున్న చట్టాలను సవరించడానికే కాక రద్దు చేయటానికి గూడా ఈ 1581 సోయర్స్ స్టాట్యూట్ వల్ల వారికి అధికారం లభించింది.

పార్లమెంట్ తన శాసనాధికారాన్ని ఇతరులకు దత్తం చేస్తూ చేసిన చట్టా లన్నిటిలో ప్రసిద్ధమైనది 8 వ హెన్రీ 1589 లో చేసిన రాజ ప్రకటనల (Statute of Proclamations) స్టాట్యూట్. రాజైనవాడు తన కౌన్సిల్ సభ్యులలో అధిక సంఖ్యాకుల సమ్మతితో చేసిన ప్రకటనలు పార్లమెంట్ స్వయంగా చేసిన శాసనాలతో సమానంగా చెల్లుబడి అవుతా యని పై స్టాట్యూట్ శాసించింది. 1589 కి పూర్వం కూడా నాణేల ముద్రణ, వస్తువుల ధరలు, విదేశీయులు, దేశ దిమ్మరులు, ఆహార పదార్థాలు, మద్యాలు, యుద్ధ ప్రకటనలు మొదలైన విషయాలనుగురించి రాజు కౌన్సిల్ ప్రకటనలు వెలువడుతూ ఉండినవే. సామాన్య శాసనము (Common law) స్టాట్యూట్ శాసనము, ఆస్తి హక్కులు రాజ ప్రకటనలవల్ల భంగపడగా, మత విషయాలలో రాజ ప్రకటనలు చెల్లుతాయని 1589 చట్టం చెప్పదలచింది. పార్లమెంట్ సమావేశమై శాసనం చేయటానికి కాలవ్యవధి కావలెనని అత్యవసర పరిస్థితులలో కాల విలంబనం కాకుండా ప్రభుత్వం చర్య తీసికోవలసి ఉంటుందని, ఆ చర్యను సక్రమ పరచడానికి ఈ చట్ట మవసరమైందని అప్పుడు సమర్థించినారు. కాని ఈ చట్టం అంతటితో

అగక, దత్తాధికారాన్ని పురస్కరించుకొని చేసిన చట్టాలను ఉల్లంఘించిన వారికి, ఉల్లంఘించి శిక్ష తప్పించుకోవలెనని విదేశాలకు పారిపోయినవారికి మరణ శిక్షను విధించింది ట్యూడర్ల నిరంకుశత్వానికి చట్టం బాగా ఉపకరించిందని వేరే చెప్పే పనిలేదు. 1542–48 లో చేసిన వేల్స్ స్టాట్యూట్, వేల్స్ ప్రదేశానికి అన్వయించే చట్టాలు రాజు చేయవచ్చునని; ఆ చట్టాలకు, అవి పార్లమెంట్ స్వయంగా చేసినవే అయితే ఎంత చెల్లుబడి ఉంటుందో అంత చెల్లుబడి ఉంటుందని వేల్స్ స్టాట్యూట్ శాసించింది. అంటే ఈ స్టాట్యూట్ వల్ల తన హక్కైన శాసనాధికారాన్ని ఇతరులకు పార్లమెంట్ దత్తం చేసిందని అర్థము. తమ నిరంకుశ పరిపాలనకు ఖరఖా తొడగడానికి దత్త శాసనాధికారాన్ని పార్లమెంట్ వల్ల ట్యూడర్ రాజులు అప్పుడప్పుడు పొందుతూ ఉండేవారు. స్టూఅర్ట్ రాజులలో రాజనీతి లోపించిన కారణంవల్ల రాజు కుండే ప్రత్యేక శాసనాధికారాన్ని రాజ ప్రకటనల రూపంలో ప్రదర్శించి పార్లమెంట్‌తో వైరం పెంచుకొని, వారధోగతి పాలైనారు.

తన శాసనాధికారాన్ని పరులకు దత్తం చేసే పార్లమెంటరీ శాసనాలలో 1717 లో చేసిన తిరుగుబాటు చట్టం (The Mutiny act) ప్రత్యేకంగా ప్రస్తావించ తగింది. 1689 లో చేసిన మొదటి తిరుగుబాటు చట్టం సముద్రాంతర దేశాలలో పనిచేస్తున్న బ్రిటిష్ సైనికులలో క్రమశిక్షణ నెలకొల్పటానికి ఉద్దేశించింది 1717 తిరుగుబాటు చట్టం విదేశాలలో ఉన్న బ్రిటిష్ సైనికులలోను క్రమశిక్షణ కాపాడటానికి చేసినారు. ఈ ప్రయోజనం సాధించ డానికి కవసరమైన నిబంధనలు చేయడానికి, క్రమశిక్షణ భంగపరిచిన సైనికులకు వేయదగిన శిక్షలను నిర్ణయించడానికి, సైనిక న్యాయస్థానాల ద్వారా విచారణ జరిపి, శిక్షలు విధించడానికి తనకున్న అధికారాన్ని పార్లమెంట్ రాజుకు దత్తం చేసింది.

19 వ శతాబ్దంలో అంటు జాడ్యాల వ్యాప్తిని అరికట్టే నిమిత్తం శాసనాధికారాన్ని పార్లమెంట్ ప్రీవీ కౌన్సిల్‌కు ఎన్నోసార్లు దత్తం చేసింది కాని, వ్యాధి వ్యాప్తి నివారణ కీ విధంగా శాసనాధికారాన్ని మొదటిసారి దత్తం చేసింది 1710 లో. ఆ సంవత్సరం బాల్టిక్ సముద్ర ప్రాంతాలలో ప్లేగ్ వ్యాపించింది. ఆ ప్రాంతాల నుంచి వచ్చిన వారిని, వచ్చిన ఓడలను బ్రిటిష్ రేవులలో కొంత కాలముంచి వ్యాధి బ్రిటిన్‌లోకి వ్యాపించకుండా తగిన చర్య తీసికోవడానికి అధికారాన్ని 1710 చట్టం వల్ల పార్లమెంట్ ఆనీ రాణికి దత్తం చేసింది. ఈ ఉద్దేశంతో 1847 లో, 1848, 1858, 1877 సంవత్సరాలలో జంతు వ్యాధుల వ్యాప్తిని మశూచికము మొదలైన అంటు జాడ్యాల వ్యాప్తిని నివారించడానికి వాక్సినేషన్‌లను నిర్బంధం చేసే చట్టాలు చేసే అధికారాన్ని ప్రీవీ కౌన్సిల్‌కు పార్లమెంట్ ప్రసాదించింది.

కాని 1825 లో పార్లమెంట్ చేసిన శాసనాధికార దత్తత (Delegation of legislative authority) పై వ్యాధుల విషయంలోవలె అత్యవసర పరిస్థితుల నెదుర్కొనే నిమిత్తం గాదు. ఆ ఏడు పార్లమెంట్ చేసిన చట్టం స్వల్ప ఋణాలు రాబట్టటాని కవసరమైన నిబంధనలు చేయటానికి స్కాట్లండ్‌లోని న్యాయాధికారులకు (justices) శాసనాధికార మిచ్చింది. 19 వ శతాబ్దంలో పోనుపోను ఈ శాసనాధికార దత్తత ఒక్కొక సంవత్సరం మరీ వ్యసనం కింద పరిణమించింది. 1860 లో చేసిన 154 స్టాట్యూట్లలో 88, 1880 లో ఏడు స్టాట్యూట్లు పార్లమెంటరీ శాసనాధికారాన్ని పరులకు దత్తం చేసినాయి.

స్వయంగా చట్టాలు చేసే అధికారం గాక, చట్టాలవలెనే చెలామణి అయ్యే నియమాలూ

నిబంధనలూ (Rules and Regulations) చేసే అధికారాన్ని ప్రభుత్వ శాఖాధికారులకు, స్థానికాధికారులకు 1890 కి దరిమిలా చాలా విరివిగా పార్లమెంట్ సంక్రమింప చేసింది 1890 నుంచే 1900 వరకు సగటున సంవత్సరానికి ఈ నియమాల, నిబంధనల సంఖ్య సహస్రమయింది. మొదటి యుద్ధకాలంలో (1914-1918) ఈ సంఖ్య 1500 కు, 1918-1921 లో 2,275 కు పెరిగింది. 1939 దాక వీటి సగటు 1500 లలో నిలిచి ఉండింది. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలంలో ఇది విపరీతంగా పెరిగి, 1942 నాటికి 3000 కు పెరిగింది యుద్ధానంతరం ఇది 2000 కు దిగజారింది. స్థానికమైన నియమాలు, నిబంధనలూ శాంతి కాలంలోను, దేశవ్యాప్తమైనవి యుద్ధకాలంలోను హెచ్చుగా ఉండటం గమనించవలె. స్థానికావసరాల కంటె రాజ్యావసరాలన్నీ యుద్ధాకాలంలో ప్రధాన స్థానాని కెక్కుతాయిగదా; 1939 అత్యవసరాధికార (Emergency Powers (defence) act) చట్టం ప్రజా రక్షణకు, దేశ రక్షణకు, శాంతి భద్రతలు కాపాడటానికి అవసరమని తోచే నిబంధనలు (Regulations) చేసే అధికారాన్ని సభాధిష్ఠుడైన రాజునకు దత్తం చేసింది ఆ విధంగా రాజసభ చేసే దేశ రక్షణ నిబంధనలలో పేర్కొన్న వ్యక్తులకు, అధికార సంఘాలకు కూడా స్వయంగా ఆజ్ఞలు, నియమాలు, ఉపశాసనాలు (By-laws) చేసే అధికారం లభించింది

మొదటి ప్రపంచ యుద్ధం ముగిసిన కొంత కాలానికి అత్యవసరాధికార చట్ట మొకటి చేసినారు. దీని ప్రకారం రాజు ముందుగా అత్యవసర పరిస్థితి ఏర్పడిందని ప్రకటన చేయవలె. ప్రజల ఆహారానికి నీరు, వంటచెరకు, ప్రయాణ సౌకర్యాలు, విద్యుచ్ఛక్తి మొదలైన ప్రధానావసరాలకు భంగం కలిగించవలెనని చూసే వారిని కట్టుదిట్టం చేయటానికి రాజు కౌన్సిల్ అందుకు తగిన నిబంధనలు చేయవచ్చు. కాని అత్యవసరపరిస్థితి ఏర్పడింది అనే ప్రకటనను అయిదు దినాలలోగా పార్లమెంట్ ముందుంచవలె. ఈ ప్రకటనను అవలంబించి చేసే నిబంధనలు సామాన్యంగా ఏడు దినాలకు మించి అమలులో ఉండవు. ఇంకా ఎక్కువ కాలమవి ఉండట మవసరమైతే పార్లమెంట్‌లోని రెండు సభలు, నిబంధనల జీవితాన్ని పొడిగించవలసి ఉంది రాజసభ కి శ 1920 అత్యవసరాధికారాలు చట్ట మిచ్చిన (Emergency Powers Act) అధికారాన్ని రాజు కౌన్సిల్ 1926 దేశ వ్యాప్తమైన సమ్మెను (General strike) ఎదుర్కొనే నిమిత్తం ఉపయోగించుకొంది

పార్లమెంటరీ శాసనాలకు, దత్తాధికార శాసనాలకు ఉన్న ముఖ్య భేదం ఏమిటి అంటే పార్లమెంటరీ శాసనాలను ప్రశ్నించే అధికారము న్యాయస్థానాలకు లేదు. దత్తాధికార శాసనాలను పురస్కరించుకొని చేసే ఆజ్ఞలు, నియమాలు, నిబంధనలు ఆ యా దత్తాధికార చట్టాలు (Statutes) విధించే పరిమితులకు లోబడక తప్పవు. ఈ స్టాట్యూటరీ ఆజ్ఞలు, నియమాలు (Orders, rules) మూడు విధాలుగా విభజించవచ్చు. 1 పార్లమెంట్ అధికారానికి ఎంత మాత్రం లోబడనివి 2. రెండవ తరగతికి చెందినవి. వాటిని విధించిన 40 దినాలలోగా పార్లమెంట్‌లోని ఏ సభ రద్దు చేయగోరుతూ రాజుకు విన్నవించటానికి ఆ విధంగా రద్దు చేయటానికి వీలైనవి. 3 సామాన్యంగా రెండు పార్లమెంట్ సభలు, కొన్ని సందర్భాలలో కామన్స్ సభ ఒక్కటైనా ఆమోదిస్తూ తీర్మానం చేయనిదే అమలులోకి రానటువంటివి, పార్లమెంట్ సభలు నిర్ణయించిన కాలానికి మించి అమలులో లేనివి. ఈ తీర్మానాలను దృఢమైన తీర్మానాలు (affirmative resolutions) అంటున్నారు. వీటిలో మొదటి తరగతికి చేర్చేవి

పార్లమెంట్ తన పర్యవేక్షణ అక్కరలేనివి, ముఖ్యం కానివిగా భావించినవి. పార్లమెంట్‌లో హెచ్చు ప్రాతికూల్యముంటే రద్దు చేయటానికి, వాటిని అమలులో పెడితే కలిగే ఇబ్బందుల దృష్ట్యా రద్దుచేయదలిస్తే రద్దుచేయటానికి వీలుకల్పించే దత్తాధికార శాసనాలు రెండవ తరగతివి పార్లమెంట్ పూర్తిగా తన అదుపులో ఉంచుకోతగినవని తలచేవి మూడవ తరగతి దత్తాధికార శాసనాలు.

మూడవ తరగతికి చెందిన దత్తాధికార శాసనాలలో దత్తాధికారాలకు సుస్పష్టమైన నిర్వచనాలున్నాయి. ఈ శాసనాలు రాజకీయ సిద్ధాంతాలను నిర్వచించేవి కారాదు. ఈ అధికారాలను పొందినవారు పన్నులు విధించరాదు, పార్లమెంట్ చేసిన శాసనాలను దత్తాధికార శాసనాలు సవరణ చేయరాదు. శాసనాధికార దత్తతను విరోధించేవారు దీనివల్ల కార్యనిర్వాహక వర్గానికి వ్యక్తి స్వాతంత్ర్యాన్ని నాశనం చేసే అవకాశం లభిస్తున్నదంటున్నారు. దీనికి ఉదాహరణగా వారు 1930 బీదల శాసనాన్ని (Poor Law Act) పేర్కొంటున్నారు. దీనిని పురస్కరించుకొని బీదల విషయంలో ఆరోగ్యశాఖ మంత్రి తనకు ఉచితమని తోచిన నియమాలు ఏవైనా విధించవచ్చు, ప్రభుత్వ విధానంలో ముఖ్యమైన మార్పులు చేయవచ్చు

ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం శతాబ్దాలుగా పార్లమెంట్ తన సొంత హక్కుగ భావించుతూ ఉన్న పన్నులను విధించే అధికారం కూడ పార్లమెంట్ మంత్రులకు దత్తం చేసినట్టి సందర్భాలున్నాయి. 1932 దిగుమతి సుంకాల చట్టం వీటి కొక ఉదాహరణ. ఈ చట్టం ప్రత్యేకంగా పేర్కొన్న దిగుమతుల విషయంలోగాక మిగిలిన దిగుమతు లన్నింటి పైన పది శాతం పన్ను విధించింది. విధించి, అంతటితో ఆగక దిగుమతి సుంకాల సలహా కమిటీ సూచనల మేరకు కొన్ని దిగుమతులపై అదనపు సుంకాలను విధించే అధికారాన్ని ఆర్థిక మంత్రికి ఈ చట్టం ఇచ్చింది. ఈ అదనపు సుంకాలు కామన్స్ సభ ఆమోదించవలెనని, కామన్స్ ప్రత్యేకంగా తీర్మానిస్తే తప్ప నిర్ణీతకాలమైన తరవాత అవి అమలులో ఉండవని అన్నదనుకోండి, అయినా పన్నులు విధించే అధికారాన్ని చేజేతుల పార్లమెంట్ కేవలం ఒక మంత్రికి ధారపోయటం బ్రిటిష్ రాజ్యాంగ చరిత్రలో ఒక విపరీత విషయము.

1888 కి దరిమిలా, (1929 కి పూర్వం) పార్లమెంటరీ శాసనాల నిబంధనలను సవరణ చేసే అధికారాన్ని మంత్రులకు దత్తం చేసిన స్టాట్యూట్లు ఎనిమిదైనా ఉన్నాయి. 1925 సంవత్సరపు ఆస్తిని విలువకట్టి రేట్లు విధించే శాసనం వీటిలో ఒకటి ఈ శాసనాన్ని అమలుపరచటంలో కలిగే ఇబ్బందులను తొలగించటాని కవసరమైతే దాని నిబంధనలను తనకు తోచిన విధంగా సవరించటానికి సంపూర్ణాధికారాన్ని ఈ శాసనం మంత్రికి దత్తం చేసింది. దత్త శాసనాధికారాలను అమలుపరిచే నిమిత్తం చేసే నియమాలు ఆ శాసనాధికారాలు దత్తం చేసిన శాసనంలో లేకున్నా, ఉన్నట్లే భావించవలెనని 1927 బీదల చట్టం (Poor Law Act) శాసించింది. అట్లా శాసించటంలో ఉద్దేశం ఆ నియమాలు శాసన సమ్మతాలు అవునా, కాదా అని, న్యాయస్థానాలు ప్రశ్నించకుండటానికని కొందరు వ్యాఖ్యానించినారు కాని ఆ విధంగా శాసించినా వ్యాఖ్యానం చెల్లదని న్యాయస్థానాలు తీర్పు లిచ్చినాయి. శాసనాధికారం దత్తం చేసిన శాసనంలోని నిబంధనలకు, అది దత్తం చేసిన అధికారాలకు వ్యతిరేకమైన నియమాలు దత్తాధికారం పొందినవారు చేస్తే అవి సక్రమాలని న్యాయస్థానాలు గుర్తించవని తేలిపోయింది.

దత్త శాసనాధికారాన్ని విరివిగా, యథేచ్ఛగా ఉపయోగించుకోవటంతో న్యాయస్థానాల చేతికి చిక్కకుండవలెనని ఎత్తిన ఎత్తొక్కటి ఈ సందర్భంలో చెప్పవలసి ఉంది. లండన్ ట్రాఫిక్ శాసనం (1924) రాకపోకల రవాణాలమంత్రి (Minister of Transport)కి లండన్ పట్టణంలోను పరిసరాలలోను రాకపోకలు, రవాణాలగురించి నియమ, నిబంధనలు చేసే అధికార మిచ్చింది. ఈ శాసనంలో వింత నియమ మొకటి చేర్చినారు. ఈ సెక్షన్ కింద మంత్రి ఒక నిబంధన చేసినాడనటమే, ఆ నిబంధన చేయటానికి, సెక్షన్ విధించిన అవసర మైన చర్యలన్నీ ముందే తీసుకొన్నాడనటానికి, చాలిన రుజువనేదే ఆ వింత నియమము. మరి కొన్ని చట్టాలిట్లా చెబుతున్నాయి: స్థానికాధికారి తాను పేర్కొన్న కార్యార్థమై సిద్ధపరచిన ఆజ్ఞను నిర్ణీతమైన ప్రభుత్వ శాఖాధికారి ధ్రువపరిస్తే ఆ ఆజ్ఞను సక్రమపరచటానికదే చాలునని ఆ చట్టం కింద తీసుకోవలసిన ముందు చర్యలన్నీ తీసుకోబడినట్లే భావించవలెననేదే ఈ చట్టాల ధోరణి.

దత్తాధికార శాసనాలలో చూసే ఈ అక్రమ, నిరంకుశ ధోరణులను అరికట్టటానికి ముఖ్యంగా మూడు జాగ్రత్తలు బ్రిటిష్ రాజ్యాంగం తీసుకొంది: 1. పార్లమెంట్ దత్తం చేసి నందువల్ల శాసనాధికారాన్ని పొందే అధికారి ఆ అధికార దత్త శాసనంలో పొందుపరచని అధికారాన్ని తన శాసన మూలంగా గ్రహింపజూస్తే అది ఆ అధికార దత్త శాసనానికి విరుద్ధం కాబట్టి చెల్లదనే న్యాయస్థానాల తీర్పులు. 2. అధికార దత్త శాసనాన్ని పురస్కరించుకొని మంత్రి మొదలైన పబ్లిక్ అధికారులు చేసే శాసన తుల్యమైన ఆజ్ఞలు, నియమ, నిబంధనలు పార్లమెంట్‌కు నివేదించవలెనని ఆ అధికార దత్త శాసనంలోనే పొందుపరచటం. 3. పార్ల మెంట్ దత్తం చేసిన శాసనాధికారాన్ని వినియోగించుకొని చేసే నియమ నిబంధనలను ఆజ్ఞ లను ప్రచురించవలెనని 1893 లో పార్లమెంట్ చేసిన నియమ ప్రచురణ శాసనము (Rules Publication Act).

### శాసనాధికార దత్తతనుగురించిన వాద ప్రతివాదాలు

1929 సంవత్సరాంతంలో ఛాన్సలర్ ప్రభువు ఏర్పరిచిన కమిటీ డొనమూర్ ప్రభువు అధ్యక్షత కింద సమావేశమై శాసనాధికార దత్తతవల్ల కలిగే ప్రయోజనాలను అనర్థాలను గురించి నివేదిక సమర్పించింది.

*శాసనాధికార దత్తతవల్ల ప్రయోజనాలు:* 1. పారిశ్రామిక యుగంలో, ప్రభుత్వం సామాజిక ప్రయోజనాల కంకితం కావలెననే సిద్ధాంతం బహుజనామోదం పొంది ఉంది. ఈ సిద్ధాంతాన్ని అమలు జరపవలెనంటే, దానికి బహుముఖమైన కార్యక్రమం అవలంబించవలసి వస్తుంది; అనేక శాసనాలు సంక్లిష్టమైనవి చేయవలసిన భారం పార్లమెంట్‌పై పడక తీరదు. ఈ భారాన్ని తగ్గించవలెనంటే శాసనాధికారాన్ని దత్తత చేయక తప్పదు. 2. ఈ శాసనా లలో అనేక సాంకేతికమైన వివరాలు చేర్చవలసి వస్తుంది. ప్రత్యేక పరిజ్ఞానం లేనివారే కామన్స్ సభలో బహుళ సంఖ్యాకులు. వారికి సాంకేతిక వివరాలు అర్థం కావు. 3. అవలం బించవలసిన కార్యక్రమం యొక్క మూల సిద్ధాంతాలను తమ శాసనాలలో కామన్స్ సభ్యులు పొందుపరిస్తే చాలు మిగిలిన వివరాలను ఇమిడ్చి సాంకేతిక నిపుణుల సహాయంతో ఆయా శాఖాధిపతులైన మంత్రులు పార్లమెంట్ దత్తం చేసిన అధికారంతో అవసరమైన శాసనాలు,

నియమాలు, నిబంధనలూ చేస్తుంటే ప్రయోజనకరంగా కార్యాభారాన్ని కామన్స్ సభ, మంత్రులూ పంచుకొన్నట్లవుతుంది. లేకుంటే, పరిపాలనా సౌష్ఠవం కుంటుపడుతుంది 4. సాంకేతిక విజ్ఞానం ఉరకలు, పరుగలు వేస్తున్న కాలంలో ఈనాడున్న పరిస్థితులు రేపుండటం లేదు అందువల్ల కాల విలంబనం లేకుండా, మారిన సందర్భాలలో కార్య నిర్వాహక వర్గం ఉచిత విధంగా తన పరిపాలన మలచుకోవలెనంటే శాసనాధికారాన్ని పార్లమెంట్ మంత్రులకు దత్తం చేయవలసిందే ఆ దత్తం చేయటం ఏ విధంగా, ఎంతవరకు అనేది వేరే ప్రశ్న. 5. విశేష సంస్కరణ ప్రణాళికలు అమలుజరపటంలో ముందు ఊహించని క్లిష్ట పరిస్థితులు ఉత్పన్నమైనప్పుడు శాసన సవరణలకు, నూతనాధికారాలకు పార్లమెంట్‌ను అడగకుండా, కార్యనిర్వాహకవర్గం తగు చర్య తీసికోవటానికి దత్త శాసనాధికారం వీలు కలుగచేస్తుంది 6. పరిపాలనా కార్యాలలో పరిశోధనలు సాగించటానికి, ఆ పరిశోధనలవల్ల కలిగే జ్ఞానాన్ని, పరిపాలనానుభవంలో కలిగే వివేకాన్ని శీఘ్రంగాను, సులభంగాను ఆచరణకు తేవటానికి దత్త శాసనాధికారం సాయపడుతుంది. 7 పార్లమెంట్ ఆరు నెలలు సభ తీరి ఉంటే, మిగిలిన ఆరు నెలలు సమావేశమై ఉండదు పార్లమెంట్‌లో చిత్తు చట్టాన్ని ప్రవేశపెట్టిన నాటినుంచి అది రాజామోదాన్ని పొంది శాసనమయ్యేలోగా నెలలు పట్టవచ్చు. యుద్ధంవంటి విపరీత, అత్యవసర పరిస్థితి దాపురించినప్పుడు తక్షణమే, ఆలస్యంవల్ల పరిస్థితులు విషమించకుండా, ప్రభుత్వం తగిన చర్యలు ఫలప్రదంగా తీసుకోవటానికి దత్త శాసనాధికారం ఎంతైనా ఉపకరిస్తుంది ఉదాహరణలు 1 ప్రథమ ప్రపంచ సంగ్రామ కాలంలో పార్లమెంట్ చేసిన దేశరక్షణ శాసనాలు ప్రజల భద్రతకు, దేశరక్షణకు విస్తార శాసనాధికారాలను కార్య నిర్వాహక వర్గానికి దత్తం చేసినాయి. ఈ దత్తాధికారాన్ని ఉపయోగించుకొని కార్యవర్గం వా రనేక శాసనాలు చేసినారు.

ii. 1926 లో దేశవ్యాప్తంగా సమ్మె (General strike) జరిగినప్పుడు, 1920 అత్యవసరాధికార చట్టం ఉపయోగించుకొని బ్రిటిష్ మంత్రిమండలి అనేక ఆజ్ఞలు నిషేధ శాసనాలు చేసి ఆ సమ్మెను అణచివేయగలిగింది

*దత్తాధికార శాసనాలవల్ల దుష్ఫలితాలు:* దత్త శాసనాధికారాన్ని ఖండించే విమర్శకులు కూడా దాని ఆవశ్యకతను కొంతవరకు ఒప్పుకున్నారు కాని ఈ అధికారాన్ని కార్యనిర్వాహక వర్గం దుర్వినియోగం చేసి నిరంకుశ పరిపాలనాన్ని నెలకొల్పే భయం కలిగిందని వారి వాదము శాసనాధికారం నిజంగా ప్రజలెన్నుకొన్న వారి ప్రతినిధులదేగాని, ఆ ప్రతినిధులలో భాగమైన మెజారిటీ పక్షం నుంచి ఏర్పాటైన కొద్దిమంది మంత్రులది మాత్రం గాదు. రాజనీతిజ్ఞు లనేకుల దృష్టిలో, మంత్రివర్గంలోని కొద్దిమంది ప్రధాన నాయకుల చేతిలోని కీలుబొమ్మ ఈ మెజారిటీ పక్షమని. ఈ మంత్రులు దత్తాధికార శాసనంలోని మూల సిద్ధాంతాలను కూడా కాలదోసి తమ ఇష్టం వచ్చిన శాసనాలను, నియమ, నిబంధనలను శత, సహస్ర సంఖ్యలుగా సృష్టిచేసి, ప్రజానీతిం నెత్తిపై రుద్దుతున్నారని ప్రబలమైన ఆక్షేపణ వింటున్నాము. ఈ విధంగా కార్యవర్గం చేసే అసంఖ్యాక శాసనాలను, శాసన సమాలైన నిబంధనలను పార్లమెంట్ పరిశీలించే అవకాశాలంతగా లేవు; పరిశీలించిన సందర్భాలుగాని, పరిశీలించి సవరించిన వైనంగాని అంతగా ప్రజల ఎరకలో లేవు. శాసనాధికారం దత్తం చేసిన శాసనాలు కొన్నింటిలో పార్లమెంటరీ పర్యవేక్షణకు ఏర్పాట్లు చేసినా, ఆ ఏర్పాట్లు చాలినంత ప్రయోజన

కరంగా ఉండటం లేదు. శాసనాధికారం దత్తం చేసే శాసనాలు కొన్నింటిలోని భాష నిర్ద్వంద్వంగా నిశ్చితార్థ మిచ్చేవి గాకుండటం చేత వాటిని మంత్రులు దుర్వినియోగం చేసిన పట్టులలో కూడా న్యాయస్థానాలు ప్రజల స్వేచ్ఛను రక్షించలేకున్నాయి. అసలధికారమే చెడ్డది. అధికారరోగ పూరితులకు కన్నులుండవు; చెవులు వినపడవు. "ఏ అధికారమైనా, ఎంతవానినైనా పాడుచేస్తుంది. మితిమీరిన అధికారం, మితిమీరి పాడుచేస్తుంది" (అబ్రహాం లింకన్). దత్తాధికారాన్ని ఉపయోగించుకొని మంత్రులు చేసే అన్యాయాలను న్యాయస్థానాలు అరికట్టకుండటానికి కొన్ని దత్తాధికార శాసనాలలో అడ్డంకులు కల్పించింది మీరు చదివినారు. ఇంగ్లాండ్ ప్రధాన న్యాయమూర్తి హివార్ట్ ప్రభువు ఈ దురన్యాయాన్నిగురించి ఇట్లన్నారు; "పార్లమెంటరీ సంస్థలు, ఏకన్యాయపాలనము పరీక్షించి చూసినాము. అవి పరీక్ష కాగలేదు, అవి లోపభూయిష్ఠాలని అనుభవంలో తేలింది. శాస్త్రీయంగా పరిపాలన సాగించటంలో నేర్పరులైన శాఖాధిపతుల నిరంకుశత్వానికి (Departmental Despots) కాల మాసన్నమైంది. వా రన్నదే శాసనమైనా, ప్రజాక్షేమాన్ని కోరే అట్టాంటి సమర్థుల పాలన, అసమర్థు లనేకులతో కూడిన పార్లమెంటరీ సంస్థల పరిపాలన కంటె ఎక్కువ ప్రయోజనకారి అని మనస్ఫూర్తిగా నమ్మేవారి సంఖ్య పెరిగిపోయింది." స్వానుభవంతో, దత్తాధికార శాసనాలను నిశిత విమర్శకు గురిచేస్తూ, స్వవిరచితమైన "ది న్యూ డెస్పోటిజమ్" (The New Despotism) అనే గ్రంథంలో హివార్ట్ ప్రభువు వెలిబుచ్చిన అభిప్రాయమిది. ఏ. ఆర్. మారియట్ కూడా ఈ అభిప్రాయాన్నే ప్రకటించినట్లు జి. బి. ఆడమ్స్ తెలిపినాడు. వీరింత తీవ్రంగా దత్త శాసనాధికారాన్ని విమర్శించినా డొనమూర్ కమిటీ (1929) ఈ విమర్శతో ఏకీభవించలేదు. కాని మంత్రులవంటి వారు తమ శాసనాధికారాన్ని దుర్వినియోగ పరచకుండా ఉండేటట్లు చేయటానికి అవలంబించవలసిన చర్యలు కొన్ని సూచించినారు. మంత్రులు చేసే నియమ, నిబంధనలు ప్రచురించవలెనంటే 1898 నియమ ప్రచురణ శాసనాన్ని తగిన విధంగా సవరించి పటిష్ఠం చేయవలెననేది ఈ సూచనలలో ఒకటి. ఈ సూచనల మేరకు, 1924 లో ప్రత్యేక ఆజ్ఞ లనుసరించవలసిన విధాన క్రమాన్నిగురించి ప్రభుసభ విధించిన నియమాలను పొందుపరచి కొత్తగా 1946 లో స్టాట్యూటరీ ఇన్‌స్ట్రుమెంట్స్ శాసనాన్ని పార్లమెంట్ చేసింది. ఇంతకు పూర్వం ఆ ఇన్‌స్ట్రుమెంట్స్‌ను నియమితకాలంలోగా పార్లమెంట్ రద్దు చేయవచ్చునని ఉండేది కాని, ఆ నియమితకాలం అన్ని ఇన్‌స్ట్రుమెంట్స్ విషయంలో ఒక్క విధంగా ఉండేది కాదు. అందుచేత ఇన్‌స్ట్రుమెంట్స్ అన్నీ, అవిప్పుడున్న శాసనాలకింద చేసినా, ఇకముందు పార్లమెంట్ చేసే శాసనాల కింద చేసినా, చేసిన 40 రోజులలోగా వాటిని పార్లమెంట్ రద్దు చేయవచ్చునని 1946 స్టాట్యూటరీ ఇన్‌స్ట్రుమెంట్స్ చట్టం శాసించింది. ఈ 40 రోజుల లెక్కలో పార్లమెంట్ రద్దయిన ప్రోరోగ్ (Prorogue) అయిన రోజులు చేర్పరు.

*దత్త శాసనాధికారాన్ని మంత్రులు దుర్వినియోగ పరచకుండా చేయటానికి డొనమూర్ కమిటీ చేసిన ఇతర సూచనలు:* 1. దత్తత చేసిన శాసనాధికారాలు సుస్పష్టంగా ఉండవలె. 2. శాసనాధికార దత్తత చేసే చట్టాలలో న్యాయస్థానాలవి న్యాయ సమ్మతాలవునా కాదా అని విచారించరాదనే నిషేధం ఉండరాదు. 3. పార్లమెంట్‌కు నివేదించవలసిన దత్తాధికారాన్ని బట్టి చేసే శాసనాలు చేసిన తరవాతనే గాక చేయటానికి ముందుగానే పార్లమెంట్‌కు తెలియచేయవలెననీ, ఆ విధంగా నియమ ప్రచురణ శాసనం సవరించవలెనని

డొనమూర్ కమిటీ సూచించింది. 4 ప్రతి ఒక పార్లమెంటరీ సెషన్ ఆరంభంలో స్థాయీ సంఘాలు రెండు - ఒకటి ప్రభుసభలోను, రెండవది ప్రజా సభలోను ఏర్పాటుచేయవలెనని, మంత్రికి శాసనాధికారమిచ్చే ప్రతి దత్తాధికార శాసనమూ, ఆ అధికార దత్తతనుబట్టి మంత్రి చేసే ప్రతి నియమాన్ని (Rule) నిబంధనను (Regulation) స్థాయీసంఘాలు పరిశీలించి, తమ శాసనసభకు వాటిలో పార్లమెంట్ గమనించవలసిన ప్రత్యేకాంశాలు ఏమైనా ఉంటే నివేదించవలె. అంతేగాని ప్రతిపాదించబోయే శాసనంలోని, నిబంధనంలోని గుణావగుణాలను గురించి స్థాయీ సంఘాలు అభిప్రాయమీయరాదు అత్యంతరకరాలైన శాసనాలు నిబంధనలు పార్లమెంట్ కనుమరుగు చేయటం నివారించటమే ఈ సూచనయొక్క ఉద్దేశము.

5. శాసనాధికారాలు ఇతరులకు దత్తం చేసే చట్టాలను పార్లమెంట్ చేయకుండా అడ్డగించటానికి అధికారంతో కూడిన పరిశీలన సంఘాన్ని నియమించవలెనని డొనమూర్ కమిటీ ఒక సూచన చేసింది కాని దానిని ఈనాటికి పార్లమెంట్ అమలు పరచలేదు.

1946 స్టాట్యూటరీ ఇన్‌స్ట్రుమెంట్స్ శాసనం విధించిన గడువులోపల వాటిని పార్లమెంట్ రద్దు చేయవచ్చునన్నదే గాని ఆ గడువు దాటినమీద ఆ ఇన్‌స్ట్రుమెంట్స్‌ను అమలు పరచటంలో కలిగే అనుభవంవల్ల వాటిని ఏమి చేయటానికి పార్లమెంట్ కధికారమీయలేదు. ఇన్‌స్ట్రుమెంట్స్‌వల్ల కలిగే ఇబ్బందులను విచారించటానికి ముగ్గురు సభ్యులుగల ఒక కమిటీని నియమించవలెనని, ఆ కమిటీ ఆ ఇబ్బందులనుగురించి సమర్పించే పిటిషన్‌లను విచారించి (Triers Petitions) కామన్స్‌కు నివేదించవలెనని ఒక సూచన చేయటం జరిగింది ఆ సూచనను 1958 లో ఒక సెలెక్ట్ కమిటీ విచారించింది. ప్రజల ఇబ్బందులనుగురించి చర్చించటానికి పార్లమెంట్‌కు అవకాశాలు ఇప్పుడు లేకపోలేదని అభిప్రాయపడి సెలెక్ట్ కమిటీ ఆ సూచనను తోసిపుచ్చింది

*సారాంశము:* దత్త శాసనాధికారాన్ని పురస్కరించుకొని ఇంగ్లండ్‌లో ఈనాడు కార్యనిర్వాహకవర్గం శాసనాలు చేయటంలో పార్లమెంట్‌కు ఎట్లా ప్రబల ప్రతిస్పర్ధి అయిందో తెలిపినాము. ముందు ముందు న్యాయపరిపాలనలో, న్యాయశాఖతో ఏ విధంగా పోటీ పడి, న్యాయాధికారుల రాజ్యంపై కార్యనిర్వాహకవర్గం దురాక్రమణ చేస్తుందో తెలుసుకొంటారు. సీయే అనే ఫ్రెంచ్ మతాధికారి ఏమన్నాడంటే "త్రివిధ రాజ్యాధి కారాలలో ఒక్కొక్కటి ఒక్కొక్క వ్యక్తిలోగాని, సంస్థలోగాని ప్రతిష్ఠితమై ఉండటం మేలు. శాసనం చేయటం, పరిపాలించటం, న్యాయం చెప్పటం అనే ఈ మూడింటిలో ఏ రెండు అధికారాలైనా ఒక్క వ్యక్తిలోగాని ఒక్క సంస్థలోనేగాని తిష్ఠ వేస్తే ప్రజా స్వాతంత్ర్యానికది గొడ్డలి పెట్టు. ఇక త్రివిధ రాజ్యాధికారాలు ఒక్కనిలోనో, లేదా ఒక సంస్థలోనో లేదా వర్గంలోనో కుదురుకొంటే వేరుగా చెప్పనక్కరలేదు, నిరంకుశత్వానికది మారుపేరు." అధునాతన ప్రజా రాజ్యాలకు మాతృక అనదగిన ఇంగ్లండ్‌లో ఈ రాజ్యాధికారాలు మూడూ ఏ విధంగా కేంద్రీకృత మవుతున్నాయో గమనించదగిన గాథ.

## న్యాయశాఖ (Judiciary)

బ్రిటన్‌లో ఉండే క్రిమినల్ న్యాయస్థానాలు ఆరు విధాలు : i. శాంతిరక్షణ న్యాయాధికారులు (Justices of the peace). ii. మాజిస్ట్రేట్లు. iii. త్రైమాసిక సెషన్స్

(Quarter Sessions). iv. అస్సైజ్ కోర్టులు (The Assyzies). v. క్రిమినల్ అపీల్ కోర్టులు. vi. ప్రభుసభ. సివిల్ వ్యాజ్యాలు విచారించే న్యాయస్థానాలు i. మండల న్యాయస్థానాలు. ii. ఉన్నత న్యాయస్థానము (High court). iii. అపీల్ కోర్టు. iv. ప్రభుసభ అని నాలుగు విధాలు.

న్యాయాధికారులనందరిని నియమించేది రాజు అంటే మంత్రిమండలి. వారి ప్రవర్తనలో మచ్చ లేనంతవరకు న్యాయాధికారులు ఉద్యోగంలో ఉంటారు. ఉన్నత న్యాయస్థానాల న్యాయాధిపతులను శాసనసభలు రెండూ తొలగించవలసిందని మనవి చేస్తేగాని రాజు తొల గించటానికి వీలులేదు. వారి వేతనాలను ఉద్యోగ మధ్యకాలంలో తగ్గించటానికి వీలులేదు. అందువల్ల, మంత్రుల, పార్లమెంట్‌లోని రాజకీయపక్షాల ఆగ్రహానుగ్రహాలతో వారికి నిమిత్తం లేదు ; న్యాయైకదృష్టితో వారు తమ న్యాయపాలన విధిని నిర్వర్తించగలుగుతున్నారు.

ఉన్నత న్యాయాధిపతుల ఉద్యోగాలను న్యాయపరిపాలనా స్వాతంత్ర్యాన్ని రక్షించేటట్లు బ్రిటిష్ రాజ్యాంగం తక్కిన న్యాయాధికారులను రక్షించటం లేదుగాని వారి విధి నిర్వహణ లోను, ఉద్యోగాల విషయంలోను ఉన్నత న్యాయాధిపతులను చూసినట్లే ప్రభుత్వం వారిని కూడా చూస్తుంది. ప్రభుత్వోద్యోగులంతా వారి ఉద్యోగ నిర్వహణలోనైనా, న్యాయవిరుద్ధమైన పనులు చేయటం తటస్థిస్తే ఇతర పౌరులవలెనే సామాన్య న్యాయస్థానాల విచారణకు, అవి విధించే శిక్షలకు పాత్రులవుతున్నారు. ఉద్యోగులు అని వారి కెటువంటి ప్రత్యేకతను న్యాయ శాస్త్రంగాని, న్యాయస్థానాలుగాని చూపే పద్ధతి ఇంగ్లాండ్‌లో లేదు.

### న్యాయశాఖకు శాసనసభకు ఉన్న సంబంధము

బ్రిటిష్ న్యాయాధిపతులు పార్లమెంట్ ఆమోదించిన శాసనాన్ని, అది ఎటువంటిదైనా, రాజ్యాంగ విరుద్ధమైంది అన్న కారణంవల్ల చెల్లదని తోసిపుచ్చలేరు. అమెరికన్ రాజ్యాంగం వలె ఒక నియమిత కాలంలో లిఖించింది కాదు బ్రిటిష్ రాజ్యాంగము. శతాబ్దాలుగా ఏర్పడిన సంప్రదాయాలూ, ఆనాటి పార్లమెంట్ ఆమోదించిన శాసనాలూ కలగాపులగంగా కలిసి కాలానుగుణంగా అది పరిణామమొందింది. దానికి పునాదివంటిది పార్లమెంట్ సార్వభౌమత్వ సిద్ధాంతము. ఈ సార్వభౌమతను బట్టి న్యాయస్థానం తీర్పులను తల్లకిందులు చేసే కొత్త శాస నాలనో, లేదా పాత శాసనాలకు సవరణలనో పార్లమెంట్ చేయగలదు. పాత శాసనాలను సవరించటానికి లేదా రద్దు చేయటానికి పార్లమెంట్‌కు ఉండే అధికారాన్ని తగ్గించే లిఖిత రాజ్యాంగమేది ఇంగ్లండ్‌లో లేనికారణంచేత కాలానుగుణంగా దేశశాసనాలను మలచుకొనే అధికారం పార్లమెంట్‌కు ఉన్నది. ప్రజాభిప్రాయం మారేకొద్దీ తదనుసారంగా శాసనం మార టానికి వీలులేకపోతే అది ప్రజాప్రతినిధి పరిపాలన కాజాలదు. అది అభివృద్ధి నిరోధకం కావటానికి వీలుంటుంది. ఛార్టిస్ట్ ఉద్యమం తలఎత్తిన కాలంలో ఆ ఉద్యమకారకు లడిగిన కోరికలు తీవ్ర పంథాలో ఉన్నట్లు భావించి వారిని ప్రభుత్వం అణిచివేసింది. ఆ రోజులలో అతివాదంగా పరిగణించిన సిద్ధాంతాలు : (ఉదా : రహస్యంగా వోటింగ్ చేసే పద్ధతి, స్త్రీ పురుషులకు సమానంగా వోటింగ్ హక్కు లుండవలెననటం మొదలైనవి) దశాబ్దాలు గడిచిన కొద్దీ పౌరుల న్యాయమైన హక్కులుగా పార్లమెంట్ గుర్తించింది. అదే విధంగా, యంత్రా గారాలలో పనిచేసే కార్మికులు ట్రేడ్ యూనియన్‌ల (కార్మిక సంఘాల) ను యేర్పరచుకోవటం

పోయిన శతాబ్దాంతంలో విప్లవ వాదంగా భావించినటువంటిదే ఈ శతాబ్దంలో పార్లమెంట్ పరమ సాధు వాదంగా గుర్తించింది

## సమన్యాయపాలన (Rule of Law)

సంఘాన్ని కట్టుదిట్టంచేసి నిలువబెట్టే నడవడిని, ఆ నడవడిని అనుశాసించే నీతి సూత్ర సముదాయాన్ని ధర్మంగా ఆర్యులు సంభావించినారు. బ్రిటిష్ జాతిలో కూడా రాజశాసనాలకు పూర్వం నుంచి మానవ సంఘం పాటించిన, ఆ శాసనాలకు మూలమైన, అతీతమైన ధర్మ ముందని, అది మానవ జాతితోబాటు పుట్టి పెరిగిందని నమ్మకము ఉంది. ఆ నమ్మకానికి లోబడి మానవులలో సామాన్య న్యాయము (Common Law), సమత న్యాయము (Equity Law) రూపొందినాయి ఆస్తిహక్కు, స్వప్రాణరక్షణ హక్కు ఈ విధమైన న్యాయ సంప్రదాయాల నుంచి బలం పుంజుకొన్నాయి ఈ హక్కులపై మానవులకంతా సమానమైన హక్కు ఉంది. రాజు నుంచి పేద వరకు ఈ హక్కులకు కట్టుబడి ఉండవలసిన వారే. మానవ సమాజం నుంచి రాజ్యమనే సంస్థ పరిణామమొందిన తరవాత, ప్రతి పౌరుడు తన హక్కులను అనుభవించేటట్లు చూడటం ప్రభుత్వ విధి అయింది. రాజుల, భూస్వాముల, పారిశ్రామికుల దౌర్జన్యం నుంచి బలహీనులైన పౌరులను రక్షించటానికి శతాబ్దాలుగా పార్లమెంట్ సాగించిన పోరాటంలో సమ న్యాయపాలనావశ్యకత గుర్తించి సమ న్యాయ సిద్ధాంతం బ్రిటన్‌లో బాగా బలపడింది. సమ న్యాయ సిద్ధాంతం యొక్క మూల సూత్రాలను డైసీ (Dicey) అనే రాజనీతివేత్త తాను రచించిన ది లా ఆఫ్ ది కాన్‌స్టిట్యూషన్ అనే (The Law of the Constitution) గ్రంథంలో కింది విధంగా వివరించినాడు :

1. సామాన్య న్యాయస్థానాలు - సామాన్య న్యాయవిచారణా విధానాన్ని అనుసరించి - ఒక వ్యక్తి శాసనాతిక్రమణం చేసినాడని నిర్ధారించనిదే అతనిని ఏ విధంగాను శిక్షించరాదు. నిరంకుశాధికారం న్యాయస్థానాల తీర్పులకు కట్టుబడి ఉండవలెనని దీని కర్థము.

2. ఎవరైనా ఎంతవారైనా సామాన్య న్యాయానికి అతీతుడు కాడు. దీని కర్థం అందరి విషయంలోను ఒక్క న్యాయమే అమలు చేయవలెనని అందువల్ల ఉద్యోగులుకాని, ఇతరులుకాని తదితర పౌరులంతా ఏ న్యాయశాస్త్రానికి, ఏ న్యాయస్థానానికి బద్ధులవుతున్నారో ఆ న్యాయస్థానానికి తాము తలవంచ నక్కరలేదనటానికి వీలులేదు.

ఈ విధంగా బ్రిటిష్ న్యాయ పరిపాలన ఫ్రాన్స్ దేశంలో అమలులో ఉండే న్యాయ పాలన కంటె శ్రేష్ఠమైందని డైసీ చెప్పదలచినాడు ఫ్రాన్స్ దేశంలోను కొన్ని ఇతర ఐరోపా దేశాలలోను సామాన్య న్యాయస్థానాలతోబాటు పరిపాలక న్యాయస్థానాలనేవి ప్రత్యేకంగా న్యాయ పరిపాలనం చేస్తున్నాయి. ప్రభుత్వోద్యోగి తన ఉద్యోగ ధర్మాన్ని నిర్వర్తించటంలో చేసిన పనులకు పౌరులతో వ్యాజ్యాలలో చిక్కుకొంటే అతనిని ఆ దేశాలలోని సామాన్య న్యాయస్థానాలు విచారించటానికి వీలులేదు. అటువంటి వ్యాజ్యాలను పరిపాలక న్యాయస్థానాలు మాత్రమే విచారించవలె. ప్రభుత్వోద్యోగి తనపై అధికారుల ఆజ్ఞలను మారు మాటలేక శిరసావహించవలసినవాడు. ఆ ఆజ్ఞలు న్యాయశాస్త్రాను గుణ్యాలవుతాయా ? అనే మీమాంస లోబడి ఆజ్ఞా నిర్వహణం చేయటంలో ఉద్యోగి ఆలస్యం చేస్తే ప్రమాదం సంభవించవచ్చు గదా, ఆ కారణంచేత ఆజ్ఞా నిర్వహణంలో న్యాయానికి మీరి ఉద్యోగి ప్రవర్తించినాడా లేదా అని

నిర్ణయించే పని అనుభవపరులైన (పరిపాలనానుభవం, లోకానుభవం గల) న్యాయాధికారులు కొలువున్న న్యాయస్థానాలకు ప్రత్యేకించటం మేలని, లేకుంటే పరిపాలనా సౌష్ఠవం దెబ్బతిని తీరుతుందని ఫ్రెంచ్ విధానాన్ని సమర్థించే వారి వాదము. పరిపాలక న్యాయాన్ని ప్రసాదించ వలసిన న్యాయాధికారులు ఉద్యోగులు అవసరానికి మీరి అన్యాయం చేసినా, వారి పట్ల పక్ష పాతం చూపవచ్చునని, అందువల్ల పౌరులకు ఉద్యోగుల అత్యాచారాలకు తగిన పరిహారం లభించకపోవచ్చునని ఈ వాదానికి ప్రతివాదము. డైసీ ఏమన్నాడంటే: "బ్రిటన్‌లో, ప్రధానమంత్రి మొదలు కాన్‌స్టేబిల్ లేదా బిల్ కలెక్టర్ వరకు న్యాయసమ్మతం కానిది వారేమి జేసినా, ఇతర పౌరులతో బాటు సమాన బాధ్యత వహించవలసి ఉంది. న్యాయాన్ని అతిక్ర మించినప్పుడు, అది వారి ఉద్యోగ నిర్వహణలో జరిగిందైనా, స్వయంగా వారు జరిమానాలు చెల్లించవలసి రావటమో, లేదా ఇతర శిక్షలకు గురి కావటమో సంభవిస్తుంది." అందువల్ల గుంపులను చెదరగొట్టవలసినప్పుడు ఇతర దేశాలలో ఈనాడు జరుగుతున్నట్లు, పదుల సంఖ్య లలో ప్రజలను కాల్చి చంపిన పోలీస్ అధికారులకు తమ దౌర్జన్య చర్యలకు తగిన శిక్ష లనుభ వించక తప్పించుకోవటం ఇంగ్లండ్‌లో ఎంతమాత్రం సాధ్యం కాదు. బ్రిటన్‌లోని ఏ మంత్రిని గాని మంత్రిమండలినిగాని పదవినుంచి తొలగించే అధికారం పార్లమెంట్ కిచ్చిన శాసన మేదీ బ్రిటిష్ రాజ్యాంగంలో లేదు. కాని పరిపాలకులుగా వారు నిర్వహించే కార్యాలన్నింటికీ ఇతర సామాన్య పౌరులతోబాటు సమానంగా బ్రిటిష్ మంత్రులు కూడా సామాన్య న్యాయస్థానాలకు బాధ్యులై ఉన్నారు దీనికి తార్కాణంగా, జనరల్ వారంట్లమీద నార్త్ బ్రిటన్ పత్రిక (నెంబర్ 45 సంచిక) లోని వ్రాతలకు సంపాదకుడైన విల్‌క్స్‌ను, లీచ్ అనే ముద్రాపకుని, (47 మంది ఇతరులను) నిర్బంధంలోకి తీసికొన్న సందర్భంలో మాన నష్టానికి పరిహారంగా స్టేట్ సెక్రటరీ హాలిఫాక్స్ ప్రభువు 4000 పౌనులు, సహాయ కార్యదర్శి ఉడ్ 500 పౌన్‌లు విల్‌క్స్‌కు చెల్లించవలసినట్లు న్యాయస్థాన మిచ్చిన తీర్పును ఉదహరించవచ్చు. దీనిని బట్టి బ్రిటిష్ పరిపాలకులు ప్రజల పట్ల అకార్యాలు చేయటానికి జంకి తీరుతారని తోచవచ్చు. లేదా, ఆ విధమైన అకార్యాలకు న్యాయస్థానాలు విధించే అపరాధాలను వారు ప్రభుత్వం తలకు చుట్టి తాము తప్పించుకోలేరా అని సందేహం కలిగినా కలగవచ్చు. ఈ సందర్భంలో మనం గమనించవలసింది 'ఇంగ్లండ్ రాజు తప్పు చేయలేదు' (The King of the England can do no wrong') అనే రాజకీయ సిద్ధాంతము. హనోవేరియన్ రాజుల కాలంలో రాజ్య పాలనాధికారం సర్వస్వం మంత్రివర్గం చేతులలోకి బదలీ కావటంవల్ల ఈ సిద్ధాంతం స్థిర పడింది. కాని ఒక్కొక్కప్పుడు నష్టపడిన వానికి ఈ సిద్ధాంతంవల్ల లభించే పరిహారం నామ మాత్రమే కావచ్చు. లాస్కి ఎ గ్రామర్ ఆఫ్ పాలిటిక్స్ అనే గ్రంథం (A Grammer of Politics) లో దీనికి నిదర్శనంగా బేన్ బ్రిజ్ కన్య విషయం ఉదాహరించినాడు. ఆ కథ ఇది: పోస్ట్ మాస్టర్ జనరల్ వాన్ (Van) బేన్ బ్రిజ్‌పై పోయింది. దానికిగాను ఆమెకు వాన్ నడపిన డ్రైవర్ను నష్టపరిహార మిమ్మని కోర్ట్ తీర్పు చెప్పింది. కాని ఆ డ్రైవర్ జీతంలో ఆమె రాబట్టుకోగలిగే ద్రవ్యము అత్యల్పం కదా. వ్యక్తి స్వేచ్ఛకు, సభ తీర్చటానికి ప్రజల కున్న హక్కులు, తన ఇంటిలో, ఆవరణంలో పరులను రానీయకుండే హక్కు మొదలైన హక్కులు బ్రిటన్‌లో పౌరుల ప్రధాన సత్వాలుగా పరిగణించబడుతున్నవని మీకు తెలుసు. కాని వాటిని ప్రధాన పౌరసత్వాలుగా నిర్ణయించిన రాజ్యాంగ శాసన మేదీ ఇండియా, అమెరికా

దేశాలలో ఉన్నట్లు బ్రిటన్‌లో లేదు. భారత రాజ్యాంగం పీఠికలోనే పౌరుల ప్రధాన పౌర సత్వాలివి అని పేర్కొన్నది వాటికి భంగం కలిగితే ఏ పౌరుడైనా ఉన్నత న్యాయస్థానాల వల్ల న్యాయం పొందవచ్చునని రాజ్యాంగం కంఠోక్తిగా చెబుతుంది అదే విధంగా అమెరికన్ (U.S A.) రాజ్యాంగంలోను ప్రజల ముఖ్య పౌరసత్వాలు ప్రత్యేకించి రాజ్యాంగ శాసనానికి ఉపోద్ఘాతంగా చేర్చినారు కాని ప్రజల మౌలిక స్వాతంత్ర్యాలను ఇట్లా రాజ్యాంగ శాసనంలో ఒక భాగంగా చేర్చటంవల్ల లాభంకంటె నష్టమే హెచ్చు అని డైసీ అభిప్రాయము. వేరొక కాలంలో పరిస్థితుల ప్రాబల్యంవల్ల రాజ్యాంగంలో భాగమైన మౌలిక స్వేచ్ఛలను రద్దు చేయటమో, లేక తాత్కాలికంగానైనా తొలగించటమో సంభవించవచ్చు సూచిత స్వాతంత్ర్యాలలో చేర్చిన సమానత్వాన్ని నెలకొల్పటానికి ఉన్నత న్యాయస్థానాల సాయంతో రక్షించుకోవచ్చుననే ప్రధాన పౌరసత్వాలైన ఆస్తి హక్కు, వృత్తి విద్యా, ఉద్యోగ స్వాతంత్ర్యాలను పరిమితం చేయటానికి ఈనాడు ఇండియాలో జరుగుతున్న ప్రయత్నాలను గమనించే వారికి డైసీ భయానికి తగిన కారణాలున్నవని తోచక మానదు ఈ విధమైన ప్రధాన పౌరసత్వాలను ఇంగ్లండ్‌లో భద్రపరిచేది ఆ దేశ రాజ్యాంగంగాని అందులో పొందుపరిచిన మౌలిక సత్వాల జాబితాగాని కాదు అట్లాంటి హక్కులు బ్రిటిష్ శాసనాలలో లీనమై, విడదీయరాని విధంగా కలిసిపోయి ఉన్నవనే భావమే వాటికి పటిమనిస్తుంది శతాబ్దాలుగా న్యాయస్థానాలు చేస్తున్న తీర్పులు ఈ అభిప్రాయానికి స్థిరత్వాన్ని కలగచేసినాయి సాధ్యాసాధ్యాలను గమనించక, రాజకీయావేశాలకు లోనై వ్యక్తి స్వాతంత్ర్యం పోగొట్టుకోవటానికైనా సిద్ధపడేటంతగా బ్రిటిష్ ప్రజలు భావపరివర్తనం పొందిందాక ఆ దేశంలో వ్యక్తి స్వేచ్ఛ, ఆస్తి హక్కు, సమావేశ స్వాతంత్ర్యం మొదలైన ప్రధాన పౌరసత్వాలకు ఏ భయమూ లేదు

## బ్రిటన్‌లో పరిపాలక న్యాయవ్యాప్తి

బ్రిటన్‌లో అమలులో ఉన్న సమ న్యాయపాలనము, దాని ఘనతను గురించి డైసీ యెంత గొప్పలు చెప్పినా 1870 తో ఆరంభమైన నూరేండ్లలో ఆయన అభిప్రాయాన్ని అబద్ధం చేసే మార్పు లనేకం బ్రిటిష్ న్యాయపరిపాలనా రంగంలో జరిగినాయి. పరిపాలక న్యాయవిధానము - దత్త శాసనాధికారంతో బాటు ప్రజల జీవితంలో అనేక రంగాలలో వ్యాపించటమే ఈ మార్పులకు కారణము. దానికి ఫలితంగా మంత్రులేగాక ఇతర ప్రభుత్వాధికారు లనేకులు న్యాయ నిర్ణేతలైనారు. మంత్రులెట్లా శాసనకర్తలయింది ముందే విశదీకరించినాము. వారు న్యాయాధికారుల ధర్మాలను కూడా నిర్వహించటం ఎట్లా సంభవించిందో ఇక వివరిద్దాము.

18 వ శతాబ్దంలో వస్తువుల ఉత్పత్తికి ఆవిరి యంత్రాలు ఉపయోగించటంతో ఆరంభమైన పారిశ్రామిక విప్లవం ఈ ఇరవయ్యో శతాబ్దంలో విద్యుచ్ఛక్తి వాడకంతోను, యంత్రాల నిర్మాణంలో కానవస్తున్న విపరీత పరిణామంతోను, జనాభివృద్ధితోబాటు జీవితావసరాలు దిన దినం కొత్త మార్గాలలో పెరిగి పోవటంతోను, వ్యాపారరంగంలో అంతర్జాతీయ స్పర్థ బహుముఖాల తీవ్రతరం కావటంచేతను సమాజంమీద, ప్రభుత్వంమీద వ్యక్తి పోనుపోను మరింతగా ఆధారపడవలసి వస్తుంది. అందువల్ల, వస్తూత్పత్తి రంగంలోను, వాటి వినిమయంలోను, ప్రభుత్వం వహించవలసిన పాత్ర ఊహిరాదనంతగా పెరిగిపోతుంది. ఈ పరిస్థితులలో పరి

పాలక యంత్రాంగంమీద సమాజాభివృద్ధితోబాటు సామాజిక న్యాయం సమకూర్చటంలో మోయరానంత భారం పడుతుంది. ఈ భార మన్ని ప్రభుత్వశాఖలమీద ఒక్కనాడే పడలేదు. సమానంగాను పడలేదు. ఆ కారణంచేత, వివిధ జీవిత రంగాలలో ప్రభుత్వం జోక్యం కలిగించుకొనే కొద్దీ వ్యక్తులకు వివిధ ప్రభుత్వశాఖలకు మధ్య కలిగే వివాదాలు అనంతంగా అసంఖ్యాకంగా పెరిగిపోయినాయి. ఈ వివాదాలు తీర్చేపని సామాన్య న్యాయస్థానాలపైతో సెమ్ముటం సాధ్యంగాదు. న్యాయం కూడా గాదు ప్రజల క్షేమ, ఆరోగ్య, అభివృద్ధులు న్యాయస్థానాల తీర్పులకోసం కాచుకొని కూర్చుండవలసివస్తే పుణ్యకాలం ముందుగానే గడచిపోయి, వ్యక్తులకు, సంఘానికి తగినంతగా న్యాయం సకాలంలో సమకూరక పోవచ్చు. అనర్థం కలిగినా కలుగవచ్చు. ఏయే కారణాలవల్ల పార్లమెంట్ తన శాసనాధికారాన్ని దత్తం చేయవలసి వచ్చిందో ఆ కారణాలవల్ల దత్తాధికార ముపయోగించి మంత్రులు మొదలైన పరిపాలన శాఖాధికారులు చేసే నియమ, నిబంధనలు, చట్టాలు అమలుపరచటంలో పుట్టుకొనివచ్చే వివాదాలను కూడా వారే పరిష్కరించవలసి వచ్చింది. సామాన్య న్యాయస్థానాలవల్ల న్యాయం పొందవలెనంటే ఆలస్యం కావటమేగాక తలకుమించిన వ్యయం భరించవలసి ఉంటుంది. శిథిలావస్థలో ఉన్న ఇండ్లను పడగొట్టించవలెనన్నా, వాటి యజమానులను వాటిని పునర్నిర్మించేటట్లు నిర్బంధించవలెనన్నా, ప్రారంభ విద్యను నిర్బంధించి వ్యాపింపచేయవలెనన్నా, ప్రజా పసరాలు తీర్చటానికి నిర్మించవలసిన పాఠశాలలు, వైద్యాలయాలు, రహదారులు, రైల్వేలకోసం ప్రైవేట్ వ్యక్తుల భూములను కొంత మూల్యమిచ్చి ఆక్రమించవలెనన్నా ఉత్పన్నమయ్యే వ్యాజ్యాలను పరిష్కారం చేయటం పరిపాలన సాగించే ఉద్యోగులకు సాధ్యమయ్యేటట్లు న్యాయాధిపతులకు సాధ్యంగాదు కార్మికుల జీవన ప్రమాణాన్ని హెచ్చించడానికి వారికి న్యాయం సమకూర్చే నిమిత్తం ఫ్యాక్టరీ యజమానులపై పరిపాలకులు విధించే నిషేధాలు, జీతాల పెంపు, నష్టపరిహారాలు, కార్మిక గృహనిర్మాణాలు, విద్యా వైద్యాది సదుపాయాల ఏర్పాటునుగురించిన నియమాలు వివాద పరంపరను అనుదినం తెచ్చి పెడుతున్నాయి. వీటిని పరిష్కరించి న్యాయప్రదానం చేయటానికి కావలసిన ప్రత్యేక అనుభవజ్ఞానాలు సామాన్య న్యాయస్థానాలలోని న్యాయాధికారులకంటె ఆ యా పరిపాలక శాఖాధిపతులకే ఎక్కువగ ఉండటాని కవకాశముంది అలస్యంలేని, ఎక్కువ ఖర్చుగాని న్యాయం పరిపాలక న్యాయస్థానాలలోనే లభిస్తుంది. ఉదాహరణ: దారిని నడిచేవారిపై కూలిపడే ఇంటియొక్క యజమాని, ఆ ఇంటిని బాగుచేయించటానికి పేచీ పెడుతున్నాడనుకోండి. దానిని గృహనిర్మాణపు బోర్డ్ (Board) బాగుచేయించి దానికైన వ్యయాన్ని ఇంటి యజమానినుంచి రాబడుతుంది. హెచ్చు ధనం ఆ నెపంతో తన నెత్తిని వేసినదని గృహయజమాని వేసే వ్యాజ్యాన్ని విచారించి తీర్పిచ్చేది ఆ హౌసింగ్ బోర్డ్ వారే (Housing Board). ఆ తీర్పుపై మంత్రికి అపీల్ ఉంటే ఉంటుందిగాని న్యాయస్థానానికి మాత్రం ఉండదు. పరిపాలన న్యాయం ఏ విధంగా ఇంగ్లండ్‌లో పనిచేస్తూ ఉంది, దానివల్ల లాభనష్టాలేవి గ్రహించటానికి కొన్ని కొన్ని పరిపాలక న్యాయస్థానాలిచ్చిన తీర్పులను పరిశీలించటానికి సాయపడుతుంది.

### ప్రజారోగ్య శాసనము (Public Health Act) 1875

ఈ శాసనము స్థానిక ఆరోగ్యశాఖాధికారులకు అవేశాధికారాలిచ్చింది. ఆరోగ్య రక్ష

ణార్థం అనేక విషయాలలో వారిచ్చే తీర్పులపై స్థానిక ప్రభుత్వమండలి (Local Government Board) కి అపీల్ చేసుకొనే హక్కును కల్పించింది. ప్రజారోగ్య రక్షణార్థం కొన్ని మరమ్మత్తులు చేయవలసిందని గృహయజమానిని స్థానిక సానిటరీ అధికారులు (Local Sanitary Authority) కోరినా అతడు లక్ష్యపెట్టకపోతే ఆ మరమ్మత్తులను తామే చేయించి అయిన వ్యయాన్ని గృహ యజమానివల్ల ఆ అధికారులు రాబట్టుకోవచ్చునని, ఆ చర్యకు ఒప్పుకొని గృహ యజమాని స్థానిక ప్రభుత్వమండలికి అపీల్ చేసుకోవచ్చునని పై ఆరోగ్యశాసనంలో ఉంది. తమకు న్యాయమైందని తోచే తీర్పును ఆ మండలి ఇచ్చినప్పుడు ఆ తీర్పుకు రెండు పక్షాలవారు బద్ధులు కావలసిందని ఆ శాసనం విధిస్తూ ఉంది. ఆ తీర్పుపై ఏ న్యాయస్థానానికి విచారణాధికారం లేదు.

విద్యాశాసనా లనేకం విద్యామండలికి శాసనాధికారాన్ని న్యాయపరిపాలనాధికారాన్ని ఇచ్చినాయి. ఏ ప్రాంతంలోనైనా పాఠశాల స్థాపించటం అవసరమో కాదో, నిర్ణయించేది ఈ విద్యామండలే. ఉద్యోగవిరమణ చేసిన ఉపాధ్యాయుల కీయవలసిన పింఛన్‌లను గురించి ఉత్పన్నమయ్యే వివాదాలను పరిష్కరించేది ఈ మండలే విద్యామండలి నిర్ణయాలపై న్యాయస్థానానికి దేనికీ అపీల్ లేదు.

*ఆరోగ్యశాఖామంత్రికి ఇచ్చిన న్యాయాధికారాలు:* జాతీయారోగ్యం పెంచే నిమిత్తం చేసిన శాసనాలు, పేదల, కార్మికుల గృహనిర్మాణానికి సంబంధించిన న్యాయాధికారాన్ని ఈ మంత్రికి దత్తం చేసినది. ఏ యే వృత్తులవారి గృహాలు ఈ శాసనాల పరిధిలోకి వచ్చేది నిర్ణయించే అధికారమూ, వీటి కన్నింటికి సంబంధించి ఉత్పన్నమయ్యే వ్యాజ్యాలు విచారించి తీర్పు చెప్పే అధికారమూ ఆరోగ్యశాఖా మంత్రివి ఆ వ్యాజ్యాలకు సంబంధించిన న్యాయశాస్త్ర విషయమై సందేహంగల కొన్ని సందర్భాలలో మాత్రం ఈయన నిర్ణయాలపై ఉన్నత [illegible]న్యాయ స్థానానికి అపీల్ చేసుకోవటానికి అవకాశముంది.

*కార్మికమంత్రి:* నిరుద్యోగుల భీమా చట్టాలు అమలుచేసే సందర్భంలో నిరుద్యోగులు తమకు రావలసిన భృతినిగురించి చేసే వ్యాజ్యాలు పరిష్కరించడానికి ఉత్తరోత్తరంగా అధికారం నిర్వహించే పరిపాలక న్యాయస్థానాలు కార్మికమంత్రి న్యాయాధికారానికి లోబడినవి ఉన్నాయి. ఈ పరిపాలక న్యాయస్థానాల తీర్పులపై సామాన్య న్యాయస్థానాలకు అపీల్ ఉండదు

ఫ్రాన్స్‌లో పరిపాలక న్యాయస్థానాలు ఒక నిర్ణీత పద్ధతిలో నిర్మాణమైనవి. వాటిలో విచారణ క్రమము ఏకవిధంగా ఉండటమేగాక సామాన్య న్యాయస్థానాలలో జరిగేటట్లే పరిపాలక న్యాయస్థానాలలో కూడా నేరారోపణ, సాక్షుల విచారించటం, ఉభయపక్షాల న్యాయవాదులు వాదించటం, నేరారోపితుని వాఙ్మూలం విని, వాటిని ప్రశ్నించటం, న్యాయశాసనం ప్రకారం న్యాయాధిపతి తీర్పు చెప్పటం - ఇవి అనుసరించబడుతున్నాయి. ఇంగ్లండ్‌లోని పరిపాలక న్యాయ మొక్క రీతిగా నడవదు అక్కడి పరిపాలక న్యాయస్థానాలు ఒక క్రమాన్ని అనుసరించి ఏర్పడినవి కావు. వాటి నిర్మాణంలో, అధికారాలలో, న్యాయవిచారణ క్రమంలో కావలసినంత వ్యత్యాసముంది. ఈ న్యాయస్థానాలలో ఒకదానికి మరొకదానికి పొందికలేక పోవటమేగాక కావలసినన్ని లోపాలూ ఉన్నాయి. కొన్ని సందర్భాలలో న్యాయాధికారాలను పార్లమెంట్ మంత్రులకు ఇచ్చింది. కొన్నిచోట్ల, ప్రభుత్వశాఖల కిచ్చింది. కొన్నిచోట్ల

మంత్రులు నియమించిన వ్యక్తులకు, సంఘాలకు న్యాయాధికారాలివ్వటం కద్దు. ఈ విధంగా ఏర్పడిన న్యాయస్థానాలు విచారించి తీర్పు చెప్పే వ్యాజ్యాలు వివిధాలు. అనేక విషయాలకు సంబంధించినవి. సామాన్య న్యాయస్థానాలలో తీర్పులిచ్చే న్యాయాధిపతులు న్యాయ శాస్త్రంలో ప్రవీణులైనవారు. న్యాయం చెప్పటంలో వీరు ఏ విధమైన పలుకుబడికి, ఎవ్వరి ఒత్తిడికీ లొంగకుండేటట్లు తగు విధమైన జాగ్రత్తలు రాజ్యాంగం తీసుకొంది. ఉన్నత న్యాయాధిపతులు జీతనాతాలు, కొలువు భద్రత, కార్యనిర్వాహకవర్గం దయాదాక్షిణ్యాలపై ఆధారపడటం లేదని ముందే తెలిసింది. వ్యాజ్యానికి రెండు పక్షాలవారి సమక్షంలో విచారణ జరగటమేగాక న్యాయాధిపతి న్యాయస్థానంలో బహిరంగంగా తీర్పు చెప్పటం సామాన్య న్యాయస్థానాలలో చూసే విషయము ఇది పరిపాలక న్యాయస్థానాలన్నీ పాటించే పద్ధతిగాదు. మంత్రులుగాని, ప్రభుత్వశాఖల ఉద్యోగులు, ఇతర పరిపాలక సంఘాల సభ్యులుగాని అందరు న్యాయశాస్త్రం చదివినవారని చెప్పలేము. మంత్రుల పలుకుబడికి వారు లొంగనివారని ఎవ్వరూ అనలేరు. బ్రిటిష్ న్యాయస్థానాలన్నింటిలో ఉన్నత న్యాయస్థానమైన ప్రభుసభ కంఠోక్తిగా ఇట్లా సెలవిచ్చింది: "సామాన్య న్యాయస్థానాలనుసరించే విచారణ క్రమాన్ని పరిపాలక న్యాయస్థానాలు విధిగా అనుసరించనక్కరలేదు." ఈ సత్యాన్ని చాటే ప్రభుసభ తీర్పులను జి. బి. ఆడమ్స్ ఉదహరించిన వాటిని కొన్నింటిని ఇక్కడ సంగ్రహించినాను

వాది ప్రతివాదులు: రైశ్ - విద్యామండలి; తీర్పు చెప్పిన అపీల్ న్యాయస్థానము: ప్రభుసభ; తీర్పిచ్చింది - లోర్‌బర్న్ ప్రభువు (ఛాన్సలర్ ప్రభువు).

"1902 విద్యాశాసనము: స్థానిక విద్యాధికారులకు, ప్రైవేట్ పాఠశాలల నిర్వాహకులకు వివాదాలేర్పడితే తీర్పు చెప్పే అధికారాన్ని విద్యామండలికి పై శాసనం అప్పచెప్పింది ఒక్కొక్కప్పుడు ఈ తీర్పు విషయ ప్రాధాన్యంగాను, ఒక్కొక్కప్పుడు శాసనానికి వ్యాఖ్యానం చేయవలసి వచ్చేదిగాను, కొన్ని సమయాలలో రెండు విధాలుగా ఉండవచ్చు. అయినా విద్యామండలికి న్యాయస్థానానికి పోలిక లేదు న్యాయస్థానంలో జరిగే విధంగా విద్యామండలివంటి పరిపాలక న్యాయస్థానంలో విచారణ క్రమం ఉండనక్కరలేదు. ఆ మండలి తీర్పుపై - అది శాసనానికి వ్యాఖ్య చేయటానికైనా, వ్యాజ్యంలో నివేదించిన విషయాలనుగురించి చెప్పటానికైనా - అపీల్‌కు అనుమతించి పరిష్కరించటానికి ఏ న్యాయస్థానానికి అధికారం లేదు."

*లోర్‌బర్న్ తీర్పుకంటె ముఖ్యమైంది ప్రభుసభ అధిపతియైన హాల్‌డేన్ ప్రభువు 1915 లో ఆర్లిజ్‌కి స్థానిక ప్రభుత్వ మండలికి మధ్య సాగిన వ్యాజ్యం అపీల్‌లో ఇచ్చిన తీర్పు:* శిథిలావస్థలో ఉన్న ఆర్లిజ్ ఇంటిని పడగొట్టించవలసిందని బరోకౌన్సిల్ ఆజ్ఞ. ఇంటిని కొంత బాగుచేయించి, తన ఆజ్ఞను ఉపసంహరించుమని ఆర్లిజ్ చేసిన మనవిని బరోకౌన్సిల్ తోసిపుచ్చింది. దానిపై వరసగా స్థానిక ప్రభుత్వమండలికి, హైకోర్ట్ విభాగమైన రాజ న్యాయస్థానానికి (King's Bench Court), అపీల్ కోర్ట్‌కు, చివర ప్రభుసభకు ఆర్లిజ్ అపీళ్ళు చేసినాడు. ఒక్క అపీల్ కోర్ట్ మాత్రం ఆర్లిజ్‌కి అనుకూలం చేసింది. అపీల్ కోర్ట్ తీర్పును తలకిందులు చేస్తూ హాల్‌డేన్ చెప్పిందిది: "స్థానిక ప్రభుత్వ మండలి ఆర్లిజ్ అపీల్‌ను పరిష్కరించటంలో న్యాయాతిక్రమణమేమీ చేయలేదు. ఆ మండలి పరిపాలనా సంస్థ. పార్లమెంట్ దానిపై న్యాయాన్ని పాలించే బాధ్యత మోపింది. అంటే న్యాయస్థానాలు విచారణలో అనుసరించే విధానాన్ని అది అనుసరించవలెనని కాదు. విచారించ

టంలో ఏ పద్ధతిని తాను అనుసరించిన న్యాయమైన తీర్పు నివ్వటానికి వీలవుతుందో ఆ పద్ధతిని అది అనుసరిస్తే చాలు. అట్లాగాక మండలి సభ్యులు ఒక్కటిగాగాని, విడివిడిగాగాని సామాన్య న్యాయస్థానాలు వ్యాజ్య విచారణలో పాటించే పద్ధతులు అవలంబించవలెనంటే, అది పరిపాలక సంస్థకు సాధ్యమయ్యే పనిగాదు. వాది తాను చెప్పదలచుకొన్నది లిఖితంగా తెల్పితే చాలు. స్థానిక ప్రభుత్వమండలి అర్లిజ్ ఇల్లున్నచోట విచారణ జరిపించింది. ఇంతచేసినా తన కన్యాయం జరిగిందని అర్లిజ్ భావిస్తే, స్థానిక ప్రభుత్వమండలి అధ్యక్షుడు మంత్రి మండలి సభ్యుడే కాబట్టి, ఆయనవల్ల జరగకూడని అన్యాయం జరిగిఉంటే, ఆయనను దారికి తేవలసింది పార్లమెంటేగాని న్యాయస్థానాలు కాదు. స్వయంగా ఆయన చేసిన పనులకేగాక, ఆయన అధికారంలో ఉండే ఉద్యోగుల దోషాలకుగూడా స్థానిక పరిపాలనామంత్రి బాధ్యుడే.''

హల్‌డేన్ తీర్పులోని సారాంశము: సహజ న్యాయానికి (natural justice) వ్యతిరిక్తం గాని అంతవరకు, సామాన్య న్యాయస్థానా లనుసరించే విచారణక్రమాన్ని అవి పాటించక పోయినా, పరిపాలక న్యాయస్థానాలు ప్రసాదించే న్యాయము సమర్థనీయమే సహజ న్యాయము అనాది కాలంనుంచి మానవుడు సంఘజీవి అయిననాటినుంచీ అతనితోబాటు పుట్టి పెరిగిన సంప్రదాయ న్యాయము. ప్రాణరక్షణకు హక్కు, ఆస్తి హక్కు సహజ న్యాయం యొక్క పరిధిలో చేరినవని, ఈ హక్కులను మేలుగా రక్షించుకొనే నిమిత్తమే మానవులు ఒకటిగా కూడి రాజ్య మేర్పాటు చేసుకొన్నారని, అందువల్ల ఈ హక్కులను తుడిచి పెట్టటానికి మానవనిర్మితమైన ఏ శాసనానికీ అధికారంలేదని బ్రిటిష్ రాజనీతి శాస్త్రజ్ఞుల అభిప్రాయము. ఈ వాదానికి లోబడినదే యెవ్వరినిగాని ఆయన చెప్పుకోదలచినది చెప్పనీయకుండ, వినకుండా శిక్షించరాదనే సిద్ధాంతము. ఆ చెప్పుకొన్నది వ్రాతమూలక మైనంతమాత్రాన, న్యాయాధిపతి సన్నిధిలో నోటిమాటగా చెప్పక పోయిన కారణంచేత అర్లిజ్‌కి స్థానిక ప్రభుత్వంలోని తన తీర్పువల్ల అన్యాయం చేసినదనే వాదం చెల్లదని హల్‌డేన్ అభిప్రాయపడినాడు.

పరిపాలక న్యాయాన్ని ప్రసాదించటంలో పరిపాలక న్యాయాధికారులు ప్రతి సందర్భం లోను తమ తీర్పు న్యాయశాస్త్రానుగుణ్యంగా ఉన్నదా లేదా అని ఆలోచించటం లేదు. స్థాని కంగా పాఠశాలను స్థాపించలేదని వచ్చిన వ్యాజ్యంలో విద్యాశాఖ మంత్రి, అతనికి లోబడిన విద్యాధికారులు ఏ న్యాయశాస్త్ర విషయాన్నిగురించి తమ అభిప్రాయాన్ని చెప్పబూనటం లేదు. స్థానికంగా పాఠశాల అవసరాన్నిగురించి వారు నిర్ణయించ బూనేది. సాంఘికావసరాలు పెరిగి వాటిని బాధ్యతలు ప్రభుత్వంపై పడేకొద్దీ, ఈ రకమైన వివాదాల సంఖ్య విపరీతంగా పెరిగి వాటిని న్యాయవిరుద్ధంగాని విధంగా, ఎక్కువ ప్రజాప్రయోజనకారిగా తీర్పు లివ్వవలసిన భారం పరిపాలకులపై పడుతూ ఉంది. అందుచేత పరిపాలక న్యాయం ఎంతమాత్రం కూడ దనే మాట చెల్లదుగాని, గహనమైన న్యాయశాస్త్ర విషయాలపై న్యాయశాస్త్రపు వాసన కూడా తెలియని ప్రభుత్వాధికారులు తీర్పు ఇవ్వటం పరమ సాహసకార్యమనీ, అందువల్ల న్యాయశాస్త్రం హింసకు గురిఅవుతున్నదన్న మాటను సులభంగా తోసివేసే వీలుకాదు. పైగా, ఈ పరిపాలక న్యాయస్థానాలలో విచారణ బహిరంగంగానైన జరగకుండటం, ఉభయపక్షాల సాక్షుల కథ నాన్ని న్యాయవాదులు ప్రశ్నించటానికి వీలు లేకుండటం, ఈ న్యాయస్థానాలు తీర్పులు బహి రంగంగా ప్రకటించబడకపోవటం, పరిపాలక న్యాయాధికారులు తామిచ్చే తీర్పులకు కారణాలు చెప్పనక్కరలేకపోవటం – ఇవన్నీ నిర్దుష్టమైన న్యాయాన్ని పోషించటానికి తోడ్పడటం లేదు.

ఈ లోపాలు ఫ్రాన్స్‌లోని పరిపాలక న్యాయస్థానాలలో కనిపించటం లేదు. బ్రిటిష్ పరిపాలక న్యాయస్థానాధికారులు మానవ మాత్రులే. వాదికి ఏ తీర్పు న్యాయమిస్తుంది అని అంతగా చూడక ఏ తీర్పు పరిపాలన నిరాటంకంగా సాగటానికి అనుకూలిస్తుందనే యోచనే వారి పరిపాలన న్యాయంలో ఎక్కువగా ఈనాడు కానవస్తున్నదనే వాదంలో ఎంతో సత్యముంది. హీవార్ట్ ప్రభువు ఈ అభిప్రాయాన్నే ఈ విధంగా చెప్పినాడు : "ఫ్రాన్స్ దేశంలోని పరిపాలక న్యాయం సామాన్య న్యాయస్థానాలలో మనం చూస్తే న్యాయంకంటె భిన్నమైనా, అది న్యాయమే. న్యాయశాస్త్రానుగుణ్యమైందే. విచారణ క్రమం ఈ న్యాయస్థానాలలోను సామాన్య న్యాయస్థానాలు పాటించేదే అమలులో ఉంది ఇక బ్రిటిష్ పరిపాలక న్యాయస్థానాలు పంచి ఇచ్చే న్యాయాన్ని పరిపాలక న్యాయమనటం కంటె పరిపాలక అన్యాయము (Administrative Lawlessness) అనటమే సమంజసము" బ్రిటిష్ పరిపాలక న్యాయంవల్ల ప్రజల స్వేచ్ఛ హత్యపాలబడటానికి కావలసినంత అవకాశముంది బ్రిటన్‌లో ఈనాడు మనం చూసే న్యాయపరిపాలనలో న్యాయశాస్త్రానుగుణ్యమైన సమన్యాయము (Rule of Law) చాలా అప్రధాన స్థానాన్నీ ఆక్రమిస్తుంది హీవార్ట్ అభిప్రాయం ప్రకారం న్యాయశాస్త్ర విరుద్ధమైన పరిపాలకన్యాయం ప్రజల జీవితాన్ని భయంకరంగా ఆవరించి ప్రజల స్వేచ్ఛకు గొడ్డలి పెట్టుగా పరిణమిస్తుంది.

పరిపాలక న్యాయం ఆచరణలో ఉన్న మరికొన్ని రంగాలు ఇక్కడ ప్రస్తావిస్తున్నాను విద్య ప్రజారోగ్యము, శిథిల గృహ నిర్మూలనంవల్ల పుట్టుకొనివచ్చే వ్యాజ్యాలే గాక ఇతర పరిపాలక న్యాయస్థానాలకు పని కల్పించినవి. 1. వీధుల శాసనము (Roads Act) 1920. బస్సుల నడపటానికి లైసెన్స్ లియ్య నిరాకరించటం గురించి చేసే అపీళ్లను పరిష్కరించేఅధికారాన్ని ఈ శాసనం రవాణా మంత్రికి ఇచ్చింది 11 కొత్త పాఠశాలలను స్థాపించే విషయంలో అపీళ్లను విద్యామండలి పరిష్కరిస్తుంది. 111 కౌంటీ కౌన్సిల్ జారీ చేసిన ఆజ్ఞను రద్దుచేసే పని ఆరోగ్యశాఖా మంత్రిదిగాని, న్యాయస్థానాలది గాదు iv. పై విధంగా కొన్ని న్యాయసంబంధమైనవి, కొన్ని కొంత మాత్రమే న్యాయశాస్త్రంతో ముడిపడినవి అయిన వ్యాజ్యాలను విచారించి తీర్పులిచ్చే న్యాయపరిపాలనాధికారం జిల్లా ఆడిటర్‌కు, జాతీయ ఆరోగ్య రక్షణ న్యాయస్థానాలకు (National Health Insurance Tribunals), నిరుద్యోగ నివారణ న్యాయస్థానాలకు (Unemployment Insurance Tribunals), వాణిజ్య మండలి (Board of Trade) కి బ్రిటన్‌లో ఇచ్చినారు. వీరు ప్రయోగించేది సూటిగా పార్లమెంట్ ఆమోదించిన శాసనాలను గాదు - అది ఒక విరమైన పరిపాలక న్యాయము. అంతగా వ్యక్తుల స్వేచ్ఛను, హక్కుల రక్షణగాక, ప్రజల శ్రేయస్సును సంఘ ప్రయోజనాలనే ప్రధానంగా దృష్టిలో ఉంచుకొని, వివిధ పరిపాలనా శాఖలలోని ప్రభుత్వోద్యోగులు, ఆ న్యాయాన్ని పౌరులకు, కార్పొరేట్ సంస్థలకు పంచి ఇస్తున్నారు. పరిపాలక న్యాయము అనే మహావృక్షం శాఖోపశాఖలై పెరిగి, ఏక న్యాయపరిపాలనాన్ని తన నీడలో అణచివేస్తున్నది. ఈ అనిష్టాన్ని కొంతవరకైనా సంస్కరించవలెననే సదుద్దేశంతో 1929లో ఏర్పరచిన డొనమూర్ కమిటీ శాసనాధికారాన్ని ప్రభుత్వోద్యోగులకు పార్లమెంట్ దత్తం చేయటంవల్ల కలిగిన ఫలితాలనుగురించి నివేదించటమేగాక, పరిపాలక న్యాయస్థానాల గుణదోషాలను ప్రస్తావించి, వాటి లోపాలను సంస్కరించటానికి కొన్ని సూచనలనుకూడా చేసింది

పరిపాలక న్యాయము స్వతసిద్ధంగా లోపభూయిష్ఠమైంది కాదు. కాని దానివల్ల వ్యక్తి స్వేచ్ఛకు, ఏక న్యాయరక్షణకు భంగం కలుగకుండా తగు జాగ్రత్తలు కొన్ని తీసుకోవలసి ఉంటుందని డొనమూర్ కమిటీ సెలవిచ్చింది. న్యాయశాస్త్రాన్ని వ్యాఖ్యానించి అన్వయించ వలసిన వ్యాజ్యాలను సాధ్యమైనంతవరకు సామాన్య న్యాయస్థానాలకు, మంత్రులేర్పరచిన న్యాయసభలకు (Tribunals) అసాధారణ పరిస్థితులలోను అప్పజెప్పవలె. ఎంతో ప్రత్యేక కారణాలున్నప్పుడే తప్ప మంత్రులు ఆ వ్యాజ్యాలను విచారించరాదు. న్యాయశాస్త్ర వివరణ మంతగా అక్కరలేని, వ్యవహార ప్రధానాలు, ప్రభుత్వ విధానాలకు సంబంధించినట్టివైనా వ్యాజ్యాలు పరిష్కరించే అధికారం సామాన్యంగా మంత్రులకే ఇవ్వవలె. న్యాయశాస్త్ర ప్రసక్తి లేని వ్యాజ్యాలు మంత్రులు ఏర్పాటుజేసిన న్యాయసభలకు (ministerial tribunals) ప్రత్యేకించవచ్చు. మంత్రులు గానివారు నియమించే న్యాయసభలుగాని ఏ కారణాలవల్ల తాము ఆ తీర్పు చెప్పవలసివచ్చింది వ్యాజ్యానికి వచ్చిన రెండుపక్షాల వారికి తెలియచేయవలె, తాము పరిష్కరించిన ప్రధాన వ్యాజ్యాల సంగ్రహాలు ప్రకటిస్తుండవలె. మంత్రిగాని మంత్రి నియమించిన న్యాయసభగాని ఇచ్చిన తీర్పులలో న్యాయశాస్త్ర విషయము ఇమిడిఉంటే వాటిపై సామాన్య న్యాయస్థానాలకు అపీల్ చేసే అవకాశము ఉండవలె. మంత్రులు, మంత్రి నియమించిన న్యాయసభలూ పార్లమెంట్ ఇచ్చిన న్యాయాధికారాలను అతిక్రమించకుండేటట్లు వారిని నిర్బంధించే అధికారాన్ని ఉన్నత న్యాయస్థానాలకివ్వటమేగాక ఆ అధికారానికి ఏ దెబ్బ కలగకుండా జాగ్రత వహించటం అత్యంతావసరము.

# 19
# బ్రిటిష్ రాజ్యాంగ సంప్రదాయాలు

**(Conventions of the British Constitution)**

ఏ ఇతర ఐరోపా రాజ్యంలోను రాజ్యాంగ పరిణామము పురాతనకాలం నుంచి ఈనాటి వరకు బ్రిటన్‌లో ఉన్నంతగా అవిచ్ఛిన్న చరిత్ర ఉందని చెప్పటానికి వీలు లేకుంది. ప్రధాన మైన బ్రిటిష్ రాజ్యాంగాలు, సంస్థలు వెయ్యేండ్లకు ముందున్నట్లే ఈనాడు కూడా నిలిచి ఉన్నాయి రాజపదవి, పార్లమెంట్ సంస్థ, రాజసభ, ప్రభువర్గము, మతానికి రాజరికానికి ఉన్న లంకె, ఉన్నత పరిపాలనాధికారి వర్గము, మేజిస్ట్రేట్‌లు, న్యాయాధిపతులతో కూడిన న్యాయస్థానాలు - వీటన్నింటితో కూడిన ఇనప చట్రంలో బ్రిటిష్ రాజ్యాంగం ఈనాడూ, ఏ నాడు ఒకే విధంగా బిగించినట్లుంది. కాదంటే వీటిమధ్య పరస్పరం ఉండే సంబంధము, ఒక్కొక్కదాని ప్రాధాన్యము శతాబ్దాలుగా మారిందనవచ్చు. సాంఘికంగాను, ఆర్థికంగాను, రాజకీయంగాను, మతవిశ్వాసాలలోను, అంతర్జాతీయ వ్యవహారాలలోను మార్పులు వచ్చేకొద్దీ జాతీయ జీవితంలోను మార్పులు వచ్చి ఒకనాడు ప్రధానమైనవని భావించిన సంస్థలు అప్ర ధానాలుగాను ప్రాముఖ్యంలేని ప్రణాగణాలు అతిప్రాముఖ్యమున్నవిగాను మారటం కాలాను గుణంగా జరిగింది. పాతసంస్థలు కొన్ని మూలబడినా, వాటిలో అనేకం కొత్తగా ఏర్పడిన వాటితో పొత్తు కుదుర్చుకోవటం సంభవించింది. ఈ బ్రిటిష్ జాతి పనిబూని, ఏ కాలంలోను, ఉన్న రాజ్యాంగ సంస్థలను ఊడ్చి పెట్టింది లేదు. ఈ పరిణామానికి తోడ్పడి, కాలానుగుణంగా రాజ్యాంగానికి - రాజ్యాంగ శాసనాలతోబాటు - పుష్టినిచ్చినవి అలిఖితమైన ఆచారాలు. జాతిలో జీర్ణించి నిల్చిన జాతీయ మర్యాదలు, రాజ్యాంగ సంప్రదాయాలు. ఈ సంప్రదాయాలు తర తరానికి మార్పు చెందుతూ పోయినవే. 15 వ శతాబ్దపు రాజ్యాంగి సంప్రదాయాలు పార్ల మెంటరీ అధికారాన్ని బలపరచగా, 16 వ శతాబ్దంలోని సంప్రదాయాలు పార్లమెంటరీ అధికా రాన్ని కాదనకుండానే ట్యూడర్ రాజుల నిరంకుశత్వానికి దోహదం చేసినవి పాత సంప్ర దాయాలకు కొత్త అర్థాలు చెబుతూ రాజమంత్రులను పార్లమెంట్‌కు జవాబుదారీ వహించేటట్లు చేసే యత్నము 1688 ప్రసిద్ధ విప్లవం (The Glorious Revolution) తో ఒకపాటి విజయం పొందింది. పార్లమెంట్ ఆధిక్యాన్ని మేరీ విలియమ్‌లు స్పష్టంగా అంగీకరించినా, రాజ్యాంగ సంప్రదాయాల మహిమవల్ల కార్యనిర్వాహకవర్గం (Executive) తామే సర్వాధి కారులుగా వ్యవహరించినారు. 18 వ శతాబ్దంలోని రాజ్యాంగ సంప్రదాయాలు, 19 వ శతాబ్దా నికి, 19 వ శతాబ్దపు మర్యాదలు, ఆచారాలు 20 వ శతాబ్దానికి మార్పులు క్రమంగా పొంది బ్రిటిష్ సామ్రాజ్యము, కామన్‌వెల్త్‌గా మారి, సర్వతంత్ర స్వతంత్రమైన మహారాజ్య సమ్మేళ నంగా రూపొందింది. ఈ సమ్మేళన రాజ్యాల కూటమికి తలమానికము బ్రిటిష్ రాజు. ఆ రాజునకు తన దేశంలోనే పరిపాలనాధికారము సున్న. పటాటోపము అధికము. పార్లమెంట్‌లో సంఖ్యాధిక్యం పొగొట్టుకొన్న క్షణాన పదవీ భ్రష్టుడు కావలసిన ప్రధానమంత్రి చెప్పుచేతు

లలో ఉండవలసినవాడు ఆ బ్రిటిష్ రాజు. ''పేరుకు పెద్ద - ఊరేమో దిబ్బ'' అన్నట్లు పేరు కాయన దేశంలోని - భూ, జల, వాయు సైన్యాలకన్నిటికి ప్రధాన సైన్యాధిపతి అయన చేవ్రాలులేని చట్టమేదీ చెల్లదు. మంత్రులను, సైన్యాధిపతులను, రాయబారులను, ఉన్నత న్యాయాధికారులను, ప్రధానోద్యోగులను నియమించేవాడు అయనే. పార్లమెంట్‌ను సమావేశ పరిచేది, రద్దు చేసేది, మంత్రివర్గాన్ని బర్తరఫ్ చేసి సాధారణ ఎన్నికలు జరిపేది బ్రిటిష్ రాజరికమే. విదేశాలమీద యుద్ధం ప్రకటించేది, వాటితో సంధి చేసుకొనేది బ్రిటిష్ రాజే. అయినా బ్రిటిష్ రాజుకు భరణం ఇచ్చేది పార్లమెంటే. ప్రధానమంత్రి అనుమతిలేనిది, దేశం విడిచిపోవటానికి అతనికి స్వాతంత్ర్యం లేదు. రాజుగా ఆయన చేసే పనులన్నీ ప్రధానమంత్రి ఆదేశంతో, ఆమోదంతో చేయవలసిందే. ఈ చిత్ర విచిత్రమైన బ్రిటిష్ రాజ్యము ఒక సుప్రసిద్ధ ప్రజారాజ్యము. కాని రాజరిక రాజ్యాలలో ఉన్నట్లు దానికి తలవంటివాడు రాజు. ఆ రాజ్యంలో సర్వాధికార సమన్వితమైనది పార్లమెంట్ - ఆ పార్లమెంట్‌లోను ప్రజాసభ (House of Commons) లోనే ఆ అపరిమిత సమగ్రాధికారం నిక్షిప్తమై ఉన్నది. కాని ప్రభుపాలిత రాజ్యమనిపించేటట్లు బ్రిటిష్ పార్లమెంట్‌లో శాసనాధికారాన్ని ప్రజాసభతో పంచుకొనే ప్రభుసభ ఉంది. అది బహుసంఖ్యా బలము ఉండేది బ్రిటిష్ రాజరికానికి అలంకార ప్రాయమైనది, శతాబ్దాల అవిచ్ఛిన్న చరిత్ర గలది - సాధారణ ఎన్నికలలో ఒకనాడున్న పరిపాలక బృందాన్ని మరునాడు అధికార భ్రష్టం చేసే శక్తి ఉన్న వోటర్ మహాశయులు ఈ రాజ్యంలో ఉన్నారు. చూడటానికట్లా పరస్పర విరుద్ధమైన లక్షణాలు బ్రిటిష్ రాజ్యంలో అమరి ఉండటానికి కారణమేమి ? రాజ్యాంగ శాసన పరంపరలవల్ల అది పరిణామం పొందటమేకాక అనేక రాజ్యాంగ సంప్రదాయాలు, రాజకీయాచారాలు, మర్యాదలు కాలానుగుణంగా పుట్టి, పెరిగి, రోజు రోజుకూ మార్పులు చెందుతూ రాజ్యాంగానికి బలమివ్వటమే కారణము. ఈనాటి బ్రిటిష్ రాజ్యాంగం ఈ విధంగా అనేక రాజ్యాంగ శాసనాల, సంప్రదాయాల సృష్టి

*రాజ్యాంగ శాసనాలకు, రాజ్యాంగ సంప్రదాయాలకు (ఆచారాలకు) ఉన్న వ్యత్యాసాలు ముఖ్యంగా రెండు:* i న్యాయస్థానాల మూలంగా శాసనాలను అమలు పరచవచ్చు. రాజ్యాంగ సంప్రదాయాలను ఆ విధంగా అమలుపరచలేము. సంప్రదాయాలకు భంగం కలిగినప్పుడు ఇదిగో ఈ విధంగా ఈ రాజ్యాంగ సంప్రదాయానికి భంగంకలిగింది అని నిర్ణయించే నిర్దిష్టమార్గం లేదు. ఒకవైపు రాజ్యాంగ సంప్రదాయాన్ని అతిక్రమించినారని కొందరు వాదించేటప్పుడే మరికొందరు సంప్రదాయాతిక్రమణ మేమీ -జరగలేదని వాదించటం ఎన్నో సార్లు చూస్తున్నాము. ఈ రాజ్యాంగ సంప్రదాయ భంగానికి ఈ ప్రతిక్రియ అని నిర్ణయమేమీ ఉండదు. ఒక వోటర్‌కు వోట్‌ను నిరాకరిస్తే న్యాయస్థాన సహాయంతో అతడు తన వోటింగ్ హక్కును సాధించుకోగలడు. రాజ్యాంగ సంప్రదాయ ప్రకారం శాసనాలను రాజు వీటో చేసే అధికారం లేదు. సంప్రదాయ విరుద్ధంగా రాజొకవేళ శాసనాన్ని వీటో చేయటం జరిగినా, సంప్రదాయ భంగానికి ఆయన చర్యను ఏ న్యాయస్థానము ఆక్షేపించటానికి వీలులేదు.

ii. శాసనాలకు చాలావరకు నిశ్చితార్థాలుంటాయి. వాటి భాష స్పష్టంగా ద్వంద్వార్థాలకు తావీయకుండా ఉండవలెనని శాసన రచయితలు చాలా శ్రద్ధ తీసుకొంటారు. రాజ్యాంగ సంప్రదాయ విషయంలో దానిని సుస్పష్టమైన భాషలో నిర్వచించవలెనని ప్రయత్నం చేసిన వారెవ్వరూ ఉండరు. అందువల్ల ఒక్కొక్కప్పుడు సుస్థిరమని చాలా కాలంగా భావించిన

రాజ్యాంగ సంప్రదాయ విషయంలో కూడా అభిప్రాయభేదాలు ఉత్పన్నం కావటం కద్దు. ఉదాహరణకు 1923 సంవత్సరానికి ముందు పార్లమెంట్‌లోని ఏ సభకు చెందిన వ్యక్తి అయినా ప్రధానమంత్రి కావటానికి వీలుండేది కాని కామన్స్ సభ్యుడైన స్టాన్లీ బాల్‌విన్‌ను ఆ కారణాన్ని బట్టి, ఆయనకంటె అనుభవశాలి పేరుగాంచిన వాడూ అయిన కర్జన్ ప్రభువును కాదని, రాజు ఆహ్వానించి, ప్రధానమంత్రిగా తన మంత్రివర్గాన్ని ఏర్పాటుచేయవలసిందని కోరినాడు ఆనాటి నుంచి ప్రధానమంత్రేకాక తదితర మంత్రులలో ముఖ్యులైనవారూ కామన్స్ సభ్యులై ఉండవలెనని, పరిపాలనలో ప్రముఖమైన శాఖలు తీసుకొన్న మంత్రులు కామన్స్ సభ్యులుగానే ఉండవలసిందని ఒక నూతన రాజ్యాంగ సంప్రదాయం బయలుదేరింది. కాని ఈ సంప్రదాయం స్థిరంగా బ్రిటిష్ రాజకీయాలలో నాటుకొన్నదని అనటానికి ఈ నాటికీ వీలులేదు. ఏనాడైనా ప్రభుసభ సభ్యుడొకడు తన పక్షానికి నాయకుడైనవాడు, సమర్థుడూ మంత్రివర్గాన్ని ఏర్పాటుచేయటానికి అన్ని విధాల అర్హుడైనవాడూ ఉండటం తటస్థిస్తే పైన చెప్పిన సంప్రదాయానికి ఆనాటి రాజు తిలోదకాలు వదిలి ఆ ప్రభువునే ప్రధానిగా వరించదని ఎవ్వరూ చెప్పలేరు అట్లా ముమ్ముందొక రాజు చేసినా, బ్రిటిష్ రాజ్యాంగ సంప్రదాయాల నతదు భగ్నం చేసినాడని ఎవ్వరూ ఆక్షేపించలేరు కాలానుగుణంగా శాసనాలే మారటం ఉండగా, ఇక రాజకీయ సంప్రదాయాల స్థిరత్వాన్నిగురించి చెప్పే దేముంది.

అత్యంత ప్రధానాలైన రాజ్యాంగ సంప్రదాయాలు కొన్నింటిని ఇక్కడ ప్రస్తావిస్తున్నాను.

(i) పార్లమెంట్ (ఉభయసభలు కూడి) ఆమోదించిన ఏ శాసనాన్నీ రాజు తోసిపుచ్చడు

(ii) కామన్స్ సభ ఆమోదించి పంపిన శాసనాన్ని ప్రభుసభ తిరస్కరిస్తే, దాని ప్రతిఘటనాన్ని తోసిపుచ్చి, శాసన కార్యంలో ఏర్పడిన ప్రతిష్టంభనను తొలగించటానికి అవసరమైనంత మందిని ప్రభుత్వ పక్షానికి చెందినవారిని ప్రభు సభకు రాజు కొత్తగా నియమించ గలడు ఆ విధంగా కొత్త ప్రభువులను చాలామందిని అవసరమైతే సృష్టించగలనని రాజు బెదిరించినందువల్లనే కామన్స్ సభ ఆమోదించి పంపిన 1832 సంస్కరణ శాసనానికి ప్రభుసభ సభ్యులు అడ్డుతగలటం మానుకొన్నారు.

(iii) కామన్స్ సభలో ఆ సమయానికి ఏ రాజకీయ పక్షానికి సంఖ్యాబలం అధికమైతే సామాన్యంగా మంత్రులు కావలసింది ఆ పక్ష నాయకులు. ఆ నాయకులలో బాగా పలుకుబడి ఉన్న వారిని ఆహ్వానించి, అతనిని ప్రధానమంత్రిగా ఉండమని, అతని సహ మంత్రులను పేర్కొనవలసిందని రాజు అడగవలె.

(iv) మంత్రులంతా కలిసి కామన్స్ సభకు ఉమ్మడిగా బాధ్యులై ఉండవలె.

(v) కామన్స్ సభ యొక్క నమ్మకం పోగొట్టుకొన్న తక్షణమే మంత్రివర్గ మంతా రాజీనామా లిచ్చి మంత్రిపదవులను వదులుకోవలె.

(vi) కాబినెట్ తాను అధికారంలో ఉన్న కాలంలో కామన్స్ సభను, ఒక్కసారి రద్దు చేసి సాధారణ ఎన్నిక జరిపించి, ప్రజలకు తమపైనా, తమ విధానంలోను విశ్వాసమున్నదని నిర్ధారించటానికి ప్రయత్నం చేయవచ్చు.

(vii) ప్రభుసభ న్యాయస్థానంగా సమావేశమై అపీళ్ళు వినేటప్పుడు, న్యాయవాద

ప్రభువు (law-lord) కానటువంటి ప్రభుసభా సభ్యుడెవ్వడూ ఆ న్యాయస్థాన వ్యవహారాలలో పాల్గొరాదు.

(viii) సంవత్సరానికి ఒక్కసారి అయినా పార్లమెంట్‌ను సమావేశపరచవలె.

(ix) చిత్తు చట్టాన్ని ప్రభుసభకు పంపేలోగా కామన్స్ సభలో దానిని మూడు సార్లయిన చదివి ఉండవలె.

(x) నేర మారోపించబడిన ప్రభుత్వోద్యోగిని ఇతర సామాన్య పౌరునివలెనే సామాన్య న్యాయస్థానాలలో, సమాన న్యాయశాస్త్రం ప్రకారం విచారణ జరుపుతారు.

(xi) ఒక బ్రిటిష్ డొమీనియన్ ప్రధాని ఆ డొమీనియన్‌కు ఎవరిని రాజు ప్రతినిధిగా పంపవలెనో ఆ వ్యక్తి పేరును తానే స్వయంగా బ్రిటిష్ రాజుకు విన్నవిస్తున్నాడు. ఆ ప్రధాని సూచించిన వ్యక్తిని రాజు డొమీనియన్‌లో తన ప్రతినిధిగా (గవర్నర్, లేదా గవర్నర్ జనరల్) నియమిస్తున్నాడు

(xii) తమ వైదేశిక నీతిని బ్రిటిష్ డొమీనియన్‌లు ఒండొంటితో సంప్రదించి నిర్ణయిస్తున్నాయి. ఇది ఇట్లా జరగటం బ్రిటన్ - బ్రిటిష్ డొమీనియన్‌ల సంబంధాలలో క్రమంగా రూపొందిన రాజకీయ సంప్రదాయాల ఫలితమేగాని ఏ శాసన ఫలితమూ కాదు. డొమీనియన్‌ల ప్రతినిధులు బ్రిటిష్ మంత్రివర్గ ప్రతినిధులు సమావేశమై జరిపిన బ్రిటిష్ సామ్రాజ్య మహాసభలలో (Imperial Conferences) బ్రిటన్‌తో డొమీనియన్‌లకూ, వాటికి అన్య దేశాలతోను వ్యవహారాలు నడుపుకోవటంలో స్వతంత్ర ప్రతిపత్తి ఉండవలెనని నిశ్చయించబడుతుంది. తాను విదేశంతో చేసుకోదలిచిన ఒడంబడిక బ్రిటన్‌కు ఇతర డొమీనియన్లకు ముందుగా యే డొమీనియన్‌గాని తెలపవలెననటం కూడా సంప్రదింపుల మూలంగా నిర్ణీతమైనదే. శాసనాల మూలంగాగాక, ఇట్లా సంప్రదింపులవల్ల అవి నిర్ణీతం కావలసి రావటం, కొత్త సంప్రదాయాల ఫలితమని తెలుసుకోవలె

(xiii) మొదటి నుంచి వైదేశిక రాజనీతి, సైన్యాలమీద అధికారమూ సామ్రాజ్య వ్యవహారాలు, డొమీనియన్‌ల పరిపాలన, ఉద్యోగ నియామకాలు - వేతనాలు రాజు యొక్క సొంత అధికారాల పరిధిలో ఉండేవే అధిక సంఖ్యాబలమున్న రాజకీయ పక్షానికి ప్రతినిధిగా మంత్రిమండలి (Cabinet) రాజాధికారాలను స్వీకరించిననాటి నుంచి పై ప్రత్యేక అధికారాలు మంత్రిమండలికి శాసనాలవల్లగాక సంప్రదాయాల రూపేణ సంక్రమించినాయి.

(xiv) 19, 20 శతాబ్దాలలో సంఘోద్ధరణ కార్యక్రమాలు, ఆర్థిక ప్రజాశికావసరాలు పరిపాలన కార్యవిస్తరణ అనేక నూతన బాధ్యతలను ప్రభుత్వంపై మోపింది. వీటి నిర్వహణకు పార్లమెంట్ ఎన్ని కొత్త శాసనాలు చేసినా, వాటిని అమలుపరచడంలో ప్రభుత్వం శాసన సిద్ధంగాని ఏర్పాట్లుచేయవలసి వచ్చింది ; నూతన అధికారవర్గాన్ని నియమించవలసి వచ్చింది ; కాబినెట్ పరిధిలో లెక్కలేనన్ని కమిటీలను, సంఘాలను సృష్టించింది. వీటన్నిటి ఫలితం అనేక నూతన సంప్రదాయాల సృష్టి. అసలీ కమిటీలే కొత్త సంప్రదాయాల ఫలితము.

(a) కానై ఏ విషయాన్నిగురించి నిర్ణయాలు తీసుకొని కమిటీలలో దేశీయ వ్యవహారాల కమిటీ (Home-affairs Committee) ఒకటి. ఒక మంత్రిత్వశాఖ నుంచి బయలెవెడలిన చిత్తు చట్టాన్ని, ఇతర మంత్రిత్వశాఖలకు పంపి, దానిపై వారి అభిప్రాయాలను తెలుసుకొని వాటిని సమన్వయపరిచి తన సూచనలతోపాటు మంత్రిమండలి (Cabinet) కి

నివేదించటం ఈ దేశీయ వ్యవహారాల కమిటీ పని. (b) ప్రత్యేక కార్యాల నిర్వాహణకోసం తాత్కాలికంగా నియమించిన కమిటీలు తాము చేయవలసిన పని పూర్తి చేయటంతో సమాప్తం గాక నిలిచి ఉండేవి. 1988 లో నియామకమైన విదేశ వ్యవహారాల కమిటీ (Foreign Affairs Committee) అట్లా ఏర్పడిన కమిటీలలో ఒకటి మంత్రిమండలి చేసే పనులతో సన్నిహితంగా తోడుపడే సామ్రాజ్య రక్షణ కమిటీ, ఆర్థిక విషయమైన సలహాలిచ్చే కమిటీ అటువంటిదే. (c) మంత్రి ఒకరు సమర్థుల సలహాలను కోరి తానై నియమించుకొనే తదర్థ (adhoc) కమిటీలు (d) రాయల్ కమిషన్‌లు (e) పార్లమెంట్‌కు ఒక విషయాన్ని నివేదించటానికి ఏర్పాటుచేసే కమిటీలు. (f) తమ తమ ప్రభుత్వశాఖలతో సహకరించే నిమిత్తం మంత్రులు నియమించే ప్రత్యేకమైన కమిటీలు. ఈ కమిటీలన్నీ పార్లమెంటరీ శాసనాలు సృష్టించినవి కావు. కొత్తగా ప్రభుత్వావసరాలు ఏర్పడేకొద్ది వాటిని తీర్చటంకోసం, శాసనాలకు అవిరుద్ధంగాను, శాసన ప్రయోజనాలు తీర్చే నిమిత్తం నూతన సంప్రదాయాలను సృష్టించిన సంస్థలు.

(xv) ప్రివీ కౌన్సిల్ యొక్క జుడీషియల్ కమిటీ (Judicial Committee) కు డొమీనియన్ న్యాయస్థానాల తీర్పులపై అపీల్ చేసే అధికారం చాలావరకు మూలబడటం కొత్తగా అమలులోకి వచ్చిన సంప్రదాయము 1926 లో జరిగిన సామ్రాజ్య మహాసభ ఇట్లా తీర్మానించింది "సామ్రాజ్యాంతర్భాగమైన ఏ దేశంనుంచి, ఆ దేశ ప్రభుత్వం ఇష్టానికి వ్యతిరేకంగా ప్రివీ కౌన్సిల్ న్యాయసభ అపీళ్ళను పరిష్కరిస్తూ ఉండవలెనని బ్రిటన్‌లోని బ్రిటిష్ రాజ ప్రభుత్వపు ఉద్దేశం కాదు." ప్రివీ కౌన్సిల్ సభ్యులై దాని న్యాయ సభలో న్యాయాధిపతులుగా తీర్పు లిచ్చేవారు బ్రిటిష్ దేశస్థులే కాదు. భారతీయులు, కెనేడియన్‌లు, ఇతరులు ఉండటం కూడా ఉన్నది. ఈ సభ ఒక డొమీనియన్‌నుంచి అపీళ్ళను ఎక్కువగానో, లేదా తక్కువగానో పరిష్కరించటం ఆ డొమీనియన్ ఇష్టానిష్టాల మీద ఆధారపడి ఉన్నది. ఈ విధంగా ప్రివీ కౌన్సిల్ న్యాయసభ చట్టరీత్యా తరతరాలుగా అనుభవిస్తున్న అపీళ్ళను విచారించే అధికారం నూతన సంప్రదాయాల ప్రభావంవల్ల కొన్ని డొమీనియన్‌లలో క్షీణించింది, కొన్నింటిలో నశించింది.

### సంప్రదాయాలు మన్నించటానికి తోడ్పడే సందర్భాలు

సంప్రదాయాలను ఎవరూ శాసనాలని అనరు కదా! న్యాయస్థానాలు సంప్రదాయాలకు విరుద్ధంగా నడిచేవారిని శిక్షించవు కదా? కామన్స్ సభ అవిశ్వాసాన్ని ప్రకటించినా, తిరిగి జరిపించిన ఎన్నికలలో ప్రధానమంత్రి పక్షం ఓడినా, ఆయన పదవినుంచి తొలగటానికి నిరాకరించినా, న్యాయస్థాన మతనిమీద ఎట్లాంటి చర్య తీసుకోదు పార్లమెంట్ ఆమోదించిన చట్టాన్ని ఆచారానికి వ్యతిరేకంగా రాజు ఆమోదించక వీటో చేసినా, బ్రిటిష్ న్యాయస్థానము మిన్నకుండే గతి ఏమిటి? ఇటువంటి సందర్భాలలో బ్రిటిష్ రాజకీయ సంప్రదాయాలు మన్నించటానికి తోడ్పడే సందర్భాలు ఇవి :

1 సంప్రదాయ విరుద్ధంగా పదవిని అంటిపెట్టుకొని కూర్చున్న ప్రధానమంత్రి చర్యను ప్రజాభిప్రాయము తీవ్రంగా ఖండిస్తున్నది. పత్రికలలో, సభలలో, రాజకీయ పక్షాల సమా

వేళాలలో అటువంటి ప్రధానిని ప్రజలు తీవ్రంగా విమర్శిస్తున్నారు. ఆ ప్రధాని అతని మంత్రి మండలి పై తొలగి పోయేవరకు బ్రిటిష్ ప్రజాభిప్రాయము నిద్రపోదు.

2. రాజకీయాలలో తమ జీవితాలు గడుపుతూ, అధికార పదవులకోసం ఆశలు పెంచుకొని ఉండే తరగతి జనులు ప్రజా విశ్వాసాన్ని కోల్పోకుండా ఉండటానికి ఎంతో శ్రద్ధతో శ్రమపడుతూ ఉంటారు అటువంటివారు రాజకీయ సంప్రదాయాలను నిలబెట్టంలోను, వాటిని భంగపరిచే ప్రయత్నాలను నిరోధించటంలోను తీవ్రంగా కృషి చేస్తుండటం బ్రిటిష్ రాజకీయాలలో మనకు కనబడే సామాన్య లక్షణము

3. రాజ్యాంగబద్ధమైన పరిపాలన యొక్క మర్యాదలను మన్నించవలెననే కోరిక చిరకాలంగా బ్రిటిష్ ప్రజలలో నాటుకొని ఉన్నది.

4. రాజ్యమనే ఓడ ఒడుదొడుకులు లేకుండా నడవవలెనంటే క్లిష్టతరమైని దాని యంత్రాంగం దెబ్బలు తినకుండా సరిఅయిన స్థితిలో ఉండవలెనని బ్రిటిష్ ప్రజల తీవ్రాభిలాష. ఈ కారణాలవల్ల కాబినెట్ పరిపాలనకు సంబంధించిన రాజ్యాంగ సంప్రదాయాలను తరతరాలుగా బ్రిటిష్ మంత్రులు తలదాల్చుతున్నారు. ఒక్కొక్కప్పుడు సంప్రదాయానికి కొత్త అర్థం కల్పించి ఇంకో ప్రయోజనం కోసం దానిని ఉపయోగించటం ఉన్నది. అట్లాచేసి తాము పాత పద్ధతులకు విరుద్ధంగా చేసిన దేమీలేదని మంత్రులు వాదిస్తూ ఉండటమే విచిత్రమైన విషయము. 1932 లో దిగుమతి సుంకాలు చట్టాన్నిగురించి మంత్రులలో ఏకాభిప్రాయం కుదరనప్పుడు మంత్రులలో అధిక సంఖ్యాకులతో ఏకీభవించకుండటానికి కొందరు మంత్రులకు స్వాతంత్ర్య మివ్వటం జరిగింది ప్రజలలో ఆ సుంకాలనుగురించి ఏకాభిప్రాయం లేకపోవటంవల్ల మంత్రులకి స్వేచ్ఛ ఇవ్వటం సమర్థనీయమని, అందువల్ల మిగిలిన అన్ని విషయాలలో మంత్రివర్గ సభ్యులకున్న ఐకమత్యాని కెటువంటి భంగపాటూ రాలేదని ఆ సందర్భంలో వాదించటం జరిగింది డైసీ కొత్త రాజకీయ సంప్రదాయా లేర్పడుతూ ఉండటానికి మరొక ఉదాహరణ ఇచ్చినాడు. సాధారణ ఎన్నికలలో మంత్రిమండలి పక్షంవారు ఓడినప్పుడు పార్లమెంట్ సమావేశమయ్యేవరకు వేచి ఉండక, ఆ మంత్రివర్గం పదవులనుంచి వెంటనే తొలగిపోవటం ఒక కొత్త సంప్రదాయము. 1868, 1886 మధ్యకాలంలో ఈ విధంగా నాలుగు పర్యాయాలు తటస్థించింది. 1884 లో సాధారణ ఎన్నికలలో ఓడిన పార్టీ నాయకుడు పిల్ పార్లమెంట్ సమావేశమైన తరవాత కూడా రాజీనామా ఇవ్వక ఎన్నికల ఫలితాన్ని వమ్ము చేయుటానికి ప్రయత్నించినాడు 1886 కు దరిమిలా పైన చెప్పిన కొత్త సంప్రదాయం స్థిరపడింది.

5. కొన్ని సంప్రదాయాలకు విరుద్ధంగా ప్రవర్తించే వ్యక్తి తత్ఫలితంగా దేశ శాసనాలను ధిక్కరించిన నేరానికి న్యాయస్థానాలచే శిక్షింపబడవచ్చు. ఈ పరిస్థితి ముఖ్యంగా మంత్రిమండలి - కామన్స్ సభ సంబంధాలనుగురించి సంప్రదాయాలలో సంభవిస్తుందని ఏ. వి. డైసీ తన 'లా ఆవ్ ది కాన్‌స్టిట్యూషన్' ('The Law of the Constitution') అనే గ్రంథంలో తెలిపినాడు. ఉదాహరణకు: ప్రతి సంవత్సరమూ తప్పక పార్లమెంట్‌ను సమావేశపరచవలెననే శాసనం లేకున్నా, ప్రతి సంవత్సరమూ పార్లమెంట్ సమావేశమై తీరుతున్నది ఒకవేళ పార్లమెంట్‌ను సంవత్సరారంభంలో సమావేశపరచ లేదనుకొండి. ఆర్థిక శాసనము పార్లమెంట్ ఆమోదాన్ని పొందని కారణంవల్ల పన్నుల వసూళ్ళు ఆగిపోతున్నవి. పన్ను

లను వసూలు చేయవలసిన ఉద్యోగులు వసూలుచేయడం మానినా, పన్నులు చెల్లించటానికి ప్రజలు నిరాకరించినా న్యాయస్థానాలు వారిని విచారించి శిక్షించవు. అంతేకాదు బలవంతంగా పన్ను రాబట్టిన ఉద్యోగిపై పౌరుడు వ్యాజ్యం వేయవచ్చు. పరిపాలన సాగించటానికి కావలసిన ద్రవ్యాన్ని ఇంగ్లాండ్ బాంక్ (The Bank of England) మంజూరుచేయదు. ఒకవేళ బాంక్ గవర్నర్ మంజూరుచేసినా బాంక్ ఉద్యోగి పరంపరలో ఏ ఒక్కరైనా ఆ ధనాన్ని చెల్లించటానికి నిరాకరించవచ్చు. తత్ఫలితంగా, ప్రభుత్వ కార్యాలన్ని శాఖలోను స్తంభించి పోతున్నవి. పార్లమెంట్ సమావేశమై ఆ ఏడాదికి విప్లవ శాసనము ఆమోదించలేదు. కనక, సైన్యంలోను, విమానదళంలోను ఏ అధికారి మాట ఏ ఉద్యోగి విననక్కరలేదు. బలవంతంగా సైనికులలో క్రమశిక్షణ నిలబెట్టే ప్రయత్నంచేసిన ప్రతి అధికారి శాసన విరుద్ధ చర్యలకు న్యాయస్థానాలచే శిక్షలకు పాత్రుడవుతున్నాడు. [విప్లవ శాసనాన్ని 1917 నుంచి సైనిక, వైమానికదళ (సాంవత్సరిక) శాసనమని పిలుస్తున్నారు].

మంత్రిమండలి అధికారానికి లోబడిన ఉద్యోగులు వారి ఆజ్ఞలను ధిక్కరించటానికి సాహసిస్తారా అనే అనుమానం కొందరికి కలగవచ్చు. దీనికి సమాధానము : 1. వందలు వేల సంఖ్యలలో వేరు వేరు ప్రభుత్వశాఖలలోని ఉద్యోగులలో ఏ కొద్దిమంది సహకరించకపోయినా పన్నులు వసూళ్ళు కొన్ని ఆగిపోవచ్చు. ఆగిపోయినా, ఇంకా మంత్రిమండలి పార్లమెంట్‌ను ధిక్కరించి ప్రభుత్వాదాయంలో చాలా భాగాన్ని రాబట్టగలిగినా, తమ చర్యలకు వారు న్యాయస్థానాలకు సమాధానం చెప్పుకోవలసి ఉంటారు. అంతేకాదు ప్రభుత్వ బొక్కసంలోకి చేరిన ధనాన్ని వారు పరిపాలనా వ్యయాలకని రాబట్టుకొనే మార్గం ఇంచుమించు మూతబడినట్లే అని భావించవచ్చు. ఇంగ్లాండ్ బాంక్ ఉద్యోగులలో ఏ కొద్దిమంది సాహాయ్యం నిరాకరణం చేసినా ద్రవ్యం వారిచేతికందదని ముందే చెప్పటం జరిగింది. అంతేకాదు, బాంక్ ఉద్యోగులలో వారి తాబేదారులుగాని, ఇంగ్లాండ్ బాంక్ గవర్నర్ లుగాని వారు కాక కంట్రోలర్ జనరల్ ఆడిటర్ జనరల్ వంటి ఉద్యోగులు వారి జీతనాతాలకు, మరే విధంగాను మంత్రిమండలి ఆగ్రహానికి జంకవలసిందిగాని, వారి అనుగ్రహానికి అర్రులు చాచవలసిందిగాని లేదు. శాసన సమ్మతం కాని ఏ వ్యయానికి కంట్రోలర్ - జనరల్ ఇంగ్లాండ్ బాంక్ అధికారులకు ధనమిమ్మని తన సమ్మతిని ఇవ్వటం, ఇటువంటి ఉద్యోగులు మంత్రిమండలి నిరంకుశ చర్యలకు పూనుకొన్న, వారి నిరంకుశత్వానికి అడ్డు కట్టలుగా పనిచేస్తున్నారు. ఒక సేనాదళ నాయకుని మొదలు సర్వ సేనాధిపతి వరకు సైనికాధికారు లెవ్వరైనా మంత్రివర్గ నిరంకుశ విధానాన్ని బల ప్రయోగంచేసి అమలుపరచ ప్రయత్నిస్తే పౌరులు వారి చర్యలను నిరోధించి తీరుతారు. వారి నిరోధాన్ని న్యాయస్థానాలు బలపరుస్తున్నాయి. న్యాయశాస్త్రం రెండంచుల పదునుగల కత్తి శాసనవిరుద్ధమైన ఆజ్ఞలను ధిక్కరించే వారికి సాయపడుతు సాత్విక నిరోధాన్ని న్యాయ సమ్మతం చేస్తుంది. ఫ్రాన్స్‌వంటి దేశాలలో ఉన్నట్లు ఉద్యోగులను ఆదుకోవడానికి పరిపాలన న్యాయమని, పరిపాలక న్యాయస్థానాలని ప్రత్యేకంగా బ్రిటన్‌లో లేనందున, సంవత్సరారంభంలో పార్లమెంట్‌ను సమావేశపరచక పరిపాలన సాగించటానికి బ్రిటిష్ మంత్రిమండలి ప్రయత్నం చేస్తే, దాని కాళ్ళేదాభుతే భానికి ఎదురు తిరగటం తథ్యము ప్రభుత్వోద్యోగులలో అధిక సంఖ్యాకులు ప్రభుత్వాజ్ఞలను పాటించకపోతే, ప్రభుత్వ మెంత నిస్సహాయ స్థితికి దిగ జారేది వేరే చెప్పనక్కరలేదు.

ఇంతవరకు నిరూపించిన దానినిబట్టి రాజ్యాంగ సంప్రదాయాలు రాజ్యాంగ శాసనాలతో పాటు బ్రిటన్‌లో ప్రజారాజ్యాన్ని ఏ విధంగా సుసాధ్యం చేస్తున్నవో తెలుసుకోగలరు. రాజ్యాంగ సంప్రదాయాలను నిర్వచించిన డైసీ, వాటిలో అనేకం రాజునకున్న ప్రత్యేకాధికారాలు ఏ విధంగా వినియోగించవలెనో నిర్ణయించే నిబంధనలే అని అన్నాడు ఈ ప్రత్యేక రాజాధికారాలు చెలాయించటానికి పార్లమెంట్ అనుజ్ఞ అవసరము, వాటిని చెలాయించటంలో గమనించవలసిన సూత్రం యొక్కటే. బ్రిటిష్ దేశంలో సార్వభౌమాధికారం (Sovereignty) ఉన్నవారు వోటర్లు ఆ వోటర్ల అభీష్టం ఏ విధంగా రాజ్యాంగ సంప్రదాయాలను, ఆధారాలను వాడుకొంటే నెరవేరగలదో ఆ విధంగా వాటిని ఉపయోగించుకోవలెనన్నదే ఆ సూత్రము మంత్రులను నియమించే అధికారం రాజుది. ఆ అధికారాన్ని ఉపయోగించటానికి ముందు కామన్స్ సభలో అధిక సంఖ్యాబలం గల రాజకీయపక్ష నాయకుని రాజు సంప్రదించటం ఒక రాజ్యాంగ సంప్రదాయము వోటర్లలో అధిక సంఖ్యాకుల అభిమతానికి అనుకూలంగా మంత్రివర్గం ఉంటే, వారి పరిపాలన ప్రజానురంజకం కాగలదన్నదే ఆ సంప్రదాయాన్ని రాజు పాటించటంలో ఉద్దేశము ప్రభుసభకు చెందిన అధికపక్ష నాయకుడైన కర్జన్‌ను కాదని, ఆ పక్షంలోని కామన్స్ సభలోని నాయకుని రాజు ప్రధానమంత్రిగా ఉండమని పిలవటంలో ఉద్దేశమూ కామన్స్ సభ ప్రజాభిమతాన్ని ప్రభుసభ కంటె యథార్థంగా ప్రతిఫలిస్తుందన్న నమ్మకమే. క్రమంగా కామన్స్ సభ్యులనుంచి ప్రధానమంత్రిని, తదితర ప్రముఖ మంత్రులను వరించే సంప్రదాయము ఈ విధంగానే ఏర్పడింది భావికాలంలోనైనా ఎప్పుడైనా ప్రభుసభ సభ్యుడే పార్లమెంట్‌లోని అధిక పక్ష నాయకులలోకెల్ల అత్యంత సమర్థుడు కావటం తటస్థిస్తే పై సంప్రదాయానికి భంగం కలిగినా కలుగవచ్చు. అట్లా జరిగినప్పుడు అది సంప్రదాయ విరుద్ధమని రాజ్యాంగ విరుద్ధమని న్యాయస్థానానికి పోవటానికి మాత్రం వీలుండదు. అధికారంలో ఉన్న రాజకీయ పక్షానికి అధిక సంఖ్యాబలం ఉన్నా, ఆ పక్షానికి ప్రజలలో హెచ్చుమంది ఆమోదంలేదని తెలిసిన తక్షణం, ఆ కామన్స్‌సభ ఎన్నికై అయిదేళ్ళు పూర్తిగాకున్నా దానిని రద్దుచేసి సాధారణ ఎన్నికలను మధ్యంతరంగా జరిపించే అధికారం రాజుకుంది. అట్లా చేయటంలో ఆ క్షణాన అధికారంలో ఉన్న మంత్రివర్గ పక్షం వోటర్లలో అధిక సంఖ్యాకుల విశ్వాసాన్ని పోగొట్టుకొన్నదా, లేదా అని పరీక్షించటమూ; లేదా నిజంగా ప్రజాప్రాతినిధ్యం వహించే రాజకీయ పక్షానికి మంత్రివర్గాన్ని నియమించే అవకాశం కలిగించటమూ అనేది ఆయన ఉద్దేశము.

రాజకీయ సంప్రదాయాలవల్ల మరొక ముఖ్య ప్రయోజనమూ ఉంది కాలానుగుణంగా, దేశంలోని పరిస్థితులు మారేకొద్దీ రాజ్యాంగంలోను, పరిపాలనా విధానంలోను మార్పులు అవసరమైనంతవరకు, సౌమ్యంగా ప్రవేశ పెట్టటానికి అవి సాయపడుతున్నాయి. అవి లేనిది, విధిగా జరగవలసిన మార్పులు విప్లవతుల్యమైన ప్రయత్నాలు చేయంది వీలుకావు. ఉదాహరణకు, సర్వాధికారాలతో కూడుకొన్న రాజరికాన్ని మాటలతో కాదనక, అంటే రాజ్యాంగ శాసనాలలో పెద్ద మార్పులు తేకుండా, ఆ రాజరిక స్థానంలో సర్వాధికార సమన్వితమైన పార్లమెంట్ ప్రతినిధులైన మంత్రివర్గాన్ని ప్రతిష్ఠించటం ఏ విప్లవం లేక, అంతకుముందున్న రాజ్యాంగ సంప్రదాయానికి నూతనార్థం కల్పించటంవల్ల సాధ్యమైంది కదా. బ్రిటిష్ మంత్రులు ఈనాడూ ఆ సార్వభౌముని మంత్రులే (His Majesty's Ministers) అయినప్పటికీ,

వారు ప్రజాప్రతినిధులైన కామన్స్ సభకు బాధ్యత వహించవలసిన వారే. చాలా వరకు అటువంటి మంత్రుల చెప్పుచేతలలో ఉండవలసినవాడు ఆ బ్రిటిష్ రాజు. బ్రిటిష్ రాజ్యాంగ పరిణామంలో రాజ్యాంగ సంప్రదాయాలు నిర్వహించిన పాత్ర అంతా ఇంతా గాదు, తైల సంపన్నములైన కీళ్ళు మనిషి దేహంలోని వివిధావయవాలు పరస్పర సహకారంతో పని చేయటానికి తోడ్పడుతున్నట్లే, ప్రభుత్వాంగాలు ఒకదానితో ఒకటి రాపిడిపడకుండా వాటి వాటి విధులను నిర్వహించటానికి రాజ్యాంగ సంప్రదాయాలూ ఉపయోగపడుతున్నాయి. "కాబినెట్ విధానానికి సంబంధించిన అలవాట్లూ, సంప్రదాయాలూ, శాసనసభా కార్యనిర్వాహక వర్గాలు ఒక్క బాటమీద నడిచేటట్లు సాయపడుతున్నాయి. బ్రిటిష్ దేశమూ దాని డొమీనియన్‌లూ డొమీనియన్‌ల ఆత్మగౌరవానికి హాని కలుగకుండా ఒక కామన్‌వెల్త్ సంస్థలో కలిసి ఉండటానికి రెండింటి మధ్యఉన్న వ్యవహారాల సందర్భంలో రూపుదిద్దుకొన్న రాజ్యాంగ సంప్రదాయాలు సాహాయపడుతున్నాయి. 1914 లో ఆనాటి కేర్పడిన కొన్ని కొత్త రాజ్యాంగ సంప్రదాయాలను గురించి వ్రాస్తూ, పార్లమెంట్‌లో అధిక సంఖ్యాబలం గల రాజకీయ పక్షపు బలాన్ని, పలుకుబడిని వృద్ధిచేసే గుణము వాటి కున్నదన్నారు డైసీ. అంతేగాక కొన్ని సంప్రదాయాలు క్రమంగా శాసనరూపం సంతరించుకోవటమూ ఉందని ఆయన వ్రాసినాడు. ఆర్థిక విషయాన్ని గురించిన చిత్తు చట్టాన్ని కామన్స్‌సభ ఆమోదించి పంపిన దానిని ప్రభుసభ నిరాకరించరాదనే సంప్రదాయం రెండున్నర శతాబ్దాలుగా గమనించ బడుతున్నది. దానిని 1911 పార్లమెంట్ చట్టం శాసనబద్ధం చేసింది అంతటితో ఆగక ఆర్థికేతరమైన చిత్తు చట్టాలను గూడా కామన్స్ సభ ఆమోదించి పంపిన వాటిని రెండేళ్ళకంటె ఎక్కువ కాలం శాసనంగా రూపొందకుండా నిరోధించటానికి ప్రభు సభకు అధికారం లేదనే నియమం చేసింది. ఈ విధంగా ఇంతకాలమూ సాంప్రదాయకంగా అంగీకరిస్తూ వచ్చిన కామన్స్ సభాధిక్యము శాసనామోదాన్ని పొందింది.

ఇదే విధంగా డొమీనియన్ పార్లమెంట్‌లు చేసే శాసనాలలో మాతృదేశం (బ్రిటన్) జోక్యం పుచ్చుకోరాదనే సంప్రదాయ మొకటి కొంత కాలంగా బ్రిటన్ మన్నిస్తూ వచ్చింది. దానికి వెస్ట్ మినిస్టర్ శాసనం శాశ్వతత్వాన్ని ఇచ్చింది. రాజ్యాంగ సంప్రదాయాల ప్రాముఖ్యాన్ని డైసీ ఇట్లా సంగ్రహించినాడు: "కాబినెట్ పరిపాలనమే గాదు, బ్రిటిష్ ప్రభుత్వ యంత్రాంగమంతా రాజ్యాంగ సంప్రదాయాలవల్లనే సమర్థవంతంగా పనిచేస్తూ ఉన్నాయి. బ్రిటిష్ కామన్‌వెల్త్ ఐక్యత వాటి మీదనే ఆధారపడి ఉంది. వాటిని అర్థం చేసుకోలేనిదే బ్రిటిష్ న్యాయపరిపాలనా సంస్థలను అర్థం చేసుకోలేము. నిజానికి, బ్రిటిష్ రాజ్యాంగ సంప్రదాయాలు బ్రిటిష్ రాజ్యాంగ న్యాయశాస్త్రంలోని అంతర్భాగాలే."

# 20

# బ్రిటిష్ ప్రజాస్వామ్యము

**( British Democracy )**

## బ్రిటిష్ రాజు స్థానము

బ్రిటిష్ దేశ పరిపాలనా వ్యవస్థను ఎట్లా వ్యాఖ్యానించవలె? దానిని వంశపరంపరాను గతమైన రాజరిక వ్యవస్థ అందమా? లేదా వంశ క్రమానుగతమైన ప్రభు పరిపాలిత వ్యవస్థ అందామా? ప్రజా ప్రతినిధి పరిపాలిత రాజ్యాంగ విధానమని అనవచ్చునా? తరచి చూడ నక్కరలేకుండానే దానిలో పైన చెప్పిన త్రివిధ రాజ్యాంగ లక్షణాలూ కనిపిస్తున్నాయి.

బేజ్‌హాట్ (Bagehot) 1872లో ప్రచురించిన "ది ఇంగ్లీష్ కాన్స్టట్యూషన్" అనే గ్రంథంలో ఇట్లా అన్నారు: పార్లమెంట్‌ను సంప్రదించకుండా బ్రిటిష్ దేశపు రాణి ఎన్ని పనులు చేయగలదో చెబితే జనులు ఆశ్చర్యపడక పోరు. సైన్యం తనకు తాను కొనుగోళ్ళు చేయరాదనే చట్టాన్ని ఆమోదించి కామన్స ప్రభు సభకు పంపినప్పుడు ప్రభు సభ దానిని తోసివేస్తే రాణి తన రాజాధికారాన్ని వినియోగించి సైన్య మా విధంగా కొనుగోళ్ళు చేయరాదని శాసించింది. ఇదే విధంగా తన ప్రత్యేక రాజాధికారాన్ని బట్టి సైన్యాన్ని రద్దు చేయవచ్చు. సర్వసైన్యాధిపతితోపాటు సైనికోద్యోగులందరినీ ఇంటికి పంపించవచ్చు. అదే విధంగా నావికులందరిని బర్తరఫ్ చేయవచ్చు. కారన్‌వాల్‌ను పరదేశానికి ధారపోసి, ఫ్రెంచ్ రాష్ట్రమైన బ్రిటనీని ఆక్రమించటానికి యుద్ధ మారంభించవచ్చు. ఉత్తర ఐర్లండ్, గ్రేట్ బ్రిటన్‌లలోని పౌరులను ప్రభువులుగా చేయవచ్చు. ఊరూర ఒక విశ్వవిద్యాలయాన్ని స్థాపించవచ్చు. సైనికులుగాని, ఉద్యోగులనేకులను తొలగించవచ్చు; నేరస్థులందరిని క్షమించి జైళ్ళ నుంచి విడుదల చేయవచ్చు. ఒక్క మాటలో చెప్పవలెనంటే, రాజు తన విశేషాధికారాన్ని (prerogative) ఉపయోగించి పరిపాలనను తలక్రిందులుచేసి, యుద్ధాన్ని తెచ్చిపెట్టి, దానిలో దేశం ఓడటానికి చేయవలసినదంతా చేసి అవమానకరమైన సంధి చేయవచ్చు. విదేశీయుల దాడుల నుంచి దేశానికి ఎటువంటి రక్షణా లేకుండేటట్లు చేయనూవచ్చు. అంతేకాదు; ప్రభు సభను తన ఆజ్ఞమాత్రం రద్దుచేసి, కామన్స సభకే సర్వ ప్రభుత్వాధికారాన్ని కట్టబెట్టవచ్చు." ఇంత చెప్పి బేజ్‌హాట్ తన కాలం నాటికి బ్రిటిష్ రాజు పదవి [illegible] ప్రాయమే అయిందని అభిప్రాయపడినాడు. బ్రిటిష్ రాజాధికారాన్ని ఇతర పరిపాలనాంగాలు అదుపులో ఉంచవలసిన అవసరమెన్నడో తీరిపోయింది. పరిపాలనా చక్రం బ్రిటిష్ రాజపదం నుంచి పార్లమెంట్‌కు బాధ్యతవహించే మంత్రివర్గం చేతులలోకి శాశ్వతంగా జారిపోయింది. బ్రిటిష్ ప్రభుత్వానికి ఘనతను, గాంభీర్యాన్ని సమకూర్చే శిరోభూషణం మాత్రమయింది బ్రిటిష్ దేశపు రాణి. రాజమర్యాదలుగా బ్రిటిష్ రాజు నిర్వహించవలసిన విధులనుగురించి, ఇవిగాక రాజైనందున, ఆ పదవినిబట్టి అతనికున్న హక్కులు మూడింటినిగురించి ముందే ప్రస్తావించినాము. 1. పరి

పాలన విషయంలోను, విదేశ వ్యవహారాలలోను మంత్రివర్గం రాజుతో తా మనుసరించదలచిన విధానాన్నిగురించి సంప్రదించి తీరవలె. 2 మంత్రివర్గ మనుసరించదలచే విధానంవల్ల అనర్థాలు కలుగుతాయని తనకు తోస్తే తన అభిప్రాయాలను మంత్రివర్గానికి తెలిపి (తన అనుభవాన్నిబట్టి ఆలోచనలనుబట్టి) మేలైన విధాన మిది అని సూచనలను చేసే హక్కు రాజుకుంది 3 ఇబ్బందులను, ఓటమిని, ఆశాభంగాన్ని (ప్రభుత్వము) ఎదుర్కోవలసి వచ్చి నప్పుడు తన మంత్రులకు ధైర్యంచెప్పి ప్రోత్సాహమిచ్చే హక్కు రాజుకుంది ఏ విషయంలో మంత్రివర్గమే నిర్ణయం తీసుకొన్నా, దానిని ప్రధానమంత్రి తనకు తెలిపి తీరవలెనని పట్టు



విక్టోరియా రాణి

బట్టటానికి కారణాలను 12-8-1850 నాడు తాను జాన్ రసెల్ ప్రభువుకు పంపిన జాబులో విక్టోరియా రాణి ఇట్లా తెలియపరిచింది ''ఏ నిర్ణయానికి తా నామోదమిచ్చేది తనకు ముందు స్పష్టంగా తెలియవలెనంటే ఏ విషయంలోగాని తానేమి చేయదలచిందో పామర్‌స్టన్ ప్రభువు

తనకు స్పష్టంగా తెలుపవలె. తన ఆమోదాన్ని రాణి తెలియజరిచిన అనంతరం మంత్రివర్గమా నిర్ణయాన్ని తిరుగతోడి తన ఇష్టంవచ్చినట్లు మార్చుకోరాదు. ప్రధానమంత్రికి విదేశ వ్యవహారాలు చూసే మంత్రులకు మధ్య జరిగే ఉత్తర ప్రత్యుత్తరాలు తనకు ముందు తెలియచేయనిదే ముఖ్యమైన నిర్ణయాలేమీ ప్రధానమంత్రి చేయరాదు. ఆ తెలియచేయటంలోను వాటిని గురించి తాను ఆలోచించటానికి తగినంత వ్యవధి ఉండేటట్లు ప్రధానమంత్రి జాగ్రత్త వహించవలె'' తనతో సంప్రదించక, స్వతంత్రించి విదేశ వ్యవహారాలలో నిర్ణయం తీసుకొన్న ప్రధానమంత్రిని పదవినుంచి తొలగింపటానికి విక్టోరియా రాణి వెనుదీయలేదు.

పైన జెప్పిన మూడు హక్కులు బ్రిటిష్ రాజరికానికి ఉన్నవన్నా బేజ్‌హాట్ ఈ సందర్భంలో మరొక్కమాట కూడా అన్నారు ''అరుదుగానే తప్ప ఈ హక్కులను ప్రయోజనకారిగా ఉపయోగింపగల శక్తిగాని యోగ్యతగాని బ్రిటిష్ రాజరికానికి ఉండజాలదని'' ఆయన అభిప్రాయము. కాని రాజు ప్రజ్ఞాశాలి, వివేకవంతుడు అయితే పరిపాలనా విధానాన్ని సరిదిద్ది, పరిపాలన సరియైన పంథాలో నడపటానికి ఈ మూడు హక్కులకంటె అధికమైన ఇతర హక్కు లేమీ ఆయన కవసరం కాబోవు. పార్టీ రాజకీయాలకు అతీతుడు, సామాన్యంగా తన మంత్రులలో అనేకులకంటె అధిక లోకానుభవమూ, యూరపియన్ రాజ్యాల వ్యవహారాలలో ఎక్కువ గ్రహింపు ఉండటంవల్ల బ్రిటిష్ రాజు దేశపు బాగోగులపై ఎక్కువ ప్రభావం చూపినా, ఆశ్చర్యం లేదు. ఈ మాట ఎంత నిజమో తెలుసుకోవటానికి ఏడవ ఎడ్వర్డ్ రాజు రాజ్యం ను పరిపాలించింది పదేండ్లు మించకపోయినా – ఏ విధంగా ఐరోపా రాజ్యాలను యుద్ధజ్వాలలలోకి దుముకకుండా కాపాడి, శాంతి దూతగా కీర్తి సంపాదించినాడో జ్ఞాపకం చేసుకొంటే చాలు

బ్రిటిష్ రాజు బ్రిటిష్ ప్రజానీకానికి శిరోమణి వంటివాడు సాంఘిక మర్యాదలను, నీతిని కాపాడి, బ్రిటిష్ ప్రజలకు సత్ప్రవర్తనలో దారి చూపవలసిన బాధ్యత ఆయనది. మత విహితమైన మార్గంలో ప్రజలు నడిచేటట్లు ప్రోత్సహించవలసిన వాడాయన. ఈ బాధ్యతలను మోయవలసిన వాడైనా, ఐదవ జార్జ్ తరవాత బ్రిటిష్ చక్రవర్తి అయిన ఎనిమిదవ ఎడ్వర్డ్ విడాకులు పుచ్చుకొన్న సామాన్య అమెరికన్ సినిమానటిని పెండ్లాడ తలచటం చేతనే, బ్రిటిష్ చర్చి అధికారులేగాక, బ్రిటిష్ మంత్రివర్గంతో బాటు యావత్ బ్రిటిష్ ప్రజానీకమూ బ్రిటిష్ డొమీనియన్ ప్రభుత్వాలూ ఆ ఎడ్వర్డ్ రాజ్య పరిత్యాగం చేయవలసిందని పట్టుబట్టటం జరిగింది. ఆంగ్లికన్ చర్చి విడాకులను ఆమోదించేదే. బ్రిటిష్ న్యాయశాస్త్రమూ విడాకు లివ్వటాన్ని నిషేధించదు. ఉన్నత కులంలో పుట్టిన స్త్రీని రాజు వివాహమాడవలె అనేది, జీవిత పర్యంతము బ్రిటిష్ రాజదంపతుల మధ్య వివాహబంధం నిల్చి ఉండవలెగాని దాని విచ్ఛేదం సహించరాదనేది సనాతన బ్రిటిష్ రాజరిక సంప్రదాయము ఈ విధంగా ఉత్తమ కుటుంబ విధానానికి బ్రిటిష్ రాజ కుటుంబము ప్రజలకు మార్గదర్శకమవుతుంది.

ప్రభుత్వ ఆదాయంలో శతాంశంలో లవలేశ వ్యయంలో బ్రిటిష్ పౌరులు జాతీయైక మత్యానికి దేశభక్తికి చిహ్నమైన రాజరికాన్ని విడనాడకుండా, దానివల్ల సమకూరే లాభాలను పొందుతున్నారు "చేయలేదు కీడు ; చేస్తే మేలే చేస్తాడుగానీ'' (The king can do no harm) అనేది తమ రాజునుగురించి వారు చెప్పుకొనే గొప్ప సిద్ధాంతము. ప్రభుతనము ఆయనిదే గాని పరిపాలనాధికారం మాత్రం కాదు. ("He reigns, but does not


Daily Mirror
THE DAILY PICTURE NEWSPAPER WITH THE LARGEST NET SALE
THURSDAY
ONE PENNY

THE KING WANTS TO MARRY MRS. SIMPSON: CABINET ADVISES 'NO'

THE KING THE DAILY MIRROR UNDERSTANDS, HAS TOLD THE CABINET OF HIS WISH TO MARRY MRS SIMPSON, AMERICAN-BORN SOCIETY WOMAN NOW LIVING IN LONDON. THE CABINET HAS ADVISED AGAINST IT

govern") పరిపాలనలోని లోపాలకు బాధ్యులు అతని మంత్రులు - వారి తాబేదారులైన ఉద్యోగులే కాని ఆయన ఎంతమాత్రం బాధ్యుడు కాడు ప్రజా పరిపాలనా విధానం అవలంబించిన అమెరికా, రష్యా, చీనాలవంటి దేశాలలో పరిపాలనకు కేంద్ర స్థానంలో ఉన్న అధ్యక్షుని ఎన్నిక సందర్భంలో ప్రదర్శించే కోపతాపాలకు, ద్వేషాలకు, లంచగొండితనానికి బ్రిటిష్ రాజు అతీతుడు ఈ పక్ష మా పక్షమని అనక(ప్రజలందరికీ) ఆయన పూజనీయుడు, ప్రేమ పాత్రుడు ఆయన విజయాన్ని, సౌఖ్యాన్ని, కీర్తి ప్రతిష్ఠలను కోరుతూ వారు పాడే జాతీయగీతంలో బ్రిటిష్ ప్రజలు మనసారా కాంక్షించేది తమ దేశ సౌఖ్య విజయాలను, కీర్తి ప్రతిష్ఠలనే ఇతర దేశాలలో, ముఖ్యంగా ప్రజా రాజ్యాలలో దేశ మాతృస్తవం జాతీయ గీతంగా ఉండటం తెలుసుకొన్నాము గాని, ఇన్ని శతాబ్దాలు పరిణామం పొంది పరిపక్వదశకు వచ్చిన బ్రిటిష్ ప్రజా రాజ్యంలో రాజు విజయగీతం ప్రజల విజయగీతంగా రూపొందటం వింతలలోకెల్ల వింత ఇది బ్రిటిష్ ప్రజల మితత్వాన్ని, సంప్రదాయాలపై అభిమానాన్ని, ప్రాచీన సంస్థలపై ఆదరాన్ని వేనోళ్ళ చాటుతూ ఉన్నది. అది కాదేని, కామన్స్ సభలో ఒక్క వోట్ ఆధిక్యంతో రాజ్యం పునాదులను పెళ్లగించి వేయగలిగిన బ్రిటిష్ రాజ్యాంగ విధానంలో బ్రిటిష్ రాజపదవి, ప్రభుసభ ఉనికి, ఏనాడో అంతరించిపోయి ఉండేవి.

### 11 బ్రిటన్ పరిపాలనలో ప్రభుసభ స్థానము

ప్రభుసభ శాసనాధికారాన్ని 1911, 1949 పార్లమెంటరీ శాసనా లే విధంగా తగ్గించింది ముందే వివరించటం జరిగింది. ద్రవ్య విషయమైన చట్టము, కామన్స్ సభ ఆమోదించి

పంపినది. తన కందిన నెల రోజులలోగా ప్రభుసభ ఏ సవరణ లేకుండా ఆమోదించకపోతే. వెంటనే రాజామోదంతో అది శాసన మవుతుంది ద్రవ్య విషయాలుగాని ఇతర చట్టాలను వాటిని ప్రజాసభ ఆమోదించిన తరవాత రెండేళ్లకంటె ఎక్కువ కాలం శాసనం గాకుండా ప్రభుసభ అడ్డగించలేదని 1911 చట్టం శాసించింది. 1949 పార్లమెంటరీ శాసనంపై వ్యవధిని



రెండేళ్ల నుంచి ఒక్క సంవత్సరానికి తగ్గించింది. 1958 పార్లమెంటరీ శాసనం ఒక వ్యక్తి యొక్క జీవిత కాలానికి మాత్రమే పరిమితమైన ప్రభు స్థానాలను సృష్టించటానికి రాజుకు అధికార మివ్వటమేగాక ప్రభుసభ సమావేశాలకు హాజరయిన ప్రభువులకు బత్తెమిచ్చే ఏర్పాటు కూడా చేసింది పై చట్టా లన్నింటి ఫలితంగా కామన్స్ సభతో సమాన ప్రతిపత్తిని ప్రభు సభ పోగొట్టుకొన్నది కామన్స్‌సభ మనస్సుంచిన ఏ చట్టాన్నిగాని శాసనం గాకుండా అది నివారించలేదు. బ్రిటన్ పరిపాలనా విధానంలో రాజు పదవి, ప్రభుసభ పోగొట్టుకొన్న ప్రాధాన్యం కామన్స్ సభ హస్తగతమై అదొక్కటే బ్రిటన్ ప్రజానీకానికి నిజమైన ప్రతినిధి అయి నిలిచింది.

111. ప్రజాభిప్రాయాన్ని బ్రిటిష్ ప్రభుత్వ మెంతవరకు ప్రతిబింబిస్తూ ఉంది ?

బ్రిటిష్ వోటర్లలో అధిక సంఖ్యాకుల అభిప్రాయాలకు బ్రిటిష్ ప్రభుత్వం అనుసరించే విధానాలకు చాలా సన్నిహిత సంబంధము ఉందంటాడు సర్ ఐవర్ జెన్నింగ్స్ ప్రభుత్వానికి కామన్స్ సభలో అధిక సంఖ్యా బలమున్నందువల్ల అది పరిపాలించగలిగేది, కడపటి సాధారణ ఎన్నికలలో అధికంగా వోట్లు గెల్చుకొన్నందువల్లనే దానికి కామన్స్‌లో ఆ మెజారిటీ లభించింది. అధికంగా వోట్లు అది సంపాదించగలగటానికి దాని పరిపాలనా విధానా లను అధిక సంఖ్యలో వోటర్లు ఆమోదించటమే కారణము ప్రభుత్వ పక్షంలోని నాయకుల మీద వ్యక్తిగతంగా తమకుండే అభిమానాన్ని బట్టి బ్రిటిష్ వోటర్‌లు తమ వోట్లను అనుగ్ర హించరా అంటే సాధారణ ఎన్నికల్లో అట్లాంటి ఆరాధన భావానికి అంత ప్రాధాన్యం వారిస్తు న్నట్లు అగపడదు. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో ''అన్యథా శరణం నాస్తి, త్వమేవ శరణం మమ'' అన్నట్లు చర్చిల్‌ను భజించిన బ్రిటిష్ వోటర్‌లు యుద్ధంలో విజయం సాధిం చిన అనంతరం శీఘ్రకాలంలోనే ఆయనను గద్దెనుంచి దింపినారు ప్రభుత్వ మనుసరించబోయే విధానాలవల్ల తమ ఆస్తిపాస్తులకు ఎట్లాంటి దెబ్బ తగులుతుందో, దాని ఆర్థిక విధానాలు తమపై పన్నుల భారాన్ని ఎంతవరకు హెచ్చించుతుందో అనే ఆలోచనలే బ్రిటిష్ వోటర్లపై ఎక్కువ ప్రభావం చూపేది. బ్రిటిష్‌వారి అదృష్టమేమోగాని, సామాన్యంగా బ్రిటన్‌లో చెప్పుకో తగ్గ రాజకీయ పక్షాలు రెండుకంటె ఎక్కువ ఉండటం లేదు. వాటి నభిమానించే వోటర్‌ల సంఖ్యాబలంలో ఆ రెండింటి మధ్య అధిక వ్యత్యాసమూ ఉండటం లేదు. ప్రభుత్వ పక్షం తాను అధికారంలో ఉండగా చేసిన తప్పులను సమర్థించుకోలేకపోయినా, సాధించిన విజయా లివి అని చూపుకోలేకపోయినా గడిచిన ఎన్నికలలో దాని విజయానికి తోడ్పడిన వోటర్‌లలో తగినంతమంది ప్రత్యర్థి పక్షానికి వోట్‌చేసి ఈసారి అది ఓడిపోయేటట్లు చేసే సావకాశం ఎంతైనా ఉంది. వోటర్లలో తమ పక్షంపై ప్రతికూల విమర్శలు ఆరంభమైనప్పుడు నియోజక వర్గపు ప్రజలతో సన్నిహిత సంబంధాలుండే కామన్స్ సభ్యులు ఆ విషయం తమ పార్టీ నాయకులకు తెల్పుకోలేక పోరు వోటర్‌లు వోట్ చేసేది వ్యక్తిగతంగా అభ్యర్థులను అభిమా నించి కాదని, పార్టీ సిద్ధాంతాలను, విధానాలను ఆమోదించటం వల్లనే అని పార్టీ నాయకులకు తెలుసు. అంతేగాక కొత్తగా అమలులోకి వచ్చిన ప్రజాభిప్రాయ ప్రకటన విధానంవల్ల ప్రభు త్వానికి ప్రజాభిప్రాయ మెట్లా మారుతుందో తెలుసుకోవటానికి వీలేర్పడుతుంది తెలుసుకొని

దానికి కొంత అనుకూలంగా తమ కార్యక్రమాలను, విధానాలను సవరించుకొంటూ రాబోయే ఎన్నికలకు ప్రభుత్వ పక్షం సిద్ధపడుతూ ఉంది.

ఈ సందర్భంలో మనం గమనించవలసిన విషయాలు కొన్ని ఉన్నాయి: 1 ప్రజలందరూ వోటర్లని మనమనుకోరాదు ప్రజా శాసనము (The People Act), 1948 తరవాత "ఒక్కరికి ఒక్కటే వోట్" అనేది సర్వత్ర ఆచరణలోనికి వచ్చినందున వోట్ల సంఖ్య, వోటర్ల సంఖ్య చాలావరకు సమానమైనందున సీట్ల మొత్తం సంఖ్యకు వోటర్ల మొత్తం సంఖ్యకు భేదం చాలా తగ్గింది. అట్లయినా వోటర్లయిన వారంతా వోట్ చేయటం లేదు. 70 లేదా 75 శాతమే వోట్ చేసే వోటర్లు. దాని కర్థము వోట్ చేయటం మానినా, వోట్ చేయనివారు ప్రజాభిప్రాయాన్ని సృష్టించను, సవరించను తోడ్పడరని కాదు

2 రాజకీయ పక్షాలు సుదృఢంగా నిర్మితమై, పనిచేసే దేశంలోగాని, ఆ పక్షాల సంఖ్య సామాన్యంగా రెండింటికి మించకుండా ఉన్న దేశాలలో తప్ప వోటర్లకు ఈ పక్షానికా, ఆ పక్షానికా తమ వోటిచ్చి గెల్పించవలెననేది స్పష్టంగా మనసుకు రాదు. బ్రిటన్‌లో ఇట్లాంటి అనుకూల పరిస్థితులు చక్కగా అమరి ఉన్నాయి రాజకీయ పక్షాలు మూడుగా ఉండటమే బ్రిటిష్ రాజకీయ పక్షాల చరిత్రలో చాలా అరుదైన విషయము.

3 కామన్స్ సభకు ప్రతినిధులను ఎన్నుకొనే విధానాన్నిబట్టి, కామన్స్ సభ్యత్వంలో ఒక రాజకీయ పక్షానికి అధిక స్థానాలు లభించినా, దేశంలోని మొత్తం వోటర్లలో అధిక సంఖ్యాకులు దానికి తమ వోట్లు ఇవ్వకపోవటం సాధ్యమవుతూ ఉంది. ఉదాహరణకు 1935 సాధారణ ఎన్నికలలో కన్సర్వేటివ్ పక్షాభిమానులకు పోటీ జరిగిన నియోజకవర్గాలలో పడిన వోట్లు 54.5 శాతం, లభించిన స్థానాలు 70 శాతం. 1945 లో కార్మిక పక్షానికి లభించిన వోట్లు మొత్తం వోట్లలో 40 శాతం కాగా 61 శాతం సభ్యస్థానాలు కామన్స్‌లో ఆ పక్షం గెల్చుకొంది. 1959 లో కామన్స్ సభలో అత్యధికమైన (Majority) స్థానాలు సాధించిన కాన్సర్వేటివ్ పక్షానికి మొత్తం వోట్లలో సగంకంటె తక్కువే లభించింది. తక్కువ వోట్లు పడిన పక్షానికి కామన్స్ సభలో ఎక్కువ స్థానాలు రావటంవల్ల కామన్స్ సభయొక్క ప్రాతినిధ్య గుణానికి లోపం రావటం లేదా, నిష్పత్తి ప్రాతినిధ్య విధానంవల్ల (Method of Proportional Representation) ఆ లోపం తీర్చవచ్చుగదా అని ఒక విమర్శ బయలుదేరింది ఈ విమర్శకు సర్ ఐవర్ జెన్నింగ్స్ కింది విధంగా సమాధానం చెప్పినాడు: "నిష్పత్తి ప్రాతినిధ్యంవల్ల కలిగే లాభాలకంటె నష్టాలు ఎక్కువ. నిష్పత్తి ప్రాతినిధ్యంవల్ల ఏర్పడేది ప్రజల ప్రభుత్వంగాదు; గణాల ప్రభుత్వం (government of groups) నియోజకవర్గాలలోని ప్రజల అభిప్రాయాలలో కలిగే మార్పులు నిష్పత్తి విధానంవల్ల ఎన్నికైన కామన్స్ సభ్యులలోని గణాల అభిప్రాయాలలో అంతగా మార్పులు తీసుకొనిరావు. నిష్పత్తి విధానమున్న రాజ్యంలో రెండుమూడు గణాలు కూడితేగాని ప్రభుత్వ మేర్పాటు చేయటానికి తగినంత సంఖ్యాధిక్యత కామన్స్ సభలో లభించదు. ఇప్పుడున్న ప్రాతినిధ్య విధానంలో ఈ అనర్థము ఉండదు, కామన్స్ సభలో తనకున్న సంఖ్యాధిక్యత నిలుపుకోగోరే ప్రభుత్వము నియోజకవర్గాలలో ప్రజాభిప్రాయంలో కానవచ్చే మార్పులను అతిశ్రద్ధగా గమనించవలసి ఉండటంచేత ప్రజాభిప్రాయాన్ని అనుసరించే పరిపాలన నిష్పత్తి ప్రాతినిధ్యంవల్ల గాక ఇప్పుడు అమలులో ఉండే భౌగోళిక నియోజకవర్గాల వల్లనే సాధ్యమవుతూ ఉంది.

నిష్పత్తి ప్రాతినిధ్యంవల్ల అధికారానికి వచ్చే ప్రభుత్వం నిలిచి ఉండేది, పతనమయ్యేది ప్రజాభిప్రాయంలో వచ్చే మార్పులవల్లగాదు. గణాల నాయకులమీద వారి అనుచరులకుండే అభిమానాలవల్ల, ద్వేషాలవల్ల ఆ ప్రభుత్వము ఉండటం, ఊడటం జరుగుతూ ఉంది."

4. ఒక రాజకీయ పక్షాన్ని అధికారానికి లేవనెత్తేది, పదవుల నుంచి పడగొట్టేది రాజకీయ పక్షాల విధానాలను స్వతంత్రంగా ఆలోచించి వ్యవహరించగలిగిన వోటర్ మహాశయులు, మా తాత, మా తండ్రి ఈ రాజకీయ పక్షానికే వోట్ చేసేవారు, అందువల్ల నేను కూడా ఆ పక్షానికే వోట్ చేస్తాను అనేవారు. అన్ని పక్షాల అనుయాయులలోను అధిక సంఖ్యలలోనే ఎప్పుడూ కనబడుతూ ఉన్నారు. వారి ఉద్రేకాలను, ఆవేశాలను సమర్థులైన వక్తలు తేలికగా రెచ్చగొడుతూ ఉండటం ఎప్పుడూ ఉండేదే. అదృష్టవశాత్తు బ్రిటన్‌లోని రెండు ప్రధాన రాజకీయ పక్షాలు సామాన్యంగా సమాన బలాలై ఉన్నాయి. అధికారపక్ష విధానంవల్ల తమకు నష్టం కలుగుతున్నదా లేదా అని ఆలోచించి వోట్ చేసే కొద్దిమంది మీదే రాజకీయ పక్షాల గెలుపు, ఓటమి ఆధారపడి ఉంది ఏ పార్టీ అధికారంలో ఉంటే మన నెత్తి మీద పన్నుల భార మధికమవుతూ ఉంది, దేశంలో వస్తువుల ధరలు మండిపోతూ ఉన్నాయి, అని విమర్శించి వీరు వోట్ చేస్తారేగానీ, 'చర్చిల్‌కు జై, కార్మిక పక్షం హటావో' అనే నినాదాలు వీరిని కదలించలేవు. అందువల్ల ఈ గణానికి చెందిన వోటర్ల సహకారాన్ని నిల్పుకోవటానికే అధికార పక్షం ప్రత్యేక శ్రద్ధ తీసుకొనేది, పార్టీ విధానాలను అమలు పరచటంలో అతికి పోకుండేది. నిష్పత్తి ప్రాతినిధ్య విధాన మవలంబిస్తే ఈ మైనారిటీ గణాలు పెచ్చు మీరిపోయి బహుజనాభిప్రాయానుసారియైన ప్రభుత్వం బ్రిటన్‌లో అసాధ్యమవుతుందని ఐవర్ జెన్నింగ్స్ మతము.

5. ప్రజాభిప్రాయం ఏర్పడటంలో వివేకానికి విషయ పరిజ్ఞానానికి ఉండే పాత్ర అల్పమని, ప్రచారానికి, ఆవేశాలకు వోటర్లలో అధిక సంఖ్యాకులు లొంగిపోవుతున్నారని అంటూ, జెన్నింగ్స్ కింది విధంగా ఈ విషయాన్ని వివరించినాడు· "బ్రిటన్‌లో రాజకీయ పక్షాలు విశేషించి ప్రచార యంత్రాలుగా మారినాయి. మితవాద పక్షం దేశాభిమానమనే ఢంకా వాయిస్తే, కార్మిక పక్షం సామాజికాభిమానమనే బాకా ఊదుతూ ఉంది. ప్రజారాజ్యం కాబట్టి బ్రిటన్‌లో ఢంకా వాయిస్తే, కార్మిక పక్షం సామాజికాభిమానమనే బాకా ఊదుతూ ఉంది. ప్రజారాజ్యం కాబట్టి బ్రిటన్‌లో ఢంకానో, బాకానో తన కిష్టమైన దానిని వరించటానికి వోటర్‌కు స్వాతంత్ర్య ముంది. ఈ బాకా ఊదటం హిట్లర్ జర్మనీ, ముసోలినీ ఇటలీల వంటి నియంతృత్వ రాజ్యాలతోను ఉన్నదే, కానీ, అక్కడ నియంతృత్వ పక్షపు ఢంకానో, బాకానో వరించకపోతే వోటర్‌కు మిగిలేది పోలీస్ లాఠీ మాత్రమే. బ్రిటన్‌లోని సామాన్య వోటర్‌కు ఈ బాకాలన్నా, ఢంకాలన్నా ఎంతో అనుమానము. అతడు చూసేది ఏ పక్షానికి వోట్ చేసిన తనకు లాభ మనేదే. మార్క్సిస్టులు బోధించే వర్గపోరాటమన్న అతనికి ద్వేషము. కార్మికుల సంఘటనాన్ని ఆమోదించే వోటర్ కార్మిక పక్షానికి తన వోటిస్తే, ఆర్థిక సుస్థిరత్వాన్ని కోరే వోటర్ మితవాద పక్షానికి తన వోటిస్తాడు. ఈ రెండు పక్షాలూ బ్రిటిష్ వోటర్లలోని ముఖ్య విభాగాలు. ఈ రెండింటికి మధ్య అటూ ఇటూ ఊగులాడుతుండేవారు కేథలిక్‌లు. ఆంగ్లికన్‌లు, ఇతర స్వతంత్ర క్రైస్తవ కూటాలవారు. సామాజిక వాదులకు, నిరీశ్వర వాదులకు సంబంధ

మున్నదనే వారు కేథలిక్‌లు. ఆంగ్లికన్‌లు సామాన్యంగా మితవాద పక్షం వైపు మొగ్గు చూపగా స్వతంత్ర క్రైస్తవ కూటాలకు చెందినవారు అతివాదాన్ని అభిమానిస్తారు.

6. బ్రిటిష్ విదేశ రాజనీతి ప్రజాభిప్రాయానుసారిగా ఉన్నదా? పై ప్రశ్న కొంత జటిలమైనదే. దేశీయ వ్యవహారాలే సామాన్య ప్రజలు సరిగా అర్థం చేసుకోలేరే. ఇక విదేశ వ్యవహారాలను, వాటి విషయంలో ప్రభుత్వ మనుసరించే రాజనీతిని వారు అర్థం చేసుకోగలగటం సాధ్యమా? విదేశ వ్యవహారాలనుగురించి ప్రభుత్వ మేమి చెప్పినా వారు నమ్మవలసిన వా రవుతున్నారు. అంతేగాక, ఏ రాజకీయ పక్షం అధికారంలోకి వచ్చినా, అంతవరకధికారంలో ఉన్న పక్ష మనుసరిస్తూ వచ్చిన విధానాన్ని తటాలున తోసిపుచ్చటానికి దానికి వీలుండదు. ఉదాహరణ: మొదటి ప్రపంచ యుద్ధానంతరం చాలా కాలం బ్రిటిష్ ప్రజలలో అనేకులు యుద్ధానికి ప్రతికూలురుగా ఉండేవారు. కాని హిట్లర్ జర్మనీలో అధికారానికి వచ్చిన కొద్ది కాలానికే రెండవ ప్రపంచ యుద్ధానికి నాజీ పక్షం కాలుదువ్వుతూ ఉందని, దానికి బ్రిటన్ సంసిద్ధం కావలెనని బ్రిటిష్ రాజనీతిజ్ఞు లందరూ గుర్తించినారు. అయినా, నానాజాతి సమితి ద్వారా యుద్ధాన్ని నివారించవలెనని, ప్రపంచ రాజ్యాల నిరాయుధీకరణకు కృషి చేయవలెనని తమ పక్షం చూస్తూ ఉందని బాల్డ్‌విన్ ప్రభుత్వం 1933-34 లో చెప్పవలసి వచ్చింది. నిజానికి అదే సమయంలో ప్రభుత్వం ఆయుధీకరణకు పూనుకొంది. అయినా 1935 లో గాని పార్టీ ప్రణాళికలో బాల్డ్‌విన్ పక్షం వారు నానాజాతి సమితి ద్వారా శాంతిని చేకూర్చవలెనని తమ ప్రయత్నమైనా ఆయుధీకరణకు తాము పూనుకొంటామని బహిరంగంగా చాటలేక పోయినారు. నిజానికి తా ననుసరించదలచిన విదేశ రాజనీతిని ఏ రాజకీయపక్ష ప్రభుత్వమైనా బట్టబయలు చేయలేదు. ఆ కాలంలో తమ లక్ష్యాలను బహిరంగంగా అది చాటటంవల్ల లేనిపోని అనర్థాలను ఏరి కోరి ముందుగా దేశం నెత్తిన తెచ్చిపడవేయటమే అవుతుంది. అందువల్ల పరిస్థితుల కనుకూలంగా విదేశ రాజనీతిని తాను మలచుకొంటూ, దాని కనుకూలంగా ప్రజాభిప్రాయాన్ని తీర్చి దిద్దటానికి ఏ పార్టీ ప్రభుత్వమైనా ప్రయత్నిస్తుందే గాని ప్రజాభిప్రాయాను సారంగా విదేశ వ్యవహారాలను నడపటానికి పూనుకోదు.

## బ్రిటన్‌లో ప్రజారాజ్యము : ప్రజల స్వాతంత్ర్యము

ప్రజాభిప్రాయాన్ని అనుసరించి ప్రభుత్వం చేయటానికి ఎన్ని అడ్డంకులున్నవో పైన సూచించినాము. కాని, అడ్డంకులున్నా ప్రజాభిప్రాయానికి పరిపాలనకు బ్రిటన్‌లో చాలా సన్నిహిత సంబంధమున్నదనే చెప్పవలసి ఉంది. సర్వ సామాన్యంగా బ్రిటిష్ ప్రజలకు వ్యక్తి స్వాతంత్ర్యం మీద ఉండే శ్రద్ధయే దీనికి కారణము. శతాబ్దాలుగా ఏదో ఒక రంగంలో స్వేచ్ఛను నిలబెట్టుకోవటానికి బ్రిటిష్ ప్రజలు పోరాటం సాగించినారు. రాజ్యాంగ పరిణామంపై ఈ పోరాటం చూపిన ప్రభావము అంతింతకాదు. వ్యక్తి స్వాతంత్ర్యం, ఆర్థిక స్వాతంత్ర్యం మత స్వాతంత్ర్యం - ఏదిగాని బ్రిటిష్ ప్రజలకు పార్లమెంట్ చేసిన కొత్త కొత్త శాసనాలవల్ల సిద్ధించింది అని అనుకొంటే అది పొరపాటు. చట్టాలను ప్రజలు ధిక్కరించవచ్చు, పార్లమెంట్లు తారుమారు చేయవచ్చు. కాని ప్రజా హృదయాలలో ఉండే ఆరని స్వాతంత్ర్యాగ్ని - అదే వారి స్వాతంత్ర్యాన్ని రక్షించేది. ఆనాటికి అధికారంలో ఉండే గణం తాము నమ్మిన మతాచారాలకు భిన్నమైనవి పైశాచ ప్రేరితాలని భిన్న మతస్థులను, ఇతర మత శాఖలవారిని

అన్నివిధాల స్వాతంత్ర్యానికి దూరంచేసి ఏ విధంగా హింసించింది, చివరికి 19 వ శతాబ్దానికి గాని మత స్వాతంత్ర్యం బ్రిటన్‌లో సంపూర్ణంగా సిద్ధించకపోయిందని మీరు చదివినారు కేథలిక్‌ల విషయంలో బ్రిటిష్ శాసనాలు చూపుతూఉన్న వివక్షణ 1829 లో తొలిగిపోయింది 19 వ శతాబ్దాంతానికిగాని యూదులకు, మతాచార విషయాలలో ఏ నియమాలకు అంగీక రించని వారికి సంపూర్ణ మత స్వాతంత్ర్యం లభించలేదు మతానికి రాజకీయాలకు ఉన్న లంకె తెగిపోవటానికి శతాబ్దాల పోరాట మవసరమైంది కాని 1688 విప్లవానంతరం చెలరేగిన పాక్షిక వివాదాలలో రాజకీయ విభేదాలు ప్రధానాలు. మత విభేదాలు అప్రధానాలు అయినవి. 18 వ శతాబ్దాంతానికిగాని రాజకీయాభిప్రాయాలకు వ్యక్తులపై శిక్షలు విధించటం ఆగిపోలేదు అట్లైనా 18 వ శతాబ్దానికి ముందే ఇంగ్లీష్ ప్రజలు ఎంతో స్వేచ్ఛ అనుభవిస్తున్నారని మాంటెస్క్యూ, వాల్టేర్ వంటి ఫ్రెంచ్ తత్వవేత్తలు ప్రశంసిస్తూ వ్రాసినారు. స్టూఅర్ట్ రాజు లతో ప్రజలూ, పార్లమెంటూ సాగించిన పోరాటం నిజానికి వ్యక్తి, మత, పౌరసత్వాలకోసం, ఆస్తి హక్కు రక్షణకోసం సాగించిన యుద్ధమే. స్టార్ ఛేంబర్, హైకమిషన్, న్యాయస్థానాల రద్దు ; హేబియస్ కార్పస్ చట్టం, హక్కుల శాసనం, స్థిరీకరణ శాసనంలో న్యాయాధి కారుల స్వాతంత్ర్య రక్షణకోసం చేర్చిన నిబంధన. ఇవన్నీ బ్రిటిష్ ప్రజల స్వాతంత్ర్యాన్ని పరిరక్షించి పటిష్ఠం చేసినాయి

19 వ శతాబ్దంలో బ్రిటిష్ రాజకీయాలలో పార్లమెంటరీ ఆధిక్యత, అందులోను కామన్స్ సభాధిక్యత నిర్వివాదంగా స్థాపించబడింది. అప్పటినుంచి ఎన్నిక సంస్కరణ శాస నాలు చేసినా వాటి లక్ష్యం ఒక్కటే. వ్యక్తి స్వాతంత్ర్య పరిరక్షణే ఆ లక్ష్యము జాతీయ వ్యాపార, పారిశ్రామిక వ్యవహారాలలో వ్యక్తులను వారి ఇష్టానుసారం వ్యవహరించనియ్యవలె నని శ్రామికులకు పరిశ్రమాధినేతలకు మధ్య ప్రభుత్వం జోక్యం కలగజేసుకోరాదని, విదేశ వ్యాపారంలో స్వేచ్ఛా వ్యాపార విధానము (Free Trade) అవలంబించవలెనని, అట్లా చేయటంచేత వ్యక్తి స్వాతంత్ర్యం పెంపొందుతుందని 19 వ శతాబ్ద సిద్ధాంతంగా ఉండేది. కాని 19 వ శతాబ్దాంతానికి, 20 వ శతాబ్దంలోను ఈ వ్యక్తి స్వాతంత్ర్య లక్ష్యమే పారిశ్రా మిక వ్యవహారాలలో, ఎగుమతి దిగుమతి సుంకాల విషయంలో ప్రభుత్వం విశేషంగా జోక్యం పుచ్చుకొనేటట్లు చేసింది. పరిశ్రమలలో కష్టించి పనిచేసే వారిని పరిశ్రమాధి నేతల దయా ధర్మాలకు వదలటంవల్ల వారికి అన్ని విధాలా అన్యాయం జరుగుతుందని పార్లమెంట్ గుర్తించి కర్మాగార శాసనాలు ఎన్నో చేసింది. పని జేయవలసిన గంటలు తగ్గించటం వేత నాది సౌకర్యాలు హెచ్చించటం శ్రామిక గృహాలు, వైద్యాలయాలు, కర్మాగార సొంతదారులు నిర్మించి, వారి శ్రామికుల విద్యా వినోదాలకు తగిన ఏర్పాట్లు చేసేటట్లు జెయ్యటం మొదలైన మేళ్లను ఈ కర్మాగార చట్టాలు సాధించినాయి. అదే కాలంలో వోటింగ్ హక్కు సర్వజనులకు లభించేటట్లు చేయడానికి అనేక సంస్కరణ శాసనాలను పార్లమెంట్ చేసింది ఈ విధంగా వ్యక్తి స్వాతంత్ర్యాన్ని మరింత పోషించటానికే వ్యక్తి స్వాతంత్ర్య భంజకాలైన శాసనాల ననేకం పార్లమెంట్ చేసింది. ఇంకా చేస్తూనే ఉంది. పౌరుని వ్యక్తిత్వ వికాసానికి తగిన ధనం చేకూర్చటానికి ధనికవర్గం మీద విశేషభారం పడేటట్లు పన్నుల విధానం సంస్కరించబడు తుంది సామాజిక వాద వ్యాప్తి ఇట్లా దారిద్ర్యంవల్ల బాధపడే వారిని ఉద్ధరించే కార్యభారాన్ని కామన్స్ సభపై వేసినా, సామ్యవాదం (Socialism) వెర్రితలలు వేసి వ్యక్తి స్వాతంత్ర్య

వినాశకరమైన విధానాలు బ్రిటన్‌లో వ్యాపించకుండేటట్లు నిరంతరం జాగ్రతపడుతూ ఉంది. పత్రికా స్వాతంత్ర్యానికి, సభా స్వాతంత్ర్యానికి ఏ భంగపాటుగాని, విచారణలేకుండా వ్యక్తులను యుద్ధకాలంలో తప్ప, చిరకాలం కారాగారాలలో ఉంచటంగాని బ్రిటిష్ ప్రజాభిప్రాయం సహించదు. ఆ ప్రజాభిప్రాయానికి విరుద్ధంగా ఏ చర్య అయినా తీసుకోవటానికి ఏ మంత్రి వర్గమూ సహించదు ప్రజా ప్రయోజనాలకవసరమైనప్పుడు, వ్యక్తుల ఆస్తి హక్కుకు భంగం కలిగించవలసి వచ్చి, వారి భూములను ప్రభుత్వం ఆక్రమించినా, వాటికి న్యాయమైన పరిహార మివ్వటానికి బ్రిటిష్ ప్రభుత్వం వెనుదీయదు. న్యాయమైన పరిహారాన్ని ఇవ్వకుండా ఎగగొట్టటానికి ప్రభుత్వం ప్రయత్నించినా బ్రిటిష్ న్యాయాధిపతులు ఆ ప్రయత్నాలను సాగనీయరు. న్యాయాధిపతులను, బ్రిటిష్ మంత్రివర్గం తన తొత్తులను చేసుకోవలెననే దురాలోచన వారికి కలనైనే కలగదు. కలిగినా దానిని బ్రిటిష్ ప్రజాభిప్రాయము, ఆ ప్రజాభిప్రాయానికి ముఖ్య ప్రతినిధి అయిన పార్లమెంట్ సాగనీయవు.

బ్రిటిష్ రాజ్యాంగంలోని త్రివర్గాలు - శాసన శాఖ, కార్యనిర్వాహక వర్గము, న్యాయ శాఖ. ఒక్కొక్కటి దాని నియమిత రంగంలో సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తూ ఉంది వాటిలో ఏ ఒక్కటి మరొకదాని కార్యరంగంలో దురాక్రమణ చేయదు. బ్రిటిష్ రాజ్యాంగంలో పౌరుని స్వాతంత్ర్యాలివి అని నిర్ధారించే సమగ్ర శాసన మేదీ లేకపోయినా, పౌరుని ప్రధాన స్వత్వాలివి అని ఘోషించే పీఠికలతోటి రాజ్యాంగ శాసనాలు మాకున్నవని విర్రవీగే దేశాలలో కంటె మిన్నగా, తృప్తికరంగా బ్రిటన్‌లో పౌరుని స్వేచ్ఛ రక్షితమవుతూ ఉంది. ఈ విషయాన్నిగురించి సర్ ఐవర్ జెన్నింగ్స్ యొక్క అమూల్యాభిప్రాయాలను ఇక్కడ పొందు పరుస్తున్నాను "రాజ్యాంగంలోని నియమాలకంటె ప్రజా స్వాతంత్ర్యాన్ని మిన్నగా రక్షించేది స్వాతంత్ర్యం మీద ప్రజలకుండే గాఢమైన ప్రీతి, మానసికతత్వము. ఒకవైపు ప్రజలలోని అన్ని తరగతుల సౌఖ్యాన్ని, వ్యక్తుల ధనము, హోదా, మతము, జాతిని లెక్కచేయకుండా ప్రభుత్వం పరిపాలన సాగిస్తూనే, అనేకుల సౌఖ్యానికై కొద్దిమందిని పీడించరాదనే సత్యాన్ని గుర్తించవలె వ్యక్తి స్వేచ్ఛను పాటించవలసిందే. కాని దానికై సామాజిక శ్రేయస్సుకు భంగపాటు కలిగించే కార్యక్రమాలను నిషేధించక ఉండరాదు. నిష్పాక్షికంగా, తమ మనస్సాక్షి చెప్పినట్లు తీర్పు లిచ్చేవారు బ్రిటిష్ న్యాయాధిపతులు. రాజకీయంగా వారిపై ఒత్తిడి తేజూసే ప్రయత్నాలను వారు బహిరంగంగా, ఖండితంగా తిరస్కరిస్తున్నారు. దానితో బాటు, వ్యక్తికి వ్యక్తికి వ్యత్యాసం చూపించే న్యాయ సమ్మతంగాని శాసనాలు బ్రిటన్‌లో లేవు. వ్యక్తుల మతము, జాతి, రాజకీయాభిప్రాయాలు ప్రజా పరిపాలనా విధానాన్ని శాంతి భద్రతలను తలకిందులు చేయచూసినప్పుడు తప్ప వాటిని ప్రభుత్వంగాని, న్యాయస్థానాలుగాని గమనించవు. కాని వ్యక్తుల జీవితంలో ఉత్పన్నమయ్యే అన్ని సమస్యలను తీర్చటానికి తగిన పరిజ్ఞానము, అనుభవము న్యాయాధిపతులకు ఉండవు. న్యాయస్థానాలవల్ల న్యాయం పొందవలెనంటే ఎంతో ఆలస్యాన్ని వ్యయ ప్రయాసలను ప్రజలు భరించవలసి ఉంటుంది. ఈ ఇబ్బందిని తొలగించే నిమిత్తమే పరిపాలన న్యాయము బ్రిటన్‌లో చోటు చేసికొంది. బ్రిటిష్ పరిపాలకులు ఈ ధర్మ నిర్వహణంలో వారి నిష్పక్షపాత, న్యాయబుద్ధికి పేరుగాంచినారు. స్థానిక పరిపాలనా సంస్థలు ప్రజారాజ్య విజయానికి ఎంతగానో సాయపడుతూ ఉంది. ప్రభుత్వోద్యోగులు, స్థానిక సంస్థలు న్యాయ విరుద్ధంగా ప్రవర్తించకుండా బ్రిటిష్ న్యాయస్థానాలు జాగ్రత్త

వహిస్తూ ఉన్నాయి. ప్రజల స్వేచ్ఛను కాపాడటానికి హేబియస్ కార్పస్, మాండమస్ ప్రోహిబిషన్, సెర్టియొరారీ (Mandamus, prohibition, Certiorari) వంటి రిట్‌లు ఎట్లా ఉపయోగిస్తున్నావో తెలుసుకోవలసి ఉంది.'' బ్రిటిష్ ప్రజారాజ్యంలో ప్రజల స్వాతంత్ర్యం ఎట్లా రక్షింపబడిందో పై విధంగా వివరించి జెన్నింగ్స్ తన వ్యాఖ్యానాన్ని కింది విధంగా ముగించినాడు, ''వ్యక్తి స్వేచ్ఛ రాజకీయ స్వాతంత్ర్యం ఫలితము. రాజకీయ స్వాతంత్ర్యం శతాబ్దాల పరిణామాల ఫలితము. పార్లమెంట్ సభ్యు లనుభవించే వాక్స్వాతంత్ర్యము రాజకీయ స్వాతంత్ర్యా లన్నింటికీ మూలము. పార్లమెంట్‌లోని ప్రతిపక్షానికి ప్రభుత్వం చూపించే గౌరవము బ్రిటిష్ ప్రజ లనుభవించే స్వాతంత్ర్యానికి కొలత బద్ద. రహస్యంగా వోట్ చేసే విధానంతోబాటు, వాక్స్వాతంత్ర్య, సభా స్వాతంత్ర్య, సమావేశ స్వాతంత్ర్యాలు పార్లమెంట్‌కు ఎన్నికలు స్వేచ్ఛగా జరగటానికి సాయపడి బ్రిటిష్ ప్రజారాజ్యాన్ని నిలబెడుతున్నాయి. కాని ఈ స్వాతంత్ర్యాలు బ్రిటిష్ రాజ్యాంగాన్ని, ప్రజల హక్కులను భంగపరచటానికి ప్రయత్నించే స్వేచ్ఛను ప్రజలకు ఇయ్యవు. పార్లమెంట్‌లోని రెండు శాసన సభలలోను అత్యధిక సంఖ్యాబలం గల రాజకీయ పక్షాలు అధికారంలోకి వచ్చినా ఆ బలాన్ని ఉపయోగించుకొని, ఏ పక్షమూ ఇంతవరకు రాజ్యాంగాన్ని తారుమారు చేయటానికి ప్రయత్నించినది లేదు. బ్రిటిష్ ప్రజల స్వేచ్ఛ రాజ్యాంగ శాసనాలలో రాజకీయ సంస్థలలోగాని లేదు, అది ఆ స్వేచ్ఛా జీవుల స్వాతంత్ర్యాభిమానంలో ఉంది.''

ఈ స్వేచ్ఛ ఉన్నట్లుండి ఒకనాడు బ్రిటిష్ ప్రజలకు ఆకాశంనుంచి ఊడి పడలేదు. విప్లవాత్మకమైన మార్పులు కూడా తరతరాల పరిణామ ఫలితంగా కలిగినవేగాని దౌర్జన్యంతో కూడిన ఉద్యమాలవల్ల సంభవించినవి గావు. హింసాకాండ, అత్యాచారాలు తీవ్ర స్వభావులను ఆకర్షిస్తాయి కాని, నిదానము, దూరముచూపు, స్వాతంత్ర్యాభిలాష కలవారు తమ లక్ష్యసాధనకు ఇతరుల స్వాతంత్ర్యాన్ని హరించటానికి, వారి ధన, మాన, ప్రాణాలకు భంగకారులైన విధానాలను, వివాదాలను అవలంబించటానికి పూనరు. 'సాధనమున పనులు సమకూరునని', శాశ్వత ప్రయోజనాలు కలుగుతాయని, హింసా విధానాలవల్ల తాత్కాలికంగా ప్రజాక్షేమ నిరోధకులను మట్టుబెట్టకలిగినా, హింస ప్రతిహింసను పురికొల్పుతుందని బ్రిటిష్ ప్రజలు శాంతి మార్గాలలోనే నడచి తమ సాంఘిక, ఆర్థిక, రాజకీయ స్వాతంత్ర్యాలను సుస్థిరంగా ఉండేటట్లు సంపాదించగలిగినారని బ్రిటిష్ రాజ్యాంగ చరిత్ర ప్రబోధిస్తూ ఉంది. రాజకీయాధికారాలకోసం హింసాత్మకచర్యలకు పూనినసందర్భాలు ఆ చరిత్రలోలేకపోలేదుగాని అటువంటి చర్యలవల్ల కోరిన ఫలితం లభించీ లభించకముందే చేజారిపోవటం తటస్థించింది. లంకాస్ట్రియన్‌ల కాలంలో పార్లమెంట్ సాధించిన అధికారాలు ముప్పై ఏండ్ల అంతర్యుద్ధాలలో అణగారిపోయినాయి. అంతటితో పోక పార్లమెంట్‌ను ఉపయోగిస్తూ, దాని సమ్మతితోనే ట్యూడర్‌లు తమ నిరంకుశ పరిపాలనం సాగించినారు. మొదటి ఛార్లెస్ కాలంలో రాజు పక్షం కావలీర్స్ (Cavaliers) వారితో ఢీకొని ప్రజాకంటకమైన అంతర్యుద్ధాలు సాగించి పార్లమెంట్ పక్షం వారు రౌండ్ హెడ్స్ (Round heads) విజయులైనా, వారి విజయ ఫలితమైన పార్లమెంటరీ ఆధిపత్యం సైనిక శాసనం కింద నలిగి, రెండవ ఛార్లెస్, రెండవ జేమ్స్ రాజుల కాలంలో వారి దుష్టపరిపాలనకు దారి తీసింది. తమ మత, ఆర్థిక, రాజకీయ స్వత్వాలకోసం భంగం కలిగినపుడల్లా ప్రజ లనుసరించిన సాత్విక నిరోధము, పార్లమెంటరీ ప్రతిఘటన బ్రిటన్‌లో

ప్రజారాజ్య విధానాన్ని క్రమంగా బలపరిచి, విజయవంతం చేసింది. ఇంతా కొత్త కొత్త విజయాలను సాధించేటట్లు ఉంది. వ్యక్తి వాదాన్ని విసర్జించక, సామాజిక వాదాన్ని కాదనక, రెండింటికి మధ్యే మార్గాన్ని చేబట్టి, సాధ్యాసాధ్యాలను గమనిస్తూ బ్రిటిష్ ప్రజారాజ్య విధానం నెమ్మదిగా ముందుకు సాగుతూ ఉంది. కార్మికుల క్షేమాభ్యుదయాలకోసం బ్రిటిష్ పార్లమెంట్ చేసిన శాసన పరంపరను, నిరుద్యోగుల పోషణకు బ్రిటిష్ ప్రభుత్వం తీసికొంటున్న చర్యలను, పరిశ్రమలను జాతీయం చేయటంలో చూపుతున్న దొరవను, కార్యా కార్య విచక్షణా జ్ఞానాన్ని, నిదానాన్ని గమనించేవారికి బ్రిటన్‌లో ప్రజారాజ్యం యొక్క భావి విజయాలను గురించి ఏ సందేహాలూ ఉండబోవు. ఈనాడు ప్రభుత్వ స్థానంలో ఉన్న రాజకీయ పక్షం రేపు ప్రభుత్వ ప్రతిపక్షం కావచ్చునన్న పరిజ్ఞానము అధికారపక్షం వారిని నిరంకుశులుగా మారి, ప్రతిపక్షాల వారిని దేశ శత్రువులనే నెపంతో హతమార్చటానికి ప్రయత్నించ నీయదు. న్యాయాధిపతులకు తమ తాబేదారులను చేసి తమ ఇష్టానుసారం తీర్పులను చెప్పే ఆ న్యాయాధిపతులుగా మారే ప్రయత్నాలు చేయనీయదు. ప్రస్తుతం తమకు కామన్స్ సభలో అధిక సంఖ్యాబలమున్నా, ఆ బలం ప్రజాభిప్రాయం మారేకొద్దీ క్షీణించే అవకాశముందని వారిని గుర్తింపజేసి నిరంతరం ఆ మారుతుండే అభిప్రాయాన్ని మన్నించి పాలించేటట్లు చేయగలదు. ప్రజారాజ్యంలో ఒక్కొక్క వ్యక్తికి స్వేచ్ఛగా బ్రతికే హక్కు ఉందని, అది లేనిది అతని వ్యక్తిత్వం పరిపూర్ణ వికాసం పొందనేరదని బ్రిటిష్ పౌరులు సర్వసామాన్యంగా నమ్ముతున్నారు. వ్యక్తి వికాసానికి ఆర్థికాభివృద్ధి అవసరమైనా, వ్యక్తి పరిపూర్ణ వికాసానికి ఉండే అడ్డంకులను తొలగించి, అవకాశాలను విరివిగా కల్పించటం న్యాయమైనా, సమానత్వం పేరిట జనుల జీవితాల నన్నింటిని నిర్బంధంగా ఒక్క మూసలో పోసి నడిపించవలెననే తత్వం బ్రిటిష్ పౌరులకు అంతగా నచ్చదు. ఒకే ఒక్క రాజకీయ పక్షము ఒకే ఒక్క అభిప్రాయము ఒక్క నాయకత్వము వీటిని బ్రిటిష్ ప్రజలు మెచ్చరు. సభా స్వాతంత్ర్యం, సమావేశ స్వాతంత్ర్యం, పత్రికా స్వాతంత్ర్యం అభిప్రాయ ప్రకటన స్వాతంత్ర్యం లేని ప్రజలు తాము ప్రజా రాజ్యంలో ఉన్నామనుకోవటం మాయలలో కెల్ల మాయ అని బ్రిటిష్ ప్రజల విశ్వాసము. ''అయ్యో, బ్రిటన్‌లో వర్గపోరాటమే లేదే - ఇక ప్రజా రాజ్య మా దేశంలో సాధ్యమా అని వితర్కించే వారి దృష్టిలో అక్కడ ప్రజారాజ్యం లేదు నిజమే. కాని పెట్టుబడిదారి విధానాన్ని, ప్రభువర్గాన్ని, ప్రభు సభను, రాజరికాన్ని కూలదోయ దలచుకొంటే బ్రిటిష్ ప్రజల కాశక్తి లేకపోలేదే. వా రీ పని ఈ నాటికిని చేయలేదు. కారణమేమి అని ఈ విమర్శకులు ఎందుకు ఆలోచించరు? అట్లా చేయవలెనని వా రనుకోకపోవటమే వా రట్లా చేయకుండటానికి కారణము'', అని జెంకిన్స్ సమాధానము.

నిజానికి బ్రిటిష్ రాజరికాన్ని కూలదోయడానికి 1660 తరవాత జరిగిన తీవ్ర ప్రయత్నమేదీ లేదు. ఎడ్మండ్ బర్క్ అన్నట్లు రాజరికము, ప్రభువర్గము, ప్రభుసభ ఇన్ని శతాబ్దాలు బ్రిటన్‌లో మనగలిగి ఉండటంలోనే ఆ సంస్థల చేవ, వాటి ఉపయోగము తేట తెల్లమవుతూ ఉన్నాయి. దౌర్జన్యసహిత విప్లవకాండవల్లగాక, కాలంతోబాటు పరిస్థితులు మారే కొద్దీ నూతనావసరాలేర్పడే కొద్దీ జాతీయ సంస్థలలో, అవి పనిచేసే పద్ధతులలో మార్పులు సహజంగా, శాంతియుతంగా కలగటంలో అందమూ చందమూ ఉన్నాయి. ఆ విధంగా జరిగే మార్పులు జాతికి పుష్టిని తుష్టిని చేకూర్చగలవు. హింసామార్గాన్ని పూని తెచ్చిపెట్టే మార్పులు

చేసే మేలుకంటె కీడే ఎక్కువ. హింసా, అసూయాద్వేషమూ ప్రతి హింసను ద్వేషాన్ని పురి కొల్పి తీరుతుంది. అవి మానవుల స్వేచ్ఛకు గొడ్డలి పెట్టుగా పరిణమించి, అవిచ్ఛిన్నంగా సాగే ప్రజాభ్యుదయానికి వేరు పురుగులవుతాయి. అభిప్రాయ ప్రకటనకు ప్రజలు సభ కూడ టానికి స్వేచ్ఛను అనుభవిస్తూ ఇతర ప్రలోభాలకు, బెదరింపులకు, దౌర్జన్య చర్యలకు గురి కాకుండా, స్వేచ్ఛగా ప్రజలు తమ పరిపాలకులను ఎన్నుకోగలిగి ఉండి, ఆ పరిపాలకు లా ప్రజలను వారి ఇష్టానుసారం పరిపాలించగలిగి ఉండటమే ప్రజారాజ్యమనే పదానికి యాథ్యర్థ మైతే, ప్రస్తుతం బ్రిటన్‌లో స్థిరంగా నెలకొని ప్రకాశించేది ఉత్తమ శ్రేణికి చెందిన ప్రజా రాజ్యమని ఘంటాపథంగా చెప్పవచ్చు తమను ఎన్నుకొన్న ప్రజలు, నియమించిన పరిపాల కులు పాడమన్నపాట పాడి, ఆడమన్న ఆట ఆడి, వారు చెప్పమన్న తీర్పు చెప్పే న్యాయాధి పతులు ఆ దేశంలో లేరు నిజమే పరిపాలకులు వెలిబుచ్చే అభిప్రాయాలకు విరుద్ధమైన అభి ప్రాయాలు చెప్పే పౌరులను దేశ ద్రోహులని దేశాంతర, ద్వీపాంతర ప్రవాసాలకో పరలోక నివాసానికో పంపించే ఘనత బ్రిటిష్ ప్రభుత్వానికి, అట్లా పోయే అదృష్టం బ్రిటిష్ ప్రజలకు లేదనేమాట నిజమే ఈ సుగుణాలులేని బ్రిటిష్ రాజ్యం ప్రజారాజ్య మెట్లవుతుంది? దాని రాజ్యాంగం ప్రజారాజ్య రాజ్యాంగమని ఎట్లా అనగలం? అని వాదించేవారికి నచ్చజెప్పగల వారు లేరు బ్రిటన్‌లోని ప్రజారాజ్యమూ రాజ్యాంగమూ శతాబ్దాల చరిత్ర గలది; సనాతన మైంది; అవిచ్ఛిన్నమైంది ఈ ప్రజారాజ్య వృక్ష మప్పుడప్పుడు ఆకులు రాలి, ఎండి మోడై నట్లు అగపడినా, అంతలోనే కొత్త చిగుళ్ళు తొడిగి కొత్త అందాలు సంతరించుకొంటూనే ఉంది చరిత్రలో ప్రసిద్ధికెక్కిన ఇతర ప్రజా రాజ్యాలు అంతరించిపోయినా, ఈ బ్రిటిష్ ప్రజా రాజ్యము నిల్చి ఉండటం ప్రజారాజ్య విధానంపై అభిమానంగల వా రందరికీ ఆశాజన కంగా ప్రోత్సాహకరంగా ఉంది.

ప్రాచీన కాలంలో దేదీప్యమానంగా ప్రకాశించిన ఎథీనియన్‌ల ప్రజారాజ్యము, సంస్కృ తిలో వారికి ఎంతో వెనకబడిఉన్న మాసిడోనియన్‌ల దండయాత్రలకు తాళలేక స్వల్ప కాలంలోనే విచ్ఛిన్నమయింది. దాని పతనానికి ఒక ముఖ్యకారణము. అద్భుతవక్తృత్వ నైపుణి ప్రదర్శించే డెమాస్తనీస్ వంటి వక్తలు తప్పకుండా సమర్థులైన, పరిపాలకులో సేనానులో అయి తీరుతారనే భ్రమలో ఎథీనియన్‌లు పడిపోవటమే అని సుప్రసిద్ధ తత్వవేత్త ఆరిస్‌టాటిల్ సెలవిచ్చినాడు. విద్యా వివేకాలు, పరిపాలనానుభవము, తదితర అర్హతలేవీ లేని పౌరులు లాటరీలో నెగ్గిన కారణాన ఏ ప్రభుత్వోద్యోగానికైనా అర్హులని ఎథినియన్‌లు నియమించటం వారి రాజ్య వినాశనానికి మరో ప్రబల కారణము. ఈ రెండు లోపాలు బ్రిటిష్ ప్రజారాజ్యంలో అంతగా కానరావు. సమర్థుడైన వక్త, సమర్థుడైన పరిపాలకుడవుతాడనే భ్రమ ఈ కాలంలోను అనేక ప్రజారాజ్యాలను పట్టి పాలారుస్తుంది. కాని బ్రిటిష్ పౌరుల ప్రవర్తన దీని కెంతో భిన్నంగా ఉంది. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో జర్మన్‌లు అవిచ్ఛిన్నంగా సాగించిన విమాన దాడులకు బ్రిటిష్ ప్రజల ధైర్యం బీటలువారుతున్న కాలంలో ప్రధానమంత్రి అయి దేశాన్ని అఖండ విజయోన్ముఖంగా నడపించిన మహావక్త చర్చిల్‌ను, యుద్ధ విరమణానంతర సమస్యలను పరిష్కరించటానికి అతడు తగడని బ్రిటిష్ ప్రజలు భావించినారు. ఇట్టాంటి రాజకీయ వివేకము, చైతన్యము బ్రిటిష్ పౌరులలో విశేషంగా కనబడుతూ ఉంది. అనేక ఇతర రాజ్యాలలో, ఆ సందర్భంలో ప్రధాన పరిపాలకుడైన వ్యక్తికి బ్రహ్మరథం పట్టి,

అతనిని, అతని (రాజకీయ) పక్షాన్ని చిరకాలం పదవులలో ఉంచుతారా ? ఈ వీర పూజా తత్వం ప్రజాసామ్య విధానానికి ప్రబల విరోధి ఇది బ్రిటిష్ పౌరులలో మచ్చుకైనా కన బడదు.

## బ్రిటిష్ పార్లమెంటరీ విధానము : భావి స్థితిగతులు

రెండవ ప్రపంచ యుద్ధం ముగిసే నాటికే ప్రపంచ రాజ్యాలలో మూడవ శ్రేణికి బ్రిటన్ దిగజారింది. బ్రిటిష్ సామ్రాజ్యాంతర్భాగాలైన బ్రిటిష్ డొమీనియన్లూ, అధీన రాజ్యాలూ స్వతంత్రాలయినందున ఈనాడు నిజానికి బ్రిటిష్ సామ్రాజ్యం విచ్ఛిన్నమైనదనే భావించ వచ్చు. కాని సామ్రాజ్య పరివ్యాప్తమైన ఈ స్వాతంత్రోద్యమాలవల్ల బ్రిటన్ ఎన్ని ఒడుదుడు కులు ఎదుర్కొవలసి వచ్చినా పార్లమెంటరీ ప్రజాస్వామ్యం మీద బ్రిటిష్ ప్రజల కుండే విశ్వాసము ఏ మాత్రం సడలలేదు. పార్లమెంటరీ విధానంలో ఉండే లోటుపాట్లను సవరించే ప్రయత్నాలను వా రింకా సాగిస్తూనే ఉన్నారు అంతేగాని సామ్రాజ్యమంతటా విప్లవాలు తలయెత్తినపుడు, ఇతర సామ్రాజ్యాల చరిత్రలలో సంభవించినట్లు ఆ విప్లవ పరిస్థితులు బ్రిటన్‌లో నియంతృత్వ స్థాపనకు దారి తీయలేదు. బ్రిటిష్ రాజ్యాంగాన్ని పార్లమెంటరీ సంస్థ లను రక్షించింది ఆ దేశాన్ని సముద్రం చుట్టి ఉండటమూ గాదు, బ్రిటిష్ జాతీయుల స్వేచ్ఛా ప్రియత్వమూ, ఔదార్యగుణమూ కావు పౌరబాటుగానైనా, వారిలో వ్యుత్పన్నబుద్ధి గానబడదు. వారి రాజ్యాంగ విధానానికి ఏ పరిస్థితులలోనైనా సరే గుడ్డిగా కట్టుబడి ఉండే మందమతులు వారు అదే వారి రాజ్యాంగాన్ని రక్షించింది, అని ఆక్టన్ ప్రభువు అభిప్రాయము ఈ అభిప్రాయాన్ని కెన్నెత్ మెకన్‌జీ కింది విధంగా బలపరిచినాడు :

పన్నుల విధింపుకు ప్రజల ఆమోదము ఉండవలె అనే సిద్ధాంతాన్ని మాగ్నా కార్టా వల్ల సాధించినా, దానిని చాలా అరుదుగా వారు ఉపయోగించి పొందవలసినంత అభ్యుద యాన్ని పొందలేక పోయినారు. రాజుకు మనవి చేసే హక్కు (Right to petition) మూలంగా శాసనాలు తామే చేసే అధికారాన్ని పొందలేక పోయినారు. ట్యూడర్ల కాలంలో పార్లమెంట్‌కు లభించిన అధికారాలు తమ పనులు చక్కబెట్టుకోవడానికి ఉపాయశాలులైన రాజుల అనుగ్రహంవల్ల వచ్చినవే. ఎన్నికల విధానంలో సంస్కరణావసరాన్ని మొదటి జేమ్స్ గుర్తించినాడు. 1647, 1658 లలో దానికి చక్కని అవకాశాలు లభించినా వాటిని వా రుపయోగించుకొన్నారు గారు. క్రామ్‌వెల్ ప్రభు సభను సంస్కరించవలెనని ప్రయత్నించి నారుగాని విజయం పొందలేకపోయినాడు. ప్రజ లా విషయమై ఏ ఉత్సాహమూ ప్రకటించ నందువల్ల, ఈ నాటికి ప్రభుసభ సంస్కరింపబడక నిలిచే ఉంది. మంత్రులు పార్లమెంట్‌కు బాధ్యత వహించే విషయంలోను మెజారిటీ పార్టీ మంత్రివర్గం ఏర్పాటు విషయంలోను ఇవి రెండు పార్లమెంటరీ స్వపరిపాలనకు మూల స్తంభాలు – 18 వ శతాబ్దంలో ప్రజలూ, పార్ల మెంట్లూ వైముఖ్యాన్నే ప్రదర్శించినవిగాని వాటి విలువను గమనించినవిగావు. కామన్స్ సభా పతి ఏ రాజకీయ పక్షానికి చెంది ఉండరాదనే తమ పార్లమెంటరీ సంప్రదాయాన్ని గురించి బ్రిటిష్ రాజకీయవేత్త లిపుడు గర్విస్తున్నారు. కాని ఆ సంప్రదాయ స్థాపన పార్లమెంట్ ప్రయత్నాలవల్లగాక ఇద్దరు ప్రముఖ సభాపతుల కృషివల్ల జరిగింది. బ్రిటిష్ రాజ్యాంగ చరిత్రను పరిశీలించేవారు బ్రిటిష్ ప్రజల రాజ్యాంగాభివృద్ధి వారి ప్రయత్నాల ఫలితం కాదు,

వారి అదృష్టం బాగా ఉన్నందువల్లనే అని అంగీకరించకపోరు.'' ఈ అదృష్టం ఇకముందు కూడా వారిని విడనాడకుండా నిల్చి ఉంటుందా అని కెన్నెత్ మెకన్‌జీ ప్రశ్నిస్తున్నాడు.

ఒకవైపు పరిపాలనా కార్యం విశ్వరూపం దాలుస్తున్న కాలమిది అయినా విద్యార్హతలుగాని పరిపాలనానుభవంగాని లేనివారూ, పార్లమెంట్ సభ్యులుగా తమ కర్తవ్యాలు నెరవేర్పటంలో శ్రద్ధ చూపనివారు కామన్స్ సభలోను, ప్రభు సభలోను అనేకు లేర్పడినారు. వైజ్ఞానికంగా నూతన పరిశోధనలు విరివిగా సాగించటంచేత నూతనావసరాలు, వినూత్న వస్తు సృష్టి, సంక్లిష్ట సాంఘిక, ఆర్థిక, అంతర్జాతీయ సమస్యలు పరిపాలకవర్గం మీద మోయరానంత భారం మోపటంచేత ప్రతి రంగంలోను ప్రావీణ్యం సంపాదించిన పార్లమెంట్ సభ్యులను, వా రే రాజకీయపక్షానికి చెందినవారైనా, ప్రత్యేక పార్లమెంటరీ కమిటీలకు నియమించే పద్ధతి 20 వ శతాబ్దంలో అమలులోకి వచ్చింది పార్లమెంట్ ఇష్టానుసారం పరిపాలన సాగుతుందా, లేదా, ప్రభుత్వ ధనం సక్రమంగా వెచ్చింపబడుతున్నదా, పార్లమెంట్ నిర్దేశించిన కార్యక్రమాలకు నిర్దేశించిన విధంగా వ్యయమవుతున్నదా, లేదా విచారించి పార్లమెంట్‌కు నివేదించటం ఆ కమిటీల పని ఈ కమిటీ లుండటంబట్టి, దేశాన్ని సక్రమంగా పరిపాలించేటట్లు చూడవలసిన బాధ్యతను పార్లమెంట్‌లోని అన్ని రాజకీయ పక్షాలమీద సమానంగా మోపటం సాధ్యమయింది ఒక్క అంచనాల కమిటీ పనిచేసే విధం చూసిన బ్రిటిష్ పరిపాలకుల కార్యదక్షత రుజువవుతుంది. పార్లమెంట్ పరిపాలన ఏ శాఖలోనైనా ఏ విధంగా జరగవలెనో సామాన్యంగా, స్థూలంగా ఆదేశించగలదేగాని, పరిపాలనలోని లోటుపాటులు పార్లమెంట్ సభ్యులకుగాని ఏ మంత్రిత్వ శాఖకుగాని ఆ శాఖకు చెందిన శాశ్వత ఉద్యోగి గణానికి తెలిసినంత తెలియదు. ఈ శాశ్వత ఉద్యోగివర్గం ఒక రాజకీయపక్షానికి చెందినవారు గారు వట్టి మాటల మూటలుగాక వారు పరిపాలనా కార్యంలో ఏండ్లకొద్ది అనుభవం గడించినవారు. వీరిని అంచనాల కమిటీ - వారి రికార్డులతో సహా - తమ సన్నిధికి రావించి, చక్కగా విషయ పరిగ్రహణం చేయగలుగుతున్నది ఏ విధంగా పరిపాలనలో ఆదాయాలు చేయటం సాధ్యమవుతుందో ఈ ఉద్యోగుల సహకారంతో అంచనాల కమిటీ తెలుసుకోగలుగుతున్నది

కాని వ్యయానికి పరిపాలనకు లంకె ఉన్న విషయాలలో అంచనాల కమిటీ ఉపయోగిస్తుందేకాని ఆ బంధంలేని ఇతర పరిపాలనవిషయాలు తమ కనుమరుగై పోకుండా పార్లమెంట్ చూసే మార్గమేది? వారానికి నాలుగు రోజులు, రోజుకి ఒక గంటకు మించకుండా, పార్లమెంట్ సభ్యు లొక్కొక్క మంత్రిని అతని పరిపాలనా శాఖ నిర్వహణలో కలిగిన లోపాలను గురించి ప్రశ్నల శరపరంపర అతనిపై ప్రయోగించవచ్చు తన శాఖయొక్క పరిపాలనలోని చీకటి కోణాలపై ప్రశ్నల రూపంలో సభ్యులు వెలుగు ప్రసరింపచేస్తారనే భయం ఏ మంత్రినైనా పార్లమెంట్ విషయంలో కొంత భయభక్తులతో ప్రవర్తించేటట్లు చేస్తుంది. పార్లమెంట్ తన శాసనాధికారాన్ని మంత్రిత్వ శాఖలకు, ఆ మంత్రులు ఏర్పరిచే సంస్థలకు దత్తం చేస్తూ, నియత శాసనాలు చేయటం ఈ శతాబ్దంలో పరిపాటి అయిందని చదివినారు. ఆ మంత్రులు, వా రేర్పరచే సంస్థలు నిర్వహించవలసిన విధులివి అని ఆ స్టాట్యూట్లు తెల్పుతాయేగాని ఆ విధి నిర్వహణకు అవసరమైన నియమావళిని చేసే అధికారాన్ని మంత్రులకు, మంత్రి నియోగించిన సంస్థలకు ఆ స్టాట్యూట్లు దత్తం చేయకపోవటమేగాక పార్లమెంట్‌కు వాటిపై ఏ రకమైన పరిశీలనాధికారం ఉండవలెనో తెలిపే అనుబంధాలను ఆ స్టాట్యూట్లలో చేర్పుతున్నారు.

స్టాట్యూట్లు సృష్టించే ఈ సంస్థలు సక్రమంగా పనిచేస్తున్నవా లేదా పరిశీలించటానికి స్టాట్యూట్ నిబంధనల పరిశీలన కమిటీ ఒకటి ప్రత్యేకంగా (Select Committee on Statutory Instruments) నిర్మింపబడింది కాని ఇది అంచనాల కమిటీవలె అంత తృప్తికరంగా పని చేయటం లేదు. రానున్న దశాబ్దాలలో స్టాట్యూటరీ సంస్థల విషయంలోను, స్టాట్యూటరీ నియమావళి, సెలెక్ట్ కమిటీల విషయంలోను సాధించవలసిన అభివృద్ధి ఎంతైనా ఉంది.

పార్లమెంట్ తరచి తరచి ప్రశ్నించటానికి వీలుగాని పరిపాలనా విషయం ప్రభుత్వ మనుసరించే విదేశ రాజనీతి ఈ రంగంలో రహస్యగోపనం ఎంతైనా అవసరము. దేశరక్షణకై ప్రభుత్వం తీసుకొంటున్న చర్యల విషయంగాని నిర్మిస్తున్న నూతనాయుధాలను గురించిగాని, చేర్చుకోనున్న మిత్రకోటి విషయంగాని బట్టబయలుగాకుండా చూసుకోవలసినవాడు విదేశాంగ మంత్రి ముఖ్యమంత్రివర్గం అనుసరిస్తున్న కార్యసరళివల్ల యుద్ధం తలపై దూకిన దాక సామాన్యంగా ప్రభుత్వం ప్రజలకు ఏమీ తెలియనీయదు వారి విదేశనీతివల్ల దేశానికనర్థం కలిగినప్పుడు మంత్రిమండలిని ప్రజలు, పార్లమెంట్ పద భ్రష్టులను చేయగలదు

దత్త శాసనాధికారంవల్ల ఏర్పాటయ్యే స్వయం పరిపాలనాధికారం, న్యాయాధికారంగల కార్పొరేషన్స్, బోర్డ్‌లు, ట్రిబ్యూనల్స్ (Corporations, Boards and Tribunals) అనేకం ఈ శతాబ్దంలో కుక్కగొడుగువలె పుట్టుకొనివస్తున్నవి. ఈ ప్రత్యేక సంస్థలకు స్వయం పరిపాలనాధికార ముంది ఈ న్యాయ సంస్థల తీర్పులపై సామాన్యంగా న్యాయ స్థానాలకు, ఇతర సామాన్య న్యాయ స్థానాలకు నష్టపడినవారు అపీల్ చేసుకొనే హక్కు లేదు. ఈ కార్పొరేషన్‌ల పెట్టుబడిలో కొంత భాగం ప్రభుత్వమిచ్చి ఉండవచ్చు మిగిలింది 'ప్రైవేట్' వ్యక్తులది పార్లమెంట్ ఆమోదించిన శాసనాలవల్ల ఈ కార్పొరేషన్‌లు ఏర్పడి ఉన్నా, ఏర్పడకున్నా, వాటి నిర్వహణ విషయంలో ప్రభుత్వానికి ఎటువంటి భాగమూ లేదు కాని వాటి నిధులలో కొంత ప్రభుత్వ ధనం కనక వాటి నిర్వహణలో లోపాలు కలిగినప్పుడు పార్లమెంట్ మంత్రిమండలిని తప్పుపట్టటానికి వీలవుతుంది కార్పొరేషన్‌ల యాజమాన్యంలో ఫలవంతమైన భాగం ప్రభుత్వానికి ఉండేటట్లు పార్లమెంట్ రానున్న కాలంలో చర్యలు తీసుకోవలసి ఉంది. లేకుంటే ప్రభుత్వ దీవనలతో, సహకారంతో స్థాపించబడే ఈ వర్తక, పారిశ్రామిక సంస్థలను నమ్మి ప్రజలు నష్టపడే వీలుంది.

పార్లమెంట్ బురఖాతో ప్రజలకు పార్లమెంట్‌కు బాధ్యత వహించిన కార్పొరేషన్‌లు, బోర్డ్‌లు, న్యాయస్థానాలు ప్రజారాజ్యంలో విచ్చలవిడిగా విహరించటానికి వీలుండటం ప్రజా పరిపాలన సౌలభ్యం దృష్ట్యా వాటిని మనమెంత సమర్థించినా వాటికి, ప్రజాపరిపాలన విధానానికి ఎంతమాత్రమూ పొత్తు కుదరదు రానున్న శతాబ్దంలో ఈ సమస్యలకు పరిష్కార మార్గం వెదకవలసి ఉంది. పరిశ్రమలను జాతీయం చేయటం 20 వ శతాబ్దం తెచ్చిన మరొక క్లిష్ట సమస్య. జాతీయం చేయటానికి మిగిలిన పరిశ్రమ లీ నాడు బ్రిటన్‌లో నూరువరకైనా ఉన్నవని ఒక అంచనా. ఒక పరిశ్రమను జాతీయం చేయగానే పరిపాలనా భారాన్ని అంత పెంచినట్లని అర్థము. దానితో పరిపాలన యంత్రాంగంలో మార్పులు చేర్పులు అవసరమవుతున్నాయి. ప్రజాపరిపాలన విధానం ఈ నూతన పరిస్థితులకు అనుగుణంగా నడుచుకోగలుగుతుందో లేక పార్లమెంటరీ సంస్థ క్రమంగా నిర్వీర్యమై నిరంకుశ ప్రభుత్వ స్థాపనకు దారి తీస్తుందో వేచి చూడవలసి ఉంది. అదే విధంగా సమర్థవంతమూ, పక్షపాత రహితమూ

అయిన ఏకన్యాయ పాలనము పరిపాలనావసరాలకు వీగిపోక ఎంతవరకు నిలిచి ఉంటుందో ఓర్పు వహించి చూడవలసిన విషయమే.

ఈ వివిధ సమస్యలను తృప్తికరంగా బ్రిటిష్ జాతి పరిష్కరించగలదని, ఆంగ్లేయుల స్వేచ్ఛా ప్రియత్వము, నార్మన్ జాతీయుల నిర్మాణశక్తి వందలేండ్లుగా పెంచిన ప్రజారాజ్య వృక్షం బ్రిటన్ దేశంలో చిరకాలం ఉండగలదని మన మాశించవచ్చు. ఈ మహావృక్షం వేళ్ల నుంచి వెలువడిన మొలకలు దూర సముద్రాంతర దేశాలలో నూతన శాఖోపశాఖలతో పుష్ప ఫల శోభితమవుతున్న విధం బ్రిటిష్ జాతి స్వాతంత్ర్యానురక్తికి తార్కాణ అయి వారి రాజ్యాంగ చరిత్రకు కీర్తి ప్రతిష్ఠలు ఆర్జిస్తుంది. (15-5-78 రాత్రి కామన్స్ సభ 10-7-78 మెక్సికోసింధు శాఖలోని బహమాస్ అన్న బ్రిటిష్ కాలనీ స్వతంత్ర్యం కావలెనని, దానితో బాటు 700 దీవుల కూటమి, కరబియన్ దీవులని పిలవబడునదీ స్వతంత్ర రాజ్యమయ్యేటట్ల తీర్మానించింది).

# BIBLIOGRAPHY


1. The Constitutional History of Modern Britain ... *Sir David Lindsey Keir*
2. Constitutional History of England ... *George Burton Adams*
3. The Elements of English Constitutional History ... *F. C. Montague*
4. Introduction to the Law of the Constitution 1939 ... *A. V. Dicey*
5. Constitutional History of India ... *R. R. Sethi & V. D. Mahajan*
6. Analysis of Taswell - Langmede's Constitutional History ... *A. M. Wilshere*
7. The British Constitution ... *Sir Ivor Jennings*
8. The English Parliament ... *Kenneth Mackenzie*
9. Short History of the Indian People ... *Tara Chand*
10. The Substance of Politics ... *A. Appa Dorai*
11. Cabinet Government ... *Sir W. Ivor Jennings*
12. Parliamentary Government in England ... *H. J. Laski*
13. The Constitutional History of England ... *Maitland*
14. English Political Institutions ... *J. A. R. Marriott*
15. How Britain is Governed ... *Ramsay Muir*
16. English Government and Politics ... *F. A. Ogg*
17. The Governments of Europe ... *W. B. Munro*
18. The English Constitution ... *W. Bagehot*
19. The Governance of England ... *A. L. Lowell*
20. The Constitutional History of India ... *K. V. Punniah*